# ఆంధ్ర వాఙ్మయారంభ దశ



ప్రథమ సంపుటము

## ప్రాఙ్నన్నయ-యుగము

గ్రంథ కర్త:

దివాకర్ల వేంకటావధాని ఎం ఏ (ఆనర్సు) పిహెచ్ డి

ఆంధ్రోపన్యాసకుఁడు

ఉస్మానియా విశ్వవిద్యాలయము

**1960**

 మూల్యము: రు. **7-50.**

# తొలి పలుకు

ఆంధ్ర వాఙ్మయమున ప్రాఙ్నన్నయ యుగమున కజ్ఞాత యుగమను పేరున్నది అందలి వాఙ్మయ భాషావిశేషములనుగూర్చి యెక్కువగా దెలియ కుండుటయే దాని కాపేరు వచ్చుటకు గారణము ఇటీవల శ్రీ కోరాడ రామ కృష్ణయ్యగారు శ్రీ గంటి జోగిసోమయాజిగారు 'అభినవ వాగనుశాసన' శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు కీ శే డా చిలుకూరి నారాయణరావుగారు కళాప్రపూర్ణ శ్రీ వజ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రిగారు మున్నగు భాషా తత్త్వజ్ఞులు ప్రాఙ్నన్నయయుగము నందలి శాసనములను బరిశీలించి యందలి విశేషములను వెల్లడించి యున్నారు. వారి రచన లాధారముగా జేసికొని నేనును ఆ శాసనము లన్నిటిని బరిశీలించి యాంధ్ర భాషారంభదశనుగూర్చి యీ రచన చేయ బూనితిని

నేను గ్రహించిన వస్తువు ప్రధానముగా వాఙ్మయ సంబంధియే యైనను వ్యాసము సమగ్రముగా నుండునను నుద్దేశముతో భాషావిషయమునుగూర్చికూడ యథాశక్తిగా వివరింప యత్నించితిని ఈ యత్నమున శ్రీ కోరాడ రామ కృష్ణయ్యగారు వేంకటేశ్వర ప్రాచ్య సంస్థాపార పత్రికలోఁ బ్రచురించిన బహు వ్యాసములు నాకు మార్గదర్శకములై చాలవఱ కుపకరించినవి వానిని బాగుగాఁ జదివి నా పరిశీలనమున దోచిన క్రొత్తవిషయములను ఉదాహరణములను జేర్చి యీ ప్రకరణమును రచించితిని వారు పరోక్షముగా నొనరించిన యపారమైన యీ సాయమునకుఁ గృతజ్ఞతావందనము లర్పించుచున్నాను అముద్రితములైన కొన్ని శాసనములను నేను వేఁడినంతనే యొసంగి నాకు జేయూతనొసంగిన యస్మద్గురువర్యులు శ్రీ గంటి జోగిసోమయాజిగారికి నా హృదయ పూర్వక నమస్కారము లర్పించు చున్నాను

విప్పర్ల శాసనములు మూడున్నవి ఒకటి జయసింహవల్లభుని యెనిమిదవ విజయరాజ్య సంవత్సరమున వేయ బడినది రెండవదియు నాతని కాలమునాటిదే మూడవది (*E P 476 q 1906, 351 q 1905*) లోఁ బ్రకటింప బడినది భేదము తెలియుటకై మొదటిదానిని విప్పర్ల శాసన మనియు, రెండవ దానిని విప్పర్తిశాసన మనియు, మూడవదానిని విత్పత్తిశాసన మనియుఁ బేర్కొంటిని

నే నీ వ్యాసము రచింపఁ దొర కొన్న దాది సర్వవిషయములందును ముఖ్యముగా భాషా తత్త్వమునకు సంబంధించిన వానియందును నాకు దెలియని రహస్యములు నూతనాంశములు పెక్కెఱింగించి మార్గదర్శకులైన ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతా నమస్కారము లర్పించుచున్నాను

ఈ గ్రంథము మిక్కిలి పెద్దదగుటచేతను దీని ముద్రణ మధిక వ్యయ సాధ్యమగుటచేతను వెంటనే దీనిని ముద్రింపలేకపోయితిని ముద్రణార్థమై సాయము చేయవేడుచు నాంధ్రప్రభుత్వమువారికి దరఖాస్తు పెట్టుకొనగా వారు దయతో నాలుగువేలరూప్యములు మంజూరుచేసిరి ఈ సాయమే లేనిచో నే నేతన్ముద్రణము తలపెట్టుటకు గూడ నవకాశము లేకపోయెడిది ఈ సందర్భమున నాకు తోడ్పడిన మంత్రివరేణ్యులకును ప్రభుత్వ విద్యాశాఖాధికారులకును శ్రీ శర్మగారికిని నా హృదయపూర్వక వందనము లర్పించుచున్నాను

పి హెచ్ డి పట్టము వడయుటకై నే నుస్మానియా విశ్వవిద్యాలయమునకు సమర్పించిన వ్యాసమునందలి ప్రథమ భాగమే ఈ గ్రంథము 957వసంవత్సరమున నాకా పట్ట మొసంగ బడినది దీని లిఖితప్రతులను వ్రాయునప్పుడు నాకు దోడ్పడిన చి గూడ వేంకటసుబ్రహ్మణ్యము M A గారికిని తిరుపతయ్య M A గారికిని కాశా శివరామకృష్ణశాస్త్రి M A గారికిని నా ఆశీర్వచనములు

అతిశ్రద్ధాభిమానములతో నీ గ్రంథమును సుందరముగ ముద్రించి యిచ్చిన అమరావతీ ప్రెస్సువారికి నా కృతజ్ఞతావందనములు

ఈ వ్యాసమును రచించుటలో నాకుఁ దోడ్పడిన గ్రంథములు

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారివి

1 Te ugu Language n the Is M llen um A D
S V O Journal

2 భాషా చరిత్ర వ్యాసములు

---

1 - రెండవభాగ మాదికవి నన్నయ భారతమును గుఱించి అది ద్వితీయ సంపుటముగా ముద్రింపఁ బడినది

3. దక్షిణదేశాంధ్ర వాఙ్మయము - దేశి

4. ఆంధ్ర భారత కవితా విమర్శనము.

5. సారస్వత వ్యాసములు.

శ్రీ నిడుదవోలు వెంకట రావు గారివి :

6. తెలుఁగు కవులచరిత్ర Vol. I.

7. ఉదాహరణ వాఙ్మయచరిత్ర.

8. ఆంధ్రవచన వాఙ్మయచరిత్ర.

9. ఆంధ్రులచరిత్ర - సంస్కృతి - ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనము, బాలేందు శేఖరంగార్లు.

10. ఆంధ్రభాషావికాసము — ఆచార్య శ్రీ గంటి జోగి సోమయాజిగారు.

11. ఆంధ్రభాషా చరిత్రము - కీ. శే. చిలుకూరి నారాయణరావుగారు.

12. ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వము - కళాప్రపూర్ణ శ్రీ వజ్ఝల చిన సీతారామ స్వామి శాస్త్రిగారు

13. చింతామణి విషయ పరిశోధనము.

14. భండార్కరు పరిశోధన సంస్థవారి భారతములలోని ఉపోద్ఘాతములు : శ్రీ సుక్తన్కరు బెల్వాల్కరుగార్లు.

15. Comparative Grammar of the Dravidian Languages. Dr. Caldwell.

16. Eastern Chalukyas of Vengi - Dr. N. Venkata Ramanaiah.

17. రాజరాజ నరేంద్రుఁడు - శ్రీ బి. వి. కృష్ణరావుగారు.

18. ధ్వన్యాలోకము.

19. ఆంధ్ర ధ్వన్యాలోకము - శ్రీ వేదాల తిరువేంగళాచార్యులుగారు.

20. నన్నయగారి ప్రసన్నకథా కలితార్థయుక్తి - కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు

21. ఆంధ్రకవి తరంగిణి Vols. I. II. and III.

22. భారతోపన్యాసములు - ఆంధ్రసారస్వత పరిషత్తు.

23. త్రిలింగ రజతోత్సవ సంచిక.

24. శాతవాహన సంచిక.

25. Inscriptions of the Andhra dynasties - Dr. M. Ramarao.

26. ప్రాకృత ప్రకాశిక.

27. Journals of the Andhra Historical Research Society - Rajahmundry.

28. రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక.

29. ఆంధ్రభాషానుశాసనము - శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు.

30. శాసనపద్యమంజరి - కీ. శే. జయంతి రామయ్య పంతులుగారు.

మిగిలిన బహుగ్రంథముల పేరు లా యా స్థలములయందే పేర్కొంటిని.

—దివాకర్ల వెంకటావధాని.



## అం కి త ము :

శ్రమసంయోజితమైన యీ రచన ము

ద్రారూప మొందింప య

త్నములం జేసెడి పట్ల నప్రతిమ మౌ

... దార్యమ్ము మీఱంగ వి

త్తము చేకూరిచి న న్దంగం గనిన యాం

ధ్ర త్యాప్రభుత్వమ్ము పే

రిమికిం జేసెద దీని నంకితము సం

ప్రీతాంతరంగుండ నై.



# విషయ సూచిక


1. ప్రాక్చాళుక్య యుగమునందలి ఆంధ్రభాష ... 1-64
2. పూర్వచాళుక్య యుగమునందలి ఆంధ్ర వాఙ్మయ స్వరూపము ... 65-120
3. చాళుక్య యుగమునందలి భాష ... 121-308
4. నన్నయకుఁ బూర్వము ఛందస్సు ... 309-358
5. మార్గదేశీ కవిత్వములు ... 359-381
6. నన్నయ ఆదికవిత్వము - భారత రచనకుఁ బూర్వరంగము ... 387-416
7. ముఖ్య విషయముల అనుక్రమణిక



# ప్రాక్చాళుక్య యుగమునందలి ఆంధ్రభాష :

ఆంధ్ర శబ్ద మిప్పుడు జాతి భాషా దేశములు మూఁడింటికిని సంజ్ఞగా వాడఁబడుచున్నది. ఆంధ్రభాష, ఆంధ్రదేశము, ఆంధ్రజాతి యనునవి మనము తఱుచుగా వినుచున్న మాటలే. ఈ మూఁడింటిలో నాంధ్రజాతి ప్రశంస యతి ప్రాచీనకాలమునుండియుఁ గనవచ్చుచున్నది. ఋగ్వేదమునకు సంబంధించిన యైతరేయ బ్రాహ్మణమున విశ్వామిత్రుఁడు తన యాజ్ఞ నుల్లఘించిన కుమారుల నేఁబదిమందిని దత్సంతతివా రార్యభూముల సరిహద్దులలో నివసించునట్లు శపించెననియు, వారే అంధ్రులు, పుండ్రులు, శబరులు, పుళిందులు, మూతిబులు అను నామములతో నార్యసీమల కావల (ఉదంత్యాః) నివసించిరనియుఁ జెప్పఁబడి యున్నది.[1] దీనిని బట్టి యా బ్రాహ్మణము రచింపఁబడుటకుఁ బూర్వమే యాంధ్రు లను నొక జాతివా రుండినట్లు తెల్లమగుచున్నది. సంస్కృతమున నాదికావ్యమగు రామాయణమున కిష్కింధాకాండలో సుగ్రీవుఁడు సీతాన్వేషణమునకై దక్షిణదిక్కున కేగు వానరులు చూడవలసినవానిలో నాంధ్ర

1. తా ననువ్యాజహారాంతాన్వః ప్రజా భక్షీష్టేతి. త ఏతేంధ్రాః పుండ్రాః శబరాః పుళిందాః మూతిబా ఇత్యుదంత్యా బహవో భవన్తి.

ఇందలి వాక్యముల కర్థము చెప్పుటలో విద్వాంసులు భిన్నమార్గముల ననుసరించుచున్నారు. వానిని Martin Haag "Viswamitra then pronounced against them the curse, "You shall have the lowest castes for your descendants.: Therefore are many of the most degraded classes of men, the rabble for the most part, such as the Andhras, Pundras, Sabaras, Pulindas and Mutibas, descendants of Viswamitra". అని తర్జుమా చేసెను. సాయన అంతాన్ అను పదమును "చండాలాది రూపాన్ నీచ జాతి విశేషాన్" అని వ్యాఖ్యానించెను. పై అనువాదము దీని కనుగుణముగనే యున్నది.

A. B. Keith గారు "Your offspring shall inherit the ends (of the earth). These are the people the Andhras, Pundras, Sabaras, Pulindas and Mutibas who live in large numbers beyond the borders. Most of the

పుండ్ర చోళ పాండ్య కేరళదేశములను పెర్కొని యుండెను [1] మహాభారతమున మయ సభలో ధర్మరాజును బరివేష్టించియుండిన రాజులలో వంగ వంగ పుండ్రక పాండ్యోడ్ర రాజులతోపాటాంధ్రులుకూడ నుండిరనియు [2] రాజసూయమునకు ముందు సహదేవుడు దక్షిణ దిగ్జైత్రయాత్ర సలిపిన సందర్భమున నాంధ్రులనుగూడ జయించెననియు జెప్పబడి యున్నది [3] మౌర్య చంద్రగుప్తుని యాస్థానమునకు గ్రీకు రాయబారిగా వచ్చిన మెగస్తనీ సవ్వు దాంధ్రులు బలవిషయమున మౌర్యులతరువాత నెన్నదగి యుండిరనియు కళింగులకంటె వారే బలవత్తరులై యుండిరనియు వారికి బెక్కు గ్రామము లును బ్రాకార గోపురావృతములైన ముప్పది నగరములు నుండెననియు వారి రాజునకు 00000 పదాతులతోడను 2000 రౌతులతోడను 000 ఏనుగుల తోడను గూడిన సైన్య ముండెననియు చెప్పియున్నాడు [4] అశోకుని షాహబాజ్‌గఢీ మాన్సేర గిర్నార్ శాసనములలో నాంధ్రుల ప్రశంస కలదు వారాతని సామ్రాజ్యములోనే యుండి యాతని ధర్మబోధ ననుసరించిరని

---

Dasyus are e descendants of V wamı ra అని యా వాక్యము నను వదించెను

అన్విశ్య దండకారణ్యం సపర్వత నదీగుహాం
నదీం గోదావరీంచైవ సర్వమే వాను పశ్యత
తథైవాంధ్రాంశ్చ పుండ్రాంశ్చ చోళాన్ పాండ్యాంశ్చ కేరళాన్
అయోముఖశ్చ గన్తవ్య పర్వతో ధాతుమండిత

కిష్కింధా 41 అధ్యా

2 తథాంగవంగౌ సహ పుండ్రకేణ
పాండ్యోడ్రరాజౌ సహ చాంధ్రకేణ

భార సభా 4 21

3 పాండ్యాంశ్చ ద్రవిడాంశ్చైవ సహితాం శ్చోడ్రకేరళై
ఆంధ్రాం స్తలవనాంశ్చైవ కళింగా నోష్ట్రకర్ణికాన్

సభా 28

4 Ncx co ne hc Andhras a s more powerful race which po sessc numero v ages and th rty towns defended by wa s and ower a d w ch upp cs ts k ng w an army of 100000 fantry 2000 cava ry an 000 c cphan Mccr nd e s Mıgas cnes Page 138 ka n I A Vo VI 337-339

13 వ ధర్మలిపి శాసనమువలనఁ దెలియుచున్నది[1] అశోకుఁ డొక్క కళింగమును దప్ప మఱి యే ప్రాంతమునుగాని జయించిన ట్లాధారములు కానరామిచే నాతని తండ్రియైన బిందుసారుఁ డాంధ్రులను జయించియుండుననియు, వారు తరువాత నామమాత్రముగ మౌర్యుల సార్వభౌమత్వము నంగీకరించినను వాస్తవమునను స్వతంత్రులుగానే యుండిరనియు నూహ చేయవచ్చును. అశోకుని యనంతర మాంధ్రులొక గొప్ప సామ్రాజ్యమును స్థాపించి శుంగకాణ్వ వంశములంతరించినపిమ్మట మగధనుగూడ నాక్రమించుకొని యచ్చటనుండియే పరిపాలనము సాగించి యుండిరని చరిత్రజ్ఞులు చెప్పుచున్నారు [2]బౌద్ధ జాతకములలో అంధకు లనువారి ప్రశంస కలదు. (అంధక వెణ్హుజాతకము)[3] సెరివణిజ జాతకమున[4] తేల్ నదీతీరమున నంధకపుర మను నొక పుర ముండినట్లు చెప్పఁబడినది. మఱికొన్ని జాతకము లంధకులను భిక్షుక గణమును చేర్కొనుచున్నవి.[5] ఈ యంధకులను వా రాంధ్రులే యై యుండవచ్చునని శ్రీ మారేమండ రామారావుగా రూహించుచున్నారు [6]వైదేహునకు కారావరు స్త్రీయందుఁ బుట్టి మృగయా జీవనులై యుండు వా రాంధ్రులని మనుస్మృతిలో (X 36) వివరింపఁ

---

1 అశోకుని ధర్మలిపి శాసనములోని భాగము

ఏవమేవ ఇహరాజ విషయేషు యవన కమ్బోజేషు నాభకే నాభపంక్తిషు భోజపితినిక్యేషు అన్ధ్ర పులిన్దేషు - సర్వత్ర దేవానాం ప్రియస్య ధర్మానుశిష్టి మనువర్తన్తే '

'హిదలాజా విశవసి యోన కంబోజేషు నాభకే నాభ పంతిషు భోజపితినిక్యేషు.

అధ పాలదేషు పవ లా దేవానాం పియసా ధంమానుషధి అనువతంతి "

So also here in the king's territories, among the Yavanas and kambojas, the Nabhaka and the Nabhapanktis, Andhras and Pulindas-in all these places people conform to Devanampriya's instruction in Dharma. Edicts of Asoka Page 47. G. Srinivasamurty and A N Krishna Aiyangar

2. సాతవాహన సంచిక పుట 78, 79.

3. Ratilal Mehta - Pre - Buddhistic India 24, 25.

4 Indian Antiquary 1918. Page 71.

5 The Jatakas V Pages 10 and 138.

6. సా. సం. పుట 14

బడి యున్నది వాయు మత్స్య బ్రహ్మాండ విష్ణు భాగవత పురాణము లాంధ్రులైన శాతవాహనులు సుమారు నాలుగున్నర శతాబ్దుల కాలము రాజ్యము పాలించిరని తెల్పుచున్నవి. శ్రీకృష్ణుఁడు చాణూరుఁడను నాంధ్ర మల్లుని సంహరించినట్లు భాగవత హరివంశములు చెప్పుచున్నవి. మగధరాజగు బలియను వాని కంగ వంగ కళింగ సింహ పుండ్రాంధ్రు లను నార్గురు పుత్త్రు లుదయించిరనియు వారు తమతమ పేర్లతోఁ బ్రత్యేక విషయములను నిర్మించుకొనిరనియు భాగవతమున మఱియొక గాథ గలదు.[1] ప్లినీయను గ్రీకు చరిత్రకారుఁడు (క్రీ. శ. 77) ఆంధ్రిజాతిని పేర్కొని తద్బలసంపదను వర్ణించెను. శాతవాహనుల తరువాత నాంధ్రదేశ భాగము నేలిన యిక్ష్వాకులు, బృహత్ఫలాయనులు, ఆనందగోత్రులు, శాలంకాయనులు, విష్ణుకుండినులు మున్నగువా రందఱు నాంధ్రులే. ఈ విధముగాఁ జరిత్ర యుగమునకుఁ బూర్వము నుండియు నాంధ్రజాతి బలవత్తరమై ప్రసిద్ధికెక్కియుండెనని నిస్సందేహముగాఁ జెప్పవచ్చును.

ఆంధ్రజాతి ప్రశంస ప్రారంభించిన కాలమునుండియుఁ గనవచ్చుచున్నను క్రీస్తుశకమునకుఁ బూర్వమెచ్చటను శాసనములందు దేశపరముగా వ్యవహారము కానవచ్చుటలేదు. శాతవాహనరాజు లాంధ్రులయ్యుఁ దాము పాలించిన దేశమాంధ్రదేశమని యే శాసనములందును పేర్కొని యుండలేదు. క్రీ. శ. 151 వ సంవత్సరమున రుద్రదాముఁడు వేయించిన జూనాగఢ్ శిలాశాసనములో[2] "దక్షిణాపథపతేః శాతకర్ణేః" అను పదములు గోచరించుచున్నవి. ఇందు శాతకర్ణి దక్షిణాపథ పతిగాఁ బేర్కొనఁబడినాఁడే కాని యాంధ్రదేశ ప్రభువని పేర్కొనఁబడి యుండలేదు. పల్లవయువరాజైన శివస్కంధవర్మ ధాన్యకటకమును దన తండ్రి ప్రతినిధిగాఁ బాలించుచుండిన యధికారి కాజ్ఞాపత్రముగాఁ జెక్కించిన మైదవోలు తామ్రశాసనములో (క్రీ. శ. 234) "అంధాపథీయోగామో విరిపరమ్" అను మాటలు కలవు. ఇం దాంధ్రదేశ మాంధ్రపథమని పేర్కొనఁబడినది. ప్రస్తుత

---

అంగవంగ కళింగాంధ్రా సింహపుండ్రాంధ్ర సంజ్ఞికాః
జజ్ఞిరే దీర్ఘ తపసో బలేః క్షేత్రే మహీక్షితః
చక్రుస్స్వనామ్నా విషయాన్ షడిమాన్ ప్రాచ్యగాం స్మ తే ।
*భాగవ. 9 స్కంధ. 23 అధ్యా.*

2 E I VIII P. 43.

గుంటూరు మండలమునందలి విప్పర్లయే యా'విరిపర'. ఆంధ్రపదము దేశపరముగా వాడఁబడినందుకు మొదటి శాసనాధార మీ మైదవోలు శాసనమే. టిబెట్టు దేశీయుఁడైన తారానాథుఁడను గ్రంథకర్త తెలుఁగు దేశమును త్రిలింగదేశమనియు, కళింగపురము రాజధానిగాఁగల కళింగదేశ మాంధ్రదేశమందలి యొక భాగమనియుఁ దెల్పియుండినట్లును.[1] పురాణకాలమునకు ముందే టాలెమీ [2] గారి కీ త్రిలింగ నామము పరిచితమైయుండినట్లును కాల్డ్వెల్‌గారు తమ ద్రావిడ భాషావ్యాకరణమున వ్రాసియుండుటచే నంతకుముందే త్రిలింగపదము దేశపరముగా వాడఁబడినట్లు తెల్లమగుచున్నది. సుచంద్రుని కుమారుఁడైన ఆంధ్ర విష్ణు వనువాఁడు శ్రీశైల భీమకాళేశ మహేంద్రగిరి సంయుతమైన గొప్ప ప్రాకారమును గట్టి యందు మూఁడు ద్వారములు నిర్మించెననియు, నా మూఁడుద్వారములందును గణములతోఁ గూడఁ త్రిలోచనుఁడు త్రిలింగరూపియై నివసించెననియు, నాంధ్ర విష్ణువు నిశుంభుఁడను రాక్షసునితో యుద్ధముచేసి యాతని సంహరించి ఋషులతోఁగూడ గోదావరీ తటమున నుండెననియు, నప్పటి నుండియు నాక్షేత్రము త్రిలింగ నామ విఖ్యాతమయ్యెననియు బ్రహ్మాండ పురాణ

---

1 Taranatha the Tibetan author already referred to who derived his information not from Telugu poets and pandits but from Indian Buddhistical narratives (which having been written before Buddhism disappeared must have been of considerable antiquity) repeatedly designates the Telugu country 'Trilinga' and describes Kalinga as a portion of Trilinga and Kalingapura as its capital The name of Trilinga has reached Ptolemy himself at a time anterior probably to the date of the Puranas Caldwell G. D -P 28.

2. Triglypton called also Trilingon capital of the kingdom 154° – 18°. In this part the cocks are said to be bearded and the crows and parrots white." India as described by Ptolemy–Mccrindle Page 225

Opinions vary much as to where this capital was situated Wilford says (Asiatic Research Vol. XIV Page 450–2) "Ptolemy places on the Takasama, the metropolis of the country and calls it Trilingon, a true Sanskrit appelation. Another name for it, says our author, was Triglypton which is an attempt to render into Greek the meaning of Trilinga or Trailinga the three lingas of Mahadeva and this in Arakan is part of an extensive district in the Puranas called Tripura or the three owns and town–ships first inhabited by three Daityas. Ibid Page 231 – 32

మునఁ జెప్పఁబడినది.[1] మగధ దేశాధిపతియైన బలిరాజు కుమారు లార్వురిలో నొకఁడైన యాంధ్రుఁడును దత్సోదరులును దమతమ పేర్లతో నాఱువిషయముల నేర్పఱిచిన వృత్తాంత మిదివఱకుఁ జెప్పఁబడినది దీనినిబట్టి భాగవత రచనాకాలమునకుముందే యాంధ్రవిషయమొకటి యుండెనని తెలియుచున్నది. ఈ యాంధ్ర త్రిలింగదేశములకు నామమునందు వలెనే వ్యాప్తి విస్తృతులందును నేమైన భేదముండెనేమో చెప్పఁజాలము. క్రీ. శ. 340 వ సంవత్సరమున మల్లదేవనందివర్మ వేయించిన దానశాసనములో నాంధ్రమండల ముదాహరింపఁబడినది.[2] క్రీ. శ. 553 వ సంవత్సరమునఁ జెక్కఁబడిన జవానుపూర్ శాసనమున 'ప్రతిచంద్ర మాంధ్ర పతినా' అనియు, క్రీ. శ. 555 లో నీశానవర్మ వేయించిన హరహా శాసనమున[3] "జిత్వాంధ్ర పతి"మ్మనియు నాంధ్రదేశ సూచకములైన పదములు వాడఁబడినవి. క్రీ. శ. 6 వ శతాబ్దిలో నుండిన వరాహమిహిరుని బృహత్సంహితయందును.[4] క్రీ. శ. 7 వ శతాబ్దిలో భారతదేశమున సంచరించిన చైనా యాత్రికుఁడగు హ్యూన్‌త్సాంగు వ్రాఁతలందును[5] ఆంధ్రదేశ ప్రశంస కలదు. క్రీ. శ. 1072 నాఁటిదైన యశఃకర్ణదేవుని ఖైరాతామ్ర శాసనమున[illegible] 'ఆంధ్రాధీశ' పద మాంధ్రదేశమునకు రాజను నర్థము నొసంగుచున్నది తరువాత నాంధ్రదేశమనుమాట పెక్కుశాసనములందును, గ్రంథములందునుగూడ

---

1 శ్రీశైల భీమకాళేశ మహేంద్రగిరి సంయుతం
ప్రాకారం తు మహత్కృత్వా త్రీణి ద్వారాణి చాకరోత్
త్రిలోచనో మహేశస్స త్రిశూలం చ కరే వహన్
త్రిలింగరూపీ న్యవసత్ త్రిద్వారేషు గణై ర్వృతః
ఆంధ్రవిష్ణు స్సురయుతో దనుజేన నిశుంభునా
యుధ్వా త్రయోదశయుగాన్ హత్వా తం రాక్షసోత్తమం
అవస త్తత్ర ఋషిభి ర్యుతో గోదావరీతటే
తత్కాల ప్రభృతి క్షేత్రం త్రిలింగ మితి విశ్రుతమ్.

ఆంధ్రుల చరిత్ర పుట 28

2. I A XV P. 175 "ఆంధ్ర మండలే ద్వాదశ సహస్ర గ్రామ సంపాదిత సప్తార్ధ లక్ష విషయాధి పతేః"

3. E I. XIV P 117.

4 కౌశిక విదర్భ వత్సాంధ్ర చేదికా శ్చోర్ధ్వ కంఠకాః

బృహత్సంహి, కూర్మభాగ. వాచస్పత్యము.

5. Beal's records of the western countries Vol II P. 217.

వాడఁబడి యున్నది. ఈరీతిగా నాంధ్రపదము మొదట జాతిపరముగాను దరు వాత దేశపరముగాను బ్రచారమున కెక్కినట్లు కనఁబడుచున్నది

ఆంధ్రపదమును భాషాపరముగా వాడిన వారిలో మనకుఁ దెలిసినంతవఱకు నన్నయభట్టే ప్రథముఁడని చెప్పవచ్చును. రాజరాజు నందమపూడి శాసనమున నాతఁడు నారాయణభట్టును వర్ణించుచు "యస్సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచి కాంధ్ర భాషాసు కవిరాజశేఖర ఇతి ప్రథిత స్సుకవిత్వ విభవేన''అని వ్రాసి యుం డెను. భారతావతారికలో నతఁడు రాజరాజు తన్ను భారతమును దెనుఁగున రచి యింపు మని కోరినట్లుగాఁ దెల్పి యుండెను.[1] అందే సారమతు లిత్యాది పద్య మునఁ గూడ నన్నయభట్టు "తెనుంగునన్ మహాభారత సంహితా రచన బంధురుఁ డయ్యె జగద్ధితంబు గన్" అని తెనుఁగు శబ్దమును వాడియుండెను. దీనిని బట్టి నన్నయకాలమున నాంధ్ర తెనుఁగు పదములు రెండును సమానార్థకములుగా వాడఁ బడుచుండెనని తెలియుచున్నది. నన్నిచోడుఁడు కుమార సంభవములోఁ జాళుక్య రాజు మొదలుగఁ బలువురు దేశికవిత పుట్టించి యాంధ్ర విషయంబునఁ దెనుంగు నిలిపిరని చెప్పియుండెను. తిక్కన సోమయాజి హరిహరనాథుఁడు తనకుఁ గలలోఁ గనఁబడి భారతమును ''తెనుఁగు భాష వినిర్మింపఁ దివురుటరయ భవ్య పురుషార్థ తరు పక్వఫలము గాదె" యని చెప్పినట్లు వ్రాసి యవతారికాంత మున '' భారతామృతము కర్ణ పుటంబుల నారఁగ్రోలి యాంధ్రావళి మోదముం బొరయునట్లుగఁ" దాను దానిని వ్రాసి యుండినట్లు తెల్పియున్నాఁడు. వీనిని బట్టి కూడ నాంధ్రభాష కాంధ్రము, తెనుఁగు అను రెండు పేర్లును నప్పుడు ప్రచార ములో నుండినట్లు తెలియుచున్నది. కేతన ఆంధ్రభాషా భూషణమునను[2] పాల్కు రికి సోమనాథుఁడు బసవ పురాణమునను[3] దెనుఁగును తెలుఁగను పేరుతోఁ గూడ వ్యవహరించి యుండిరి. మన మిప్పు డాంధ్రము తెనుఁగు తెలుఁగు శబ్దములను మూఁడింటిని భాషాపరముగా వాడుచున్నాము. నన్నయభట్టాంధ్ర తెనుగుశబ్దములు రెండింటిని గూడ వాడి యుండుటచే నాతనికిఁ బూర్వమే యాభాష కాపేరు లుండె నని యూహింప వచ్చును.

---

1. ఆదిపర్వ 1 ఆశ్వా 16 పద్య.
2. ఆంధ్ర భాషాభూషణము 4 పద్య.
3. తెలుఁగుమాట లనంగ వలదు వేదముల కొలఁదియగాఁ జూడుఁడిల వెట్టు లనిన,

ఆంధ్రులు తెలుఁగుదేశము నెప్పు డాక్రమించిరో నిశ్చితముగాఁ జెప్పఁజాలము కాని కొంతయూహ చేయుట కవకాశమున్నది రామాయణమునందలి కథను బట్టి విశ్వామిత్రుఁడు తన కుమారులను శపించునప్పుడు పుష్కరక్షేత్రమున దప మొనరించుచుండినట్లు తెలియుచున్నది. ఈ పుష్కరక్షేత్రము రాజపుత్ర స్థానము నందలి అజ్మీరు ప్రాంతమున నుండి యుండునని రాప్సనుగారి యభిప్రాయము దాని కిప్పుడు పొఖారా యనిపేరు. శాపానంతర మాంధ్రులు తూర్పు దక్షిణములకు వ్యాపించిరి వారిలోఁ గొందఱు కరూశదేశమును బ్రవేశించిరి. ఆంధ్ర మల్లుఁ డని హరివంశమునఁ జెప్పఁబడిన చాణూరుఁడీ కరూశదేశమువాఁడే ఆంధ్రులు కొంత కాలము వింధ్యపర్వత ప్రాంతములందుండిన పుండ్రపుళిందశబరాదు లగు ననార్యజాతులతోఁ గలసి నివసించిరి ఆయుధ జీవనులైన వారు తరువాత వింధ్య దక్షిణ దేశమునకు వ్యాపించి చివరకు కృష్ణా గోదావరీనదుల మధ్యప్రదేశమున స్థిరనివాస మేర్పఱుచుకొని రాజ్యము స్థాపించిరి.

సుగ్రీవుఁడు దక్షిణ దిక్కునకేగిన వానరులతో వారు వెదకవలసిన ప్రదేశములను బ్రజలను సూచించుచు మొదట దండకారణ్యమును గోదావరీ నదిని జేర్కొని పిమ్మట నాంధ్రులను పుండ్రులను చోళులను పాండ్యులను కేరళులను పేర్కొనెను. అతఁడు చెప్పిన పేళ్లలో నొక క్రమ మున్నదని భావించినచో రామాయణ కాలమున కాంధ్రులు గోదావరికి దక్షిణమున నివసించుచుండిరని చెప్పవచ్చును. క్రీ. పూ 4 వ శతాబ్దిలో మౌర్య సామ్రాజ్యమును స్థాపించిన చంద్రగుప్తుని కాలమునకుఁ జెందిన మెగస్తనీ సప్పటికే ఆంధ్ర రాజ్యము మిక్కిలి బలవత్తరమై యుండెనని చెప్పుటచే నారాజ్యమప్పటి కథమ మొక శతాబ్దికి ముందే స్థాపింపఁబడియుండునని చెప్పుట కవకాశము కలుగుచున్నది. ఆంధ్ర విష్ణువు నిశుంభుఁడను రాక్షసునిఁ జంపి యొక రాజ్యమును స్థాపించెననియు, నందలి భీమేశ్వర కాళేశ్వర శ్రీశైలములను క్షేత్రములలోని శివలింగములను బట్టి యాదేశమునకుఁ ద్రిలింగనామ మేర్పడె ననియుఁ జెప్పు బ్రహ్మాండ పురాణస్థమైన గాథ యిదివఱకుఁ జెప్పఁబడినది. ఈ రాజ్యస్థాపనము బహుశః క్రీ పూ. 5, 6 శతాబ్దులలో జరిగి యుండునని తలంపవచ్చును [1]

---

1 This acquired the name Andhra after they came and settled in this country at least some 5 or 6 centuries before the Christian era S V. O I Journal XIII 2 P 19

ఔత్తరాహులును బ్రాకృత భాష మాటాడువారు నగు నాంధ్రులిట్లు దక్షిణము నందలి కృష్ణా గోదావరీ మధ్య ప్రదేశము నాక్రమించి యంతకుఁబూర్వము నుండియు నట నివసించుచుండిన దేశీయులతోఁ గలసి, వారి భాష నవలంబించి, దానికిని వారికిని, ఆ దేశమునకునుగూడఁ దమయాంధ్రనామ మొసంగి యుండిరి. జాతి సంస్కృతి ప్రాభవములలోఁ దమ కుండిన యాధిక్యమును బట్టి వా రట్లు చేయుట కవకాశము కలిగినది ఆంధ్రులు వచ్చుటకు ముం దచ్చట నివసించుచుండిన యా దేశీయులు నాగులు, తెలాంగులు మున్నగు ద్రావిడజాతులకుఁ జెందినవారై యుందురని తలంపవచ్చును. వారు మాటాడుచుండెడి భాషకూడ ద్రావిడ కుటుంబమునకే చెంది, తెలాంగులను జాతినామమును బట్టి తెలుఁగనుపేర వ్యవహరింపఁబడుచుండ వచ్చును[1] అతి ప్రాచీన కాలము నుండియు నాంధ్రులు సముద్రయానము చేయుచు నౌకా జీవనము గడపుచుండి రనుటకు సూచనలు కలవు కళింగ తీరమున దంతపురమును, కృష్ణాముఖ ద్వారమున వజ్రాల దిన్నెయు నప్పుడు గొప్ప రేవుస్థలములుగా నుండినట్లు బౌద్ధ జాతక కథల వలనఁ దెలియుచున్నది ఆ రోజులలో నాంధ్రులు సువర్ణ భూమి యనఁబడు బర్మా దేశమునకుఁగూడ వ్యాపారార్థమై యరుగుచుండిరి అట్లు వలసపోయిన జనులలోఁగొందఱు బర్మాలో స్థిరనివాస మేర్పఱుచుకొనిరనియు, నిప్పుడచట తలైంగులని పిలువఁబడువారు వారి సంతతివారే యై యుందురనియుఁ జెప్పవచ్చును.

బౌద్ధ గాథలలో నాంధ్రదేశము నాగభూమి యని కూడ వర్ణింపఁ బడినది. అప్పుడు గంగా ముఖ ద్వారమునకును సింహళమునకును మధ్యఁ గల ప్రదేశము నాగులకు నివాసమై యుండెను. నాగులు బౌద్ధ మతము నవలంబించి బుద్ధుని

---

1 It is clear that the Andhras were a Prakrit speaking tribe of the North who having migrated into the country between Godavary and Krishna made it their home, mixed with the original inhabitants, adopted their language, at the same time giving their name to the country, people and language spoken by them on account of their sovereignty in the land and superiority in race and culture The original inhabitants were 'Telangs' – perhaps a mixture of Pre—Dravidian and Dravidian races speaking a Dravidian laungage Telugu which took after the name of their tribe and which must have got separated from other cognate languages of South India." K. R. in S V. O. I XIII 2 P 18—19.

భక్తి విశ్వాసములతోఁ గొల్చుచుండిరి వీరి పూర్వులు కూడ నాంధ్రరాజ్య స్థాపన సమయమున కృష్ణా గోదావరీ నదుల మధ్య నివసించి యుండురనియు, నాంధ్ర విష్ణువు జయించిన విశుంభుఁడీ నాగుల నాయకుఁడై యుండుననియు 'నాంధ్రుల చరిత్ర - సంస్కృతి' లోఁ జెప్పఁబడి యున్నది (పు. 102).

ఆంధ్రు లాక్రమించుటకుఁ బూర్వము కృష్ణా గోదావరీ నదుల మధ్య ప్రదేశమున కే పేరుండినను ఆంధ్రుల పాలనము క్రిందికి వచ్చిన పిమ్మట నది యాంధ్ర దేశ మయ్యెను. ఆ దేశము నందలి తెలుఁగుభాషకుఁ దదనుగుణముగా నాంధ్ర భాష యను నామ మేర్పడెను. ఆంధ్రులును దెలుఁగు దేశమున మొదటి నుండియు నివసించుచుండిన తెలుఁగు వారును గలసి యాంధ్రులై రనియు, నాంధ్ర భాష మాత్ర మట్లు రెండు భాషల కలయికచే నేర్పడిన భాష కాదనియుఁ, దెలుఁగే యాంధ్రులా ప్రాంతము నాక్రమించుకొన్న పిమ్మట నాంధ్రమని పిలువఁబడె ననియు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పంస్థా పత్రికలో వ్రాసి యున్నారు.[1] ఈవిధముగా క్రీ. శ. మున కైదారు శతాబ్దులకుఁబూర్వమే తెలుఁగు భాష వాడుకలో నుండెననుట కవకాశము కలుగుచున్నది. కాని దీని కూహ తప్ప నిశ్చితములైన వేఱాధారములు కానవచ్చుట లేదు.

తెలుఁగు భాష ద్రావిడ జన్యమా లేక సంస్కృత ప్రాకృత జన్యమా యను విషయమున నభిప్రాయ భేదము లున్నవి. తమిళము, తెలుఁగు, మలయాళము, కన్నడము మున్నగు దక్షిణ దేశ భాషలు ద్రావిడ భాషా కుటుంబమునకుఁ జెందిన వనియు, నివి కొన్ని శతాబ్దులకుఁ బూర్వ మేకాకారముగనే యుండి క్రమ క్రమముగా నొండొంటి నుండి విడివడి ప్రత్యేక పరిణామము నొంద నారంభించిన వనియు నొక పక్షము వారి వాదము. ఈ పక్షమునకు బిషప్ కాల్డ్వెల్‌గారు మార్గదర్శకులు డా. చిలుకూరి నారాయణరావు మున్నగు రెండవ పక్షమునకుఁ జెందిన భాషావేత్తలు తెలుఁగు సంస్కృత ప్రాకృత జన్యమనియుఁ దెలుఁగునందలి పదము లన్నిటికిని బాగుగాఁ బరిశీలించినచో సంస్కృతముననో ప్రాకృతముననో మూల రూపములు గోచరించు ననియు నొక వాదమును బ్రతిపాదించి యున్నారు. మన భాషకు వ్యాకరణములు వ్రాసిన పూర్వ పండితులు దేశ్యమును గూడ నొక భాషా భేదముగా సూచించుచునే తెలుఁగునకు సంస్కృత ప్రాకృతములే ప్రకృతులని

1. S V. O I. XII 1 పుట 26.

యభిప్రాయపడి యుండిరి. ఆంధ్ర శబ్ద చింతామణి "ఆద్య ప్రకృతిః ప్రకృతిశ్చాద్యే ఏషా తయోర్భవే ద్వికృతిః" అని చెప్పుట యిందుకు నిదర్శనము. ఈ రెండు వాదములలో ద్రావిడ వాదమునకే దేశమున బహుళాదర ప్రచారములు కలవు. కాని తెలుఁగితర ద్రావిడ భాషల నుండి యెప్పుడు విడివడి ప్రత్యేక పరిణామ వికాసముల నొంద మొదలిడెనో నిశ్చితముగాఁ జెప్పుట కాధారములు లేవు.

తమిళమున క్రీస్తుశకారంభ కాలముననే వాఙ్మయము బయలుదేరి యుండుటచేతను, మూలద్రావిడ భాషాస్వరూపము తక్కిన భాషలలోఁ గంటె నందెక్కువగాఁ గనఁబడుచుండినట్లు తమకుఁ దోఁచుటచేతను కాల్డ్వెల్‌గారు ద్రావిడ భాషలలో నదియే ప్రాచీనతమమై యుండునని యభిప్రాయపడియుండిరి. కీ. శే. కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగా రా యభిప్రాయముతో నేకీభవించక గ్రియర్సను మొదలగువారి ననుసరించి తెలుఁగు మొదలగు నితర ద్రావిడ భాషలలోనే ప్రాచీన భాషా సంప్రదాయము లెక్కువగా నిల్చియున్నవనియుఁ, దెలుఁగులో నిల్చియున్న కొన్ని పదము లరవ కన్నడ భాషా రూపములకంటెఁ బ్రాచీనతరములని స్పష్టముగా నిరూపింపవచ్చుననియుఁ జెప్పి యొక వ్యాసమున నట్లు నిరూపించుటకు యత్నించియున్నారు.[1] కాని వారు చూపిన పదముల

1 సంయుక్తాక్షరములుగల శబ్దములు మొదటివిగానుండఁ దరువాత వాని నుండి వికృతిశబ్దములు పుట్టునప్పు డుచ్చారణ సౌకర్యార్థమై సంయుక్తాక్షరములు విడఁదీయఁబడుచుండు సంప్రదాయమున కనుగుణముగా మరమ్, విరల్, తిరుప్పు, కురుడన్, కురుంగు, కరై మొదలైన తమిళరూపములు విడిపోయిన సంయుక్తాక్షరములు కలిగియుండఁ దెలుఁగున మ్రాను, వ్రేలు, త్రిప్పు, గ్రుడ్డి, క్రుంగు, క్రాగు మొదలైనవాని రూపములు సంయుక్తాక్షరయుక్తములై యుండుటయు, ప్రొద్దు, ప్రోలు, మ్రోగు, క్రొవ్వు మొదలగు శబ్దములలోని సంయుక్తాక్షరములే విడిపోయి మొదట పొరుదు, పురోలు, మురగు, కురుప్పు అను రూపములుగను దరువాత ళకారయుక్త రూపములుగను మాఱియుండుటయు, తమిళ కన్నడములలో సాధురేఫముతోఁ గూడియుండిన పరకు, తేరు, ఎరుపు మొదలగునవి తెలుఁగున శకటరేఫయుక్తములై యుండుటయు, ఱెప్ప, ఱేయి, ఱోలు మొదలగు ఱేఫాది శబ్దములు తమిళమున నుచ్చారణ సౌలభ్యానుగుణముగా ఇరప్పై, ఇరవు - ఇరా, ఉరల్ అనునట్లజాదులుగాఁ గానిపించుచుండుటయు, మగఁడు, నల్ల, మున్నగు శబ్దములు తమిళమున మూలార్థమును నుండక యర్థపరివర్తనము నొందుటయుఁ

పరిణామ స్వరూపమును విమర్శించి యీ నిరూపణము లోప భూయిష్ఠమై యున్న దనియు, నొకే కుటుంబమునకుఁ జెందిన భాషలలో నొక్కొక్క దాని యందుఁ గొన్ని ధాతువుల యొక్క కాని, పదములయొక్క కాని, క్రియారూపముల యొక్క కాని మూల రూపములు కాలగతి ప్రచ్ఛాదన భేదము వలనఁ గలుగు పరిణామము లకు లోనుగాక నిల్చియుండుట తటస్థింప వచ్చుననియు, నట్టివి తెలుఁగు తమిళము మొదలగు పరిణత భాషలలోనే కాక సంస్కార రహితములైన కోదు, కుయి మొదలగు ననాగరిక భాషలలోఁ గూడ గనఁబడ వచ్చుననియు, నంత మాత్రముచే సజాతీయ భాషా రూపముల నన్నిటిని బోల్చి చూడకుండ నా భాషల పురాతనత్వమును నిర్ణయింప వీలుకాదనియు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు అన్వ వము, తెలుఁగు-వాని ప్రాచీనత అను వ్యాసమున స్పష్టపఱిచియున్నారు [1] అందుచే నీ ద్రావిడ భాషలలో అందును తెలుఁగు తమిళములలో నేది ప్రాచీనతరమో, యేది యెప్పుడన్య ద్రావిడభాషలనుండి విడివడియుండెనో చెప్పుట శక్యముకాదు. కాని యితర ద్రావిడ భాషల నుండి విడివడి ప్రత్యేక పరిణామమును బొందిన

---

దమిళముకంటెఁ దెలుఁగే ప్రాచీనతర మనుటకు కీ శే. లక్ష్మణరావుగారు చూపిన హేతువులు.

ఆంధ్రపత్రిక - వృష సంవత్సరాది సంచిక.

1 భాషా చారిత్ర వ్యాసములు - 5 పుట 168.

పదాదిని సంయుక్తాక్షరములు కలిగి యుండుట ద్రావిడ భాషలకు సహజ లక్షణము కాదనియు తెలుఁగుభాష మూల ద్రావిడము నుండి ప్రత్యేక భాషగాఁ బరిణమించిన పిమ్మట నెప్పుడో కొంత కాలమునకు ద్వితీయాక్షరము రేఫగాఁ గలిగిన మూల భాషా పదముల యుచ్చారణమునఁ గొంత మార్పు వచ్చుటచే నందలి రేఫము తొలి వర్ణముమీఁదికి దూకివచ్చి దానితోఁ గలయుటచేఁ (వర్ణప్లుతిచే) బదాదిని రేఫ సంయుక్త వర్ణములు కలుగుట తటస్థించినదనియు, సజాతీయములగు భాష లన్నిటిలో నా శబ్దములు సంయుక్త వర్ణ రహితములై కనఁబడు చుండఁగా నొక్క తెలుఁగుననే యట్లుండుటను బట్టి యది యా భాషకు విలక్షణ మనియే తలంప వలయును గాని ప్రాచీనతా చిహ్నముగా గ్రహించుట యుక్తము కాదనియు నా భాషను వ్యవహరించు వారి కది పరిపాటిలోనిది కాకపోవుట చేతనే యాపదములందలి రేఫము కాలక్రమమున జాఱవిడువఁబడుట సంభవించినదనియు(వేలు పొద్దు మాను మొద) పెక్కు భాషలలో లకారముతోఁగూడిన రూపము కనఁబడినపు డదియే దాని ప్రాచీన రూపముగా గ్రహించుట న్యాయముగాని, యొక భాషలోఁ గొన్ని రూపములలోఁ

తెలుఁగు పదము లెప్పటినుండి శాసనములలోఁగాని గ్రంథములలోఁ గాని కానఁబడుచున్నవో కనుఁగొనుటకు యత్నింపవచ్చును

రేనాటి చోళరాజులును తూర్పు చాళుక్య రాజులును దెలుఁగు భాషలో వ్రాయించిన శాసనములు క్రీ. శ. 7 వ శతాబ్ది నుండియుఁ (E I 27 సంపుటములో రేనాటి చోళుల శాసనములు 6 వ శతాబ్ది నుండియుఁ గలవని తెల్పఁబడి

---

గనఁబడు 'ర డ, శ'ల స్థానము న నీలకారమిటువల వెలసిన దనుట సమంజసము కాదనియు తెలుఁగు పదములలోని శకట రేఫములను నిర్ణయించుటకు నిష్కృష్టములైన సాధనములు లేవనియుఁ జెక్కు పదములకు సాధుశకట రేఫద్వయయుక్త ద్వైరూప్య ముండుటయే యిందుకు నిదర్శనమనియు నితర ద్రావిడభాషా పదములతోఁ బోల్చి చూచికాని యట్టిపదములందలి రేఫముల తత్త్వము నిర్ణయింపరాదనియు లక్ష్మీనారాయణీ యాంధ్రపద పారిజాతములందు వరకు రేఫయుక్తముగాఁ గూడఁ జూపఁబడినదనియు నరవమున తేఱు అను శకట రేఫయుక్తమైన రూపముకూడ నున్నదనియు తేట యను పదమునందలి టకారమే యది శకటరేఫయుక్తమని తెల్పుచున్నదనియు, ఎరుపు శబ్దరూపమున తమిళకన్నడములందు సాధురేఫమే కనఁబడుచున్నదనియు నాభాషలలో నుచ్చారణభేదము పూర్తిగా రూపుమాసిపోలేదని తద్భాషావేత్తలు చెప్పుచున్నారనియు పదాదిని రేఫమువచ్చుట ద్రావిడ భాషలకు నైజము కాదనియు రెప్ప రేయి మొదలయిన వానిలోని యాద్యరేఫము ద్వితీయాక్షరము రేఫగాఁ గలిగిన శబ్దములలోని రేఫవర్ణప్లుతిచే నేర్పడినదేయనియు ఎఱక, ఱెక్క అనుపదములు (తమి) ఇఱంకు (తె) ఎఱగు (మల) ఇరక్కు అనుధాతువునుండి యేర్పడియుండుననియు, నల్లి యనుదానికిఁ బ్రాచీన తమిళమున నలువను నర్థముకూడఁ గలదనియు శ్రీ రామకృష్ణయ్యగారు కీ. శే. లక్ష్మణరావుగారు చూపిన హేతువులను నిరసించియుండిరి ఇట్లని తెలుఁగునఁ బ్రాచీనతర రూపములు లేనే లేవని భావింపరాదు 'నాలుక - నాల్క' యను రూపమిట్టిదే తమిళ మలయాళము లందు నా, నాక్కు అను లకారములేని రూపములే కానవచ్చుచున్నను కన్నడ తుళు భాషలలో నాలగె, నాలాయి యను రూపములందు లకారము గోచరించుచునే యున్నది అందుచే లకారము మూలశబ్దములో నుండి యుండునని యూహించుట కవకాశము లేకపోలేదు "వ్యాకరణ రూపముల విషయమున నొక్కపోదుమ్ అను తద్ధర్మార్థక రూపమే కాక భూత కాలిక క్రియా రూపములు తుమున్నంత రూపములు మొదలగు మఱి కొన్నిటి విషయమునఁ గూడఁ దెలుఁగున నిలిచియున్న రూపములు తమిళ కన్నడాదు లందలి వాని కంటె" ప్రాచీనతను సూచించుచున్నవి

యున్నది) గానఁబడుచున్నవి. అంతకుఁబూర్వము తెలుఁగు భాషలో వ్రాయఁబడిన శాసనములు లేనిమాట నిజమే. కాని తెలుఁగుభాష యంతకుముం దసలేమియులేకుండ నాశాసనముల కాలమునందే హఠాత్తుగా రూపొందెననుట యుక్తియుక్తముగా నుండదు. ఆ శాసనముల కాలమున కవ్యవహిత పూర్వముగనే కాక యాంధ్ర శాతవాహనులు తెలుఁగుదేశము నాక్రమించుకొనుటకు ముందు కూడ నచ్చటి దేశీయులైన జనులు వాడుకొనుచుండెడి భాష యొక టుండితీరవలయును అప్పటి (శాతవాహనుల) శాసనములు ప్రధానముగాఁ బ్రాకృత భాషా లిఖితములేయై యుండినను అందచ్చటచ్చటఁ గానవచ్చు గ్రామనామాదులు భాష తెలుఁగై యుండవచ్చుననుట కవకాశ మొసంగుచున్నవి ఆ విషయమును నిశ్చయముగా నిర్ణయించుట కాధారములు మాత్రములేవు కాని యాకాలమునఁ దెలుఁగు దేశమున వాడుకలో నుండిన భాష ప్రాకృతముకంటె భిన్నమని చెప్పుటకు భరతుని నాట్యశాస్త్రమునందలి కొన్ని శ్లోకములు నిదర్శనము లగుచున్నవి. సంస్కృత నాటకములందలి భాషాప్రయోగము పాత్రల యంతరము ననుసరించి వైవిధ్యము దాల్చియుండును అందుత్తమ మధ్యమ పాత్రలకు సంస్కృతమే వాడఁబడినను స్త్రీబాలసేవకాదులగు నీచ పాత్రలకుఁ బ్రాకృత భేదములు వాడఁబడుచుండును. ఆ విషయమును చర్చిచెప్పుచు భరతుఁడు "బర్బర కిరాతాంధ్ర ద్రవిడ ప్రభృతి జాతులందు నాట్య ప్రయోగమునఁ గావ్యమును దేశభాషా సమాశ్రయము కావింపరాదనియు, నాటకమున శుద్ధములైన సర్వజాతుల విషయమున శౌరసేని నుపయోగింపవలయుననియు" వ్రాసియున్నాఁడు.[1] నాట్యశాస్త్ర రచనాకాలమును గూర్చియు గ్రంథ కర్తృత్వమును గూర్చియు భిన్నములైన యభిప్రాయము లున్నవి మహామహోపాధ్యాయ హరప్రసాదశాస్త్రిగారది క్రీ. పూ. 2వ శతాబ్దిలో వ్రాయఁబడెననియు,[2] A B Keith గారది క్రీ. శ. మూఁడవ శతాబ్దికి ముందు రచింపఁబడెనని విశ్వసనీయముగాఁ జెప్పరాదనియు,[3] శ్రీ మల్లాది సూర్యనారాయణ

---

1 న బర్బర కిరాతాంధ్ర ద్రవిడాద్యాసు జాతిషు
నాట్యప్రయోగే కర్తవ్యం కావ్యం (పాఠ్యం) భాషాసమాశ్రయమ్
జాతి ష్వేతాసు సర్వాసు శుద్ధాసు చ ద్విజోత్తమాః
శౌరసేనీం సమాశ్రిత్య భాషా కార్యా తు నాటకే

నాట్య. *17-46-47*

2 Journal of the Asiatic Society of Bengal 1913 P 317

3 Sanskrit Drama Page 13

శాస్త్రిగా రది క్రీ. పూ. 300 ప్రాంతమున రచింపఁబడి యుండుననియు[1] మనోమోహన్ ఘోషుగారు దాని రచనాకాలము క్రీ. పూ 100 మొదలు క్రీ. శ. 200 వరకు నడుమనై యుండుననియుఁ[2] జెప్పియున్నారు శ్రీ కాణే పండితుఁడు కొంచెము మించుమించుగా మనోమోహన్ ఘోషుగారి కాలనిర్ణయముతో నేకీభవించి యున్నాఁడు[3] ఈ విధముగా భరత శాస్త్ర రచనాకాలము నిర్వివాదముగా నిర్ణయించుటకు వీలులేదు కాని యది క్రీస్తు శకారంభమునకే రచితమై యుండెననుట మాత్రము సత్యదూరము కానేరదు భరతుఁడు చెప్పిన పై శ్లోకములను బట్టి యాకాలమున కాంధ్ర ద్రవిడ జాతులవలెనే తద్భాషలుకూడ వెలసి యుండెననియు వానికి బదులాకప్పుడు శాబరేని వాడఁదగి యుండెనని చెప్పఁబడి యుండుటచే నవి శాబరేనికంటె భిన్నములనియుఁ దెలియుచున్నది. ఇంతకంటె నప్పటి యాంధ్రభాషను గూర్చికాని యంతకుఁబూర్వమది యుండెనా లేదా యను విషయమును గూర్చికాని యేమియుఁజెప్పఁజాలము. కొంచెము మించుమించుగా నశోకుని కాలమువనే యాంధ్రదేశమునందలి భట్టిప్రోలులో వేయఁబడిన పది ప్రాకృత శాసనములు లభ్యము లగుచున్నవి. అందొకటి దానియందు సింహగోష్ఠి ప్రముఖుఁడైన రాజాఖుబిరకుఁడు పేర్కొనఁబడియున్నాఁడు.[4] ఇందులోఁగాని మిగిలిన తొమ్మిదింటిలోఁగాని యెచ్చటను దెలుఁగుభాషా చిహ్నములు గోచరింపుటలేదు.

శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు తమ తెలుఁగు కవిజీవితము లను గ్రంథమునందలి ఆంగ్లోపోద్ఘాతములో ఆంధ్రాటవిధనుగూర్చి చెప్పుచు నదితెలుఁగు గ్రంథమనియు, నందు పాళీప్రాకృత మిశ్రితమైన తెలుఁగు భాషాపదములు కన

---

1. సంస్కృత వాఙ్మయ చరిత్ర Vol II.

2 Department of letters, Calcutta University Vol. 25-P1-54

3. Although I do not agree with several things he says, the date he arrives at cannot be far from the truth Hist of Skt Poetics Page 40. The above discussion however makes it probable that the present Natyasastra is not older than the beginning of the Christian era. Page 41

4. పగతి భిగమపుతానమ్ రాజపాముఖా స ఇ (మ) పుతో ఖుబిరకో రాజా సిహగోఠియా పాముఖ ... అమ్మమ్ మజూసమ్ ఫాలిగసముగో చ పాహాణ సముగో చ E I Vo II Page 327.

వచ్చుచున్నవనియు వ్రాసియున్నారు [1] ఆంధ్రాట్టకథ యిప్పుడు లభ్యమగుట లేదు. క్రీ. శ. 5 వ శతాబ్దిలో నుండిన బుద్ధఘోషుఁడు తాను వినయ పిటకమునకు వ్రాసిన సమన్తపాసాదిక యను వ్యాఖ్యలో నంతకుఁ బూర్వమున్న వ్యాఖ్యానములను గొన్నిటిని పేర్కొని యుండెను. వానిలో మహా అట్టకథ, మహా పచ్చరి అట్టకథ, కురుంది అట్టకథ, అనునవి ముఖ్యములైనవి మిగిలిన వానిలో అంధక అట్టకథ సంక్షేప అట్టకథ, మల్లపచ్చరి అనునవి కలవని సారత్థదీపిని విమతి వినోదిని, వజిరబుద్ధి అను టీకలవలనఁ దెలియుచున్నది ఈ అట్టకథల నశోకుని కుమారుఁడైన మహేంద్రుఁడు సింహళమునకుఁ గొనిపోయి సింహళ ద్వీప భాషలోనికిఁ దర్జుమా చేసియుండెనని ప్రతీతి. అందుచే నవి క్రీ. పూ 3 వ శతాబ్దికిఁ బూర్వములై యుండవలయును. ఆంధ్రాట్టకథ ఆంధ్రదేశమున వ్రాయఁబడినదో లేక యుపయోగింపఁబడినదో యై యుండునని దానిపేరే చెప్పక చెప్పుచున్నది అందలి భాష యేదో నిశ్చితముగాఁ జెప్పఁజాలము పాళీ వాఙ్మయ చరిత్రలో బి. సి. లా గారు అంధకాట్టకథ బహుశః దక్కనునందలి యొక దేశ భాషలో వ్రాయఁబడియుండునని తెల్పియున్నారు [2] Oldenburg గారు తము వినయపిటకమునకు వ్రాసిన పీఠికలో బౌద్ధ గ్రంథముల నెల్లరును వారివారి స్వభాషలలోనే నేర్చుకొనవలెనని బుద్ధుఁడు శాసించినట్లు తెల్పు చుల్లవగ్గములోని యొక వాక్యమును సూచించియున్నారు [3] ఇట్లు నిజముగా బుద్ధుఁడు శాసించెనో లేదో తెలియదు కాని యా గ్రంథములు దేశమునందలి వివిధ ప్రాంతములలో నుపయుక్తములైనప్పు డాయా దేశభాషల ద్వారముననే పఠింపఁబడుచుండె నన్ని ధృఢముగాఁ జెప్పవచ్చును. దీనినిబట్టి ఆంధ్రాట్టకథ యాంధ్ర భాషలోనే వ్రాయఁబడి యుండెనేమోయని తలంచుట కవకాశ మున్నది బుద్ధ

---

1 The Andhrattakatha referred to by Buddhaghosha should have been written before 3rd century B C. This must be a Telugu work with Telugu and Pali Prakrit words as the Telugu language was formed even before that time Page XV

2 Presumably it (the Andhrattakatha) was written in some native dialect of the Deccan Vol II P 376

3. Buddha 'decreed that everyone should learn the sacred Texts in his own language" Oldenburg's Introduction to Vinayapitaka Vol I

ఘోషుఁడు థేరవాదమునకుఁ జెందినవాఁ డగుటయు, నీ వాదమును దత్సంబంధి గ్రంథములను థేరవాదమునకు మూలస్థానములలో నొకటైన దక్షిణభారతము నుండియే సింహళమునకు వ్యాపించియుండెనని తెలియవచ్చుటయు, బుద్ధఘోషుఁ డాంధ్రాట్టకథయందలి యభిప్రాయములను దఱుచుగా నుదాహరించి యుండుటయుఁ, బై తలంపునకు బలము చేకూర్చుచున్నవి. కాని డా. వి. రాఘవన్‌గారు స్టెన్‌కొనో, హార్నెల్ మున్నగువారు పాళీ పైశాచీ భాషలనుగూర్చి చెప్పిన వాక్యములను బురస్కరించుకొని[1] ఆంధ్రాట్ట కథ ద్రావిడ ప్రాంతమున వాడఁబడుచుండిన యార్యభాషలో వ్రాయఁబడి యుండుననియు, దాని నొక విధముగాఁ బైశాచీ పాళీ యని చెప్పవచ్చుననియు నిశ్చయించి యున్నారు.[2] ఆంధ్రాట్టకథ యిప్పుడు లభ్యము కాకపోవుటచే శ్రీ వెంకటరావుగారు చెప్పిన ట్లది తెలుఁగు గ్రంథమే యని కాని యందలి భాష యిట్టిదనికాని చెప్పుటకు వీలులేకుండ నున్నది. కాని పేరు సూచించునట్లుగా నా అట్టకథ కాంధ్ర భాషతో నెట్టిసంబంధమైన నుండుచో నా భాష క్రీ. పూ. 3వ శతాబ్దిలో నేదో యొక రూపమున జన వ్యవహారములో నుండిన ట్లూహించుటలో దోష ముండదు.

ఈ విధముగా భరత నాట్యశాస్త్రమును బట్టికాని ఆంధ్రాట్టకథను బట్టికాని యాంధ్రభాష క్రీస్తుపూర్వ ముండెనని యూహించుటకే వీలుకలుగుచున్నది గాని ఖండితముగాఁ జెప్పుట కవకాశము లభించుట లేదు. కాని క్రీస్తుశకారంభమైన యచిరకాలముననే కూర్పఁబడిన గాథాసప్తశతిలోను, శాతవాహనులును వారి తరువాత నాంధ్రదేశమును బరిపాలించిన రాజులును వేయించిన శాసనములలోను అవి ఆంధ్రభాషా లిఖితములు కాకపోయినను అచ్చటచ్చటఁ గొన్ని తెలుఁగు

---

1. Konow accepts Hoernle's conclusion that Paisachi represents an Aryan vernacular as spoken by a Non - Aryan people and adds that these Non - Aryans may be the Dravidians of the Vindhyan neighbourhood and that Pali was also an Aryan dialect spoken by the local people of the same region. (Journal of Andhra History and culture. Vol. IV Pages 163 – 165).

2. We may draw the probable conclusion that the language of the Andhrattakatha quoted by Buddhaghosha was an Aryan vernacular spoken in a Dravidian region which we may for convenience call Paisachi – Pali. Ibid

పదములు గోచరించుట యంతకుఁ బూర్వమునుండియుఁ దెలుఁగుభాష యాంధ్ర దేశమునఁ బ్రచారమున నుండెనని తలంచుట కాధార మగుచున్నది.

శాతవాహన రాజుల కాలమునఁ బ్రాకృతభాష సర్వతోముఖమైన యభి వృద్ధి గాంచి యుండెను. అందును హాలునికాల మాభాషకు స్వర్ణయుగమని చెప్పవచ్చును. అతని యాస్థానమున నుండిన గుణాఢ్య పండితుఁడు పైశాచీ ప్రాకృతమున బృహత్కథ యను పెద్ద కథాకావ్యమును నిర్మించియుండెను. హాలుఁడు స్వయముగా మహాకవియై తాను రచించినవియుఁ దన కొలువున కరు దెంచిన పలువురు ప్రాకృత మహాకవులు రచించినవియు నగు గాథాపరంపరల శృంగార రసనిధానములును బ్రౌఢగంభీరభావసేవధులు నైన యేడువందల గాథలనేరి గాథాసప్తశతి యను ముక్తక గ్రంథమును గూర్చెను. ఈ హాలుఁడు క్రీ. శ. 19 నుండి 24 వఱకుఁ బరిపాలించి యుండెనని చరిత్రజ్ఞులు చెప్పు చున్నారు.[1] దీనినిబట్టి గాథాసప్తశతియు క్రీ. శ. ప్రథమ శతాబ్దిలో సంకలిత మయ్యెనని నిర్ణయింపఁబడుచున్నది.

శాతవాహనరాజులు జాతిచే నాంధ్రు లయ్యును, బ్రస్తుత మాంధ్ర దేశమని పిలువఁబడుచున్న ప్రదేశమును బరిపాలించినవా రయ్యును, దమ శాసనములందుఁ బ్రాకృత భాషనే వాడియుండిరి. వారాంధ్ర భాషను బోషించినట్లు చెప్పుటకు నిదర్శ నము లేవియుఁ గానరావు. కాని హాలసంకలితమైన గాథాసప్తశతిలో నెడనెడఁ గొన్ని తెలుఁగుపదములు కానవచ్చు చుండుటచేఁ దెలుఁగుభాష క్రీ. పూ. ప్రథమ శతాబ్ది నాఁటికే సుస్థిరమైన రూపము నొంది ప్రచారము గాంచెనని చెప్పుటకు వీలగుచున్నది.

గాథా సప్తశతి యందలి ప్రాకృతము మహారాష్ట్రి యని విద్వాంసుల యభి ప్రాయము. ఈ మహారాష్ట్రి ప్రాకృతమున స్వల్పముగనే యైనఁ దెలుఁగు పద ములు చొచ్చుటకు రెండు విధములైన యవకాశము లున్నవి. శాతవాహన రాజుల కాలమున రాజభాష ప్రాకృత మగుటచేఁ బ్రజలు కూడ నాభాష నేర్చి వ్యవహరించు చుండ వచ్చును. అప్పుడు తెలుఁగు దేశమునఁ దద్దేశభాష కూడ మాటాడఁ బడు చుండినచో నందలి పదములు కొన్ని ప్రాకృతమునఁ బ్రవేశించుట కవకాశ మున్నది. రెండు భాషలు వ్యవహారమున నున్నచోట్ల నా భాషలం దన్యోన్య

1. శ్రీ మారేమండ రామారావుగారు సాతవాహన సంచిక

ప్రభావ సంక్రమణము కావింపుట సహజము. ప్రస్తుతము బళ్ళారి జిల్లా యందలి తెలుఁగువారు మాటాడు భాషలోఁ గొన్ని కన్నడ పదములును, గంజాముజిల్లా వారి తెలుఁగులోఁ గొన్ని యుత్కళ పదములును నెల్లూరుజిల్లా యందలి తెలుఁగులోఁ గొన్ని తమిళ పదములును, హైదరాబాదు రాష్ట్రము నందలి తెలుఁగులోఁ గొన్ని హిందూస్థానీ పదములును జొచ్చి యుండుట యిందుకు నిదర్శనము. ఇంక భాషలోని కెక్కిన పదము లన్యదేశ్యము లైనను క్రమముగాఁ గవిత్వమునకుఁ గూడ నెక్కినను టలో నచ్చెరువు లేదు. సప్తశతి యందలి గాథ లేకకర్తృకములు కావనియు, నందు వివిధ ప్రదేశము లందలి స్త్రీ పురుషులు రచించిన గాథ లనేకములు కూర్పఁబడిన వనియు నెల్ల రంగీకరించిన విషయమే. ఆ రచయితలలోఁ దెలుఁగు దేశమున నివసించుచుఁ దెలుఁగు భాషతో సుపరిచయము గలవారు కూడ గొంద ఱుండ వచ్చును. అట్టివారు రచించిన గాథలలో నెడనెడఁ బ్రాకృత పదముల నడుమఁ దెలుఁగు పదములు కూడ దొర్లి యుండినచో వింతపడవలసిన యక్కఱ లేదు.

హాలుని ముఖ్యపట్టణము ప్రతిష్ఠానపుర మను నామాంతరము గల పైఠన్ నగరము. అది యిప్పుడు మహారాష్ట్ర దేశమున నున్నది. బృహత్కథా నిర్మాత యైన గుణాఢ్య పండితుఁడు కూడ నీ నగరము నందే నివసించి యుండెను. అతఁడు శర్వవర్మతోఁ గలిగిన వాదమున "షడ్భిర్మాసై స్త్వయా దేవః శిక్షితశ్చే త్తతో మయా, సంస్కృతం ప్రాకృతం తద్వద్దేశ భాషాచ సర్వదా, భాషాత్రయ మిదం త్యక్తం యన్మనుష్యేషు సంభవే" త్తని శపథము కావించినట్లు కథా సరిత్సాగర కథనము వలనఁ దెలియుచున్నది. శర్వవర్మ కుమార వరప్రసాదముచే రాజు నాఱు మాసములలో సంస్కృత భాషానిష్ణాతునిఁ గావింపఁ జాలుటచే గుణాఢ్యుఁడు మున్ను గైకొన్న ప్రతిన కనుగుణముగా సంస్కృతమును బ్రాకృతమును దేశభాషను విసర్జించి యుండవలెను. ఇచ్చటఁ బ్రాకృత దేశభాష లనఁగా నేమో యింత పరిశీలింప వలసి యున్నది.

గుణాఢ్యుని బృహత్కథ యిప్పు డుపలభ్యమాన మగుట లేదు. పైశాచీభాషతో (పైశాచ్యా భాషయా) సప్తలక్ష గ్రంథపరిమితమైన దానిని గుణాఢ్యుఁ డేడు సంవత్సరములలో రచించి యుండెనని కథా సరిత్సాగరము

నుడువుచున్నది[1] ఈ పైశాచి సామాన్యముగా నొక ప్రాకృత భేదముగాఁ బరిగణింపఁ బడుచున్నది. వరరుచి ప్రాకృత ప్రకాశము నందలి దశమ ప్రకరణమున నేతల్లక్షణములను వివరించి యున్నాఁడు. ప్రాకృతమునుగూడ విడిచి వేసెద నన్న గుణాఢ్యుఁడు ప్రాకృత భేదములలో నొకటైన పైశాచిని గ్రహించి యుండినచోఁ బ్రతిజ్ఞా భంగము కావించిన వాఁడు కాఁడా? లేక యాతఁడు వాడిన పైశాచీ భాష మనుష్య వ్యవహారము నందలి పైశాచీ భాషకంటె భిన్నమైనదా? లేక ప్రాకృతమనుటచే నాతఁడు దండిచేఁ దరువాతఁ బ్రకృష్టమైన ప్రాకృతమని ప్రశంసింపఁ బడిన మహారాష్ట్రి ప్రాకృతము నొక్కదానినే యుద్దేశించి యుండెనా? అను విషయములను నిర్ణయింప వలయును.

ప్రాకృత వ్యాకరణములలోని కెల్ల మిక్కిలి ప్రాచీనమైనది వరరుచి ప్రాకృత ప్రకాశిక. అందు మహారాష్ట్రి, శౌరసేని, మాగధి, పైశాచి యను నాలుగు ప్రాకృత భేదములకు వ్యాకరణము చెప్పఁ బడినది. వీనిలో మహారాష్ట్రి ప్రధాన ప్రాకృతముగాఁ బరిగణింపఁబడుచుండె ననుటకు వరరుచి యందు దానికిచ్చిన ప్రాధాన్యమే తార్కాణము. అందాతఁడు మహారాష్ట్రికిఁ దొమ్మిది ప్రకరణములను మిగిలిన మూఁడింటి కొక్కొక్క ప్రకరణమును వినియోగించి యుండెను. మిగిలిన వానినిగూర్చి చెప్పునప్పు డాతఁడు వానియందలి విశేషములను, మహారాష్ట్రితో వానికిఁగల భేదములను మాత్రమే తెల్పుచుండును. తక్కిన యంశములలో నవి మహారాష్ట్రి ప్రాకృతముతో సమానములని యాతని యభిప్రాయము.[2] హేమచంద్రుఁడు కూడ నాపద్ధతినే యవలంబించెను గాని యాతఁడు మహారాష్ట్రి యని పేర్కొనక యాభాషను, నిరుపపదముగాఁ బ్రాకృతమని మాత్రము తెల్పుచుండును. అతఁడు వరరుచి పేర్కొన్న నాలుగు ప్రాకృతములకు చూళికా పైశాచి, అపభ్రంశము అను

1. నిబద్ధా సప్తభిర్వర్షైః గ్రంథలక్షాణి సప్త సా.

*కథాసరిత్సాగరము.*

2 Vararuchi devotes the first nine chapters of his work to the Maharashtri and then a chapter each to the rest. The peculiarities only of the latter dialects and their differences from the Maharashtri are given and in other respects they are to be considered similar to the first. Hemachandra follows the same method but he does not mention the name Maharashtri and speaks of the dialect only as the Prakrit (Bhandarkar Wilson Lectures Page 72).

మఱిరెండు భేదములను జేర్చియుంచెను తరువాతఁ బ్రాకృతమునకు వ్యాకరణము వ్రాసిన త్రివిక్రమ, చంద్ర, లక్ష్మీధరాదులు కూడ నీ షట్ప్రాకృత భేదములను గూర్చియే తమ గ్రంథములలో వివరించి యుండిరి.

దండి కావ్యాదర్శమున "మహారాష్ట్రాశ్రయాం భాషాం ప్రకృష్టం ప్రాకృతం విదుః" అని చెప్పి యుండెను. (1-34) అతఁ డట్లు చెప్పుట కందుఁ గన వచ్చిన విస్తృతమైన వాఙ్మయమే కారణమై యుండును. సూక్తి రత్నముల కది సాగర మనియు సేతు బంధాది కావ్యము లందే రచింపఁబడె ననియు నాతఁడు చెప్పి యున్నాఁడు. హాలుని సప్తశతి యందలి భాష మహారాష్ట్రియే యని విద్వాంసుల యభిప్రాయము. కనోజి రాజైన యశోవర్మ యాస్థానమున నుండిన వాక్పతి రాజు రచించిన గౌడవధ కావ్యముకూడ మహారాష్ట్రి ప్రాకృత రచితమైనట్టిదే. సప్తశతియును బృహత్కథయును గొంచె మించుమించుగా సమానకాలమున వెలసిన గ్రంథములు. సప్తశతి యా కాలమునందలి పలువురు కవులచే వ్రాయఁబడిన పద్యముల కూర్పు. అందలి భాషయే (మహారాష్ట్రియే) యప్పుడు బహుళముగా గ్రంథరచన కుపయుక్తమగు చుండెనని చెప్పవచ్చును. దానికే యప్పుడు ప్రాకృతమను పేరు రూఢముగా వాడఁబడుచుండి యుండును. అందుచే గుణాఢ్యుఁడు ప్రాకృతమును వర్జింతునని చెప్పినప్పుడు దీనినే యుద్దేశించి యుండెనని యూహింపనగును.

మహారాష్ట్ర దేశమున వ్యవహరింపఁబడిన ప్రాకృతమునకే మహారాష్ట్రి యను పేరు వచ్చెనని యా నామమే చెప్పక చెప్పుచున్నది. క్రీ. శ. మూఁడు నాలుగు శతాబ్దులకుఁబూర్వ మా దేశమునకు మహారాష్ట్ర మను పే రేర్పడి యుండలేదనియు, నందుచే నంతకుఁబూర్వము మహారాష్ట్రియను పేర నొక ప్రాకృత ముండుట యసంభవమనియు, సప్తశతి మహారాష్ట్రి ప్రాకృత రచిత మను వారిమాట యాధారరహిత మనియు, వరరుచి తన వ్యాకరణమున మొదటి తొమ్మిది యధ్యాయములలో వివరించినది ప్రధాన ప్రాకృతమే కాని మహారాష్ట్రి కాదనియు, నందుచేతనే హేమచంద్రుఁడు తన వ్యాకరణమున మహారాష్ట్రియను పేరు పేర్కొనక వట్టి ప్రాకృతమనియే పేర్కొని[illegible] శ్రీ ఖండ్రుగంటి సీతారామయ్యగారు తెల్పియున్నారు.[1] ఆ[illegible] బ్రమాణ భూతమైన



1. Journal of the Dekkan History and [illegible] No. .........

యొక ప్రధాన ప్రాకృత ముండెననియు నదియే ప్రాకృతమని పిలువఁబడు చుండె ననియు మాగధీ శౌరసేనీ పైశాచు లప్రధానములైన యితర భేదములనియు వారి యభిప్రాయము.[1] దీనినిబట్టి గుణాఢ్యుఁడు మహారాష్ట్రీ ప్రాకృతమును గాక యా ప్రధాన ప్రాకృతమునే విసర్జించెనని చెప్పినట్లు తలంపవలసి యుండును.[2]

ఐనచో గుణాఢ్యుఁడు వాడిన పైశాచీ భాష స్వరూప మెట్టిది? నేపాల మాహాత్మ్యమను కథను బట్టి గుణాఢ్యుఁడు పైఠాను నగరమునుండి నేపాల దేశమునకుఁ బోయి యచ్చటఁ దప మొనరించెనని తెలియుచున్నది. సర్ జార్జి గ్రియర్సను గారు లింగ్విష్టిక్ సర్వే ప్రథమ సంపుటమున (పుట 108-114) "నేఁటి హిందూస్థానమున కుత్తరమున మాటాడఁబడు కొన్నిభాషలు పిశాచ భాషలనియు, వానిని దరద దేశమున మాటాడు చున్నారనియు, వానికి దార్దిక భాష లని పేరుపెట్టఁ బడినదనియు" వ్రాసియున్నారు. దర్దిస్థాన మనఁబడిన యా ప్రదేశము గిల్గితు, కాశ్మీరము, కొహిస్తాను, కాఫిరిస్తాను, చిత్రాలు అను భాగములతోఁ గూడియుండె ననియు, నందలి భాషలు ప్రాచీన కాలమున పంజాబు నం దంతటను వ్యాపించి నేపాలదేశము వఱకు నుండినట్లు తెలియు చున్నదనియు, నాదేశ భాగములం దుండిన జనులనే పూర్వులు పిశాచములని చెప్పుచుండిరనియు వారే వ్రాసియున్నారు. షడ్భాషా చంద్రికలో పాండ్య కేకయ బాహ్లిక సహ్య నేపాల కుంతల సుధేష్ణ భోజ గాంధారాదులగు దేశములు పిశాచ దేశములని పేర్కొనఁ బడియున్నవి.[3] అందుచే గుణాఢ్యుఁడు నేపాల

---

1 The plausible conclusion should be that there was a major standardised language which was called Prakrit and minor variations called Paisachi Magadhi and Sauraseni. Ibid Page 4.

2 మహారాష్ట్రీ ప్రాకృతమునో మఱియే ప్రధాన ప్రాకృతమునో ప్రాకృత మనిచెప్పి మిగిలిన ప్రాకృత భేదములను దద్భిన్నముగాఁ బేర్కొను నాచారము తరువాతఁ గూడఁ గానవచ్చుచున్నది నన్నయ నారాయణభట్టును గూర్చి నందమపూడి శాసనములో 'యస్సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచికాంధ్ర భాషాసు' అని చెప్పుచుఁ బ్రాకృత పైశాచీ భాషలను, శ్రీనాథుఁడు తన్నుగూర్చి "సంస్కృత ప్రాకృత శౌరసేనీ ముఖ్యభాషా పరిజ్ఞాన పాటవంబు" అనిచెప్పుకొనుచుఁ బ్రాకృత శౌరసేనీ భాషలను బృథక్కరించి పేర్కొనుట యిందుకు నిదర్శనములు

3 పాండ్య కేకయ వాహ్లీక సహ్య నేపాల కుంతలాః
సుధేష్ణ భోజ గాంధార హైవకన్నౌ జనాస్తథా
ఏతే పిశాచ దేశాస్స్యుః — షడ్భాషా చంద్రిక

(ఆంధ్ర భాషా వికా. 79)

దేశమునకేగి సంస్కృత ప్రాకృత దేశభాషా భిన్నమైన యచ్చటి పిశాచ భాషలో బృహత్కథను రచించి యుండును. అతని శిష్యుల వలన శాతవాహన రాజా గ్రంథమును విని దాని నామోదింపక యది పిశాచ భాషయనియు నీరస భాషయనియు నిరసించుటకు[1] విద్యామదమేకాక యిదియు నొక హేతువై యుండును బృహత్కథకు మూఁడు సంస్కృతానువాదము లున్నవి. అందొకటి బుద్ధస్వామి రచించిన బృహత్కథా శ్లోక సంగ్రహము. ఇది నేపాల దేశమున సంపాదింపఁ బడినది మిగిలిన రెండును కాశ్మీర ప్రభువైన అనంతుని యాస్థానమునఁ బండితులైన క్షేమేంద్ర సోమదేవు లను వారిచే రచింపఁ బడినవి. (క్రీ. శ. 10-9-1044) ఈ మూఁడు గ్రంథములును నేపాల కాశ్మీర దేశములకు సంబద్ధములై యుండుట కూడఁ బైకథ కనుగుణముగానే యున్నది. సోమదేవుఁడు తాను గుణాఢ్యుని గ్రంథమును యథామూలముగా ననువదించి నట్లు చెప్పి యున్నాఁడు. మనుష్యుఁడైన యాతఁడు దానినిజదివి యర్థముచేసికొని యనువదించెను గావున[2] నందలి భాష పిశాచములని పిలువఁబడు వారిచే మాటాడఁబడు భాషయే కాని మనుష్య భిన్నులైన పిశాచములచే వ్యవహరింపఁబడు చుండిన భాష కాదని తెలియు చున్నది. సోమదేవుఁడు "యన్మనుష్యేషు సంభవేత్"ని వ్రాయుట నిక్కడ యథాశ్రుతముగా గ్రహింపరాదు.

వరరుచి పైశాచినిగూడఁ బ్రాకృత భేదముగాఁ జేర్కొని యుండెను. దానిని వాడువా రెవ్వరైనను అది ప్రాకృత మనుటలో మాత్రము సందేహము లేదు అందుచే గుణాఢ్యుఁ డా భాషలో బృహత్కథను వ్రాసి స్వవచన వ్యాఘాత మొనర్చి యుండెనను నాక్షేపణము మిగిలియే యున్నది. దానిని దొలఁగించుటకై శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారు చెప్పిన యీ క్రింది యభిప్రాయ మెంతయు సమంజసముగాఁ దోఁచుచున్నది. "ఏకదేశ వికృత మనన్యవ"త్తను న్యాయమున

1. పిశాచ భాషాం తాం శ్రుత్వా, తాంచ దృష్ట్వా తథాకృతీ
విద్యామదేన సాసూయం స రాజైవ మభాషత
ప్రమాణం సప్తలక్షాణి పైశాచం నీరసం వచః
శోణితే నాక్షరన్యాసో ధిక్ పిశాచకథా మిమాం ।
(కథా సరిత్సాగరము)

2. యథామూలం తథైవేత న్న మనాగ వ్యతిక్రమః
ఔచిత్యాన్వయరక్షా చ యథాశక్తి విధీయతే
(కథాసరిత్సాగరము)

స్వల్పభేద మున్నంత మాత్రమున నది (పైశాచి) ప్రాకృతము కాకపోదు. గుణాఢ్యుఁడు దానియం దుద్గ్రంథ రచన చేయుటచే దానికొక గౌరవము కలిగి ప్రాకృతముల స్థానమున కెత్తఁబడి యుండును. కొందఱు పాశ్చాత్య విద్వాంసులూహించినట్లు ప్రాకృతపద బాహుళ్య సంకీర్ణమైన దేశభాషయే పైశాచియై యుండవచ్చును. వరరుచి దానియందలి ప్రాకృత భాగమునకే వ్యాకరణము చేసెను గాని యావత్పైశాచికిని అనుశాసనము చేసి యుండఁడు. దీనినె ద్రావిడీ ప్రాకృతమనికూడఁ బిల్చియుందురు. మూలద్రావిడ ప్రాకృతభాషల సమ్మిశ్రణమే పైశాచి కావచ్చును. గుణాఢ్యుఁడు సంస్కృతమును, ప్రాకృతమును (శుద్ధ ప్రాకృతమును) దేశభాషను (శుద్ధ దేశభాషలు) వదలుటకు కృతప్రతిజ్ఞుఁడాయెను. ప్రాకృత దేశభాషా సంకీర్ణమైన భాషను (పైశాచియని వ్యవహరింపఁబడిన దానిని) విసర్జించుట యాతని ప్రతినలోని విషయము కాదని భావింపవలెను. లేనిచో నాతఁడొక యపూర్వ భాషను సృష్టించియో నేర్చియో కావ్యము వ్రాసినాఁడనవలసి యుండును. అది యంత విశ్వసనీయముకాదు."

ఇంక గుణాఢ్యుఁడు విసర్జించిన దేశభాష యేదో పరిశీలింప వలయును దేశభాష యను పదము ప్రాచీనకాలము నుండియు వాడఁబడుచున్నది. మహాభారతము[1], పాణినీయము, నాట్యశాస్త్రము[2], కామసూత్రములు[3] మున్నగు పెక్కు గ్రంథములం దా పదము వాడఁబడియున్నది. బుద్ధమహావీరులు తమ మతసిద్ధాంతములను దేశభాషలోనే బోధించినట్లు ప్రతీతి. కువలయమాలాకథ అను ప్రాకృతకావ్యములోఁ బదునెనిమిది దేశభాషలు పేర్కొనఁబడి యున్నవి.[4] హర్షచరిత్ర ప్రథమోచ్ఛ్వాసమున బాణుఁడు దేశభాషాకవిని పేర్కొని

---

1 నానా చర్మభి రాచ్ఛన్నా నానాభాషాశ్చ భారత
కుశలా దేశ భాషాసు జల్పన్తోऽన్యోన్య మీశ్వరాః.

శల్యప 46 - 103

2 'అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి దేశభాషా వికల్పనమ్'
'అథవా ఛందతః కార్యా దేశభాషాప్రయోక్తృభిః'

నాట్యశాస్త్ర. 17 24

3 నాత్యంతం సంస్కృతేనైవ నాత్యంతం దేశభాషయా
కథాంగోష్ఠీషు కథయన్ లోకే బహుమతో భవేత్.

కామసూత్ర. 1 - 4

4. వ్యాసనంగ్రహము ప్రాకృత గ్రంథకర్తలూ ప్రజాసేవాసు పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిలుగారు

యున్నాఁడు. పై గ్రంథములలో వాడఁబడిన దేశభాషలన్నియు నేకభాషా విశేషమే యనుటకు వీలులేదు. అవి యాయా గ్రంథకర్తల కాలములలో నాయాదేశములందు గ్రంథస్థ వాఙ్మయమునకు భిన్నముగాఁ బ్రజావ్యవహారమున నుండిన భాషలని చెప్పవచ్చును. మహారాష్ట్రి ప్రాకృతమో లేక ప్రధాన ప్రాకృతమో గ్రంథరచనోపయోగిగా నుండినప్పుడు, "అనియమాద్గ్రామ్యం యత్త్వప భ్రంశః" అని చింతామణిలోఁ జెప్పఁబడినట్లు నియమరాహిత్యముచే నపభ్రంశమని చెప్పఁదగిన తదపభ్రంశరూపము జనవ్యవహారమున నుండి యుండును.[1] దానినే గుణాఢ్యుఁడు దేశభాష యని చెప్పినట్లు తలంపవచ్చును. కాని యపభ్రంశముల కాలము క్రీ. శ. 5వ శతాబ్దినుండి యని పండితులు చెప్పుట యటుండఁ బ్రాకృత భాషావికారమైన యపభ్రంశమును దేశభాషగాఁ బరిగణించుట యెట్లను సందేహ ముదయింపవచ్చును. జనవ్యవహారమున నుండుటచేతనే దానిని గుణాఢ్యుఁడు దేశభాషగాఁ బరిగణించెననుటకంటె దీనికి వేఱుసమాధానములేదు. అందుచే గుణాఢ్యుఁడు దేశభాషగాభావించిన దపభ్రంశము కంటె భిన్నమైనదేదో యై యుండవలయును. అది సంస్కృత ప్రాకృత భిన్నమై దేశమునందలి జనులచే వాడఁబడుచుండిన భాష కావలయును. గుణాఢ్య శర్వవర్మల వివాద వృత్తాంతము పైఠాన్ నగరమున జరిగియుండెను. అది యిప్పటి మహారాష్ట్ర దేశమున నుండుటచే నాతఁడు సూచించిన దేశభాష మహారాష్ట్ర భాష యంద మన్నఁ దరువాతఁ గొన్ని శతాబ్దుల వఱకును ఆభాష యుత్పన్నము కాలేదని తెలియుచున్నది. ఐనచో గుణాఢ్యుఁడు పిడువ నూహించిన దేశభాష యేది? శాతవాహన సామ్రాజ్యములో నాంధ్ర-తెలుఁగు జనుల ప్రాభవము తావన్మాత్రము కాదు. వారే యా సామ్రాజ్యమునకు మూలస్తంభములై యుండిరి. పైఠాన్ ప్రాంతమునఁ దెలుఁగు నెలకొన్నను నెలకొనక పోయినను విపణి వ్యవహారము నందైన విరివిగా వ్యాపించియుండును. అప్పటి కందుఁ గావ్యరచనానుకూలమైన పదసంపదయు విస్తృతియు లేకుండినను అది ప్రచురమైన దేశ

1. 'The term Apabhramsa was used at any rate later for various local speeches or Desa bhasha In this sense there were various forms of Sourasenı Apabhramsa actually spoken in the districts round Muttra where Sourasenı Prakrit had become a literary language. Similarly in the Magadhı and the Maharashtri areas there should have been Magadhı and Maharashtrı Apabhramsas."

Intro to Prakrit Woolner Page 82.

భాషగా నుండె ననుటకు మాత్రము సందేహింపఁ బనిలేదు. గుణాఢ్యుఁడు యద్దేశీయుఁడో మనకుఁ దెలియదు. అతఁ డాంధ్రుఁడే యైనచోఁ దెలుఁగు దేశ భాష యతనికి సుపరిచితమే యై యుండును. ఆంధ్రుఁడు కాకపోయినను అతనికా కాలమున దానితోఁ బరిచయముండె ననుటలో నసంభావ్యత కానిపింపదు. అందుచే నాతఁడు తన ప్రతినలో విడువ నూహించిన దేశభాష తెలుఁగే యై యుండునని తలంప వచ్చును.

సంస్కృత ప్రాకృతములలోఁ దొలి దేది తరువాతి దేది యను విషయ మున నభిప్రాయ భేదము లున్నవి. ప్రాకృతమే పాణిన్యాదులచే సంస్కరింపఁ బడి సంస్కృత మయ్యెనని కొందఱును, సంస్కృతము జన వ్యవహారమునఁ గొంత వికారమును బొంది ప్రాకృత మయ్యెనని కొందఱును దలంచుచున్నారు. ఈ రెం డభిప్రాయములలో రెండవ దానికే యధికమైన ప్రాచుర్యము కలదు. దీనినిబట్టి సంస్కృతము ప్రకృతి; ప్రాకృతము వికృతి. ప్రాకృత పదము లన్నియుఁ గొంచె మించుమించుగా సంస్కృతభాషాజన్యము లైనట్టివే. ప్రాకృత భాషలో వ్రాయఁబడు వాక్యములను దచ్ఛాయయైన సంస్కృతమును బరికించి నచో నీవిషయము తేట తెల్లమగును. ప్రాకృత ప్రకాశాది వ్యాకరణ గ్రంథము లలో సంస్కృత పదములనుండి ప్రాకృత పదము లేర్పడు నప్పు డెట్టి వికృతు లను బొందినవో తెల్పఁబడి యున్నది. ఈ మార్పులకు లోఁబడక పూర్తిగా భిన్నములైన వర్ణముల కలయికతోఁ గూడి సంస్కృతముతో నేవిధమైన రూప సాదృశ్యము లేని పదములు ప్రాకృతములోఁ గానిపించినచో వానిని దేశి నామ ములుగనో అన్య దేశ్యములుగనో భావింపవలసి యుండును. గాథాసప్తశతి యందలి ప్రాకృత పదముల నన్నిటిని బరికింపఁగా సంస్కృత పదములలో యత్కించిదుపసాదృశ్యమును లేని భిన్న పదములు సుమారొక వంద కాని పించినవి. వానిలోఁ దెలుఁగు పదము లేవైన నున్న వేమో పరిశీలింప వలయును.

ప్రాకృత వ్యాకర్తలలోఁ బ్రసిద్ధుఁడైన వాఁడును వరరుచికిఁ దరువాతి వాఁడు నైన హేమచంద్రుఁడు దేశీనామమాల యనుపేరఁ బ్రాకృత భాషలలోఁ గానవచ్చు దేశి పదముల కొక నిఘంటువు కూర్చియుండెను. లక్షణమునఁ బ్రకృతి ప్రత్యయ విభాగముచే నిష్పన్నములు కానివియు, నట్లు నిష్పన్నములు

కాఁదగియు సంస్కృతాభిధాన కోశములందుఁ బ్రసిద్ధములు కానివియు, ననాది కాలము నుండి ప్రాకృత భాషలలో వాడఁబడుచున్నవియు నగు పదముల నాతఁ డందు దేశీశబ్దములుగాఁ బరిగణించి యుండెను.[1] ప్రాకృత వ్యాకరణ కర్తలు శబ్దములను దత్సమ తద్భవ దేశ్యములని మూఁడు తెగలుగా విభజించిరి. పైని పేర్కొనఁబడిన దేశీశబ్దము లిందలి మూఁడవతెగకుఁ జెందును. ఇవి వివిధ దేశవ్యవహార ప్రసిద్ధములైనవి కావచ్చును.[2] గాథాసప్తశతిలోని యిట్టిదేశ్యములలో నాంధ్ర దేశ్యములు కూడఁ గొన్నియుండుట కవకాశము లేకపోలేదు,

తెలుఁగు ద్రావిడ జన్యమైనదని పలువురు భాషాతత్త్వజ్ఞులు నిర్ణయించి యున్నారు. ద్రావిడజన్యములైన భాష లింకను గొన్నిగలవు. ఏకజన్యత్వముగల భాషలలో బహుశబ్దములందు సాదృశ్యమో సాన్నిహిత్యమో యుండుట సహజము. అందుచేఁ దెలుఁగుశబ్దమువంటి శబ్దమేదైనఁ గానవచ్చినచో నది తెలుఁగు శబ్దమా లేక తత్సోదర భాషాశబ్దమా లేక వానికన్నిటికిని మూలమైన మూల ద్రావిడ శబ్దమా యను విషయమును నిర్ణయింపవలెను. తమిళాదిభాషలు రెండు మూఁడింటిలో సమానరూపము దాల్చియుండు శబ్దము లేవైన సప్తశతిలో నుండుచో నవి యందు మూలద్రావిడము నుండి యైనను బ్రవేశింప వచ్చును. తజ్జన్య భాషలనుండి యైనను బ్రవేశింప వచ్చును. సంస్కృతముతో నెట్టి సంబంధమును లేనిదియు నితర ద్రావిడ భాషాశబ్ద సాదృశ్యము లేక యొక్క తెలుఁగులోమాత్ర మున్నదియు నగు శబ్దమేదైన సప్తశతిలోఁ గానవచ్చినచో నది తెలుఁగు శబ్దమే యనియుఁ దెలుఁగునుండియే యందుఁ బ్రవేశించిన దనియు నిశ్చయము చేయవచ్చును.

ప్రాకృత భాషయందలి కొన్నిశబ్దములు తెలుఁగు పదములతో సమానార్థకములు కాకపోయినను సమానరూపములై యుండవచ్చును. అట్టిరూప

---

1. లక్షణే = శబ్ద శాస్త్రే, సిద్ధ హేమచంద్రనామ్ని యే, న సిద్ధాః = ప్రకృతి ప్రత్యయ విభాగేన న నిష్పన్నాః తేఽత్ర నిబద్ధాః యే చ సత్యా మపి, ప్రకృతి ప్రత్యయ విభాగేన సిద్ధా, సంస్కృతాభి ధానకోశేషు న ప్రసిద్ధాః తే ఽ ప్యత్ర నిబద్ధాః తస్మా దనాది ప్రవృత్త ప్రాకృత భాషా విశేష ఏ వాయం దేశీ శబ్దే నోచ్యత ఇతి నాతి వ్యాప్తిః.

1. దేశ విశేషాః = మహారాష్ట్ర విదర్భాభీరాదయః, తేషు ప్రసిద్ధాః.
(దేశీ నామ మాల)

సాదృశ్యముచే మాత్రము వానిని దెలుఁగు పదములుగా భావించుట యుక్తము కాదు. అర్థరూప సాదృశ్యములు రెండును గోచరించి నప్పుడే యా మాటలకుఁ బరస్పర సంబంధ మంగీకరింప వచ్చును. ఎట్టి సంబంధమును లేని భాషలలో సైత మొకప్పుడు కాకతాళీయముగా రూపసాదృశ్య మమరిన రూపము లుండుటయే యిందుకుఁ గారణము. ఉదాహరణమున కాంధ్ర భాషలోఁ గల మేలు, రేకు అను శబ్దములను దీసికొందము. ఆంగ్ల భాషలోఁ గూడ నిట్టి యుచ్చారణము గల Male, Rake, అను శబ్దము లున్నవి. కాని యీ రెంటికిని నర్థమున నెట్టి సంబంధ మును లేదు. అందుచే వీనిలో నొక దానిని బట్టి యింకొకటి యేర్పడినదని కాని యొక భాషలోని పద మింకొక భాషలోఁ బ్రవేశించినదని కాని చెప్పుట కవ కాశము లేదు. ఒకప్పుడు ప్రాపు, Prop అను శబ్దము లందువలె నర్థరూప సాదృ శ్యము కనఁబడినను ఆ భాషల కెట్టి సంబంధమును లేనప్పు డది యదృచ్ఛా పతిత మనియే భావింప వలెను. ఒక భాషలోని పదము లింకొక భాషలోఁ బ్రవేశించు నప్పు డర్థ మందుఁ గూడ నింత భేదము చూపట్ట వచ్చును. కాని యట్టిది చాల నరుదు. సప్తశతి లోని కొన్ని ప్రాకృత శబ్దము లర్థమున భిన్నములయ్యుఁ రూప మునఁ దెలుఁగు శబ్దముల వోలెఁ గానవచ్చుటచేఁ గొందఱు వానిని దెలుఁగు శబ్ద ములుగా భావించి యుదాహరించి యుండిరి. పసువఇణో రోసారుణ పడి మాసం కత్తగోరి ముహ అన్దమ్" ౧ - 1. ఇందు ముహ అన్దమను మాటకు ముఖ చంద్ర మనునద ర్థాయి. అందమను మాట తెలుఁగులో నున్నది కాని దాని కందుఁ జంద్రుఁ డను నర్థము లేదు అందుచే నిచ్చటి అన్దమ్ అను పదమునకును దెలుఁగు నందలి యందమునకును సంబంధమున్న దనుట పొసఁగదు. చంద్ర శబ్దమునకుఁ బ్రాకృతమున చన్దో అను రూపము కనఁబడుచుండఁగా నిచ్చట 'అన్ద'మను దానిని చంద్రార్థకముగా గ్రహించుట యెట్లను ప్రశ్న రావచ్చును. కాని ముఖచంద్రమను సంస్కృత సమాసమునుండి ప్రాకృత వ్యాకరణ సూత్రముల ననుసరించి ముహ అన్ద శబ్దమును నిష్పన్నము కావింప వచ్చును.[1] ఇది యిట్లుండ శబ్ద రత్నాకర మున అంద మను శబ్దము వైకృతముగాఁ బరిగణింపఁ బడినది. అంత శబ్దము దానికిఁ బ్రకృతియై యుండవచ్చును. సప్తశతిలో అంద శబ్దము సౌందర్యార్థము ననే వాడఁ బడినను దానిని సంస్కృతములోని అంతశబ్దమునకుఁ బ్రాకృతరూపము

1. కగచజతదప యవాం ప్రాయోలోపః ప్రా కృ ప్రకా అయుక్త వర్ణవిధి ౨
ద్రేరోవా ప్రా ప్ర సంయుక్త వర్ణ విధి ౪.

గానే భావింపవలయును గాని తెలుగు నందలి అంది మే అందుఁ జొచ్చినదని భావించుటకు వీలులేదు. "అసమత్త మణ్డణావిఅ వచ్చ ఘరం సేసకో ఉహల్లస్స" ౧ - 21. ఇందలి వచ్చ అను పదమునకు వ్రజ యనునది ఛాయ. వెళ్ళుము - అని యర్థము. తెలుఁగున వచ్చు ధాతు వున్నది కాని దాని యర్థము వచ్చుట కాని వెళ్ళుట కాదు. అది ప్రాకృతమునఁ జొచ్చినచో దానికి లోణ్మధ్యమ పురుషైక వచనమున వచ్చ అను రూపము రావచ్చును. కాని యర్థము భిన్నముగా నుండుటచే నా రెండు శబ్దములకును సంబంధ మున్న దనుటకు వీలు లేదు. అది గాక "వ్రజ నృత్యోః " (ప్రా. ప్ర. ధాత్వా దేశము 47) అను సూత్రముచే వ్రజ శబ్దము నుండి వచ్చ శబ్దమును సాధింప వచ్చును. ఈ విధముగ నితర శబ్దముల విషయమునఁ గూడ రూప సాదృశ్య ముండియు నర్థ సామ్యము లేనిచో[1] నవి తెలుఁగు శబ్దము లనుట యుచితము కానేరదు. తెలుఁగు శబ్దములతో రూప సామ్యమును అర్థ సామ్యమును గల్గి సప్తశతిలోఁ గానఁబడు శబ్దముల నింకఁ బరికింతము.

అత్తా = ఇది గాథాసప్తశతిలోఁ బలుసా ర్లుపయోగింపఁబడినది. దీనికి శ్వశ్రూః = అనిఛాయ. ౧—8; ౫—69, 97; ౬—42; 57; 2—51; 63; ~4. ఈ శబ్దము సంస్కృతమునఁగూడ నున్నది. 'A mother, an elder sister, mother-in-law (rarely mother's sister" అవి దానికి Apte ఇచ్చిన యర్థములు. శబ్దరత్నాకరకారుఁడు దీనిని గొన్ని యర్థములందు సంస్కృతమును గొన్ని యర్థములందు దేశ్యమునైన యుభయశబ్దముగాఁ బరిగణించెను. దేశ్యమైనప్పుడు దానికి మగనితల్లి, భార్యతల్లి యను నర్థములను, సంస్కృతమైనప్పుడు అక్క, తల్లియను నర్థములను నొసంగి (సంస్కృతమున నీయర్థములు కొన్ని పుస్తకములయందు వ్రాయఁబడియున్న) వని సూచించెను. ఈశబ్దము తమిళమున అత్తై యనురూపముతోను, కన్నడ తుళుభాషలందు అత్తెఅను రూపముతోడను,

---

1. తరప = తీరదే (శక్యతే) చుక్క = చిక్కిన (ఉష్క = చ్యుత) వోలిఅ = వెళ్ళిని; సిప్పిర = చీపురు (పలాల) తుప్పు కప = నీకై (తవకృతే) ఉఅ = ఓయి, పుట్టి = ముడ్డి (పృష్ఠం), వణ్ణఘిఅ = వెన్న (వర్ణఘృత) మఇలేణ = మైల (మలినేన), దేఉల = దేవళము (దేవకుల), ణం = ఈనన్ (ఏనం), చటులం = చట్టి (చటుకం); చిరడింపి = చేవ్రాలైనా (సిద్ధిరస్తు).

గానఁబడుచున్నది.[1] హేమచంద్రుఁడు దీనిని దేశినామముగఁ బరిగణించి మాతా, పితృష్వసా, శ్వశురభార్యా, సఖీ అను నాలుగర్థము లొసంగెను.[2] తత్సంపాదకులు glossary లో నిది తత్సమము కాని ద్రావిడ జన్యము కాని కావచ్చు నని సూచించిరి. (పుట 4) పై విషయములను బట్టి యీ శబ్దము ద్రావిడభాషల నుండియే సంస్కృత ప్రాకృతములు రెండింటను బ్రవేశించినట్లు తెలియు చున్నది. ఛాయాకారుఁ దత్తా శబ్దమునుగాక శ్వశ్రూశబ్దమును వాడియుండుటచే నది సంస్కృతమున నంతబహుళ ప్రయోగముగల శబ్దముకాదని తెలియుచున్నది. ద్రావిడభాషలందుఁగల రూపములన్నింటిలోఁ దెలుఁగునందలి అత్తయను రూపము తోడనే ప్రాకృత రూపమున కెక్కువ సాన్నిహిత్యము కనఁబడుచుండుటచే నది తెలుఁగునుండియే ప్రాకృతమునఁ బ్రవేశించెనని యూహింపనగుచున్నది.

పాడి (౧—౬౫ గా. స) "ణవ సూఅ పీఅ పే ఊస మత్త పాడి వ్వ కింసు వసి." "నవసూత పీత పీయూష మత్త మహిషీ వత్సేవ కిం స్వపిషి" అని దీనికి ఛాయ. బింబ ప్రతి బింబముల కిచ్చట నెట్టి సామ్యమును లేదు. ఈ శబ్దము తెలుఁగున సార్థ బిందుకము. దీనికి శబ్ద రత్నాకర కారుఁడిచ్చిన యర్థము క్షీరము. వ్యవహారమున దీని కించుక విస్తృత తరమైన యర్థ మున్నది. పాఁడి యనఁగా నొక్క క్షీరమే కాక తత్సంబంధులగు పెరుగు, చల్ల, వెన్న, పశువులు మున్నగునవియు సూచితములగును. తొలి చూలి యావు లేక గేదె యను నర్థమున పడ్డ యను మాటకూడఁ దెలుఁగున నున్నది. ఈ రెండు శబ్దములును దేశ్యములే. హేమ చంద్రుని దేశినామమాలలో పాడి శబ్దము లేదు కాని పడ్డీ శబ్దమున్నది. (౬—1) దానికి ప్రథమ ప్రసూతాయని యర్థము. పడ్డ శబ్దము సరిగా నీ యర్థముననే తెలుఁగునఁ గనఁబడు చున్నది. సంపాదకులు glossary లో పడ్డీ, పడ్డనుండి వచ్చియుండునని సూచించిరి. పడ్డ పాడి శబ్దములకు రెండింటికిని అర్థరూపముల రెంటను సన్నిహిత సంబంధమున్నది. ఈ రెండు శబ్దములును నితర ద్రావిడ భాషలలో లేవు. అందుచే పాడిశబ్దము తెలుఁగు నుండియే ప్రాకృతమునఁ బ్రవేశించెనని చెప్పవచ్చును. కాని తెలుఁగు నందలి యా శబ్దమునకును బ్రాకృతము నందలి శబ్దమునకును నర్థమునఁ గొంత

---

1. Dravidian cognates, page 13.
2 దేశినామమాల ౧—౬1,

భేదము కానవచ్చుటచే నీవిషయ మించుక సందేహాస్పద మగుచున్నది. ప్రాకృత మున దానికి గేదె దూడ (మహిషీ వత్సా) యని యర్థము.

పొట్ట :- (౧—83: ౨—71: 3—85 గా. స.) ఉదర శబ్దమున కుదర శబ్దము ఛాయగా నీయఁబడినది. సరిగాఁ దెలుఁగునఁ గూడ పొట్ట యనఁగా నుదరమే. తమిళమున పొచ్చై యను శబ్దమును, కన్నడ తుళు భాషలందు బొట్టె యను శబ్దమును, కురుఖు భాషయందు పట్ట శబ్దమును నుదరార్థమున నున్నవి.[1] పొచ్చై బొజ్జ శబ్దములు రూపమున సన్నిహిత తరములుగాఁ గనఁ బడుచున్నవి. తెలుఁగు కన్నడములందును బొజ్జ శబ్ద ముదరార్థమున నున్నది. పొట్ట శబ్దము సంస్కృతమున లేక పోవుట చేతను, తెలుఁగు తుళు కన్నడము లం దుండుట చేతను అది ద్రావిడమేయని చెప్ప వచ్చును. ఆ శబ్దము తమిళమున పొచ్చై యనియే కాని ద్విత్వటకారాంతముగాఁ గాని రాకుండుటచే నది యందుండి ప్రాకృతమునఁ జొచ్చి యుండలేదని తోఁచు చున్నది. సప్త శతి వెలసిన ప్రదేశమునకును తెలుఁగు కన్నడ దేశములకును గల సామీప్య మును బట్టి యది యా రెండింటిలో నొక దానినుండి, అందును దెలుఁగునుండి, ప్రాకృతమునఁ బ్రవేశించి యుండె ననుట యసంగతముగా నుండదు.

పిలుఅ (౨—2 గా. వ.) "తడ.సంఠి అణీదేక్కన్త పిలుఅ రక్ఖణేక్క దిణ్ణమణా" "తటసంస్థిత నీడైకాన్త శాఒక రక్షణైక దత్తమనాః" ఇచ్చట పిలుఅ శబ్దమునకు దానితో నెట్టి సంబంధమును లేని శావక శబ్దము ఛాయగా నొసంగఁబడినది. దానికిఁ బక్షిపిల్లయని యర్థము. తెలుఁగున పిల్లశబ్ద మా యర్థమున నున్నది. సంస్కృతమున పిలుకా, పీలు, పల్లశబ్దము లున్నవి. కావి వాని కీ యర్థములేదు. శబ్దరత్నాకరమున పిల్ల శబ్దము వైకృతముగాఁ బరిగణింపఁబడినది. ఏ శబ్దమున కిది వికృతియో తెలియదు. తమిళ మలయా ళములందు పిళ్ళై, పిళ్ళశబ్దములును కన్నడ తుళు భాషలందు పిళ్లె పిల్లశబ్దము లును శాబక మను నర్థమున నున్నవి. (Dr. Cognates. పుట 193) హేమ చంద్రుఁడు దేశి నామ మాలలో పిల్లశబ్దమును లఘుపక్షిరూప మను నర్థమునఁ జేర్కొని యుండెను. (౪—46) తత్సంపాదకు లది తెలుఁగు పిల్ల శబ్దము నుండి వచ్చినదని యూహించిరి. అందుచే పిలుఅ శబ్దము ద్రావిడభాషా

---

1. Dravidian cognates పుట 159.

శబ్దమైనదో తెలుగు పిల్లమంకియే ప్రాకృతమున కించుక మార్పుతోఁ బ్రవే శించి యుండు ననియుఁ జెప్పవగును.

కరణీ :- "అవ్లో పిడ్డూరిఅ సఙ్ఖవత్త కరణిం వహఇ చన్దో (3—100 గా. స.) "ఆ ప్రత్తిపిడ్డూరిత శంఖపాత్ర సాదృశ్యం వహతి చంద్రః". కరణికి గావు సాదృశ్యము. తెలుఁగున నీశబ్ద మీ యర్థమును సూచించుచున్నది. శబ్ద రత్నాకరమున నిది దేశ్యముగాఁ బరిగణింపఁబడినది. ఇట్టి శబ్ద మీ యర్థమున సంస్కృతములో లేదు. ఇతర ద్రావిడభాషలలోఁగూడ నీ శబ్దము కానరాలేదు. కావున నిది తెలుఁగునుండియే ప్రాకృతమున కేగినదని భావింపవచ్చును.

ఫలహీ (౨—౬౫; ౪—59 గా. స.) "ఫలహీ వాహణ పుణ్ణాహ మంగళం" "కార్పాసీక్షేత్ర కర్షణ పుణ్యాహ మంగళమ్" ఫలహీ శబ్దమునకు కార్పాసీపదము ఛాయగా నొసంగఁబడినది. ఫలహీ అనఁగా ప త్తి. ఈ శబ్దము దేశీ నామమాలలో దేశీశబ్దముగాఁ జేర్చఁబడినది. (౪—82) తమిళమున పరుత్తి శబ్దమును, తెలుఁగున ప్రత్తి. పత్తిశబ్దములును, తుళుకన్నడములలో పత్తి శబ్దమును నున్నవి. వీనికిని ఫలహీశబ్దమునకును రూపమునఁ జాల వ్యత్యాస మున్నది. అందుచే పత్తిశబ్దమే ప్రాకృతమున నా రూపమును బొందెనని చెప్పుటకు సందేహింపవలసి వచ్చుచున్నది.

బోణ్డీ (౫—1 గా. స.) దీనికి ఛాయ సూకరీ. దేశీ నామమాలలో బుందీ (౬—98) యనుమాట పంది యను నర్థమున నున్నది. తమిళమున పన్ఱి, తెలుఁగు కన్నడముల పంది, తుళులో పఞ్జి, మలయాళమున పన్ని యను రూప ములు కనఁబడుచున్నవి. (Dr. Cognates పుట 147) పందిశబ్దమే యించుక మార్పుతో బుందీ బోణ్డీ యను రూపములను బొంది ప్రాకృతమునఁ బ్రవేశించె నని తోఁచుచున్నది.

మోడి :- "పా అ పడణాణం ముద్ధే రహస బలామోడి చుమ్బి అవ్వాణం" (౫—౬౫ గా. స.) "పాదపతనానాం ముగ్ధే రభస బలాత్కారచుమ్బితవ్యానామ్" మోడి శబ్దమును దేశ్యమని సూచించి శబ్దరత్నాకర కారుఁడు దానికి గణికాదులు మొగ్గవాలి కాలికి సమీపమునందుండు వస్తువు నెత్తుట; బింకము అను అర్థము లొసంగి యున్నాఁడు. తమిళమున మగిడి (= A trial of magical powers between two enchanters) అను శబ్దమును, మలయాళమున మోడి యను శబ్ద మును, తెలుఁగున మోళి (మోడి) శబ్దములును, కన్నడమున మోడి శబ్దమును

గానవచ్చుచున్నవి. ఈ శబ్దమునకుఁ బ్రాకృతమునఁ గల బలాత్కార మను నర్థమునకును దమిళ కన్నడము లందున్న అర్థములకును సంబంధ మేమియు లేదు. తెలుఁగున బింకమను నర్థము బలాత్కార మను నర్థమున కించుక సమీప మున నున్నది. అందుచే నిది తెలుఁగునుండియే ప్రాకృతమునఁ బ్రవేశించి యుండెనని చెప్ప వీలగుచున్నది.

కుడ:- కుడదోహిణీ (౭-37 గా.స.)దీనికి కుటదోహినీ అని ఛాయ. కుటో ఘటః అని వ్యాఖ్యానము. దేశినామ మాలలో కుడ్యశబ్దము లఘుభాండ మను నర్థమున నున్నది. (౨-63) Glossary లో కుండయం అనునది సరియైన రూపముగాఁ గానవచ్చుచున్న దనియు నది తెలుఁగునందలి కుండనుండివచ్చి యుండుననియు వ్రాయఁబడియున్నది. తమిళ మలయాళములందు కుటమ్ అను రూపమును తెలుఁగున కుండ యను రూపమును తుళుకన్నడములందు కొడ కడ్య పదములును కుండయను నర్థమున నున్నవి. (Dr. Cognates పుట 80) సంస్కృతమునఁగూడ కుండ శబ్ద మున్నది. దీనికి Apte "A bowl - shaped vessel; a basin; a bowl; a round hole in the ground for receiving and preserving water; A hole in general; A pool, a well; The bowl of a mendicant అను నర్థముల నొసంగియున్నాఁడు. ఈ యర్థములుకూడ దీనికిఁ దెలుఁగునఁ గానవచ్చుటచే శ. ర. కారుఁడు దీనిని వైకృతమని సూచించెను. కాని నిజమునకిది ద్రావిడభాషల నుండియే సంస్కృత ప్రాకృతములలోనికిఁ జొచ్చినట్లు కానవచ్చుచున్నది. కుడ శబ్దము తెలుఁగునందలి కుండ, కడవ శబ్దములకుఁ గూడ దగ్గఱగానే యున్నను కన్నడమునందలి కొడ శబ్దమున కంతకంటెఁగూడ సన్నిహిత తరముగా గోచరించుచున్నది.

కులుశ్చ్ఊణ (౫-26 గా. స.). దీనికి ఛాయా రూపము దగ్ధ్వా. ఇది కులుశ్చ్ ధాతువునుండి యేర్పడిన క్త్వార్థక రూపము.[1] దగ్ధ్వాకును దీనికివి గించిత్తైన రూపసాదృశ్యము లేదు. ఇది తెలుఁగునందలి కాల్చుధాతువునకు సన్నిహితముగా నున్నది. కాలు యొక్క ప్రేరణార్థకరూపము కాలుచు లేక కాల్చు. తెలుఁగునందలి మొదటి పద్యశాసనమైన అద్దంకి శాసనములో 'కొల్లల్చు' ధాతువు ప్రయోగింపఁబడినది.[2] దీనికి గొచ్చు (త్వవ్విపాడుచేయు)

1. క్త్వ ఊణః (ప్రాకృ. ప్రకా. ౪-13)
2. వేంగి నాణ్ణం గొల్లల్చియ - అద్దంకి శాస.

అనునర్థ మున్నది. పై కులుశ్ఛ్ ధాతువు కాల్చునకుకంటెను దీనికి మఱింత సన్నిహిత తరముగా గోచరించుచున్నది.

బోల:- హేమచంద్రుఁడు దేశినామ మాలలో వోల ధాతువు వెళ్లుట యను నర్థమును సూచించునని చెప్పినాఁడు. (వోలయి = గచ్ఛతి) వబలకు భేదము లేదు కావున నా ధాతువు బోల కూడఁ గావచ్చును. దాని రూపములు గాథా సప్తశతిలో సుమా రిరువది చోట్లఁ గానిపించును.[1] అన్ని చోట్ల దానికి వ్యతిక్రమ్ ధాతు రూపములు ఛాయలో నీయఁ బడినవి. తెలుఁగు నందలి వెళ్లు ధాతువే ప్రాకృతమున వోల, బోల రూపములను దాల్చిన దని చెప్పుట కించుక యవకాశ మున్నది.

ఇవిగాక సుర సుర, మడహ (మట్టము) అవ్వో (అబ్బో) ఓల (ఆర్ద్ర) కణఅదోరో (కనకదోరో దారము - తోరము) అను శబ్దములు కూడ ద్రావిడ భాషల నుండియే ప్రాకృతమున కేగి వట్లనుమానింపఁ దగి యున్నవి. కొందఱు[2] కాఇ, పడఏహి, తీరై, పుట్టి, అమాన్తమ్ అను శబ్దములు కూడఁ దెలుఁగునుండి ప్రాకృతమున కేగినవని సూచించినారు. కాని, కాక, పతిత, తీరయతి, పృష్ఠ మున్నగు సంస్కృత రూపముల నుండియే యవి వచ్చుట కవకాశ ముండుటచే వానిని దెలుఁగు శబ్దము లనుకొనుటకు వీలులేదు. అమాంత మను దేశ్య శబ్దము తెలుఁగునఁ గలదు. దాని కకస్మాత్తుగా నని యర్థము. గాథాసప్తశతిలో నా శబ్దమున్నది కాని యా యర్థమున వాడఁబడి యుండలేదు.

తెలుఁగు శబ్దము లని యనుకొనుట కవకాశమున్న పైశబ్దములలోఁ గొన్ని ప్రస్తుత మహారాష్ట్ర భాష యందుఁ గూడఁ గనఁబడుచున్నవి. కావున నవి మహారాష్ట్రము నుండియే గాథా సప్తశతిలోని కెక్కినవని యెవ్వరైన వాదింప వచ్చును. ఆ గ్రంథ మిప్పుడు మహారాష్ట్ర దేశమైన ప్రాంతమున సంకలిత మగుటయు నా యూహకుఁ గొంత బల మొసంగును. కాని ప్రస్తుత మహారాష్ట్రభాష రూపొందిన కాలమునుబట్టి పరిశీలించినచో నా వాదము వీఁగిపోవును. ఈ మహారాష్ట్రి భాష మహారాష్ట్రి ప్రాకృతమునుండి యేర్పడిన యపభ్రంశము మాతృకగా

1. 3-10; 20; 23; 32. ౪-67 ౪-36 ౬-5.
2. శ్రీ కురుగంటి సీతారామయ్యగారు Journal of Dekkan History and Culture P. 1 - 8.

క్రీ. శ. 8, 9 శతాబ్దులలో స్థిరరూపము నొంద నారంభించినది. అంతకుఁ బూర్వము దానికిఁ బ్రత్యేకరూపముకాని నామముకాని లేనే లేవు. అందుచే నిందుండి యవి ప్రాకృతమునఁ జొచ్చియుండె ననుట కిసుమంతయు నాధారము లేదు. అదిగాక మహారాష్ట్రి వ్యుత్పత్తి కోశములో నా శబ్దములలోఁ గొన్నిటికి ద్రావిడ జన్యత్వము సూచింపఁబడి యున్నది.

పోట్ = The Stomach. హాశబ్ద ద్రావిడమూల ఆహే. పిలూం; పిల్లూం; "A young one of the smaller beasts, birds or reptiles. ప్రాకృత భాషేంతహా ద్రావిడీ భాషేంతూన ఆలా అసావా మహణూనచ దేశీ మహణూనతో నిర్దేశిలా ఆహే. త. పిళ్లే తె. పిల్ల. కన్న. పిల్లె." ఓల : Humidity, moisture, dampness, to be wet. ఇది జలచరార్థమైన ఉద్ర (సంస్కృత) శబ్దమునుండి వచ్చినదని మహారాష్ట్రికోశమున సూచింపఁబడినది. ఈ శబ్దము తెలుఁగున నొక విధముగా జలార్థముతో సంబంధించి యున్నట్లు కానవచ్చును. ఓలలాడు అనునది శబ్దపల్లవ ధాతువు. ఆనందాబ్ధి నోలలాడు - వంటి ప్రయోగములు తెలుఁగు గ్రంథము లన్నింట గోచరించును. ఓల యనునది నీరాడునప్పుడు వాడు క్రీడాపదము. ('ఓలోలంచు' వసుచరిత్రము.) పాడి శబ్దముకూడ మహారాష్ట్రిమున నున్నది. పాడీ = A female calf of a cow, not of a buffalo. పాడా = a male calf, calf of a cow, not of a buffalo. ప్రాకృతమున నీ శబ్దము దీనికిఁ గేవల విరుద్ధముగా మహిషీవత్స మను నర్థమున వాడఁబడినది.

మహారాష్ట్రి భాషా తత్త్వజ్ఞులు కూడ పోట్, పిల్లూం మున్నగు శబ్దములు ద్రావిడ జన్యములని చెప్పుటచే నవి ద్రావిడము నుండి తెలుఁగునకును, నందుండి ప్రాకృతమునకును జొచ్చినవనియు, మరల నందుండి యపభ్రంశమునందును, ఆ భాషనుండి మహారాష్ట్రిము నందును, బ్రవేశించిన వనియు నూహించుట కవకాశము కలుగుచున్నది.

క్రీ. శ. ప్రథమ శతాబ్దిలో సంకలిత మైన గాథాసప్తశతిలో నీరీతిగా దెలుఁగు శబ్దములేయని చెప్పఁ దగిన శబ్దములు కొన్ని కానవచ్చుటచే నాకాలమునఁ దెలుఁగు భాష సుస్థిర రూపము నొంది జన ప్రచారమున నుండెనని తలంపవచ్చును. ఒక భాష బహుళ ప్రచారమున నుండిననే కాని యందలి శబ్దములు కొన్ని యన్య భాషా ప్రవిష్టములగుట కవకాశము లేక పోవుట యీ విషయము

నకు బలము చేకూర్చుచున్నది. అప్పటినుండియుఁ దెలుఁగు జన వ్యవహార మున నుండెనని చెప్పుటకు శాసనస్థములైన యాధారములు కూడఁ గొన్ని కలవు. అందుఁ బ్రథమోదాహార్య మైనది యమరావతీ స్తూపము నందలి యొక రాతి పలక మీఁదఁ గానవచ్చు 'నాగబు' అనుమాట. అది యందు వాక్యగత మై కాక ప్రత్యేకముగా నున్నది. ఇది యసలు తెలుఁగుమాట యగునా కాదా యను విషయమున సందేహ ముదయింప వచ్చును. నాగ శబ్దము సంస్కృత శబ్దమే యైనను దాని చివరఁ గల బు అను నక్షరమది తెలుఁగు మాటయేయని స్పష్ట ముగాఁ దెల్పుచున్నది. విష్ణుకుండిన వంశమునకుఁ జెందిన మూఁడవ మాధవ వర్మ పొలమూరు శాసనము నందలి 'పొలబూరు' అను రూపమును, దరువాతఁ దూర్పు చాళుక్యుల శాసనములలోఁ గనవచ్చు వ్రక్రబు, సిద్ధాయబు, మఠబు, పట్టనబు, బృన్దబు, క్రమబు మున్నగు బు వర్ణాంత రూపములును ఈవిషయ మునకు దృష్టాంతము లగుచున్నవి. ఈ బు వర్ణమే క్రమముగా మ్బు, ంబు మ్ము, ము అను రూపాంతరములను బొంది తెలుఁగున నమహద్వాచక ప్రథమైక వచన ప్రత్యయముగాఁ బరిగణింపఁబడినది. దీనికిఁ బ్రాచీన రూపము పువర్ణమనియు, నది యొక్క తెలుఁగునకేకాక యితర ద్రావిడ భాష లన్నిటికిని సమానమనియు "ప్పు, మ్పు బు, మ్బు పు, వు" అను రూప ములతో నది యందుఁ గనఁబడుచుండు ననియు, మాపు, మేపు, కానుపు మున్నగు వానియందువలెఁ దెలుఁగు మూలధాతువులపైఁ జేర్పఁబడు నా ప్రాచీన పువర్ణమే సంస్కృత పదములతుదిని గూడఁ జేర్పఁబడుచు వచ్చిన దనియు, నందలి పకారము బకారమగుటయు, ముందాను నాసిక్యమేర్ప డుటయు వింత కాదనియు శ్రీ గంటి జోగిసోమయాజిగా రాంధ్రభాషావికాస మునఁ (పుట 394) జెప్పియున్నారు. అరవమున ఇరుమ్బు, ఎలుమ్బు, పామ్బు, వేమ్బు, మున్నగు మ్బు వర్ణాంత పదములు పెక్కు కానవచ్చు చున్నవి. అవి తెలుఁగున ఇనుము, ఎమ్ము, పాము, వేము మున్నగు రూపములు దాల్చినవి. కన్నడమున పావు, హావు మున్నగు వు వర్ణాంత రూపము లున్నవి. పై శబ్దము లందలి ము వర్ణము పదైకదేశమేకాని ప్రథ మైక వచన ప్రత్యయముకాదనియు, నైనను బై రూపముల సామ్యము చేతనే అకారాంత సంస్కృత నపుంసకలింగ పదములు తెలుఁగునఁ దత్సమీకరింపఁ బడినపుడు బు, మ్బు వర్ణాంతములైన పదములుగా నేర్పడె ననియు

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు తెల్పియున్నారు.[1] పాము, వేము అను ప్రాచీన రూపములు తెలుగున భ్రష్టములై పోయినవి. "సంస్కృతపదము లెప్పటి కప్పుడు ప్రకృతులనుండి యేర్పడవలసినవి. ఉన్నత కావ్యాది ప్రయోజనము కలవి. ప్రకృతి ప్రత్యయ విభాగము చే వ్యుత్పన్నములు. కాఁబట్టి ప్రత్యయములైన ఋ, ం ఋ, మ్ము వర్ణము లన్నియుఁ గవులు రూపములను జేసికొనుటలో గణయతిప్రాసాను కూల్యముల కొఱకు వాడుచునే యుండిరి"[1] నన్నయ తరువాత ఋవర్ణాంత రూపములు వాడుకనుండి తొలఁగినవి. కాని ంఋ, మ్ము, ము వర్ణాంతములైన రూపములు మూఁడును విరివిగాఁ గానవచ్చుచునే యున్నవి. ప్రాచీన గ్రంథములలో విభక్తి ము వర్ణముతో మాత్రమే పు, ఫు, బు, భు లకు యతి వేయఁబడు చుండెను. అప్పకవి దానిని ము విభక్తిక యతియని పేర్కొనెను. పు, ఋ, వర్ణములే తరువాత మువర్ణముగా మాఱెననియు నవి యభిన్నము లనియుఁ దలంచుట చేతనే పూర్వ కవులు పు ఫు బు భు ల కొక్క విభక్తి ముకారముతో మాత్రమే యతివేసి యుండిరి తరువాతి కవులు వాని కొక్క విభక్తి ము వర్ణముతోనే కాక మువర్ణసామాన్యముతోఁ గూడ యతివేయుటచే నప్పకవి దానిని బృథక్కరించి ముకార యతి యని పేర్కొనెను. అందుచే 'నాగఋ' అందలి ఋవర్ణము తెలుఁగు ఋవర్ణము యొక్క పూర్వ రూప మనియు నాపదము తెలుఁగు పదమే యనియు నిశ్చయింప వచ్చును.

తొల్లి నాగజాతి యనుపేర నొక దేశీయమైన జాతి యుండెననియు, మొదట శతపథ బ్రాహ్మణము నందును దరువాత భారతము నందును అది పేర్కొనఁ బడియుండె ననియు, ననార్యులైన యా జాతివారు నగ్నులై పల్లపు భూముల యందును లోయల యందును నివసించి యుండుటచే వారికాపేరు వచ్చి యుండుననని (నగ్న శబ్దము నుండి) కొందఱు ఉత్పత్తి చెప్పుచున్నారనియు, నది నిజమగుచో నాగశబ్ద మసలు దేశీయమయ్యుఁ దరువాత సంస్కృతీకరింపఁ బడియుండుననియు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు సూచించి యున్నారు.[2]

---

1. Telugu Language in the 1 st millenium A. D. Journal of Sri Venkateswara Oriental Institute, XII — 1 Page 3.

2. ఆంధ్రభాషావికాసము. పుట 395.

3. Tel. Lang. in the 1st millenium page 4 ff.

ఈ సంస్కృతీకరణ మెప్పుడుజరిగెనో చెప్పఁజాలముకాని యది క్రీస్తుశకమునకుఁ బూర్వమే యనుట నిస్సందేహము. సంస్కృతమున నాగశబ్దము పుంలింగము. ఏ విభక్తిలోఁ గాని దాని కందు నాగబు అను రూప ముండదు. సంస్కృతమునఁ బుంలింగములైనను దెలుఁగున నమహద్వాచకములుగాఁ బరిగణింపఁబడు వృక్షాది శబ్దములకు నపుంసక లింగ శబ్దములకు వలెనే ము వర్ణము చేర్చు పరిపాటి ననుసరించి నాగశబ్దమునకుఁ దత్పూర్వ రూపమైన బువర్ణము చేర్పఁబడి యుండునని తోఁచుచున్నది, ఈ విషయముకూడ నాగబు తెలుఁగు పదమేయని నిశ్చయించుటకుఁ దోడ్పడుచున్నది.

శాతవాహనుల తరువాత నాంధ్ర సామ్రాజ్యము చిన్నచిన్న భాగములుగాఁ జీలి వేఱు వేఱు వంశముల వారి యేల్బడిలోనికి వచ్చినది. అట్టివారిలో ఇక్ష్వాకు లొకరు. శాతవాహనులవలె వీరును దమ శాసనములను బ్రాకృతములోనే వేయించిరి. అవి నందిగామ తాలూకాలోని జగ్గయ్యపేట యందును గుంటూరు మండలము నందలి నాగార్జునకొండ యందును లభించినవి. వారు సుమా రర్ధ శతాబ్దికంటె నెక్కువకాలము పాలించి యుండలేదు. (క్రీ. శ. 225-275) వారి తరువాత బృహత్ఫలాయన వంశ జాతులైన రాజులు కృష్ణానదికి దక్షిణ భాగమును బాలించియుండిరి. వీరు వేయించిన శాసనములలో జయవర్మ యను వాని కొండమూడి (కొండముడి) తామ్రశాసన మొక్కటే లభించుచున్నది. ఇందలి భాషకూడఁ బ్రాకృతమే. వీరి తరువాత వైంగేయకులని వ్యవహరింపఁ బడుచుండిన శాలంకాయనులు క్రీ. శ. 325 నుండి యొకటిన్నఱ శతాబ్దులకుఁ పైఁగాఁ బాలించి యుండిరి. వీరి రాజధాని ఏలూరునకు సమీపము నందున్న పెదవేఁగి. కొండమూడి శాసనమునఁ బేర్కొనఁబడిన కుదూరహారము (కుద్రాహారము) వీరి పాలన లోనిదే. వీరి శాసనములలోఁ గొన్ని సంస్కృతమునను గొన్ని ప్రాకృతమునను వ్రాయఁబడి యున్నవి. కందర నృపతి కులోద్భవులైన యానంద గోత్రరాజు లిప్పటి గుంటూరు మండలమునకుఁ జెందిన ప్రదేశమును క్రీ. శ. 4 వ శతాబ్ది యారంభము నుండి పరిపాలించినట్లు తెలియుచున్నది. వీరి రాజధాని కపోత కందరపురము. ఇది ఇప్పటి నర్సారావుపేట తాలూకాలోని చేజెర్ల గ్రామమునకు సరిపోవుచున్నది. ఇచ్చట కపోతేశ్వర దేవాలయము కలదు. వీరి శాసనములలో నొకటి పూర్తిగా సంస్కృతము నందును రెండు సంస్కృత

ప్రాకృతము లందును వ్రాయఁబడి యున్నవి. వీరి తరువాత విష్ణుకుండినులను వారు శాలంకాయనుల యధికారమును దుద ముట్టించి క్రీ. శ. 5 వ శతాబ్ది యారంభము నుండి 7 వ శతాబ్దిలోఁ గొంత భాగము వఱకును బాలించి యుండిరి. వీరి జన్మస్థానము గుంటూరు మండలము నందలి వినుకొండ. వీరి శాసనములు సంస్కృత భాషలో నున్నవి. వీరి తరువాత నాంధ్ర దేశము దూర్పు చాళుక్యుల పాలన లోనికి వచ్చెను.

పైని పేర్కొనఁబడిన రాజు లందఱును ఆంధ్రులే. వీరు కాక పల్లవులు కూడ నాంధ్ర దేశమునందలి కొంత భాగమును బాలించి యుండిరి. శాత వాహనుల తరువాత దక్షిణాపథమున గొప్ప సామ్రాజ్యమును స్థాపించినవారు వీరే. పలువురు చరిత్రజ్ఞులు పల్లవులు తొలుఁదొల్త నాంధ్రులే యనియుఁ బల్లవుల నాఁడే తరువాత పల్నాడుగా మాఱెననియుఁ దలంచుచున్నారు.[1] వీరి రాజధాని కాంచీపురము. కృష్ణానదికి దక్షిణమున నుండిన తెలుఁగు దేశము క్రీ. శ. 3 వ శతాబ్దినుండి వీరి యధీనమున నుండినట్లు తెలియుచున్నది. మొదటి పల్లవ రాజుల శాసనములు ప్రాకృతము నందును దరువాతి వారివి సంస్కృతము నందును గానంబడు చున్నవి.

ఈ విధముగా క్రీస్తు పూర్వము నుండి క్రీ. శ. 7 వ శతాబ్దిలోఁ గొంత భాగమువఱకును (అనఁగాఁ దూర్పు చాళుక్యు లాంధ్రదేశము నాక్రమించు కొను వఱకును) ఆంధ్ర దేశమును బాలించిన రాజుల శాసనము లేవియు నాంధ్ర భాషలో వ్రాయఁబడి యుండలేదు.[2] అవి కొన్ని ప్రాకృతము నందును గొన్ని సంస్కృతము నందును గొన్ని సంస్కృత ప్రాకృతము లందును గానఁబడు చున్నవి. కాని వీనియందుఁ బేర్కొనఁ బడిన కొన్ని గ్రామ నామములును, కొన్ని ధ్వనులును, అక్షరములును, పదములును, ప్రత్యయములును దెలుఁగు భాష పరిణామ స్వరూపములను గూర్చి కొన్ని విశేషములను వెల్లడించుచు నా భాష

---

1 విన్సెంటు స్మిత్తు : డా॥ కృష్ణస్వామయ్యంగారు; డా॥ నేలటూరి వేంకట రమణయ్యగారు. (ఆం. చ. సం. పుట 147).

2 రేనాటి చోళుల శాసనములు తెలుఁగులో వ్రాయఁబడినవి. E. I. XXVII వ సంపుటమున (పుట 22) ముద్రింపఁబడినవి. వానినిబట్టి యా రాజులు క్రీ. శ. 6 వ శతాబ్ది యారంభమునుండియు రేనాడు పాలించినట్లు తెలియుచున్నది.

క్రీస్తు శకమునకుఁ బూర్వము నుండియు జన వ్యవహారమున నుండె ననుటకు దృష్టాంతములుగా నున్నవి. ఆ విశేషముల విప్పుడు పరిశీలింతము.

గ్రామ నామములు :—

1. శాతవాహనరాజుల కాలము.

| | |
|---|---|
| ఖదవలి (కొదవలి) | చందసతి కొదవలి శాసనము E. I. XVIII పు 316—319 |
| వేపురకే (వేపూరు) | శ్రీ పు లో మావి మ్యాకదోనిశాసనము E. I. XIV పు 153—115 |
| కెవురురే | Burgess, Buddhist stupas of Amravathi and Jaggayya peta No. 19 |
| మందర | Do No. 22 |
| హిరలూరే | Do No. 43 |
| కుదూర | Do No. 50 |

2. ఇక్ష్వాకుల కాలము.

| | |
|---|---|
| ఖదతూరే | |
| మహాకామ్దురూరే | Do పుట 110 |
| హాలమ్పుర | M. E R 196, 37 పుట 335. |

3. పల్లవుల కాలము.

| | |
|---|---|
| విరిపర | యువరాజ శివస్కందవర్మ మైదవోలు శాసనము E. I VI పుట 84–89. |
| దాలూరే | చారుదేవి బ్రిటిషు మ్యూజియం తామ్రశాస. E. I. IV పుట 143. |
| చెన్దలూర | రెండవ కుమార విష్ణుని చందలూరు తామ్రశాస. E. I. VIII పు 233-236. |
| ఓమ్ గోదు (ఒన్‌గోదు) | రెండవ విజయస్కందవర్మ ఒమ్గోదు దాన శాసనము. E. I. XV పు 249. |
| ఉరువపల్లియే. | విష్ణుగోపుని ఉరువపల్లి తామ్రశాసనము. |

| | |
|---|---|
| కణ్డుహార | I. A. Vol. V పుట 51 (క్రీ. శ. 5). |
| క (వ) రుపూర | |
| కోణ్డమురువుదు | |
| నడిప్ప (నడిపి) | నెడుంగ రాయ తామ్రపట్టిక భారతి XVIII క్రీ. శ. 448, పుట 699–718. |
| ఓమ్ గోడు | |
| కొడికిమ్ (కోదండి) | |
| నశాటడు | |
| కడాకుదురు | రెండవ సింహవర్మ ఓమ్గోడు శాసనము. |
| పెణుకపఱ్ఱు | (క్రీ. శ. 5. 6 శతా) (Put into writing |
| కుణ్డూరు (కుణ్టూరు) | in the 7th century) |
| పికిరే | సింహవర్మ పికిరదాన శాసనము E. I. VIII పు 159–163. |
| మాఙ్గడూ (దూ) ర్గ్రామే | సింహవర్మ మంగదూరు దానశాస. I. A. Vol. V. పుట 154. |
| విశవట్టి | సింహవర్మ విశవట్టి దానశాస. E. I. XXIV పుట 296 క్రీ. శ. 446, |
| ఛగుబమ్ము | |
| పగుహూరు | పల్లవ విష్ణుగోపవర్మ చూరదాన శాసనము. |
| కుణ్డూరు | E. I. XXIV పుట 137 (క్రీ. శ. 7). |
| నాగోశామి | |

4. ఆనంద గోత్రికుల కాలము.

కంగూర

మట్టెపాడు తామ్ర శాసనము (దామోదరవర్మ).

| | |
|---|---|
| తాన్తికొట్ట | అత్తివర్మ గోరంట్ల తామ్రశాస. |
| అస్తుక్కూర | I. A. IX పుట 102. |

5. బృహత్ఫలాయనుల కాలము.

| | |
|---|---|
| కూడూర | జయవర్మ కొండముది తామ్రశాస. |
| పాంతూర | |
| కొణ్డముడి | E. I. VI పు. 315—319. |

6. శాలంకాయనుల కాలము.

| | |
|---|---|
| ఏలూర | విజయదేవవర్మ ఏలూరు తామ్రశాస. |
| | E. I. IX P. 56-59. |
| ప్రాలూర, | శాలంకాయన నందివర్మ పెదవేగిశాసనము. |
| | క్రీ. శ. 475. |
| ఉలుతొతె | భారతి 1924 పుట 120. |
| ముణ్డూర | |
| చెఞ్చెరువ గ్రామే | |
| కమ్మురాఞ్చెరువే | |
| విదేనూర పల్లికా | విజయనందివర్మ కొల్లేరుదాన. |
| కురవక గ్రామ | I. A V పుట 175 (క్రీ. శ. 4). |
| కురువాడ | నందివర్మ కన్తేరు దానశాస. J. A. H. S. |
| | Vol. V Page 81 (క్రీ. శ. 4). |
| పిడిహ | కానుకొల్లు ప్రాకృతశాస. భారతి 1950ఏప్రిల్. |
| కొంపెర | స్కందవర్మ కానుకొల్లు తామ్రశాసనము. |
| చిన్తపురి (చిన్నపుర) | విజయస్కందవర్మ కన్తేరు తామ్రశాస. |
| పేనుమారి | E. I. XXV 42-47 (క్రీ. శ. 4). |

7. విష్ణుకుండిన రాజుల కాలము.

| | |
|---|---|
| పులిమ్బూరు (పొలమూరు) | మాధవవర్మ పొలమూరు తామ్రశాస. |
| మయిన్ద వాటకి | |
| పణ్లూరు | భారతి VII పుట 468-69. |
| కుడావాడ | మాధవవర్మ ఈపూరు (I) తామ్రశాస. |
| విలెమ్బలి | E. I. XVII 334-37. |

| | |
|---|---|
| ముర్రోకకి | మాధవవర్మ ఈపూరు II తామ్రశాస. |
| కళిక | E. I. XVII 337-339. |
| పుంజీసమ | ఇంద్రభట్టారకవర్మ రామతీర్థం తామ్రశాస. |
| పెరువాటక | E. I. XVIII 337-39. |
| పట్టికి విషయే | |
| బైందుఘూర వాసక | |
| రావిరేవ | విక్రమేన్ద్రవర్మ చిక్కుళ్ళ తామ్రశాస. |
| రేగొన్టమ్ | E. I. IV పుట 193-198. |
| నేత్రపాటి విషయ | |

8. కళింగరాజుల కాలము.

| | |
|---|---|
| రాకలువ | శక్తివర్మ రాజోలు తామ్రశాస. |
| సకునక | అనంత శక్తివర్మ సకునక దాన శాసనము. |
| | M. E. R. 1934-35 C. P. No. 24. |
| తొణ్డావర | అనంతవర్మ సిరిపుర తామ్రశాస. |
| | E. I. XXIV క్రీ. శ. 528-529. |
| తెల్లవల్లి విషయే | |
| కిడ్డెప్ప | అనంతవర్మ శృంగవరపు కోట దాన శాస. |
| అచంట | J A. H S. VIII పు. 153 (క్రీ. శ. 450. 550). |
| పాగుణార విషయే | |
| తాణ్డివాడ | పృథ్వీ మహారాజు తాణ్డివాడ దాన శాస. |
| కోణ్డమంచి | E. I. XXIII పు. 88 (క్రీ. శ. 7) |
| కోహూరె | చంద్రవర్మ కోమర్తి తామ్ర శాస. పుట 142 |
| | E. I. IV |
| బృహత్ ప్రోష్ఠమ్ | ఉమావర్మ బృహత్ప్రోష్ఠ దాన శాస. |
| | E. I. XII పు 4-6. |
| సారపల్లి | ప్రభంజన వర్మ చికాకోల్ తామ్ర శాస. |
| | I. A. XIII 48-50. |
| దేయవాటి | ఉమావర్మ ధవళపేట దాన శాస. |
| | J. A. H. R. S. X P. 143—44. |

| | |
|---|---|
| చిహార | |
| పులోక (పులత) | శరభవర దాన శాస. E. I. XIII పుట 104-108. |
| చూయిపాక | |
| తానుపాక | పృథ్వీ మూలుని గోదావరి తామ్ర శాస. |
| కడ్డ్లి (కడ్డలి) | J. A. H. R. S. 1906 పు 204. |
| మూగమూరు | |
| ఇర్పులి | |
| కొడ్డవేముపూర్ | రెండవ పులికేశి కొప్పరపు తామ్రశాస |
| విర్పులు (పథాత్) | E. I. XVIII P. 258 (A. D. 631). |

ఈ గ్రామములలోఁ బెక్కు ఊరు, పర (పఱ్ఱు) కొణ్డ (కొండ), చెరువు, కోడు, పదురు, రేవు, పాక, పల్లి, వాడ, (వాట - వాటక) పుర, పట్టి, మడి (మాడి - పూడి) తొత్తె, పంచి అనువానిలో నేదో యొక పదముతో ముగియుచున్నవి. వీనిలో పల్లి, పుర, వాడ మున్నగువానికి సంస్కృత మూలములను గనుఁగొనవచ్చును. మిగిలినవాని కట్లు కనుఁగొనుట సాధ్యము కాకపోవుటచే నవి దేశ్యపదములే యని భావింపవలయును. మఱియు నవి యితర ద్రావిడ భాషాసామాన్యము లగుటయు, సంస్కృత ప్రాకృత గ్రామ నామముల చివర నట్టి వెక్కడను గానరాకపోవుటయు వాని దేశ్యత్వమును దృఢపఱచుచున్నవి. ఈపదములు ప్రాచీనకాలముననే కాక యిప్పటికిని దెలుఁగు దేశమునందలి కొన్ని గ్రామనామముల తుదలఁ గానవచ్చుచున్నవి. వీనిలోఁ గొన్నిటికి సోదర ద్రావిడ భాషలలోఁ గల సమాన పదములను గనుఁగొనుట కష్టముకాదు.

పులోమావి మ్యాకదోని శాసనములో గామే వేపురకే అని కలదు. ఇందలి వేపురక శబ్దమునందలి క స్వార్థమున వచ్చిన ప్రత్యయము. ఇది ఆదోనితాలూకా లోని పీరాపురముకాని, హడగళ్ళి తాలూకాలోని వేపార్లకాని కావచ్చునని కొందఱూహించిరి. కాని యిందలి తుదిపదము పుర, పఱ్ఱు (పర్ల, పార్ల) అను వానిలో నొకటి యనుకొనుటకంటె ఊరు అనుకొనుట యుచితముగా

సుండును.[1] అప్పు డది వేప + ఊరు = వేపూరు అనుదానిలోని ఊకారము హ్రస్వమైనపిదప నేర్పడిన రూపమని భావింపవచ్చును. వేపచెట్లు విస్తారముగా నుండుటచే దాని కాపేరు వచ్చియుండును. పైఁగా దాని సమీపముననే వేవినహాళు అను గ్రామ మున్నదనియుఁ గన్నడమున నది తెలుఁగునందలి వేపూరు, వేపపాడు అనువానితో సమానార్థకమైనదనియు శ్రీ గంటి సోమయాజిగారు చెప్పుచున్నారు.[2] ప్రాచీనకాలమున నిట్లు చెట్లు, చెఱువు, కొండ, కోడు, ఏరు మున్నగు ప్రకృతియందు స్థిరములైన దృశ్యముల గుర్తులతోడనే గ్రామ నామము లేర్పడుట సర్వసాధారణముగాఁ గానవచ్చుచునే యున్నది. వేగొన్న, వేగొండ అను గ్రామముకూడ వేపూరువలెనే చెట్లనుబట్టి యేర్పడిన పేరుగాఁ దోఁచుచున్నది. అది వేగుచెట్లు విస్తారముగాఁగల కొండప్రక్కనో మీఁదనో వెలసిన గ్రామమై యుండవచ్చును.

ఊరను పదముతో ముగియు గ్రామముల పేర్లింకను చెప్పఁ గలవు. ఈ పదము పురశబ్దమునకుఁ బ్రాకృతరూప మని చెప్పుట కవకాశ మున్నది. కాని హేమ చంద్రుఁడు దేశి నామమాలలో దీనిని దేశినామముగా గ్రహించి "ఊరో గ్రామో" గ్రామమని యర్థము చెప్పియున్నాఁడు. తెలుఁగున నిది పెక్కు తత్సమ శబ్దములవలె మువర్ణాంతముగాఁ గానరాక యుదంతమై స్త్రీ సమముగా నుండుటయు దీని దేశ్యత్వమునకే దృష్టాంతముగా నున్నది.

పల్లవ శివస్కందవర్మ మైదవోలు ప్రాకృత శాసనమున (క్రీ. శ. 234) విరిపరయను గ్రామనామము కానవచ్చుచున్నది. ఈ ప్రాకృత రూపమునకు మూలమైన తెలుఁగు పదము విర్పఱ్ఱు. ఇదియే తరువాత విప్పఱ్ఱు, విప్పర్ల అను రూపములు దాల్చినవి. ఇది గుంటూరు జిల్లాయందలి నరసారావుపేట తాలూకాలోని గ్రామము. క్రీ. శ. 7 వ శతాబ్దియందలి జయసింహ వల్లభుని శాసనములోఁ గూడ నీ పదమునకు సంబంధించిన విత్పర్తి యను రూపము కానవచ్చుచున్నది. ఇది విత్పఱ్ఱుయొక్క విశేషణ రూపము. ఇందలి పఱ్ఱు శబ్దమునకును సంస్కృత ప్రాకృతములకును నెట్టి సంబంధమును లేదనియు నిది ద్రావిడ పదమే యనియుఁ జెప్పుటకు ద్రావిడ భాషలయందు మాత్రమే

1. ఆంధ్రభాషావికాసము. పుట 51 ff E. H. A. C. Page 71.
2. ఆంధ్రభాషా వికాసము. ff 51.

శాసనగు శకటరేఫ మిం దుండుట సాక్ష్యముగా నున్నది. ఈశబ్దము ద్విత్వ శకట రేఫములోనో విశకట రేఫముతోనో చాళుక్య యుగమునందును ప్రాక్చాళుక్య యుగమునందును గల పెక్కు శాసనములలోఁ గానవచ్చుచున్నది. ఉదా : పెణుకపఱ్ఱు (ద్వితీయస్కందవర్మ ఓంగోడు దానశాసనము) ఋగుదఱ్ఱు (విష్ణుగోపవర్మ చూరదానశాసనము) తొణ్డాపర (తొంటపఱ్ఱు. అనంతవర్మ సిరిపుర తామ్రశాసనము) నిడుమ్బఱ్ఱు. పామ్బఱ్ఱు. కలుచువుమ్బఱ్ఱు మున్నగునవి చాళుక్యశాసనము లందలి రూపములు.

తమిళ మలయాళములందుఁగూడ పఱ్ఱుశబ్ద మున్నది. దాని కందు గ్రామము, దేశైకదేశము, ఆశ్రయము అను నర్థములు కలవు. తెలుఁగు కన్నడము లందలి పట్టు ధాతువు పఱ్ఱుధాతువునుండి యేర్పడినది. పట్టు అనురూప మందు విశేష్యముగాఁగూడ వాడఁబడుచుండును. అప్పుడు దానికి స్థలము, చోటు అని యర్థము. శకటరేఫమును ద్విరుక్తమైనప్పుడు ద్విత్వ టకారముగా నుచ్చరించు నలవాటు పెక్కుచోట్లఁ గానఁబడుచున్నది

| | | |
|---|---|---|
| తమి. | చిఱు — చిట్రు | తెలు. చిట్టి |
| | కుఱు — కుట్రు | కుట్టి |
| | ఆఱు — అట్రు | ఏటి |
| | నూఱు — నూట్రి | నూటి |

దీనివలన పఱ్ఱు పట్టు శబ్దములు సమానములేయనియు వానికి స్థలమని యర్థ మనియుఁ దేలుచున్నది. ఈపట్టే కొన్ని గ్రామముల చివర పట్టి, వట్టి యను రూపములతోఁ గానవచ్చుచున్నది. ఉదా : విళవట్టి (సింహవర్మ విళవట్టి దాన శాసనము).

తొఱె యను పదమునకుఁ దమిళ కన్నడములలో రేవను నర్థ మున్నది. కన్నడమున దానికి నదియను నర్థముకూడఁ గలదు. తెలుఁగున నీటిగుంట యను నర్థముగల దొరువను పదము దీనికి సంబంధించినదే యై యుండ వచ్చును. ఏరను పదముతో ముగియు గ్రామనామములు తెలుఁగున ననేకము లున్నవి. దానితో సమానార్థకమైన తొఱెయను పదముతో ముగియు గ్రామ నామములుకూడ నుండుటలో వింతలేదు. శాలంకాయన పెదనందివర్మ పెద వేఁగి శాసనమునందలి అఱుతొఱె యిట్టిదే. గోష్ఠ మను నర్థమునఁ దమిళములో

తొఖుశబ్దమును, తెలుఁగున తొట్టు పట్టను శబ్దమును, కన్నడమున తొఱు అను శబ్దమును గలవు. పై గ్రామమునందలి తొటె వీనికిఁ బూర్వరూపమైన నై యుండవచ్చును.

తెలుఁగున మంచము, పీట, బల్ల మున్నగువాని కాలికి కోడను పదము వాడఁబడుచుండును. (మంచపుఁగోడు) దీనికిఁ దమిళమునఁ గొండకొన (పర్వతాగ్రము) అను నర్థ మున్నది. ఒంగోడులోని కోడుశబ్ద మీ యర్థమున వాడఁబడినదే. ఒన్ + కోడు అనఁగా నొక్క శిఖరముగలది. కోడు శబ్దమునకు నదీతీర మను నర్థము తమిళమునను, ఊరిదరి నీటిపల్లమను నర్థము తెలుఁగునను, గానవచ్చుచుండుటచేఁ బై గ్రామ నామమునందది యీ యర్థమునకైన వాడఁబడి యుండవచ్చును.

ఒంగోడు శాసనమున కడాకుదు రను నొక గ్రామము పేర్కొనఁబడి యున్నది. ఇందలి కుదురు కుదుఱను ధాతువునుండి యేర్పడిన విశేష్యరూపము. ఈ ధాతువు తమిళమున కుదిర్ అను రూపముతోఁ గానవచ్చుచున్నది. దీనికి స్థిరపడు, నిలకడయగు నని యర్థము. చివరనున్న గ్రామమని దీని యర్థము కావచ్చును. వడకుదురు, నడికుదురు మున్నగు గ్రామనామములుకూడ నిట్లే యాదిమధ్యాంతస్థితులను బట్టి కలిగినట్టివే కావచ్చును.

పృథ్వీమూలుని గోదావరీ తామ్రశాసనమున చూయిపాక, తానుపాక యను పదము లున్నవి. ఇట్లు పాకయను పదముతో ముగియు గ్రామ నామములు తెలుఁగుదేశమున ననేకములు గలవు. (పందలపాక) తెలుఁగున పాక యనఁగా శాల యని యర్థము. తమిళమున పాక్కా మను పద మున్నది. దానికి సముద్ర, పార్శ్వస్థమైన గ్రామమని యర్థము. ఇదియే కొన్ని గ్రామ నామముల చివర పాక యను రూపమునఁ గానవచ్చుచున్నది.

తమిళమున పాటి శబ్దమునకు పట్టణము, పల్లి యను నర్థము లున్నవి. కన్నడమున నది పాడియను రూపముతోడను తెలుఁగున పాడు అను రూపముతో డను జూపట్టుచున్నవి. (దోసపాడు; పెంటపాడు) విక్రమేంద్రవర్మ చిక్కుళ్ల దానశాసనమునందలి నేత్రపాటి విషయే యను దానియందలి నేత్రపాటి యను రూపము నేత్రపాడు శబ్దము యొక్క విశేషణరూపమై యుండును. ఇచ్చట

సమాసమునం దొపవిభక్తిక రూపము కనఁబడుట దాని తెలుఁగుఁదనమును పృథ పఱచుచున్నది.

రేవుశబ్దము తమిళాంధ్ర కన్నడములు మూఁడింట దిగు స్థలము (Land ng Place) అను నర్థమునఁ గనవచ్చుచున్నది. దీనితో ముగియు గ్రామ నామములు కొన్ని తెలుఁగున నిప్పటికిఁ గూడ నున్నవి. (తాళ్లరేవు). విక్రమేంద్రవర్మ చిక్కుళ్ల దానశాసనమునందలి రావిరేవు గ్రామనామము కూడ నిట్టిదే.

ఇట్లే మఱికొన్ని గ్రామనామముల చివరఁ గానవగు మంచి (కొండమంచి) కలువ (రాకలువ) బఱ్ఱు (పఱ్ఱు-ఋగుబఱ్ఱు) పూడి, మూడి (కొండముడి) మున్నగు శబ్దములు కూడఁ దెలుఁగు శబ్దములే. వీనికి సంస్కృత ప్రాకృతములతో నెట్టి సంబంధమును లేకపోవుట యటుండ ద్రావిడ భాషలన్నిటిలోఁగూడ సదృశరూపములు కానఁబడుచున్నవి. అందుచే నివి తెలుఁగు దేశ్యము లనుటకు సందేహములేదు.

ఇప్పుడు తెలుఁగు భాషలో వాడుకలో నున్న విశేషణములు కూడ నారూపములతోనే పై శాసనములలో గోచరించు చున్నవి. కురువాడ (నందివర్మ కన్తేరు దానశాసనము) చిన్నపురి (విజయ స్కందవర్మ కన్తేరు తామ్ర శాసనము క్రీ. శ. 4) చెశ్పెరువు (శాలంకాయన నందివర్మ పెదవేఁగి శాసనము) పెరువాటక (ఇంద్ర భట్టారక వర్మ రామతీర్థం తామ్ర శాసనము) తెల్లవల్లి (అనంతవర్మ శృంగవరపు కోట దాన శాసనము) మున్నగు పదము లిందుకు నిదర్శనములు. ఇందలి చిన్న·కురు (కుఱు) చెన్న, పెరు (పేరు) తెల్ల అను విశేషణము లిప్పటికి నా రూపములతోనే కానఁబడుచున్నవి. కొన్ని గ్రామ నామముల మొదట రావి, కొండ, రా (రాకలువ) మూగ, తాడి (తాడి) రే (రేగొన్న) ప్రోలు (ప్రోలూరు) అను శబ్దము లున్నవి. ఇవి విశేష్యములే యైనను ఇచ్చట విశేషణముల పని నొనరించు చున్నవి. తెలుఁగుననే కాక యితర భాషల యందుఁ గూడఁ బెక్కు పదములు తామున్న స్థితిని బట్టి విశేష్య విశేషణ భావము పొందుచుండుట కానవచ్చుచునే యున్నది. పై నుదాహరించిన రావి, తాడి, ప్రోలు (బియ్యము) మున్నగు శబ్దములా యా గ్రామముల గుణాకార స్థితులను వర్ణించునవిగా నున్నవి. ఇవి తెలుఁగు పదములే యనుటకు సందేహము లేదు.

రెండవ పులికేశి కొప్పరపు తామ్ర శాసనమున ఇప్పులి యను గ్రామము పేర్కొనఁబడినది. ఇందలి ఇరు + పులి అను రెండు పదములును దెలుఁగు పదములే. రెండు పులు లచ్చట సంహరింపఁ బడుటచేతనో సంచరించుట చేతనో యా గ్రామమున కా పేరు కలిగి యుండవచ్చును.

కొన్ని గ్రామ నామముల మొదట సామాన్య విశేషణముల వలెనే సంఖ్యా విశేషణములు కూడఁ గానఁ బడుచున్నవి. ఒంగోడు (సింహవర్మ ఒంగోడు దాన శాసనము-విజయ స్కందవర్మ ఒంగోడు దాన శాసనము.) ఈ శబ్దమును ఒన్ + కోడు = (ఒక శిఖరము కలది) అని విడఁదీయ వచ్చుననియు, ఒన్‌లోని పదాంత నకారము శకట రేఫమును సహాయ ధ్వనిగా గ్రహించుటచే ఒన్టు అను రూపమును, దానినుండి ఒణ్డు, ఒండు అను రూపములును ఏర్పడెననియు- శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు చెప్పి యున్నారు.[1] ఇట్లే పల్లవ విష్ణు గోపవర్మ చూర దాన శాసనము నందలి మయూర్ కూటువ (మూయెల కూడువ) అను పదము నందు మూఁడు శబ్దము కానవచ్చుచున్నది. సమాసము నందు మూడు శబ్దము నందలి డుజ్వర్ణము లోపించినది. మూ + ఊర్ + కూటువ అనఁగా మూఁడు గ్రామములు కలియుచో టని యర్థము చెప్పవచ్చును. ఈ సమాసము నందలి శబ్దము లన్నియుఁ దెలుఁగు పదములే.

శివస్కందవర్మ హిరహడగల్లి తామ్రశాసనమున కొలిక పద మున్నది. ఈ శాసన మంతయుఁ బాళీ భాషలో వ్రాయఁబడినది. శాసన పరిశోధకులు కొలిక పదమునకు బానిసలు (slaves) అని యర్థము చెప్పి యున్నారు. అగుచో కూలి శబ్దమునకును దీనికిని సంబంధ ముండవచ్చును.

పల్లవ విష్ణు గోపవర్మ చూర దాన శాసనములో మేట్టి తాప : ముదిటి తటాక : అను పదము లున్నవి. ఇందలి మేట్టి తాప యగు పదమునకుఁ దద్శాసనావిష్కర్తలైన శ్రీ సి. యస్. కృష్ణమాచార్లుగారు E I. XXIV పుట 137 లో Stepped plat-form to stock ploughs అని యర్థము కావచ్చునని యూహించి యున్నారు. మేట్టి యనఁగా మేడి. తాప యనఁగా మెట్టు. అందుచేఁ బై యర్థము సరియైనదే యని తోఁచుచున్నది. పై రెండు శబ్దములును దెలుఁగు దేశ్య శబ్దములే.

1. Telugu Language in the 1st mill. Page 8.

ముదిటి తటాక మనఁగాఁ బ్రాఁత చెఱువని యర్థము వ్రాయఁబడినదీ. ముదిర్, ముదురు, ముదు అను రూపములు ప్రాఁత (old) అను నర్థమునఁ దమిళాంధ్ర కన్నడ భాషలం దున్నవి. ముదిమి యనఁగాఁ దెలుఁగున వార్ధక్యము. ముదివగ్గు అను రూపములో ముది యను మాట ముసలి, వయసు మీఱిన అను నర్థమునఁ గానఁ వచ్చుచున్నది. కావునఁ బై ముదిటి తటాకము నందలి ముదిటి శబ్దము కూడ దీనికి సంబంధించినది గానే తోఁచుచున్నది.

వీరపురుషదత్తుని కాలమునకుఁ జెందిన నాగార్జున కొండ శాసనములలో మహాతలవరి, మహాతలవర అను బిరుదనామములు కనఁబడుచున్నవి. (C3, B1, B2, M6) శబ్దరత్నాకరమున తలవరిశబ్దము వైకృతమని తెల్పఁబడినది. అగుచో దీని ప్రకృతి యేదో తెలియుటలేదు. దీనికిఁ దలారి యనునది రూపాంతరము. రాత్రులయందు దొంగతనము పోక కావలికాచు దొరతనపుబంటు అని యర్థము. సరిగా నీయర్థముననే యించుక రూపభేదములతో నీశబ్దము తమిళ మలయాళ కన్నడములందుఁ గూడఁ గానవచ్చుచున్నది. తమి. తలైయారి. కన్న. తలారి మల. తలయాళి. ఇట్లిది యీ ద్రావిడభాషలన్నిటిలోఁ గానవచ్చుటచే వైకృతము కాదనియు ద్రావిడ జన్యమే యనియుఁ జెప్పవచ్చును. సంస్కృత మహచ్ఛబ్దరూపమైన మహాశబ్దము పూర్వపదముగా దానిని సమాసము సందుఁ గూర్చుట వ్యాకరణ సమ్మతము కాదు. కాని యాకాలమున నా సమాసమట్లు వాడఁబడుచుండిన కతమున శాసన రచయితలు దాని నట్లే యుపయోగించి యుందురు. ఇట్లే మహాతగవర యను సమాస మింకొకటి కొండముడి (జయవర్మ) శాసనమునఁ గనఁబడు చున్నది. ఆ శాసనమును రాజాజ్ఞచేఁ జెక్కించిన బాపహాన వర్మకు "మహాతగవర - మహాదండనాయక" బిరుదము లున్నవి. తగవను శబ్దమునకు మతుబర్థమున అరియను తద్ధిత ప్రత్యయము చేర్పఁబడఁగాఁ దగవరి యను రూప మేర్పడును. దీనికి న్యాయాధిపతి యని యర్థము. "శాసనమున నిది ధర్మాధికారి యను నర్థమున వాడఁబడినట్లు తోఁచును. ఇక్ష్వాకు శాసనములందలి మహాతలవర శబ్దమువలెనే మహాతగవర పదము కూడఁ దెలుఁగు పదము."[1]

---

1. ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి. పుట 154.

## వ్యక్తుల పేర్లు :

పైని పేర్కొనఁబడిన గ్రామనామములవలెనే కొందఱు వ్యక్తుల నామములును, ఆనామముల చివరఁ జేర్పఁబడిన కొన్ని శబ్దములును దెలుఁగు ప్రాక్ప్రాకృత యుగముననే వ్యాప్తిలో నుండె ననుటకుఁ దార్కాణము లగుచున్నవి. దాన ప్రతిగ్రహీత లైన బ్రాహ్మణులపేర్లు పెక్కు సంస్కృత నామములే యైనను గొన్ని కేవల తెలుఁగు శబ్దములవోలెఁ గాననగుచున్నవి. గోలశర్మ (విజయ స్కందవర్మ ఓంగోడు శాసనము) కొట్టిశర్మ (అత్తివర్మ గోరంట్ల శాసనము) దొడ్డిస్వామి (విష్ణుగోపుని నెడుంగ రాయదాన శాసనము) అనునామము లందలి పూర్వభాగములు తెలుఁగు శబ్దములే. ఆసంద గోత్రజ దామోదరవర్మ మట్టే పాడు శాసనమున అగ్గిజ్జ, వేణిజ్జ, భావజ్జ, నందజ్జ అను బ్రాహ్మణుల పేర్లు పేర్కొనఁబడినవి. ఇందుఁ దుదిని గానవచ్చు జ్జ వర్ణము అజ్జ యను ప్రాకృత శబ్దముయొక్క లుప్తశేషమువోలెఁ దోఁచుచున్నది. ఈ అజ్జశబ్దమే తరువాత అయ్యగా మాఱి యుండును. తెలుఁగువారిలోఁ బురుషులపేర్లు పెక్కు అయ్య శబ్దముతో ముగియుచుండుట సర్వ సామాన్యమే. యువరాజ శివస్కందవర్మ మైదవోలు తామ్రశాసనములోఁ బేర్కొనఁబడిన పువకొటుజ, గొనమదిజ యను పేర్లు కూడ నిట్టివే యని భావింపవచ్చును.

కొన్నినామముల చివర అయ్య శబ్దము వలెనే అన్న శబ్దము కూడఁ గానవచ్చుచున్నది. ఇక్ష్వాకుల కాలమునకుఁ జెందిన నాగార్జున కొండ శాసనములలో ఖందచలికి రెమ్మణక (B4) ఖంద సాగరమ్నక (C3) ఖందవిశాఖమ్ణక (B 2) బుధిమ్నక (స) హమ్మఘ్న (స) వాగమ్న (స) వీరమ్న (స) (E) ఖంద సాగరమ్నక (E. I. XX Page 66) మున్నగు శబ్దము లున్నవి. ఇందలి అణక యను రూపమును గూర్చి స్టెన్‌కొనోగారు "ఇది ద్రావిడమైన - బహుశః కన్నడ భాషకు సంబంధించిన - ప్రాతిపదికతోఁ గూడిన మాండలికమునకుఁ జెందిన దని స్పష్టమగుచున్నది .... ద్రావిడభాష — బహుశః కన్నడము మాతృభాషగాఁ

గల జనులచే మాటాడఁబడు నొకరకమైన ప్రాకృతము- ఇందు గోచరించుచున్న" దని వ్రాసియున్నారు.[1] ఈ శాసనములు తెలుఁగు దేశము పడమి భాగములో నుండిన నాగార్జున కొండలో వేయించఁబడినవి. అందుచే నిందలి శబ్దములకుఁ గన్నడముతోఁ గంటెఁ దెలుఁగుతో నెక్కువ సంపర్కముండుట సహజము. మఱియుఁ బై శబ్దములు పెక్కింటిలో మూర్ధన్య ణకారముకంటె దంత్య నకారమే యధికముగాఁ గానవచ్చుచున్నది. వీరమ్న, నాగమ్న శబ్దములు వీరన్న, నాగన్న అనువానికిఁ బూర్వ రూపములవలె నున్నవి. అరవమున అణ్ణన్ అనియు కన్నడమున అణ్ణయనియు నీశబ్దము ద్విత్వణ కారయుక్తముగాఁ గానవచ్చుచున్నది. ద్విత్వనకారముతోఁ గూడిన అన్న శబ్ద మొక్క తెలుఁగులోనేయున్నది. కావునఁ బైశబ్దములను దెలుఁగుశబ్దములుగానే భావింపవచ్చును. అణక యందలి కవర్ణము స్వార్థమున వాడఁబడిన క ప్రత్యయము. మూఁడవ మాధవవర్మ వేయించిన ఈపూరు తామ్రశాసనమున కాజ్ఞప్తి యాతని ప్రియ పుత్త్రుఁడైన మంచ్యణ్ణ భట్టారకుఁడు. ఇందలి మంచ్యణ్ణ పదమే తెలుఁగున మంచన్న, మంచన అను రూపములతోఁ గానవచ్చుచున్నది.

ఈ విధముగాఁ బైని పేర్కొనఁబడిన గ్రామ నామములును వ్యక్తుల పేర్లును, బిరుదములును, విశేషణ సంఖ్యావాచకాదులును బ్రాచ్యశుక్య యుగమునందుఁ దెలుఁగు బహుళప్రచారమున నుండె ననుటకుఁ దార్కాణములుగా నున్నవి. అట్లవి జనవ్యవహారమున నుండనిచో శాసనములందుఁ బ్రయోగింపఁబడుట సంభవింపదు.

### అక్షరములు : ధ్వనులు :

క్రీస్తుశకారంభమునందలి తొలి శతాబ్దులలోనే ద్రావిడభాషలు ప్రచారమునే నుండెననుట కా కాలపు శాసనములందు వ్రాయఁబడిన కొన్ని యక్షరములును, ధ్వనిరూపములును గూడఁ దోడుపడుచున్నవి. అందొకటి శకటరేఫము.

---

1. It evidently belongs to a dialect with a Dravidian, perhaps Kanarese substratum......... We are faced with a normalised semiliterary Prakrit used by people whose home tongue was Dravidian probably Kanarese. Ep. Ind. XX page 25. Prof. Stenkonow.

ఇది సంస్కృత ప్రాకృతములందు లేని యక్షరము. ఇది నఴాచదు, ఴగుబష్ఠు అఴుతొఴె, కొణ్డవేఴుపూర్, విప్పఴు పఴాత్ అను పదములందుఁ గానవచ్చుచున్నది. నాగరలిపిలోఁ గాని వేంగీచాళుక్యలిపిలోఁ గాని వ్రాయఁబడిన సంస్కృత ప్రాకృత శాసనములలో నీ యక్షరములుగల గ్రామముల పేర్లు వ్రాయవలసివచ్చినప్పు డది యా లిపులలో లేనికతమున దానికై ప్రత్యేకముగాఁ దెలుఁగు కన్నడలిపి వాడఁబడుచుండెను. ఆ ధ్వని యప్పుడు బహుళ ప్రచారమున లేకుండినచో శాసన లేఖకు లాయక్షరమును బ్రత్యేకముగాఁ దెలుపుటకై యంత శ్రమపడియుండరు.

ప్రాక్చాళుక్య యుగము నందలి సంస్కృత ప్రాకృత శాసనములలోఁ గానఁబడు మఱొక వింతయక్షరము ఴ. డా॥ కాల్డ్వెల్ దాని నాంగ్లము నందలి rzh అను నక్షరముల కూడికచే నేర్పడు ధ్వనిగా గుర్తించెను. ఈ యక్షరము విక్రమేంద్ర వర్మ చిక్కుళ్ల తామ్ర శాసనము నందలి ఴెందులూరు గ్రామము నందును, పల్లవ విష్ణుగోపవర్మ చూర దాన శాసనము నందలి ఴగుబష్ఠు గ్రామ నామమందును, మేఴి తాప పదము నందును గాననగుచున్నది. తూర్పు చాళుక్యుల శాసనములలోఁ గూడ నీ యక్షరముతోఁ గూడిన పదము లున్నవి. కొంచె మించుమించుగా నన్నయభట్టు కాలము నుండి యీ యక్షరము తెలుఁగున వాడుక నుండి తొలఁగినది. ఇది తరువాత నందు డ, ద, ళ, ల, ర, ఱ అను వానిలో నొక యక్షరము రూపము నొందినట్లు కనఁబడుచున్నది. పూర్వపు ఴెందులూరు గ్రామమిప్పుడు డెందులూరు, లేక దెందులూరు అని పిలువఁబడు చుండుటయు, మేఴి తాప మేడితాప యగుటయు, ఇంద్రవర్మ రామతీర్థ శాసనము నందలి పఴ్టికి ప్రక్కగా మాఱుటయు నిందుకు నిదర్శనములు. తెలుఁగున వలెనే యీ యక్కరము కన్నడమునఁ గూడఁ గొంత కాలముండి క్రమముగా నదృశ్యమై పోయినది. కన్నడ వైయాకరణులు దీనికి ఱళమని పేరు పెట్టిరి. సాధారణముగా నందు ళకారము దీని స్థానము నాక్రమించు చుండును: తమిళ మలయాళము లందుమాత్ర మది యిప్పటికిని నిల్చియే యున్నది. వ్యవహారమున మాత్ర మిది యందును మాఱి వేఱువేఱు ధ్వనులతో నుచ్చరింపఁబడుచున్నది. ఈ యక్షరముతోఁ గూడిన చూర దాన శాసనము నందలి భాష సంస్కృతమే యయ్యును అది తెలుఁగు కన్నడ లిపిలో వ్రాయఁ బడినది. దీనికా లిపి యం దప్పటికే తమిళము నందలి ఴ అను నక్షరము కంటె భిన్నమైన ఴ అను క్రొత్త గుర్తేర్పడి యుండెను. ఇదియును

శకట రేఫమును సంస్కృత వర్ణ సమామ్నాయమున లేనివి కాఁబట్టి వానితోఁ గూడిన దేశ్య పదములను వ్రాయవలసి వచ్చినప్పుడు తరువాతి కాలమునఁ దెలుఁగు కన్నడ లిపి యందలి గుర్తులే వాడఁబడుచుండెను. పై యక్షరములును దద్ధ్వనులను సంస్కృత ప్రాకృతములకుఁ గ్రొత్త లగుటయు, నా యక్షరములతోఁ గూడిన పదములు కొన్ని సంస్కృత ప్రాకృత శాసనములలో గోచరించుటయు వానితోఁ గూడిన ద్రావిడ భాష లప్పుడు వాడుకలో నుండెనని విశదముగా రుజువు చేయుచున్నవి.

నన్నయ భారతమునఁ గానరాక యంతకుఁ బూర్వపుఁ జాళుక్యుల శాసనము లందును బ్రాక్చాళుక్య యుగము నందలి సంస్కృత ప్రాకృత శాసనము లందును గనఁబడు మఱియొక వింతధ్వని న్ట. ఇందలి పదాంత నకారము దంత్య నకారము కంటె భిన్నమైనది. తమిళమున నిది రన్నకారముగాఁ బరిగణింపఁబడి యిప్పటికిని అవన్, ఇవన్, మగన్ మున్నగు శబ్దములందు గోచరించు చున్నది. ఇందలి ధ్వనుల సమ్మేళనము కేవల ద్రావిడ భాషలకు సంబంధించినదే. ఉత్తర హిందూస్థాన భాషలలోఁగాని ఆర్య వర్గమునకుఁ జెందిన భాషలలోఁగాని యిందలి ధ్వనులు కానిపింపవు. ఇందలి నకారమును ఆంగ్లమున Alveolar nasal అందురు. అత్తివర్మ గోరంట్ల శాసనము నందలి (క్రీ. శ. 350) తాన్టికొన్ట యను గ్రామ నామమునం దీ ధ్వని సమ్మేళనముతోఁ గూడిన యక్షరము మొట్ట మొదటఁ గానవచ్చు చున్నది. గుంటూరున కిరువది మైళ్ల దూరమునఁ గృష్ణానది తూర్పు తీరమునఁ గల తాడికొండయే యీ గ్రామమని గుర్తింపఁ బడినది. ఈ యక్షరము విక్రమేంద్రవర్మ చిక్కుళ్ల తామ్ర శాసనము నందలి రేగొన్టమ్ గ్రామ నామ మందును, తృతీయ మాధవవర్మ పొలమూరు శాసనము నందలి కున్టూరు గ్రామనామ మందును గూడ నున్నది. ఈ రెండు గ్రామములును దరువాతఁ గ్రమముగా రేగొండ, కొండూరు అను రూపములను దాల్చినట్లు తెలియుచున్నది. దీనినిబట్టి పూర్వకాలము నందలి శకట రేఫముతోఁగూడిన పదాంత నకారము కాలక్రమమున ణ్డ గా మాఱిన దని భావింప వచ్చును. పృథ్వీ మహారాజు తాండివాడ దాన శాసనమున కాజ్ఞప్తి శ్రీరామలేణ్టు రాజః అని యున్నది. అతని పేరు శ్రీరామ లేన్దు రాజః అయి యుండవచ్చును. అందుచే న్ట కొన్ని చోట్ల న్దగాఁగూడ మాఱినట్లు తోఁచుచున్నది.

పదాంత నకారమును (వల్లినమ్) శకట రేఫమును సమీప స్థానముల నుండి యుత్పన్నములగు (Alveolar = belonging to the sockets of the teeth,

as the alveolar arch, the part of the upper jaw in which the teeth are placed) నక్షరము లగుటచేఁ బదాంత నకారము నూది పల్కునప్పు డది సమీప స్థానోత్పన్నమగు శకట రేఫమును సహాయ ధ్వనిగా గ్రహించి న్ఱ్ అను ధ్వని సమ్మేళనమునకుఁ దా వాసంగును. ఇట్లే శకట రేఫము నాసిక్యమును బొందవలసి నప్పుడు పదాంత నకారము నూతగా గ్రహించి పై ధ్వని సమ్మేళమును బుట్టించును. కాని యీ ధ్వని నుచ్చరించుటలోఁ గొంత క్లేశ ముండుటచే నది వివిధ భాషలలో వివిధ రూపముల నందినది.. ఈ క్రింది యుదాహరణములను బరికించినచో నీ విషయము తేటతెల్ల మగును.

| తమి | తెలు | మల | తుళ |
|---|---|---|---|
| కన్ఱు | కొణ్డ | కన్ను | కన్జి |
| పన్ఱి | పన్ది | పన్ని | పన్జి |
| మూన్ఱు | మూణ్డు | మూన్ను | మూజి |
| ఒన్ఱు | ఒణ్డు | ఒన్ను | ఒన్జి |

దీనిని బట్టి న్ఱ్ తెలుఁగున ణ్డగాను, మలయాళమున ద్విత్వ నకారముగాను, తుళు భాషలో న్జ్‌గాను మాఱినదని స్పష్టమగుచున్నది. తెలుఁగు కన్నడము లందొక్కొక్కప్పు డనునాసికము లోపించుటయు దకారము పరుషత్వము నొంది ద్విత్వమగుటయుఁ గానఁ బడుచున్నది. గుట్ట యను రూప మిట్లేర్పడినదే. ఇప్పటి తాడికొండయే తాన్ఱికొన్ఱగా గుర్తింపఁ బడుటచే. తాన్ఱికొన్ఱ యందలి పూర్వ భాగము తాఁడిగా మాఱినదని చెప్పవచ్చును. తాన్ఱి శబ్దము తాఁడిగా మాఱుటకు ముందు కొన్నాళ్లు తాణ్డిగా వాడఁబడి యుండును. తరువాత దీర్ఘము మీఁది ణ కారోచ్చారణము సన్నగిల్లి పోవుటచే నది యఱసున్నతోఁ గూడ తాఁడి యను రూపమున వ్రాయఁబడుట సంభవించి యుండును. ఇట్లే మూన్ఱు మూణ్డై మూఁడుగా మాఱి యుండును. కన్ఱు కొణ్డమైనది కాని యిందలి ణకారము హ్రస్వము మీఁది దగుటచే నిల్చి పోయినది. ఇట్లే ఒన్ఱు ఒణ్డు (ఒండు) అను రూపముతోనే నిల్చి యున్నది.

పదాంత నకారముతోఁ గూడిన శకటరేఫము పూర్వశాసనములలో డ, ఱ, ఴ, అనువాని చిహ్నములకంటె భిన్నమైన ◯ వంటి చిహ్నముతో వ్రాయఁబడుట గోచరించుచున్నది. దీనిని గొందఱు శకటరేఫముగాను గొందఱు ఴ కారముగాను జదివియుండిరి. డా. ఫ్లీటుగారు తాన్ఱి కొన్ఱను తాన్ఴి కొన్ఴగాఁ

బఠించిరి. మఱికొందఱు దానినే తాన్థి కొన్థ (Tanthi Kontha) అని చదివి యుండిరి. కాని నిజమునకది శకటరేఫముకాని, ట కారముకాని, థ కారముకాని కాదు. తెలుఁగు దేశమున నాపూర్వ శాసనముల కాలముననే న్థ అనుధ్వని ణ్ట్రి అను (ṇṭr) ప్రత్యేక ధ్వనిగా నుచ్చరింపఁబడుచుండుటచే దాక్షిణాత్య వేంగీ లిపి యందును, వేంగీ చాళుక్య లిపియందును అందలి శకటరేఫమును ఱ అను నల్లాక వింత గుర్తుతో నప్పటి శాసనలేఖకులు సూచించియుందురు. తరువాత 'తాణ్ట్రి కొణ్ట్రి' తాఁడికొండగా మాఱియుండును. న్థఅను తమిళధ్వనియు ణ్ట్రి అను తెలుఁగు ధ్వనియుఁ గాలక్రమమున ణ్డగానే మార్పుచెందుటచే మధ్య కాలమున నవి యుచ్చరింపఁబడిన ధ్వనులలోని భేదమంతగా గుర్తింపఁ బడుటలేదు. వాన్థు, మగన్థు, ఉన్థి అనునవి తెలుఁగున వాణ్ట్రి, మగణ్ట్రి, ఉణ్ట్రి అను నట్లుగానే వ్రాయఁబడి తరువాత వాణ్డు, మగణ్డు, ఉణ్డి అనురూపములను బొందియుండినట్లు చెప్ప వచ్చును.

ప్రాచీన భాషయందలి పదాంత నకారము శకటరేఫమును సహాయధ్వనిగా గ్రహించి కాలక్రమమున ణ్డుగా మాఱిన దనుటకుఁ బెక్కు నిదర్శనములను జూపవచ్చును.

| తమి | తెలు |
|---|---|
| అవన్ | అవన్థు - అవణ్డు - వాణ్డు - వాఁడు |
| మగన్ | మగన్థు - మగణ్డు - మగఁడు |
| మూన్థు | మూన్థు - మూణ్డు - మూఁడు |
| తిన్, తిన్థి | తిన్థి - తిణ్డి - తిండి. |

పు బు వర్ణముల పరిణామ రూపమైన మువర్ణము (నాగము, వృక్షము, మఠము) వ్యాకరణ కర్తలచేఁ దరువాత నమహద్వాచక ప్రథమైక వచన ప్రత్యయముగాఁ బరిగణింపఁబడినట్లే ణ్డు లోని డు కాలక్రమమున మహద్వాచక ప్రథమైక వచన ప్రత్యయముగాఁ బరిగణింపఁ బడినది. నిజము పరికింప ద్రావిడ నామములు ప్రథమైక వచనమున నే ప్రత్యయమునుగాని గ్రహింపనే గ్రహింపవు. సంస్కృత ప్రాకృతములలో లేని పై వింతధ్వనులు ప్రాక్చాళుక్య శాసనములలో గోచరించుటచే నాకాలమునఁ దెలుఁగును దత్సోదర ద్రావిడ భాషలు మఱికొన్నియు జనులచే మాటాడఁ బడుచుండె ననుట కవకాశము కలుగుచున్నది.

## తాలవ్యీకరణము :

శాలంకాయన నందివర్మ పెదవేఁగి శాసనములో (క్రీ. శ. 475) చెఋ్పరువ గ్రామే, కమ్పురాఋ్పరువే అను రెండు గ్రామనామములు కనవచ్చుచున్నవి. ఈ రెండు గ్రామముల చివరను చెరువను పద మున్నది. తెలుఁగున నది ఉకారాంతమైనను శాసనమున వకారాంతముగా వాడఁబడినది. ఇంకొక విశేషమేమనఁగా చెరువు దేశ్యపదమైనను సంస్కృతమున వకారాంత శబ్దమునకువలె దానికి సప్తమీ విభక్త్యేక వచన ప్రత్యయము చేర్పఁబడినది. కమ్పురాఋ్పరు వనునది గ్రామనామ మగుటచే శాసనకర్త దానిని సంస్కృత నామముగానే గ్రహించి సప్తమీ విభక్తి ప్రత్యయము చేర్చి యుండును. కాని ఉకారాంతమైన చెరువు శబ్దము నతఁ డకారాంత మేల చేసెనో తెలియరాదు. చెఋ్పరువ గ్రామే అను నప్పుడు సమాసమునఁగూడ చెరువు శబ్ద మకారాంతము గానే వాడఁ బడినది. తెలుఁగునఁ బెక్కు గ్రామ నామముల చివరఁ జెఱువను పదము కానఁ బడు చున్నది. కొన్ని యెడల నది బహు వచనాంతమై చెఱువులు, చెర్ల అను రూపములఁ దాల్చుటయుఁ గలదు. (మాచెర్ల). ఇట్లు చెఱువు పదము గ్రామ నామముల తుదఁ జేర్పఁబడుట యొక్క తెలుఁగుననే కాక కన్నడభాషలోఁగూడఁ జూపట్టు చున్నది. (పులిగెఱె, అరికెఱె). చెఱు వను పదము కన్నడమున కెఱె యను రూపముతో నుండును. రెండింటి యందును శకట రేఫమే. చెఱు వను నర్థమున నది యం దిప్పుడు కూడ వాడఁ బడుచునే యున్నది. ఇందలి యాది కకారము తెలుఁగున తాలవ్యీకరణముచే చకారముగా మాఱినది. ఈ మార్పునకుఁ గారణము క తరువాతవచ్చు తాలవ్యమైన అచ్చు (ఎ) తాలవ్యములు కాని అ, ఉ అను నచ్చులు వచ్చుచో నట్లు క చ గా మాఱక యథాస్థితముగా నుండిపోవును.

| తమి | తెలు |
|---|---|
| కాల్ | కాలు |
| కాల్ | గాలి |
| కడై | కడ |
| కోట్టై | కోడి |
| కుట్టై | గొయ్యి |
| కుళమ్ | కొలను |

తాలవ్యమైన యచ్చు వచ్చినప్పుడు

| | |
|---|---|
| కెయి | చెయి |
| (కేలు, కయి అను రూపములు కూడ నున్నవి.) | |
| కెమ్ | చెమ్ |
| (కెందామర మున్నగు రూపములందు కెమ్ కూడఁ గానవచ్చును.) | |
| కిఱు | చిఱు, చిట్టి |
| కీఱు | చీఱు (గీఱు) |
| కన్ను, కెళె | తెలు, చెలి |
| కివి | చెవి. |

ఛ్చెరువు వందలి మొదటి పదమగు చెమ్‌లోని చకారము కూడ నిట్లు తాలవ్యీకరణముచే నేర్పడినదే. దీనికిఁ బ్రాచీన రూపము కెమ్. కెం పనఁగా నెఱ్ఱని లేక ప్రకాశించు అని యర్థము. అది తెలుఁగు కన్నడములు రెంటింట వాడుకలో నున్నది. తెలుఁగు దేశ్యముల మొదట నుండు చకారములు పెక్కిట్లు తాలవ్యీకరణముచే నేర్పడినవే. ఏలయన వానికి సదృశ్యములైన కన్నడ పదములు కకారాదులుగానే కనఁబడుచున్నవి. పదాది నున్న యీ కకారము తెలుఁగు తమిళములలోఁ గంటెఁ గన్నడముననే పెక్కుచోట్ల మాఱకుండ నిల్చియున్నట్లు చూపట్టుచున్నది. మూల ద్రావిడమున నా పదములు కకారాదులుగానే యుండి యుండును. తాలవ్యీకరణము ననుసరించి కకారము చకారముగా మాఱుటకు తెలుఁ గితర ద్రావిడ భాషలనుండి విడివడిన పిమ్మటఁ జాల సంవత్సరములు పట్టి యుండును. పై పెదవేఁగి శాసనము (క్రీ. శ. 475) లోని దగుటచే నంతకుఁ బెక్కు శతాబ్దులకు ముందే తెలుఁగు మూల ద్రావిడము నుండి విడివడి ప్రత్యేక భాషగా వాడఁబడుచుండె నని చెప్ప వీ లగుచున్నది.

### అనుస్వారము :

ప్రాక్చాళుక్య యుగమునందలి శాసనములలో ననుస్వారము వ్రాయఁబడిన పద్ధతికూడ నాకాలమున ద్రావిడభాషలు పఠన లేఖన వ్యవహారమునం దుండెనను టకు నిదర్శనముగా నున్నది. సంస్కృతమున నోష్ఠ్యాను నాసికయైన మ్ పదాంతమందుఁగాని పద మధ్యమందుఁ గాని యున్నపుడును, దంత్యాను నాసిక

మైన న్ పదమధ్యమందు వచ్చినప్పుడు కొన్ని సందర్భములందును అనుస్వారము వాడఁబడుచుండును.[1] ఈ యనుస్వారము సాధారణముగాఁ దత్పూర్వాక్షరముపై నుంచఁబడు చిన్న చుక్కచే సూచింపఁ బడుచుండును. శషసహలు తప్ప మిగిలిన హల్లులు పర మగునప్పు డది మఱల నా వర్గమునకుఁ జెందిన యను నాసికముగా మాఱు చుండును.[2] దంత్యోష్ఠ్యములైన యను నాసికములు తప్ప మిగిలినవి (జ, ఞ, ణ,) హల్లులు పరమైనప్పు డనుస్వారములుగా మాఱక యట్లే నిల్చిపోవుచుండును.

"ద్రావిడభాషలలో మొదట ననుస్వారము లేకుండెను. మొదటి నాలుగు వర్గాక్షరములును నట్టియెడఁ దమతమ యనునాసికాక్షరములతోఁ గలపి వ్రాయఁ బడుచుండెను. ఈ పద్ధతి తమిళమున నిప్పటికి ననుసరింపఁ బడుచున్నది. అజ్విరహితమైన పొల్లక్షరమును సూచింపవలసినప్పు డీ భాషలో నా యక్షర ముపై నొక చుక్క పెట్టుచుందురు. ఇట్టి చుక్క లేని యక్షర మద్విశిష్టముగా నుచ్చరింపఁ బడుచుండును. ఈ విషయమును దమిళవ్యాకరణకర్త యైన తొల్కాప్పియరు చెప్పియుండుటచే క్రీస్తుశకారంభమునకే యీపద్ధతి యందుండె నని తెలియుచున్నది. బ్రాహ్మీ లిపిలో నట్టి చుక్క పొల్లునకుఁ గాక యనుస్వార మునకో యనునాసికమునకో చిహ్నముగాఁ బరిగణింపఁ బడుటచే నప్పటికే యీ విషయమున నుత్తర భాషలు దాక్షిణాత్య భాషల కంటె భిన్నమైన పద్ధతి నవలంబించుచుండె నని భావింప వచ్చును. కాల క్రమమునఁ దెలుఁగు కన్నడ ములపై సంస్కృత ప్రభావ మధికముగాఁ జూపట్టుటచే నా భాషలందలి పరి స్థితులు కొన్ని సంస్కృతాను గుణముగా మాఱుట సంభవించెను. తమిళము దక్షిణమునఁ గడు దవ్వుగా నుండుటచే సంస్కృత ప్రభావ మందు మిక్కిలి తక్కువగాఁ గానఁబడు చుండును."[3] ఈ సంస్కృత ప్రభావముచేఁ బ్రాకృత శాసనము లందలి తెలుఁగు గ్రామ నామములలోఁ గొన్నింట ననునాసికమునకు బదు లనుస్వారమే వ్రాయఁబడి యున్నది. ఉదా :- విరిపరం (మైదవోలు శాసనము) పాంటూరం (కొండముడి శాస.) కాని ద్రావిడ పద్ధతి ననుసరించి యనుస్వారములను గాక యనునాసికములనే యథాతథముగా నుంచిన చోట్లును

1. మోఽను స్వారః - నశ్చాదాపదాన్తస్యఝలి. పాణిని.
2. అనుస్వారస్య యయి పరసవర్ణః.
3. Journal S. V. O. I. XII-2. Page 35.

గొన్ని గలవు. చెన్దలూర గ్రామే (చెందలూరు తామ్ర శాసనము) విలేమ్బలి (మాధవవర్మ ఈపూరు తామ్రశాసనము). చిక్కుళ్ల దానశాసనములో "కశ్చిదేనం పాలయతి" యనుచోట ఏనమ్‌లోని పదాంత మకార మనుస్వారముగా వ్రాయఁబడక యనునాసికసహితముగా "కశ్చిదేనమ్పాలయతి" యని వ్రాయఁబడినది. ఇచ్చట ద్రావిడ లేఖన పద్ధతియొక్క ప్రభావము గోచరించుచున్నది. ద్రావిడ భాషలకుఁ బ్రత్యేకములైన ఴ, ఱ, ళ అను నక్షరముల వలెనే యనుస్వారములకు బదు లనునాసికములను వ్రాయు పద్ధతికూడఁ బ్రాక్చాళుక్య యుగమున ద్రావిడభాషలు వ్యవహారమున నుండె ననుటకు దృష్టాంత మగుచున్నది.

## బహువచన ప్రత్యయము :

విక్రమేంద్రవర్మ చిక్కుళ్ల దాన శాసనములో (క్రీ. శ. 6వ శతాబ్ది) తెలుఁగు నందలి యిప్పటి బహువచన ప్రత్యయమును దెల్పునొక వింత పదము కానవచ్చుచున్నది. ఆ శాసన మంతయు సంస్కృత భాషలోనే రచింపఁబడినను దానిచివర సంస్కృతమునందలి సుబాదులలో నేప్రత్యయముతోఁ గాని కూడి యుండని "విజయరాజ్య సంవత్సరంబుళ్" అను పద మొకటి చూపట్టుచున్నది. సంస్కృతమున సంవత్సర పదమునకుఁ బ్రథమా బహువచనమున సంవత్సరాః అను రూపమేర్పడును. అందుచేఁ బై పదము సంస్కృతపదము కాదనుట స్పష్టము. అమరావతీ స్తూపమునందలి యొక రాతిపలకపైఁ బ్రత్యేకముగాఁ గానిపించిన 'నాగబు' అను దానియందలి బువర్ణమే కాలక్రమమున మ్బు,ంబు, మ్ము, ము అను రూపములను దాల్చి తెలుఁగునందలి అమహద్వాచక ప్రథమైకవచన ప్రత్యయముగాఁ బరిగణింపఁ బడెనని యిదివఱకుఁ జెప్పఁబడినది. సంవత్సరంబులోని బిందు పూర్వక బువర్ణ మా బువర్ణము యొక్క పరిణామరూపమే. దాని తరువాతఁ జేర్పఁబడిన ళ్ అనునది బహువచనమును దెల్పుచున్నది. ఇదియే తరువాతఁ దెలుఁగునందలి లు అను బహువచన ప్రత్యయముగా మాఱినది. దీనికిని సంస్కృతనామముల చివరఁ జేర్పఁబడు ప్రత్యయములకును నెట్టి సంబంధమును లేదు. అసలు సంస్కృతమున విభక్తి ప్రత్యయములతో సంబంధములేని ప్రత్యేక-బహువచన ప్రత్యయ మేదియు లేనేలేదు. అందలి సు ఔ జస్ మున్నగు ప్రత్యయములు విభక్తిని వచనమును గలసియే సూచించుచుండును. ద్రావిడ భాషలలో నట్లు కాక విభక్తి ప్రత్యయముల కంటె భిన్నమగు

నొక బహువచన ప్రత్యయము గోచరించును. దీని తరువాతనే కావలసిన విభక్తి ప్రత్యయము చేర్పఁబడు చుండును. ద్రావిడ భాషా సంపర్క ప్రభావము చేతనే సంస్కృత ప్రాకృత జన్యములైన యాధునికోదీచ్య దేశభాషలలో విభక్తి విశ్లిష్టమైన ప్రత్యేక బహువచన ప్రత్యయము పరిణతమైన దని చెప్పవచ్చును. వీనిలోఁ గొన్నింట లోగ్ అనునది బహువచన ప్రత్యయముగా వాడఁబడు చుండుటచేఁ దెలుఁగు మున్నగు ద్రావిడభాషలకుఁ గూడ సంస్కృత ప్రాకృత జన్యత్వము చెప్పఁ జూచు కొందఱు భాషావేత్తలు దానికి మూల రూపమైన సంస్కృతమునందలి లోక శబ్దము నుండియే లు ప్రత్యయ మేర్పడినదని వాదింతురు. కాని యుత్తర దేశ భాషలన్నియుఁ గొంచె మించు మించుగా క్రీ. శ. 10 వ శతాబ్ది ప్రాంతముననే వర్ధిల్లిన వగుటచేతను, ప్రాచీన ప్రాకృతములం దెచ్చటను లోక శబ్దము ప్రత్యేక బహువచన ప్రత్యయముగా వాడఁబడి యుండక పోవుటచేతను దెలుఁగు నందలి లు వర్ణము గాని తత్పూర్వరూపమైన శ కారముగాని దానినుండి యేర్పడె నని చెప్పుట యుక్తి సహముగా నుండదు. పై చిక్కుళ్ళ శాసనము సంస్కృతముననే వ్రాయఁబడినను దల్లేఖకుఁడు తెలుఁగువాఁడగుటచే నతిపరిచయ వశమున సంవత్సరాః అనుటకు బదులు తాను దఱచుగా వాడుచున్న సంవత్సరంబుళ్ అను పదమును జెక్కి యుండును.

తమిళ కన్నడము లందు కళ్ అను ప్రత్యయము బహువచన సూచకముగా వాడఁ బడుచున్నది. తమిళమునకుఁ బ్రథమ వ్యాకర్తయైన తొల్కాప్పియరు కళ్ అనునది నపుంసక లింగ (అహ్ఱిణై) నామములకుఁ జేర్పఁబడు ప్రత్యేక బహువచన ప్రత్యయమని చెప్పి యుండెను. తరువాత నది యొక్క నపుంసక నామములకేకాక యితర నామములకుఁ గూడ వాడఁబడుట సంభవించినది. తెలుఁగున నీ కళ్ ప్రత్యయమే యనుచితముగా విభజింపఁ బడుటచే నందలి యుత్తర భాగమైన శ కార మొక్కటే బహువచన ప్రత్యయముగా నేర్పడినట్లు తోఁచుచున్నది. ద్రావిడ కుటుంబమునకుఁ జెందిన మఱి కొన్ని భాషలలో కళ్ ప్రత్యయముయొక్క పూర్వ భాగమైన క యొక్కటే బహువచన ప్రత్యయముగా నున్నట్లు కనఁబడుచున్నది. తెలుఁగున రేను (రేగు) గోను (గోగు) కొలను (కొలకు) మ్రాను (మ్రాకు) ఇత్యాదిగా నేక వచనమున రెండు రూపములు గల పదములను బాగుగాఁ బరిశీలించినచో నందలి కొంత గొంత రూపములు ప్రాచీన బహు వచన ప్రత్యయమైన 'కళ్' అనుచిత విభాగము నొందుటచే నేర్పడినవని తెలియ వచ్చును.

ఈ యనుచిత విభాగము చేతనే కళ్ లోని యేకదేశమైన ళ్ బహు వచన ప్రత్యయముగాఁ బరిగణింపఁ బడుటయు, కకారము మూల శబ్దము యొక్క చివరి యక్షరముగా నేర్పడుటయు సంభవించినది. ఎలిక, చిలుక, ఈఁగ మున్నగు పదములకు సోదర ద్రావిడ భాషలలోఁ గల రూపములను జూచినచో నీ విషయము మఱింత స్పష్టమగును.

| తమిళము | తెలుఁగు | కన్నడము |
|---|---|---|
| ఈ (మలయాళము) | ఈఁగ | — |
| ఎలి (మల) | (ఎలిక) ఎలుక | ఇలి, ఎలి (తుళు) |
| కిళి | చిలుక | గిళి |
| కుళమ్ | కొలను, కొలకు | కొళమ్, కుళ (తుళు) |
| మరమ్ | మ్రాను, మ్రాకు | మర, మ్రానూ (గోండి) |
| యానై | ఏనుఁగు | ఆనె |

పై వానిలో నొక్క తెలుఁగునఁ దక్క మిగిలిన ద్రావిడ భాషలలోఁ బదముల చివర క గ లు లేకపోవుట కనుచిత విభాగమే కారణము.

కొన్ని చోట్ల సూనిక యొక్క స్థానము మాఱుటచేఁ గొన్ని యక్షరములు లోపించుట జరుగుచుండును. మొగము-మోము; సగము-సాము; కన్యక-కన్నె; స్వర్ణకారి-సొన్నారి. పై యుదాహరణము లందలి క గ ల వలెనే కళ్ లోని కకారము కూడ లోపించుట కవకాశము కలదు. నేఁటి తమిళ వ్యవహారమునఁ గల పండితాళ్ (పండితర్ కళ్) పిరామణాళ్ (బ్రాహ్మణర్ గళ్) అను పదములలోఁ గూడ క గ ల కు లోపము కానిపించుచున్నది. ఇట్లూనిక స్థానము మాఱుట చేతనే క గ లు లోపించినచో నేక వచనముల చివర నవి చూపట్టవు. అనుచిత విభాగము జరిగి నప్పుడే యవి మూల శబ్దముల యేక వచన రూపములం దంతి మాక్షరము లుగాఁ గానఁ బడుచుండును.

ఈ కళ్ ప్రత్యయమే కాలక్రమమున ళ్, ళు, ల్, లు అను రూపములను జెందినది. క్రీ. శ. 7వ శతాబ్ది యందలి అహదనకర శాసనములో కొన్దుకళ్, పెర్దళ్ కొన్దుకలు, సాముళ్, వసిండి ముద్లు, అను వానియందు కళ్, కలు, లు, ళ్ అనున వన్నియు బహువచన ప్రత్యయములుగాఁ గానవచ్చుచున్నవి. తరువాతఁ గ్రమముగా వాని స్థానమున లు వర్ణమే విల్చి పోయినది.

చిక్కుళ్ళ తామ్ర శాసనము నందలి సంవత్సరంబుళ్ అను పదమును బట్టి యానాఁటికే క్రీ. శ. (6 వ శతాబ్ది) ళ్ అనునది ప్రాచీన బహువచన ప్రత్యయమైన కళ్ నుండి విడివడి ప్రత్యేక బహువచన ప్రత్యయముగా వ్యవహరింపఁబడుచుండె ననియు, సంవత్సరంబు మున్నగు తత్సమ పదముల చివరఁ గూడ నది వాడఁ బడుచుండె ననియుఁ దెలియుచున్నది. ఇట్టిది వాడఁబడుటకుఁ దప్పక కొన్ని శతాబ్దుల కాలము పట్టి యుండును. దీనిని బట్టి కూడఁ గ్రీస్తు శకారంభ కాలముననే తెలుఁగు సోదర భాషల నుండి వేఱై జనులచే మాటాడఁ బడు చుండె ననుట కవకాశము కలుగుచున్నది.

సమాసములు :

ప్రాక్చాళుక్య యుగమునందలి గ్రామనామములలోఁ బెక్కు రెండు పదముల కలయికచే నేర్పడిన సమాసములు. అందలి పూర్వపదము సాధారణముగా నుత్తర పదమునకు విశేషణముగాఁ గానఁబడుచుండును. ఉదా : చిన్న-పుర; చెన్ - చెరువు; ఒన్ - గోడు; తెల్ల - వల్లి; రే - గొన్టమ్ (రేగుచెట్లుగల కొండ) ప్రాలు - ఊర (ప్రాలు = బియ్యము గల గ్రామము) వేప - ఊరు; తాన్టి - కొన్ట (తాడిచెట్లుగల కొండ) పేరు - వాటక; ఇరు - పులి (ఇర్పులి) మొదలైనవి. పల్లవ విష్ణుగోపవర్మ చూరదాన శాసనములో (ముయరుర్కుటువ) ముయూర్కూడువ అను మూఁడు పదములతోఁ గూడిన సమాసము కానఁబడు చున్నది. మూఁడు, ఊర్, కూటువ అనున విందలి పదములు. సంస్కృతములో వలె ద్రావిడభాషలలో రెండింటికంటె నెక్కువ పదములతోఁ గూడిన దీర్ఘ సమాసము లుండుట యరుదు. కాని పై చూరదాన శాసనము నాఁటికే (క్రీ. శ. 7వ శతాబ్దియారంభము) పదత్రయఘటితమైన సమాసముకానఁ బడుటయు, క్రీ. శ. 2వ శతాబ్ది నుండియు (వేపూరు) రెండుపదములతో నేర్పడిన సమాసములు వాడఁబడియుండుటయు నంతకుఁ జాలకాలము పూర్వమే తెలుఁగు వ్యవహారముననుండి క్రమ వికాసము నొందుచుండె నని తెలియుచున్నది.

మూర్ధన్య ళకారము బహువచన ప్రత్యయము నందే కాక మఱికొన్ని గ్రామనామము లందును, అవి యేర్పడుటకు మూలములైన ధాతువు లందును గూడఁ గానఁబడుచున్నది. ఏళూరను నదందొకటి. (విజయనందివర్మ ఏళూరు తామ్రి శాసనము) ఇందలి మొదటి పదము పరిపాలించు అను శబ్దము గల ఏళు

అను తెలుఁగు నందలి ధాతువుతో సంబంధించి యున్నట్లు కానఁబడుచున్నది. దీనికిఁ బూర్వ రూపము అళ్. ఈ రూపము తమిళ కన్నడములం దిట్లే చూపట్టుచున్నది. తమిళమునందలి ఆ అనుధ్వని తెలుఁగున ఏ గామాఱుననుటకుఁ బెక్కు నిదర్శనము లున్నవి.

| తమి | తెలుఁగు |
|---|---|
| ఆఱ్ | ఏఱు |
| ఆణ్డు | ఏఁడు |
| ఆన్ | ఏను |

పై ఏలూరు తామ్రశాసనమునాఁటికే యిట్టి మార్పుజరిగియుండుట తెలుఁగంతకుఁ జాలకాలముపూర్వమే మూలద్రావిడమునుండి విడివడియుండెననుటకుఁ దార్కాణముగానున్నది.

ళ, ఱకారములు:

ప్రాచీనశాసనములందలి ళ, ఱకారములు తరువాతఁ గ్రమముగా లరకారములుగా మాఱుచుండుననుట కనేక నిదర్శనములున్నవి. ప్రాక్చాళుక్య శాసనములు పెక్కింటిలో నీ యక్షరములు విరివిగాఁ గానవచ్చుచున్నది. తరువాతి తూర్పుచాళుక్య శాసనములలోఁ గూడఁ గొన్ని పదములలో ళఱకారములున్నవి. నన్నయ నాఁటి కవి లరకారములుగా మార్పు చెందినవి.

ఈ విధముగాఁ బ్రాక్చాళుక్య యుగము నందలి శాసనములలోఁ గానవచ్చు పెక్కు గ్రామనామములు క్రీ. శ. ప్రథమ శతాబ్ది నాఁటికే తెలుఁగితర ద్రావిడ భాషలనుండి విడివడి దేశమున వ్యవహరింపఁ బడుచుండెనని యూహించుటకుఁ దోడ్పడుచున్నవి. గాథా సప్తశతి యందలి తెలుఁగు పదము లీ విషయమునకు బలమొసంగుచున్నవి. ఇట్లు క్రీ. శ. ఆరంభము నాఁటికే తెలుఁగు జనవ్యవహారమున నుండెనని చెప్పుటకు వీలుకలుగుచున్నను లక్ష్యములైన పదములు పెక్కు గ్రామనామములగుటయుఁ, బ్రాకృత శ్లోకములనడుమ వాడఁబడిన విడిపదములగుటయు నప్పుడు తెలుఁగున వాఙ్మయమేమైన నుండెనో లేదో ఉన్నచో నెట్లుండెనో చెప్పుట కవకాశము లేకున్నది. ఇంతకంటెఁ బ్రాక్చాళుక్యయుగమునందలి తెలుఁగునుగూర్చి యేమియుఁ జెప్పఁజాలము.



# 2. పూర్వ చాళుక్య యుగమునందలి ఆంధ్ర వాఙ్మయ స్వరూపము

ప్రాక్చాళుక్య యుగమునందలి సంస్కృత ప్రాకృత శాసనములలోఁ గనఁబడిన తెలుఁగుపదములు పెక్కు గ్రామనామములే. అవియును, గాథాసప్త శతియందలి తెలుఁగు పదములును, సంస్కృత ప్రాకృతవాక్యముల నడుమ నున్నవేకాని తెలుఁగు వాక్యములలో వాడఁబడినవి కావు. వానివలన నప్పుడు తెలుఁగు జనవ్యవహారమున నుండెనని చెప్పనగునేకాని యందు వాక్యనిర్మాణ మెట్లుండెనో, పదములఁ గూర్చుపద్ధతి యెట్లుండెనో, వ్యాకరణ నియమము లేవి యనుసరింపఁబడెనో చెప్పుట కవకాశము లేకున్నది. తూర్పుచాళుక్య రాజులు కొన్ని శాసనములను దెలుఁగుభాషలోనే వ్రాయించిన కతమున వానినుండి యప్పటి తెలుఁగుభాష పరిస్థితి నంతకుఁ బూర్వముకంటె స్పష్టతరముగా నెఱుంగుటకు వీ లేర్పడుచున్నది. అందుచేఁ బూర్వచాళుక్య పరిపాలనారంభ మాంధ్రభాషావికాసము నందలి యొక విస్పష్టమైన పరిణామదశను సూచించు చున్నదని చెప్పవచ్చును.

ఈ కాలమున నాంధ్రదేశమునందలి విస్తారమైన భాగము పూర్వచాళుక్య రాజుల పరిపాలనముననే యుండినను గృష్ణానదికి దక్షిణమునందలి కొంత ప్రదేశమును మాండలికులైన యితరరాజులు కూడఁ బాలించియుండిరి. వారిలో రేనాటి చోళులు, బాణవంశీయులు, వైదుంబులు ముఖ్యులైనవారు. వీరు తెలుఁగు వారగుటచేఁ దమశాసనములను గొన్నింటిని దెలుఁగుభాషలోనే వ్రాయించి యుండిరి. ఈ కాలమునందలి తెలుఁగుభాష పరిస్థితి నెఱుంగుటకు ఈ శాస నములు కూడఁ గొంత వఱకుఁ దోడ్పడఁ జాలును. అందుచే వీరినిగూర్చి యిచ్చటఁ గొంత తెలిసికొనవలసి యున్నది.

క్రీ. శ. 7వ శతాబ్ది యారంభమున భారతదేశమును దర్శింప వచ్చిన హ్యూన్‌త్సాంగు దక్షిణదేశయాత్ర చేయుచు నాంధ్రదేశమునందలి బౌద్ధక్షేత్ర ములను సందర్శించిన పిమ్మట ధాన్యకటకమునకు నైఋతి దిశనున్న చుళియ

(Chuli-ya) దేశమున కలిగెనని తెలియుచున్నది. ఇక్కడ చోళవంశీయులు కొంత కాలమునఁ బరిపాలించుచుండిన కతమునఁ నాతఁడా చోళశబ్దమునే కొంచెము వికృతముగ "చుళియ" యని పేర్కొని యుండెను. ఈ చోళులకును దాక్షిణాత్య చోళులకును ఎట్టిసంబంధమును లేదు. "వీ రాంధ్రదేశీయులు గనే కన్పట్టుచున్నారు. వీరి ఆదిమ నివాసమైన చోళవాడి తెలంగాణములోని నల్ల గొండ మహబూబు నగర ప్రాంతముగా నుండెను."[1] వీరు మొదట స్వతంత్రులు గనే యుండినను దరువాత బాదామి చాళుక్యులకు సామంతులై "రేనాడు ఏడు వేల దేశమును" బాలించి యుండిరి. హ్యూన్‌త్సాంగు చుళియ దేశము భయంకరములగు నడవుల తోడను, సారహీనములైన భూముల తోడను, క్రూరులైన మోటు మానిసుల తోడను, దారి దోఁపుడుకాండ్ర తోడను గూడియుండె నని వర్ణించెను. బ్రిటిషువారి పరిపాలనకు రాకముం దిప్పటి కడప మండలము స్థితి కొంచెమించుమించుగా నట్లే యుండుటచే నాతఁడు వర్ణించిన యా చుళియ దేశమిదియే యై యుండునని భావింప వచ్చును.[2] ఈ చోళ రాజులు తాము పాలించిన దేశము రేనాటి యేడువేల దేశమని తమ శాసనములలోఁ బేర్కొని యుండుటచే వీరికి రేనాటి చోళులను పేరు కలిగినది. వీరు కరికాల చోడుని సంతతి వారనియు, సూర్య వంశీయు లనియు, కాశ్యప గోత్రు లనియు నా శాసనముల వలననే తెలియుచున్నది.[3] ఇవి కడప మండల మందలి ప్రొద్దుటూరు, జమ్మలమడుగు తాలూకాలలోఁ గానఁబడినవి. ఈ శాసనములలో ధనఞ్జయుఁడు, చోళ మహారాజు, పుణ్య కుమారుఁడు (పోర్ముఖ రాముని కుమారుఁడు), విక్రమాదిత్య చోళ మహారాజు, పృథివీ వల్లభ విజయాదిత్య చోళ మహారాజు, సత్యాదిత్యుఁడు అను రాజుల పేర్లు పేర్కొనఁబడియున్నవి. హ్యూన్‌త్సాంగు భారత దేశమును జూడ వచ్చినది క్రీ. శ. 7వ శతాబ్ది పూర్వార్ధ మగుటచే నీ రాజులు క్రీ. శ. 7, 8 శతాబ్దములలోఁ బాలించియుండి రని తలంప వచ్చును. కాని ఎపిగ్రాఫికా ఇండికా 27 వ సంపుటములో (పుట 221) శ్రీ నీలకంఠశాస్త్రి వేంకటరామయ్య గార్లు ఎరికల్ముతు

1. ఆం. చ. సం. పుట 231.

2. ఆంధ్రదేశ కథా సంగ్రహము - పుట 343 (చి. వీ.).

3. "శ్రీహరి దుర్ధర రావర భుజ్జాసి భాసుర ప్రసన్గ ప్రద్యోత దినకరకుల నన్దన కాశ్యప్ప గోత్ర కరికాళాన్వయ శ్రీమత్ చోళ మహారాజులు రేనాణ్డు ఏఱు వేల వేళ్" ధికిరాజు శాసనము, S. I. I. X No. 594.

రాజు ధనంజయుని కలమళ్ళ శాసనము క్రీ. శ. 6వ శతాబ్ది తుదిభాగములోని దని నిర్ణయించి యుండుటచే 6 వ శతాబ్ది నుండియు వీరి పాలనము సాగుచుండె నని చెప్పవలసి యున్నది. ఇదియే సత్యమైనచోఁ దొలుఁదొల్తఁ దెలుఁగు భాషలో శాసనము వ్రాయించిన కీర్తి పూర్వ చాళుక్యులకుఁ గాక రేనాటి చోళులకే దక్కును. పూర్వ చాళుక్యులు సార్వభౌము లగుటచేతను రేనాటి చోళులు మాండలికులై చిన్న రాజ్యమును మాత్రము పాలించినవా రగుటచేతను ఆంధ్ర విషయమునఁ దెలుఁగు నిల్పిన గౌరవము చాళుక్యులకే యాపాదింపఁ బడుచున్నది. నన్నిచోడుఁడు చోడవంశీయుఁ డయ్యును చోళరాజులకుఁ దక్కవలసిన గౌరవమును చాళుక్యుల కాపాదించుటలో విశేషోద్దేశ ముండవలెను. ఈ తెలుఁగు చోళు లాత నికి మిక్కిలి ప్రాచీను లగుటచే వారి యునికియు సేవయు నాతనికిఁ దెలిసి యుండక పోవలెను. లేదా వారు తెలుఁగును సాహిత్య ప్రయోజనములకుఁ గాక నిత్య వ్యవహార సంబంధములకును శాసనాది ప్రయోజనములకును మాత్రమే వాడి యుండుటచే నన్నిచోడుఁడు దానినంత గణనీయముగఁ దలఁచియుండక పోవలెను. తెనుంగు నిలుపుట అనఁగా వాఙ్మయ క్షేత్రమునందు దానికి స్థానము కల్పించుట అని యర్థము చేసినచో ఆ విధి నిర్వహించినవారు చాళుక్యులే యనుటలో నస త్యము లేదు. అందుచేఁ గాలక్రమమును బట్టి వీరి శాసనములు రేనాటి చోళుల శాసనముల కంటెఁ దరువాతి వైనను దెలుఁగు భాషను వెలుఁగునకుఁ దెచ్చిన గౌర వము వీరికే చెందుట యసమంజసము కాదు.

బాణరాజులు బలిచక్రవర్తి కుమారుఁడైన బాణాసురుని వంశమునకుఁ జెందినవా రని తెలియుచున్నది. వీరు శైవమతావలంబులు. అసిత కేతనులు. వృషభలాంఛనులు. నందీశ్వర భక్తులు. వీరికి మొదట మైసూరు రాజ్యమునందలి కోలారుమండలములోని ఆవణ్యనగరమును, దరువాత నుత్తరార్కాడు మండల ములోని తిరువళ్లమును, రాజధానులుగా నుండెను. ఈ తిరువళ్లమునకు బాణపుర మను నామాంతరము గలదు. " ఈ మహాబాణుల రాజ్య మాంధ్రపథమునకుఁ (వడుగావళికి) బడమట నున్నదని కొన్ని శాసనములు తెల్పుచున్నవి. ఆంధ్రమం డలములోని 12000 గ్రామములు వీరి రాజ్యములోఁ జేరియుండెను. వీరు స్వతం త్రులు కాక పల్లవరాజులకును, గాంగపల్లవరాజులకును, లోఁబడిన మాండలికు లై ప్రఖ్యాతిగన్నవారుగఁ గన్పట్టుచున్నారు. విద్యానాథపండితుఁడు బాణవంశమును

గూర్చి ప్రతాపరుద్రీయమునందుఁ బ్రశంసించియున్నాఁడు."[1] ఈ బాణరాజుల శాసనములు పెక్కు కడప, అనంతపురము జిల్లాలలోఁ గానవచ్చినవి. వానిలో మహాబలి బాణరాజు కాలమున ( క్రీ. శ. 9వ శతాబ్ది చివరి భాగమున ) వ్రాయఁబడిన శాసనమొకటి ( No. 543 ) సోర్మడి యుద్ధమును బ్రశంసించుచున్నది. మహాబలి బాణరాజు వైదుంబ రాజగు గండత్రినేత్రునితోఁగలసి నలంబరాజుతో ఘోరయుద్ధము గావించెను. మహాబలి బాణరాజు విజయాదిత్య పరచూడామణి ప్రభుమేరుని కాలమునందలి మఱియొక శాసనము ( No. 542 of 1906 ) బాణరాజు వడుగావళిలో ( ఆంధ్రపథములో ) 12000 గ్రామములను, మన్నెలో 200 గ్రామములను బరిపాలించుచుండె నని తెల్పుచున్నది. కడపటి చోళులశాసనముల వలన బాణదేశము పడమట పుంగనూరు వఱకును దూర్పున కాళహస్తి వఱకును వ్యాపించినట్లు తెలియుచున్నది. క్రీ. శ. 10వ శతాబ్ది పూర్వార్ధమున రాజ్యమేలిన మొదటి పరాంతకుఁ డను తంజాపుర చోళరా జిరువురు బాణరాజులను సంహరించి వారిదేశమును గాంగుఁడైన రెండవ పృథివీపతికి బహుమానముగా నిచ్చినట్లు 1900—1901 సంవత్సరములకుఁ జెందిన సాంవత్సరిక నివేదికలో వ్రాయఁబడి యున్నది ఈ కారణముచేతనే కాఁబోలు బాణవంశమునకుఁ జెందిన యొక కుటుంబమువా రాంధ్రదేశమునందలి యుత్తరభాగమునకు వచ్చినట్లు కాన్పించుచున్నది. గుంటూరు మండలమునకుఁ జెందిన కొణిదెన గ్రామములో బాణవంశజుఁడైన శూరబలిరాజు యొక్క పంద్రెండవ శతాబ్దిలోని శాసన మొకటి లభ్యమగుచున్నది. దీనినిబట్టి బాణరాజులు క్రీ. శ. 9వ శతాబ్ది మధ్యభాగమునుండి క్రీ. శ. 12వ శతాబ్ది వఱకు నిప్పటి యుత్తరార్కాటు జిల్లాను ఆంధ్రదేశమునందలి యుత్తరభాగమునఁ గొంత ప్రదేశమును బాలించిన ట్లూహింపవచ్చును. వైదుంబ మహారాజుల శాసనములు కడప కోలారు మండలములలోను చిత్తూరు జిల్లాలోని పెద్దతిప్ప సముద్రము, మదనపల్లి, చిప్పిలి, ముడివేడు, తుపాకులోల్లపల్లి, రామానాయనికోట మున్నగు గ్రామములలోను దొరకినవి. వీరు రాష్ట్రకూటులకును, నలంబులకును, చోళులకును, లోఁబడి ఆంధ్రకర్ణాటకదేశము లందలి కొంతప్రదేశమును బాలించి యుండిరి. వీరిలో గండత్రినేత్రుఁడను రాజుపేరు మదనపల్లి,[2] పెదతిప్ప సముద్రము[3] శాసనములలోఁ జేర్కొనఁబడియున్నది. ఇతఁడు మహాబలి బాణరాజుతోఁ

1. చి. వీ. ఆంధ్రుల చరిత్ర Vol. I. పుట 353.
2 Ep. Car. Vol. Intro. P. XX.
3. S. I. I. Vol. III 104, 107.

గలసి సుప్రయోగా నదీతీరమునందలి కోట్మడి (ఖారమతి) యొద్ద నలంబాధిరాజగు దాడిగతోడను. రాచమల్లుని తోడను, ఘోరసమర మొనరించియుండెను. ఈ కోట్మడి యుద్ధము క్రీ. శ. 9వ శతాబ్ది తుదిపాదమున (క్రీ. శ. 880 ప్రాంతము) జరిగిన ట్లూహింపఁ బడినది. పైని పేర్కొనఁబడిన శాసనములలోఁ బెక్కు యుద్ధమున నిహతులైన వీరుల పరాక్రమమును బ్రశంసించు నట్టివే. గండత్రినేత్రుఁడే వైదుంబరాజులలోఁ గడపటి స్వతంత్రరాజుగాఁ గానవచ్చుచున్నాఁడు. అతని యనంతరము చోళరాజైన మొదటి పరాంతకుఁడు వారి నోడించి సామంతులుగా నొనరించెను. క్రీ. శ. 960, 964 సంవత్సరములకు నడుమ వ్రాయఁబడిన కీలూరు శాసనములలో రాష్ట్రకూట రాజైన మూఁడవ కృష్ణునకు లోఁబడిన చందయ తిరువయ్యా యను వైదుంబరాజు పేర్కొనఁబడి యున్నాఁడు. ఉప్పరపల్లికి సమీపమున నున్న యొక శాసనములో భువన త్రినేత్ర శ్రీమత్ వద్యుంబ మహారాజు శా. శ. 894 (క్రీ. శ. 972) వ సంవత్సరమునఁ బట్టాభిషిక్తుఁడై నట్లు తెలుపఁబడియున్నది. అందుచే నీ వైదుంబరాజులు క్రీ. శ. 9వ శతాబ్ది నడిమిభాగము నుండి 10వ శతాబ్ది యుత్తరభాగము వఱకును సుమారొక శతాబ్దికిఁ బైగా రాజ్యము పాలించిరని చెప్పవచ్చును.

పూర్వచాళుక్య యుగమునందు లభించు నాంధ్రవాఙ్మయ మంతయుఁ బ్రధానముగా శాసనాత్మకమైనదే. శాసనములు సాధారణముగా నే దేవునికో, దేవాలయమునకో, బ్రాహ్మణునికో, మతాచార్యునికో యొసంగఁబడు దానములను సూచించుటకో, రణనిహతులైన మహావీరుల పరాక్రమమును బ్రశంసించుటకో వ్రాయింపఁబడి యుండును. వీనిలోఁ బెక్కు దేవాలయ కుడ్యములందో స్తంభములందో కానవచ్చును. ఇవి సామాన్యముగాఁ బ్రజలందఱకును బ్రత్యేకముగా దానవిషయముతో సంబంధముగల గ్రామమునందలి జనులకును ఉద్దేశింపఁబడి యుండును. వారా శాసనము లందలి విషయములను జూచి దాత యుద్దేశములు సంపూర్ణముగాఁ గొనసాగుటకుఁ దోడ్పడవలయు నని తత్ప్రతిష్ఠాపకుల యాశయము. వీనిలో నొక్కొక్కప్పుడు దాతృప్రతిగ్రహీతల వంశములయు గుణగణములయుఁ బ్రశస్తులును, దత్తములైన గ్రామముల సీమాదులును వివరింపఁబడి యుండును.

పూర్వ చాళుక్యరాజులలోఁ గొందఱు దేశభాషలయందలి యభిమానముచేఁ దమ శాసనములను దెలుఁగు భాషలో వ్రాయించినను బలువురు పూర్వ సంప్ర

దాయము ననుసరించి వానిని సంస్కృత భాషలోఁ గూడ వ్రాయించి యుండిరి. ఈ సంస్కృత శాసనములలో దాతృప్రతిగ్రహీతల వంశగుణాది వర్ణనమంతయు సంస్కృతమువనే యుండును గాని గ్రామ క్షేత్ర సీమాదులను వివరించు భాగము మాత్రము తెలుఁగుననే వ్రాయఁబడును. దత్తములైన గ్రామ క్షేత్రముల సంగతి సంస్కృతము రాని సామాన్య జనులకుఁ గూడఁ దెలియ వలయు నను నుద్దేశమే యీ భాగమిట్లు తెలుఁగున వ్రాయఁబడుటకుఁ గారణము. ప్రాక్చాళుక్య యుగము నందలి సంస్కృత ప్రాకృత శాసనములలో వలెఁ గాక యీ భాగములందు గ్రామముల తోపాటు వానికి సంబంధించిన వివరణ మంతయుఁ దెలుఁగుననే యుండును. ఉదా: అస్యావధయః. పూర్వతః కొతనడిపియ చెఱువు పడుమటి కట్ట ఆగ్నేయతః మ్రోంతు కత్తియుం బాలూరియు రణస్తిపూండియు ముయ్యాలికుట్టున వెలంగ గుణ్ణ పడుమటికట్ట. దక్షిణతః పెంజెఱువు కట్టడిగ్గు త్రోవ. నైరి (ఋ) త్యతః పాలూరియుం గోరుకోటియు రణస్తిపూండియు ముయ్యాలి కుట్టు చింత గుంట. పశ్చిమతః కోఱుకోటి పొదఱు. వాయవ్యతః ఋల్ల సీమైవ సీమా. ఉత్తరతః కఱిపత్తియు నేత్తియు సీమైవ సీమా. ఐశానతః ఏత్తియు మ్రోన్తు కత్తియు రణస్థిపూండియు ముయ్యాలి కుట్టు (విమలాదిత్యుని రణస్థిపూండి తామ్ర శాసనము). దీనిని బట్టి "దక్షిణతః పెంజెఱువు కట్ట డిగ్గు త్రోవ" మున్నగునవి కేవల తెలుఁగు వాక్యములని తెలియుచున్నది. కొన్ని వాక్యములలో "పాలూరియుం గోరుకోటియు" మున్నగుచోట్లఁ దెలుఁగు వ్యాకరణమునకు సంబంధించిన సరళాదేశము కూడఁ గాన వచ్చుచున్నది. అందుచే నీ సంస్కృత శాసనములు సైత మప్పటి తెలుఁగుభాష స్వరూపము నెఱుంగుట కించుక తోడ్పడు ననుటలో సందేహము లేదు.

ఈ కాలపుఁ దెలుఁగు శాసనములను (1) గద్యమయ శాసనములు, (2) పద్యమయశాసనములు, (3) పద్యగద్యమయశాసనములు అని మూఁడువిభాగములు చేయవచ్చును. గుణగ విజయాదిత్యుని కాలమునకుఁ జెందిన కందుకూరి శాసనమున సీసపద్య మొక్కటే యున్నది. క్రీ. శ. 1000 ప్రాంతమునకుఁ జెందిన విరియాల కామసాని గూడూరి శాసనమున మూఁడుత్పల మాలలును రెండు చంపక మాలలును గలవు. ఇంతవఱకు లభించిన శాసనములలో నీ రెండే కేవల పద్యమయ శాసనములుగాఁ గనవచ్చు చున్నవి. దక్షిణ హిందూదేశ శాసనములు పదవ సంపుటములోని 2 వ పుటలోఁ గల ధర్మవరము నందలి శాసన మొకటి

పద్యమయ మని యూహింపఁ బడుచున్నది. అట్లే ఆఱవ సంపుటము నందలి 585 వ సంఖ్య గల జయసింహ వల్లభుని విప్పర్తి శాసనము కూడఁ బద్య మయ మగానే కనఁబడు చున్నది. కాని యిందలి పద్యము లేవో నిర్ణయించుటకు వీలు లేకున్నది. యుద్ధమల్లుని బెజవాడ శాసనమున నైదు పూర్తి మధ్యాక్కర లున్నవి. ఆఱవ మధ్యాక్కర లోని మొదటి పంక్తి యందు నాలుగు గణములపై నొక యక్షరమును మాత్రము చెక్క యే హేతువు చేతనో శాసన లేఖకుఁడు విడిచి పెట్టి యుండెను. నాల్గవ మధ్యాక్కర తరువాతఁ గల "దీని జేంబ్రో" లిత్యాదిగాఁ గల యేడు పంక్తుల భాగము పద్య బంధముగాఁ గాక గద్యము వలెనే కన్పట్టు చున్నది. అందుచే నీ శాసనమును బద్య గద్యమయ శాసనములలోనే చేర్పవలసి యున్నది. క్రీ. శ. 848 నాటి పండరంగుని అద్దంకి శాసనము కూడ గద్య పద్య మయ మైనదే. ఇందొక తరువోజ పద్యమును దరువాతఁ బండరంగఁ డాదిత్య భట్టారకుని కెనుబొదిపుట్ల అఱ్ఱపట్టు నేల దానము చేసిన విషయమును దెలుపు చిన్న గద్యమును గాన వచ్చుచున్నవి. చాళుక్య భీమ మహారాజు ధర్మవరము శాసనములో మొదటఁ గొంత గద్యమును బిమ్మట నొక సీస పద్యమును నున్నవి. జయసింహ వల్లభుని విప్పర్ల శాసనము (641) కపోతేశ్వర స్వామి ఆలయము లోని చేజెర్ల శాసనము, లక్ష్మీపురశాసనము (680) మూఁడవ విజయాదిత్యుని ధర్మ వరము శాసనము (850) మున్నగు తూర్పు చాళుక్యుల శాసనములును బైని పేర్కొనఁ బడిన రేనాటి చోళులయు బాణవైదుంబ రాజులయు శాసనములును వచనములో నున్నవి. క్రీ. శ. 740 నాఁటిదని కొందఱును 840 నాఁటిదని కొంద ఱును దలంచుచున్న ఆహదనకర శాసనమున మొదటఁ గొంత సంస్కృతమును దరువాతఁ గొంత తెలుఁగును గాన వచ్చుచున్నవి. ఇవిగాక యింతవఱకును బ్రచురింపఁ బడని శాసనము లింకను అనేకము లున్నవి. ఇవి యన్నియు గద్య మయములే యని తెలియు చున్నది.

సంస్కృత భాషలో నాదికావ్యమైన రామాయణ మాద్యంతము శ్లోక రూపముగనే రచింపఁబడినది. మహాభారతమున నచ్చటచ్చట మూఁడు నాలు గధ్యాయములు వచనములో వ్రాయఁబడినవి యున్నను[1] అదికూడ శ్లోకమయము గానే పరిగణింపఁబడుచున్నది. పురాణము లన్నియు శ్లోక రూపము లైనట్టివే. కాళిదాసాదుల రఘువంశాది కావ్యములలో నెచ్చటను వచనములేదు. బాణుఁడు

1. 3-90 అధ్యాయములు ఆది. B. O. R. Edition.

వ్రాసిన కాదంబరి హర్షచరిత్రము లందును, దండిరచిత దశకుమార చరిత్రము నందును, అచ్చటచ్చటఁ గొన్ని శ్లోకము లున్నను అవి గద్యకావ్యములుగానే పరిగణింపఁబడు చున్నవి. సంస్కృతమునందలి నాటకములు గద్యపద్యమయ ములే యైనను ప్రత్యేకశాఖగా నేర్పడి యున్నవి. దండి కావ్యాదర్శమునఁ జంపూ శబ్దము కావఁబడుచున్నది.[1] సాహిత్య దర్పణకారుఁడు "గద్యపద్యమయం కావ్యం చంపూరిత్యభిధీయతే" అని చంపూకావ్యమును నిర్వచించెను. (కారిక 569). దీనినిబట్టి గద్యపద్యోభయాత్మకములైన నాటకములును, పై కాదంబర్యా దులును జంపూ కావ్యములే కావలయును. కాని యీశబ్దము నలచంపువు, రామా యణచంపువు, మున్నగు కావ్యములకే కాని పైవానికి రూఢముగా వాడఁబడు చుండుటలేదు. క్రీ. శ. 10వ శతాబ్దిలోని త్రివిక్రమభట్టు నలచంపువునకు (915 A. D.) ముందు సంస్కృతమున నిజమైన చంపూకావ్యము లేదనియే చెప్ప వచ్చును.

అరవము, మలయాళము, కన్నడము, తెలుఁగు మున్నగు భాషలన్నియు ద్రావిడకుటుంబమునకే చెందినను వానిలోఁ దెలుఁగు కన్నడములకుఁ బురాతన కాలమునుండియుఁ జాల సన్నిహితమైన సంబంధము గోచరించుచున్నది. వ్యాకరణలిపి ఛందస్సంప్రదాయములలోఁ గల సమానత్వమును, మతసాంఘిక పరిస్థితులం దేర్పడిన పరస్పర సంబంధమును, రాజకీయముగాఁ దెలుఁగు కన్నడ దేశములు కొంతకాల మొకే యేల్పడియం దుండుటయుఁ బై రెండు భాషలకును సాన్నిహిత్య మావహిల్లుటకు హేతువు లైనవి. ఈ రెండు భాషలును మూల ద్రావిడమునుండి యెప్పుడు విడివడెనో నిశ్చయముగాఁ జెప్పుటకుఁ దగిన యాధారములు లేవు. కాని తెనుఁగునందుఁ గంటెఁ గన్నడముననే కావ్యరచన ముందుగా సాగియుండెనను మాటమాత్రము తథ్యము. ఆకారణముచేఁ దెలుఁగు వారు పెక్కు సాహితీ సంప్రదాయములను గన్నడకవులనుండి గ్రహించి వానిని దెలుఁగు భాష కనుగుణమగు తీరునఁ బెంపొందఁజేసి యుండిరి. అట్టి వానిలో నీ చంపూకావ్య రచనపద్ధతి యొకటి. కన్నడమున పంప, పొన్న, రన్న మున్నగు కవులు రచించిన కావ్యము లన్నియుఁ జంపూజాతికిఁ జెందినవే. ఆ పద్ధ

---

1. గద్యపద్యమయీ కాచి చ్చంపూ రిత్యపి విద్యతే.

తిని జూచి నన్నయయు, నన్నయను జూచి తరువాతి మహాకవులును దెలుఁగున గావ్యములను రచించినప్పు డా చంపూ మార్గమునే యవలంబించియుండిరి.

సంపూ (చంపూ) శబ్దమునకుఁ గన్నడ తులు భాషలలో "కలయిక, మనోహరము" అను నర్థము లున్నవి. దీనికి చంబూ అని రూపాంతరము. జైమిని భారతమున (1 ఆశ్వా. ప. 107) జంబూ అని ప్రాసస్థానమున వాడఁబడి యున్నది. గద్యపద్యముల కలయికతోఁ గూడిన కావ్యమునకే సంస్కృతమునఁ జంపూ కావ్య మను పే రుండుటచేతను, క్రీ. శ. 7వ శతాబ్దిలో నుండిన దండి మహాకవికిఁ బూర్వ మట్టి చంపూ కావ్యములు సంస్కృతమున లేకుండుట చేతను ఈ పద్ధతి ద్రావిడభాషాసాహిత్యమునకే విసర్గమైనదనియు, నందుండియే సంస్కృతమునఁ జొచ్చియుండుననియు నూహింప వీలగుచున్నది. దండి మహా కవి దాక్షిణాత్యుఁడగుటచేఁ గన్నడమునందలి చంపూ పద్ధతిని గాంచియే కావ్యా దర్శమున దానినిగూర్చి చెప్పియుండవచ్చును. లేనిచో నాతఁడు సంస్కృతమునఁ బ్రసిద్ధములైన లక్ష్యములు లేకుండనే దానికి లక్షణము నిర్దేశించెనని చెప్పవలసి వచ్చును. తరువాత నలచంపువు, యశస్తిలక చంపువు, రామాయణ చంపువు ఆ భాషయందుఁ జంపూ కావ్యజాతికిఁ జక్కని యాదర్శములైనవి.

కన్నడమునఁ బంప మహాకవికిఁ బూర్వము గూడఁ గొందఱు మహా కవు లుత్తమమైన కావ్యములు రచించియుండి రని కవిరాజ మార్గమువలనఁ దెలియుచున్నది. వీరిలోఁ గొన్నిటిలో నీచంపూ మార్గమే యనుసరింపఁబడి యుండును. వానిని జూచియే తెలుఁగు శాసన కావ్యకర్తలు శాసనములందు గద్యపద్య మిశ్రితమైన రచన సాగించి యుందురు. తరువాత నన్నయభట్టారకుఁడు భారతము నాంధ్రీకరింపఁబూని కన్నడ మహాకవులు చూపిన యాదర్శమును, మిత్రుఁడైన నారాయణభట్టు నుపదేశమును బ్రేరేపఁగాఁ జంపూ పద్ధతినే యనుస రించెను. అందుచే నీ చంపూపద్ధతి నన్నయ క్రొత్తగాఁ దెచ్చిపెట్టినది కాదనియు దానికి బీజములు క్రీ. శ. 9వ శతాబ్దిలో వ్రాయఁబడిన తెనుఁగు శాసనములందును, దత్పూర్వ కన్నడ వాఙ్మయమందును గోచరించు చున్నవనియుఁ జెప్పవచ్చును.

తెలుఁగున వ్రాయఁబడిన పద్యసహితములైన శాసనములలో మొదటి దద్దంకి శాసనము. ఇది క్రీ. శ. 848 నుండి 892 వఱకును బరిపాలించిన పూర్వ చాళుక్య మహారాజగు గుణగ విజయాదిత్యుని ప్రథమ రాజ్యసంవత్సరము నాఁటిది.

ఇందు రాజు సేనాపతియగు పండరంగని పరాక్రమమును, ఆతఁడాదిత్య భట్టారకుని కొనరించిన భూదానమును వర్ణింపఁబడినవి. ఈ పండరంగఁడు గుణగ విజయాదిత్యుఁడు పట్టాభిషిక్తుఁడైన సంవత్సరమునందే సైన్యాధిపత్యమున నియమింపఁబడి, సామంత సేనలతోఁబోయి, బోయరాజుల (కొట్టములు) కోటలు పండ్రెండు పట్టుకొని, త్రిభువనాంకుశ బిరుద ధారులైన చాళుక్యరాజుల వేంగిరాజ్యమును బెంపొందించి వారిధ్వజమును బ్రతిష్ఠించెననియుఁ, గట్టెపు దుర్గమును పాడుచేసి, కందుకూరును మెచ్చి బెజవాడయంత పట్టణముగా నొనరించెననియు దీనివలనఁ దెలియుచున్నది.

ఈ శాసనమున నాజ్ఞప్తి పేరుగాని కర్తృలేఖకుల పేర్లుగాని తెలుపఁబడి యుండలేదు. ఇందుఁ బ్రస్తుతింపఁబడిన పండరంగుఁడే విజయాదిత్యుని కాలమున సాతలూరు, ఊరుటూరు, మచిలీపట్టణము, పోణంగి మున్నగు ప్రదేశముల వేయింపఁబడిన శాసనముల కాజ్ఞప్తిగా నుండినట్లు తెలియుచున్నది. ఇతఁడు శాసనమున "అసిధారా సముచ్ఛిన్న విద్వద్బృందోప వందితః" అనియు, ఊరుటూరు పోణంగి శాసనములందు "విజయాదిత్య భూపాల పాద పద్మ శిలీముఖః" అనియు, మచిలీపట్టణపు శాసనమున "విక్రమాక్రాంత శాత్రవః, ద్వితీయ ఇవ బీభత్సుః, ప్రతాపవాన్" అనియు వర్ణింపఁబడి యున్నాఁడు. సాతలూరి శాసనము నందలి విశేషణమునఁ గొంత పొరపాటున్నట్లు తోఁచుచున్నది. విద్వద్బృందోప వందితః అని కాక విద్విడ్బృందోప వందితః అని యుండుట లెస్స. లేనిచోఁ గత్తివాదరచే ఛేదింపఁబడిన విద్వాంసుల సమూహముచే వందితుఁడైన వాఁడని యర్థము చెప్పవలసి వచ్చును. ఈ యర్థ ముచితము కాదుగదా. కావున నీవిశేషణమును బట్టి యీతఁడు మహాపరాక్రమశాలి యనియే తెలయవచ్చును కాని కవియో పండితుఁడో యని యూహించుట కవకాశము లేదు. ఈతఁడే కాక యీతని పౌత్రుఁడును ప్రపౌత్రుఁడును గూడఁ జాళుక్య రాజుల శాసనముల కాజ్ఞప్తులుగా నుండుటచే వీరికిది కులక్రమాగతముగా లభించిన యధికారమని తోఁచుచున్నది. ఇతని పౌత్రుఁడైన కడియరాజు చాళుక్య భీమునికిని, బ్రపౌత్రుడైన దుర్గరాజు రెండవ అమ్మరాజునకును నాజ్ఞప్తులుగా నుండినట్లు శాసనములు తెలుపుచున్నవి.[1] అందుచే గుణగవిజయాదిత్యుని యితర శాసనములకు వలెనే

1. మలియంపూడి దానశాసనము E. I. IX పుట 49.
ఆజ్ఞప్తి రస్య ధర్మస్య కడెయరాజః ప్రతాపవాన్
పితామహో ఽ భవద్యస్య పండరంగః పరంతపః. E. I. V. P. 132.

యీ యద్దంకి శాసనమునకును బాండురంగఁడే యాజ్ఞప్తిగా నుండెనని యనుమా వించుట కవకాశమున్నది. ఆజ్ఞప్తి పేరిందేల పేర్కొనఁబడలేదో తెలియదు. బహుశః ఇం దాతనిదే పరాక్రమమును, ఆతఁ డొనరించినదే దానమును వర్ణితము లగుటచే నాజ్ఞప్తిపేరు వేఱుగాఁ దెలుపఁబడి యుండలేదు కాఁబోలును.

ఈ శాసన కావ్యకర్తకూడ పండరంగఁడే యై యుండునని శ్రీ నిడదవోలు వెంకటరావుగా రనుమానించుచున్నారు.[1] మంత్రులు, దండనాధులు, సంధి విగ్రహులు కవులై శాసన రచయితలుగా నుండుటలో వైపరీత్యమేమియును లేని మాట సత్యమే. అతఁడే శాసనకర్తయై యుండుటచే నాత్మ శ్లాఘాదోషమును బరిహరించుటకై దానిని ప్రథమ పురుషలో రచించి యుండునని యనుకొను టయు నుచితమే. కాని యిట్లు చెప్పుట కూహ తప్ప వే ఱాధార మేమియు లేదు. పైఁగా నసిధారా సముచ్ఛిన్న విద్విద్బృందోప వందితః అను విశేషణమునకు యథాతథముగాఁ జూచినచో నర్థము పొసఁగుటలే దనియు, నది విద్విద్బృందోప వస్థితః అని యుండు టుచిత మనియు, నందుచే నీ విశేషణమునుబట్టి యాతఁడు కవియుఁ బండితుఁడు నని యూహించుట కవకాశము లేదనియు నిదివఱకు సూచించియుంటిని. అందుచే నీశాసనకర్త యెవ్వరో నిశ్చయముగాఁ జెప్పుటకుఁ దగిన యాధార మేమియు లేదు. పండరంగఁడే శాసనకర్త యని రుజువైనచో వింతపొందవలసిన యక్కఱయు లేదు.

తెలుఁగు నందలి రెండవ పద్యమయ శాసనము కందుకూరు శిలాశాసనము. ఇది కందుకూరులో లభించుటచే దీని కీ పేరు కలిగినది. ఇదియును గుణగ విజయాదిత్యుని కాలము నాఁటిదే. ఇందొక సీస పద్యము కలదు. సీస పాదములే కాని గీత పాదములు సరిగా తెలియుటలేదు. ఈ సీస పాదములైనను ముగ్గురు పరిశోధకులు మూఁడు రకములుగా పఠించిరి.[2] ఇం దన్నియు విశేషణములే కలవు. ఇవి పై అద్దంకి శాసనములోని పండరంగని గుణగణములనే వర్ణించు

1. "కావున పండరంగఁడే ఈ శాసన రచయిత యని యూహించుట యసమంజసము కాదు." తెలుఁగు కవుల చరిత్ర - పుట 25.

2. Nellore Inscriptions Vol. II 544.
ఆంధ్ర పరిశోధన మండలి పంచమ వార్షికోత్సవాధ్యక్షోపన్యాసము - కొమర్రాజు.
నెల్లూరి మండల యాత్ర. (మల్లంపల్లి సోమశేఖర శర్మగారు).

చున్నట్లు తోఁచుచున్నది. అతఁడు బోయకొట్టములఁ బొడిచిన సంగతికూడ నిందు సూచింపఁ బడినది. ఇందు "గొణకె నల్లాతని, గొణక నల్లతని, గొణకె లాత" అని గుణగ విజయాదిత్యుని పేరు కూడఁ గానిపించుచున్నది. "గుణకె ల్లాతని'' అనునది గుణకాంకియుఁడను దానికిఁ గన్నడ భాషలోఁ బ్రయుక్త మని తెలుఁగు కవుల చరిత్రలో వ్రాయఁబడి యున్నది.[1] తెలిసినంత వఱకిందలి విశే షణములు (శ్రీ నిరవద్యుండు, చిత్తజాతసముండు, శివపద వరరాజ్యసేవియుండు, అఖిలుఁడు) సంస్కృత సమాస ఘటితములై శ్రుతి సుభగమైన కూర్పు కలిగి యున్నవి. ఇందలి రచన సీసపద్యమని తొలుతఁ గనిపెట్టినవారు శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు. ఈ శాసన కావ్యకర్త యెవ్వరో తెలియదు.

చాళుక్య భీమమహారాజు ధర్మవరము శాసనమున నొక సీసపద్యమును దానికి ముందువెనుకల నల్పములైన వచన భాగములును గలవు. ఈ భీమమహా రాజు గుణగ విజయాదిత్యుని తమ్ముఁడైన విక్రమాదిత్యుని కుమారుఁడు. ఇతఁడు క్రీ. శ. 892 లోఁ బట్టాభిషిక్తుఁ డయ్యెను. ధర్మవర శాసన మీతని యెదవ విజయ రాజ్యసంవత్సరమున వేయింపఁ బడినది. ఇందలి సీస పద్యమున పండరంగఁడు తనప్రభువైన గుణగ విజయాదిత్యునిచేఁ బంపఁబడి సాధించిన విజయములు వర్ణింపఁబడినవి. ఆతఁడు భుజ గర్వమున విజృంభించిన బోయల నోడించి యడవి పాల్సేసెను. రాష్ట్రకూట భూపతియగు ఇమ్మడి కృష్ణరాజు (కన్నరాభూపతి) వెన్ను చూపి పాఱున ట్లొనరించెను. పూర్వము చేది మండల మనఁ బరఁగి ప్రస్తుతము మధ్య పరగణాలలో నున్న డాహళ లేక దాహళ యను పురమునకు రాజైన సంకి లుని గర్వ ముడిపెను. చోళరాజును జేకొని రక్షించెను. ఈ చోళరాజు దాక్షి ణాత్యుఁడు కాక ప్రస్తుత కడప మండలమం దుండిన రేనాటి యేడువేల దేశము నేలిన చోళరాజై యుండును. కిరణపురము, దాహల, నిరుతము, తఱెనాఁడు, అచలపురము మున్నగు వాని నచలితుఁడై యాక్రమించెను. ఇందు మొదటి పాదము నందలి కొంత భాగము లోపించినది. రెండవ పాదము (లోహాసనం బెక్కి రాహను నొడిచిన) నందలి రాహనుఁ డెవ్వరో తెలియుట లేదు. ఈ సీస పద్యము సమాస రహితమై యలఁతి యలఁతి మాటలతోఁ బ్రసాద గుణమున కిరవై యున్నది. దీని కర్త యెవ్వరో తెలియదు. ఈ సీసము తరువాత నయ్యాప

1. పుట 33.

రాజు తమ్ముఁడైన విజయరాజు ధర్మపురమున కీశాన్యమున నొక గుడి నిల్పెనని చెప్పఁబడినది. వీ రిరువురును పండరంగనికి సంబంధించిన వారుగాఁ గన్పట్టు చున్నారు. కాని శాసనమునఁ గొంత భాగము శిథిలమై పోవుటచే నా సంబంధ మెట్టిదో చెప్పుటకు వీలు లేకున్నది.[1]

యుద్ధమల్లుని బెజవాడ శాసన మచ్చటి మల్లేశ్వరస్వామి యాలయమందు భద్రపఱుపఁబడి యున్న యొక స్తంభము యొక్క యెదుటి ప్రక్కను, ఎడమ ప్రక్కను, కుడి ప్రక్కఁ గొంత వఱకును జెక్కఁబడి యున్నది. దాని కడుగున మహా మండలిక బంగయ నాయకుని గురువును, గుముడూరు నివాసియు నగు సీశ్వర భట్ట సోమయాజి క్రీ. శ. 1087 లో శ్రీ మల్లేశ్వరస్వామి కఖండ దీపము వెలిఁగించుటకై 55 గోవుల నిచ్చిన యొక తెలుఁగు శాసనమును, వెనుకఁ బ్రథమ కులోత్తుంగ చోళుని 41 వ విజయరాజ్య సంవత్సరమున రాజేంద్ర చోళ తెంకరై నాట్టు మూవేంద వేళా నను నామాంతరము గల అరైసూరు దైయన్ వేళాన్ కావేరీ వల్లవన్ అను నతఁడు శ్రీ మల్లేశ్వరము దైయ మహాదేవర యాలయములో నఖండ దీప మాచంద్రార్కముగా నుంచుటకై దొడ్డయ్యా యను వాని పరముగా 50 గొఱ్ఱెల నిచ్చిన యొంకొక శాసనమును గలవు. తుది రెండు శాసనములును నన్నయ కాలమునకుఁ దరువాతి వగుటచే వానితో మన కిప్పుడు పనిలేదు. మిగిలిన దంతయు నొకే శాసనము కాదనియు, నందు మొదటి ముప్పది యాఱు పంక్తులు నొక శాసనమును, గుడి ప్రక్క సీశ్వరభట్ట సోమయాజి శాసనమునకుఁ బైని గల పది పంక్తు లింకొక శాసనమును నైనట్లు కనఁబడు చున్నదనియు శాసన పరిశోధకు లభిప్రాయ పడియున్నారు. ఆ శాసనము లందలి విషయము కూడ నీ యభిప్రాయమును బలపఱుచు చున్నది.

ఇందు మొదటి శాసనమున నాలుగు మధ్యాక్కరలును దరువాత ఫలశ్రుతితోఁ గూడిన కొంత వచన భాగమును గలవు. రెండవ దానిలో నొక పూర్తి మధ్యాక్కరయుఁ బిమ్మట నింకొక మధ్యాక్కర మొదటిపాదమున విశ్రాంతి స్థానము వఱకును గల భాగమును గానఁబడుచున్నవి. మొదటి మధ్యాక్కరలో రాజసర్వజ్ఞ భువనల్లభుఁడైన యుద్ధమల్లుని ప్రశంస యున్నది. తరువాత నాతఁడు బెజవాడ యందలి కుమారస్వామికి భక్తుఁడై గుడియు నొక మఠమును గట్టించె

1. Eastern Chalukyas of Vengi, Page 150.

ననియు, నందు శైవ భిక్షుకులు తప్ప నితరులు విడిసినచో వారణాసి యందు హత్య చేసిన పాపము పొందుదు రనియు, నొక వేళ శైవేతరు లందు విడిసిన యెడల స్థానపతులను రాజును వారిని వెడలఁ గొట్టవలె ననియు, నట్లు వారు వెడలఁ గొట్టినచో నశ్వమేధ యాగ మొనరించిన ఫలమును, నుపేక్ష యొనరించి నచో లింగమునుఁ బగులఁగొట్టినంత పాపమును గలుగుననియు వర్ణింపఁబడినది. నాల్గవ మధ్యాక్కరలోఁ గుమారస్వామి చేఁబ్రోలునుండి యొకప్పుడు బెజవాడ జాతరకు వచ్చి యన్య స్థలము మెచ్చక యచ్చోటే చేకొని యందుఁ బ్రత్యక్షము కాఁగాఁ గని యుద్ధమల్లుఁ డతని కొక దేవాలయమును మఠమును గట్టించెనని రెండవ పద్యము నందలి విషయమే మఱికొన్ని వివరములతోఁ దెల్పఁబడినది. తరువాత 29 వ పంక్తిలోఁ గల "దీనిం జేంబ్రో" లిత్యాదిగా 39 వ పంక్తి వఱకును గల భాగమే పద్యమునకును జెందినట్లు కానరాక పోవుటచే వచనమే యని భావింపఁబడుచున్నది. ఇందు మామూలుగా శాసనాంతము లందుఁ జెప్పఁబడు ఫలశ్రుతి కానవచ్చుచున్నది. రెండవ శాసనములో బెజవాడకు బెడంగుగాను రక్షగాను తమ తాత మల్లపరాజు కట్టించిన గుడికి కలశ మెత్తించినట్లు యుద్ధమల్లుఁడు ముఖమండపము కట్టించెనని తెల్పఁబడినది. తరువాతి యసంపూర్ణ పద్య పాద మీ ధర్మమును బాలించువారికిఁ బుణ్యమును జెఱుచువారికిఁ బాపమును గలుగుననను భావమును సూచించుటకై వ్రాయఁబడిన పద్యము లోనిదిగాఁ దోఁచుచున్నది.

పై రెండు శాసనములను నిరువురు యుద్ధమల్లులచే వేయింపఁబడినట్టివి. అందు మొదటివాఁడు తాత. రెండవవాఁడు మనుమఁడు. తాత కట్టించిన గుడికి మనుమఁడు ముఖమండపమును గట్టించెను. చాళుక్యవంశమున క్రీ. శ. 844 మొదలు 890 వఱకును బరిపాలించిన గుణగవిజయాదిత్యునికి యుద్ధమల్లుఁ డను తమ్ముఁ డొకఁ డుండెను. ఆతని కొడుకు తాడరాజు. అతనికి యుద్ధమల్లుఁ డను పుత్రుఁడుండెను. ఇతఁడు క్రీ. శ. 927 నుండి యాఱేడు సంవత్సరములు వేంగిరాజ్యమును బాలించెను. వీ రిరువురే పైశాసనములను వేయించిన తాతయు మనుమఁడు నైన యుద్ధమల్లులని శాసనపరిశోధకులు చెప్పుచున్నారు. ఇందు మొదటివాఁడు స్వతంత్రముగా రాజ్యమేలకపోయినను అన్నయగు గుణగవిజయాదిత్యునితోఁ గలసి ప్రజాపాలనము చేసినట్లు శక్తివర్మ ప్రభుబళ్ళుశాసనము

వలనఁ దెలియు చున్నది.[1] దీనినిబట్టి మొదటి శాసనము క్రీ. శ. 885 ప్రాంతము నను రెండవది క్రీ. శ. 930 ప్రాంతిమునను వ్రాయింపఁబడి యుండునని నిశ్చయింప వచ్చును. ఇందలి యక్షరముల స్వరూపముకూడ నివి యాకాలమునకుఁ జెందినవే యని రూఢి పఱుచుచున్నవి.

చేఁబ్రోలునం దుండిన కుమారస్వామియే జాతరకు బెజవాడవచ్చి యా చోటు సౌందర్యమున కలరి, యెుండుచోటు మెచ్చక యచ్చటనే ప్రత్యక్ష మయ్యెనని శాసనములో నున్నది. ఈ చేఁబ్రోలు గుంటూరునకుఁ దొమ్మిదిమైళ్ల దూరమున బాపట్ల తాలూకాలోఁ గలదు. అచ్చటఁ బూర్వమొక షణ్ముఖాలయ ముండెననియు దానినిబట్టి దానికి షణ్ముఖపుర మను నామాంతరముకూడఁ గలిగెననియుఁ గొన్ని శాసనములవలనఁ దెలియుచున్నది. ఇప్పు డా దేవాలయము లేనిమాట సత్యమేయైనను క్రీ. శ. 1213 ప్రాంతమునఁ గాకతీయ గణపతిదేవుని రాజ్యకాలములో నక్కడ నాగుడి యున్న ట్లొక శాసనము తెలుపుచున్నది.[2] బెజవాడ శాసనము చెప్పుచున్న ట్లంతకుఁ బూర్వమే కుమారస్వామి జాతరకై బెజవాడ కేగి యచ్చటనే స్థావర మేర్పఱుచుకొని యుండ యుద్ధమల్లుఁ డాతని కందు దేవాలయము నిర్మించెనని తెలియుచుండఁగాఁ జేఁబ్రోలులో గణపతి దేవుని కాలమున గుడి యుండుట యెట్లు పొసఁగునని సందియ ముదయింప వచ్చును. దీనికి యుద్ధమల్లుని బెజవాడ శాసనములో[3] కీ. శే. జయంతి రామయ్యపంతులు గారు రెండు సమాధానములు చెప్పియున్నారు. "చేఁబ్రోలులోని విగ్రహమును యుద్ధమల్లుఁడు బెజవాడలోఁ బ్రతిష్ఠించెననియు, దానిని మఱికొంత కాలమునకుఁ జేఁబ్రోలు నివాసులు తిరిగి తమ గ్రామమునకుఁ గొనిపోయిరనియుఁ జెప్ప వచ్చును. లేదా యుద్ధమల్లుఁడు ప్రతిష్ఠించినది నూతన విగ్రహమనియు, దాని యందు జనులకు భక్తిహెచ్చుటకై సుప్రసిద్ధమైన చేఁబ్రోలు దేవుని సత్త్వమే యీ నూతన విగ్రహమందుఁ బ్రవేశించెనని చెప్పుటయే శాసనోద్దేశమనియుఁ జెప్ప వచ్చును." ఇందు రెండవ సమాధానమే యెక్కువ యుక్తియుక్తముగాఁ దోఁచు చున్నది. "ఏదైన నొకయర్చా విగ్రహమున జనులకు భక్తి విశ్వాసములు

---

1. ఆం. సా. ప. ప. సం. 2.

2. తె. క. చ. పుట 61; జయంతి రామయ్యపంతులుగారి బెజవాడ శాస.

3. పుట 22, 23.

రూపములైనప్పు డా విగ్రహములఁ బోలిన విగ్రహములు ఆపేరనే యితర గ్రామములందుఁ బ్రతిష్ఠింపఁబడుట యిప్పటికిని గానఁబడుచున్నది."

శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు చేఁబ్రోలు నందలి మహాసేన దేవాలయ మాకాలమున జాతరకు మిక్కిలి ప్రసిద్ధి వడసియుండె ననియు, నా జాతర సంవత్సరమున కొకసారి జరుగుచుండె ననియు నప్పుడు భక్తులు బారులు బారులుగాఁ గూడి చేఁబ్రోలునుండి కుమారస్వామి విగ్రహము నూరేగింపుతో బెజవాడ వఱకుఁ గొనిపోయి మఱల దానిని జేఁబ్రోలునకుఁ గొనివచ్చుచుండి రనియు వ్రాసి యున్నారు.[1] ఈ యాత్రా సమయమునఁ గుమారస్వామియుత్సవ విగ్రహము బెజవాడలోఁ గొంతకాల ముంపఁబడుటయు నట్లది యుండుటచే యక్కడ యుద్ధమల్లునిచే దేవాలయము నిర్మింపఁబడుటయు సంభవించి యుండ వచ్చును. దీనినిబట్టి యా విగ్రహము జాతరకుఁ బూర్వము కొంతకాలము చేఁబ్రోలు నందును దరువాతఁ గొంతకాలము బెజవాడ యందును బూజింపఁ బడుచుండె నని చెప్పుట యసమంజసముగా నుండదు. ఉత్సవ విగ్రహమును గాక మూల విగ్రహమునే జాతర సమయాన బెజవాడకుఁ గొనిపోవుచుండి రనుట సంప్రదాయమునకు విరుద్ధముగా నుండును. ఏలయన నూరేగింపునకై మూలవిగ్రహము నెవ్వరును గుడినుండి పెకలింపరు.

యుద్ధమల్లుఁడు కట్టించిన కుమారస్వామి యాలయమిప్పుడు బెజవాడలోఁ గానరాదు. ఆనకట్టకుఁ బైని నదీ తీరమునఁగల ప్రాచీన దేవాలయమే పూర్వము కార్తికేయాలయముగా నుండెనని కొంద అందురు. అం దిప్పు డావిగ్రహము లేదు. శాసనస్తంభ మాదేవాలయమునఁ గాక మల్లేశ్వరస్వామి యాలయమం దున్నది. అందుచేఁ గొంద ఱిదియే మున్ను కార్తికేయాలయముగా నుండె ననియుఁ దరువాత నందు యుద్ధమల్లునిచే శివలింగము ప్రతిష్ఠితమగుటచే నా యాలయమునకు మల్లేశ్వరాలయమను పేరు వచ్చినదనియుఁ జెప్పుచున్నారు. యుద్ధమల్లుఁడు మల్లేశ్వరుని బ్రతిష్ఠించుట సత్యమే కావచ్చును గాని కుమారస్వామి యాలయమే మల్లేశ్వరాలయముగా మాఱె ననుటకుఁ దగిన సాధనములు లేవు. మఱియు యుద్ధమల్లుఁడు తాను గట్టించిన కార్తికేయాలయమునే మల్లేశ్వరాలయముగా

1, E. Ch. of Vengi. పుట 290-291.

మార్చెననుట కంటె నీశ్వరునకు వేఱుగా నాలయమును నిర్మించెననుటయే యుచితముగా నుండును.

పూర్వ మర్జునుఁ డచ్చటనే యీశ్వరునితో మల్లయుద్ధ మొనరించి యాతని వలనఁ బాశుపతాస్త్రము వడసెననియు, యుద్ధసమయమున విగ్రహాకారుఁడైన శివునచ్చటఁ బూజించెననియు, మల్లయుద్ధకాలమునఁ బ్రతిష్ఠించుటచే మల్లేశ్వరుఁడను పేరు కలిగెననియుఁ జెప్పు శాసనమొకటి మల్లేశ్వరాలయము నందున్నది.[1] కాని యీ వ్యుత్పత్తి యంత విశ్వసనీయముగాలేదు. బెజవాడకు సమీపమున నింద్రకీల పర్వతమను పేరఁ బరఁగు కొండపైఁ గల యొక శాసన స్తంభమున శివార్జునులకు జరిగిన మల్లయుద్ధము సంస్కృత శ్లోకములలో వర్ణింపఁబడి యున్నది. ఆ యుద్ధక్రమమును దెలుపు విగ్రహములు కూడ నక్కడఁ జెక్కఁబడియున్నవి. ఆ శాసన స్తంభముమీఁది లిపి యుద్ధమల్లుని శాసన మందలి లిపిని బోలి యుండుటచే నాకాలము నాఁటిదే యని చెప్పవచ్చును. అర్జునుఁడు శివుని మెప్పించి పాశుపతాస్త్రము సంపాదించిన చోటదే యను ప్రతీతి యిప్పటివలెనే సుమారు వేయి యేండ్లకుఁ బూర్వము కూడ నుండెనని యీ శాసనము వలనఁ దెలియుచున్నది.

ఈ రెండు శాసనము లందును గల వృత్తములు మధ్యాక్కరలే. ఈమధ్యాక్కర దేశీయ వృత్తము. మొదటి మధ్యాక్కరలో యుద్ధమల్లుని వర్ణించు విశేషణము లన్నియు సంస్కృత సమాస ఘటితములై యున్నవి. తక్కిన వానిలోఁ దత్సమ పదము లెడనెడ లేకపోలేదు కాని యలఁతి యలఁతి తెనుఁగు పదముల సంఖ్యయే హెచ్చు. కర్త చెప్పఁ దలఁచిన భావ మందు స్పష్టముగా వ్యక్తమగుచున్నది. పూర్వము మధ్యాక్కర నెట్లు పఠించెడివారో మనకుఁ దెలియదు. ఈ కాలపు వారి కది నడకను బట్టి వచన ప్రాయముగాఁ గానిపించును. ఈ శాసనము లందలి మధ్యాక్కరలు తెలుఁగు భాష యందు మొదటివే యయ్యుఁ బ్రసన్నమైన గమనముతోఁ గూడి యింపుగా నున్నవి. ఇందలి రచన విషయ ప్రధానముగనే

---

1. ఆరాధ్య మల్లయుద్ధేన ఫల్గునేన కృతాభిధః
మల్లేశ్వర ఇతి ఖ్యాతః సన్నిధత్తే మహేశ్వరః
శ్రీమద్విజయ వాటాఖ్య పురే కృష్ణా విభూషణే
వల్లకేతుని శాసనము.

యున్నది కాని రసాలంకార ప్రధానముగాఁ గాన వచ్చుట లేదు. ఇందలి భాషా చ్ఛందో విశేషములు ముందు ప్రకరణమున వివరింపఁ బడును.

ఈ శాసనము లందాజ్ఞప్తి కర్తృ లేఖకుల పేర్లు తెలుపఁబడి యుండలేదు కాని దీని రచయిత వీరశైవ పండిత త్రయములోఁ దొలివాఁడగు శ్రీపతి పండితుఁడని కీ.శే. విడుదవోలు సుందరము పంతులుగారు కవికావ్య ప్రశంసా చంద్రికలో వ్రాసిన వ్రాఁతను బట్టి [1] భారతిలో పండిత త్రయ మను వ్యాసమున శ్రీ విడుదవోలు వేంకటరావుగారు నిరూపించి యున్నారు.[2] శ్రీపతి పండితుఁడు బెజవాడ వాస్తవ్యుఁడనియు, నతఁడు శైవ మత ప్రాశస్త్యమును నిరూపించుటకు మల్లేశ్వరాలయముననే కొంగున నిప్పులు ముడిచి మహిమ ప్రదర్శించె ననియుఁ దెలియ వచ్చుటయు, నీ శాసనమున శైవ భిక్షుకుల (గొరగల) ప్రశంస యుండుటయు, శ్రీపతి పండితుఁడు కవియని పాల్కురికి సోమనాథాదులు ప్రశంసించుటయు, శైవ కవులు మతవ్యాపనమునకు మధ్యాక్కర వంటి దేశీయ చ్ఛందములనే యెక్కువగా నుపయోగించుటయు వారు చూపిన కారణములు.

మల్లికార్జున పండితుఁడు శివతత్త్వ సారములో :

ఒక్కఁడ దైవము శివుఁడని
నిక్కము సేయుటకు ముడిచె నిప్పులు చీరన్
స్రుక్కక శ్రీపతి పండితుఁ
డక్కజముగ విజయవాడ నల జమ్మి శివా !

1. అల యుద్ధమల్లు పనుపునఁ
దెలుఁగున మధ్యాక్కరలను దెలిపెను దొలి దా
నిల శ్రీపతి పండిత కవి
లలిత గతి న్విజయ నగర రామయ లింగా.

అక్కరలఁ జెప్ప జాఁ దెలు
గక్కరముల యుద్ధ మల్లుఁడని చెక్కించెన్
నిక్క మతఁ డొక్క శివకవి
రక్కొన నుతియింతు విజయ రామయ లింగా.

2. భారతి 3.3 పుట 28-33,

యని శ్రీపతి పండితుఁడు విజయవాడలో జమ్మికడ నిప్పులు వస్త్రమున ముడిచి శివుఁడొక్కఁడే దేవుఁడని నిరూపించి నట్లు తెల్పియున్నాఁడు. పాల్కురికి సోమనాథుఁడు బసవపురాణమున శ్రీపతి పండితుఁడు శివ భక్తునకుఁ గోటి బ్రాహ్మణులైన నెన యన్న నాలుకను గోసివైతు నని యనంతపాలుని సభలోఁ బల్కిపొత్తి పచ్చడమునఁ జంద్ర నిప్పులు ముడిచెనని వ్రాసి యున్నాఁడు. [1] ఈ యనంతపాలుఁడు క్రీ. శ. 12వ శతాబ్ది యారంభమునఁ (1104 A. D) గొండపల్లి, బెజవాడ ప్రాంతములను బశ్చిమ చాళుక్యుల దండనాథుఁడై పాలించినట్టి వాఁడు. అందుచే నిదియుఁ బండితుఁడు బెజవాడ వాస్తవ్యుఁ డనుటకు సాక్ష్య మొసంగుచున్నది. శ్రీపతి పండితుని వంశము వాఁడైన కాశీనాథుని వీరారాధ్యుఁడు ధర్మ గుప్తాభ్యుదయ మను కావ్యమున " ఆ గురుఁడు విజయవాటిని భోగేశ్వర మందిరమున " విత్యాదిగాఁ గల పద్యమునఁ బైకథనే వివరించి యున్నాఁడు. బెజవాడ మల్లేశ్వర స్వామి యాలయమునఁ గల చాళుక్య మహామండలేశ్వర పల్లకేతుని శాసనములో భక్తోత్తముఁడైన శ్రీ పండితారాధ్యునిచే శివభక్తుఁడే దేవర్షుల కంటెఁ గూడ నధికుఁడని శమీకోమలశాఖతోఁ జీనాంబరమున నగ్ని ముడువఁ బడఁగాఁ జూచి మల్లేశ్వరుఁడు ప్రీతిమైఁ బ్రత్యక్ష మయ్యెనని తెలుపఁబడినది. పై వానివలన శ్రీపతి పండితుఁడు బెజవాడ వాస్తవ్యుఁడనియు క్రీ. శ. 12 వ శతాబ్దికిఁ బూర్వము నివసించె ననియుఁ దెలియుచున్నది. పాల్కురికి సోమనాథుఁడు బసవపురాణముననే కాక పండితారాధ్య చరిత్రములోఁ గూడ నొక్కచో శ్రీపతి పండితుఁడు "పైపొత్తి పచ్చడమున నిప్పు లడరంగ ముడిచె" నని వ్రాసి యుండెను. కాశీనాథుని వీరారాధ్యుఁడు ధర్మగుప్తాభ్యుదయమున వలెనే భద్రాయుశ్చరిత్రమున సైతము శ్రీపతి పండితుఁడు "మల్లికార్జును నాగ్నేయ భాగంబున నున్న శమీశాఖ సమీపంబునకు

---

1. భక్తుండు శ్రీపతి పండితుఁ డీశు-భక్తున కిల కోటి బ్రాహ్మణులైన
వెనయన్న నాలుక నేఁ గోసివైతు - ననుచు ననంత పాలుని సభాస్థలిని
వెక్కొనఁగాఁ జంద్ర నిప్పులు గా దె - చక్కన పొత్తి పచ్చడమున ముడిచె
ఆ VIII పుట 210. బసవ.

తతః శ్రీ పండితారాధ్య నామ్నా భక్తోత్తమేన చ
శివభక్త ఏవ నూనం దేవర్షిభ్యో ఽ ధిక ఇతి
చీనాంబరే ఽ గ్నిం సంస్థాప్య శమీ కోమల శాఖయా
బద్ధే మల్లేశ్వరః ప్రీతః ప్రత్యక్ష స్సమ జాయత
M. E. R 1910. 536 of 1909.

వరిగి, యద్దేవు నభినందనంబును బ్రమథగణ స్తోత్రంబును గావించి, వీతిహోత్రు నాకర్షింపుచుఁ దనమీఁది పట్టు పచ్చడంబునఁ గట్టె" నని తెల్పియుండెను.[1] శ్రీపతి పండితుఁడు చూపిన యీ మాహాత్మ్యము తెలుఁగు దేశము నుండి క్రమముగాఁ గన్నడ దేశమువఱకుఁ గూడ వ్యాపించినది. శంకరారాధ్యులను నొక కన్నడ కవి బసవేశ విజయమునను, గుబ్బి మల్లనార్యుఁడు తన భావ చింతా రత్నమునను (క్రీ. శ. 1513) శ్రీపతి పండితుఁడు ప్రదర్శించిన పై మాహాత్మ్యమును బ్రశంసించి యున్నారు.[2] అందుచే నా పండితుఁడు బెజవాడలో నివసించుటయుఁ బై మాహాత్మ్యమును బ్రదర్శించి యుండుటయు సత్య విషయములే యని తేలుచున్నది.

క్రీ. శ. 1100-1170 నడుమ నివసించిన మల్లికార్జున పండితారాధ్యుఁడు శ్రీపతి పండితుని మహిమను బేర్కొనుటయు, శాసన పరిశోధకులు క్రీ.శ 11వ శతాబ్ది నాఁటిదని తెలుపుచున్న మల్లేశ్వరాలయము నందలి పల్లకేతుని శాసనము నందాతని మహిమ వర్ణితమగుటయు, నాతఁడు క్రీ. శ. 11వ శతాబ్దికిఁ బూర్వుఁడని వ్యక్తము చేయుచున్నవి. పాల్కురికి సోమనాథుఁడు శ్రీపతి పండితుఁడు కొంగున నిప్పులు మూటఁగట్టిన దనంతపాలుని సభాస్థలమునం దని బసవ పురాణములో వ్రాసియుండెను. ఈ అనంతపాలుఁడు త్రిభువనమల్ల విక్రమాదిత్యునకు దండనాయకుఁడుగా నుండి క్రీ. శ. 12 వ శతాబ్ది ప్రథమ పాదమున బెజవాడలోఁ గొన్ని శాసనములు వేయించి యుండుటచే శ్రీపతి పండితుఁడు కూడ నప్పటివాఁడే యని నిర్ణయింప వలసి వచ్చును. కాని సోమనాథుఁ డనంతపాలుని గుఱించి తెలిసి వ్రాయలేదనియు, నాతఁడు బసవ పురాణమునఁ జెప్పిన దంతయు నిజమైన చరిత్రగాఁ బరిగణింపరాదనియు, నందుకు నిదర్శనములు పెక్కు గలవనియు విమర్శకులు నుడువుచున్నారు.[3] ఆ యనంతపాలుని శాసనములలో నెచ్చటను శ్రీపతి పండితుని ప్రశంస కానరాకుండుటచే నాతఁడతని కాలముననే నివసించె ననుట సందేహాస్పద మగుచున్నది. సోమనాథుఁడు వినికిడినిబట్టి యిట్లు వ్రాసి యుండుననియు నిజమునకుఁ బండితుఁ డనంతపాలుని

---

1. పండితా. పురాతన ప్రకర. కుమారపాల ఘూర్జరకథ. భాగ. 1 పుట. 408.
2. తె. క. చరిత్ర. పుట 72.
3. తె. క. చ. పుట 78. చి. నా. పం. రా. చరిత్ర. ఉపో. పుట 89.

కాలమునకు ముందే నివసించి యుండుననియు నిర్ణయింప వచ్చును. కాని పాల్కురికి సోమనాథుని కథనము నిరాకరించుటకు బలవత్తరమైన హేతువు లింకను గానవచ్చుటలేదు. శ్రీ చిలుకూరి నారాయణరావుగారు పండితారాధ్య చరిత్ర యుపోద్ఘాతములో (పుట 28) శ్రీపతి పండితుఁడు పండితారాధ్యున కించుక ముందుగా జీవించియుండెనని నిరూపించి యున్నారు. కాఁగా శ్రీపతి పండితుఁడు క్రీ. శ. 10 వ శతాబ్దిలో నివసించెనని యూహింప వచ్చును. ఈ కాల నిర్ణయము పండితుఁడే యుద్ధమల్లుని బెజవాడ శాసనమునకుఁ గర్త యను కొనుట కనుకూలముగానే యున్నది.

శ్రీపతి పండిత కృతమగు శ్రీకర భాష్యము నాంగ్లేయ భాషలోఁ బెద్ద యుపోద్ఘాతముతోఁ గూడఁ బ్రకటించిన శ్రీ సి. హయవదనరావుగారు పండితుఁడు క్రీ. శ. 1400 సంవత్సరము ప్రాంతమున నివసించి యుండునని నిర్ణయించి యున్నారు. శ్రీకర భాష్యమున మధ్వాచార్య ప్రతిపాదితమైన ద్వైత మతము ఖండింపఁబడిన దనియు, మధ్వాచార్యులు క్రీ. శ. 13 వ శతాబ్దివాఁ డగుటచేఁ బండితుఁడు వారి తరువాత నివసించి యుండుననియు వారి వాదము. కాని వారు తమ వాదమును నిలఁబెట్టుకొనుటకై మూలములో లేని కొన్ని పదములను దాము ప్రకటించిన గ్రంథములోఁ జేర్చినట్లు తెలియవచ్చినదనియు, నానంద తీర్థుఁడు ద్వైతమత పునః ప్రతిష్ఠాపకుఁడే కాని దానికి మూలస్థాపకుఁడు కాక పోవుటచే నా గ్రంథమున మధ్వపద ముండుటయు ద్వైతమత ఖండనముతోఁ గూడిన భాగము లుండుటయు నిజమేయైనను బండితుఁడా మధ్వాచార్యునికిఁ దరువాతి వాఁడని నిర్ణయించుట కవకాశము లేదనియు శ్రీ నారాయణరావుగారు పండితారాధ్య చరిత్రోపోద్ఘాతములో (పుట 31) వారి వాదమును నిరసించి యున్నారు. పైఁగా వారు శ్రీపతి పండితుని కాల నిర్ణయమునకుఁ దోడ్పడు తెలుఁగు గ్రంథములు వేనిని జూడక పోవుటచేతను, ముందే యేదో నిర్ణయమునకు వచ్చి దానిని నిలఁబెట్టు కొనుటకై ప్రయత్నించినట్లు కనఁబడుచుండుటచేతను వారి వాదము విశ్వసింప వలసిన పనిలేదు.

శ్రీపతి పండితుఁడు బ్రహ్మసూత్రములకు శివదీపిక యను వ్యాఖ్యానమును దెలుఁగులో రచించినట్లు ప్రతీతి కలదు.[1] పాల్కురికి సోమనాథుఁడు బసవ

---

1 కీ. శే. ని. సుందరం పంతులుగారు శివకవులలో -

"శ్రీపతి పండిత కవి శివ
దీపిక విరచించి శైవదీక్షా గురుఁడై
చేపట్టె ముక్తి పేరిటి
రాపట్టని విజయనగర రామయ లింగా!" అని వ్రాసియుండిరి.

పురాణములో నంగమేశ్వరుఁడు బసవని మూఁడవ కన్నడిగిన సందర్భమున "శ్రీపతి పండితుల్ శివుఁడః మీ కవులు, నా పండితయ్య గారనుఁగుఁ బండితు" లని చెప్పినట్లు వ్రాసి యున్నాఁడు. పండితారాధ్యుఁడు పండితుఁడే కాక కవికూడ నగుటకు శివ తత్త్వసారమే సాక్ష్యము. అట్టివాఁడు కేవల పండితుఁడుగాను, శ్రీపతి పండితుఁడు కవిగాను చెప్పఁబడి యుండుటచేఁ గవితా విషయమున వారిరువురిలో శ్రీపతి పండితుఁడే మిన్నయని సోమనాథుఁడు భావించినట్లు తలంప వచ్చును. కాని యాతఁడు రచించిన కావ్యము లేమియు లభ్యము లగుటలేదు. అతఁడు బెజవాడ వాస్తవ్యుఁడగుటయు, మల్లేశ్వరాలయ సమీపము ననే యాతఁడు మహిమ ప్రదర్శించినట్లు తెలియ వచ్చుటయు, యుద్ధమల్లుని శాసన మాదేవాలయముననే యుండుటయు, నందలి పద్యములు శివకవులకుఁ బ్రీతి పాత్రమగు దేశీయచ్ఛందమునకు సంబంధించిన వగుటయు, శ్రీపతి పండితుఁడు పండితారాధ్యునికిఁ బూర్వుఁడనియుఁ గవియనియు నిశ్చయముగాఁ దెలియవచ్చుటయుఁ, బై శాసనకర్త యాతఁడే యై యుండునని యూహించుట కవకాశము నొసంగుచున్నవి. ఇంతకంటె నీ విషయమును నిర్ధరించుట కాధార ములు లేవు. ఇదియే సత్యమగుచో శ్రీపతి పండితుఁడు నన్నయకుఁ బూర్వ ముండిన ప్రశస్త కవులలో నొకఁడని చెప్పవచ్చును.

విరియాల కామసాని గూడూరు శాసనమున మూఁడు చంపకమాలలును రెం డుత్పల మాలలును ఉన్నవి. విరియాల యెఱ్ఱభూపతి భార్యయైన కామసాని తన కుమారుఁడగు సూరభూపతి సాయమున బేతరాజునకు శత్రువుల వలనఁ గలిగిన యాపద తొలఁగించి యాతనిఁ గాకతీయ రాజ్యమున సుప్రతిష్ఠితునిఁ గావించెనని యందు వర్ణింపఁ బడినది. ఈ బేతరాజు కాకతీయ వంశపు రాజు లలో మొదటివాఁడు. క్రీ. శ. 1028 ప్రాంతమున నుండినవాఁడు. ఈతఁడు రాజ్యము స్థాపించిన యారంభ కాలములో శత్రువులవలన నలజడి కలుగఁగా కామసాని యాతనికిఁ దోడ్పడి పై శాసనము వేయించి యుండవచ్చును. అందుచే నీశాసనము క్రీ. శ. 11 వ శతాబ్ది మొదటి పాదములోనిదని నిస్సంశ యముగాఁ జెప్పవచ్చును. ఇందు సూత్రధారి (శాసనలేఖకుని) పేరున్నది కాని యాజ్ఞప్తియొక్కయుఁ గర్తయొక్కయు నామములు పేర్కొనఁబడి యుండ లేదు. ఇందలి మొదటి మూఁడు పద్యములలో దుర్జయాన్వయమునకుఁ జెందిన విరియాల వంశపు రాజుల క్రమమును నాల్గవ పద్యమున కామసాని బేతభూపతికిఁ

జేసిన సాయమును వర్ణింపఁబడినది. అయిదవ పద్యములో సూరభూపతి చూపిన విక్రమము ప్రశంస కానవచ్చుచున్నది. ఈ విధముగా నీ శాసనమునందలి సారాంశము తెలియుచున్నను ఇందలి పద్యములలోని కొన్ని వాక్యములయుఁ బదములయుఁ బ్రత్యేకమైన యర్థము బోధపడుటలేదు. ఈ పద్యములు తత్సమ దేశ్యపద మిశ్రితమైన రచనతోఁ గూడి నన్నయ భారతమునందలి పద్యములను బోలియున్నవి. "పాండవ మధ్యమ భీముఁడో యనఁగా" మున్నగుచోట్ల నాలంకారికమైన రచన గోచరించుచున్నది. ఇంతకుఁ బూర్వమున్న శాసనములలో దేశియచ్ఛందమునకుఁ జెందిన పద్యములే కాని యక్షర గణములతోఁ గూడిన వృత్తములు కానవచ్చుటలేదు. అందుచే నీ శాసన కాలమునాఁటికే కవులు సంస్కృత వృత్తముల నెరవు తెచ్చుకొని వానిలో యతిప్రాసలు కూర్చి కవిత నాగించుచుండిరని చెప్పవచ్చును. ఇందలి పద్యములందలి యర్థము క్లిష్టముగా నున్నను ధారమాత్రము ప్రసన్నమై కానవచ్చుచున్నది.

ఇవిగాక మిగిలిన చాళుక్య రాజుల శాసనములును, రేనాటి చోళులును బాణ వైడుంబ రాజులును వ్రాయించిన శాసనములును, మఱికొన్ని యితర శాసనములను గద్య మయములుగానే కావవచ్చుచున్నవి. కాని యక్కడక్కడ నా శాసనముల నడుమ వృత్తగంధి వాక్యములు కొన్ని యున్నవి. పుణ్యకుమారుని మాలెపాది శాసనమున రగడయు, వెంకయ చోడుని దొంగలసాని శాసనమున మహాక్కరయుఁ గావిపించు చున్నవని కొందఱు పరిశోధకులు వ్రాసియున్నారు.[1] ఈ రెంపిటిలో గణము లొకమాదిరిగా సరిపుచ్చుటకు వీలున్నను యతిప్రాసలను సరి పెట్టుట కష్టము. ఇందలి గణములు మాత్రాగణము లగుట చేతను మామూలుగా మనము వ్రాయు వచనమునఁ గూడ యతి ప్రాసలతోఁ బని లేనిచో మాత్రాగణ విర్దేశము ననుసరించి యేదో యొక పద్య మున్నదని నిరూపించుట కవకాశ ముండుట చేతను అవి తత్కర్తలు పద్యము వ్రాయ వలెనను నుద్దేశముతో వ్రాసి వట్టివేయని చెప్పుటకు వీలులేకున్నది. వృత్తగంధి వాక్యముల విషయమును వీని విషయమును నన్నయకుఁ బూర్వము ఛందస్సను భాగమున విపులముగాఁ జర్చింపఁబడును.

---

1 శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారు- పరిశోధన పత్రిక.

సంస్కృత శాసనములలో దత్త క్షేత్రముల సీమావధుల వివరమును జెప్పు భాగములు తప్ప వాఙ్మయమని చెప్పఁ దగిన దేదియును లేదు. ప్రాక్చాళుక్య యుగము నందలి శాసనములలోని గ్రామ నామముల వలెనే చాళుక్య యుగములోఁ గనవచ్చు గ్రామముల నామములు కూడ పాడు, పఱ్ఱు, వాడ, చెఱువు, కొలను, ఊరు, కోడు, చేడు, పూణ్డి, మున్నగు పదములతోనే యంతమొందు చున్నవి. (ఉప్పుఱటూరు, ట్టణపాఱు, అంగలూరు, వేల్పూరు - మూఁడవ విజయాదిత్యుని కాలమునాఁటి శాసనములు E. I. Vol. V పుట 122-చాకి చెఱువు, పెద్దకోడు, కోరు కొలను, కాకణ్డివాడ, కారణ్చేడు, శ్రీ పూణ్డి) ఇవి గాక గ్రామముల చివర మఱి కొన్ని పదములు కూడఁ గానవచ్చుచున్నవి. వటి (రెణ్డువటి, రామాటి) గుణ్ట (పరువుల గుణ్ట, జువ్విగుణ్ట, ఐరివియ గుట్ట) గుమ్మి (తాఱ్ఱు గుమ్మి) ప్రోలు (గొట్టి ప్రోలు) చేను (వేల్పు జేను) నది (వ్యాఘ్ర నది, వన్నేరు నది) తటాకమ (విడుగడ్డ తటాకము) మున్నగున వందు ముఖ్యము లైనవి. ఈ సీమలను జెప్పు చోట్లనే కొన్ని యెడల సమాపక క్రియా రహితములయ్యు సంపూర్ణార్థము గల వాక్యములు గలవు. దక్షిణతః పెంజెరువు కట్ట డిగ్గు త్రోవ. (రణస్థిపూణ్డి శాస.) ఐశాన్యతః ఇయ్యూరియుం బిల్లెమ పెద్ద పూండియుం బొలగరుసున మడ్డిగోడి తాటి యొద్ద చింతయ సీమా (వందమపూడి శాస.) ఊరి తూర్పుననుండి పడు మటికిం బాఱిన పెద్దవీధి దక్షిణమున గృహక్షేత్రమున మూడ్లు నలుపది (వంద తామ్రశాస.) అగ్నేయతః చందూరి మాన్యమున పడపలిద మాన్యమునయు నడుమం బాఱిన ఏఱు (తిమ్మాపురశాస.) ఇట్టి వాక్యములలో ఉండు, అగు, అను ధాతువుల రూపములు సందర్భమును బట్టి అధ్యాహారము చేసికోవలయును. నన్నయకుఁ బూర్వ మందలి శాసనములలో నిట్టి కూర్పుగల వాక్యములే అధికముగాఁ గావవచ్చు చుండును.

క్రీ. శ. 6వ శతాబ్ది తుది భాగము నుండియుఁ బూర్ణముగాఁ దెలుఁగు భాషలో వ్రాయఁ బడిన శాసనములు కనవచ్చు చున్నవి. విషయమును బట్టి చూచిన వీనికిని సంస్కృత భాషా శాసనములకును భేద మంతగాఁ గానరాదు. అవియు నివియు దాన విషయమును సూచించు నట్టివే. వీనిలో మొదట నవి వేయింపఁ బడిన కాలము నందలి రాజును, అతని విజయరాజ్య సంవత్సరములును పేర్కొనఁబడి యుండును. (రేనాటి చోళుల శాసనములు). కొన్ని శాసనము లందీ విజయరాజ్య సంవత్సరముల ప్రశంస చివరఁ గనవచ్చు చుండును. మధ్య

ప్రధానమైన దాన విషయము వర్ణింపఁ బడును. అందు దత్తములగు క్షేత్ర గ్రామాదులును, దాతృ ప్రతి గ్రహీతల పేర్లును, వివరింపఁ బడును. తరువాత నా క్షేత్ర గ్రామాదులకు సీమలు చెప్పఁ బడును. పిమ్మట నా దానము రక్షించిన వారికిఁ బుణ్యమును ప్రచ్చిన వారికిఁ బాపమును గలుగునను ఫలశ్రుతి కాననగును. ఈ ఫలశ్రుతి సాధారణముగా నన్ని శాసనము లందు నొకేమాదిరిగా నుండును. కాచిన వారి కశ్వమేధము నాచరించిన ఫల మబ్బుననియు, 'వక్రము' చేసిన వారికి వారణాసిలో బ్రాహ్మణులను గపిల గోవులను జంపిన పాతక మబ్బు ననియు నందుఁ జెప్పఁ బడుచుండును. ఈ ఫలశ్రుతియైన పిమ్మట నా జ్ఞప్తి కర్తృ లేఖకుల పేర్లు చూపట్టును. ఇవి లేని శాసనములు కూడఁ గొన్ని గలవు.

తెలుఁగునఁ గల కొన్ని శాసనములలో వీరుల పరాక్రమాదులు వర్ణింపఁ బడి యున్నవి. బాణ వైదుంబ రాజుల కాలమున వేయఁబడిన పెక్కు శాసనము లిట్టివే. వీనిలో నెవ్వఁడో యొక వీరుఁడు మఱొక వీరునితోఁ బోరి స్వర్గ లోకమున కేగెనని చెప్పఁ బడును. ఇందు వీర రసముతోపాటు కరుణరసము కూడ స్ఫురించు చున్నది. క్రీ. శ. 850 ప్రాంతమున వేయఁబడిన వైదుంబ రాజుల కాలమునాఁటి శాసన మొకటి యిచటఁ బేర్కొనఁ దగియున్నది. ఇందు దోచయ్య, ప్రభు చెల్వొన్ను అను వారి పరాక్రమమును, ప్రభుచెల్వొన్ను నొలంబి సేనను దాఁకి వీరస్వర్గ మొందిన తెఱంగును వర్ణింపఁబడి యున్నవి. ప్రభు చెల్వొని మరణ వృత్తాంతము కరుణరస పూరితమై యున్నది.

"వైదుమ్బ మహారాజుల ముట్లమలె దోచయ్య మానిసి
యెమ్మకాల మెఱెసి ప్రభూ
చెల్వొన్ను మా (మ) హారాజులయు
నొళ్ళొంబియు సోరెమటి
కయ్యంబున మెఱెసి ప్రభూ
చెల్వొన్ను నొళొంబి నాగుతా న్కి పొడిచి (వీరలో) కా....వోయి"

"Servant Dochayya of ముట్లమలె of వైదుంబ మహారాజ గండత్రినేత్ర distinguished himself sportively (ఎమ్మెకాల) and ప్రభు చెల్వొన్ను shone of in the battle of Sorematі fought between the Maharaja and No!ambi. Of these ప్రభు చెల్వొన్ను met and attacked the No!ambi army and went to the world of heroes (died)"

అవి పై శాసనమున కాంగ్లానువాదము, విహత వీరుల సమర క్రమమును, మః
ణమును వర్ణించు నిట్టి శాసనములు పెక్కున్నవి. అవి మిక్కిలి చిన్నవగుటః
రస ప్రధానములు కాక కేవల విషయ ప్రధానములై యున్నవి.

క్రీ. శ. 7, 8, శతాబ్దులలోని తెలుఁగు శాసనములలోఁ బ్రాకృత భాషా
సంపర్క ప్రభావములు గోచరించు చున్నవి. ఇవి రేనాటి చోళుల శాసనములలోఁ
గంటెఁ దూర్పు చాళుక్యుల శాసనములలోనే హెచ్చు. వీనిలో సంస్కృత
సమాసముల సంఖ్య తక్కువగను దేశ్య పదముల సంఖ్య హెచ్చుగను గోచ
రించును. కాని నడుమ నడుమఁ బ్రాకృత శబ్దములు కొన్ని ప్రయోగింపఁబడి
యుండుటచేతను, దేశ్య పదము లింకను నన్నయ భారతమున స్థిరపడి మనకు
సుపరిచితములైన రూపములను బొందియుండకపోవుటచేతను ఆ శాసనములు
కొంతవఱకు దుర్బోధములుగా గోచరించును. పూణ్ణమ, బారణాసి(విప్పర్తిశాస)
దొగ, ప్రతమ, బోళ, (లక్ష్మీపుర), సర్వబాద పరియారువు, సవ్వలోకశ్రయ
మహా పర్థణ వళ్ (అహదనకర) దుజయరాజుల, దుకరాజులు, పన్నస (ఎఱ్ఱ
గుడిపాడు శాస.) ఆణతి (రామేశ్వర స్తంభ శాస.) వణం (చిలంకూరు) అణ
పోతులు (పొట్ల, మాలె) మున్నగు పదములా శాసనములలోఁ గల ప్రాకృత
భాషా సంసరమునకుఁ దార్కాణములు. రేవణకాలు, కుణ్డికాళ్లు, నివబుకాను,
రట్టకుట్ట, తారుమున్టి, పాకాతుఋూన, ఋచ్చు వాన్టు, పులొంబున, మట్టు, ఇల్ల
కాను, అడ్లు పట్టు, పఱాను, రెడ్డు నడల, పసిణ్డి ముడ్లు మున్నగు పదములు
తెలుఁగుపదములే యైనను బరిచితములైన రూపములతో నుండక పోవుటచే
మన కన్యదేశ్యముల వలెనే క్రొత్తగాఁ గానవచ్చు చున్నవి. అహదనకర
శాసనములో నిట్టి పదముల సంఖ్య హెచ్చుగా నున్నది. ల, నలను శఱలుగా
వ్రాయుటయు (కశరేని, బణిసేసిన, శేదు) మన మిప్పుడు సర్వసాధారణముగా
వాడుచుండు లు అను బహువచన ప్రత్యయమే ళు, ళ్, కళ్, గళ్, కొళు,
కొల్, మున్నగు భిన్నరూపములతోఁ గానవచ్చుటయు మనకా భాష కొంత
వింతగాఁ దోఁచుటకుఁ గారణ మగుచున్నది

పై శాసనము నందలి భాషకును గుణగవిజయాదిత్యుని కాలము నుంచి
వ్రాయఁబడిన శాసనములలోని భాషకును గొంత వ్యత్యాసము గోచరించుచున్నది.
కాలము గడచినకొలంది ప్రాకృతభాషా సంసర్గ ప్రభావములు తగ్గి సంస్కృత
భాషాప్రభావ మధికమగుట కానవచ్చును. ఈ శాసనములో దీర్ఘ సంస్కృత

సమాసములును, తత్సమ పదములును విరివిగా నుపయోగింపఁబడి యున్నవి. వీనిలోఁ గూడ దేశ్యపదములు లేకపోలేదు. కాని తత్సమ పదముల సంఖ్య యధిక మగుటచేతను, ఉపయుక్తములైన కొలఁది దేశ్యపదములు క్రమ ముగా మనకుఁ బరిచితములైన రూపములను బొందఁ జొచ్చుటచేతను బైవానిని గంటె వీని నర్థము చేసికొనుట సులభతరముగా గోచరించును. చాళుక్యభీముని కొఱవి శాసనము నందలి శైలి (900 A. D. )సరిగా నన్నయ భారతమునందలి శైలిని బోలియున్నది. ఉదా॥ "కుసుమాయుధు పెద్దకొడుకనేక రిపునృపతి మణిమకుట మకరికారేఫణ మశ్రుణిత. .గలంలా వర్తణంబు రాజ్యంబు సేయుచు నిష్టవిషయ కామభోగంబుల ననుభవించుచు, సుఖంబుండి యొక నాణ్డు కొరవి నల్లజెఱియు కొడుకు పెద్దన రావించి, నీవు నా ప్రాణ సమానుణ్డవైన చెలివి.నీ చేసిన యుపకారంబునకు బ్రత్యుపకారంబు సేయవలయుం గాన నీ కేమి అయు దానివ....ణ్క్రకొమ్మన్వగి". దీనినిబట్టి యీ శాసనము కాలమునాఁటికే తెలుఁగున సలక్షణమైన సరళ వచనశైలి యేర్పడి యుండెనని తెలియు చున్నది. అక్కడక్కడ నిందును గొన్ని యర్థముకాని పదము లున్నను మొత్తముమీఁద తత్సమపదములే యధికమగుటచే నివి యంతకుఁ బూర్వ ముండిన శాసనములకంటె నెక్కువ సుబోధములుగా నున్నవి. కొఱవి శాసన మందలి సంభాషణశైలి చిన్నచిన్న వాక్యములతోఁగూడి మనోహరమై యల రారు చున్నది.

ఈ శాసనములలో వచ్చటచ్చట భూత తద్ధర్మములందలి క్రియలు కానవచ్చును కాని సమాపకక్రియలు లేని వాక్యముల సంఖ్యయే హెచ్చు. విరి పఱితి కమ్మరి వినియన వ్రాసె (రామేశ్వర స్తంభ) మరుతున్ను ప్రసాదచేసిరి (చిలంకూరి). కోసియ పాఱకిచ్చిరి (వెలుదుర్తి శా.) కాచేఱు పాఱ ఎఱమ వ్రాసిరి. కొట్టలి కున్నడా అను వాన్ను కొట్టె (వెలుదుర్తి) దన్తియ మన్గు తోళన్ పొడిచి పడియెన్ (బుడ్డిగడ్డ పల్లి) దీనికి వక్రంబు వచ్చినవారు పంచ మహా పాతకుఅగు (ఉరుటూరు) అఱువది వే లేండ్లు నరకయోని నుండుదురు. (ఏడువాడలపాలెము శాస.)తేని రక్షిఞ్చ్చ కుడ్డిపి వాన్ను అస్వమేదంబున పల్లమ్బు కొఞ్చన్ (విత్పర్తి) మున్నగునవి సమాపక క్రియలతోఁ గూడిన వాక్యములకు నిదర్శనములు. వైదుంబరాజుల కాలమునందలి వీర పరాక్రమ స్మారకములైన శాసనములు పెక్కు ఏఱ్గె, పడియె, మున్నగు భూతకాల క్రియలతో ముగియు

చున్నవి. వీవి చివర ద్రుత స్వరములకు లోపము చేయఁబడుటచే నివి పద్య మయములేమో యను భ్రాంతి కలిగించు చున్నవి. సాధారణముగా వాక్యముల లోవి యర్థము భూతకాల క్రియాజన్య విశేషములతోడనే వ్యక్తము చేయఁబడు చుండును. ఉదా॥ ఎరిగల్ దుగరాజుల్ యిచ్చిన పన్నస. (ఇందుకూరి) అగ్గిశమ్మాఁర్ రి కిచ్చిన దతి (వెలుదుర్తి) స్వస్తిశ్రీ బెజయిత్త భటరళ నిల్పిన దత్తి (కపిలేశ్వర 740). కొన్నిచోట్లఁ దచ్ఛబ్దానుగత క్రియాజన్య విశేషణములే క్రియలుగా వాడఁబడు చుండును. ఇట్టి కూర్పును ఆంగ్లమున appositional construction అందురు. ఉదా. దీవికి వక్రమ్బు వచ్చు వాన్ఱు........బారనాసి వేవురు పాఱ జమ్పిన వాన్ఱు (రామేశ్వర స్తంభ) దేవస్వంబు లఞ్చంబు గొణ్న వాన్ఱు వారణాసి ఞ్ఱచ్చిన పాపంబు గొణ్నవాన్ఱు (పెద్దముడియమ్). అహదనకర శాసనమున "దీవికి వక్రంబు లేదు'' అను వాక్యమున వ్యతిరేకార్థక క్రియ వాడఁబడినది. కొన్ని శాసనములలో రెండు వాక్యములను సంబంధ బోధక సర్వనామములతో నొకే వాక్యముగాఁ గలిపి వ్రాయు పద్ధతి కనవచ్చును. ఉదా: ఇచ్చిన పన్నస పెన్పాఱ ఇశెతేవికివ్. తేని ఱచ్చినవాన్ఱు పఞ్చ మహాపాతకున్ఱకున్ (పొట్లదుర్తి మాలెపాడు) ఏ దానమును జెడఁ గొట్టిన వాఁడు పంచ మహాపాతకుండగునో అట్టి దానము నొసఁగెనని యిచ్చట భావము. దేని ఞ్ఱచ్చువాన్ఱు పఞ్చ మహాపాతక స......క్తుఁకున్. తేని, రక్షిఞ్చ కుడ్డిపి వాన్ఱు అస్వమేదమ్బున పల్లమ్బు కాఞ్చున్ (విత్పత్తి శాస.). అన్ని శాసనములకును దానమును సూచించుటయో వీరుల పరాక్రమమును స్తుతించుటయో తప్ప వేఱు ప్రయోజనము లేమిచే వీనియందు వాఙ్మయమని చెప్పఁదగిన లక్షణము లేవియుఁ గానరావు. ఇవి కేవలము విషయ ప్రధానములు. కొఱవి శాసనము వంటి వొండు రెండింద కపవాద భూతము లైనవి కలవు.

పైవి పేర్కొనఁ బడిన శాసనములే కాక నన్నయకుఁ బూర్వము కొందఱు కవులు కావ్యములు కూడ రచించిరనియు, నందు కందలి పద్యములు కొన్ని ప్రబంధ రత్నావళిలో నుదాహరింపఁబడి కనవచ్చుటయే దృష్టాంతమనియు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు తెలుఁగు కవుల చరిత్రలోఁ దెల్పియున్నారు. అట్టి కవులలో జినేంద్ర పురాణ కర్తయైన పద్మకవి యొకఁడు. ప్రబంధ రత్నావళి యందలి 81 వ పుటలో నీ కావ్యము నందలి పద్య మొకటి యుదాహరింపఁ బడియున్నది. ఏ తత్కర్త కన్నడమున విక్రమార్జున విజయము,

ఆది పురాణము అను మహాకావ్యములు రచించి యా భాషలోఁ గవి చక్రవర్తిగాఁ బరిగణింపఁ బడుచున్న పంపకవియే యని తెలియుచున్నది. అతఁడు భారత మును వేములవాడ చాళుక్య రాజైన అరికేసరికిఁ కృతి యిచ్చి యుండెను. అతని నివాసము తెలుఁగు దేశము నందలి వేంగి పట్టి అని పరిశోధకులు నిర్ణ యించి యున్నారు. అందుచే నీతఁడు తెలుఁగు భాషలోఁ గవిత్వము చెప్పెనన వింతపడ నవసరము లేదు. అదియును గాక యానాఁటి తెనుఁగువారు పలువురు తెనుఁగు కన్నడముల రెంటను బాండిత్యము గలవారై యా రెండు భాషలందును గూడఁ గవిత్వము చెప్పియుండి రనుటకు దృష్టాంతము లున్నవి. మంగుళూరు నందలి మిషను కళాశాలలో విద్వాంసులైన తిమ్మప్పయ్యగారు నాడోజ పంప యను విమర్శ గ్రంథమున (పుట 76-78) పంప కవియే పద్మకవి యని నిరూపించి యున్నారు. జైన సంప్రదాయమునకుఁ జెందిన యాఱవ తీర్థంకరుని పద్మప్రభ యను నామమే పద్మప్ప, పద్దప్ప, పమ్మప్ప, పంప యను విధముగాఁ బరిణామము చెందిన దనియు, సంస్కృత జైననామ మగు పద్మశబ్దమే కన్నడ మున పమ్మగాను, దెనుఁగున పెమ్మగాను మాఱినదనియు శ్రీ వేంకటరావుగారు చెప్పుచున్నారు.[1] ఆంధ్రదేశము నందలి వైశ్యు లందును బ్రాహ్మణు లందును పమ్మి యను గృహనామ మిప్పటికిని గానవచ్చు చున్నది.

అందుచేఁ బంప మహాకవియే తెలుఁగున జినేంద్ర పురాణమును రచించె నని యనుకొనవలయును. ఇతఁడు క్రీ. శ. 10 వ శతాబ్ది పూర్వార్ధమున నాంధ్ర దేశము నందలి వేంగీపురము నుండి చాళుక్యరాజైన యరికేసరి కొలువున కేగి[2] యాతని యాదృతికిఁ బాత్రుఁడై కన్నడమున విక్రమార్జున విజయమును రచిం చెను. దీనిని బట్టి జినేంద్ర పురాణము తెనుఁగున నన్నయకుఁ బూర్వమే పుట్టిన కావ్యమని చెప్ప వలయును. ఇతర జైన కావ్యముల వలెనే యిదియు నశించి పోవుటచే నిందలి కవితా మాధుర్యమును గ్రోలు నదృష్ట మాంధ్రుల కబ్బినది కాదు.

---

1. తె. క. చ. పుట 84.

2. "Pampa, an Andhra Brahman of Vengipura migrated to Chalukya chief Arikesari II"

J. A. H. R. S. Vol VI Part 3.

జినేంద్ర పురాణము జైన సమయాచార్యులలో మహా ప్రసిద్ధుఁడైన జినేంద్ర ముని చరిత్రము. ఇతఁడు పంప మహాకవికే కాక కన్నడ రత్నత్రయములో నొకఁడైన పొన్న మహాకవికిఁ గూడ గురువై విలసిల్లెను. పంపకవి ఆది పురాణము నందును పొన్న శాంతి పురాణము నందును గద్యలలో నీ విషయమును వ్యక్తముచేసి యున్నారు.[1] పూజ్యపాద చరిత్రమున జినేంద్రముని ప్రస్తుతుఁడై యున్నాడు. ఇతఁడు కానూరు గచ్ఛమునకు సంబంధించిన జైనాచార్యుఁడు. అర్హద్బలి, అర్హనంది, రామనంది, చందినంది, యాతని గురుపరంపర. ప్రబంధ రత్నావళిలో నుదాహరింపఁబడిన పద్యమొకటియు సీసపద్యము.[2] ఇందు మందర పర్వతము వర్ణితమై యున్నది. పద్యమునందలి సీసభాగ మంతయు సంస్కృత సమాస భూయిష్ఠమై శ్లేషాలంకారముతోఁ గూడి యున్నది. ఒకటే సమాసము మేరు మందరములు రెండింటికి నన్వయించునట్లు ద్విరుక్తము చేయఁబడి యున్నది. పద్యము ప్రౌఢమై సుందరమైన గమనముతో నొప్పారుచున్నది.

---

1. ఇదు దేవేంద్ర మునీంద్ర వంద్య పరమ జినేంద్ర ముఖచంద్ర వాక్చంద్రికా ప్రసర ప్రసారోదీర్ణసూక్తి కల్లోల మాలాకీర్ణ కవితా గుణార్ణవ ప్రణీత మప్పాది పురాణదోళ్...ఆదిపురాణ.

ఇదు జినేంద్ర చరణ సరసీరుహ శిలీముఖాయమాన శ్రీ మదుభయకవి చక్రవర్తి నిర్వర్తితముం......పొన్నపార్యకారితము...శాంతిపురా.

2. హరి నిలయంబును హరి నిలయంబును
విషధరాఢ్యంబును విషధరాఢ్య
మప్సరోమయమును నప్సరోమయమును
వన విలాసమును పావన విలాస
మున్నత కరి శృంగ మున్నతకరిశృంగ
మిందు కాంతస్రవ మిందు కాంత
మురుకల నకులంబు నురుకలనకులంబు
నంశుకాంత ద్యోతి......కాంత

మొనర నవశత సాహస్ర యోజనోన్న
తమును బదివేల యోజన లమరు వలము
గలిగి కనకాద్రి కిన్మూటఁ గలిగి తనరి
ప్రథితమై యొప్పు మందర పర్వతంబు.

ప్రబంధ రత్నావళి పీఠికలో (పుట 27) శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు జైన కర్ణాట భాషలలో జైనకృతు లనేకము లున్నవనియు నందు జినేంద్ర పురా ణాదిపురాణము లను రెండు జైన ప్రబంధము లుదాహరింపఁబడినను వాని నుండి పద్యము లెక్కువగాఁ జేర్కొనఁబడవయ్యె ననియు నున్నపద్యములైనను ప్రాచీనతర రచనలుగాఁ దోఁపవయ్యెననియు వ్రాసియుండిరి. ఉదాహృత పద్యము శ్లేషబహుళమై యుండుటయుఁ, దెలుఁగున క్రీ. శ. 16వ శతాబ్దివఱకును జిత్రశ్లేషమయ కవిత్వ మతివిరళముగనే కానవచ్చుటయు వా రట్లూహించుటకుఁ గారణములు. కాని క్రీ. శ. 12వ శతాబ్దిలో నుండిన నన్నిచోడుఁడు కుమార సంభవమున నట్టి కవిత్వము నచ్చటచ్చట వ్రాసియుండెను. క్రీ. శ. 9వ శతాబ్ది వాఁడును గన్నడ లాక్షణికుఁడు నైన నృపతుంగుఁడు కవిరాజ మార్గమున నట్టి రచనలు పేర్కొని యుండెను. పంప కవియే కన్నడమున వ్రాసిన విక్రమార్జున విజయములో నెడ నెడఁ జిత్రకవిత్వము కానవచ్చుచునే యున్నది. అందుచేఁ బై పద్యము శ్లేషమయమై యున్నంత మాత్రమున నది ప్రాచీన రచన కాదేమో యని సందేహింప నవసరము లేదు. కాని పంప, పద్మ శబ్దముల కభేదము కల్పించి, జినేంద్రపురాణము నందలిదిగా లభ్యమగుచున్న యేకమాత్ర పద్యము నాధారముగాఁ గొని, యా పురాణము నన్నయకు ముందుండె నని భావించుట కొంత దూరానేయముగాఁ గానవచ్చుచున్నది. ఈ విషయము నింతకంటె దృఢతరముగా నిశ్చయించుట కాధారాంతరములు లభ్యములగుట లేదు.

క్రీ. శ. 1400 ప్రాంతమున నుండిన మడికి సింగన తనకుఁ బూర్వులైన కవుల గ్రంథముల నుంచి యుద్ధృతములైన పెక్కుపద్యములతోఁగూడిన సకల నీతిసమ్మత మను నొక సంకలనగ్రంథమును గూర్చియుండెను. అతఁడు గ్రంథావ తారికలోఁ దా నే యే గ్రంథములనుండి యేయే కవుల గ్రంథములనుండి పద్యముల సేకరించెనో తెల్పియుండెను.[1] ఇందుఁ గొన్ని గ్రంథములయుఁ బురాణపురుషులయుఁ

---

1. ఆంధ్రభాషా కోవిదులైన సుకవీంద్ర విరచితంబైన ముద్రామాత్య పంచ తంత్ర బద్దె భూపాల చాణక్య ధౌమ్య విదుర, ధృతరాష్ట్ర బలభద్ర, కామందక గజాంకుశ నీతిసార నీతిభూషణ క్షేమేంద్ర భోజరాజ విభూషణ పురుషార్థసార భారత రామాయణాది మహాకావ్యంబులు, పురాణేతిహాసంబులు, కంచనా మాత్యుని నీతితారావళి లోకోక్తి చాటుప్రబంధములయందుం గల నీతివిశేషంబు లూహించి తత్తత్సారాంశంబులయ్యె విధంబుల వర్గ సంగతంబు గావించి సకలనీతి సమ్మతంబను పేర నొక్క ప్రబంధము రచింపుదు.

పేర్లు కలగలుపుగాఁ జెప్పఁబడినవి. "ఆంధ్రి భాషా కోవిదులైన సుకవీంద్ర విరచితంబైన" అనుమాటకుఁ దరువాతి శబ్దములతో నెట్టి సంబంధమో తెలియుటలేదు. ఏలయనఁ జాణక్య ధౌమ్య విదుర ధృతరాష్ట్రాదు లాంధ్రి భాషా కోవిదులును గారు. సుకవీంద్ర విరచిత గ్రంథ విశేషములును గారు. అందుచే నా విశేషముల ముద్రామాత్య పంచ తంత్రములకు రెండింటికే సంబంధించినవవి చెప్పుకోవలయును. తరువాతఁ జెప్పఁబడిన పేర్లలోఁ గొన్ని కర్తల పేర్లును గొన్ని కావ్యముల పేర్లునుగాఁ గానవచ్చుటచే "ఆది మహాకావ్యము"లను మాట కన్వయము కుదురుట లేదు. అప్పుడు కవుల పేర్లతరువాత "వారిచే రచింపఁబడిన" అనుమాటల నధ్యాహార్యము చేసికోవలెను. లేదా కవుల పేర్లతోడనే కావ్యములను పేర్కొను నాచారమును బట్టి యా పేర్లను దత్కృత కావ్యములుగా భావింపవలయును. అప్పుడైన ధౌమ్య విదురాదులు కవులు కాకపోవుటచే నా పేర్ల కెట్లన్వయము చెప్పవలెనో కుదురుటలేదు. ఇట్టి వచనము క్లిష్టాన్వయముగా గోచరించుచున్నను అందుఁ బేర్కొనఁబడిన కొందఱు కవులును కొన్ని కావ్యములును మన కిప్పుడు లభించుచుండుటచే మిగిలిన పేర్లనుగూడ యథార్థములుగా భావించి పరిశీలింప వలసి వచ్చుచున్నది.

గజాంకుశ క్షేమేంద్ర భోజరాజులు కవులై కావ్యములు వ్రాసి నట్లితరాధారముల వలనఁగూడఁ దెలియుచున్నది. వీ రందఱును, మఱికి సింగనచేఁ బేర్కొనఁబడి యుండుటచే క్రి. శ. 1400 కుఁ బూర్వమే యుండిన వారనుట నిశ్చితము. గజాంకుశుఁడు క్రీ. శ. 1000 సంవత్సరము ప్రాంతమువాఁడని కన్నడకవి చరిత్రము చెప్పుచున్నది. క్రీ. శ. 1049 లోని వాడఁగు శ్రీధరాచార్యుఁ డాతనిఁ బ్రశంసించి యుండుట యందు కాధారము. ఇతఁడే కాక నయసేనుఁడు (1112) దుర్గసింహుఁడు (1145) మున్నగువారు కూడఁ దమ గ్రంథములలో గజాంకుశునిఁ బ్రస్తుతించి యుండిరి. ఇంతమంది కవుల ప్రశంసలకుఁ బాత్రుఁడై యుండుటచే నాతఁడు కన్నడమున నుత్తమశ్రేణికిఁ జెందిన కవిగాఁ గానవచ్చు చున్నాఁడు. కాని యితఁడు కన్నడములోఁ గాని తెలుఁగులోఁ గాని వ్రాసిన, గ్రంథము లేవియుఁ గానవచ్చుట లేదు. గజాంకుశుఁ డనునది బిరుదనామమే కాని సహజనామము కాదనియు, నాతనిపేరు నారాయణుఁడనియు, నతఁడు రాష్ట్రకూట రాజును, క్రీ. శ. 939 నుండి 965 వఱకును మాల్యఖేటము రాజధానిగాఁ బాలించిన వాఁడును, అమోఘవర్షుని కుమారుఁడును, అకాల వర్ష

దేవుఁడను నామాంతరము గలవాఁడునగు మూఁడవ కృష్ణచక్రవర్తికి మంత్రియై ప్రసిద్ధికెక్కె ననియు, శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు శాస నాధారముతో నిరూపించి యున్నారు.[1] దానిని బట్టి యాతఁడు మహిష విషయమునందలి కాంచనముదువో లను గ్రామమున నివసించె ననియుఁ గౌండిన్యసగోత్రుఁ డనియు రామపార్యసుతుఁ డనియు, రాజవిద్యాపారగుఁ డనియుఁ దెలియు చున్నది. మఱికిసింగన పేర్కొన్న గజాంకుశుఁ డీ నారాయణుఁడే యగుచో నీతఁడు నన్నయకుఁ బూర్వుఁడై యాంధ్రమునఁ గవిత్వము చెప్పె నని నిశ్చయింప వచ్చును.

భోజమహారాజు క్రీ. శ. 1018 నుండి 1060 వఱకు ధారాపురము రాజధానిగా మాళవదేశము నేలి స్వయముగా మహాకవియై యనేక మహాకవులను బోషించి ప్రసిద్ధి నొందినట్టి వాఁడు. ఇతఁడు సంస్కృతమున రామాయణ చంపువు, సరస్వతీ కంఠాభరణము, శృంగార ప్రకాశము మున్నగు ప్రశస్త గ్రంథములను రచించి యుండెను. బద్దెన విరచితమైన నీతిసారముక్తావళి పీఠికలో శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు భోజరాజ విభూషణ మను నీతి భూషణము పేరు నుదాహరించి "భోజరా జాంధ్ర ద్రవిడ కర్ణాటములఁ గవిత్వముఁ జెప్పఁజాలె ననుట మనకు హృదయానందముగా నున్నద"ని వ్రాసి యున్నారు. దీనినిబట్టి భోజరాజు నీతిభూషణ మను నీతి గ్రంథము రచించె ననియు దానికి భోజరాజ విభూషణ మని నామాంతర ముండె ననియుఁ దెలియు చున్నది. సింగన నీతిభూషణ భోజరాజ విభూషణములను వేఱువేఱుగా నుదాహరించి యుండుటచే నవి వేఱువేఱు గ్రంథములని తోఁచుచున్నది. సకల నీతి సమ్మతమున నీతి భూషణములోని పద్యములే కాని భోజరాజ విభూషణము లోని పద్యము లుదాహరింపఁబడ లేదు. పద్యము లుదాహరింపఁ బడకుండ నాతఁడు గ్రంథమును మాత్రము పీఠికలో నేల పేర్కొని యుండెనో తెలియదు. లేదా సకలనీతి సమ్మతము పూర్తి గ్రంథ మంతయు లభింపమిచే లభ్యముగాని గ్రంథభాగమున నందలి పద్యము లేవైన నుదాహరింపఁబడి యుండు నని

1. నారాయణాభిధానేన నారాయణ ఇ వాపరః
విఖ్యాతో భువి విద్యావాన్ యో గజాంకుశసంజ్ఞయా
ప్రధానః కృష్ణరాజస్య మంత్రీ సన్ సంధివిగ్రహీ
శోలోద్గిస్తంభ శాసనము- Ep. I. Vol. IV పుట 57.

భావింపవలయును. నీతి భూషణమునకే భోజరాజ విభూషణము నామాంతర మని శ్రీ కవిగారు చెప్పుట కాధారము లేవియును లేవు.

ప్రసిద్ధులైన పూర్వకవు లెవ్వరును గవి స్తుతిలో భోజుని నుతియించి యుండ లేదు. నడిమింటి వేంకటపతి యభిషిక్త రాఘవము నందును, మొల్ల రామాయణము నందును, పైడిపాటి వేంకట నృసింహకవి లక్ష్మీనృసింహ విలాసము నందును భోజునిఁ బూర్వ కవిగా స్మరించినారు. కాని యాతఁ డాంధ్రకవిగనే వారిచే నుతింపఁబడె ననుట కాధారములు లేవు. అదిగాక శ్రీ రామకృష్ణకవిగారు సకల నీతి సమ్మత పీఠికలో నీతి భూషణము నాంధ్ర భోజుఁడను కవి రచించిన శ్లోక లక్షణ గ్రంథమునఁ గలదనియు, నాతఁ డెవ్వఁడో గుర్తించుటకు వీలు కాకున్న దనియు, బాలబోధ లక్షణమున నందలి పెక్కు పద్యము లుదాహరింపఁ బడిన వనియు వ్రాసి యున్నారు. దీనిని బట్టి చూడ నీతి భూషణమును రచించినవాఁడు సుప్రసిద్ధుఁడైన భోజమహారాజు గాక యాంధ్రభోజ బిరుదాంకితుఁడైన యింకొక కవి యెవ్వఁడో యని స్పష్టమగుచున్నది. ఇక్కడ నిట్లు వ్రాసి శ్రీ కవిగారు బద్దెన నీతిసార ముక్తావళి పీఠికలో భోజరాజే నీతి భూషణ కర్త యని వ్రాయుటకుఁ గారణమేమో తెలియదు. మొత్తము మీఁద బలవత్తరమైన యాధారము లభించు వఱకు భోజమహారా జాంధ్రమునఁ గవియై యుండినట్లు చెప్పఁ జాలము.

మఱికి సింగన సకలనీతి సమ్మతపుఁ బీఠికలో ముద్రామాత్య మను గ్రంథ మును క్షేమేంద్రుఁడను కవినిగూడఁ బేర్కొని యున్నాఁడు. తెలుఁగు కవులెవ్వరును ఈ క్షేమేంద్రునిఁ దమ గ్రంథములందు ప్రశంసించి యుండలేదు. సంస్కృత మున క్షేమేంద్రుఁడను ప్రసిద్ధకవి యొకఁడు కలఁడు. ఇతఁడు క్రీ. శ. 1020-1080 సంవత్సరముల నడుమఁ గాశ్మీర దేశపు రాజైన యనంతవర్మ యాస్థానమునం దుండెను. అతఁడు సంస్కృతమున సుమా రఱువది కావ్యములను వ్రాసె నని ప్రతీతి. ముద్రామాత్యము క్షేమేంద్ర కృతమనియు నది భోజరాజున కంకితము చేయఁ బడెననియు శ్రీ రామకృష్ణ కవిగారు బద్దెన నీతిసార ముక్తావళి పీఠికలోఁ దెల్పియున్నారు. సింగన ముద్రామాత్య నామమును క్షేమేంద్ర నామమును వేఱు వేఱు చోట్లఁ బేర్కొని క్షేమేంద్ర నామము తరువాత భోజరాజ విభూషణమును జేర్చి యున్నాఁడు. దీనిని బట్టి క్షేమేంద్రునికిని ముద్రామాత్యమునకును నెట్టి సంబంధమును లేదనియు, నితరములైన యాధారము లేవైన లభించుచో క్షేమేం

ద్రుఁడు భోజరాజ విభూషణమునే రచించెనని చెప్పుట యుచితముగా నుండు ననియుఁ దోఁచుచున్నది. సింగన సకలనీతి సమ్మతమున ముద్రామాత్యము నందలి పద్యముల నుదాహరించి యున్నాఁడు. కాని యెచ్చటను దానిని రచించిన వానిపేరు పేర్కొని యుండలేదు. ఈ క్షేమేంద్రుఁడు భోజరాజునకు సమకాలికుఁ డగుట సత్యమే కాని కాశ్మీర దేశీయుఁడైన యాతనికిని మాలవాధీశుఁడైన భోజ మహారాజునకును గావ్య కర్తృ కృతిపతిత్వ సంబంధ మేర్పడుటకుఁ దగిన యవ కాశము లేశమును గానవచ్చుట లేదు. మఱియు నీతఁ డాంధ్ర కవి యని చెప్పుట కును నాధారములు మృగ్యము. కాని సింగన గ్రంథ పీఠికలో క్షేమేంద్రునిఁ బేర్కొని యుండుటచే నా పేరు గల తెలుఁగు కవి యొకఁ డున్నాఁడని చెప్ప వచ్చును.

శ్రీ రామకృష్ణకవి గారు సకలనీతి సమ్మతమునందలి పీఠికలో "ముద్రా మాత్యము క్షేమేంద్రుఁడను బిరుదము వహించిన లక్కాభట్టను కవి రచించినట్లు తోఁచుచున్నది. క్షేమేంద్రకవి క్రీ. శ. 1050 ప్రాంతమున నుండెను గావునఁ దద్బిరుద వహనముచే నితఁడు తత్పూర్వుఁ డగుటకు సాధ్యుఁడు కాఁడు. ఇతఁడు శూద్రకరాజ చరిత్రమును, శతపక్షి సంవాదమును రచించినట్లు లక్షణ గ్రంథోదాహృత పద్యముల వలనఁ దెలియుచున్నది. బాలబోధమనియుఁ గవి సంజీవని యనియు సందిగ్ధనామములు గల యొక ఛందోగ్రంథమున ముద్రామాత్య నీతిభూషణ పురుషార్థసారములనుండి పద్యము లుదాహృతము లయ్యె .... ముద్రామాత్యము కేవలము నీతిగ్రంథము కాక ముద్రారాక్షసము వలె నొకరాజు ప్రాభవమును సంపాదించు మంత్రిశిఖామణి నీతి ధౌరంధర్యమును వర్ణించు కావ్యమో యను సందియము కలిగించుచున్నది. ఇందు రాజరాజ వంశజులగు చోళభూపతుల జయించిన చాళుక్య రాజులయో లేక చాళుక్యుల జయించిన కాకతీయులయో పరాక్రమము ప్రశంసింపఁబడిన ట్లుదాహృత పద్యముల వలన నూహింపఁదగియున్న" దని వ్రాసియున్నారు. ఈ వాక్యములను బట్టి కాశ్మీర దేశీయుఁడైన క్షేమేంద్రుఁడును లక్కాభట్టను నామాంతరముగల యా క్షేమేంద్రుఁ డును భిన్నులని తెలియుచున్నది. శ్రీ కవిగారు బద్దెన నీతిసారముక్తావళిలో క్షేమేంద్రుఁడు ముద్రామాత్యమును రచించి భోజరాజున కంకితము చేసెనని వ్రాసి యిచ్చట నిట్లు వ్రాయుటకు హేతువేమో తెలియదు. క్షేమేంద్ర బిరుద ధారియైన లక్కాభట్టు సంస్కృత కవియైన క్షేమేంద్రుని బట్టియే యా బిరుదమును

వహించిన వాఁడగుటచే నాతనికంటె నర్వాచీనుఁడనుట నిశ్చయము. మఱియు శ్రీ కవిగా రూహించినట్లు ముద్రామాత్యమునఁ జోళవంశీయుల జయించిన చాళుక్యులో చాళుక్యుల జయించిన కాకతీయులో వర్ణింపఁబడిరని తలంచితి మేని ఆ కాలము క్రీ. శ. 11వ శతాబ్ది తరువాతిదే యగుటచేఁ దత్కర్త నన్నయ్యకుఁ బూర్వము నివసించినవాఁడు కాఁజాలఁడు.

తంజావూరు సరస్వతీ పుస్తక భాండాగారమున కవి వాగ్బంధ మను నొక ఛందో గ్రంథ మున్నది. దీనికే కవి సార్వభౌమచ్ఛందస్సని యింకొక పేరు కల దనియు నిది తిక్కన సోమయాజి కృత మనియుఁ జెప్పఁబడుచున్నది. అందు వృద్ధి యతికి క్షేమేంద్ర కృతమైన శతపక్షి సంవాదమునుండి యొక పాద ముదాహృతమై యున్నది.1 ఈ కవి వాగ్బంధము తిక్కన రచించిన దనుట కాధారములు లేవు. పైఁగా నిందు 27 యతులు పేర్కొనఁబడి యుండుటచే నేతత్కర్త యనంతామాత్యునికిఁ దరువాతి వాఁడని చెప్పుట కవకాశ మున్నది.

భీమన పది చెప్పె ననం
తామాత్యుఁడు చేసె వెనుక యతు లిరువది నా
ల్గా మీఁదఁ గొందఱు కవి
గ్రామణు లిరువదియు నేడు గావించి రొగిన్ ॥

అని అప్పకవీయ తృతీయాశ్వాసములోఁ జెప్పఁబడిన పద్య మిందుకుఁ దార్కాణము. శతపక్షి సంవాద మను గ్రంథ మిప్పు డెచ్చటను లభ్యమగుట లేదు. అది యున్నను దత్కర్తయైన క్షేమేంద్ర బిరుదధారి నన్నయకుఁ దరువాతి వాఁడని తెలియుచుండుటచే నిచ్చట నాతని ప్రసక్తి తేనక్కఱ లేదు.

ప్రబంధ రత్నావళిలో సర్వదేవ కవి విరచితమగు నాది పురాణము నుండి రెండు పద్యములను, విరాట పర్వమునుండి యొక సీస పద్యమును ఉదాహరింపఁబడియున్నవి. పై ప్రబంధ రత్నావళికిఁ బెదపాటి జగ్గన ప్రబంధ రత్నాకరమును, ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యాలయమునఁ గల యుదాహరణ పద్యములను పేరు గల గ్రంథమును మూలమ్ములు. సర్వదేవుని పద్యములు పరిషత్కార్యాలయము

1. ఇందుల్లో వృద్ధియతికి క్షేమేంద్రులు చెప్పిన శతపక్షి సంవాదములోఁ "సీ. అను వినాశర రూపి యాద్యంత సకల లో
కైక సంస్తుత సురౌఘవంద్య" ఆంధ్ర. కవిత. I పుట 154.

వందలి గ్రంథములో నున్నవి. ఆ గ్రంథమున క్రీ. శ. 1530 కి పూర్వ మందున్న కవుల పద్యములే పేర్కొనఁబడి యుండుటచే సర్వదేవుఁడు కూడ నంతకుఁ బూర్వుఁడే యనుటకు సందేహము లేదు. కృష్ణదేవరాయల కాలము వాఁడగు నెడపాటి యెఱ్ఱన్న తన మల్హణ చరిత్రమున స్తుతించిన పూర్వ కవిసత్తములలో సర్వదేవునిఁ గూడఁ జేర్చి యుండెను.[1] ఇదికూడ సర్వదేవుఁడు క్రీ. శ. 16 వ శతాబ్దికిఁ బూర్వ ముండెనని మాత్రమే వ్యక్తము చేయుచున్నది. పెనుమర్తి వెంకటార్యుఁడు రచించిన లక్షణ సారమను ఛందో గ్రంథము నందుఁ గూడ సర్వదేవుని యాదిపురాణము వందలిదిగా నొక పద్య ముదాహరింపఁబడి యున్నది.[2] ఈ విషయము సర్వదేవుఁ డాది పురాణమును రచించెననియే వ్యక్తము చేయుచున్నది కాని యాతని ప్రాచీనతను నిశ్చయించుట కేవిధముగను దోడ్పడఁ జాలకున్నది. అప్పకవి వికల్పయతి కుదాహరణముగా ఒకనాఁ డిందుధరుం డిత్యాదిగాఁ గల పద్యము నాది పురాణము నందలి, దానినిగా నుదాహరించెను. కాని ఆ పద్యము నాచన సోముని యుత్తర హరి వంశమునఁ గానఁబడు చుండుటచే నాతఁడు పొరపాటు వ్రాసెనేమో యని తోఁచుచున్నది. ఆ పద్య మెందలి దైనను అతఁ డాదిపురాణ మను కావ్యమునుమాత్ర మెఱింగి యుండెనని తెలియుచున్నది. ఇది యత్కర్తృకమో యాతఁడు పేర్కొని యుండలేదు. రేచనకు గురువైన వాదీంద్ర చూడామణి యొక ఛందో గ్రంథమునే కాక యాది పురాణమును గూడ నాంధ్రమున రచించి యుండెనని శ్రీ చిలుకూరి వీరభద్రరావు గారు తెల్పి యున్నారు.[3] అప్పకవి యెఱిఁగిన యాది పురాణ మిదియో సర్వదేవునిదో తెలియదు.

---

1. వినుతి నొనర్తు నంధ్రసుకవి ప్రభు నన్నయభట్టు తిక్క
జ్వను శివదేవు భాస్కరుని జక్కన నాచనసో
వుని భవదూరు వేములవాడ పోతన పిల్లలమఱ్ఱి
ద్రుని శరభాంకు వీరకవి ధూర్జటి కేతన భ

2. శాలి వనాలిఁ గ్రాలి, జలజాత పరాగము పద్మినీ
కూల లతాంత సౌరభము గ్రోలి, మధూలిత
తూలము నేలి, వాఃకణము దోలి, మదేభ మదాం
దేలి, వనాంతరాళములఁ ద్రిమ్మరు గాలి ప్రమోద శాలియై

3. ఆం. క. త. II పుట 5.

కన్నడ రత్నత్రయము లోని పొన్నకవికి సర్వదేవుఁ డను పేరుండె ననియు నతఁడే యాది పురాణమును గూడ రచించి యుండెననియు, సుదయిని పత్రికలో శ్రీ డా. నేలటూరి వేంకట రమణయ్యగా రొక వ్యాసమునఁ దెల్పి యున్నారు.[1] ఈ పొన్నకవియుఁ బంప మహాకవివలెఁ దెలుఁగువాఁడే. అతఁడు శాంతిపురాణములోఁ దాను వేంగిదేశములోని కమ్మనాటికిఁ జెందిన పుంగనూరు గ్రామ వాసినని చెప్పుకొనియున్నాఁడు.[2] ద్వాదశాశ్వాసాంతమున నాతఁడు వాసిన

"సకలజ్ఞం కవి చక్రవర్తి జినచంద్రేంద్రంగ సద్భక్తి పూ
ర్వక దిందిమ్మన భక్తనుం త దనుజాతం పొన్ననుం పేళ్వుదం
దుకర ప్రార్థి సశాంతినాథ కథయం (వేళ్వుదం) వేసప్పినం సర్వదే
వ కవీంద్రం బిరదంబుధర్ పొగళ్వి నంతన్నం మహోత్సాహదిం"

అను పద్యమువలన నతనికి సర్వదేవుఁ డను పేరున్నట్లు స్పష్టపడు చున్నది. ఇతఁడు క్రీ. శ. 10వ శతాబ్దిలో రాష్ట్రకూట రాజ్యమును బాలించిన మూఁడవ కృష్ణ చక్రవర్తిని దన కవితాపాటవముచే మెప్పించి యుభయ కవి చక్రవర్తియను బిరుదమును బడసియుండెను. అందుచే నతఁడు పంపగజాంకుశా దులకు సమకాలికుఁడును నన్నయకుఁబూర్వుఁడును నగుచున్నాఁడు. ఈతఁడు ప్రధానముగాఁగన్నడ మహాకవియే యైనను ఆంధ్రుఁడగుటచేఁ బంపకవివలెఁ దెనుఁగులోఁగూడఁ గావ్యమును రచించి యుండుటలో నచ్చెరువు లేదు.

పొన్నకవియుఁ బంపవివలె జైన మతావలంబియే. పంపకవి కన్నడ భాషలో నాది పురాణమును రచించి యుండెను. దానికి క్రీ. శ. 8వ శతాబ్ది యుత్తర భాగమున నుండిన జినసేనుఁడను కవి రచించిన సంస్కృతాదిపురాణము మూలము. ఇందు జైన తీర్థంకరులలో నాద్యుఁడైన పురుదేవుని చరిత్రము వర్ణింపఁబడి యున్నది. పంప రచితమైన కన్నడ గ్రంథమునో లేక జినసేనుని సంస్కృత గ్రంథమునో చూచి పొన్నకవి తెనుఁగున నాది పురాణమును రచించి యుండును. లభ్యము లగుచున్న ఆంధ్రాది పురాణమునందలి మూఁడు పద్యములలో నీ క్రింది కంద పద్యము పంపకవి యాది పురాణమునందలి యొక పద్యములోని పదములను భావమును గూడ సన్నిహితముగా ననుసరించు చున్నది.

---

1. సం॥ I. మె. 1936 పుట 395.

2. శాంతి 1. ఆశ్వా. 41, 44, 45 పద్య.

క. శాళి హరినీల మణి కిర
ణాళి పొదఘెపె యె రాహుగెత్త గిదిద్ద
టాళి గెగ కల్లి నాదెయు
మాళోచం బెరసు తదెదు నదెవం దినపం. ఆది పు.

హరినీల మణి విరాజిత
సురుచిర గోపురము దగిలి చూచి తమి స్రా
కరుఁడు విధుంతుద మండల
పరిశంకం జేసి పురముపైఁ జన నోడున్ ॥ ప్రబంధ రత్నావళి.

దీనినిబట్టి పొన్నకవి పంపని యాది పురాణమునే యనుసరించె నేమో యను సందేహము కలుగుచున్నది.

లభించిన పద్యములలో రెండు పురవర్ణనమునకును ఒకటి వాయువర్ణనమునకును సంబంధించి యున్నవి ఇవి శబ్దాలంకార భూయిష్ఠములై ప్రౌఢమైన రచన గలిగి తరువాత వెలసిన ప్రబంధము లందలి పద్యములను బోలియున్నవి. పద్యములందలి వడక కుంటుపోక ధారాశుద్ధి శోభితమై యొప్పారుచున్నది. కీ.శే. ప్రభాకర శాస్త్రిగారు "ఉన్న పద్యములం జూడగాఁ బ్రాచీనతర రచనముగాఁ దోఁపకున్న" దని వ్రాసియున్నారు. కేవల రచనాపద్ధతిని బట్టి కవి ప్రాచీనతనో అర్వాచీనతనో నిర్ణయించుట చాల కష్టము. పురాణ యుగమునఁ బ్రబంధ రచనా క్రమముకూడ సాగెననుటకు నన్నిచోడుని కుమారసంభవము ప్రబలసాక్ష్యముగా నున్నది. మఱియుఁ బంపపొన్నాదులు ప్రధానముగాఁ గన్నడ కవులగుటచేతను వారు రచించిన తెలుఁగు కావ్యములలోఁ బ్రబంధ పరిపాటి కానవచ్చుటలో వింత లేదు. అంతమాత్రమున వారిప్రాచీనతను శంకింపవలసిన పని లేదు.

సర్వదేవుఁడు భారతము నందలి విరాటపర్వమును గూడఁ దెనిఁగించి యుండె ననుటకుఁ బ్రబంధరత్నావళిలో నుదాహరింపఁబడిన యా సీసపద్య మొక్కటి దక్క వేఱు సాక్ష్యములు లేవు. ఆ పద్యము పురసరోవరములను వర్ణించు చున్నది. ఇందలి శైలి సులభ జాతీయపదములతోఁ గూడి తిక్కన సోమయాజి శైలిని దలఁపించు చున్నది. పొన్నకవియే యీ సర్వదేవుఁడైనచో నా కాలమునకే తెలుఁగున సీసము సుందరగతి శోభితమై యొప్పారు చుండెనని

చెప్పవచ్చును. ఈ పద్యమున యతులను ప్రాసయతులను గూడ వేయఁబడి యున్నవి. అందుచే నన్నయ సీసపద్య నియమము లిందుఁ బాటింపఁ బడలేదని తెలియుచున్నది. ఈ విషయము నన్నెచోడుని ప్రాచీనతను సంశయాస్పద మొనరించు చున్నది.

తెలుఁగునఁ గల ఛందోగ్రంథములలోఁ గవిజనాశ్రయము మొదటిదిగాఁ గనవచ్చుచున్నది. దీని కర్తృత్వమును గూర్చి భిన్నములైన యభిప్రాయము లున్నవి. దీనిని వేములవాడ భీమకవి రచించెనని ప్రతీతి. ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు ముద్రించిన ప్రతిలో గ్రంథాంతమున "ఇది వాదీంద్ర చూడామణి చరణ సరసీరుహ మధుకరాయమాన కవిజనాశ్రయ శ్రావకాభరణాంక విరచితంబైన కవిజనాశ్రయ చ్ఛందంబునందు దోషాధికార"మని గద్యమున్నది. దీనిని బట్టి దానిని రచించిన కవి బిరుదములును, గురువుపేరును దెలియుచున్నవే కాని యాతనిపేరు తెలియవచ్చుట లేదు. గద్యకుఁ బైనున్న కందపద్యములో "మల్లియరేచన సుకవి జనాశ్రయుఁ డీ ఛందంబుఁ జెప్పె"ననియు, గ్రంథారంభము నందలి మూఁడవ పద్యమున "కవి జనాశ్రయుఁడు మల్లియరేచన సుకవి కవిజనాశ్రయ మను ఛందము దెనుఁగు బాస నరుదుగఁ జెప్పె" ననియు నుండుటచే మల్లియ కుమారుఁడైన రేచన కవిజనాశ్రయమునకుఁ గర్తయని తేలుచున్నది. అతనికిఁ గల (సు) కవిజనాశ్రయ బిరుదమును బట్టి గ్రంథమునకుఁ గవిజనాశ్రయ మను పేరు కలిగియుండవచ్చును. గ్రంథమునం దెడనెడ 'మల్లియ రేచా'యను సంబోధన ముండుటచే నాతఁ డాత్మసంబోధనము కావించుకొని కొన్నికొన్ని పద్యములు రచించెనని యూహింపవచ్చును. కాని వేములవాడ భీమకవియే యీ గ్రంథమునురచించి ద్రవ్యలోభముచే రేచన పేరుపెట్టి యుండునని పలువురు పండితు లభిప్రాయ పడుచున్నారు. ఆంధ్ర సాహిత్య పరిషత్తువారికి దొరకిన పది ప్రతులలో నొకదాన మాత్రముండిన యేడు పద్యములు ముద్రిత ప్రతియం దవతారికగా ముద్రింపఁబడినవి. అందులో

శ్రీ కరముగ రేచనపై
లోకంబున సుకవివరులు లోలతఁ బొగడన్
బ్రాకటముగ నీ ఛందము
లోకం బౌ ననఁగఁ దెలుఁగులో నొనరింతున్॥ (2)

వేమనవాడను వెలసిన
భీమేశ్వరు కరుణగల్గు భీమ సుకవి నే
కోమటి రేచన మీఁదను
నీ మహి కవులెన్న ఛంద మెలమి రచింతున్॥ (3)

రేచన సంతోషిల్లఁగ
భూచక్రములోన భీమ పురహరు కృపచే
ఏ ఛందము సుకవులు బ్రది
కే చందము తెరువు దానినే రచియింతున్॥ (6)

నిను నీవె పొగడు వైఖరి
నొనరించెదఁ దెనుఁగు బాస నొప్పుఁగ ఛందం
బున.... ... (7)

మున్నగు పద్యములందు వేములవాడ భీమకవియే యీ ఛందో గ్రంథమును రేచనపేర రచించెనని చెప్పఁబడుటయే వార ట్లభిప్రాయపడుటకుఁ గారణము. ఆ ప్రతిలోనే కల మఱిరెండు పద్యము లా యవతారికలోఁ గాక పీఠికలో మఱొక చోట ముద్రింపఁ బడినవి. ఇందలి మొదటి పద్యమున

"పరఁగిన విమల యశోభా
సురనిరతుఁడు భీమనాగ్రసుతుఁ డఖిల కళా
పరిణతుఁ డయ్యె.

నని భీమనాగ్ర సుతుఁడు పేర్కొనఁబడి యున్నాఁడు. ఈ పద్యము లన్నిప్రతుల లోను లేక యొక్క ప్రతిలో మాత్రమే కానవచ్చుట చేతను, మొదటి యేడింటిలో భీమ సుకవి యనియుఁ దరువాతి రెండిటిలో భీమనాగ్రసుతుఁడనియుఁ జెప్పఁబడి యుండుటచేతను ఈ పద్యముల నెవ్వరో లేఖకులు వ్రాసి యా ప్రతిలోఁ జేర్చి యుందురను సందేహ ముదయించుచున్నది. మఱియు నా యేడు పద్యములలో మొదటి దింటక మార్పుతో ననంతుని ఛందమునఁగూడఁ గనఁబడు చున్నది. ఇదియు నా పద్యములు కవిజనాశ్రయ కర్తకాక మ ఱెవ్వరో వ్రాసి యందుఁ జేర్చి రనుటకుఁ దార్కాణముగా నున్నది. వేములవాడ భీమకవిని స్తుతించిన శ్రీనాథాదులెవ్వరు కాని యాతఁడు ఛందోగ్రంథకర్త యని కాని కవిజనాశ్రయ కర్త యని కాని చెప్పి యుండలేదు. అప్పకవి కవిజనాశ్రయములోని పద్యము

లను, భీమకవి పేరును గొన్నిచోట్ల నుదాహరించెను గాని యాతఁడు వేముల వాడ భీమకవి యని యెచ్చటను స్పష్టముగాఁ జెప్పియుండలేదు. కవిజనాశ్రయ తాళ ప్రతులపై భీమన ఛ్ఛందస్సని యుండ వచ్చును. దానిని భీమనయో భీమ నాగ్రసుతుఁడో వ్రాసి యుండ వచ్చును. కాని వేములవాడ భీమకవియే దాని కర్త యనుటకుఁ బ్రక్షిప్తములని చెప్పఁదగిన యవతారికలోని యేడుపద్య ములలో నొకదానఁ గల "వేమన వాడను వెలసిన" యను భాగము తక్క మఱే యాధారమును లేదు. అందుచే దానిని వేములవాడ భీమకవి రచింప లేదనియే భావింప వచ్చును.

అయినచోఁ గవిజనాశ్రయ కర్త యెవ్వరు? శ్రీ చిలుకూరి వీరభద్ర రావుగారు వర్ధమాన పురాధీశుఁడును భీమన సోదరుఁడునైన గోకర్ణుఁడు వాదీంద్ర చూడామణి యను జైన సమయాచార్యుని శిష్యుఁడనియు నాతఁడు కవిజనాశ్రయ మను ఛందోగ్రంథమును రచించి కళ్యాణ పురాధిపతి యైన చాళుక్య జగదేక మల్లుని సేనాపతి యగు రేచ భూపాలున కంకితము చేసెననియుఁ గాకతీయాంధ్ర రాజయుగ చరిత్రలో వ్రాసియున్నారు. కాని కవిజనాశ్రయమున రేచన సేనాధిపతి యని సూచించు విశేష మొక్కటియుఁ గానరాదు. చాళుక్య జగదేక మల్లునికి రేచన యను సేనాని యుండెననుటకును నాధారములు మృగ్యము. "కస్తూరి రంగకవి గోకర్ణుని ఛందస్సనియు, భీమన ఛందస్సనియు వేఱు వేఱుగా వ్రాసి వేఱువేఱుగాఁ బద్యముల నుదాహరించి యున్నాఁడు." అప్పకవి కూడ గోకర్ణ ఛ్ఛందమును గవిజనాశ్రయంబునని వేఱువేఱుగా నుదాహరించి యున్నాఁడు.[1] గోకర్ణుఁడే రెండు వేఱువేఱుఛందోగ్రంథములను రచించెననుట యుక్తియుక్తము కాదు. అందుచే గోకర్ణుఁడు కవిజనాశ్రయ కర్త యనుట కవకాశము లే దున్నది "వేములవాడ భీమకవి గాక మఱొక భీమన దీనిని రచించి యుండ వచ్చు"[2] ననియు, నప్పకవ్యాదు లీ భీమ కవుల నిర్వురి నొక్కరుగా భ్రమించి యుండ వచ్చుననియు నాంధ్రకవి తరంగిణీ కర్తల యూహ. కవిజనాశ్రయము నకు భీమన ఛందస్సను ప్రతీతి యుండుట తక్క నీ యూహ కింకొక యాధారము లేదు.

---

1. ఆం. క. త. 8 పుట II Pt.

2. Do. 7 పుట II Pt.

క్రీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచికలోఁ నన్నయకుఁ బూర్వము ఛందస్సును వ్యాసమునఁ గవిజనాశ్రయము రేచన కృతమే యనియు, నది క్రీ. శ. 11 వ శతాబ్దికిఁ దరువాతిది కాకుండు ననియు నిరూపించి యున్నారు.[1] అఱవ భాషలో యాప్పిరుంగలమ్ కారికై యను చాల ప్రసిద్ధమైన ఛందోగ్రంథ మొకటి యున్నది. ఇది క్రీ. శ. 11వ శతాబ్దికిఁ జెందినది. కారికా రూపమున నున్న దీనికిఁ దరువాత నొక వృత్తి కూడ రచింపఁ బడినది. ఆ మూల గ్రంథమునఁ (పుట 490) దత్కర్తకుఁ బూర్వులైన ద్రవిడాంధ్ర కర్ణాట చ్ఛందో గ్రంథకర్తలు పేర్కొనఁబడి యున్నారు. "వీని నంతయు చరణాశ్రయమను జయదేవమును, మిశ్రాకృతియను(మిధ్యాకృతియను) పింగళమును, మా పింగళము, రణమా మంజూపా చంద్రకోటి చ్ఛందస్సును, గుణహాంకి యనెడి కర్ణాటక చ్ఛందమును, రేచి (కొ) యారు శెయ్‌ద వడుగ చ్ఛందమును, అయినవానిలోను మా పురాణము మొదలైన అఱవ గ్రంథములలోను ప్రవేశము గలవారి నడిగి తెలుసుకొనునది. దీని నంతయు వివరించి చెప్పిన యెడల విస్తార మగును" అను నర్థము గల భాగ మిందుకు దృష్టాంతము. రేచియారు శెయ్‌ద వడుగ చ్ఛంద మనఁగా రేచియ రచించిన తెలుఁగు ఛందో గ్రంథ మని యర్థము. ఈ గ్రంథము కవిజనాశ్రయమే యని వేఱుగాఁ జెప్ప నవసరము లేదుగదా! రేచియ (రేచన) యాప్పిరుంగలమ్ కర్తకుఁ బూర్వుఁ డగుటచే క్రీ. శ. 11 వ శతాబ్ది లోనివాఁడు. అనఁగా నన్నయకు సమకాలికుఁడో

---

1. రా. రా. న. ప. సంచిక. పుట 30.

ద్రావిడ భాషలో యాప్పిరంగలమ్ అను ఛందో గ్రంథము పదునొకండవ శతాబ్దిదికలదు. అందు సంస్కృత కర్ణాటాంధ్ర చ్ఛందస్సు ప్రస్తావమున్నది. "వాంచియార్ శెయిద వడఘు చందవుం" అని యందున్నది. అనఁగా వాంచియ రచించిన తెలుఁగు ఛందమును జూచి తా నా గ్రంథమును రచించినట్లు గ్రంథకర్త చెప్పుకొనుటలోఁ గలదు... ప్రాచీన లిపి రీతిని బరిశీలించినవారు వాంచియార్ అను పదము రేచియార్‌గా నుండఁదగు ననిరి. కొన్ని సంస్కృతశబ్దములు కూడ నిం దిట్లే వికృతిని బొరసి యున్నవి. రేచియార్ అని యగునేని యా గ్రంథము (రేచియ) రేచన రచించిన కవి జనాశ్రయ మగును. ఆ ద్రవిడ గ్రంథకర్త జైనుఁడు. ఈ రేచియయును జైనుఁడే. ఇది యొక పొందిక యగును. ఇట్లగునేని కవి జనాశ్రయము 11 వ శతాబ్దికి తర్వాతిది కాక పోవును.

యించుక తరువాతి వాఁడో యని చెప్పవచ్చును. ఈతని ప్రాచీనతను నిర్ణయించుటకు మఱికొన్ని యాధారములు కూడఁ గనవచ్చుచున్నవి.

కన్నడ భాషలోఁ గవిరాజ కలహంస బిరుదాంకితుఁ డగు నాగవర్మ ఛందోఽంబుధి యను సుప్రసిద్ధ ఛందోగ్రంథమును రచించియున్నాఁడు. ఇతఁడు క్రీ. శ. 10వ శతాబ్ది తుది పాదమున నున్నవాఁడు. ఛందోఽంబుధి ఆఱు ప్రకరణములుగా విభజింపఁ బడినది. కవిజనాశ్రయము నందలి అయిదధికారములకును వీనికిని బెక్కు విషయముల సాదృశ్యము కానఁ బడుట చేతను, నాగవర్మ నుతించిన "జయదేవాద్యర ఛంద" మును (షష్ఠాధికారము మొదట) రేచన గూడ గ్రంథాంతమునఁ బ్రస్తుతించి యుండుటచేతను,అతఁడు నాగవర్మ ఛందోఽంబుధి ననుసరించినట్లు వ్యక్తమగు చున్నది. మఱియుఁ గవిజనాశ్రయము నందలి దోషాధికారము మొదట నున్న "శ్రీ శ్రితవక్షుఁ" డిత్యాదిగాఁ గల కంద పద్యమొకటి నన్నిచోడుని కుమారసంభవ సప్తమాశ్వాసాదిని స్వల్పములైన మార్పులతో ననుసరింపఁ బడియున్నది. నన్నిచోడుఁడు క్రీ. శ. 12వ శతాబ్ది పూర్వార్ధమున నున్నవాఁడని విమర్శకులు తలంచుచున్నారు. దీనిని బట్టి రేచన నాగవర్మ నన్నెచోడులకు నడిమి కాలమున నున్నట్లు నిశ్చయము చేయవచ్చును.

కవిజనాశ్రయ గద్యలో రేచన వాదీంద్ర చూడామణి చరణ సరసీరుహ మధుకరాయమానుఁ డని చెప్పఁబడి యుండుటచే నతఁడు వాదీంద్ర చూడామణి శిష్యుఁ డని తెలియుచున్నది. ఈ వాదీంద్ర చూడామణిని గుమారసంభవ కృతిపతియైన జంగమ మల్లికార్జునుఁడు వాదమున నోడించి న ట్లందలి నవమాశ్వాసాంత పద్యములం దొక దాన నున్న "పర వాదీంద్ర ఘనా ఘనానిలుఁ" డను విశేషణము ధ్వనింపఁజేయుచున్నదని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు చెప్పుచున్నారు.[1] ఇదియుఁ గవిజనాశ్రయకర్త క్రీ. శ. 11 వ శతాబ్దిలో నివసించి యుండె నను విషయమునే వ్యక్తీకరించు చున్నది.

రేచన రచించిన యీ ఛందోగ్రంథము వలన నన్నయకుఁ బూర్వము తెలుఁగునఁ బద్యరచన బాగుగా సాగుచుండెనని చెప్పుట కవకాశము కలుగుచున్నది. సాధారణముగా లక్ష్యములు విస్తారములుగా నున్నప్పుడే లక్షణ

1. తె. క. చ. పుట 171.

గ్రంథములు బయలుదేఱును. అట్టి లక్ష్యములు లేకుండనే లాక్షణికులు "కుమ్మర వాఁడు కుండలను వలె" లక్షణములను వ్రాసి వానిని లోకు లనుసరింప వలె నని యాజ్ఞాపింపఁజాలరు. వా రట్లు చేసినను వాని ననుసరించువారు పలువు రుండరు. అందుచే క్రీ. శ. 11 వ శతాబ్దిలోనే కవిజనాశ్రయమువంటి యుత్తమ చ్ఛందోగ్రంథ మవతరించె ననఁగా నంతకుఁ బూర్వ మందలి లక్షణములకు లక్ష్యములుగాఁ దగిన కావ్యములు కొన్ని యుండెనని నిస్సందేహముగాఁ జెప్పవచ్చును. ఆ కావ్యము లేమైన వను ప్రశ్నకు సమాధానము చెప్పఁజాలము. మతవైషమ్యముచేతనో, దేశ భాషలందు పండితుల కంతకుఁ బూర్వ మధిక మైన యాదరము లేమిచేతనో యా గ్రంథములు నష్టములై పోయి యుండును.

కవిజనాశ్రయము క్రీ. శ. 11 వ శతాబ్దిలోని దగుట నిజమైనచో నందుఁ బేర్కొనఁబడిన జయదేవుఁడును, వాదీంద్ర చూడామణియు నన్నయకుఁ బూర్వము నివసించిన కవులని చెప్పవలసివచ్చును. కవిజనాశ్రయమునఁ గల

జయదేవాది చ్ఛందో
నయమున సంక్షేపరూపునం జెలువుగ మ
ల్లియ రేచన సుకవి జనా
శ్రయుఁ డీ ఛందంబు చెప్పె జనులకుఁ దెలియన్ ॥

అను పద్యమునుబట్టి తత్కర్త జయదేవ చ్ఛందము నొజ్జబంతిగాఁ గైకొనె నని తెలియుచున్నది. కర్ణాట చ్ఛందోఽంబుధి కర్తయైన నాగవర్మకూడ నీ జయ దేవుని నుతించి యుండుటచే నతఁడు నాగవర్మకుఁ గూడఁ (క్రీ. శ. 10వ శతాబ్ది తుది పాదము) బూర్వుఁడని చెప్పవలయును. కస్తూరి రంగకవి యానంద రంగ రా ట్ఛందమున,

రహిగ లశలకు దశలకుఁ బ్రాస యతులొ
నరుప నవి యభేద ప్రాస విరతులగును
గశల విలసిల్లు నీ విందు నెలయనంగ
(జాదనేసె రాముఁడు సప్తతాళములన)

నను పద్యము జయదేవ చ్ఛందములోనిదిగాను నుదాహరింపఁ బడుటచే నా గ్రంథము తెలుఁగు గ్రంథమేయని తెలియుచున్నది. సంస్కృతమున జయదేవ నామధారులైన కవులు ముప్పురు నలువు రున్నారు. వారికిని ఛందోగ్రంథకర్త

యైన జయదేవునికిని నేమైన సంబంధ మున్నదో లేదో తెలియదు. చింతలపూడి యెల్లయ రాధామాధవమున రాధామాధవ కర్తయైన జయదేవు నొకని సన్నుతించి యున్నాఁడు. ఆ జయదేవుఁడే యీ ఛందోగ్రంథ కర్తయై యుండునని ఆంధ్రకవి తరంగిణీ కర్తగా రూహించుచున్నారు.[1] కాని య ట్లూహించుట కాధారము లేనియును లేవు. కవిజనాశ్రయ చ్ఛందోంబుధులలో జయదేవుఁడు ప్రస్తుతింపఁ బడుటచే నాతఁడు నన్నయకుఁ బూర్వుఁడే యై యుండునని తలంపవచ్చును. ఇంతకంటె నాతని గూర్చి యేమియుఁ దెలియదు. అప్పకవి యీతనిని పేర్కొని యుండలేదు.

రేచన గురువైన వాదీంద్ర చూడామణి తనపేరనే యొక లక్షణ గ్రంథ మును రచించినట్లు తెలియుచున్నది. అప్పక వీయారంభమునఁ జెప్పఁబడిన యాంధ్ర లక్షణగ్రంథములలో వాదీంద్ర చూడామణి కలదు. కాని యాతఁడందలి పద్యముల నెచ్చటను ఉదాహరించి యుండలేదు. సంస్కృత భాషలో కవి కర్పటిక యను చిత్రకావ్యమును రచించిన వాదీంద్ర చూడామణి యొకఁడు కలఁడు.[2] కాని యాతనికిని రేచన గురువునకును గల సంబంధ మెట్టిదో తెలియదు. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు వాదీంద్ర చూడామణి ఛందో గ్రంథమునే కాక ఆదిపురాణమును గూడ నాంధ్రమున రచించెనని వ్రాసి యున్నారు.[3] కాని యా గ్రంథ మిప్పుడు లభ్య మగుటలేదు. అందుచే నీ వాదీంద్ర చూడామణి నన్నయకుఁ బూర్వముండిన యొక పండిత కవి యనియే కాని యాతనిఁ గూర్చి యంతకంటె నేమియుఁ జెప్పుటకు వీలు లేకున్నది.

నన్నయకు సహాధ్యాయుఁడును, నందంపూడి అగ్రహార దాన పరిగ్ర హీతయు నగు నారాయణభట్టు నన్నయ కాంధ్ర భారత రచనమునఁ దోడ్పడి యుండెనని "పాయక పాకశాసనికి" అను పద్యము వలనఁ దెలియుచున్నది. నందంపూడి శాసనములో నన్నయ యాతఁడు సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచి కాంధ్రాది భాషలలోఁ గవితఁ జెప్పఁజాలి కవి రాజశేఖర, కవీభ వజ్రాం కుశ బిరుదములను వహించి సరస్వతీ కర్ణావతంసుఁ డనియు, అష్టాదశావధారణ

1. ఆం. క. త. పుట 3.
2. సం. వా. చ.
3. ఆం. క. త. పుట 5. Part II.

చక్రవర్తియనియుఁ బ్రసిద్ధి వడసెనని వర్ణించి యున్నాఁడు. ఈతఁ డాంధ్రమున వ్రాసిన గ్రంథమేదియు లభ్యమగుటలేదు. శ్రీ నిడుదవోలు వేంకటరావు గారు తెలుఁగు కవుల చరిత్రలో పాయక పాకశాసని కిత్యాది పద్యము భారత తాళపత్ర ప్రతులు పెక్కింటిలో లే దనియు నప్పకవి నిత్య సమాస విశ్రాంతులలో నారాయణ శబ్దమున కుదాహరణముగా (3-170) నా పద్యము నిచ్చియుండుటచే నది యాతని నాఁటి తాళపత్ర ప్రతులలో నుండి యుండవలె ననియు, నవి యిప్పుడు లభ్యములు కావు కాన నందలి సత్యము నిరూపింపఁ జాలమనియు, నొక్క యీ పద్యమునఁదప్ప నన్నయ భారతము నం దింకెక్కడను నిత్య సమాస విశ్రాంతి కుదాహరణములు లేవనియు, నప్పకవికిఁ బూర్వుఁడును భారతము నుండియే మూఁడు వంతులకుఁ బైఁగా నుదాహరణము లిచ్చి యున్నవాఁడు నగు ముద్దరాజు రామన్న కవిసంజీవనిలోఁ బై పద్యము నుదాహరింప లేదనియుఁ దెల్పి యవతారికలోఁ బై పద్యమును నన్నయ వ్రాసెనో లేదో యని యనుమానించుచున్నారు. నిజమున కా పద్య మచ్చట లేకపోయినను సందర్భమునకుఁ గాని అరమునకుఁ గాని యెట్టి భంగమును బాటిల్లదు. మఱియు

మును నారాయణ ధీరుఁడు
తనకు సహాయుఁడుగ సంస్కృతము వాగనుశా
సనుఁడు రచియించె దానిం
దెనిఁగింపఁగ నీకుఁ దోడు నే నిపుడగుదున్ ॥

అని అప్పకవి నన్నయకు భారత రచనముననే కాక ఆంధ్రశబ్ద చింతామణి రచనమునఁగూడ నారాయణభట్టు సాయ మొనరించెనని వ్రాసి యుండిన పద్యము నన్నయయే యాంధ్రశబ్ద చింతామణి రచించెనని స్థిరపఱుచుటకై యాతఁడు సృష్టించినదేమో యను ననుమానమును గలిగించు చుండుటచే భారతము నందలి పద్యముకూడ నట్టిదే యేమో యను నూహ జనింపఁ జేయుచున్నది. ఈ విషయము నారాయణభట్టు భారత రచనమున నన్నయకు సాయ మొనరించె నను వంశమునకే బాధకముగా నున్నది కాని నారాయణభట్టుకాలమున నుండె నను వంశమునకు బాధకము కాఁజాలదు. ఏలయన దాని కీ పద్యముకాక నందంపూడి శాసనము ప్రబలతరమైన సాక్ష్యము.

నందంపూడి శాసనము వేయింపఁబడిన కాలము క్రీ. శ. 1053. నారాయణ భట్టు కూఁతురు కుపమ యను నామె ద్రాక్షారామ భీమేశ్వరునకు అఖండ దీపము

వక్తై లోహపు దివియ నొసఁగి క్రీ. శ. 1055లో వ్రాయించిన శాసనములో[1] "త్రైలోక్య మల్లదేవర ప్రధాని నారాయణ భట్టు కూంతురు కుపమ" యని యున్నది. కీ. శే. కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు పంతులుగారు క్రీ. శ. 1044 మొదలు 1058 వఱకు కళ్యాణ కటకము నేలిన ప్రథమ సోమేశ్వరునకు త్రైలోక్య మల్ల, ఆహవ మల్లయను బిరుదు లుండుటచే నాతనికే నారాయణ భట్టు మంత్రి యనియు, నందమపూడి దాన పరిగ్రహీతయైన నారాయణ భట్టు కూడ నా కాలమునందే యుండుటచే నా యిరువురు నారాయణ భట్టులు నొక్కరే యనియు వ్రాసియున్నారు.[2] శ్రీ నేలటూరి వేంకట రమణయ్యగారు కూడ నా యూహతో నేకీభవించుచు "ప్రధాని నారాయణభట్టు నిజ ప్రభువగు త్రైలోక్య మల్ల సోమేశ్వర చక్రవర్తి యొక్క స్థానాపతియై యతని కరిగాపైన రాజరాజ నరేంద్రుని యాస్థానమునకు వచ్చెననియు, నన్నయ భట్టారకునికి భారత రచనయందుఁ దోడ్పడెననియు దానికిఁ బ్రతిఫలముగ రాజరాజ నరేంద్రుఁడతనికి నందమపూడి గ్రామము నగ్రహారముచేసి ఇచ్చెననియు" భారతిలో వ్రాసియున్నారు. నందమపూడి శాసనములో నారాయణభట్టు కవియుఁ, బండితుఁడు ననియే కాని యొక రాజునకుఁ బ్రధానిగా నుండెననుటకు సూచనయైన లేకపోవుటచేతను, త్రైలోక్యమల్లుఁడు వేంగీదేశమును జయించెననుటకును రాజరా జాతని కరిగాపుగా నుండెననుటకును బ్రబల తరములైన యాధారములు లేకపోవుటచేతను, నన్నయకు సహాధ్యాయుఁడై భారత రచనలో నాతనికిఁ దోడ్పడిన నారాయణభట్టును త్రైలోక్య మల్లదేవరకుఁ బ్రధానిగా నుండిన నారాయణభట్టును భిన్నులై యుందురనియు యాదృచ్ఛికముగాఁ గాలసామ్యము కుదురుటచే నా భ్రాంతి కవకాశము కలుగుచున్నదనియు నాంధ్రకవి తరంగిణీ కర్తగారు వ్రాసియున్నారు.[3] కాని నందమపూడి శాసనమున నారాయణభట్టు తండ్రి శంకనామాత్యుఁడనియుఁ, దాతయగు కంచెనను అరిగణములు యమునిగా భావించు చుండిరనియు, (యం మన్యంతే యమ మరిగణాః) వ్రాయఁబడి యుండుటచే వారెక్కడనో మంత్రులై యుండిరనియే తోఁచుచున్నది. అట్టియెడ నారాయణభట్టుకూడ మంత్రిత్వము నెఱపి యుండుటలో నచ్చెరు

---

1. S. I. 4. No. 1010.

2. రా. రా. న. పట్టా. పుట 114-115.

3. ఆం. క. త. I పుట 139,

వేమియును లేదు నందమపూడి శాసనములో నా సూచన లేనంత మాత్రమున నా విషయమును శంకింపఁబనిలేదు. అందుచే మంత్రి నారాయణభట్టును, గవి పండిత నారాయణభట్టును నొక్కరేయని చెప్పవచ్చును.

నారాయణభట్టు గృహనామము వానస. గోత్రము హారీత గోత్రము. మడికి సింగన పద్మపురాణకృతిపతియైన కందనమంత్రి యింటిపేరుకూడ వానసవారే. అతని గోత్రము కాశ్యప గోత్రము. హైదరాబాదు ప్రభుత్వమువారు ప్రచురించిన నాగాయి శాసనములో దాతలయిన గోవిందరాజాదులు కూడ వానసవారే. వారు వసిష్ఠసగోత్రులుగాఁ గన్పట్టుచున్నారు. దీనినిబట్టి వానస వారిలో మూఁడు భిన్న గోత్రములవా రుండినట్లు గోచరించుచున్నది. నారాయణ భట్టు కర్ణాట భాషలో నొక భారతమును వ్రాసెననియు దానికిని నన్నయ భారతమునకును జాలచోట్ల సామ్యము లున్నవనియుఁ జెప్పుదురు కాని యా భారతము లభ్యమగుట లేదు. కర్ణాట కవిచరిత్ర ప్రథమ భాగమున (పుట 74) "ఇవను కన్నడదల్లి అవ గ్రంథ వన్ను బరదిద్దాన యో తిళియ" దని వ్రాయఁబడి యున్నది. ఈతఁడు తెలుఁగునఁ గూడ నేవైన గ్రంథములను వ్రాసెనో లేదో తెలియదు. రెట్టఁడను కవి కన్నడమున రెట్టమతమును రచించెను. ఆతఁడు తన గ్రంథమున నారాయణభట్ట విరచిత శాస్త్ర మాధారమని చెప్పినట్లు అయ్యల భాస్కరకవి రెట్టమత శాస్త్రము నందలి "ఉదిత కీర్త్యాఖ్యచే నొనరు నారాయణభట్ట మతంబును" అను పద్యపాదమువలనఁ దెలియుచున్నది.[1] ఈ నారాయణ భట్టునకును నన్నయ మిత్రుఁడైన నారాయణ భట్టునకును గల సంబంధ మెట్టిదియో నిర్ణయించుట కవకాశము లేదు.

పైని పేర్కొనఁబడినవారు కాక యాంధ్రమున నన్నయకుఁ బూర్వ మింకను గొందఱు పండిత కవులుండిన ట్లాధారములు కానవచ్చుచున్నవి. క్రీ. శ. 9 వ శతాబ్ది యుత్తరార్ధమునఁ బరిపాలించిన గుణగ విజయాదిత్యుని కాలమునందలి సాతలూరి శాసనమందు సంస్కృత భాషలో నొక చంపకమాలా

1. ఆం. శ. త. I పుట 139,

వృత్తమున్నది.[2] ఈ వృత్తమునకు సంస్కృత భాషలో నంత ప్రాచుర్యము లేదు. క్రీ శ. 8, 9 శతాబ్దులలో నుండిన రాజశేఖరాది సంస్కృత కవులు దీనిని వాడినను అంతకుఁ బూర్వు లెవ్వరును ఆ భాషలో దీనిని వాడి యుండ లేదు కన్న డాంధ్రములందు దీనికి ప్రచార మెక్కువ. అందుచే దాక్షిణాత్య వాఙ్మయము నుండియే యిది సంస్కృతమున కెక్కియుండునని తలంప వచ్చును. పై శాసనములందలి చంపకమాలలోఁ బ్రాస నియమము కానవచ్చు చున్నది. మొదటి రెండుపాదములలో యతినియమము కూడఁ బాటింపఁ బడినది. సంస్కృతమున గణనియమమే కాని ప్రాసనియమము లేదు. అందు యతిస్థానమునఁ బదము విఱిగినఁ జాలును. పాదాద్యక్షరమో తన్మిత్రాక్షరమో యతి స్థానమునఁ బునరావృత్తము కావలసిన యక్కఱ లేదు కన్నడమునఁ బ్రాస నియమ మున్నది కాని యతి నియమము లేదు. అందుచేఁ బై శాసన కావ్యకర్త తెలుఁగు కవిత్వముతోఁ బరిచ యము కలవాఁడనియు నందు చేతనే సంస్కృత భాషలో నా నియమము లేక పోయినను బ్రాసనియమము నా చంపకమాలలోఁ బాటించినాఁ డనియుఁ దోఁచు చున్నది ఆ శాసనమున కాజ్ఞప్తి పండరంగఁడు. కర్త యెవ్వరో తెలియదు. పండ రంగఁడే శాసనకర్త కూడ నై యుండునని శ్రీ వేంకటరావుగారి యూహ. అది నిజమో కాదో నిశ్చయముగాఁ జెప్పఁజాలము కాని యా శాసనకవి తెలుఁగు కవి కూడనై యుండుననుటలో సందేహము లేదు.

క్రీ. శ. 973-1000 మధ్య నుండిన రెండవ యుద్ధమల్లుని కుమారుఁడైన బాడప మహారాజు వేయించిన ఆరుంబాక తామ్ర శాసన మంతయు సంస్కృతము లోనే యున్నది. కాని యందు యతిప్రాసలతోఁ గూడి సరిగాఁ దెలుఁగుపద్యమే

2 భారతి I. 1 పుట 90-110

అరి నృపవాజి వారణ పదాతి మహాస్త్ర విరామ మారుతః
వర కరికార సుస్థిత సితాస్త్రవినాశిత భాను సన్నిభః
గురుతర దీన భాగవత మానవ మానిత కల్ప పాదపః
వరకరిగల్ల భూమిప భుజాసి రిహాజి భువి ప్రకాశతే

యసి దగిన కందపద్యము కూడ నున్నది 1 కందము సంస్కృతమునకు సహజ మైనది కాదు. కావునఁ దెలుఁగు పద్యమే సంస్కృతమున వ్రాయఁ బడిన దనియు దానిని రచించిన యాతఁడు తెనుఁగు కవిత్వముకూడఁ జెప్పనేర్చిన వాఁడనియుఁ దెలియు చున్నది. దాని కర్త అయ్యనభట్టు. పై శాసన కాలమును బట్టి చూడ నీతఁడు నన్నయకుఁ బూర్వమే యున్న వాఁ డగుచున్నాఁడు. కాని యాతఁడు రచించిన తెలుఁగు గ్రంథము లేవియుఁ గానవచ్చుట లేదు.

రాజరాజు కోరుమిల్లి దానశాసనమున కాజ్ఞప్తి కటకేశుఁడు. కర్త భీమనభట్టు కుమారుఁడైన పేతనభట్టు. ఇది క్రీ శ. 1022లో రాజరాజ నరేంద్రుఁడు పట్టాభి షిక్తుఁడై నప్పుడు చంద్ర గ్రహణ కాలమునఁ జీదమార్యుఁడను బ్రాహ్మణునికిఁ గోరుమిల్లి గ్రామ మగ్రహారముగా నొసంగిన విషయమును దెల్పు చున్నది. ఇందు 24 పాదములు గల రగడ యొకటి యున్నది. ఈ పాదము లన్నింటను అంత్యానుప్రాస మున్నది. నాలుగు పాదములలోఁ (2, 3, 4, 16) దప్ప మిగి లిన వాని యందు ద్వి తీయాక్షర ప్రాసము పాటింపఁ బడినది. 1, 4, 6, 7, 9, 11, 20, 21,22 పాదము లం దాద్యక్షర పునరావృత్తి రూపమైన తెలుఁగు యతి కనఁబడుచున్నది. 13 వ పాదమునఁ బ్రాస యతియు 18వ పాదమున నఖండ యతియు గోచరించు చున్నవి. ఈ రగడకు విజయభద్ర రగడ యని పేరు. ఇం దొక్కొక్క పాద మున నైదు మాత్రలతోఁ గూడిన నాలుగేసి గణము లుండును. రగడలు కర్ణా టాంధ్ర భాష లందుఁ గలవు. సంస్కృత భాషలో క్రీ. శ. 940 ప్రాంతమున సోమదేవ సూరి రచించిన యశస్తిలక చంపువున నొక రగడ యున్నది. కాని మఱెవ్వరును దాని నందు వ్రాసి యుండలేదు. పేతనభట్టు వ్రాసిన పై రగడలో తెలుఁగు రగడ లక్షణములు చాలఁ గానవచ్చుటచే నాతఁడు తెలుఁగునఁ గూడఁ గవియై యుండెనని చెప్ప వచ్చును. ఇతఁడు రణస్థిపూఁడి శాసనకర్తయైన భీమనభట్టు కుమారుఁడనియు, నన్నయభట్టు జనకుఁడనియు నాంధ్రకవి తరంగిణి యందు సూచింపఁ బడినది. నన్నయభట్టు భారతమునఁ దాను రాజరాజు కుల

---

1. కం ధవళ గుణో ధవళ యశో
ధవళిత దిఙ్మండలో౽ ధవదమి తారాతిః
ధవళక్షో ధవకరుణో
ద్భవ భవ భోగాన్వితో విశాతి సుకీర్తిః॥ ఆంధ్ర. ఉగాది. సం. 12 1921,

బ్రాహ్మణుఁడని చెప్పుకొని యుండుటచే నాతని తండ్రి తాతలు కూడ రాజరాజు పూర్వుల కడ సంధి విగ్రహులై యుందురని యూహింప వచ్చును. శాసనము నందలి యక్షరములను సరిగాఁ బరిశీలింపక పోవుటచే మొట్టమొదట నా శాసనమును బ్రకటించిన ఫ్లీటు దొరగారు చేతనభట్టని చదివి యుండిరి అందుచే వారి ననుసరించి యితరులు కూడఁ గొందఱాతని జేతనభట్టనియే పేర్కొని యుండిరి. మఱి కొంద ఱతనిని చెట్టనభ ట్టని చెప్పుచున్నారు. కాని 'బే' యను నక్షరము స్పష్టముగా గోచరించుటచే నతని పేరు జేతన భట్టనియే నిశ్చయింపఁ బడినది. ఈతఁడు తెలుఁగున వ్రాసిన కావ్యములు కాని పద్యములు కాని లభించుట లేదు.

పైని పేర్కొనఁ బడిన కవులందఱును మంచి వ్యుత్పన్నులు. వారు దేశి మార్గ పద్ధతులు రెండింటఁ గవితఁ జెప్పనేర్చిన వారు. వారివలెఁ బండితులుగాక సామాన్య జనులకు మాత్రము ప్రీతి కలిగించు పాండిత్య నిరపేక్షములైన పాటలు, పదములు, ఏలలు, జోలలు, మున్నగు గేయముల రచించిన వారుకూడ నన్నయకు ముందుండి రనుటకుఁ గొన్ని యాధారములు కానవచ్చు చున్నవి. అసలు సంతోష విషాదాది భావములు ముమ్మరముగాఁ గలుగు నప్పుడు మానవుల నోట లయాన్వితమైన భాషయే వెలువడు నని విమర్శకులు చెప్పుదురు. వ్యాధుఁడు క్రౌంచ మిథునమునం దొక దానిని వధింపఁగాఁ జూచి శోకోద్రిక్తుఁడైన వాల్మీకి నోట నయత్న పూర్వకముగా ఛందోమయమైన వాక్కు వెలువడుట యంద ఱెఱిఁగి నట్టిదే. అట్లే నన్నయకుఁ బూర్వముండిన యాంధ్రులు కూడ సంతోషమో విషాదమో యతిశయముగాఁ గల్గినప్పుడు దానిని బాట రూపము ననో పదము రూపముననో వెలువరించి యుందు రనుటలో విప్రతిపత్తి యుండదు. పాల్కురికి సోమనాథుఁడు పండితారాధ్య చరిత్రలో పండితుఁడు వెలనాటి చోడుని బౌద్ధ గురువుతో వాదించుటకై యా రాజు సభకేగు సందర్భమునఁ ద దనుయాయులగు శిష్యులు

"పదములు తుమ్మెద పదముల్ ప్రభాత
పదములు శంకర పదముల్ నివాళి
పదములు వాలేశు పదములు గొబ్బి
పదములు వెన్నెల పదములు సంజ
వర్ణన మఱి గుణ వర్ణన పదములు
ఫాడుచు నాడుచు"

నరిగి రని వ్రాసియున్నాఁడు అట్లే శివరాత్రి జాగరణ సమయ మందలి వేడ్కల వర్ణించుచు

"ప్రమథ పురాతన పటు చరిత్రములు
గ్రమమొంద బహు నాటకము లాడువారు
ఆదట గంధర్వ యక్ష విద్యా ధ
రాదులై పాడెడు నాడెడు వారు
వెండియు భవు బహువిధ చరిత్రము ల
ఖండితగతి నాటకంబు లాడుచును"

అని కొన్ని నాటక ప్రదర్శనములను వర్ణించి యున్నాఁడు. బహుశః ఇవి దేశిమార్గమునకుఁ జెందిన యక్షగానముల వంటివే యయి యుండునని తోఁచు చున్నది. మఱియు నాతఁడు బసవ పురాణమును బ్రాచీన శివభక్తుల చరిత్రమును బురాతన గీతములను బట్టి రచించితినని చెప్పుకొని యున్నాఁడు. ఆతని నాఁటికి బహుళ ప్రచారము నందుండిన యీ గీతములు, పదములు, యక్షగానములు మున్నగునవి యాతని కాలముననే పుట్టినవి గాక తత్పూర్వము నుండియుఁ (అనఁగా నన్నయకుఁ బూర్వము నుండియు) గూడ జన వ్యవహారమున నుండి వట్టివే యని యూహింప వచ్చును.

పండితారాధ్య చరిత్ర కృత్యవతారికలో సోమనాధుఁడు ద్విపదనుగూర్చి చెప్పుచు "అనియతగణైః,ప్రాసోవా,యతిర్వా"యని సంస్కృతోక్తులను మూఁడింటి నుదాహరించినాఁడు. ఇది యతిప్రాసలను గూర్చియు మాత్రా గణములను గూర్చియుఁ జెప్పునట్టి వగుటచేఁ దప్పక తెలుఁగుభాషకు సంబంధించిన ఛంద స్సూత్రములే యై యుండు ననియు, గణములు నియతముగా నుండ నక్కఱ లే దనియుఁ, బ్రాసముగాని యతిగాని యుండినఁ జాలుననియు వానివలన స్పష్ట మగుచున్నదనియు, కీ.శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తెల్పియున్నారు.[1] మఱియు నా సూత్రములుగల ఛందోగ్రంథము నన్నయకు సమకాలమో, పూర్వమో యై యుండునని కూడ వా రభిప్రాయ పడి యున్నారు. దీనినిబట్టి నియతములు కాని గణములతోఁగూడి, యతియో ప్రాసయో కలిగియుండిన ద్విపదలును దత్ప ద్రృశములైన యితర రచనలును అప్పుడుండెడివని తలఁచుట కవకాశము కలుగుచున్నది. తెలుఁగున ము విభక్తిక యతియనియు ముకార యతి యనియు

1. రా. రా న సం పుట 30

రెండు యతి భేదము లున్నవి అందు మొదటిదానిని బట్టి ప్రథమావిభక్తి ముకార మునకును పు ఫు బు భు లకును యతి చెల్లును నన్నయ యీ యతిని వాడియుండెను. తరువాత విభక్తిప్రత్యయము కాని పదమధ్య ముకారమునకుఁ గూడ పుఫు బుభులతో యతివేయు పరిపాటి వచ్చినది దీనికే ముకార యతి యని పేరు. నన్నయ భారతమున నీ యతి కుదాహరణములు లేవు దీనినిబట్టి ప్రాచీన కాలమున నీ రెండింటిలో నొక్కటి ము విభక్తిక యతి మాత్రమే యుండెనని తెలియుచున్నది. ఇప్పటి వారి కిది యచ్చెరువుగాఁ దోఁపవచ్చును కాని యసలు ము విభక్తిక యతి యెట్లేర్పడెనో పరిశీలించినచో నీ యాశ్చర్య మునకుఁ గారణ ముండదు. ప్రథమావిభక్తి ము వర్ణమున కిప్పుడు ంబు, మ్ము అను వానివలెనే ప్రాచీనకాలమున బు అను రూపాంతరము కూడ నుండెననుటకు శాసనములును ఇతర ద్రావిడభాషలందలి శబ్దములును సాక్ష్య మిచ్చుచున్నవి శాసనములందలి మరబు, పనబు, వక్రబు, నాగబు మున్నగు రూపము లిందుకుఁ దార్కాణము. దీనినిబట్టి విభక్తి ము వర్ణమనఁగా బువర్ణమే యని తెలియ వచ్చుటచే దానికి పు, ఫు, బు, భులతో యతి చెల్లుటలో వింతయేమియు నుండదు. "మీఁదఁ జెప్పఁబడిన ము విభక్తిక యతి (వనమునకు) వనబు అన్న రూపమున్న కాలమున నేర్పడిన దగును. వనబు అను రూపము పోయిన తరువాత ఛందోగ్రంథకర్తలు దానికి ము విభక్తిక యతి యని పేరిడిరి. నన్నియ నాఁటికి వనబు అనురూపము పోయినది, భారతమునఁ గానరాదు. ఈ సాధనము యతిప్రాసలు, పద్య రచనము నన్నయకుఁ బూర్వమే కలవని స్పష్ట పఱుచు చున్నది "

నన్నెచోడుఁడు కుమార సంభవ కావ్యమున దేవతా గురు సంస్కృత కవుల స్తోత్రము కావించిన పిమ్మట

మును మార్గ కవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గును నిలిపి రంధ్రవిషయం
బునఁ జనఁ జాళుక్య రాజు మొదలుగఁ బలువుర్

అను పద్యమును వ్రాసి యుండెను "తెనుంగు నిలిపి రంధ్రవిషయమునఁ జన సత్యాశ్రయునిఁ దొట్టి చాళుక్య నృపుల్" అను పాఠము శ్రీ కవిగారు ముద్రించిన

కుమార సంభవ ప్రతిలోఁ గనవచ్చు చున్నది. కుమార సంభవమునకుఁ దంజావూరు సరస్వతీ గ్రంథాలయమున నున్న తాళపత్ర ప్రతి తప్ప మఱియొక ప్రతి లభ్యము కాకపోవుట చేతను, అందుఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్ అనుపారమే యుండుట చేతను, మన మిదియే యథార్థమైనదని గ్రహింప వలయును. ఇందుఁ జెప్పఁబడిన మార్గదేశి కవిత్వము లేవి యను విషయమును గూర్చియు, నా చాళుక్య రాజెవ్వఁడను విషయమును గూర్చియు వేఱు ప్రకరణమున వివరింపఁ బడును. సంస్కృత కవులను స్మరించిన పిమ్మట నన్నెచోడుఁ డీ పద్యమునఁ దెలుఁగు కవులను బ్రత్యేకముగాఁ గాక సామాన్యముగా స్మరించినట్లు కానవచ్చుచున్నది. మార్గకవిత లోకమున వెలసి యుండఁగాఁ జాళుక్యరాజాదు లనేకులు దేశికవిత్వమును బుట్టించి యాంధ్రదేశమునఁ దెనుఁగును నిల్పిరని పై పద్యమునందలి భావము. దీనిని బట్టి చాళుక్యరాజుల కాలమునఁ దెలుఁగు దేశములో దేశికవిత పెంపొందింపఁ బడె నని తెలియు చున్నది. ఆ కవిత్వమునకుఁ బైని పేర్కొనఁబడిన శాసనములలోని పద్యములు తక్క వేఱు నిదర్శనములు కానవచ్చుటలేదు. కాని నన్నయకుఁ బూర్వము దేశికవిత దేశమున సాగె ననుటకు మాత్ర మీ పద్యము నిశ్చితమైన నిదర్శనమై యలరారు చున్నది నన్నె చోడుఁడు సంస్కృత కవులలోఁ గొందఱిని వలెనే తెలుఁగు కవులలోఁ గూడఁ గొందఱిని బ్రత్యేక నామములతోఁ బేర్కొని యుండినచో నా విషయము మఱింత స్పష్టముగా వెల్లడి యైయుండును. కాని తనకు ముందున్న దేశికవులలో సుప్రసిద్ధ కావ్య రచనచేఁ బేర్కొనఁదగినవా రెవ్వరును గానరాకపోవుట చేతను, మార్గకవులలోఁ గొందఱు జైన మతమును మఱి కొందఱు వైదిక మతమును నవలంబించిన వా రగుటచేతను, ఆ రెండు మతములను గూడ శైవుఁడైన తనకు విరుద్ధములైన వగుటచేతను, అతఁడు వారిలో నెవ్వరిని గాని ప్రత్యేకముగాఁ బేర్కొని యుండ లేదని తోఁచుచున్నది.

ఈ విధముగా నన్నయకుఁ బూర్వమున్న కవిత్వమిట్టిదని వస్తు రసాలంకార వివేచన చేసి విమర్శించుటకుఁ దగిన యాధారము లేవియు లభింపక పోయినను అప్పు డాంధ్రమున నేదో కొంత కవిత్వ ముండె ననుటకు మాత్రము నిదర్శనములు గోచరించు చున్నవి. ఈ కవిత్వమును శాసన కవిత, పదగేయ రూపమైన దేశికవిత, మార్గపద్ధతికిఁ జెందిన కావ్యకవిత యని మూఁడు తెఱంగులుగా విభజింప వచ్చును. ఇందు శాసన కవిత యారంభమున దేశీయ

మార్గమునకును దరువాత (అనఁగా పదవ శతాబ్దినుండి) మార్గపద్ధతికిని (విరియాలకామసాని గూడూరు శాసనము) జెందినదిగాఁ గానవచ్చుచున్నది. పదగేయ కవితకు సోమనాధుఁడు పేర్కొన్న గీతములును, బదములును, ఉదాహరణములు కావ్యకవిత్వమునకు పద్మాదులగు జైనకవులు రచించిన కావ్యములు తార్కాణము ఇవియు క్రీ. శ. 10వ శతాబ్ది యుత్తర భాగమున రచింపఁ బడినవే. దీనిని బట్టి దెలుఁగునఁ గవిత మొదటఁ జాళుక్య రాజుల ప్రేరణ ప్రోత్సాహములచే దేశి రూపముగా నారంభమైనదనియుఁ దరువాతఁ గన్నడకవుల ప్రభావముచే మార్గ కవితకూడఁ గొంత వెలువడి నన్నయ భారతమున సమగ్రరూప సౌష్ఠవము నొందెననియుఁ దెలియు చున్నది. ఈ రెండు రకముల కవితయు నారంభము నుండి నేఁటివఱకు దేశకాలమతాది పరిస్థితుల ననుసరించి యొకప్పుడొక దానికిని మఱొకప్పు డొకదానికిని దోహదము చేకూరుచుండ నధికముగనో యల్పముగనో పాగుచునే యున్నది. అందు నన్నయకుఁ బూర్వ మందలిది యుండియు నుపలబ్ధము కాక పోవుటచేఁ బ్రకటయు గూఢయునైన సరస్వతీనది వోలె మన పాలి కసత్ప్రాయమేయై పొడఁగట్టు చున్నది.



# 3 చాళుక్య యుగమునందలి భాష :

ప్రాక్చాళుక్య యుగమునఁ దెలుఁగులో వ్రాయఁబడిన శాసనములు లేనప్పటికిని అప్పటి సంస్కృత ప్రాకృత శాసనములందుఁ గనవచ్చిన గ్రామ నామములనుబట్టియు, మఱికొన్ని యితరాధారములనుబట్టియు నప్పుడు తెలుఁగు భాష యితర ద్రావిడభాషలనుండి విడివడి వ్యవహారమున నుండి యుండవలెనని తెలిసికొంటిమి. పూర్వ చాళుక్యులును రేనాటిచోళులును రాజ్యాధికారము వహించిన కాలమునఁ గొన్ని శాసనములను దెలుఁగు భాషలోనే వ్రాయించి యుండిరి. ఇతర శాసనములు సంస్కృత భాషలో వ్రాయఁబడినను గ్రామ సీమాదులను దెల్పు సందర్భమునందు మాత్రము పెక్కింటిలోఁ దెలుఁగు భాషయే వాడఁబడియున్నది. క్రీ. శ. 6, 7, 8 శతాబ్దులలోని తెలుఁగు శాసనములు వచనమునందే యున్నప్పటికిని అందలి పదములు కొన్ని యతి ప్రాచీన రూపములతోఁ గూడి దురవగాహములుగాఁ గానిపించుచున్నవి. అయ్యు నవి యితర దక్షిణ దేశభాషలందలి పదములతో సన్నిహిత సంబంధము కలిగి తెలుఁగుభాషా పరిణామ ప్రకారమును సూచించుచునే యున్నవి. ఈ శాసనములలో సంస్కృత ప్రభావముకంటెఁ బ్రాకృతభాషాప్రభావము హెచ్చుగాఁ గానఁ బడుచుండును. ఉదా ఆసివైరువు లికితమ్(చోళమహారాజు ఉరుటూరు శాసనము, పొట్లదుర్తి మాలెపాడు శాసనము). అణవొతులు (అజ్ఞప్తి) పుణ్య కుమారుని మాలెపాడుశాస. దుగరాజు, దుగిరాజు (యువరాజు) చోళమహారాజు ఇందుకూరు శాస. దమ్మువు, దమ్మువులు (ధర్మము) అద్దంకి శాసనము. బెజయరాజు [విజయ (యాదిత్య) రాజు] ధర్మవరశాస. బెజయిత్త భటురకు(విజయాదిత్య భట్టారక) కపిలేశ్వర పుర శాసనము. క్రీ. శ. 740. సర్వబాద పరియారువు (సర్వబాధాపరిహార) సవ్వలోకశ్రయ మహాసత్థ్ణ వశ్. అహదనకర శాసనము. మున్నగున వెందుకుఁ దార్కాణములు. "ఊరిస్వాముక్, మహానభియుక్, పెల్ల వసుపుళ్, పెద్దణ్, పసుఖేవుల కొడుకళ్ - మొదలగు పదములు తెలుఁగున

నన్నయ భాషలో మనకుఁ బరిచితములగు రూపములతో వింకను స్థిరపడక ప్రాకృతము మూలముగా నీ భాషలోనికి వచ్చు మార్గములో నున్న ట్లగపడు చున్నవి. కావుననే యీ రూపములు సులభముగా నర్థమగుట లేదు. ఇవి భాష యొక్క ప్రాచీన స్థితిని దెలుపుచున్నవి. ఈ కాలమున తెలుఁగు పలుకుబళ్ల ప్రాచీన ద్రావిడ సంప్రదాయములనుండి ప్రాకృత భాషా సంపర్క సహాయముచే నూతన పరిణామమును బొందుచున్న సంధిస్థితిలో నున్నవని చెప్పవలసి యున్నది "[1] తరువాతి శాసనములలో వలె వీనియందుఁ దత్సమీకృతములై తెలుఁగు భాషలోఁ గలసిపోయిన పదములు కాని, దీర్ఘ సమాసములు కాని యంతగాఁ గనఁబడవు. కాలక్రమమునఁ దెలుఁగుభాషలోఁ బ్రాకృత ప్రభావము సన్నగిల్లుటయు సంస్కృత ప్రభావ మధిక మగుటయు సంభవించెను. అందుచే శాసనములందలి బిరుదాదులు దీర్ఘ సమాసములుగా వ్రాయఁబడుట గోచరించును యుద్ధమల్లుని బెజవాడ శాసనములో నా రాజునకుఁ గల బిరుదాదులు మొదటి పద్యమున దీర్ఘ సమాసములతో వివరింపఁ బడినవి. ఇట్లే చోళరాజులను వైదుంబరాజులను, బాణరాజులను వేయించిన శాసనములలోఁ గూడ బిరుదాదులు దీర్ఘ సమాస రూపములుగానే కన్పట్టుచున్నవి [2] చాళుక్యభీముని కొఱవి శాసనములో[3] దీర్ఘ సమాసము లంతగా లేక పోయినను అందలి భాష తత్సమ పదబహుళమై పరిగా నన్నయ భారతమునందలి వచన శైలిని బోలియున్నది. గుంటూరు జిల్లా బాపట్ల తాలూకా చేఁబ్రోలులోని నాగేశ్వరస్వామి ఆలయమున

---

1 ఆంధ్ర భారత కవితా విమర్శనము పుట 30, 31

2 చోడ మహారాజు సూర్య గ్రహణ కాల శాసనము

స్వస్తి హరి దర్ధర రావ భుజాసి భాసుర ప్రచణ్డ ప్రద్యోతిరదినకర కులనన్దన కాస్యప గోత్ర కరికాలాన్వయ మహారాజు

వైదుంబ రాజుల శాసనము.

స్వస్తిశ్రీ స్వస్త్యనేక సమర సంఘట్ట నోప లబ్ధ జయలక్ష్మి సమాలింగితవక్షతల కండ త్రినేత్ర వైదుంబ మహారాజుల

బాణరాజుల శాసనము.

స్వస్తిశ్రీ వల్లభ మహారాజాధి రాజ పరమేశ్వర భట్టరశ

S. I. I. X 604.

3 తెలంగానా శాసనములు. 12 పుట. 163.

లభించిన శ్రీ మదాహవమల్లదేవుని శాసనము నందలి యీ౦డి బిరుదావళి నన్నయ భారతాద్యంతములందు రాజరాజును సంబోధించిన పద్యములను స్మరింపఁ జేయుచున్నది. ఈ శాసనము రాజరాజు పట్టాభిషేకమున కించుక పూర్వము (క్రీ. శ. 1006) వ్రాయఁ బడినది.

"స్వస్తిశ్రీ సకళ భువన వల్లభ శ్రీ మదాహవమల్లదేవ శ్రీ పాద పద్మా రాధక, పరిమణ్డళ సాధక, సకళ జగదుత్తంస, విప్ప వంశాళంకార, సత్తిగ నంకకాఱ, సాహిత్య విద్యానిధి, వినయ రత్నాంబుధి, శంకర కింకర, కొంకణ భయంకర, సమదారాతి మత్త మాతంగ మస్తక స్థళ విదారణ దారుణ ఖర నఖర పంజర, సామన్త వజ్ర పంజర, నిజ భుజ పరాక్రమ నిర్జిత ప్రతిమల్ల, దుర్గ్గఱ్త్రియ మల్ల, పర బళ జలనిధి కబళన బడ వాన లోదంగ దావానల".

విరియాల కామసాని గూడూరు శాసనము నందును, బద్మ సర్వదేవుల రచనలుగాఁ బ్రబంధ రత్నావళిలో నుదాహృతములైన పద్యము లందును గలశైలికిని నన్నయ శైలికిని భేదమే లేదు. ఈ విధముగాఁ బ్రాక్చాళుక్య యుగమునఁ గేవల గ్రామనామ రూపమునఁ గనవచ్చిన తెలుఁగుభాష చాళుక్య యుగారంభమునఁ బ్రాకృత భాషా సంపర్కమును బొంది, తరువాతఁ గ్రమక్రమముగాఁ దత్సమ పదజాలమును గూర్చుకొని, క్రీ. శ. 11వ శతాబ్దినాఁటికి నన్నయ భారతభాషతో సదృశమైన భాషగాఁ బరిణమించినదనియు, నన్నయ యందలి లోప వైకల్యములను సవరించి దానిని లాక్షణికమును శ్రుతి మనోహరమునైన యుత్తమ భాషగా సంస్కరించె ననియుఁ జెప్పవచ్చును

క్రీ. శ. 6వ శతాబ్ది నుండియుఁ గానఁబడుచున్న కేవల తెలుఁగు శాసనములలోవలెనే సంస్కృత శాసనములలో సీమాదులను జెప్పు సందర్భమున నుండు తెలుఁగు భాగములలోఁగూడ దేశ్యపదములు ప్రయోగింపఁబడియే యున్నవి. వీనిలో నారంభ కాలము నందలివి నన్నయ భారతమునందు స్థిరపడి మనకుఁ బరిచితములైన రూపములకంటె భిన్నములైన రూపములతో నుండుటచేతను, వివిధ కాలములందు వివిధ ప్రదేశములలో వివిధరూపములతోఁ గానవచ్చుచుండుటచేతను అర్థగ్రహణ విషయమునఁ గొంత క్లేశము కలిగించుచు వింతగా గోచరించుచున్నవి. ఇట్టి వింత రూపములు క్రీ శ. 9వ శతాబ్ది నడుమ వ్రాయఁబడిన పద్యశాసనములలోఁ గూడఁ గొన్ని కానిపించు చున్నను వానిసంఖ్య

యప్పటికిఁ దగ్గిన దనియే చెప్పవచ్చును. అందుచేతనే యప్పటి శాసనముల నర్థముచేసికొనుట కొంచెము సుకరముగాఁ గానిపించును. మధ్యకాలమునందలి యీ శాసనములలోఁ దత్సమదేశ్యపదము లించుమించు సమాన సంఖ్యాకములుగా నుండును. తరువాత దేశ్యపదములకంటెఁ దత్సమ పదముల సంఖ్య పెరుఁగుట సంభవించినది. ఆ యున్న దేశ్యపదములలో సైత మప్పుడుకూడ నర్థక్లేశము కలిగించునవి కొన్ని లేకపోలేదు. విరియాల కామసాని గూడూరు శాసనమునందలి తుదిపద్యము తత్సమపద బహుళమయ్యు నర్థము కాకపోవుట కదియే కారణము.

వింతపదములు :

వివబుకాను ఎఱ్ఱగుడి పాడు శాసనము. (క్రీ. శ. 6వ శతాబ్ది చివర)
పన్నస.
ఇరువది యాదినాల్కు మఱుతుఱ్ఱు.
చీఱున తిప్పలూరి శాసనము
పూల్లవట్టమ్బున చోళమహారాజు రామేశ్వర స్తంభ శాసనము.
కాటుఱున చిలంకూరు శాసనము. (8వ శతాబ్ది ఆరంభము)
రట్టగుళ్ల.
ఎఱుంబొది విప్పర్ల శాసనము. క్రీ. శ. 641.
ఇఱ్ఱకాను.
గాణంబు.
వేడ్లుము లక్ష్మీపుర శాసనము. క్రీ. శ. 685-705
బోళ.
ముడ్లు.
కడువంప్లు.
దత్తి కపిలేశ్వరపుర శాసనము. క్రీ. శ. 740.
బోయ చందలూరు తామ్రశాసనము క్రీ. శ. 673.
తెతె రేయూరు శాసనము క్రీ. శ. 669.
అరియుడగు అహదనకర శాసనము.
గజ్జుబు.

క్రీ. శ. 9వ శతాబ్ది తరువాతి శాసనములందలి యుదాహరణములు:

గొఱల్చు — అద్దంకి శాసనము

బాణ.

ఱస్సి — యుద్ధమల్లుని బెజవాడ శాసనము.

మణ్డి మొఙ్క (ముంక) చి న్త. [మణ్డి = bent (Kittel) The young tamarind tree that is bent వంగిన చింతమొక్క.]

కొడమదువు (A sluice of a tank with a top sill or a sluice on the hi l side.

మదువ = a sluice (Tamil) తెలుఁగున మదవయను శబ్దమున్నది. మళ్లకు నీరు పెట్టెడి కాలువ ముఖమని యర్థము. "అడుసుఁ దుంపురు చెక్కుటద్దంబులను బర్వ మళ్లకు మదవలు మార్చిమార్చి" కళా పూర్ణోదయము. చతుర్థాశ్వాసము.

గోగుతేవు = గోగుచెట్లు పండింపఁబడు క్షేత్రము. (A plot of land in which generally గోగు plants are cultivated)

కదము కోపు = con cal trunk of a Kadamba tree

కలవెలగుల (కల్వెలగుల) పెద్దచి న్త = B g tamarind tree adjoining the stone fencing కల్లు = ఱాయి.

వెలుగు = లోపల పశువులు లోనగునవి చొరక తోఁట మొదలగువాని చుట్టు ముండ్లచెట్లుపెట్టి యెదిగించిన ఆవరణము (శబ్దరత్నాకరము.)

మద్దలు = మద్దిచెట్లు. చిఱుకోడి మద్దలు.

గొరగ పల్లము = శైవసన్న్యాసులకుఁ జెందిన పల్లపుభూమి.

కట్టుమ్బొదలు = Artificial enbankments or fences made of natura bushes కట్టు అను పదము కృత్రిమమైన (కట్టఁబడిన, artificial) అను నర్థమున నిప్పుడును వ్యవహారమునఁ గనవచ్చు చున్నది. కట్టుపండ్లు = artificial teeth.

బడియ బొల యణ్ట పేదరి యాకు చి న్త.

బొల (పొలఁ) boundary.

అణ్ట = by the side of, touching.

పేదరి యాకు చి న్త = poor leafed tamarind.

పై పదములు రెండవ శాకుని పిరిపుర తామ్ర శాసనమునందలివి,

ఇతఁడు రెండవ యుద్ధమల్లుని (క్రీ. శ. 930) కొడుకు బాడపుని సోదరుఁడు.

గుజ్జేటిదు కజితి వేములకోను (రెండవ అమ్మరాజు వేమలూరుపాడు తామ్ర శాసనము. క్రీ. శ. 945)

పరువులు = salt marshes Do.

పటు (పట్టు = స్థలము) రెండవ అమ్మరాజు మచిలీపట్టణ శాసనము. క్రీ. శ. 945–70.

పుసియిల్ల దాష్టక = మోసములేని తాల్మి: వెంకయ చోళుని దొంగల సాని కనుమ శాసనము

గద్యవంబు: విరియాల కామసాని శాసనము క్రీ. శ. 1000.

రూప వైవిధ్యము గల పదములు ·

| | |
|---|---|
| 1. ఏబది | చోళమహారాజు ఉరుటూరు శాసనము. క్రీ. శ. ౭వ శతాబ్ది ఆరంభము. |
| ఏభది | వెలదుర్తి శాసనము. |
| ఏమ్బదియె | తిప్పలూరి శాసనము. |
| ఏంభాది | వెలదుర్తి శాసనము. (క్రీ. శ. 8 వ శతాబ్ది.) |
| 2. తేని | ఉరుటూరు శాసనము. |
| తీనికి | సాలెపాడు శాసనము. |
| దేనికి | No 403—1904. |
| దినికి | No 401—1904. |
| 3. అచ్చినవాస్తు | ఉరుటూరు; అగస్త్యేశ్వర దేవాలయ శాసనము. చిలంకూరు; దిమ్మగుడి శాస. |
| దచ్చిన, దచిన | పెట్లూరి శాసనము. |
| వ్రచ్చిన | ఉరుటూరు శాసనము. |
| అత్థిసినవారి | బూదిదగడ్డపల్లి శాసనము. |

| | |
|---|---|
| 4. తక్కౌ-ళాపువోల | పుణ్యకుమారుని తిప్పలూరి శాస. |
| పైదుంబ వ్రోలు | మురుసుపల్లి శివాలయము 346. |
| గొట్టిప్రోలు | మొదటి అమ్మరాజు మచిలీపట్టణ తామ్రశాస. క్రీ శ. 918—25 |
| 5. తాంబుల్ | విజయాదిత్యచోళుని చామలూరు శాస |
| తబుణ్డు (తమ్ముఁడు) | కపిలేశ్వరపుర శాస క్రీ. శ. 740. |
| 6. మఱున్డుఱు | ఎఱ్ఱగుడిపాడు శాస. క్రీ. శ. 6 వ శతాబ్ది. |
| మరుతుణ్డు | చిలంకూరు శాస. క్రీ శ. 8 వ శతాబ్ది. |
| మాఱుత్రు | సత్యాదిత్యుని మాలెపాడు శాస. |
| మఱూతూ క్రి | విప్పర్ల శాసనము. 7 వశతాబ్ది. |
| మఱుతుడ్లు | విక్రమాదిత్య బలికుల బాణరాజుల శాస. |
| | బికిరాజు శాస. S. I I X 594. |
| వ్రితుడ్లు | రేమయ్య శాస. .. 593. |
| మఱుతు | మోపూరు భైరవ దేవాలయ శాస 615. |
| మఱుతుంఢ్లు | దిమ్మగుడి శాస. నెం. 364 |

ఊరు (బహువచన రూపములు)

| | |
|---|---|
| ఊర్లందు | జయసింహ వల్లభుని విప్పర్లశాస. |
| పాన్దూఱ్లు | సత్యాదిత్యుని మాలెపాడు శాస. |

8. ఏడు

| | |
|---|---|
| ఏ ఱు వేల నేల | బికిరాజు శాస. S I I No 594. |
| ఏఱు వేల నేల | చోడమహారాజు సూర్య గ్రహణ కాల శాస. No 595. |
| | కొపినేపల్లి శాస. S. I I. X No. 598. |
| ఏళు వేళ | చెన్నరాయనిపల్లి కుత్తరమున నున్న శాస. No 639. |

9. తూర్పు.

ఖూఱువ్వ నూర్ల No 408—1904

తు ఱు గు నుర్ల }
తుఱుమ్ము నూర్ల } No 408 A 1904.
తూ పు శా న No 340—1905.

10. పాఱఁడు = బ్రాహ్మణుఁడు.
పాఱువారికి No 338-1922
పాఱళ్ల No 287-1905
పాఱశ No 384-1904.
పాఱ రామేశ్వర స్తంభ శాసనము.
పాఱ్ల చిలంకూరు శాసనము.
పఱాను లక్ష్మీపుర శాసనము.

11. పొడుచు ధాతువు క్త్వార్థక రూపము.
పొడుచి బూదిదగడ్డపల్లి శాస
పొడిచి వైదుమ్బ రాజుల శాస.
పొడిచ్చి చిన్నతిప్ప సముద్ర శాస. No 621 S I I X
కురుబలకోట శాస No 625

12. కపిల గోవు.
గవిలల చోళమహారాజు సూర్యగ్రహణ కాల శాస.
కవిళ విష్ణువర్ధనుని సాలెపాడు శాస.
గవిలశ No. 401-1904
కవిలశాను No 403-1904.

13. పన్నస ఎఱ్ఱగుడిపాడు శాసనము.
పన్నాస ఉరుటూరు శాస.
పన్నపీస వెలుదుర్తి శాస.
పన్నశా.

14. పెండ్లంబు (= భార్య) S I I. X 598
పెండ్లాంబులు No 408-1904

15. రెడ్డి.
రట్టోడ్లు—రట్టోడ్లు No 341-1905.

| | |
|---|---|
| రట్ట గుళ్లు | రామేశ్వర స్తంభశాసన, చిలంకూరు శాసన. |
| రట్ట గుడ్ము | No. 400–1904. |
| రట్టడ్ము | No 400B–1900. |
| రాడ్లు | No 408A–1904. |

ఇట్లే రూపవైవిధ్యమును బొందిన దేశ్యశబ్దము లింకను బెక్కు గలవు. ఈ దేశ్య శబ్దముల వలెనే కొన్ని తత్సమ శబ్దములు సైతము వివిధ రూపములతో వ్రాయఁబడి యున్నవి. కొన్నిటిలో వర్ణక్రమము చాల దుష్టముగా నున్నది. దీని కప్పు డా శబ్దములు రూప వైవిధ్యమును బొంది యుండుటే కాక శాసన లేఖకుల యజ్ఞత కూడఁ గొంతవఱకుఁ గారణమై యుండవచ్చును. రూప వైవిధ్యముతోడను వర్ణక్రమ దోషముతోడను గూడిన శబ్దములు కొన్ని యీ క్రింద నొసంగఁ బడుచున్నవి.

| | |
|---|---|
| 1. సాక్షి | ఎఱ్ఱగుడిపాడు శాస. క్రీ. శ. 6 వ శతాబ్ది చివర. |
| సక్షి | చిలంకూరు అగస్త్యేశ్వ రాలయ శాస. నెం. 401. |
| శాక్షి | ఎఱ్ఱగుడిపాడు శాస. |
| చక్షి (చాక్షి) | ఉత్తమాదిత్య చోళమహారాజు వెలుదుర్తి శాస. |
| 2. భటార శాకు | బుదమనారాయలపాడు శాస. |
| భటరికి | బసివికొండ శాస, వెంకయ చోడుని దొంగలసాని కనుమ శాస |
| భటారల లకు | నెం. 405. |
| భటారశకున్ | దిమ్మగుడి శాస. No 364. |
| భటరశకు | మైలవర శాస. No 306. కపిలేశ్వరపుర శాస. |
| 3 బారనాసి (=వారణాసి) | రామేశ్వర స్తంభ శాస. |
| బారణా | నల్ల చెఱువుపల్లి శాస. |
| బారణాసి | బుదమ నారాయలపాడు శాస. |
| బారాణసి | జయసింహవల్లభుని విప్పర్ల శాస. |
| బారనాసి | బికిరాజు శాస. |
| వారణాసి | ఛిలంకూరు శాస. |

4. శ్రీ పబ్బాతంబు వెంకయ చోడుని దొంగలసాని కనుమ శాస.
శ్రీ పర్వతంబు పెట్లూరి శాస.
5 వగ్రబు కపిలేశ్వరపుర శాస. క్రీ. శ. 740.
వక్రంబు విష్ణువర్ధనుని సాలెపాడు శాస.
వక్రబు చిలంకూరి అగస్త్యేశ్వర దేవాలయము. No 405.
6. బ్రాహ్మణులను రాష్ట్రకూట నిత్యవరుని శాస. మాలెపాడు శాస
ఇలపకుఱ్ఱు శాస.
బ్రాహ్మనులను కుసుమాయుధుని శాస.
శూజ్యగ్రహన నిమిత్య (త్త)ం బున రేమయ్య శాస. నెం. 593.
ప్రితివి రాజ్యంబు ముదివేడుచెఱువు దగ్గఱనున్న శాస.
కొల విస్తారకుండు
ద్రుగ్గాదేవి లక్ష్మీపుర శాసనము.
చన్ద్రాయిత్తకాలంబు విష్ణువర్ధన మహారాజు బుదమనారాయలపాడు శాస.
ప్రతిష్టితః పాత్రీశ్వరః ఇంద్రకీలపర్వత చాళుక్య శాస
నృపాణాం క్కాలేక్కాలే ..
జయలక్ష్మి సమాలింగిత వక్షతల వైదుమ్బ రాజుల శాస. క్రీ. శ. 850.
వధిసిన వాస్తు వల్లచెఱువుపల్లి శాస. క్రీ. శ. 8 వ శతాబ్ది.
పుత్రవద్య. స్త్రీ వద్య. గో వద్య. సత్యాదిత్యుని మాలెపాడు శాస.
అత్మానృతంబున. ధర్మవర శాస. (నెల్లూరు శాస.)

పైని పేర్కొనఁబడిన పదములలోఁ గొన్నిటి యర్థము నీ విధముగా నూహింప వచ్చును.

పన్నస : కిటెల్ గారి కన్నడ నిఘంటువులో పణ్నెయ, పణ్య అను పదములు కానవచ్చుచున్నవి. అందు పణ్నెయ యను పదమునకు పెద్ద పొలము, సేరి అను నర్థము లొసంగఁ బడియున్నవి. పణ్య పదమునకు కిసంవార్ గ్లాసరీ యను నిఘంటువులో (మంగుళూరు 1891, 1895) "పూర్వము రాజుల యధీనములో నుండి తిరిగి వారెప్పుడడిగిన నప్పుడిచ్చివేయు పద్ధతిమీద కౌలు కిచ్చు భూమి" యను నర్థము వ్రాయఁబడినది. అరవమున వ్యవసాయ మను నర్థమున పణ్ణై అను పదము కనఁబడుచున్నది. పణ్య, పణ్నెయ, పణ్ణై, పన్నాస శబ్దము లన్నియు సమానార్థకములే యని తోఁచుచున్నది. సత్యాశ్రయ మహారాజు పుత్త్రు

డుసు గీర్తివర్మ పౌత్త్రుఁడు నైన ఆదిత్యవర్మ వ్రాయించిన యొకశాసనములో [1] దేవశర్మ, అగ్నిశర్మ అను నిరువురు బ్రాహ్మణుల కాదిత్యవర్మ ముణ్డకల్లు, పాల్గిఱె యను గ్రామములను "ఉఞ్ఛమన్న పన్నాస" అను వృత్తిగా నిచ్చె నని తెల్పఁబడి యుండుటచేఁ బైకిసంవార్ గ్లాసరీలో పణ్య శబ్దమున కీఁ బడిన యర్థము సరియైనదిగానే కనఁబడుచున్నది. సంస్కృతము నందలి పంచాశత్ శబ్దము నుండి ప్రాకృతమున నేర్పడిన పణ్ణాసా యను శబ్దము తెనుఁగున పనస యను ప్రాకృత భవముగాఁ గనఁబడుచున్నది. దానికిని ఈ పన్నాసకును సంబంధ మున్నట్లు లేదు.

దత్తి: ఈ శబ్దము పెక్కు శాసనములలోఁ గనఁబడుచున్నది.[2] దానమని దీని కర్థము. దత్తము (= ఈయఁ బడినది) అను రూపము నుండి యిది యేర్పడి యుండును. ఇదియే కొన్ని శాసనములలో దత్తిడి యను రూపాంతరముతోఁ గానవచ్చుచున్నది.[3] ఈ రూపము చాల విరళముగా మాత్రము కనఁబడుచుంటుటచే దీని సాధుత్వము సందిగ్ధముగా నున్నది. దత్తి శబ్దము నన్నయ తరువాతి శాసనములలోఁ గూడఁ బ్రయోగింపఁ బడియున్నది. (గణపతిదేవ మహారాజు విధించిన దత్తి: దేవదత్తి = దేవ భోగము) దీనికి బహువచనము దత్తులు. (ఆ. సా. ప. ప. సంపుటము 5 పుట 361 ఇట్లు సప్త సంతానంబులు దేవ బ్రాహ్మణ దత్తులు).

మఱుతు : మాఱుత్రు : ఈ శబ్దమునకుఁ గల రూపద్వైవిధ్యము పైని చూపఁబడినది. ఇది మత్తరు అను కన్నడ శబ్దము యొక్క అసాధు రూపమనియు నొకా నొక భూమి కొల మానమును సూచించుననియు రాజరాజ నరేంద్ర సంచికలో శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు వ్రాసి యున్నారు. మఱుతురు లేక మఱున్తురు అనునది దీని యేక వచన రూపమై యుండవచ్చును. బహువచనమున మఱుతుడ్లు, మఱుతుఌ, మఱున్తుఌ, మఱు

---

1 Madras Museum C P grants of Western Chalukyas No 1 Sewell's list of Inscriptions No 95.

2. స్వస్తి శ్రీ బెజఇత్త భటరశ నిల్పిన దత్తి (కపిలేశ్వరపుర శాసనము. క్రీ శ. 740).
ఉబిలీశ్వర భటరశాకు ఇచ్చిన దత్తి (విష్ణువర్ధన మహారాజు బుదమ నారాయలపాడు శాస.).

3. Nellore Inscriptions D. 13 పుట 297,

తుఢ్లు అను రూపములు కానవచ్చుచున్నవి. మఱుతురు అను దానికి బహు వచనమున మూర్ధన్య ళకారము పరము కాఁగా దాని సాహచర్యమున నందలి రేఫము శకట రేఫముగా మాఱియుండును. శకట రేఫళకార సమ్మేళనము పూర్వము డ్ఱ్ళు (d rl u) అనునట్లుగా నుచ్చరింపఁ బడుచుండెను. కొంత కాలమునకు రేఫము పోయి మఱుతుడ్లు అను రూపమేర్పడి యుం డును (cf ఊరు, ఊడ్లు). కొన్ని శాసనములలో నీ శబ్ద మేకవచన బహువచ నములందు మఱుతు, మఱుతులు, అను రూపములతోఁ గనఁబడుచున్నది విశ్ప్రత్తి శాసనమున ముప్పది మఱూతూ అనియు, మోపూరు భైరవ స్వామి దేవాలయమున "నూఱు మఱుతు" అనియుఁ బ్రయోగములు చూపట్టుచున్నవి. కాకతి గణపతి దేవుని పాకాలశాసనములో[1] మఱ్తులను బహువచన రూపము ప్రయోగింపఁ బడినది. దీనిని బట్టి మఱుతు, మఱ్తు అనున వేకవచన రూపము లనియు మఱుతులు, మఱ్తులు అనునవి బహువచన రూపము లనియు స్పష్టమగు చున్నది. మఱుతురు అను రూపమే కాలక్రమమున నంత రు వర్ణము లోపించు టచే మఱుతు అను రూపమును జెందిన ట్లూహింప వచ్చును.

పూర్వము భూ పరిమాణమును మఱుతుల లెక్కతోఁ గొల్చెడివారు. "కాక తీయుల కాలమునను అటు పిమ్మటను నీరు నేలను (పల్లపు నేలను) మఱ్తుల లెక్కను, వెలి చేనును (మెట్ట నేలను) పుట్ల లెక్కను గొల్చెడి వారు".[2] పై పాకాల శాసనమున నొక మఱు తొక నివర్తనమునకు సమానమని సూచింపఁ బడినది. సంస్కృత శ్లోకమున,

తస్మై శ్రీ జగదాళ ముమ్మడి రదా దస్యాం పురి ప్రోన్నతం
సాధం పంచ నివర్తనాని చ సదా క్లిష్టాని సస్య శ్రియా

అని చెప్పఁబడిన విషయమే తరువాత "ఈ శాసనమునఁ జెప్పిన కవి చక్రవర్తిఁగారలకు ముమ్మడయంగారు ఇచ్చిన వ్రిత్తి అయిదు మఱ్తు" లని వివరింపఁ బడినది. ఈ నివర్తనము పరిమాణము విషయమునఁ గూడ భిన్నాభిప్రాయము లున్నవి. కాకతీయ సామంతుఁడైన సారంగధరుని సారంగపుర శాసనమునఁ బది హస్తముల దండముతో ముప్పది దండములైన

1. Nellore Inscriptions Vol I C. P grant No. 17. పుట 187.
2. రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచిక పుట 64

నొక నివర్తన మగునని తెల్పఁబడినది.[1] కాని శుక్రనీతి సారమున నాలుగు లేక యైదు కరము లొక దండ మనియుఁ, బ్రజాపతి మనువు లుభయుల మతమున నిరువది యైదు దండము లొక నివర్తన మనియుఁ జెప్పఁ బడియున్నది.[2]

పొల గరుసు:- కీ. శే. జయంతి రామయ్య పంతులు గారీ పదమునకుఁ బొలిమేర యని యర్థముచెప్పి యిందలి పొలి శబ్దము పొరపాటున పొల యని అకారాంతముగా లిఖింపఁబడిన దనియు, నది బలిశబ్దభవ మనియుఁ దెల్పియున్నారు. (నందమపూఁడి శాస) ఇప్పుడు పొలిమేర శబ్దము జన వ్యవహారమున నున్నది. శబ్దరత్నాకరమునఁ గూడఁ బొలిమేర యందలి లకార మిదంతముగానే కనవచ్చుచున్నది. దాని కందు గ్రామద్వయ మధ్య సీమ, ఎల్ల అను నర్థము లొసంగఁబడి యున్నవి. ముద్రితమైన కాశీ ఖండమున (3.116) నొక సీస మందలి గీత పద్యములోఁ బొలిమేర సీమ యను పద మున్నది. కాని యిది యతి స్థానము ననో ప్రాస స్థానముననో లేని కారణమున శ్రీనాథుఁడు పొలిమేర యని వ్రాసెనో పొలమేర యని వ్రాసెనో నిశ్చయముగాఁ జెప్పఁ జాలము. అతఁడు పొలమేర యనియే వ్రాసినను అర్వాచీన లేఖకులో అచ్చు వేయించుటకు ముందు పరిష్కరించిన పండితులో వ్యవహారము నందలి రూపమును బట్టి యిందలి లకారమును లికారముగా దిద్దియుందు రన్నచో నచ్చెరువు పొంద నక్కఱలేదు. నన్నయభట్టు నందమపూఁడి శాసనములో సీమలను వివరించిన సందర్భమున వ్రాసిన యెనిమిది వాక్యములలోను పొల గరుసని లకారముతోఁ గూడిన రూపమే గోచరించుచున్నది. ఈ యెనిమిది చోట్లను శాసన లేఖకుఁడైన గండాచార్యుఁడు ప్రమత్తుఁడై లివర్ణమును లవర్ణముగా మార్చి వ్రాసి యుండు ననుకొనుట యుక్తి యుక్తముగా నుండదు ఒక్కచోట నైనచో నెవ్వరైనఁ బొరపడుట కవకాశ మున్నది. కాని యిన్ని చోట్ల నొకే విధముగాఁ బొరపాటు పడి యుండిరనుట సంభావ్యము కాదు. నన్నయ తరువాత వ్రాయఁ బడిన పెక్కు శాసనములలో నా శబ్దము లకార యుక్త రూపముతోనే కనవచ్చుచున్నది. "నే నెరిగి నంత మట్టుకు ప్రాచీనుల వ్రాఁతలలో ఎక్కడా పొలిమేర కానరా" దని కీ. శే. గిడుగు

---

1 దశహస్తేన దండేన త్రింశ ద్దండా నివర్తనమ్.

2. చతుః కరాత్మకో దండో లఘుః పంచకరాత్మకః అధ్యా 1 శ్లో 19.
పంచ వింశతిభి ర్దండై రుభయో స్తు నివర్తనమ్ అధ్యా 1 శ్లో 200.
రా. రా. న పట్టాభిషేక సంచిక పుట 64.

రామమూర్తి పంతులుగారు రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచిక (పుట123) లోఁ దెల్పియున్నారు. కొన్ని ప్రాచీన కన్నడ శాసనములలోఁ గూడ పొల శబ్దము లకార యుక్తముగానే వ్రాయఁబడి యున్నది.[1] కిటెల్ కన్నడ నిఘంటువులో పొల శబ్దము కనఁబడుచున్నది. అందు దానికి దిక్కువి యర్థ మొసంగఁ బడి నది. అందుచేఁ బొలిశబ్దము కాక పొలశబ్దమే సరియైనదని నిర్ణయింప వచ్చును. గరుసు శబ్దమునకు మేర మర్యాద అను నర్థములు శబ్ద రత్నాకరములో నీయఁ బడినవి శ్రీనాధుఁడు భీమ ఖండమున (ఆ ౩-ప 88) "ఏక భోగంబుగాఁగ నేలేఱు గరు" పని గరుసు శబ్దమును సీమ యను నర్థమున వాడియున్నాఁడు. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు రా. రా. న. ప. సంచికలో (పుట 65) తిక్కన సోమయాజి ద్రోణ పర్వమునందలి పంచమాశ్వాసములోని యీ క్రింది పద్యము నుదాహరించి యాతఁ డిందు గరుసు శబ్దమును మోమోటమి యను నర్థమున వాడి యుండెనని తెల్పి యున్నారు.

కం. గురునకు నాకును బాండవు
లరయఁగఁ గూరిమికిఁ బాత్ర మగుదుర యైనన్
దురమునఁ జుట్టఱికంబను
గరు సిడికొనుటేల గలుగుఁ గౌరవనాధా!

కాని యిచ్చట గరుసు శబ్దమునకు మేర, మర్యాద యను నర్థమే చెప్పు కొనుట కాటంక మేమియుఁ గానఁబడదు. శబ్ద రత్నాకరమున నా శబ్దమునకుఁ గల యా యర్థమున కీ పద్యమే యుదాహరణముగాఁ జూపఁబడినది. అందుచే పొలగరుసు శబ్దమునకు పొలము సీమ, పొలము సరిహద్దు అను నర్థము చెప్పుటయే సమంజసముగా నుండును. మఱియొక శాసనములో (E. I. Vol V పుట 139) చేని గరు సను శబ్ద మీ యర్థముననే వాడఁబడి యున్నది. కఱుత · దీనికిఁ దీరమున లేక ఒడ్డున అని యర్థము. (గంగ కఱుత గవిలం జంపిన పాపానం బోదురు) దీనికి సమానార్థకముగా నరవమున కత్తై యను శబ్దము కానవచ్చుచున్నది. ఇది కులోత్తుంగ చోడుఁడు, వీరచోడుఁడు మున్నగు వారి కాలమునుండి (క్రీ. శ. 12 వ శతాబ్ది) తెలుఁగు శాసనములలోఁ గానవచ్చు చున్న దనియు, వైదికమతము పునరుద్ధరింపఁ బడిన నాఁటి నుండియు

1. పొలసీమె E I. X పుట 66.

గంగకును వారణాసికిని ప్రాముఖ్యము కల్గినదని యూహింప వచ్చుననియు శ్రీ సోమశేఖరశర్మగారు వ్రాసియున్నారు.[1] కాని కళుత అనునది క్రీ. శ. 10 వ శతాబ్దిలోఁ గూడ గానవచ్చుచున్నది (రెండవ అమ్మరాజు వేమలూరుపాడు తామ్రశాసనము క్రీ. శ. 945. గుజ్జేటియ కళితి వేములగోను) జయసింహ వల్లభుని విప్పర్తి శాసనమున (క్రీ. శ. 7 వ శతాబ్ది) "వచ్చినవారు భారనా" అని వారణాసి శబ్దము కూడ రూపాంతరముతోఁ గానఁబడుచున్నది. క్రీ. శ. 11 వ శతాబ్దిలో కళుతకు గట్టున అను నర్థము రూఢమై యుండెను. (ఏంటి కత్తిపుట్ట. E I Vol V. పుట 70) అంతకు ముందున్న రెండవ అమ్మరాజు శాసనములోఁ గూడ నది యా యర్థముననే వాడఁ బడినది. కాల క్రమమున కళుతలోని శకట రేఫము సాధు రేఫ మైనట్లు తోఁచుచున్నది. క్రీ. శ. 12 వ శతాబ్దికిఁ దరువాతి శాసనములలో నది కఱు కఱ్ర అను రూపాంతరములను జెందినది [2]

రట్టగుడి - రట్ట గుళ్లు :- ఈ శబ్దములు క్రీ. శ. 7 వ శతాబ్ది నుండియుఁ గాన వచ్చుచున్నవి.

| | |
|---|---|
| అరవశ మహేంద్ర రట్టగుడి | Ep. Collection No. 798 of 1917 |
| పల్లవ రట్టగుడి | .... No. 400 of 1904. |
| చల్కి రట్టగుడి | Do. |
| తొల్పకామి రట్టగుళ్లు | విక్రమాదిత్య చోళ మహారాజుల చిలంకూరుశాస. |
| చోళియ రట్టగుళ్లు | Do. Do |
| అతిశయ రట్టగుళ్లు | క్రీ శ. 8 వ శతాబ్ది. |
| మాఱ్పిడుగు రట్టగుళ్లు | Ep. Coll. No. 384 of 1904. |

పై యుదాహరణములను బట్టి రట్టగుడి శబ్ద మేకవచన రూపమనియు రట్టగుడ్లు లేక రట్టగుళ్లు అనునది బహువచన రూపమనియుఁ దెలియుచున్నది. రట్ట

1. రాజరాజ పట్టాభిషేక సంచిక పుట 64. "వారణాసి వచ్చువారు. గంగ కళుత. ఇయ్యవి క్రీ శ 11 వ శతాబ్దినుండి కానవచ్చు పదములు. వారణాసి యనునది క్రీ శ. 7 వ శతాబ్ది నాఁటి తెలుఁగు శాసనములలోఁ గానరాదు"

2. రాజరాజ నరేంద్ర సంచిక. పుట 64

(రట్టు) అనున దొక తెగయొక్క పేరై యుండుననియు, దానినిబట్టియే రట్ట పాడి, ఇరట్ట మండలము, రట్ట రాజ్యము అను పదము లేర్పడినవనియు, నొకా నొక రాజు రట్టుల పక్షమున నొకరి మీఁదికి యుద్ధమునకు వెళ్లిన ట్లొక శాసన మునఁ (Ep Coll No 562 of 1915) జెప్పఁబడిన దనియు, నా తెగను సూచించుటకై రట్ట పదము వివిధ రూపములతోఁ బేళ్ల చివరఁ గానవచ్చు చున్నదనియు శ్రీ సోమశేఖరశర్మగారు వ్రాసి యున్నారు.[1] నిపరధుఁడు, అతని తండ్రి దెసెరధుఁడు (Ep. Coll. No. 754 of 1916) ప్రోలయ రట్టోటి (No. 675 of 1917) ముప్పిరటి (No 673 of 1917) అనునవి వా రొసంగిన యుదాహరణములు. రట్టులను బట్టియే రాట్ట మను పేరు వచ్చెననియు (కమ్మక రాట్టము) నదియే సంస్కృతమున రాష్ట్రముగా మారెననియు వారి యభి ప్రాయము. కుట్టు అను శబ్దమును గూర్చి రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచికలో వా రిట్లు వ్రాసియున్నారు (పుట 68) "కుట్టు" అనునది కూడ నొక తెగయొక్క పేరని నా అభిప్రాయము. కుట్టు అను నొక తెగ యుండెననియు, శాత వాహన వంశము రాజకీయముగా పతనము నొందిన తరువాత ఆంధ్ర సామ్రాజ్యములో చాలభాగము కుట్టు తెగవారి వశమయ్యెననియు, వారు మహారథులవలెనే శాతకర్ణులను బిరుదములను తమ నామముల చివర నుంచు కొనుచు వచ్చిరనియు డుబ్రెయిల్ దొరగారు వ్రాయుచున్నారు.[1] ఉదా: విష్ణ కద కుటు శతకర్ణి. రట్ట పదము వలెనే కుట్టు పదము క్రీ. శ. 3, 4 శతాబ్దుల లోనే కాక యిటీవలి కాలమున కూడ పేళ్ల చివర నుండుచు వచ్చెననుట కీ క్రింది నిదర్శనములను చూపవచ్చును. పిరగుట్టి (Ep Coll. No 735 of 1917) అయ్యకుట్టి (Ep Coll No. 735 of 1917) కాలము గడచినకొలంది రట్టపదము రట్టి అయినట్లే కుట్టు పదము కుట్టి అయినది. కుటుపదము క్రమ క్రమముగా కుట్టు, కుట్టి, కుడిగా మారెనని యూహింప వచ్చును. ఈ రట్ట కుట్టు తెగల అన్యోన్య సంబంధమే రట్టగుడి యను పద మేర్పడుటకు కారణ భూతమై యుండును. ఇంకను పరిశోధనము వలన తేలవలసిన విషయ మిది. ఈ రట్టకుడు, రట్టగుడి అను పదమే సంస్కృతమున రాష్ట్రకూట పద మయ్యెను. ఇయ్యది పూర్వ చాళుక్య శాసనములందుఁ గానవగును.

---

1 రాజరాజన రేంద్ర పట్టాభిషేక సంచిక. పుట 68.

2. Ancient History of the Deccan. Page 48

"గుద్రహార విషయ నివాసినో రాష్ట్రకూట ప్రముఖాన్ కుటుంబిన స్సర్వాన్సమాహూయ." పూర్వ చాళుక్యశాసనములందలి రాష్ట్రకూటపదముకంటె రట్టకుడు అను పదమే పురాతనమైనదిగాఁ గానవచ్చుచున్నది. ఏలయన విషయ నివాసినో రాష్ట్రకూట ప్రముఖాన్ అని పూర్వ చాళుక్యులు దేశీయులను సంబోధించుట రెండవ విజయాదిత్యుని కాలము నుండియో (క్రీ. శ. 799-843) లేక నాల్గవ విష్ణువర్ధనుని కాలము నుండియో (క్రీ శ 764-799) ప్రారంభమైన ట్లూహింపవచ్చును అనఁగా రమారమి 8 వ శతాబ్ది మధ్య కాలము నుండి యారంభమయ్యెను.

ఈ పై ప్రమాణముల వలన రాష్ట్రకూట పదము కంటె రట్టకుడు పదమే పురాతన మైనదని నా అభిప్రాయము రట్టులే రరులు రధులు అయిరి. వీరిని బట్టియే రట్ట రాజ్యమునకు మహారాష్ట్ర మను పేరు కలిగెను. (మహారరుల దేశము) ఈ రట్ట లేక రరు అను పదమే రాథోడు పద మయ్యెనని కొందఱి మతము. రాథోడు అనునది రాజపుత్ర స్థాన మందలి రాజ వంశములలో నొక దానికి పేరు. రట్టకుడు, రట్టగుడి అను జాతి పదము నామములచివర కడప, అనంతపురము మండలము లందలి ప్రాచీన శాసనములలో కనవచ్చుచున్నది. ఉదా - మాఱ్పిడుగు రట్టగుడి. మాఱ్పిడుగు అనునది యొకా నొకని నామము. పిడుగు అంతమునఁ గల పేళ్ళు పల్లవుల కాలమునఁ బెక్కు కానవచ్చుచున్నవి. ఉదా: కదుంబిడుగు (S I I Vol I పుట 63) పెరుంబిడుగు (పుట 155) విదెల్విడుగు. శ్రీ కంఠ చోళుని పూర్వుల పేళ్ళలో అగ్రణి పిడుగు అను పేరు కానవచ్చుచున్నది రట్టకుడి అనునది రాష్ట్రకూట రూపముతోఁ బూర్వ చాళుక్యుల శాసనములలో క్రీ. శ. 8 వ శతాబ్దము నుండి విశేషముగా కనఁబడుచున్నది. ఈ రాష్ట్రకూటులు, కుటుంబు లని శాసనముల ననుసరించి తెలియుచున్నది కుటుంబులనఁగా వ్యవసాయదారులని అర్థము. తమిళమున కుడి అను శబ్దము నుండి కుటుంబి అను పదము పుట్టెనని శబ్ద శాస్త్రజ్ఞులు చెప్పుదురు." ' కాలక్రమమున రట్టగుడిలోని గు లోపించుటయు నది వివిధరూపముల నందుటయు నంభవించెను. ఉదా:

రట్టోడి. Nellore Ins K 67 పుట 606. EP. In. Vol. V పుట 139.

రట్టాడ్లు, రట్టొడ్లు. Ep. Coll. 363 364 of 1905.

రద్దోడి, రాడ్డొడి, రాదొడ్లు. Nellore Ins. P 22

రట్టయ Nellore Ins P 38 Page 1201.

రట్టడ్ల No. 403 B of 1900.
రాష్ట్ర No. 408 A of 1904 ముందూరు రాష్ట్ర.
ఒడ్డి Nellore Ins A 24 Page 230. K 31 Page 724 K 22 Page 716.
రెడ్డి Nellore Ins O 67 Page 1039, O 58 Page 994

రట్ట కుట్టు శబ్దముల సంయోగముచే రట్టగుడి, రిట్టకుడు అను పదము లేర్పడుట కవకాశ ముండుట నిజమేయైనను శ్రీ శర్మగారిన్ని ట్లీ విషయ మింకను బరిశోధనము మీఁదఁ దేలవలసి యున్నది. రాట్ట శబ్దము రాష్ట్ర శబ్దము కంటెఁ బురాతన మనుట సందేహాస్పదము. మనుస్మృతిలో రాష్ట్ర (7.109 · 10.61) మహారాష్ట్ర (7.32) శబ్దములు కనఁబడుచున్నవి రాష్ట్రిక, రాష్ట్రికూట శబ్దముల నుండి రట్టకుడను శబ్ద ముత్పన్న మగుట క్రమబద్ధముగా నుండును. శ్రీ జయంతి రామయ్య పంతులుగారు రట్టగుడి రట్టడి మున్నగు వానికి రాష్ట్రికూట శబ్దమే మూలముగాఁ దోఁచుచున్నదనియు, రాష్ట్రమునకుఁ బ్రధానుఁడు లేక ముఖ్యుఁడు అని దాని కర్థ మనియు ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో సూచించి యున్నారు.[1]

వేవాన్లు = వేయువాఁడు.
కోట్టము (కొట్టము) = దుర్గ పురము.
ప్రతిరవలు. విష్ణువర్ధనమహారాజు బుదమనారాయలపాడు శాసనము. (దీనికి ప్రతి రవలు వచ్చువారు) ఇది యాటంక మను నర్థమున వాడఁబడినట్లు తోఁచుచున్నది

వక్రము అనునదియు విదియు సమానార్థకములే యని చెప్పవచ్చును.

వెమ్బొరుచు = వెంబడించు.
వడ్డవారము = శుక్రవారము.
వడ్డిపివాన్లు = కుడుపువాఁడు; అనుభవింపఁ జేయువాఁడు.
వడ్డచి = వడ్రంగి (వర్ధకి).
లఞ్చంబు గొను = అపహరించు.
క్లొచ్చు = శిలాదులపైఁ జెక్కు: తరువాతఁ ద్రవ్వు అను నర్థము కూడ దీనికిఁ గలిగినది.
డూబ (రెండవ అమ్మరాజు మచిలీపట్టణ తామ్ర శాసనము. Ep. Ind. Vol. 24 పుట 274) రాతిగుట్ట.

1 Vol. 24 పుట 168

బూరువు పడువ = బూరుగుచెట్ల గుంపు (Cluster of silk-cotton trees).
పై శాసనముననే తప్పరాల పడువ అనుచోట పడువ శబ్దమునకు శ్రీ భావరాజు వేంకట కృష్ణారావుగారు a marshy swamp అను నర్థము నూహించి యున్నారు.
ఇసి్ప (ఇయ్యోట్టు ఇసి్ప యుద్ధమల్లుని బెజవాడ శాస.) ఇది అయ్యు ధాతువు యొక్క క్త్వార్థక రూపము. ఈ యొట్టు ఓడించఁజేసి యని యిచ్చట నిది సకర్మకముగా వాడఁబడినది.
గొరగలు = శైవ మతావలంబకులగు భిక్షుకులు. (యుద్ధ మల్లుని బెజవాడ శాసనము గొరగల్గా కొరులిందు, రెండవ తాళుని సిరిపుర శాసనము. క్రీ. శ 940 ప్రాంతము. గొరగ పల్లము).

ఇది నన్నెచోడుని కుమార సంభవమున శకట రేఫముతో ముద్రింపఁ బడినది. "గొఱగఁ గలుచుఁగా కాతనిఁ గోరి తపము సేసెదట గౌరి నీ వెంత చేట్ల పురులొ" సప్త. 38. శ్రీనాథుని కాశీ ఖండమునఁ గూడ గొరగ శబ్దము ప్రయోగింపఁ బడియున్నది. అచ్చట నది సాధు రేఫముతోనే కనఁబడుచున్నది.[1] ఠాన పతులు = స్థానికులు, ధర్మకర్తలు. (స్థానాపతి యను శబ్దము మధ్యవర్తి యను నర్థమున శబ్ద రత్నాకరములో నున్నది. దానికిని దీనికిని సంబంధము లేనట్లు తోఁచుచున్నది).

మొగ మాడువు (యుద్ధమల్లుని బెజవాడ శాస.) మొగ నుండు మాడువు (మేడ).
వేరఱు = గొప్ప ధర్మము. ఆ. సా ప ప. 8 సం. IV, పుట 263.

కాలు, కాళ్లు· ఇది పూజ్యార్థమునవాడఁబడుచుండినట్లు కనఁబడుచున్నది. పూజ్యులను గూర్చి చెప్పునప్పుడు పాద, చరణ శబ్దములను జివర వాడు నాచార మిప్పుడుకూడ నున్నది. ఉదా·- శ్రీ శంకర భగవత్పాదులు, గురుచరణులు. కాలుశబ్దమును పాద చరణ శబ్దములను సమానార్థకములే. అందుచే సంస్కృతమునఁ బాద చరణ శబ్దములను వాడుచోటఁ దెలుఁగున కాలు, కాళ్లు శబ్దములు వాడఁబడు చుండెనవి చెప్పనగును. సంస్కృతమునఁ బాద చరణ శబ్దములు పూజ్యార్థమున సాధారణముగా బహు వచనాంతములుగానే ప్రయోగింపఁబడును. తెలుఁగున కాలను నేక వచన రూపము కూడఁ గానవచ్చుచున్నది. మన మిప్పుడు పూజ్యార్థమున వాడు

1. గొరగమై మైలారుఁ గొనియాడు నొకవేళ నొసటిపై బండారు పసుపు దాల్చి, కాశీ 2 ఆశ్వా

చుండు 'గారు' అనునదియు నిదియు సమానార్థకములే. కల్, కళ్ అను బహు వచన ప్రత్యయమే యిట్లు రూపాంతరమును జెందినదనియైనఁ జెప్పవచ్చును.

కలాకణుగుమ్, పదువారమ్బు : భూమిపైఁ జెల్లింపవలసిన వస్నులపేర్లు (జయసింహ వల్లభుని విప్పర్ల శాసనము) కలా యనఁగా సంస్కృతమునఁ బదు నాఱవ భాగ మను నర్థ మున్నది. దీనిని బట్టి కలాకణుగు మనఁగా రాజునకుఁ జెల్లింప వలసిన పదునాఱవ భాగ మను నర్థము స్ఫురించుచున్నది.

బోయ, బోఋ, బోళ ; ఇది సంస్కృతము నందలి భోజక శబ్దము నుండి యేర్పడి యుండును. గ్రామము నందలి భూ భాగమును ఖండించుచు దాని ననుభ వించు వాఁడని దీని యర్థము. S I. I X నెం. 597 లో చాంగెయ బోయుణ్డను రూపము కూడఁ గాన వచ్చుచున్నది. దీనికి బహువచనమున బోళ్, బోఋ అను రూపములు వాడఁబడినవి. (అలపాక బోళ్, వెళ్లెక్కి బోళ్, మారటబోళ్, ఇంద్ర వర్మ కొండనగూరు శాసనము)

ముఋద, (మునుద) గ్రామాధికారి. గ్రామమున నుండి రాజు శాసనముల నిర్వహించు నధికారి. దీనికి బహు వచనమున ముట్బు, ముడ్లు అను రూపములు కనఁ బడుచున్నవి (విప్పర్ల శాస మ్లావిండి రాజుల ముట్బు, లక్ష్మీపుర శాస. మగి దొగరజుల ముష్లు)

రేనాడు: కన్నడమున ఎర అనఁగా dark red, dark brown colour అను నర్థము లున్నవి. ఎర యనునదీ వర్ణ ప్లుతిచే రేయైనది. రేనా డనఁగా నల్ల రేగడి భూమి గల ప్రదేశమని యర్థము చెప్పవచ్చును.

పెక్కు శాసనములలో లళ, నణ, నళ, తద అను నక్షరము లొకదాని కొకటి తారుమాఱుగా వ్రాయఁబడి యున్నవి. దీని కప్పటి జనుల యుచ్చారణ మందలి భేదము కాని, ప్రాకృత భాషా సంపర్క ప్రభావము కావి, కొన్ని చోట్ల శాసన లేఖకుల యజ్ఞత కావి కారణమై యుండవచ్చును. కొన్నియెడల మూల రూపములందలి వర్ణములు కాల క్రమమున మార్పుచెందుట చేతను. మాఱిన రూపములు మాత్రమే మనకుఁ బరిచితములై యుండుటచేతను అంతకుఁ బూర్వమున్న రూపము లిప్పుడు వింతగా గోచరింప వచ్చును. పెక్కు చోట్ల వర్గ యుక్కులును వర్గ ప్రథమ తృతీయాక్షరములును నొండొంటితోఁ

దారుమా ఱగుట కూడఁ గనవచ్చుచున్నది. ఈ వ్యత్యాసమునకుఁ జాలచోట్ల శాసన లేఖకుల యజ్ఞతయే హేతువని తలంపవచ్చును.

ల ళ

ఏళన్ ధనంజయుని కలమళ్ల శాసనము క్రీ. శ. 575.
చోళమహారాజు ఇందుకూరు శాస.
,, ఉరుటూరు శాస.

ఏళుచుఙ్ఞి No. 338.
ఏలుచు పుణ్యకుమారుని తిప్పలూరు శాస.

క్రీ. శ. 4 వ శతాబ్ది యందలి శాలంకాయన విజయదేవవర్మ ఏలూరు ప్రాకృత శాసనములో ఏళూరు అనురూపము కానవచ్చు చున్నది. ఏలు + ఊరు అను వాని కలయికచే నీ రూప మేర్పడినది. ఏలు ధాతువున కితర ద్రావిడభాషలలో అళ్ అను ళకార యుక్తమైన రూపము కానఁబడుచున్నది ఇదియే ఏళుగా మాఱి తరువాత ఏలు అను రూపమును బొందినది.

వేళ్ళుగుడ్లు : ( జయసింహ వల్లభుని విప్పర్తి శాస. ) యజనార్థకమైన వేళ్ ధాతువు నందలి ళ కారమే యీ ప్రయోగమునఁ గానఁబడుచున్నది. ఇది క్రమముగా వేల్‌గా మాఱుటచే మన మిప్పుడు వేల్పు అని వ్రాయు చున్నాము.

కళరేవి అహదనకర శాసనము; లక్ష్మీపుర శాస.
కళవస్థు కామనూరు S. I. I X నెం. 610.
కయ్యంబుళోన బసినికొండ శాస. S I I X 623.
వళ్ళాద్యది యొకటి వెంకయ చోళుని దొంగలసాని కనుమ శాస.
గణపతి వ్రళ్ళి No 408 A కొపినేపల్లి దగ్గఱ.

వీనియందలి ళ కారమునకుఁ బ్రాకృత భాషా సంపర్కముకాని శాసనలేఖకుల పొరపాటుకాని కారణమై యుండును.

న ణ

పణికేసిరి S. I. I. X 47.
భణిపేసిన విప్పర్ల శాస.

తమిళ కన్నడములందు పణ్, పణ్ణు అనువానికి చేయు అను నర్థమున్నది ఇందలి మూర్ధన్య ణకారమే పై పణి శబ్దమునందుఁ గానవచ్చుచున్నది.

ఎణుంబొది విప్పర్ల శాస.

ఎణుబొణ్డ్రి ( ణ్ణి ) పెద్దముడియం శివాలయము S. I I X 612.

నూటయెణ్మ విత్యవర్షుని మాలెపాడు శాస.

తమిళ కన్నడములలో ఎట్టు, ఎణ్టు అనురూపములును తుళులో ఎణ్మ అను రూపములును గలవు. ఎణ్ అనునది మఱియుఁ బ్రాచీన రూపమై యుండును.

పణ్డెణ్డు గొణి అద్దంకి శాస. బికిరాజు శాస. S. I I X 574.

గొణ్నవాను పెద్దముడియం శివాలయ శాస. S I I X 611.

ఔగొణ్న వాన్డు Do

గ్రహణార్థకమైన కొళ్ ధాతువు దీనికి మూలరూపము. తమిళ కన్నడము లందు కొళ్ధాతువున్నది. తుళులోనది కొన్ అను రూపముతోను, తెలుఁగులో కొను అను రూపముతోను గనఁబడు చున్నది.

పణ్చిన అద్దంకి శాసనము.

తెలుఁగున నిప్పుడు పనుచు, పంచు అనునవి పోవు ధాతువునకుఁ బ్రేరణార్థక రూపములుగా వాడఁబడు చున్నవి. పై మూర్ధన్య ణ కారము ప్రమాద పతితము కావచ్చును. లేదా కరణార్థకమైన పణ్ ధాతువునుండియే పై రూప మేర్పడి యుండవచ్చును.

కావన్ బూని కొఱవి శాసనము.

తమిళ కన్నడములందు పూణ్ (to undertake, to consent) ధాతు వున్నది అది తెలుఁగున పూను అని దంత్య నకారముతోనే చూపట్టుచున్నది. చేకొని ఎనుబొది వుర్ల అనుదంత్య నకారయుక్త రూపములు కూడఁ జాళుక్యుల శాసనములలోఁ గానవచ్చుటచే నప్పు డీ మార్పు క్రమముగా జరుగుచుండెనని యూహింప వచ్చును.

అణతి రామేశ్వర స్తంభ శాసనము.

వివియణ Do.

ఫణమ్ చిలంకూరు శాసనము,

సంఘట్టణోపలబ్ధ గాలివాం(డపల్లె S I I X 635.
మణిసి కొఱవి శాస.
సంఘట్టణ Do

వీనియందుఁ బ్రాకృత భాషా సంపర్క ప్రభావము గోచరించుచున్నది. కొన్నిచోట్ల మూర్ధన్య ణకారమునకు బదులు దంత్య నకారము తప్పుగా వ్రాయఁబడి యున్నది. దీనికి శాసన లేఖకుల పొరపాటే కారణము.

గ్రహన స్తితి : చోళమహారాజు సూర్యగ్రహణకాల శాస. S. I I X 595.
బ్రాహ్మనులకు : కుసుమాయుధుని శాస. ఉగాది సంచిక. భావ సంవత్సరము. పుట 297.

వై శ్రవను కపిలేశ్వరపుర శాసనము. క్రీ. శ 740.

శ స

కొన్ని శాసనములలో శసలు తారుమాఱుగా వ్రాయఁబడియున్నవి. అసలు ప్రాచీన ద్రావిడ భాషలో శ స ష ల ను సూష్మము లున్నట్లే లేదు. తమిళమున నీ ధ్వనులకు బదులు చకారమే వాడఁబడు చుండును. ఆంధ్ర శబ్ద చింతామణిలో హల్వర్గమున సకారము పేర్కొనఁబడి యుండుట చేతను, ఉబుసు, పసిఁడి, పస, ఎకసక్కెము మున్నగు మూల పదము లందును, చేసెను, చేసిరి మున్నగు క్రియా రూపము లందును అది కానఁ బడుచుండుట చేతను, దెలుగునఁ బ్రాచీన కాలము నుండియు సకార ముండెననియే యూహింపనగును. అందుఁ దాలవ్యము లైన శచ వర్ణములకును గొన్ని చోట్ల షకారమునకును బదులుగా దంత్య సకారమే వాడఁబడు చుండును. ఈ క్రింది పదములలో శవర్ణమునకు బదులు సకారము వ్రాయఁబడి యున్నది.

స క్తిత్రయ సంపన్నుణ్డు ధర్మవర శాసనము S. I I X P. 2
Nellore Ins. Page 968
ఇసాన శివులు వెంకయ చోడుని దొంగలసాని కనుమ శాస.
పాసన బిదిగల్లు S I. I X 598
వేగి దేసము కొఱవి శాస.
కలస నిర్వహణమ్బు
కళా విసారదుణ్డు

| | |
|---|---|
| కాస్యపగోత్ర కరికాలాన్వయ | చోడ మహారాజు సూర్యగ్రహణకాల శాస |
| సూద్రపుండు | గురిందగుంట శాస. |
| అస్వ మేదంబున | అద్దంకి శాస. |
| సవ్వఽ లోకాస్రయ | విష్ణువర్ధనుని సాలెపాడు శాస |

క్రీ. శ. 7, 8 శతాబ్దు లందలి కొన్ని శాసనములలో దంత్య సకారమునకు బదులు శవర్ణము వాడఁ బడినది.

| | |
|---|---|
| వశున్దరా | లక్ష్మీపుర శాసనము. |
| యశ్య యశ్య తశ్య తశ్య | Do. |
| 'పెడశిన రెండు వట్టి | Do. |
| శాక్షి | ఎట్టి గుడిపాడు శాస. |
| మశృణిత | కొఱవి శాస. |
| శూర్యఽ గ్రహన నిమిత్యంబున | బికిరాజు శాస. |

చకారమునకు బదులు సవర్ణము వాడుట పూర్వపు శాసనములలోఁ బెక్కు చోట్లఁ గనవచ్చును. దీనినే తరువాత వ్యాకరణ కర్తలు గ స డ ద వాదేశ సూత్ర మునఁ జేర్చి యుండిరి ఈ విధముగా వచ్చు సకారమునకు బదులు కూడ నొండు రెండు చోట్ల శవర్ణము వాడఁ బడినది.
వే చెఱువులు—వే సెఱువులు—వే శెఱువుకు. మంగి దొగరాజు లక్ష్మీపుర శాస

ఈ గసడ దవాదేశము ప్రథమాంతములగు కళల పైని, సమాస మధ్యము నను గనవచ్చుచున్నది తమిళమునఁ బద మధ్యము నందలి 'కటత'లు గడద లుగా నుచ్చరింపఁ బడుచుండును. అచ్చుల నడుమ నుండుటచే వాని నాద స్వభా వము వీని మీఁదికిఁగూడఁ బ్రాకుట వలన మొదట నీ పద్ధతి యేర్పడి క్రమముగాఁ బ్రచురమైనది అదియే తెలుఁగునఁ గూడ తల్లిదండ్రులు, కూరగాయలు మున్నగు సమాసముల నడుమఁ జూపట్టుచున్నది. ఇంక సవల సంగతి-"చకారమును సకార మును బ్రాచీనతమిళమునను నేఁడును సాధారణముగా పరస్పరము మాఱుచుండును. ప్రాచీన భాషలో శవర్ణ షకారములే లేవు. కావుననే తమిళమున చకారమే యొక ప్పుడు పరుషముగాను, సామాన్యముగా తత్స్థాన మగు సూక్ష్మముగను గూడ బలుకఁబడుచుండును. శ్రమ యక్కఱ లేకయే వ్రాఁతలోని చకార ముచ్చారణ మున శకార మగు చుండును (సంధి. పుట. 128). చవర్ణము తాలవ్య స్పర్శము.

శవర్ణము తాలవ్యమగు నూష్మము. శషలు ఊష్మము లగుటఁ బరస్పరము మాఱు నను అనుభవ సిద్ధము చవర్ణము సవర్ణముగా మాఱి శ స లకుఁ గల భేదమును నిరూపించున ట్లుచ్చరింపఁ బడక పోవుటచేతను, సకారము మాత్రమే తెనుఁగున నున్నట్లు లాక్షణికు లంగీకరించుట చేతను చ స లే మాఱుపడినట్లు ప్రామాణిక మైనది. వాగ్వ్యవహారములో శవర్ణము వినఁబడును పయి మార్పు అనవధాన ముచే స్థాన కరణముల మాఱుపాటు వలనఁ గలిగిన దనుట స్పష్టము. ఇట్లు పదా దిని గూడ గలిగిన మార్పు సమాస మధ్యమున నిల్చి వైయాకరణులచే నంగీక రింపఁ బడి సూత్ర గ్రథిత మైనది. . . ఇంకఁ బద మధ్యమున నున్న పకారము బకారముగా మాఱి వకారమయి యుండవచ్చును. ఇట్లు పకారము వకారమగుట మిక్కిలి ప్రాచీన కాలముననే జరిగి యుండుటచేత నద్దాని క్రమము నిరూపించు టకు ప్రామాణిక భాషలో నుదాహరణములు లభింపవు. "(ఆంధ్రభాషా వికాసము. పుట 334). దీని సామ్యముచేఁ గాఁబోలు బికిరాజా శాసనములో (S I I X 594) ' ప్రచండ ' యను సంస్కృత పదములోఁ గూడ చకారము సకారముగా వ్రాయఁ బడినది.

వత్సరము అను పదము నందలి త్స- చ్చ, చ్ఛ అను రూపములతోఁ గనఁ బడుచున్నది.

| | |
|---|---|
| వచ్చరమ్బుళ్ | విజయాదిత్య చోళుని చామలూరు శాస. |
| విజయరాజ్య సంవచ్ఛరంబు | విష్ణువర్ధనుని సాతెపాడు శాసనము. |

త ద.

కొన్ని శాసనములలో దేని యనుటకు బదులుగా తేని యను రూపము కానఁ బడుచున్నది. ద్రావిడ భాషలలోఁ బ్రథమ పురుష సర్వనామ రూపములు అ, ఇ, ఉ, ఎ అను వానికి లింగ చిహ్నములను జేర్చుటచే నేర్పడినవి. అవన్, ఇవన్, ఎవన్ అను పుంలింగ (మహత్) రూపములును, అదు, ఇదు ఎదు అను నపుంసక ద్రూపములును విశ్లేర్పడినవే ఈ రూపము లితర భాషలలో విశ్లే నిల్చి పోఁగా తెలుఁగున వేఱు రూపములను బొందినవి. అవన్, ఇవన్ అను రూప ములు తెలుఁగునఁ బ్రాచీన శాసనములలోఁ గూడఁ గావరావు. ఆ నాఁటికే యివి స్వర పరివర్తనముచే వాన్, వీన్ అను రూపములను బొంది వాణ్డు, వీణ్డు అను శబ్దములుగా నేర్పడినవి. ఇవియే తరువాత వాణ్డు, వీణ్డు (వాఁడు, వీఁడు) అను రూపములను బొందినవి. ఒక్క ప్రశ్నార్థక సర్వనామ విషయమున మాత్రము

ఈ పరిణామము కొంత యాలస్యముగా జరిగినట్లు కనఁ బడుచున్నది. ఏలయన ఎవ్వఁడు, ఎవని అను రూపములు తెలుఁగులో నిప్పటికిని వాడఁ బడుచునే యున్నవి. వేఁడు, వేనిని (ఎవనిని) అను రూపములకు వాడుక చాల తక్కువ ఇట్లే అమహ ద్రూపములైన అదు, ఇదు, ఎదు అనునవి మొదట అది, ఇది ఎది అను రూపములను బొంది వాని, వీని అను మహ ద్రూపముల సామ్యముచే అది–వి = దాని; ఇది–ని = దీని; ఎది–ని = దేని అను రూపములను దాల్చినవి రేనాటి చోళుల శాసనములలో (క్రీ. శ. 7, 8 శతాబ్దులు) తేని, దేని అను రూపములు రెండును గానవచ్చుచున్నవి. ఇవి ఎతు (దు)–ని అను దాని నుండి పరిణమించినట్టివి. ఇందు దేని కంటె తేని ప్రాచీనతరమైన రూపము. ఈ ప్రయోగము అతు, ఎతు అను వానిలోని హల్లు తెలుఁగులోఁ గూడ సరళముగాఁ గాక పరుషముగానే యుచ్చరింపఁ బడుచుండిన కాలమును సూచింపుచున్నది

తేని కట్చు మహాపాతకగు — చిలంకూరు శాస.
తేవి ఒచ్చిన వాన్డు — చోళ మహారాజు ఇందుకూరు శాస
దేనికి వక్రమ్బు వచినవాన్డు — ఉరుటూరు శాస.
తేవి ఒచ్చినవాన్డు — పొట్లదుర్తి మాలెపాడు శాస. క్రీ. శ.

మఱికొన్ని పదములలోఁ గూడ దకారమునకు బదులు తకారము వ్రాయఁబడి యున్నది.

చోళ మహారాజుల తేవుళ్ — నల్లచెఱువుపల్లి శాస.
ఇన్త్రిలోకం బేగె చిన్న — తిప్పసముద్ర శాస. S I I X 621

ఋ, రి

పెక్కు శాసనములలో ఋ అను నచ్చు రి గా వ్రాయఁ బడినది. బహుశః అ రోజుల్లలో దాని కట్టి యుచ్చారణ ముండి యుండవచ్చును. నన్నయ కాలమునఁ గూడ నిట్టి యుచ్చారణ ముండుట చేతనే కాఁబోలు నాతఁడు ఋ, రి అను వానికి యతిమైత్రి పాటించి యుండెను.

ఋత్విజుండని విచారించి పూజించితే — సభా ౨. 11.
గ్రిహంబు — రేమయ్య శాసనము.
అశ్వత్థ వ్రిక్షేన — కుసుమాయుధుని శాస.
స్వస్తిశ్రీ ప్రితివి — విశ్వత్తి శాస,

| | |
|---|---|
| నైరిత్యతః | రణస్థిపూడి శాస |
| క్రిత్య (కృత్య) | Do |
| ప్రిథివి | బాణరాజుల శాసనము. |
| ప్రితివి రాజ్యంబు | ముదివేడు శాస. S I I X 628. |
| గుణాలంక్రిత | చా. భీ. ధర్మవర శాసనము. |
| ఉద్ధ్రితముగ | విరియాల కామసాని గూడూరు శాస. |
| అభిప్రిద్ధి | నిత్యవర్షుని మాలెపాడు శాస. |

తాలవ్యీకరణము:

తాలవ్యములైన ఇ, ఎ అను నచ్చులు పరమైనప్పుడు పదాది యందలి కగలు చకారముగా మాఱుట యిదివఱకు సూచింపఁ బడినది. ప్రాక్చాళుక్య యుగము నందలి పెదవేగి శాసనములోఁ గల చెన్చెఱువు, కమ్పురాన్చెరువు అను వాని యందలి చెన్, చెఱువు పదములును స్కందవర్మ కంతేరు శాసనము నందలి చిన్న (చిన్న పురము) యను పదమును తాలవ్యీకరణము వలన నేర్పడి నవే. ఇవి కెమ్ (ఎఱ్ఱని) కెరె (చెఱువు) కిఱు (చిఱు, చిన్న) అను మూల పదముల నుంచి యేర్పడినవి. కెమ్, కిరు, కెరు మున్నగు కంఠ్య యుక్తములైన రూపము లిప్పటికిని కన్నడాది భాషలలో నిల్చి యున్నవి. తెలుఁగునఁ గూడ కెంపు, కెందమ్మి మున్నగు పదములలో కకారము కానఁబడుచునే యున్నది. తమిళమున కంఠ్యము నిల్చిన రూపములును, తాలవ్యీకరణము జరిగిన పదము లును గూడ నున్నవనుట కీ క్రింది పదము లుదాహరింప వచ్చును.

చెఱు (చెఱువు) చిఱు (చిన్న) చెమ్బొన్ (ఎఱ్ఱని లోహ పాత్ర. ఇది కెమ్ పొన్ నుండి యేర్పడినది).

కిళి (చిలుక) కెణ్మై (స్నేహము - చెలిమి) కుళిర్ (చలి) కెడు, కెట్ట (చెడు, చెట్ట).

కకారముతోఁ గూడిన రూపములు తెలుఁగునఁ జాల తక్కువగను కన్నడమునఁ జాల ఎక్కువగను గానఁ బడును.

తాలవ్యాచ్చు పరమైనప్పుడే యీ తాలవ్యీకరణము జరుగుచుండును. ఇత రాచ్చులు పరమగు నపుడు మూల పదము నందలి కకారమే నిల్చి పోవును. కాల్—కాలు; కోట్టి—కోడి; కాల్—గాలి; కళ్—కల్లు; కణ్—కన్ను. మొద

లైన విందు కుదాహరణములు. తాలవ్యీకరణము తమిళ పదము లందుఁ గూడ గనఁబడుటచే నీ పరిణామ క్రమము చాల ప్రాచీన కాలము నుండియు జరుగు చుండె నని చెప్పవచ్చును.

చాళుక్య యుగము నందలి శాసనములలోఁ గూడ పులగి చెఱువ, వేసెఱు వులు మున్నగు పదములలో చెఱువు పదము కనఁ బడుచున్నది.
చేసిన, చేసిరి అనురూపములు చేయ్మి ధాతువునుండి యేర్పడినవి. ఈ ధాతువు కన్నడమున కెయ్, గెయ్ అని కంర్యాదిగాఁ గానవచ్చుచున్నది. తెలుఁగున సైతము కొన్ని శాసనములలో పణికేసిరి (I I I X 47) కేసినపణి (S I I X 54) బ్రాహ్మమలకు భరన (మ్) బు గెసిరి (కుసుమాయుధుని శాస.) పృథివి రాజ్యం గెయె (య్యె) (వైదుంబ మహారాజ గండత్రిణేత్రుని శాస. E I XXIV పుట 192) మున్నగు కంర్యయుక్త పదములు చూపట్టుచున్నవి. కేలు, కెంపు, కయి మున్నగు కకారాదులగు పదములిప్పటికివి వాడఁబడుచున్నవి. అయినను దెలుఁగునఁ బెక్కు పదములలోఁ దాలవ్యీకరణము జరిగిన దనియే చెప్పవలయును.

చేకొను (కైకొళ్)

చెడు చెఱుచు అనునవి కెడు ధాతువునుండి యేర్పడినవి.

చేను (బుదమనారాయలపాడు శాస.) కన్న. కెయ్, తమిళము చెయ్ (పొలము).

చెవి (కొఱవి శాస.) కన్న. కెళె; తమి. గెళె (స్నేహితుఁడు).
విష్ణువర్ధన మహారాజు బుదమ నారాయలపాడు శాసనములో రెండు చోట్ల జరిగించు అనుటకు బదులు చరిగిన్చువారు అనురూపము వాడఁబడియున్నది. తమిళమున చరుక్కు అనుధాతువు చకారాదిగానే యున్నది.

జయసింహ వల్లభుని విప్పర్ల శాసనమున జయసింఘ వల్లభ మహా రాజు లాకున్ అను రూపము కనఁబడుచున్నది. ఇందు ప్రాకృత ప్రభావము కనవచ్చుచున్నది. సంస్కృతమున వాక్ + హరి = వాగ్ఘరి అనుచోట హకారము ఘకారముగా మాఱుచున్నది. సింహ శబ్దమునకు వికృతిరూపము సింగము. సింహము - సింఘము - సింగము అనునది పరిణామ క్రమమై యుండును,

వికర్షము.

ఉచ్చారణ సౌలభ్యమునకై సంయుక్తాక్షరముల నడుమ నొక యచ్చు చేర్చుట పెక్కు వికృతి శబ్దములలోఁ జూపట్టుచున్నది. చంద్రుఁడు-చందురుఁడు; ద్వారము - దువారము; హర్షము - అరుసము ఇట్టిమార్పును స్వరభక్తి, వికర్షము, లేక విప్రకర్షము అని చెప్పుదురు. ఇంద్ర శబ్దము కొన్నిచోట్ల ఇందర అని యుచ్చరింపఁ బడుటచే నీ మార్పు వేదకాలమునఁ గూడ నుండినట్లు తెలియు చున్నది. స్వరభక్తిచే నిట్టిమార్పులను బొందిన రూపములు చాళుక్య యుగము నందలి శాసనములలో నచ్చటచ్చటఁ గానవచ్చుచున్నవి.

వరుష — నిత్యవర్షుని మాలెపాడు శాస.

ప్రవద్ధమాన (బాణరాజుల శాసనము) పట్టభద్దుండయి (S I I. X 636 వైదుమ్బరాజుల శాసనము. క్రీ. శ. 849) వజ్జిరాజు. మున్నగు చోట్ల వర్ణసమీ కరణముచేఁ గలిగిన మార్పు కానవచ్చుచున్నది.

వర్గయుక్కులకు బదులు వర్గప్రథమ తృతీయాక్షరములను వాడుట పెక్కు శాసనములలో గోచరించుచున్నది. ఇది జనుల యుచ్చారణ భేదము చేతను, శాసన లేఖకుల యజ్ఞత చేతను గలిగి యుండవచ్చును. ఇందుఁ బెక్కు తత్సమ పదములే.

త్రిలోచన ప్రముకాకిల - పెంకయచోడుని దొంగలసాని కనుమ శాస
సంగట్టబోప లబ్ద S I I X 639 చెన్నరాయని పల్లిశాస.
స్తితి పాలపట్టు శాసనము, యుద్ధమల్లుని బెజవాడ శాస.
స్తానంబు S I. I X 99 595.
ప్రతమ రాజ్యంబున - లక్ష్మీపుర శాస.
ప్రితివివల్లభ నిత్యవర్షుని మాలెపాడు శాస.
ఆదిత్య బటరనికి అద్దంకి శాస.
అస్వమేదంబున Do

కొన్నిచోట్లఁ బ్రథమ తృతీయాక్షరములకు బదులు వర్గయుక్కులు వాడఁ బడి యున్నవి.

ఇష్ఠవిషయ కొఱవి శాసనము.
శిలాస్థమ్భంబు కొఱవి శాస.

ఉభయ సన్మతబు - అగ్గప్పరాజు పొదిలి శాస. 968 క్రీ. శ.
దామోధ రేశ్వరము S I I X 41.
వెణ్గ వద్ద S. I I X 612.
గణ్ఢశాల రెండవ అమ్మరాజు మచిలీ పట్టణ శాస.
గుణ్ణ రణస్థిపూఁడి శాస.
కుమ్మఱుక్కణ్ణ - చోడమహారాజు సూర్య గ్రహణకాల శాస. No 595.
అగు నేణ్ఠి.
తొంభనూట నల్వొది ఏడువాడల పాలెపు శాస క్రీ. శ. 1018.

చాళుక్య యుగమునఁ గొన్ని యచ్చుల యుచ్చారణమునఁ గల వైలక్ష ణ్యము నీ క్రింది పదములనుబట్టి గ్రహింప వచ్చును. ఏడువాడల పాలెపు శాసన ములో నల్వొది యనుమాటయు, అగ్గప్పరాజు పొదిలి శాసనమున ఇరువోది నాలుగు అనుమాటయుఁ గానవచ్చు చున్నవి. వలు, పది, ఇరు + పది; అను పదములందలి వకార మాదేశముగా రాఁగా నలువది, ఇరువది యను రూపము లేర్పడును. దంత్యోష్ఠ్యమైన వకారముయొక్క సాహచర్యముచే నిందలి అకార మొకారముగా మాఱినది. అందుచేతనే నలువొది, ఇరువొది యను రూపము లేర్పడినవి.

ఎణ్, ఉమ్, పది అను పదముల కలయికచే నేర్పడిన సమాస మెనుంబది కావలసి యుండఁగా ఎనుంబొది యనురూపముతోఁ గనవచ్చుచున్నది. (జయ సింహవల్లభుని విప్పర్ల శాస.) ఉమ్ అను సముచ్చయార్థక ప్రత్యయమునందలి ఓష్ఠ్యమైన ఉకారముయొక్క సంపర్క ప్రభావముచే పదిలోని అకారము ఒకార ముగా మాఱినది. ఇట్లే పుణ్యకుమార చోళమహారాజు రామేశ్వర స్తంభ శాసన మున విరిపఱితిపులొమ్బున అనురూపమునందు ఓత్వవిశిష్టమైన లకారము కనఁ బడుచున్నది ఈ పదమిప్పుడు పొలమని వాడఁబడుచున్నది. ఈ పదమునకు మేర, గరుసు మున్నగు నుత్తర పదములు పరమైనప్పుడు మువర్ణమునకు లోపము కలుగుచున్నది. పొలమేర, పొలగరుసు అనుపదము లిట్లేర్పడినవే.

కొన్నిచోట్ల అకారము ఎకారముగా నుచ్చరింపఁ బడుచుండెనేమో యను ననుమానమును గలిగించు కొన్ని ప్రయోగములు కనఁబడుచున్నవి.
పెడశిన రెండు వట్టి పదేన్డుంబు (మంగిదొగరాజు లక్ష్మీపుర శాస.)

పడయు ధాతువుయొక్క భూతకాల క్రియాజన్య విశేషణము పడసిన. ఇందలి అకార మెకారముగా మాఱుటచే పెడసిన అను రూప మేర్పడినది. ఇది లేఖకుని ప్రమాదమైనను గావచ్చును కాని ఏడువాడలపాలెపు శాసనమున కాపాడువారు అనుటకు కాపెడువా రను రూపము కనవచ్చుచున్నది. (దీని గాపెడవారు తాంమ్మిణ్లవరు) అందుచే నాకాలమునఁ గొందఱి యుచ్చారణములో అకార మెకారముగా మాఱిన మాండలిక భేదము లుండెనేమో యని తోఁచు చున్నది.

దీర్ఘములు హ్రస్వములు నైన అకారములు తారుమాఱుగా వ్రాయఁ బడుచుండుట పెక్కుచోట్లఁ గానవచ్చుచున్నది.

ఆకారమునకు బదులు అకారము.

వనిద ధర్మువు - వాని దధర్మువు.

ఇచ్చువరు - ఇచ్చువారు.

వరి కొడుకు - వారి కొడుకు (కపిలేశ్వరపుర శాస 740 A. D )

ఆదిత్యవరమ్బునాణ్డు - ఆదిత్యవారమ్బునాణ్డు.

వెంకయ చోళ మహారాజు - వెంకయ చోళ మహారాజు.

సత్యదితున్డు - సత్యాదిత్యున్డు.

అకారమునకు బదులు ఆకారము.

భటారికాకు - భటారికకు.

వెంకయాచోణ్ణ - వెంకయచోణ్ణ.

పడుమాటి కోట - పడుమటి కోట.

తాఱు తోంటలాయు - తాఱు తోంటలయు.

నల్వారాయు తోట - నల్వరయు తోట.

మహారాజులాకున్ - మహారాజులకున్ విప్పర్లశాస.

వళ్ళాప్దియది - వల్పది.

ధర్మాపురమ్మున - ధర్మవరమ్మున.

పేవురాను - పేవురను. అగస్త్యేశ్వరాలయ శాసనము. చిలంకూరు.

ఇతరాచ్చుల వ్యత్యస్త ప్రయోగము.

దెని ఇచ్చువాణ్డు - దేని ఇచ్చువాణ్డు.

ఎఱ్ఱు అగునేటి - ఏఱ్ఱు అగునేటి
విని - వీవి అద్దంకి శాస.

ఱ కారము.

సంస్కృతా ద్యార్య భాష లందుఁ గానరాక ద్రావిడ భాషలకు మాత్రము విలక్షణమైన ఱ యను వింత యక్కరము ప్రాక్చాళుక్య యుగమునందలి కొన్ని శాసనములలోఁ గానవచ్చుచున్న దనియు, దాని యునికి యప్పటికే ద్రావిడ భాషలు దేశమునఁ బరనలేఖన వ్యవహారమునం దుండె నని ఋజువు చేయుచున్న దనియు నిదివఱకుఁ జెప్పఁబడినది ఈ యక్షరము నన్నయకుఁ బూర్వమునందలి చాళుక్య చోళరాజుల శాసనములలోఁ గూడఁ బలుచోట్లఁ గాన వచ్చుచున్నది. నన్నయ తరువాత వ్రాయఁబడిన కొన్ని సంస్కృతభాషా శాసనములలోని దేశీయశబ్దములలో సైత మీయక్కరము పొడగట్టుచునే యున్నది. క్రీ. శ. 1127 లోని విక్రమ చోళుని చేబ్రోలుశాసనములో నాగరలిపి మధ్య చోడ శబ్దమునందలి రెండవయక్షరము ఱ అను రూపముతోనే వ్రాయఁ బడి యున్నది. మఱియు దానవిషయమును దెలుపు వాక్యము లందలి భాష తెలుఁ గైనను అవి నాగరలిపిలోనే వ్రాయఁబడినవి

(श्रीमान् महामण्डलेश्वर नबय यिच्चिन गो ఱ यलु)
ఇందు గోఱ య లనుపదమున ఱ కారము కనఁబడుచున్నది. ఇట్లే క్రీ శ. 12వ శతాబ్ది యారంభమునందలి రాజరాజ చోడగంగు టేకిశాసనమున విజయవాడలోని తెలిక కులమునందలి భిన్నశాఖలను దెలుపు సందర్భమున నీ వర్ణము వ్రాయఁబడి యున్నది.[1] రాజరాజనరేంద్రుని తండ్రియైన విమలాదిత్యుని రణస్థిపూఁడి శాస నమున (1011) పాఱువటినామ గ్రామేణ పఱమటి కట్ట, కఱ పట్టి, ఱల్ల సీమైవ సీమా, తాంకఱ పొలము మున్నగుపదములలోఁ గూడ నీ యక్షర మున్నది. కాని నన్నయ భారతమునఁ గాని తరువాతి గ్రంథము లందుఁ గాని యీ యక్షరము కానవచ్చుట లేదు. నన్నయ యాంధ్ర భాషకుఁ గలిగించిన సంస్కారములలో నీ యక్షరమును బరిహరించుట యొకటని చెప్పవచ్చును. అట్లాతఁడు దానిని బరిహరించినను అతని తరువాతఁ గూడ నది కొంతకాలము

1. విజయవాటాయాః యే వాస్తవ్యకుటుంబినః యే చ వేలమనూఱలు నఱి యూఱలు కుముడాల్లలు మఱినూఱలు అడ్డనూఱలు ఇత్యాదికుల సహస్రభేద ప్రసిద్ధాః తేలికకుల లబ్ధజన్మానః

విరళముగాఁ బ్రయోగింపఁ బడుచుఁ గ్రమముగా నదృశ్యమై పోయిన దనుటకు క్రీ. శ. 12వ శతాబ్ది యందలి పై శాసనములలో నది కానవచ్చుటయే తార్కాణము. నన్నయ భారతమందును, బహుశః అతని కాలపు శిష్టుల భాషా వాఙ్మయములందును బ్రమాణముగా గ్రహింపఁబడని హేతువున నది యాంధ్ర వర్ణ సమామ్నాయమునఁ జేర్పఁబడి యుండలేదు. ఇది తరువాతి భాషలో డ, శ, ర, ఱ, య అను నక్షరములుగా మాఱినట్లు తెలియుచున్నది.

తమిళ మలయాళ భాషలలో నిప్పటికి నీ యక్షరము వ్యవహార మందున్నది. కాని యందుఁ గూడ స్థిరమైన యుచ్చారణములేక వేఱువేఱు ప్రదేశములందు వేఱు వేఱు ధ్వనులతో నుచ్చరింపఁ బడుచున్నది. కన్నడమున నిది క్రీ. శ. 13వ శతాబ్ది వఱకును వ్యవహారముననుండి తరువాతఁ దెలుఁగున వలెనే రూపాంతరమును బొంది యదృశ్యమై పోయినది. కన్నడ వైయాకరణులు దానిని శకటరేఫము వలెనే ప్రత్యేక వర్ణముగాఁ బాటించిరి. కాని యప్పటికే యది రూపాంతరమును బొంద నారంభించుటచేఁ గాఁబోలు కేశిరాజు శబ్దమణి దర్పణమునఁ దన నాఁటి కా యక్షరములతోఁ గూడిన పదములన్నియు సేకరించి యొక పట్టిక నిచ్చి యున్నాఁడు. అది తరువాత నా భాషలో శకారముగా మార్పునొందినది.

నన్నయకుఁ బూర్వము వ్రాయఁబడిన కావ్యము లేవియు లభ్యములు కాక పోవుటచే నందీ ఌ కారము వాడఁబడెనో లేదో చెప్పుట కవకాశములేదు. కాని యప్పటి తెలుఁగు శాసనములలోను, సంస్కృత శాసనములలో గ్రామ నామము లను పరిహద్దులను దెలుపు సందర్భము లందును బలు చోట్లఁ గానవచ్చు చుండు టచే నది యప్పుడు జన వ్యవహారమున నుండెనని చెప్పుటకు మాత్రము సందే హింపఁ బనిలేదు. ఈ యక్షరముతోఁ గూడిన శాసనములందలి పదములు కొన్ని యిచ్చట నొసంగఁ బడుచున్నవి.

చోఌ మహారాజులు ఉరుటూరు శాస ; ఇందుకూరు శాస.

రామేశ్వర స్తంభ శాస, చిలంకూరు శాస.

ఇందలి ఌ కారము తెలుఁగున చోడ, చోళ అని డ శ కారముల రూపమునొందినది. తమిళ కన్నడములలో నీ పదము ఌ కారముతోనే యున్నది.

ఇప్పుఌోలి అణపోతులు — సత్యాదిత్యుని మాలెపాడు శాస.

"ఇందలి పుఌోలు శబ్దము పు వర్ణమునందలి ఉకారము లోపించుటచే ప్ఌోలు, ప్రోలు

అనురూపములను బొందినది. తెలుఁగు నందలి క్రావడికి ఴ కార శకట రేఫములే మూలరూపము లని చెప్పవచ్చును. కాల్డ్వెల్ పండితుఁడు తమిళము నందలి కీఴ్న్ద మిఱుంగు శబ్దములు తెలుఁగున క్రింద మ్రింగు అని మాఱుటచే నీ ధ్వని తెలుఁగులోఁ గూడ నుండవలయు ననియు, నది తమిళములో కీఴ్ అయి నట్లుగాఁ గాల క్రమమునఁ దేల్చి పలుకఁ బడుటచే నీ భాషలో జాఱిపోయి యుండుననియుఁ" జెల్పి యున్నాఁడు. ప్రాచీన తమిళము నందు వలెనే ప్రాచీన తెలుఁగునందుఁ గూడ నీ వర్ణముతోఁ గూడిన పదము లనేకము లుండినట్లు శాసనములు దృష్టాంతముగా నున్నవి. కాల్డ్వెల్‌గారు చెప్పిన ట్లిది తెలుఁగునఁ గేవలము జాఱిపోయినది కాక తొలుత రేఫముగా మాఱి తరువాతఁ బదాద్యక్షరము నందలి అచ్చు లోపించుటచే దానితో సంయోగమును బొంది క్రావడిగా మాఱిన దని చెప్పవచ్చును

కీఴ్న్ద - కీర్న్ద - క్రింద.

విఴుంగు - మిఴుంగు - మిరుంగు - మ్రింగు.

ఇట్లిది క్రావడిగా మాఱిన శబ్దములు తెలుఁగున వింకను బెక్కు గలవు.

పొఴుదు - ప్రొద్దు.

ఉఴుకు - ఱ్రుంగు.

ము ఱంగు - మ్రోగు.

ద్రావిడ భాషలలోఁ బదాదియందు సంయుక్తాక్షరము నుచ్చరించు సంప్రదాయము లేమిచేఁ గొంతకాలమునకు మొదటి సంయుక్తాక్షరము నందలి క్రావడి విడువఁ బడినది. ఈ విధముగనే మింగు, కింద, పొద్దు మొదలైన రూపము లేర్పడినవి. దీనినిబట్టి ఴ కారము డళ శకట రేఫములుగా మాఱుటయేకాక కొన్ని చోట్ల లోపించుటకూడ జరుగు చుండెనవి చెప్పవచ్చును.

ఒచ్చిన వాఴ్టు : ఇందుకూరి శాసనము.

ఴచ్చు ధాతువు నన్నయకుఁ బూర్వ మందలి శాసనములలో వివిధ రూపములతోఁ గనవచ్చుచున్నది.

ఴచ్చు వాఴ్టు — దిమ్మగుడి శాసనము.

ఴమవరు కళరేవి — పంగి దొగరాజు లక్ష్మీపుర శాస. క్రీ. శ. 9.

ఴచ్చిన పాపంబు గొణ్ణువాఴ్టు - పెద్ద ముడియం శాస. వికిరాజు శాస.

దచ్చిన వానికి—నెల్లూరు శాసనములు Vol. II. పుట 676
ఒట్టు అస్పి యుద్ధ మల్లుని బెజవాడ శాస.
లింగం బఱిసిన Do
అఱిపుట వాపంబు (వాబు) గాన క్రీ. శ. 890.

ఈ రూపము లన్నిటిలో అఱిసిన, అఱిపుట అనునవి మిక్కిలి ప్రాచీన ముల వలెఁ గానఁబడుచున్నవి. తమిళ కన్నడము లందు అఱి అను ధాతు వున్నది. తమిళమున దానిని సకర్మకముగను అకర్మకముగను గూడ వాడెదరు. Winslow's Tamil English Dictionary లో దీనికి to blight blast, ruin, injure damage, annihilate destroy demolish, exterminate, efface అను నర్థము లొసంగఁ బడినవి కన్నడమున కేశిరాజీ ధాతువునకు " వినాశే " అను నర్థము చెప్పెను. కిటెల్ నిఘంటువు నందీ యర్థమునందే అఱిసు అను ధాతువు కూడఁ గనఁబడుచున్నది. బహుశః ఇది అఱి ధాతువు యొక్క ప్రేరణార్థకమై యుండును. అఱిధాతువునకు యువర్ణము చేరఁగాఁ దెలుఁగున అఱియు అను ధాతు వేర్పడి దానినుండి అఱిసిన అను చేదర్థక రూపము కలిగియుండును. లేదా కన్న డము నందలి అఱిసు ధాతువే తెలుఁగునఁ గూడ నుండెననియు, దానినుండి అఱి సిన అను చేదర్థిక మేర్పడె ననియుఁ జెప్పవచ్చును అఱిసిన, అఱిసి అనునవి వర్ణ వ్యత్యయముచే ఒస్సిన, అస్పి అను రూపములను బొందును. వీనిని బట్టి తరువాత ఒయ్యు అను ధాతు వేర్పడుటయు, ఒ కారము తెలుఁగున దకార ముగా మాఱును గావున నది దయ్యు అను రూపమును బొందుటయు జరిగి యుండును. తెలుఁగున నిప్పుడు దయ్యు అకర్మకమే కాని సకర్మకముకాదు. దీనికిఁ గృశించు, బలహీనమగు అను నర్థములు శబ్ద రత్నాకరములో నొసంగఁ బడినవి.

తెలుఁగున ధాతువులకుఁ ప్రేరణార్థమున ఇంచు, చు, పు అను ప్రత్యయ ములు చేర్పఁబడు చుండును. వీనిలో చు పు వర్ణములు ప్రాచీన తరములు. తరువాతఁ గ్రమముగా ఇంచు అను ప్రత్యయము కూడఁ జేర్పఁబడుచు వచ్చెను. ఇది ఈ ధాతువు నుండి యేర్పడి నట్టిది. ప్రాచీన శాసనము లలోఁ గొన్ని చోట్ల నిది ఇచ్చు అనురూపముతోఁ గూడఁ గానఁబడు చున్నది. (పరి యిచ్చువారు (S I I V 1011. క్రీ. శ. 1063 ) అఱి ధాతువునకు ఇచ్చు

అను ప్రత్యయము చేరఁగా అటిచ్చు అను రూపమును, పు అను ప్రత్యయము చేరఁగా అటిపు అనురూపమును ఏర్పడును. అటిపు అను దానికి భావార్థక రూపము అటిపుట. అటిచ్చు అనునది వర్ణ వ్యత్యయముచే టచ్చు, దచ్చు అను రూపములను బొందును. దచ్చు అనునది దయ్యు యొక్క ప్రేరణార్థక రూపమని యైనఁ జెప్ప వచ్చును. ఈ విధముగా అటి సిన, అటి పుట, టస్సి, దచ్చిన అను రూపము లన్నియు అటి ధాతువు నుండియే యేర్పడి నట్లు కనఁబడుచున్నది. యుద్ధమల్లుని బెజవాడ శాసనము కాలమును బట్టి అతి ప్రాచీనమైనది కాక పోయినను అటి ధాతువు యొక్క ప్రాచీన రూపముతోఁ గూడియుండుటచే దాని స్వరూపమును నిర్ణయించుటకుఁ జాలఁ దోడ్పడు చున్నది.

తెలుఁగున వశించు అను పర్థమున అఱు అను ధాతువొకటున్నది. ఇది సాధారణముగా బలము, ఉక్కు, క్రచ్చు మున్నగు విశేష్యముల మీఁద క్త్వార్థక రూపముతోఁ గనవచ్చుచుండును. (బలమఱి, ఉక్కఱి, క్రచ్చఱి) ఇది తమిళ కన్నడము లందలి అటి ధాతువున కర్థమునందును ఆకృతియందును గూడ మిక్కిలి సన్నిహితముగా నున్నది. అటి యందలి ట కారమిందు శకటరేఫ ముగా మాఱినది.

వింత యక్షరమైన ట కారమును బదాదిని బలుకుట క్లేశకరమగుటచేఁ గాఁబోలు టచ్చు ధాతువు కాలక్రమమున వచ్చు అనురూపమును బొందిన దనియు, నిందలి శకటరేఫమే సాధురేఫముగాఁ గూడఁ గనఁబడుచున్న దనియు (వచ్చిన - జయసింహ వల్లభుని విప్పర్లశాసనము) శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారు తెలిపియున్నారు. (Journal S. V. O Inst XII - 1 - 35) దీనిని బట్టి వచ్చు ధాతువుకూడ అటిధాతువు నుండి యేర్పడినదే యని తెల్లమగుచున్నది.[1]

---

1. పై ధాతువులకే కాక తెలుఁగునందలి మఱికొన్ని యితర ధాతువులకుఁ గూడ అటి ధాతువే మూలమై యుండునని యూహించుచు ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం గారిట్లు తెలిపి యున్నారు.

"తెలుఁగు నందలి అడఁగు ధాతువుకూడ అటి నుండి గు వర్ణము చేర్చుటచే నేర్పడి యుండును అడఁచు దీని ప్రేరణార్థక రూపము. అడఁగుట (స్వార్థము) అడఁచుట అపపుట (ప్రేరణార్థకము) అనునవి పైవాని నుండి యేర్పడిన

అటి యను ధాతువు వంటిదే క్ట్రొచ్చు అను మఱియొక ధాతువు కాన వచ్చుచున్నది.

క్ట్రొచ్చిన వాస్తు - పెద్దముడియం శివాలయ శాసనము.
క్రొచ్చిన వణ్డు - బికిరాజు శాసనము.
క్ట్రొచె - తుపాకులపల్లి శాసనము

తమిళ మళయాళ కన్నడము లందు కుటి యను ధాతు వున్నది. కేశిరాజు దీనికి ఖననే అని యర్థము వ్రాసియున్నాఁడు. కు టి - కుటిట్టు - కు టిచ్చు> కొటి చ్చు > క్ట్రొచ్చు - అను పరిణామము జరిగి కుటి నుండి క్ట్రొచ్చు అనుధాతు వేర్పడినది. ఇందలి ట కారము కాలక్రమమున ముందు శకటరేఫము

---

భావార్థక రూపములు. అటి మీఁద యు చేరఁగా నేర్పడు అటి యు అను నకర్మక రూపము నేఁడు వాడుకలో లేదు. శాసనములందైనను అ టి సిన వంటి రూపముల నుండి యూహ్యాముగానే యున్నది అటి యనునది అడి యను రూపమునఁ దెలుఁగులోఁ బ్రవేశించినట్లు కనఁబడును. 'అడియాన కొలువు' అను నప్పుడు వశించిన యాశ, వ్యర్థమైన యాశ అను నర్థము భాసించుచున్నది అనలు అటి ధాతువు యొక్క ప్రాథమిక రూపము టి మాత్రముగా నుండెననియు వావర్ణ మును బదాది నుచ్చరించుట కష్టమగుటచే రాజు - అరసు రక్తము-ఇరత్తం అను వానియందువలెఁ దత్పూర్వ మొక అకారమును తమిళులు చేర్చుకొని యుందురనియుఁ దలంపవచ్చును. అప్పుడు తెలుఁగునందలి డాయు డయ్యు అను రూపములు వర్ణవ్యత్యయముచే నేర్పడినవి కాక మూల రూపమునుండి సూటి గా నేర్పడిన యత్యంత సన్నిహిత రూపములుగా భాసించును. డాయు, డయ్యు అనువానిలో నేది మొదలింటి రూపమను విషయమున భేదాభిప్రాయము లుండ వచ్చును పైని సూచింపఁ బడినట్లు ట లేక టా అనునదే మూల ద్రావిడ రూప మైనచో దానిమీఁద యువర్ణాగమముచే డాయు అనునది ముందుగా నేర్పడి అదిదీర్ఘము హ్రస్వమగుటచే రెండవ వర్ణము ద్విత్వము నొంది డయ్యు అను రూపమేర్పడుట క్రమ పరిణామమునకుఁ దగియుండును. మొట్ట మొదటనే ద్విత్వ యువర్ణాంత ధాతువేర్పడి యందలి యొక యువర్ణము లోపింపఁగాఁ దత్పరిహారముగ డకారమునందలి అకారము దీర్ఘమయ్యెనని (compensatory lengthening) చెప్పుట సాధ్యమైనను అంత యుక్తి యుక్తముగాఁ దోఁపదు ఇట్టి డా ధాతుమూల రూపము మీఁద గువర్ణ మాగమముకాఁగా 'నిలీనమగు'వను నర్థముగల డాగు, (దాగు, దాచు) అను ధాతువు కూడ నేర్పడినట్లు తోఁచును. దాగుట యందు నశించునట్లగుట అదృశ్యమగుట అను భావ మిమిడి యున్నది.

గను దరువాత క్రావడిగను మాఱుటచే క్ఱౌచ్చు, క్రౌచ్చు అనురూపములు కలిగి నవి. శ్వాసములు నాదములుగా మాఱుచుండుటకు కడచు - గడచు, కడప - గడప; చెముడు - జెముడు; బ్రతుకు - బ్రదుకు; కాల్ - గాలి, మున్నగు తార్కాణము లనేకము లున్నవి. ఈ పద్ధతిని బట్టి (క్ఱౌచ్చు) క్రౌచ్చు అను రూపమే గ్రౌచ్చు అని గకారాదిగా మాఱుటలో వింతలేదు. దీనికిఁ ద్రవ్వి గొయ్యి తీసి యని యర్థము తిక్కన గ్రౌచ్చి పాతెదన్ అనియు పోతన గ్రౌచ్చి కోరాడి త్రవ్వి రికుతలమెల్ల (భాగ. ౬ స్కంధ) అనియుఁ బ్రయోగించి

---

వ్రయ్యు, వ్రచ్చు ధాతువులు మూలధాతువైన ఊా (అఃరి) నుండి యేర్పడి నవి కావచ్చును. వ్యస్తముగ ఉను పలుకుట కష్టమగుటచేఁ దమిళులు 'అను సహాయముగా గ్రహించినట్లే తెలుఁగు వారంతస్థ వర్ణమై లఘూచ్చారణముగల వ కారమును సహాయముగ గ్రహించి యుందురు అప్పుడిది వఉ - వ్ర - వ్రయ్యు అనునట్లుగా మాఱియుండును సంయుక్తవర్ణమును ముఖ్యముగ రేఫసంయుక్త వర్ణమును ఉచ్చరింపఁ గల్గుట తెలుఁగు భాషప్రత్యేకత దీనినుండి వ్రక్క వక్క వ్రక్కలగు మొదలగు రూపములు పుట్టెను. గీఱుట అను నర్థముగల ఱుక్కు అను ధాతువుకూడ నీ కుదుటనుండియే పుట్టియుండవచ్చును ఇది సాధు రేఫాగి కూడ నయి యుండనగును. అప్పుడు రక్కు ధాతువు నుండి రక్కెస రక్కసి, రాకాసి అను రూపములు కలుగవచ్చును ఆ పదములను రాక్షస శబ్ద భవము లనియే చెప్ప నక్కఱలేదు.

“ఊా (డా) అను అటీ ధాతు పూర్వ రూపము నుండి డాయు డయ్యు వలెనే వ్రయ్యు వ్రాయు అనురూపములు కూడ నుండెనా యని శంకింప వచ్చును. కాని ఈయర్థమున వ్రాయు ధాతువునకు వాడుక కనిపించుటలేదు దీని వంటిదే యగు రాయు ధాతువొకటున్నది. ఇది దేశ్యము, అకర్మకము అని శబ్దరత్నాకరము చెప్పుచున్నది. ఇప్పటి వ్యవహారమున నిది సకర్మకముగా గూడఁ గన్పించుచున్నది. (ఉదా - చేతిని నేలకు రాయుము) లేఖనార్థమున వ్రాయుధాతువు ప్రచారమైయుండుటచే నర్థసందేహమును నివర్తించుటకై మొదటి వ్రాయు ధాతువులోని వకారము లోపింపఁగా మిగిలిన రాయు అను రూపము వాడుకలోనికి వచ్చియుండును. అటీ ధాతువుకు మూలార్థమైన నశించుటయను భావము తజ్జన్యములైన యితర ధాతువులలోఁ బల్పఁబడుచుఁ దత్సంబంధమైన యితరార్థము నిచ్చుచుండుటలో వింతలేదు రాసి అంపానఁ బెట్టు వంటి ప్రయోగములలో సూక్ష్మముగ ఖండించి నశింపఁ జేయుట అనుభావము తోఁచు చునే యున్నది ”

యున్నారు. ఈ ధాతువు నుండియే గ్రొయ్యి అను నామవాచక రూప మేర్పడినది సంయుక్తాక్షరములను బదాది నుచ్చరించు సంప్రదాయము ద్రావిడ భాషలకు విరుద్ధమగుటచే గ్రొయ్యియందలి క్రావడి జాఱి గొయ్యి, గోయి యను రూపము లేర్పడినవి ఈ విధముగాఁ గొన్ని తెలుఁగు పదముల (వ్రేలు, ప్రాఁత, మ్రోగు ప్రోలు, క్రోవి, త్రిప్పు) మొదట సంయుక్తాక్షరములలో ద్వితీయాంగముగాఁ గనఁబడు రకారము పదాదినున్న రెండక్షరములలోని స్వరముల వ్యత్యయముచే నేర్పడినదే కాని సహజము కాదనియు, నిది మూలపదము నందలి అకారము పొందిన పరిణామ రూప మనియు గ్రహింపవచ్చును

వేంగి నాణ్ణిం గొఅల్చియ — అద్దంకి శాసనము.

ఇందలి కొఅల్చి యను క్త్వార్థక రూపము కూడ కుఱి ధాతువు నుండియే యేర్పడి యుండవచ్చును. అప్పుడు వేంగినాటిని ద్రవ్వి నాశనము చేసి యని పైవాక్యమున కర్థము కుదురును కొఅల్చు అనునది పై క్రొచ్చు (గ్రొచ్చు) ధాతువులకుఁ బూర్వ రూపమై యుండును. వర్ణ సమీకరణముచే కొఅల్చు, కొఅచ్చు అగును. తరువాత వర్ణప్లుతి వలన క్ట్రొచ్చు, క్రొచ్చు అనియు నాదత్వముచే గ్రొచ్చు అనియు రూపము లేర్పడుట సహజమే.

కన్నడమున కుళ్ఱి = కలఁత (Confusion perplexity) అను పదమున్నది. తమిళమున కులై, కన్నడమున కొళె (to become putrid rotten) తుళులో కురె అను పదము లున్నవి. వీనికిని గొఅల్చు ధాతువునకును సంబంధ ముండవచ్చును. దీని నుండి క్రుళ్లు ధాతువు వచ్చిన దనియు గొఅల్చి యనఁగా క్రుళ్ళఁ జేసి, జీర్ణమైన దానినిగాఁ జేసి, శక్తిలేని దానినిగాఁ జేసి (స్వాధీన పఱుచుకొని) అని యర్థము చెప్పవచ్చుననియు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు ద్రావిడ అకారమను వ్యాసమున సూచించి యున్నారు.[1]

---

1 Journal of S V O Institute XII Page 37

కొఅలు అను ధాతువునకు ఉండు, ప్రకాశించు అను నర్థములు కలవు (శ. ర. 202) కొఅకొఅలాడు అనఁగాఁ గోపగించు అను నర్థమును కొఅకంచు, కొఅకచ్చు అనఁగాఁ గొఅవి అను నర్థమును గనఁబడుచున్నవి కొఅలు అనఁగా బూర్వము మండు అను అర్థముండె ననియుఁ గొఅల్చు దాని ప్రేరణార్థక రూప మనియు నూహించినచో దానికి దహించుట యను నర్థము చెప్ప వచ్చును. క్రమముగా దహించుట యను నర్థము మాఱి భారత కాలమునకు దానికి వెలుఁగుట, ప్రకాశించుట అను నర్థము లేర్పడి యుండును

ఎఱువేల ఏఱుచున్ది—పత్యాదిత్యుని మాలెపాడు శాస.
పదియేఁబగునేణ్డు—చాళుక్య భీముని యింద్రకీల పర్వత శాస.
ఆం. సా. ప. ప. VII 4 పుట 227—231.

ఏఱు అను పదమునందలి ఱ కారము తరువాత దకారముగా మాఱినది. (తెలుఁగు - ఏడు). తమిళ తుళు కన్నడములందు ఏఱు అను రూపమే నిల్చి యున్నది. (Dr Cog 58).

తాటి తోంటళాయు - తాడి తోఁటలయు
తాటి శర్మణః పుత్రాయ - తాడి శర్మణః.
ఈఱ్ల నల్వ్వరాయుతోఱ (నెల్లూరు జిల్లా శాస).
అలరాము విభుతోఱ - చాళుక్య భీముని ధర్మవర శాప.
ొఱంచి తోటి కయ్యంబున - వైదుంబ గండ త్రినేత్రుని
శాస. E I XXIV P 192.

తోఱ అనునది తెలుఁగుననున్న సహార్థకమైన తోడ అను తృతీయా విభక్తి ప్రత్యయమునకుఁ బూర్వ రూపము వలెఁ గానవచ్చుచున్నది. తమిళ భాషలోఁ దృతీయార్థమున ఒడు అను ప్రత్యయమున్నది. ఇది తోఱ, తోడ అనువానికి రూపాంతరమై యుండవచ్చును తమిళ కన్నడములందు తొడు అను ధాతు వున్నది.

త. తొడు to touch, to come into contact with to take hold of, join to an arrow

కన్న. తుడు = to join ; తొడు = to put on to wear as shoes

తెలు. తొడు. touch, to put on as clothes or shoes

తొడి. పూసి. కట్టి. తిక్కన.

తొడుగు = to fix an arrow

స్పర్శార్థకమైన యీ తొడు ధాతువు నుండియే సహార్థకమైన తోడ ప్రత్యయ మేర్పడి యుండును. నొఱ్ఱంచి తోట్టి కయ్యంబున అను వాక్యము తోడకుఁగల స్పర్శార్థమును మఱింత స్పష్టము చేయుచున్నది. ఇరువురు వ్యక్తులు గాని

ఇరుపక్షములు గాని కలిసినప్పుడే — స్పృశించి నప్పుడే — కయ్యము సంభవించును. సంస్కృతము నందలి యుధ్ అను ధాతు వీ యర్థమునందే యేర్పడినదని శబ్దశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. యు = to join, to unite to detach, to separate (మిశ్రణా మిశ్రణే) ధా to seize, to take hold of, to wear, to put on అను రెండు ధాతువుల కలయికచే యుధ్ అను ధాతు వేర్పడినదని వారిమతము స్పర్శార్థమైన తోడు అను విశేష్యము చివర ఇ చేర్పఁగానే అది విశేషణమగు చున్నది. (మఱ్ఱి తోడి తాటి యొద్ద — నందంపూఁడి శాస. చిన్త తోడి పుట్టయ సీమా. మందరాత్రమ శాస. కొఱపుట్ట తోడి గుంటయ సీమా — మందరాత్రమ శాస.) ప్రాథమికమైన స్పర్శార్థము క్రమ క్రమముగా విస్మృతమై పోవుటచే (తోడు + అన్) తోడన్ అనునది విభక్తి ప్రత్యయముగా మాఱి నది. కొన్నిచోట్ల తోడ అను దానియందలి రెండవ యక్షరము లోపించుటయు తో అను నక్షర మొక్కటే తృతీయార్థమును సూచించుటయుఁ గనఁబడు చున్నది. ఇట్లున్నప్పుడు దీని మూల రూపమును గనుఁగొనుట మఱియుఁ గష్ట సాధ్యముగా నుండును. తో అను దానికిని తోడు అను దానికిని రూపమునఁ జాల వ్యత్యాసము గోచరించుటయే యందుకుఁ గారణము.

అహదనకర శాసనమున కొన్తుకళ్ కొణ్డుకళ్, కొన్థుకళ్ అను రూపములు కనఁబడుచున్నవి. ఇవే తరువాత కొడుకులను రూపమును బొందినవి. తమిళమున కుట్టికన్ అను పదమునకు యువకుఁడు, అందగాఁడు అను నర్థము లున్నవి. కన్నడమున కొద యనఁగా యౌవనము; తారుణ్యము అను నర్థము లున్నవి. ఇవి కుఱ్ఱ యను మూల ధాతువునుండి యేర్పడినవి. తెలుఁగు నందలి కొదమ, కోడలు, కోడె మొదలైన వన్నియు దీనినుండియే యేర్పడియుండును. కొణ్డుకళు అను దాని యందలి కళు బహువచన ప్రత్యయము. ఇందలి క అను నక్షర మనుచిత విభాగముచే మూల శబ్దముతోఁ జేరఁగా కొడుకను నేకవచన రూప మేర్పడు చున్నది. తెలుఁగు నందలి చిలుక, ఎలుక, ఏనుఁగు, పీనుఁగు, ప్రూకు, రేగు మొదలగు క గ వర్ణాంత శబ్దము లిట్లనుచిత విభాగముచే నేర్పడి నట్టివే.

వేంకయ చోడుని దొంగలసాని కనుమ శాసనమున చోళ మహారాజా. పుసియిల్ల దాష్మ అను రూపములు కనఁబడుచున్నవి. ఇందలిష్మ అనునది ఆకా

రమునకు బదులు వ్రాయఁబడినదే. చోడ్డ—చోఱ—చోడ—చోళ అనునవి సమాన రూపములే. తాల్మి శబ్దము తెలుఁగున శాల్మియైనదని యనుకొనవచ్చును పుసియిల్ల దాష్మ యను దానికి మోసము లేని, తక్కువ కాని, తాల్మి కలవాఁడని యర్థము చెప్పవచ్చును. తెలుఁగున సహించు, నిదానించు అను నర్థములు గల తాళు ధాతు వున్నది. ఇది తమిళ కన్నడము లందుఁ గల తాళ్ అను ధాతువు నుండి యేర్పడి యుండును. ఈ తాళ్ ధాతువునకు to fall low, to stop to stay అను నర్థము లున్నవి. దీని నుండి తాళ్మె, తాల్మె శబ్దములును అందుండి తాల్మి అను శబ్దమును నేర్పడి యుండును. తాళు యొక్క కృదంత రూపమే తాల్మి. కన్నడమున తాళిమె, తాళుమె, తాళ్మె అను శబ్దములకు కిటెల్ నిఘంటువున సహనార్థ మొసంగఁబడి యున్నది. ఇవి కూడ తాళ్ ధాతువు నుండి యేర్పడినవే. ఇందలి ళకారము కన్నడమున ళకారముగను, తెలుఁగున ల. ళ కారములుగను మాఱినదని చెప్పవచ్చును.

మేళ్ళాంబా విజయాదిత్య వందనః (మేడాంబ) రెండవ చాళుక్య భీముని మచిలీపట్టణ శాసనము E. I. V P 134

| | |
|---|---|
| నొలంబి | వైదుంబ గండ త్రినేత్రుని శాస. నొళంబి |
| పలకి విషయే (ప్రక్క) | మొదటి విష్ణువర్ధనుని తిమ్మాపుర శాస. E I. IX P 317 |
| దళినాండు (దఱినాడు) | చాళుక్య భీముని ధర్మవర శాస. |
| పెద్ద గాఱిడిపఱ్ఱు | రెండవ అమ్మరాజు మచిలీపట్టణ శాస. |
| కోదగాటి పఱ్ఱియు | రెండవ అమ్మరాజు మచిలీపట్టణము శాస. |
| కలపఱ్ఱియు | రణస్థిపూడి శాస E I VI P 347. |
| పాఱువ ల నామ గ్రామేణ. | Do |
| తాంక ల పొలము | Do |
| ఉల్లసీమైవ సీమా | Do. |

క్రీ. శ. 740 ప్రాంతమునందలి కపిలేశ్వరపుర శాసనమున శక వైశ్రవనుకొడుకు ట్ప్రోలయ యనురూపమున్నది. ప్ప్రోలయ, ప్రోలయ యనుటకు బదులుగా నిందు ట్ప్రోలయ యని పొరపాటున వ్రాయఁబడినట్లు తోఁచుచున్నది. ఱ కారము వ్రావడికిఁ బూర్వరూప మగుట యిదివఱకే వివరింపఁబడినది.

పై యుదాహరణములను బట్టి ఱ కారము తెలుఁగున నొకప్పుడు దకారముగను, ఒకప్పుడు శకారముగను, ఒకప్పుడు శకట రేఫముగను, ఒకప్పుడు రేఫము లేక క్రావడిగాను మాఱుచున్నట్లు తెలియుచున్నది. ఇది కొన్ని పదములలో ణకారముగా మాఱుటయుఁ గలదని కాల్డ్వెల్ పండితుఁడీ యుదాహరణముల నిచ్చియున్నాఁడు.

ముఱుగు (sink) ముణుగు, మునుగు (ములుగు)
కుఱ (hoe) కన్న.కుణి (గ్రొచ్చుధాతు విందుండియే యేర్పడి యుండవచ్చును. గ్రొయ్యి పడునట్లుచేయు, త్రవ్వు అను నర్థము కూడ దీనికి సంబంధించినదే.)

ఈ క్రింది యుదాహరణములను బట్టి చూడ ఱకారము కొన్నిచోట్ల ద, య, స, అను నక్షరములుగాఁ గూడ మాఱుచున్నట్లు తెలియుచున్నది.

అవిఴ్ = అవియు, ఉమిఴ్ = ఉమియు, కఱల్ = కదలు;
అఱుందు = అద్దు, ఒఱు = ఒదవు, కుఱ = కొదమ; తుఱుల్ = దోయిలి;
పఱుప్పు = పసుపు.

శబ్దమణి దర్పణకారుఁడైన కేశిరాజీ క్రిందిశబ్దముల నుదాహరించి కొన్ని సంస్కృత శబ్దములు తద్భవ రూపమునఁ గన్నడమునఁ జేరినపు డందలి ట త ఠ శ అను కొన్ని యక్కరములు ళకారముగా నుచ్చరింపఁ బడుట కనఁబడుచున్నదని చెప్పి యున్నాఁడు.

| సం | కన్న | తెలు. |
|---|---|---|
| ఘటికా | గళిగె | గడియ |
| ఘోటికా | గొఱ్ఱిగె | గోడిగ |
| ధాటి | దాళి | దాడి |
| కుక్కుటః | కోళి | కోడి |
| మఠికా | మఱ్ఱిగె | మడిగ (తెలంగాణము) |
| ప్రతిహార | పఱ్ఱిహారి | పడిహారి |
| క్రూర | కూళ్ళ | కూళ |

| | | |
|---|---|---|
| తాళ | తాఱ్ | తాడి |
| ఏళదం[1] | ఏఱిదం | ఏలిదము. |

సంస్కృత శబ్దము లందలి కొన్ని యక్కరములను దేశియు లుచ్చరింప లేనప్పుడు వానికి బదులుగాఁ దమకుఁ బరిచితములైన ధ్వనులను బ్రవేశపెట్టుటలో నచ్చెరువు లేదు. థ మొదలైన మహాప్రాణముల నుచ్చరింప వలసి వచ్చినప్పుడు వారట్లు చేసి యుండవచ్చును. కాని ట, త, శ మున్నగు వానిని వారు మార్చ వలసిన యక్కఱలేదు. ఏలయన నా ధ్వనులు వారి భాషలకు సహజములై నట్టివే. ఈ టకారము భిన్న ప్రాంతము లందు భిన్నరూపములుగా మాఱుచుం డుట చేతను, భిన్న భాషల వ్యవహరించు జనులకు సంపర్కము గల్గినప్పు డవి యొండొంటిలోఁ బ్రవేశించుట (పరస్పర సంక్రమణము నెందుట) సహజ మగుటచేతను, ఈ వింత యక్కరముతోఁ గూడిన దేశీయపదములే సంస్కృత మునఁజేరి యుండవచ్చునని శ్రీ కోరాడ రామకృష్ణయ్యగా రూహించుచున్నారు [2] రోమకాది మ్లేచ్ఛ భాషలనుండి పికనేమ దీనారాది శబ్దములు సంస్కృత మున సంక్రమించి యుండెనని ప్రాచీనులే యంగీకరించి యున్నారు. అట్టివానికి వ్యుత్పత్తులను గల్పించునప్పుడు సంస్కృత పండితులు శబ్ద సామ్యమునుబట్టి వానికి సంస్కృత జన్యత్వమునే నిరూపించి యా క్రమము ననుసరించియే యర్థ నిర్ణయము కావించియున్నారు. అట్టివాని సంస్కృత వ్యుత్పత్తులను నిర్విమర్శ ముగా నంగీకరింపరాదని కుమారిలభట్టు తంత్రవార్తికమున హెచ్చరించి యున్నాఁడు. కేశిరా జిచ్చిన కన్నడ శబ్దములలోని ఱ కారమును బరిశీలించి చూడఁగా నది యందు స్వతస్సిద్ధముగా నున్నదే యనియు సంస్కృతము నందలి యక్షరము నుచ్చరింపలేక దానికి బదులుగా దేశీయులు తెచ్చిపెట్టినది కాదనియుఁ దోఁచుచున్నది. అందుచే ద్రావిడ శబ్దములే రూపాంతరమును బొంది సంస్కృతమునఁ బ్రవేశించెనని చెప్పవచ్చును. దీనికిఁ దరువాత ద్రావిడ భాషలలో నా శబ్దములకు సజాతీయములైన శబ్దములు కానవచ్చుచుండుటయే దృష్టాంతము.

---

1 ఇది శబ్దరత్నాకరమున దేశ్య విశేష్యముగాఁ జేర్కొనఁ బడినది. ఎల్లిదము అనునది దీనికి రూపాంతరము

2. Journal of the S, V. Oriental Inst. XII - I పుట 44, 45.

| తమి | కన్న | తె | తు. మళ | సం |
|---|---|---|---|---|
| కోటి | కోటి | కోడి | కోళి (మళ) కోరి (తుళు) | కుక్కుటః |
| కుదిరై | కుదురె | కుదిర | | ఘోటికా |
| | గోఢిగె | గుఱ్ఱము | | |
| కూఱై | కూఱు | కూళ | | క్రూర |
| తాన్ఱి | తాఱి | తాడి | | తాళ |
| మాడం | మాడ | మాడుగు మేడ | మాడం (మళ) | |

శకట రేఫము:-

ప్రాక్చాళుక్య యుగము నందలి అత్తివర్మ గోరంట్ల శాసనము నందును, శాలంకాయన హస్తివర్మ పెదవేఁగి శాసనము నందును తాన్ఱి కొన్ఱ, అఱుతొరె అను పదములలో మొదటిసారి శకట రేఫము కనవచ్చుచున్నది. దీనిని బట్టి క్రీ. శ. నాల్గవ శతాబ్ది నాఁటికే ఆంధ్ర కర్ణాటక లిపిలో శకటరేఫము ప్రవేశించిన దని చెప్పవచ్చును. పల్లవ శివస్కందవర్మ మైదవోలు శాసనమున విరిపర అని సాధు రేఫములతో వ్రాయఁబడిన శబ్దమే రెండవ పులకేశి కొప్పరపు తామ్ర శాసనము నందును (విర్పఱు పథాత్ 631) జయసింహ వల్లభుని విప్పర్ల శాసనము నందును (విఱ్పఱ్తి ఉత్తరంబున) శకట రేఫముతో వ్రాయఁబడి యున్నది. ఇందుద్దేశింపఁబడిన గ్రామములు రెండును సమానములైనవే. దీనిని బట్టి ప్రాచీన ప్రాకృత శాసనముల కాలము నాఁటికి ద్రావిడ భాషలకు సహజమైన యీ ధ్వని యింకను ఆంధ్ర కర్ణాటక లిపిలోఁ బ్రవేశింప లేదనియు, శాసనములు సంస్కృతములో వ్రాయఁబడుట మొదలైనప్పటి నుండియు (సుమారు క్రీ. శ. 4వ శతాబ్ది నుండియు) నాగరాక్షరముల నడుమ దానికి స్థాన మొసంగఁబడు చుండెననియు వ్యక్తమగు చున్నది. చాళుక్య యుగము నందలి పెక్కు శాసనములలో నీ యక్కరము కానఁ బడుచున్నది.

పెన్‌పాఱు, సత్యాదిత్యుని పొట్లదుర్తి మాలెపాడు శాసనము.
ప్రస్తుతము తెలుఁగు భాషలో బ్రాహ్మణుఁడను నర్థమున, పాఱుఁడను పదము వాడఁబడు చున్నది నన్నయకుఁ బూర్వ మందలి శాసనములలో ప్రథమా

విభక్తి దుప్రత్యయముతోఁ గూడిన యీ రూప మెచ్చటను గానరాదు. అది యందు పాఱయని ప్రథమగానే ప్రయోగింపఁ బడియున్నది. జయసింహ వల్లభుని విప్పర్తి శాసనమున (S I.I Vol vi - నెం. 585) పాఱను అను ద్వితీయా విభక్తి రూపము కనఁబడుచున్నది. చోళ మహారాజు ఉరుటూరు శాసనమున తిరువుళ పాఱకు ఇచ్చిన యని షష్ఠీవిభక్తి రూపము చూపట్టు చున్నది [1] పాఱుని, పాఱునికి మొదలైన తరువాతి విభక్త్యంత రూపము లందుఁ బ్రయోగింపఁబడి యుండలేదు. పాఱకు బహు వచనమునఁ గూడ నదే రూప ముండె ననుట కీ క్రింది ప్రయోగములు దృష్టాంతము లగుచున్నవి.

| | | |
|---|---|---|
| వేవురు | పాఱను | బుదమనారాయలపాడు శాస. |
| వేవురు | పఱాను | మంగిదొగరాజు లక్ష్మీపుర శాస. |
| వేవురు | పాఱ | రామేశ్వర స్తంభ శాస. |
| వేవురు | పఱ | గొద్దులోళ్ళపల్లి శాస. నెం. 437 |

తమిళమున పాఱు ధాతువునకు దర్శించు (to see) అను నర్థ మున్నది దానిని బట్టి పాఱ అను దానికి ద్రష్ట (seer) అను నర్థ మేర్పడుచున్నది. ప్రాచీన బ్రాహ్మణులు క్రాంతదర్శులైన ద్రష్టలుగా నుండెడివారు కావున నాపదము వారిని సూచించునదిగా స్థిరపడి యుండవచ్చును. పాఱ శబ్దము బ్రాహ్మణ శబ్ద భవమని తలంచినచో సాధు రేఫము వికృతిలో శకట రేఫముగా మాఱెనని చెప్పవలయును

ఇఱె తేనికిన్, సత్యాదిత్యుని పొట్లదుర్తి మాలెపాడు శాస.

ఈ శాసనమున నిది ప్రతిగ్రహీతయైన బ్రాహ్మణుని పేరుగాఁ గాని పించుచున్నది. ఇది ఈశ్వరునికి అను దాని వికారమై యుండును. కాని యప్పు డిందు శకట రేఫ ముండుట కవకాశము లేదు, శకట రేఫముతోఁ గూడిన పై రూపమునకు ఇఱెరాజునకు అను నర్థము వచ్చుచున్నది. తే అనఁగా రాజు. తరువాతి భాషలోఁ బాఱ శబ్దమునకు వలెనే దీనికిని బ్రథమా విభక్తి డు ప్రత్యయము చేర్పఁబడుటచే తేఁడు అను రూప మేర్పడినది. చాళుక్య యుగము

1. కొట్టంబున పాఱకు - ఎఱ్ఱగుడిపాడు కేశవస్వామి దేవాలయపు టుత్తర ప్రాకారమున. క్రీ. శ. 6 వ శతాబ్ది చివర
E.I Vol XXVII-Page 221

నందలి శాసనములలో నిది డు ప్రత్యయ విరహితముగానే కనఁబడు చున్నది. (పాలవే గారికి) కన్నడమున రాజను నర్థమున ఇఱెయ యను శబ్ద మున్నది. అఱై - ఱాయి; ఉరల్-రోలు, ఎఱక - ఱెక్క అను వానివలెనే వర్ణ ప్లుతిచే ఇఱెయ - ఱే యను రూపమును జెందియుండును.

పాలఱేగారికి అను ప్రయోగమును బట్టి యా కాలమున నీ శబ్దమునకు మొదట డు ప్రత్యయము లేకుండెననియుఁ గ్రమముగా దానికది చేర్పఁబడు చుండెననియు నూహింపవచ్చును

ఱో గొణ్ణ వాస్తు - పెద్దముడియం శివాలయం శాస. S. I I X 612.
ఱో అనఁగా ధనము. ఇందలి శకటరేఫమిది దేశ్యమని సూచించుచున్నది. కాని సాధారణముగా నిది సంస్కృతము నందలి రై శబ్ద భవమని చెప్పుదురు.[1] అగుచో నిందలి శకటరేఫము లేఖక ప్రమాదమని కాని అవ్యాజముగా నందుఁ జొచ్చినదని కాని చెప్పవలయును.

పిత్పఱ్ఱి - జయసింహ వల్లభుని విప్పర్లి శాస.
కలుచుమం బఱీఠి-రెండవఅమ్మరాజు కలుచంబఱ్ఱుశాస. E I VII 177.

దేనంబఱీఠి
ఆలపఱీఠి
కఱపఱ్ఱి - రణస్థి పూఁడి శాస.
పోతుంబఱ్ఱి - కలిదిండి శాస.

మున్నగు పదములలో పఱీఠి యనురూపము కనఁబడుచున్నది. ఇది పఱ్ఱు యొక్క ఔప విభక్తిక రూపము. ఇది పఱు, పఱ్ఱు (to hold), పట్టు (to take) అను ధాతువునుండి యేర్పడినది. తెలుఁగున పట్టు అను నామవాచకమునకు స్థలమని యర్థము. పఱ్ఱు అనుదాని యర్థముకూడ నదియే
వేశెఱువులు - మంగి దొగరాజు లక్ష్మీపుర శాసనము.

వే చెఱువులు అనునది గ స డ ద వాదేశముచే వే పెఱువులు అగును.

1. శబ్దరత్నాకరమున రో శబ్దముసాధురేఫముతో గ్రహింపఁ బడినది. ఇది (వై. వి) వైకృత విశేష్య మైన రోయి శబ్దమునకు రూపాంతరము.

దంత్యమైన సకార మిచ్చట తాలవ్య శవర్ణముగా వ్రాయఁ బడుట ప్రమాద జనితము. కన్నడము నందలి కెఱె యను పదమే తాలవ్యీ కరణముచే చెఱువుగా మాఱినది తాలవ్యాచ్చు పరమైనప్పు డిట్లు తాలవ్యీకరణము జరుగుట పెక్కు చోట్లఁ గనఁ బడుచున్నది.

మఱుస్తుళ్లు - ఎఱ్ఱగుడిపాడు శాసనము.

దీనికిఁగల రూప వైవిధ్య మిదివఱకు సూచింపఁ బడినది. ఇది మొదట సాధు రేఫాంతముగానే యుండి బహువచన ళ కార సాహచర్యముచే శకట రేఫాంతముగా మాఱి యుండును. ఆచాఱ్లు S I I X 47, 54 అఱ్ఱ పట్టుసేను, పాన్తూఱ్లు మొదలైన విందు కుదాహరణములు. ఈ శకట రేఫ ళకార సంయోగ మప్పుడు డ్ర్ళు అనున ట్లుచ్చరింపఁబడుచుఁ గ్రమముగా డ్ళు గా మాఱియుండును. విక్రమాదిత్య బలికుల బాణరాజుల శాసన మందును, బికిరాజు శాసన మందును మఱుతుడ్లు అను రూపము కనఁబడు చున్నది.

ఇఱ్ఱకాను. జయసింహ వల్లభుని విప్పర్ల శాసనము.

ఇటులు + అ = ఇటుల = ఇట్ల అనునది యిచ్చట ఇఱ్ఱ అను రూపముతో వ్రాయఁబడినది. అందుచే బహువచన ళ కార సాహచర్య ప్రభావముచే మూర్ధన్య టకారము శకట రేఫముగా మాఱినట్లు తోఁచుచున్నది.

కొట్టంబుఱ్ వడ్ద్రెణ్డు. (అద్దంకి శాసనము) దీని యరివాణంబు పడ్ణెణ్డు పుట్లు (బికిరాజు శాస. S I I. X 594) ఇందలి పడ్డెణ్డు అను పదము (పన్-పఱ్. పది + రెండు) అను పదముల కలయికచే నేర్పడినది. రెండులోని ర కారము సాధు రేఫమే కాని పన్ అను దానిలోని పదాంత నకారము దీనిని శకట రేఫముగా మార్చుటయే కాక ద యను సహాయ ధ్వనిని గూడఁ జేకూర్చినది.

వ్ఱచ్చిన, చేఱ్టోల నుండి : తరువాతి భాషలో, వీని యందలి శకటరేఫము స్థానమును క్రావడి యాక్రమించినది. (వ్రచ్చిన, చేట్రోలు) వ్రచ్చు ధాతువు నకు అఱి + చ్చు అనునదియు, ప్రోలు శబ్దమునకు పుఱోలు అనునదియుఁ బ్రాచీన రూపములు. అందుచే నా రూపములందలి ఱ కారమే మొదట శకట రేఫముగను దరువాత క్రావడిగాను మాఱియుండునని యూహింపవచ్చును

శాలంకాయన నందివర్మ పెదవేఁగి శాసనములో (క్రీ. శ. 4వ) సర్వపరిహారై ఱ్పరిహర్తవ్యాని అను వాక్యము కనవచ్చుచున్నది. (సర్వపరి

హార్త్రైః పరిహర్త్రవ్యాని) ప ఫ లకు వెనుకనున్న విసర్గ కుపధ్మానీయమని పేరు. ఇది దేశీయ పదములలో నుండదు. కాని శాసన లేఖకునికి శకటరేఫము పరిచితమై యుండుటచే నాతఁడిచ్చట వింత ధ్వనియైన ఉపధ్మానీయము నా యక్కరముతో సూచించి యుండును. సంస్కృతమున శకట రేఫమునకుఁ బ్రవేశము కల్గుట కింతకంటె వేఱు కారణము కనఁబడదు

మెఱసి-వైదుంబరాజుల శాసనము క్రీ. శ. 850. తమిళ కన్నడములందు ప్రకాశించు అను అర్థమున మెఱ అను ధాతు వున్నది. అదియే తెలుగున మెఱయు అయి తరువాత మెఱయు అను రూపమును బొందినది.

పేరఱు (ఆ సా. ప. ప. VIII సం. 4 పుట 263) పేరు + అఱు అను పదముల కలయికచే నిది యేర్పడినది. పెద్ద ధర్మమని యర్థము కన్నడమున అఱు అను పదమునకు ధర్మము, దానము అని యర్థము.

తూఱ్పు: ఇది ప్రవేశించు అను నర్థము గల తూఱు ధాతువు నుండి యేర్పడి నది. సూర్యుఁడు క్షితిజమును (Horizon) బ్రవేశించు స్థలమని యర్థము.

ఉత్తరమ్మున నేలకు గుఱువ (వెంకయచోడుని దొంగలసానికనుమ శాసనము) ఉత్తరపు టెల్లకు గుఱుతని యర్థము. తమిళ కన్నడము లందు కుఱి, కుఱితు (= a mark, a sign an aim) అను పదములున్నవి. వీనివలెనే తెలుఁగున గుఱువ గుఱుతు అనుపదము లేర్పడినవి.

అఱుపట్లు: అఱుశబ్దము తమిళ మలయాళములలోఁ గూడనున్నది. అఱు + పది యను శబ్దములుకూడి అఱువది యను సమాసమైనది. గ స ద ద వా దేశముచే ప, వ యైనది. సమాసమున అఱులోని దీర్ఘము హ్రస్వమైనది. ఇట్లే ఏడు + పది = డెబ్బది యను రూపమును బొందినది. ఏడునందలి ఏకారము హ్రస్వమైనది. పిమ్మట వర్ణప్లుతివలన ఎడు = డె అను రూపమేర్పడినది.

ఎనుబొన్డ

ఎనుబొన్ + రు + ఆ అనువాని కలయికచే నీ రూపమేర్పడినది. ఎనుబొన్, ఎనుబొది అనునవి యెనిమిది యొక్క పూర్వరూపములు. ఎణ్, ఎణ్టు అవి తమిళ కన్నడము లందున్న రూపములు మఱియుఁ బ్రాచీనములైనవి. ఎనుబొన్ అనుదానికి బహువచన చిహ్నమైన రు చేరినది. ఇది సాధురేఫమే యైనను

పన్ (పొన్) లోని పదాంత నకార సాహచర్యముచే శకటరేఫముగా మాఱుటయే కాక ద యను సహాయ ధ్వనిని గూడఁ జేర్చుకొన్నది.

కొణ్డు (బూడిదగడ్డపల్లి. అపిమాన గంగుకేసరాజు శాసనము S I I X 633) తమిళ కన్నడము లందు కొళ్ అను ధాతు వున్నది. దాని నుండియే తెలుఁగున కొను ధాతు వేర్పడినది. పెద్ద ముడియం శివాలయమునఁగల శాసనములో మూర్ధన్య ణకారముతోఁ గూడిన కొణ్ను అనురూపమున్నది. కొణు + దు + రు. మూర్ధన్య ణకార సాహచర్యముచే దంత్య దకారము మూర్ధన్య డకారముగా మాఱినది. కొణ్డు + రు పిమ్మట బహువచన చిహ్నమైన సాధు రేఫము శకట రేఫమైనది. లేదా యిచ్చట శకటరేఫమే బహువచన చిహ్నమని చెప్పవచ్చును దీనికి ముందుత్వలోపము కలిగినది.

తెలుఁగున సాధు శకట రేఫములు రెండును బహువచన ప్రత్యయము లుగాఁ గన వచ్చుచున్నవి. ఉదా. అల్లురు, పగతురు, వారు, అందఱు, ఇందఱు, విలుకాఱు, చెయువుఱు మొదలైనవి. ఎఱికల్ ముతురాజు ధనంజయుని కల మళ్ళ శాసనములో (E I Vol. XXVII Page 221) ధనంజయుఱు అను రూపము కనఁబడుచున్నది. శాసనములలో రాజుల పేర్లు పూజ్యార్థమున బహు వచనాంతములుగా వాడఁబడు చుండును.

ముత్తురాజుల్ల కుణ్డికాఱ్ను — ఎఱ్ఱ గుడిపాడు శాస.
చోళ మహారాజు ల్లేళన్ — ఇందుకూరు శాస.
పుణ్యకుమార పృథివీ వల్లభ చోళ మహారాజులకు — రామేశ్వర స్తంభ శాసనము.

అట్లే ధనంజయుఱు అనునది కూడఁ బూజ్యార్థమున బహు వచనాంతముగాఁ బ్రయోగింపఁ బడినదని తలంప వచ్చును. డు ప్రత్యయ హీనముగా నేక వచన రూపములను వాడు పరిపాటి రేనాటి చోళుల శాసనముల లోను చాళుక్యుల శాసనముల లోను గనఁబడు చున్నది.

పాతకు అగు - ఉరుటూరు శాస.

పణ్డరఙ్గ-నెల్లూరు జిల్లా శాస, పుట 968. ధర్మవర శాసనము

పై యాకరణులు వృద్ధాదుల డుజ్జునకు లోపంబు విభాష వగునని చెప్పి వృద్ధాది గణమును పెర్కొని యున్నారు ఆలోచించి చూడఁగా నిట్టి పట్టుల డుజ్జు వచ్చి

లోపించిన దనుట కన్న దుజ్వీరహిత రూపమే ప్రాచీన కాల సిద్ధమని తలంచుట సమంజసముగా నుండును. తెలుఁగున ఉదంతత సహజమని తోఁచిన కాలములో జనులు సంస్కృత శబ్దములను తత్సమీకరించుటకు ఉకారము మాత్రము చేర్చెడి వారు. (వృద్ధ + ఉ = వృద్ధు; జ్ఞానమ్ + ఉ = జ్ఞానము.) కాలాంతరమున మహద్వివక్ష చేయఁ దలఁచి డుజ్జు కూడఁ జేర్చి యుండుదు. అందుచే ధనంజయు అనునది యేకవచన రూప మనియు ధనంజయుఱు[1] అనునది బహు వచనాంత రూప మనియు భావింప వచ్చును. ధనంజయుఱు అనఁగా ధనంజయుఁడు గారని యర్థము.

చోళ మహారాజు ఉరుటూరు శాసనమున చోళ మహారాజుల్లు అనియు తుగరాజుల్లు యనియు ల్లు అను నక్షరముతో ముగియు రూపములు కనవచ్చు చున్నవి. ఇందు ఱు, లు అను రెండు బహువచన చిహ్నములును సంయుక్త ములై యున్నవి. రాజులుంగారు అను నట్లిచ్చట బహు వచనముపై నింకొక బహువచనము వాడఁబడి నట్లు తోఁచుచున్నది. చోళ మహారాజు ఇందుకూరు శాసనమున రాజు ల్లేళన్ అని ద్విత్వ లకారముతోఁ గూడిన రూపము వాడఁ బడినది. ఇచ్చటఁ గూడ బహువచన చిహ్నము ద్విగుణముగా వాడఁ బడినదనియే చెప్ప వచ్చును. లేదా ఊనిక కొఱకు ద్విత్వము వచ్చినదని యూహింప వచ్చును. పొట్లదుర్తి మాలెపాడు శాసనమున రాజుల్లోళన అను రూపము కలదు. చోళ మహారాజు నధీనత యందున్న యని యర్థము. రాజుల + ఓళన అని పైదానికిఁ బదవిభాగము. అన్ + ఇష్టసఖి యను చోటవలె నిచ్చటఁ గూడ నూనిక కొఱకు ద్విత్వము వచ్చినట్లు కనఁబడు చున్నది.

దీని చెఱుఖ్ఖువారు - పెట్లూరి శాసనము నెల్లూరు జిల్లా శాసనములు సం. 2. పుట 606-607.

తెలుఁగున చెడు ధాతు వున్నది. తమిళ కన్నడము లందలి కెడు దీనికిఁ బూర్వ రూపము. ఇది తాలవ్యీకరణముచే చెడు అను రూపమును బొందినది.

---

1 ద్రావిడ భాషలందు అన్, అర్ అనునవి ఏకవచన బహువచన ప్రత్యయ ములు. అందుచే ధనంజయ శబ్దము బహు వచనమున ధనంజయర్ అయి, ఉకారము చేర్చుటచే ధనంజయురు - ధనంజయులు అను రూపమును బొంది యుండును.

దీనికి చు చేర్చుటచేఁ బ్రేరణార్థక రూపము కలిగినది. అప్పుడు చెడు లోని ద కారము శకట రేఫముగా మాఱినది.[1] కెడు అను దానికిఁ బూర్వ రూపము కీల్ (below, beneath base degraded) అను ధాతువు కావచ్చును. ఇందలి ఱకారమే స్వార్థమున ద కారముగాను బ్రేరణార్థమున శకట రేఫము గాను మాఱెనని యూహింప వచ్చును. చెఱుఞ్చు అను దానిలోని యానునాసిక్య మెట్లు వచ్చెనో చెప్పఁ జాలము. [2] ఈ యానునాసిక్యము యుద్ధమల్లుని బెజవాడ శాసనములోని వెల్వఱించు అను రూపము నందుఁ గూడఁ గనవచ్చు చున్నది. వెలి + పడు— వెల్పడు-వెల్వడు (గ స డ ద వా దేశము). ప్రేరణార్థమున చు చేరఁగా డ శకట రేఫముగా మాఱి వెల్వఱుచు అను రూప మేర్పడును. వెల్వఱించు అను నానునాసిక్యముతోఁ గూడిన రూప మిప్పుడు కూడ వాడఁబడుచునే యున్నది. కాని దానికి వాడుక కొంచెము తక్కువ. చెఱుంచు అను రూపము తరువాతి భాషలోఁ గనఁబడనే కనఁబడదు. అందుచేఁ బ్రేరణార్థమునఁ గొన్ని ధాతువులలోఁ బ్రాచీన కాలమున వచ్చిన అనునాసిక్యము తరువాతఁ గ్రమముగాఁ దొలఁగి పోయినదని భావింప వచ్చును.

ఎఱుగు.

తమిళ కన్నడము లందు అఱి అను ధాతువునకు ఎఱుఁగుట అని యర్థము అందుఁ బదాది నున్న అకారము తెలుఁగున ఎకారముగా మాఱినది. తమిళము నందలి అకార మిట్లు తెలుఁగున ఎ కారముగా మాఱుచుండు ననుటకుఁ బాల దృష్టాంతము లున్నవి.

---

1 చెడునకుం జుక్పుగాగమంబులు డా కలఘు రేఫంబు నగును బాల వ్యాకరణము. క్రియా ప్ర. 81.

2 ప్రేరణార్థమున ధాతువులకుఁ జేర్పఁబడు చు ఇచ్చు యొక్క అవశిష్ట రూపమని చెప్పఁబడు చున్నది. ఇచ్చు ధాతువునే కాక ఉంచు ధాతువును గూడ ప్రేరణార్థమున సహాయ ధాతువుగా స్వీకరించి యుందురని భావించినచో కీఱ్ + ఉంచు, కీఱుంచు అయి తాలవ్యీకరణముచే చెఱుఞ్చు అను రూపమును బొందెనని చెప్ప వచ్చును కాని ప్రేరణార్థమున ఉంచు చేర్చు విధానము మఱెచ్చటను గాన వచ్చుట లేదు అందుచే ద్రావిడ భాషలం దానునాసిక్యము నిర్హేతుకముగా వచ్చుచుఁ బోవుచుండుట కలదు గావున నిది యట్టిదే యని చెప్పవలయును.

| తమిళము. | తెలుఁగు. |
|---|---|
| అఱి | ఎఱుఁగు |
| అఱివు | ఎఱుక |
| ఆడు | ఏట |
| అమ్మై | ఎన్దె |
| ఆఱ్ | ఏఱు |
| యాన్, అన్ | ఏను |
| యార్, ఆర్ | ఏరు |
| యాణ్డు, ఆణ్డు | ఏణ్డు, ఏడు. |
| యానై | ఏనుఁగు |

తమిళ భాషలో యి అను ధ్వని విల్చియున్న చోట్లఁ బూర్వ ద్రావిడ భాషలోని రూపములం దుండిన ధ్వని కేవల - ఎ కారము కాదనియు, నది అ, ఎ (æ)అను ధ్వనుల సమ్మేళనమై యుండుననియు, నందు అ య లలో నేది మొదట నున్నను తెలుఁగున మాత్రము ఎ అనునచ్చుతోఁగూడిన రూపములే కనవచ్చుచున్నవనియు, ఈ మార్పు క్రీస్తు శకారంభము నందలి శాసనముల కాలము నుండియుఁ గన వచ్చు చున్నదనియు, శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారు తెల్పి యున్నారు. (Journal S. V. Or. Inst. XV-1 Page 74, 75) తెలుఁగునఁ గూడ వ్యావహారిక ప్రయోగములలో (చూవాను, మట్లాడు) అ, ఎ ల కలయికతోఁ గూడిన ధ్వనివినఁబడుచునే యున్నది. కొందఱు చూశాను, చూశేను అను రీతిగాఁ గూడ నుచ్చరించుట కలదు. మఱియుఁ 'ఐదాది యకార మొకప్పుడు శిష్ట ప్రయోగము నందే యుండెననుటకు చింతామణి యందలి "అద్యః క్రియాసు భూతార్థద్యోతివ మాద్యగం వినా వర్ణ్యః" అను సూత్రము నిదర్శనమగుచున్నది అందుచేఁ దమిళమున యకారాదులుగా నున్న పదములు తెలుఁగునఁ గూడ మొదట నట్లే యుండి క్రమముగా ఎకారాదులుగా మాఱెనని యూహింప వచ్చును.

రెండు తేవులు (వెంకయ చోళుని దొంగలసాని కనుమ శాస.) రేవనఁగా నీటిలోనికి దిగు చోటు. లేక సముద్ర తీరమున నెగుమతి దిగుమతులకు వీలు గల చోటు. క్రి. శ. 5 వ శతాబ్దికిఁ జెందిన విక్రమేంద్రవర్మ చిక్కుళ్ళ తామ్ర శాసనములో థావి రేవను వద మున్నది. అందు రేవను పదము సాధు రేఫాదిగానే

వ్రాయఁ బడినది. రేఫాదులగు రూపములు ద్రావిడ భాషలకు సహజములు కాక పోవుటచే నిది ప్రాథమిక రూపము కాక పరిణామము పొందిన రూపమని భావింప వచ్చును. తమిళమున ఇఴంగు = to descend, to get down, అను ధాతు వున్నది. దీనిని బట్టి సులభముగా దిగుట కనువైన స్థలమను నర్థమున ఇఴవను నామవాచక మేర్పడినది. దాని నుండి తెలుఁగులో ఎఱవు-వర్ణ ప్లుతిచే తేవు-అను పదము లేర్పడినవి. ఎఱగు ధాతువు తెలుఁగునఁ గూడ నున్నది దానికి దిగు నమస్కరించు అను నర్థములు శబ్ద రత్నాకరములో నొసంగఁ బడినవి. దీని నుండియే ఎఱక — తెక్క అను పదము లేర్పడినవి. ఇఴంగు, ఎఱగు అను ధాతువులకు తమిళమున నిప్పుడు కూడ నిల్చియున్న ఇఴి అను ధాతువు పూర్వ రూపమైయుండును. ఈ ఇఴి అనుధాతువునుండియే ఇఴి గు-ఇడిగు-ఇదిగు-దిగు అను తెలుఁగు ధాతు వేర్పడి యుండునని తలంప వచ్చును. ఇఴి ధాతువునందలి ఴకారమే ఇఴంగు, ఎఱగు అను ధాతువు లందు శకట రేఫముగా మాఱినది చిక్కుళ్ళ తామ్ర శాసనమున నది సాధు రేఫముగా వ్రాయఁ బడుటకు శకట రేఫ చిహ్న మప్పటి కింకను ఆంధ్ర కర్ణాటక లిపిలోఁ బూర్తిగాఁ బ్రవేశింపక పోవు టయే కారణమై యుండును. క్రీ. శ. 10 వ శతాబ్ది యందలి దొంగలసాని కనుమ శాసనమున నది శకట రేఫముతోఁ గానఁబడుట మొదటి నుండియు నది శకట రేఫాది గానే యుండెననుటకు నిదర్శనము. (గోగుతేవు — సిరిపుర తామ్ర శాస నము) తరువాతి భాషలో నది సాధు రేఫాదిగా మార్పు చెందినది. శబ్ద రత్నా కరమున నది సాధు రేఫముతోనే గ్రహింపఁ బడినది.

వ్రాయు ధాతువు కొన్ని శాసనములలో శకట రేఫముతోఁ గనవచ్చు చున్నది. (ఉత్తమాదిత్య చోళ మహారాజు వెలుదుర్తి శాసనము - ఎఱమ వ్రాసిరి) ఇది ప్రమాద జనితమై యుండును. తమిళ కన్నడములలో నిది సాధు రేఫము తోనే యున్నది. తమి. వరై; కన్న. బరె.

ను.

ణు అను దానికిఁ బూర్వ రూపమైన యీ ధ్వని ప్రాక్చాళుక్య యుగము నందలి శాసనములలో వలెనే చాళుక్య యుగమునందలి శాసనములలోఁ గూడఁ గానవచ్చుచునే యున్నది. ఇది తెలుఁగు దేశమునందలి యాంతర భాగములలోఁ

గంటెఁ దీర ప్రదేశము లందు ముందుగా ణ్డు గా మాఱినట్లు తలంప వచ్చును. ఏలయనఁ జాళుక్యుల శాసనములలోఁ గంటెఁ రేనాటి చోళుల శాసనములలో నీ రూపము బహుళముగాఁ జూపట్టుచున్నది.

పుణ్య కుమారున్ను—గణ్య మానున్ను—మద ముదితుసు
అవిన వాన్ను—తిప్పలూరి శాసనము.

పఞ్చ మహాపాతక సంయుక్తున్గు - ఇందుకూరి శాస. వెలుదుర్తి శాస. సేలపాడులో శివ విగ్రహము చెక్కఁబడిన రాతిపైఁ గల విష్ణువర్ధన మహారాజు శాసనమున క్రీ.శ. 742. (నెం 116) ముప్పది మూన్టకు నేణ్డను రూప మున్నది. మూన్టు అనునదే మూణ్డు—మూఁడు అను రూపములు పొందినది. సత్యాదిత్యుని మాలెపాడుశాసనమున ఏలుచున్టి అను రూప మున్నది. ఇది తరువాత ఏలుచుణ్డి—ఏలుచుండి అనునట్లుగా మాఱినది. ఇట్లితర శబ్దములలోఁ గూడ నచ్చు టచ్చట ణ్డు అనుటకు న్టు అనునది పూర్వ రూపముగాఁ గాన వచ్చుచున్నను - సాధారణ ముగా నది ప్రథమా విభక్త్యేక వచన రూపముల నుండు ణ్డు అను దానికి బదులుగా మాత్రమే కానవచ్చుచున్నది. ఇతర పదము లందలి ణ్డు — ణ్డు అను రూపముతోనే వ్రాయఁబడి యున్నది. వేణ్డికొని.

అనుస్వారము :

తెలుఁగులో నిప్పు డనుస్వార మర్ధాను స్వారపూర్ణాను స్వారములను రెండు రూపములతోఁ గనవచ్చు చున్నది. ఇందలి యర్ధానుస్వార మొక తెలుఁగులోఁ దప్ప మఱియే యితర ద్రావిడ భాష లందును లేదు. పూర్ణానుస్వారము కన్నడ మునఁ గూడ నున్నది. తమిళమున ననుస్వారమునకు బదులు వర్గ పంచ మాక్షరమే వ్రాయఁబడును. వర్గపంచ మాక్షరము వ్రాయు నాచారము తెలుఁగు నందును ప్రాచీన శాసనములలోఁ గనఁబడు చున్నది. మకారము వ్యంజనముల ముందు అనుస్వారముగా మాఱుటను పాణిని సూచించెను. (మోఽనుస్వారః) వర్గ పంచ మాక్షరములలో మకారము ముందుగను దక్కిన యను నాసికములు గ్రమముగను అనుస్వార రూపము నంది యుండును. ఈ విధముగా ద్రావిడ భాషలలో నెల్ల నొక్క తెలుఁగు నందే యర్ధానుస్వార పూర్ణాను స్వారములు రెండును గోచరించు చున్నవి. ఆంధ్రమున మొదటి వ్యాకరణమైన ఆంధ్ర శబ్ద చింతామణి కాలము నుండియు నెల్ల లక్షణ గ్రంథములందుఁ బూర్ణార్ధ బిందువుల విచారము చేయఁబడి యున్నది. ప్రాఁత వ్రాఁతల యందెచ్చటను అర్ధ బిందువు

కానవచ్చుట లేదు. శిలా తామ్ర శాసనము లందలి వ్రాతలలోనే కాక సుమారు మూఁడు శతాబ్దుల కంటె నెక్కువ పాతవి కాఁజాలని తాళపత్ర ప్రతులలోఁ గూడ నది కానవచ్చుట లేదు.

తమిళమున నచ్చురహితమైన పొల్లక్షరమును సూచించుటకు దానిపై నొక్క చుక్క పెట్టు నాచారము కలదు. ఈ విషయమును తొల్కాప్పియరు తన గ్రంథమునఁ జెప్పి యుండుటచే నీ యాచార మా భాషలో క్రీస్తు శకారంభము నుండియు వచ్చుచుండెనని తలంప వచ్చును. సంస్కృతమున నిట్టి చుక్క పొల్లును గాక అనుస్వారమును సూచించు చుండును. సంస్కృత ప్రభావమున నాంధ్ర కర్ణాటక లిపిలో నీ పద్ధతియే వాడుక లోనికి వచ్చెను. తమిళ మాంధ్ర కర్ణాట భాషలవలె నంతగా సంస్కృత ప్రభావితము కాక పోవుటచే నందు మాత్రము ప్రాచీన సంప్రదాయమే నిల్చి పోయినది. ఆంధ్ర కర్ణాటక లిపిలో నీ చుక్కను వ్రాయు పద్ధతిలో నొక వైలక్షణ్యము గోచరించును. సంస్కృత మున ననుస్వార సూచకమైన చుక్క తత్పూర్వాక్షరము నెత్తిపైఁ బెట్టఁ బడు చుండును. ఆంధ్ర కర్ణాటక లిపిలోఁ గొన్ని చోట్ల నది యట్లు పూర్వాక్షరముపైఁ గాక పరాక్షరముపైఁ గానవచ్చు చుండును. వర్గాను నాసికాక్షరమునకు బదులుగా ననుస్వారము వ్రాయఁబడు చున్నదని యెఱింగిన వారగుటచే నప్పటి లేఖకులు తత్సూచకమైన చుక్కను సరిగా నది యుండు చోటనే అనఁగాఁ బరాక్షరము పైనే యుంచుచుండిరి. (ఉదా : ఒఙ్గోదు, కొడిఙ్కి అను వానిని ఒం గోదు, కొ డిం కి అని వ్రాయుట సంస్కృత పద్ధతి. కాని అనునాసికాక్షర మాంధ్ర కర్ణాట లిపిలో గ, క కారములపైఁ గానవచ్చు చుండుటచే లేఖకులు చుక్కను వానిపైనే పెట్టుచుండిరి. అప్పుడవి ఒగోందు, కొడికిం అను వట్లుగాఁ గానఁబడును. అందుచేతనే కొందఱు శాసన పాఠకులు వానిని ఒగోందు, కొడికిమ్ అని తప్పుగాఁ బఠించి యుండిరి) ప్రాక్చాళుక్య యుగమునందలి కొన్ని శాసనములలో వలెనే చాళుక్య యుగమునందలి శాసనములలోఁ గూడఁ గొన్నిచోట్ల నీ పద్ధతిని బరికింపవచ్చును. అహదనకర శాసనమున వక్రంబు అనుటకు బదులు వక్రబుమ్ అని రెండుచోట్లఁ గనవచ్చు చున్నది. అద్దంకి శాసనములో పట్టబు గట్టిన ప్రథమబు నేణ్డు బలగర్వ బొప్పగ అని చుక్కలు పరాక్షరములపైనే వ్రాయఁబడి యున్నవి. యుద్ధమల్లుని బెజవాడ శాసనమున 41 వ పంక్తి మొదట బిందువు కానవచ్చుటకు మూలమునఁ జొక్క

బు పైఁ బెట్టఁబడుటయే కారణము. (గ్ర.మ 41బు న. సర్వలోకాశ్రయ మంగి యువరాజు నూతలపట్లు శాసనమునను, రెండవ విష్ణువర్ధనుని రేయూరు శాసనమునను నిడుబమ్లు, పసిడ్డిపమ్లు, వేగిమ్బోయన్య అను రూపములు కన వచ్చుచున్నవి నిజమున కివి నిడుమ్బలు, పసిణ్డిమ్పలు, వేమ్గిబోయన్య అను భావముతో లేఖకుఁడు వ్రాసియుండును. పమ్లు, బమ్లు అనువాని కెట్టి యర్థము లేదు. పట్లు, పలు అనునవి ప్రాచీనకాలము నుండియు గ్రామనామముల చివరఁ గానవచ్చు చున్నవి. తరువాత ప, బ అనునవి వెనుకనున్న మకారములో లీనమగుటచేతనో, లోపించుటచేతనో నిడుమట్లు పసిడిమట్లు మొదలైన రూపము లేర్పడినవి. ఇట్టి గ్రామముల యొాప విభక్తిక రూపములే యిప్పటికిని గొందఱి గృహనామములుగా గోచరించుచున్నవి. దిగుమర్తి, పసుమర్తి మొ॥.

ఈ విధముగా ననుస్వారమును వ్రాయు పద్ధతి ద్రావిడ భాషలకు సహజమైనది కాక సంస్కృతము నుండి తెచ్చుకోఁ బడిన దగుటచే నారంభ కాలమున దానిని వ్రాయుటలోఁ గొంత యవ్యస్థిత స్థితి గోచరించు చున్నది. తరువాత సంస్కృత ప్రభావ బలమున నది పూర్వాక్షరముపైనే వ్రాయఁ బడుచుండెను. క్రమముగా నా చుక్క పైనుండి ప్రక్కకు మాఱి బిందు రూపమును దాల్చినది. అదియే మన మిప్పుడు వ్రాయుచున్న పూర్ణానుస్వారము.

చాళుక్య యుగము నందలి శాసనములలో ననుస్వారమును వ్రాయు పద్ధతి రెండు విధములుగాఁ గనఁ బడు చున్నది. అందొకటి పూర్వాక్షరముపైఁ జుక్క రూపమున వ్రాయఁబడు సంస్కృతపద్ధతి. రెండవది పరాక్షరమునకు సంబంధించిన యనునాసికాక్షరముగా వ్రాయఁబడు ద్రావిడ పద్ధతి. ఒకే శాసన మందే యీ రెండు పద్ధతులును గానఁబడు చుండుటచే నప్పటి కింకను దీనిని వ్రాయు పద్ధతి స్థిరత్వమును గాంచలేదని చెప్పవచ్చును. సంస్కృతమున దంత్యోష్ఠ్యములైన యను నాసికములు రెండును కొన్నిచోట్ల అనుస్వారములుగా మాఱుచుండును. (మోనుస్వారః నశ్చాపదాన్తస్య ఝలి). మిగిలిన జ, ఞ, ణ అను ననునాసికాక్షరములు మూఁడును నితర వర్గాక్షరములు పరమైనప్పు డట్లే యుండిపోవును. ప్రాచీన కాలమున ద్రావిడ భాషలలో ననుస్వార ధ్వని సర్వత్ర పరాక్షరమునకు సంబంధించిన యను నాసికాక్షరము తోడనే సూచింపఁ బడుచుండెను. తమిళమున నిప్పటికిని ఆ పద్ధతియే యనుసరింపఁ బడుచున్నది.

చాళుక్య యుగమున ననుస్వారము బిందువుగను వర్గాను నాసికాక్షరము గను గూడ వ్రాయఁబడు చుండెననుట కీ క్రింది రూపములు తార్కాణములు.

ధనంజయుని కలమళ్ళ శాసనము. క్రీ. శ. 575.
ధనంజయుఱు; రేనాణ్డు. చిరుమ్బూరి; పంపుచే పఞ్చ మహాపాతక.
చోళ మహారాజు ఉరుటూరు శాసనము. క్రీ. శ. 625.
రాచమానంబున. వక్రంబు; పఞ్చ మహాపాతకు.
చోళ మహారాజు ఇందుకూరు శాస.
పఞ్చ మహాపాతక; సంయ్యుక్తుణ్డగు.
పుణ్య కుమారుని తిప్పలూరు శాసనము.
ఉత్త మోత్తముణ్డయిన. కొణ్డ కాత్తిఁయ; సోమవారంబు; పునరు పుష్యంబు. ఏమ్బదియె.
రామేశ్వర స్తంభ శాసనము.
సంవత్సరమ్బుళ్‌; నాణ్డు; వసన్తి పోఱి: వసన్తీశ్వరంబున; వట్టమ్బుఁన; పులొంబున. రెణ్డు; రిహితంబ; రాచమానంబున. వక్రంబు; జమ్బున.
రెండవ విక్రమాదిత్య చోళ మహారాజు వల్లచెఱువుపల్లి శాసనము.
ఇన్నెద్దివాడి; కజ్జఖాన్డు. ఉణ్డేలు; గోణ్డపుల్య: మంళి.
ఉత్తమాదిత్య చోళ మహారాజు వెలుదుర్తి శాస. c. 730.
రాజ్యంచేయ. వెన్దరంబు: వక్రంబు
పృథివీ వల్లభ విజయాదిత్య చోళుని చామలూరు శాస.
ఇరువదిరెణ్డు; వచ్చరంబుల్‌; పాంబుఱిగ్గి; తాంబుల్‌ రాచమానమ్బున;
స్వదత్తాంపరదత్తాంవా; వసుంధరాంచిన్త; కొణ్డిల్య: విష్టాయాం జాయతే.
బూడిద గడ్డపల్లి శాసనము.
మహేన్ద్రిన్‌; మంగు.
పొట్లదుర్తి మాలెపాడు శాస.
పఞ్చ మహాపాతకు ణ్డగున్‌.
సత్యాదిత్యుని మాలెపాడు శాసనము,

కాశ్యప గోత్రుణ్ణు, రేనాణు, చిఱుమ్బూరి, పుణ్యమ్బు, లోకమ్బు: ఉణ్ణు.
రేనాటి చోళుల కాలమునకుఁ జెందిన యీ శాసనములలో తాలవ్యమూర్ధన్యాక్షరముల వెనుకనున్న యనుస్వార మెల్లయెడల ననునాసికాక్షరము గానే వ్రాయఁబడినది కంఠ్యాక్షరములకు వెనుకఁగూడ నది యనునాసికముగానే వ్రాయఁబడి యున్నది కాని పంఖి యను రూపమున ననుస్వారమే కానవచ్చు చుండుటచే నా పద్ధతి సార్వత్రికముగా లేదని చెప్పవలసి వచ్చుచున్నది. దంత్యోష్ఠ్యములైన హల్లులకు వెనుక ననుస్వారము రెండు తెఱఁగులుగాను వ్రాయఁబడు చుండినట్లు పై యుదాహరణములవలన వ్యక్తమగుచున్నది వెలుదుర్తిశాసనమునఁ బ్రథమా విభక్తి మువర్ణమునకు బదు లనుస్వారము వ్రాయఁబడినది (రాజ్యం చేయ). ఇచ్చట ననుస్వారము తాలవ్యాను నాసికముగా మార్పుచెందలేదు. సత్యాదిత్యుని మాలెపాడు శాసనమున సరిగా నిట్టి సందర్భముననే మువర్ణక మనుస్వారముగను, చకార పరకమగుటచే నది తరువాతఁ దాలవ్యానునాసికముగను మార్పుచేయఁబడినది (పాతక ఞ్చేసినవాని). వెలుదుర్తి శాసనమున "విష్ఠాయాం జాయతే క్రిమిః" అనుచోటఁ బదాంత మకార మనుస్వారముగా మాఱినది కాని జకారము పరమైనను దాలవ్యానునాసికముగా మార్పఁబడి యుండలేదు. పెన్బాఱు, ఇన్బుట్టోలి అనుచోట్లఁ బూర్వ శబ్దములు మకారాంతములు కాక నకారాంతములను భావము శాసన లేఖకుని కుండుటచేఁ గాఁబోలుఁ బకారము పరమైనను దంత్యాను నాసికమట్లే నిల్చిపోయినది.

ఈ శాసనములలో నంతస్థములైన యవలకు వెనుకనున్న యనుస్వారము బిందు రూపముననే వ్రాయఁబడి యున్నది

సంయ్యుక్తుణ్డు: సంవత్సరమ్బుళ్, దత్తంవా.

చాళుక్య రాజులయు బాణ వైదుంబులయు శాసనములలోఁగూడ ననుస్వార లేఖన విషయమున స్థిరత్వము కనిపించుట లేదు. అది పైని పేర్కొనఁ బడిన ద్వివిధ రూపములతోడను వ్రాయఁబడి యున్నది.

ధమిఞ్చిన—ధర్మవరము శాసనము,

వెల్వరించిన— యుద్ధమల్లుని బెజవాడ శాస
నమయించిన— ధర్మవర శాసనము. నెల్లూరు జిల్లా శాస. పు. 968
కారంచేడు— రెండవఅమ్మరాజు వేమలూర్పాడు శాస.
అణ్మణఙ్గూరు— Do.
మణ్డిమొఙ్కచిన్త— రెండవ తాళుని సిరిపుర తామ్ర శాస
బింకముడిపె— చాళుక్య భీముని ధర్మవర శాసనము.
త్రిభువనాంకుశబాణ— అద్దంకి శాసనము
గుణ్ట— రెండవ అమ్మరాజు తాడికొండ శాస.
చూంటూరి— .. మచిలీపట్టణ శాస
మంటపంబును— ధర్మవరి శాసనము.
కోమ్పళు— మొదటి జయసింహుని పెదవేఁగి తామ్ర శాస
కమ్పరి గుట్ట— రెండవ అమ్మరాజు కలుచుంబఱ్ఱు శాస
పట్టంబు— అద్దంకి శాస.
అమరలోకమ్బ్రెఙ్గ— నాగవూటి కాల్వ శాస. S I I X 624
పెద్దచిన్త— రెండవ తాళుని సిరిపుర తామ్ర శాస.
ఇన్దు బృన్దంబు— యుద్ధమల్లుని బెజవాడ శాస
మేణ్మామ్బ విజయాదిత్యనన్దనో— రెండవ చాళుక్య భీముని మచిలీపట్టణ తామ్ర శాసనము
ఇన్దనీచెఱువు— రెండవ అమ్మరాజు మచిలీపట్టణ తామ్ర శాస.
చింతూరోప్పియస్య— రెండవ విష్ణువర్ధనుని రేయూరు శాస.
హోంకాల పూణ్డి— Do.
సిన్తెల, ఉణ్డం గాంతురు— ఏదువాదల పాలెపు శాస

అనుస్వారము దేశీయ పదములలో ననునాసికాక్షర రూపమునను దత్సమ పదములలో బిందు రూపమునను వ్రాయఁబడుచుండె నని చెప్పుటకుఁ గూడ నవకాశము లేదు. పై యుదాహరణములను బట్టి చూడ రెండు రకములైన పదము లందును రెండు విధములైన పద్ధతులను గానవచ్చుట తెల్లమగును. ఒక్కడ కారమునకు వెనుకనున్న యనుస్వారము మాత్రము అను నాసికాక్షర రూపముననే గోచ

రించుచున్నది. పండరంగని ధర్మవర శాసనమున (నెల్లూరుజిల్లా శాస. పుట 968) పన్చిన అనియు, అద్దంకి శాసనమున బణ్చిన అనియు చకారమునకుఁ బూర్వము దంత్యమూర్ధన్యాను నాసికములతోఁ గూడిన రూపములు కానఁబడు చున్నవి. ఈ పదము నిప్పుడు మనము పంచిన అని పూర్ణానుస్వారము తోడనే వ్రాయు చున్నాము పెన్నాఱు యందలి పెనుశబ్దము వందువలెనే పన్చు ధాతువునకు మూల రూపమైన పణ్ ధాతువు నందలి ణ కారమును అనుస్వార ధ్వని కాక సహజాను నాసికాక్షరమై యుండుటయే యిందుకుఁ గారణమై యుండును.

నన్నయకుఁ బూర్వ మీ విధముగా ననుస్వారము వర్గ పంచమాక్షర రూపమునను బిందు రూపముననుగూడ వ్రాయఁబడుచుండఁగా నాతని తరువాతఁ గ్రమముగా బిందువు వాడుక యధికమై వర్గ పంచమాక్షర ప్రయోగము తగ్గి పోయినది.

కూంచు పరియె పోల్చం గాంత లెందు - సోమలదేవి శాస. క్రీ. శ. 1065

ముందటం గదు ఘనతరముగ మండప మెత్తించె - వనపతి
దీర్ఘాసి శాసనము క్రీ. శ. 1075.

బన్ధు మిత్ర జనతామణి గొంక్క నరేంద్రు మంత్రి ప్రోత్సారిత
కొమ్మ్మాసాని అమరావతి శాస క్రీ. శ. 1108.

పరమహీశులు భక్తులై బంప్పం బనులు సేయుచుండ
మండలిక భీమన శాస. 1124.

ఆచంద్రార్కాఱముగా నడపం గలవారు-గోకర్ణదేవుని శిలాశాస. క్రీ శ. 1127.

పేమ్మిఁఱతోడం గరము ధమ్మవు గాంగ నఖండ దీప మఖిల మండవముగ.
S I. I. VI 645.

ఉవికిం జతుస్సీమములునుం, తోణ్ట S I. I VI 1016 క్రీ. శ. 1085.

దేవరకుంబెట్టిన, సరింప్పంగలవారు, బోయంగ్గల వణ్డు
క్రీ. శ. 1080 S I I. V 68.

సంధ్ధి విగ్రహిదణ్డనాయక; రెడ్డు; రెంజికి, పోయంగ్గల వాండు
క్రీ. శ. 1095 S I. I. V 68.

క్రమముగాఁ బూర్ణబిందువు తరువాత ద్విత్వాక్షరము వ్రాయు నాచారము ప్రబల మయ్యెను. నేఁడు మన మర్ధానుస్వార ముంచుచోట్లను, దేల్చి పల్క వలసిన చోట్లను గూడఁ బూర్ణబిందువే వ్రాయఁబడును గాని యట్టియెడఁ దరువాతి హల్లు ద్విత్వ యుక్తముగా వ్రాయఁబడదు. అనుస్వారమును వర్గానునాసికముతో వ్రాయు పద్ధతికూడ నన్నయ తరువాత లేకపోలే దనుటకుఁ బై యుదాహరణములే సాక్ష్యము. చాళుక్య యుగము నందలి శాసనములలో ననుస్వారమును బిందువుగా వ్రాసి తరువాతి హల్లును ద్విత్వ యుక్తముగా వ్రాయు సంప్రదాయము మూఁడు నాలుగుచోట్లఁ గనఁబడు చున్నది

మహాపాతక పంయ్యుక్తున్నగు - చోళ మహారాజా ఇందుకూరు శాస

బెడంగ్గరాజా - ఏడువాడలపాలెపు శాసనము.

వేంగ్గి మణ్డలమ్ - త్రిక లింగ్గాటవి - మొదటి అమ్మరాజు

మచిలీపట్టణ తామ్రశాసనము.

అను నాసికాక్షరముతో నంయుక్తమై యున్నప్పటి ఊనికను ( Stress ) విల్పుటకే బహుశః బిందువు తరువాతి హల్లును ద్విత్వయుక్తముగా వ్రాయు నాచార మేర్పడి యుండును. వర్గ పంచమాక్షరమునకు వర్గాక్షరత్వమును నాసిక్యమును గూడ సమాన ధర్మము లనియు నందు నాసిక్య మనుస్వార రూపమును బొందఁగా వర్గాక్షర ధర్మము తరువాతి హల్లురూపమును బొంది దానితోఁగూడి ద్విత్వముగా వ్రాయఁబడుచున్న దనియు ఆంధ్రభాషా వికాసము 366వ పుటలోఁ దెల్పఁబడి యున్నది.

పద్య శాసనములలోఁ బ్రథమావిభక్తి ము ప్రత్యయము బిందుపూర్వక బు వర్ణముగా వ్రాయఁబడిన కొన్నిచోట్ల యథాస్థితముగా గురు లఘు నిర్దేశము చేసి చూచినచో గణభంగము చేకూరుచున్నది.

అద్దంకి శాసనము.

బలగర్వంబొప్పగ - కొట్టంబుల్ వణ్డెణ్డు

చాళుక్యభీముని ధర్మవరంశాసనము.

భూలోకం బెఱుంగ.

యుద్ధమల్లుని బెజవాడ శాసనము.

నెగి దీచ్చెఁ మరంబు, ఫలంబు పేకించిన; మరంబునుం గాత్రిఁ కేయునకు: క్రిమంబున దానిక కలశ.

ఇట్టిచోట్ల నా పూర్ణానుస్వారమును దేల్చి యది లేనట్లే పలుక వలయును. పూర్వపు వ్రాఁతలలో నఱసున్న వ్రాయునాచారము లేదని యిదివఱకుఁ జెప్పఁబడినది. దాని స్థానమునఁ గొన్నిచోట్లఁ బూర్ణ బిందువును వర్గాను నాసికాక్షరమును వ్రాయఁబడి యున్నవి అట్టి యెడలఁ గూడ నాపూర్ణబిందువునో వర్గానునాసి కాక్షరమునో తేల్చి పలుక వలయును. లేనిచో గణభంగము కలుగును. కొన్నిచోట్ల ద్రుత ప్రకృతికములకు బదులుగావచ్చు నర్ధ బిందువు శాసనములలో వదలివేయఁ బడినది.

| శాసనము | పూర్ణబిందువు వ్రాయఁబడినచోట్లు | వర్గానునాసికము వ్రాయఁబడినచోట్లు | విడిచిపెట్టఁబడినచోట్లు |
|---|---|---|---|
| అద్దంకి శాస. | ప్రథమం బందరం గుం<br>బణ్చిన.<br>వేంగినాణ్డంగొఅల్చియ | | బలగర్వం<br>బొప్పగబై<br>లేచి |
| చాళుక్య భీముని<br>ధర్మవర శాసనము | ఎల్లనెఱుంగ<br>వెన్నాఁడిలోం జూపె. దఱెనాండు<br>లోక మెఱుంగ. పన్చినంబణ్డరంగ | | |
| యుద్ధమల్లుని<br>బెజవాడ శాసనము. | బెజవాడంగొమరు 7<br>నలియంబై వారల 18<br>దీవింజేంబ్రోలు 29<br>బెడంగును 38<br>దానుంగట్టించెంగ్రమం<br>బున 40, 41<br>ధర్మవొదంబడి | మల్లుణ్డనవద్య 3<br>ఓక్కుత్తై 7<br>ధాముణ్డెత్తిశ్చె 9<br>సుతుణ్డొణ్డు 24<br>మల్లణ్డెత్తిశ్చె 28<br>మల్లుణ్డెత్తించె 43 | విడిసిన<br>త్రోల్లిగల<br>చేట్బోల<br>పాపంబుగాగ |
| జయసింహ వల్లభుని<br>విప్పర్ల శాసనము. | | | నాకుబణి<br>సేసిన |
| పండరంగని ధర్మవర<br>శాసనము. | | కార్త్తికేయుణ్డు<br>బోలె | |
| నందంపూఁడి శాస. | | పెద్దపూణ్డి | |

| | | |
|---|---|---|
| కామసానిగూడూరు శాసనము. | వెన్నుండనుసంభ | చనినబొరంటి |
| | వుండయ్యేనతి | ఉద్దిగ్రితముగ్ర |
| | ప్రసిద్ధుండై | జంపి |
| | వెన్నుండు వైన్నుండవోలె | వల్లభుబిన్నవాని |
| | ఘనుండగు భీముండో | పరగంగజే త |
| | ఘస్మరుండై | బట్టి |
| | భూషణుండెట్టి | నాయకుజంపి |
| | నరేంద్రుండుత్తమ | |
| | బంధుజన సేవ్యుండు | |
| | సూరండవ్వేలుపు | |

బెజవాడ యుద్ధమల్లుని శాసనమున మొదటి పద్యము చివర ఏడవ పంక్తిలో అర్థిఁ అనుపదము తరువాత ద్రుతము వ్రాయఁబడినది దానిని గూడ లేనట్లే పరిగణింప వలయును. లేనిచో గణభంగ మగును. అర్థస్ఫూర్తికై యదియట్లు వ్రాయఁబడియుండును. 38వ పంక్తి చివర గాను అను పదమున్నది దానితరువాత నచ్చట సముచ్చయార్థముండవలసిన యక్కుఱ కనఁబడదు. అయినను 39వ పంక్తి "న్దమ తాత (గాను న్దమ తాత) యని యారంభించు చున్నది గాను ద్రుతప్రకృతికమూ కాఁబట్టి తరువాతి 'త' 'ద' గా మాఱవచ్చును. అచ్చట నఱసున్నగాని బిందుసున్నగాని ద్రుతముగాని యుండవలసిన యావ శ్యకము లేకపోయినను వకార మెందుకు వ్రాయఁబడినదో తెలియదు 46 వ పంక్తిలో నృపులకున్ద అనుచోట ద్రుతము బిందువుగా మాఱక ప్రకృతిభావ ముతో (స్వత్వ రూపముతో) వ్రాయఁబడినది. నందంపూఁడి శాసనములో సరిహద్దులను జెప్పు సందర్భమున 'ఇయ్యూరియుం' అని పెక్కుచోట్ల సముచ్చ యార్థకము చివర బిందువు కనవచ్చుచున్నది. 87 వ పంక్తిలో మాత్రము ఇయ్యూరియు బిల్లెమ పెద్దపూణ్డి యని నిర్బిందుకమైన రూప మున్నది ఇది లేఖక ప్రమాదజనితమై యుండును.

రెండవ అమ్మరాజు మచిలీపట్టణ తామ్ర శాసనమున (క్రీ. శ. 10) 58 వ పంక్తిలో జూంటూరియుం ముయ్య ల్కుట్టున అనియు, 61 వ పంక్తిలో కోడగాడిఱిపత్తియుం (వలివేరియుంము) య్యల్కుట్టున అనియు సముచ్చ

యార్థకముల చివరఁ బరుష సరళేతరములైన యక్షరములు (మ, వ) పరమై వప్పుడు కూడ బిందువులు కనవచ్చుచున్నవి. దీనినిబట్టి అప్పుడు (క్రీ శ. 10వ శతాబ్ది) సముచ్చయార్థకము ఉమ్, ఉం అను రూపములతో వాడఁబడుచుండె నని తెలియుచున్నది. క్రీ. శ. 649 లో జయసింహవల్లభుఁడు వేయించిన విప్పర్ల శాసనములో ఎవ్వరయ్యును అను నర్థమున ఎవ్వరయ్యుము అను రూప మున్నది. యుద్ధమల్లుని బెజవాడ శిలా శాసనమున 16 - 18 పంక్తులలో పోౢలగల తానపతులును రాజుపట్టంబు గట్టిన పతియు నలియంబయ్యారల అనియు, 38 వ పంక్తిలో బెడంగును గళయుంగాను అనియు, 40 వ పంక్తిలో తానుం గట్టించె అనియు సముచ్చయార్థకము ద్రుతాంతముగానే కనఁబడు చున్నది. క్రీ. శ. 1000 ప్రాంతము నందలి కామసాని గూడూరు శాసనమున మొగడుపల్లియు పంద్రడునేలు అనియు, బోతి పాదునుం మేలుగ అనియు సముచ్చయార్థకములతోఁ గూడిన రెండు రూపములు వ్రాయఁబడినవి ఇందు మొదటిదాని చివరఁ మకారముకాని ద్రుతముకాని కానవచ్చుట లేదు. అదియందు ఉ అను రూపముతో నున్నది. దీని తరువాత వచ్చిన ప సరళత్వము పొంద లేదు. స్థిరము పరమైనను రెండవదాని చివరఁ బిందువు కన వచ్చుచుండుటచే సముచ్చయమప్పుడు కూడ ఉం అను రూపముతో నుండెనని తోఁచుచున్నది. క్రీ. శ. 10వ శతాబ్ది పూర్వార్ధము నందలి బెజవాడ శాసనమున సముచ్చ యము ద్రుతాంతముగా నుండుటయు, నొక శతాబ్ది తరువాత వేయింపఁబడిన గూడూరు శాసనమున నది ఉం అనురూపముతో నుండుటయుఁ జూడ నది యింకను బూర్తిగా ద్రుతాంతముగా మాఱియుండ లేదనియు రెండు రూపము లును గూడ క్రీ శ. 11వ శతాబ్ది యారంభ కాలమువఱకు వాడుకలో నుండె ననియుఁ జెప్పవచ్చును. రెండవ అమ్మరాజు మచిలీపట్టణ తామ్ర శాసనమున నొకే పంక్తిలో (57) ఆలపత్త్రియుం జూంటూరి యుం ముయ్య ల్కట్టున అను రూపములుండుటచే ఉం లోని బిందువు (మ్) తరువాతఁ గూడఁ బరుష ములకు సరళము లాదేశములగు చుండెనేమోయను సందేహము కలుగుచున్నది. లేదా ఉమ్, ఉన్ అను రూపములు రెండును ఒకే వాక్యమునందు వాడఁబడెనని చెప్పవలయును. (ఆలపత్త్రియుం + చూంటూరి = ఆలపత్త్రియుం జూంటూరి.

వందంపూఁడి శాసనములో నీ సముచ్చయము తరువాతఁ బెక్కుచోట్ల పకారము బకారముగా మాఱినది. (పెద్ద పూఁడియుం బొలగరుసున, వెరపుల యుం బొలగరుసున) నకార మకారములు పరములైనప్పు డా సముచ్చయము చివర ద్రుతముగాని బిందువుగాని కానవచ్చుట లేదు. అనఁగా నిచ్చట స్థిరములు పరములగుటచే ఉన్‌లోని ద్రుతము లోపించిన దన్న మాట.

ఇయ్యూరియు నెరపుల యుంబొలగరుసున
ఇయ్యూరియు వెరపులయు మందరమున యుం బొలగరుసున
ఇయ్యూరియుసుందరమునయు పడకుటిఱియుం బొలగరుసున
ఇయ్యూరియు మడకుటిఱియుం బిల్లమ పెద్ద పూఁడియుం బొలగరుసున

దీనిని బట్టి నన్నయభట్టు తనకుఁ బూర్వము ఉం, ఉమ్, ఉన్ అను రూపములతో నున్న యీ సముచ్చయమును భాషలో ద్రుతాంతముగా స్థిరపఱిచె నని భావింపవచ్చును. ఏడువాడల పాలెపుశాసనమున (రాజరాజనరేంద్ర ప. సం. పుట 187) మానమ్మం న అను రూపమున్నది. ప్రథమా విభక్తి ము వర్ణమును బూర్వము బు, ంబు, మ్బు, మ్మ, ము అను రూపములతో వ్రాయుచుండిరి. అందు మ్మ తరువాత మరల బిందువు వ్రాయవలసిన యక్కఱలేదు అందుచే నిది ప్రమాద పతితమై యుండును. లేదా లేఖకుఁడు 'ంబు' అందలి బు వర్ణమును మ్మగా వ్రాసి అనుస్వారమును బరాక్షరముపైఁ జుక్కగా వ్రాయు నాచారమును బట్టి దానిపైఁ జుక్క పెట్టఁగాఁ బాఠకులు మ్మం అని చదివి యుండవచ్చును. య, వ, శ, వర్ణముల వెనుక ననుస్వారము బిందురూపము ననే వ్రాయఁబడి యున్నది.

సంవత్సరంబు - చాళుక్యభీముని ధర్మవర శాస.
అంశే - సర్వలోకాశ్రయుని చందలూరు శాసనము.
అంశ - రెండవ విష్ణువర్ధనుని రేయూరు శాస.
సంయ్యుక్తుస్తు - చోళమహారాజు ఇందుకూరు శాస.

కర్ణాటలాక్షణికుఁడైన కేశిరాజు(క్రీ.శ. 1250) శబ్దము లందలి బిందువులు కొన్ని నిత్యములనియుఁ గొన్ని వైకల్పికము లనియుఁ జెప్పెను. నిత్యములైన బిందువు లెప్పుడును బూర్ణానుస్వారములుగానే వ్రాయఁబడు చుండును.

ఉదా. తోఁటం, వేంబె, కుసుంబె, కుంబె, తుంబిలు. వికల్పము లైనచోట నవి పూర్ణబిందువులుగా వ్రాయఁబడుటయో లోపించుటయో జరుగుచుండును.[1] ఉదా కదపు - కదంపు, జినుగు - జినుంగు. అంతేకాని యం దర్ధానుస్వారము యొక్క ప్రయోగ మెచ్చటను గానరాదు. ప్రాచీన కర్ణాట శాసనములలో ననుస్వారములను బూర్ణబిందువులుగా వ్రాయుటయు వర్గ పంచమాక్షరములుగా వ్రాయుటయుఁ గూడఁ గానఁబడుచుండును

సురచాపం బోలె విద్యుల్లత గళతెఱవోల్ మంజువోల్ తేఱవేoం
పత్వన్ సంది సేప ప్రవరమునివరన్ దేపలో కక్కె సగ్గా.
క్రీ శ. 8 వ శతాబ్ది శ్రావణ బెళ్గొళ Ep. C. II. 88

చాళుక్యయుగమునందలి శాసనములలో సాధురేఫ సంశ్లిష్టములైన యక్షరములనువ్రాయుపద్ధతికూడ ద్వైవిధ్యమును దాల్చియున్నది. మనమిప్పుడు వ్రాయునట్లు సంయుక్తాక్షరములోఁ బూర్వాంగమును రకారముగా వ్రాసి దానిక్రింద మఱొక హల్లు చిహ్నమును వ్రాయుట యొక పద్ధతి. ఉత్తరాంగమైన హల్లును ద్విత్వరూపమున వ్రాసి దానిప్రక్క వలపలిగిలుక నుంచుట రెండవ పద్ధతి. కాలక్రమమున హల్లునకు ద్విత్వము కల్పించుట మాని అద్విరుక్తమైన హల్లు ప్రక్కనే వలపలిగిలుక వ్రాయు పద్ధతి యేర్పడినది. ఈ రెండు పద్ధతులను శాసనములలోఁ గనఁబడుచున్నవి. కాని యందు రెండవ పద్ధతికే ప్రాచుర్య మెక్కువగా నున్నది. ఇప్పటికివి దాటాకుల వ్రాఁతలందును వృద్ధుల వ్రాఁతలందును ఈ పద్ధతి కనఁబడుచునే యుండును

కొచ్చియపాటరేవశమ్మారికి - చోళమహారాజు ఇందుకూరి శాసనము
అతిశయ రట్టకూట నర్కుపు - వెలుదుర్తి శాస,
మాసపూణ్ణమి - „
పాలశమ్మారికి - „

---

[1] కెలవు నిజబిందుగళ్ కెల కెలవు వికల్పార్ధ బిందుగళ్ — శబ్దమణిదర్పణమున సంజ్ఞా ప్రకరణము. 26 వ సూత్ర వికల్పార్థబిందుగళ్ అనఁగా వికల్పమైన యర్థబిందువు గలవని చెప్పవచ్చునుగాని దాని కందుఁడీకలో వికల్పదిం సబిందుక మబిందుక మాగిరప్పు అని యర్థము స్పష్టము చేయఁబడినది.

చిర్పులియ పటుకాను - తిప్పలూరు శాస.

తక్కర్ వొల పాఱదాయ ,,

కట్టి శమ్మర్డు - ,,

తిప్పలూర పనాస - ,,

కొణ్డ కార్త్తియ ,,

ప్రవర్ద్ధమాన - రామేశ్వర స్తంభ శాస.

ఆచన్ద్రార్క్కంబు - చిలంకూరిశాస.

పూర్వ్వము - ,,

ప్రవర్త్తిల్లన్ - చామయూరి శాస.

తూర్ప్పున - సత్యాదిత్యుని మాలెపాడు శాస.

సమర్త్థుణ్డవి - ధర్మవర శాస.

కార్త్తికేయుణ్డుబోలె - ,,

కట్టెపు దుర్గంబు - అద్దంకి శాస

కణ్డుకు ర్బెజవాడ - ,,

కీర్త్తి (3) యుద్ధమల్లుని బెజవాడ శాస.

నెగిదీర్చె మరంబు

వేవుర్గ్గవిలల - చోడమహారాజు సూర్యగ్రహణకాల శాస. S I I V ౫౯౫.

ఎవ్వోర్క పున్నమ

వర్షంబు - సంగమేశ్వర దేవాలయ శాస.

పూర్వ్వతః - రెండవ అమ్మరాజు కలుచుంబఱ్ఱు శాస.

సకవర్షమ్మ - ఉప్పరపల్లి సమీపమునందలి శాస. S. I I. X 636

సూర్య్యగ్రహన - రేమయ్యశాస. S. I. I. X 593.

అచంద్రార్క్కస్తాఇ

సమర్ప్పణ, కర్ణ్ణాటక A D 1563. S I I VI 698.

అచ్ఛి, అజ్జ, అయ్య, అయ.

సంస్కృతములోఁ బూజ్యార్థమున నామముల చివర వాడఁబడు నార్య శబ్దము కొన్ని ప్రాకృత శాసనములలో అజ్జ అను రూపమును బొందినదని యిదివఱకుఁ జెప్పఁబడినది (దామోదర వర్మ మట్టేపాడు శాసనము) ఈ అజ్జ అనునది తరువాత అయ్య, అయ అను రూపములతోఁ గనఁబడుచున్నది.

దినకరయ్య - అహదనకర శాస.
అయ్య పయ్య—ధర్మవర శాస.
రేమయ్య—S I I X 593
నల్లజెరెయ కొడుకు—కొఱవి శాస.
ఈ అయ్య అనుదానికిఁ బూజ్యార్థమున మరల అర్ ఆర్ అనురూపములు చేర్పఁబడెననుట కీ క్రింది పదములు దృష్టాంతములు.
రేమయ్యరు S I I X 593
పొట్టియారు—నల్ల చెఱువుపల్లి శాస.
బణ్డయారు—అగస్త్యేశ్వర దేవాలయము నెం 400 A.
అయ్య అను శబ్దము లేనిచోటఁగూడఁ బూజ్యార్థమున అర్ అను ప్రత్యయము వాడఁబడినది.

పాంకమ్మాఙరికి—వెలుదుర్తి శాస.
రేవకమ్మాఙరికి—ఇందులూరి శాస.
ఇరకమ్మారికి—దిమ్మగుడి శాస.

కాలు, కాళ్లు అనునవి పూజ్యార్థమున వాడఁబడు చుండెనని యిదివఱకుఁ జెప్పఁబడినది (రేవణకాలు, పుద్దణకాలు—పొట్లదుర్తి మాలెపాడు శాసనము). పాంతేగారికి అనుచోట నిప్పటివలె గారను పదముగూడఁ బూజ్యార్థమున వాడఁబడి యున్నది.

సంస్కృత భట్ట శబ్దమునకు భట్టార, భట్టారక అనురూపాంతరములు కనవచ్చు చున్నవి. ఈ ఆర (భట్ట + ఆర) అనునది ఆర్య శబ్దము నుండి కలిగినదే కావచ్చును. చాళుక్య యుగము నందలి పెక్కు శాసనములలో భటారకకున్ (దిమ్మగుడి శాస.) అను దానికి వివిధ రూపములు వాడఁబడియున్నవి. ఆ ఆరకు మరలఁ బూజ్యార్థమున బహు వచన ప్రత్యయమైన ళు కూడఁ జేర్పఁబడుట కలదు,

పై అరయే తెలుఁగునఁ బూజ్యార్థమున వాడఁబడి యుండును లేదా యది వారు శబ్దము నందలి వ లోపింపఁగా మిగిలిన రూపము కావచ్చును.

బహువచన ప్రత్యయము.

తమిళ కన్నడములందిప్పటికిని కళ్ అనునదే బహువచన ప్రత్యయముగా నిల్చి యున్నది తెలుఁగున నిది మొదట ళ్, ళు అను రూపములుగా మాఱి క్రీ. శ. 9వ శతాబ్ది నాఁటికి లు అను రూపముగా స్థిరపడి, యప్పటి నుండి యట్లే వాడఁబడుచున్నది. ఇది బహుశః కల్, కళ్ (to go or pass beyond) అను మూలధాతువు నుండి యేర్పడి యుండును. మొదటవిది జడవాచక నామ వాచకములకుఁ జివర మాత్రమే వాడఁబడి తరువాతఁ గ్రమముగా నన్ని నామవాచకముల చివరను వాడఁబడుచు వచ్చెను. క్రీ శ. 6వ శతాబ్ది యందలి చిక్కుళ్ల తామ్ర శాసనమునందలి విజయ రాజ్య సంవత్సరంబుళ్ అను పదములో మొట్ట మొదటఁ దెలుఁగు బహువచన ప్రత్యయము కనవచ్చుచున్నది. కళ్ ప్రత్యయమే అనుచిత విభాగముచే మొదట ళ్ ళు అను ప్రత్యయములుగాను బిమ్మట లు అను దానిగాను మాఱెనని యిది వఱకుఁ జెప్పఁబడినది. సంవత్సరమువంటి తత్సమ పదము తరువాతఁ గూడ నిది ళ్ అను రూపముతోఁ గానవచ్చుటచే నప్పటికే యీ యనుచిత విభాగము జరిగి యుండునని యూహింప వచ్చును.

సంస్కృతమున ఏక, ద్వి, బహు వచనములను మూఁడు వచనము లున్నవి. ద్రావిడ భాషలలో ద్వి వచనము తప్ప మిగిలిన వచనములు రెండే యున్నవి 'నామ్' 'మనము' అను ద్వి వచన రూపములందుఁ దరువాత నేర్పడినవిగాఁ దోఁచు చున్నది. అవియైన పొక్క యుత్తమ పురుషమందే కలవు. పురుష సర్వనామములలో మొదట మ్ అనునదే బహువచనమును సూచించుచుండెను. నాన్ – నామ్; నీన్ - నీమ్, తాన్ - తామ్. ఇది బహుశః ఉమ్ అనెడు పూర్వసముచ్చయ రూపముయొక్క యవశిష్ట చిహ్నమై యుండవచ్చు నని డా. కాల్డ్వెల్‌గా రభిప్రాయపడి యుండిరి. అదే నిజమై యుండినచో నేను + (ఉ)మ్ = నేనుమ్ అనునది నేనును అను సముచ్చ యార్థమునే యొసంగునుగాని బహువచనమును సూచించుట యెట్లు సంభవించును ? అందుచే ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారు తెల్పినట్లు నాన్, యాన్, నేన్, ఏన్, అవన్ ఇత్యాది నకారాంత శబ్దములందలి నకార

మేకవచన బోధకమై యుండఁగా బహువచన నిర్దేశము చేయుటకు వర్ణాంతర మైన మకారము చేకొనఁబడి యుండు ననియుఁ ననునాసికములలో సులభ తరోచ్చారణము గల నకార మకారములలో నొకటి యేకవచన బోధకముగాను మరొకటి బహువచన బోధకముగాను గుదురుకొని యుండు ననియు, బహు వచన మందలి మకారమే తరువాత నైకతా సూచకమైన సముచ్చయార్థకమునఁ గూడ వాడఁబడి యుండు ననియుఁ దలంచుట యుక్తముగా నుండును. అవన్ - అవర్, నీన్ - నీర్, తాన్ - తార్ అను రూపములనుబట్టి తరువాత ద్రావిడభాషలలో ర్ అనునది బహువచన సూచక ప్రత్యయముగా గ్రహింపఁ బడినట్లు తెలియుచున్నది. ఇది రెండు అను నర్థముగల ఇర్ అను సంఖ్యా వాచకము యొక్క యవశేషము కావచ్చును. ఉత్తమపురుష సర్వనామము లలోమాత్ర మీ ర్ కనిపింపదు నాన్ - నామ్. అమహద్వాచక ప్రథమపురుష సర్వనామ బహువచన రూపమున మ్ కు బదులు వ్ అనునది కానవచ్చు చున్నది. 'అవి'. ర్ అనునది కళ్ కంటెఁ గూడఁ బూర్వతర రూపముగా గోచరించుచున్నది. అదంత దీర్ఘ పూర్వలోపధములకు బహువచనమున వచ్చు ప్రత్యయమిదే బహువచన లకారమునకు రేఫమగునని వైయాకరణులు చెప్పు పద్ధతి చరిత్ర విరుద్ధమైనది. మలినురై ఇయ్యోట్టు అ స్ప్రి అను చోట రు అనునది బహువచన ప్రత్యయముగా వాడఁబడినది. (యుద్ధమల్లుని బెజవాడ శాస.) కొన్నిచోట్ల శకటరేఫముకూడ బహువచన ప్రత్యయముగా గానఁబడు చున్నది. అందఱు ఇందఱు, కొందఱు, నిత్యవర్షుని మాలెపాడు శాసనమున (S I I X పుట 0) ఇందొఱును అను రూపమున్నది.

చాళుక్య యుగమునందలి శాసనములలోని కొన్ని బహువచనాంతములును, బహ్వర్థకరూపములు నీక్రింద నొసంగఁ బడుచున్నవి.

| | |
|---|---|
| ముత్తురాజుల్ల | — ఎఱ్ఱగుడిపాడు శాస. |
| పడికాఱుళ | — ,, |
| చోళమహారాజుల్ల | — ఉపటూరు శాస. |
| చోళమహారాజులాకు | — రామేశ్వర స్తంభ శాస. |
| రాజుల్లేళన్ | — ఇందుకూరు శాస. |
| సంవత్సరంబుళ్ యేనగు | — రామేశ్వర స్తంభ శాస. |
| ధేవళమ్మాఱరికిఁ | — వెలుదుర్తి శాస, |

| | |
|---|---|
| పంఖిపొట్టియారు | — వల్లచెఱువుపల్లి శాస |
| గంజిపాఱ మాదియారికి | — ,, |
| శర్మారికిచ్చిన దతి | — చామలూరు శాస. |
| రాజుల్లొ శన | — పొట్లదుర్తి మాలెపాడు శాస. |
| ఉడిపినవారు | — వెలుదుర్తి శాస. |
| బాదెయ్య రట్టొడ్లు | — గుఱ్లు నెం 408-1904 |
| గుఱ్లు ఎత్తిశ్చెరి | — S I I X 598. |
| సోడుశతోద | — బసినకొండ శాస. |
| మహారాజులాఉన్ | — విప్పర్ల శాసనము. |
| రాజుల్ల దేవుళ్ | — విత్పత్తి శాస |
| ప్రితివి పతుల్ల | — ,, |
| వేవురు పఱాను | — మంగిదొగరాజు లక్ష్మిపుర శాస |
| పదేన్దుంబు అడ్లు | — ,, |
| వేగవిశాఉ | — ,, |
| కదువండ్లు | — ,, |
| కొన్దుకళ్ | — అహదన కర శాస. |
| పణికొఉ | — ,, |
| పెర్దళ్ | — ,, |
| ముద్దకంచికొళ్ | — ,, |
| కొరిన్థి కొళ్ | — ,, |
| గొరవళ్మెచ్చి | - విష్ణు వర్ధనమహారాజు బుడమనారాయలపాడు శాస. |
| వేయుగుఱ్లవు | — ,, |
| వెయిగవిలాఉ | — ,, |
| వేవుకన్న్యశను | — ,, |
| భోగంబుల | — కొఅవి శాస. |
| రాజుల్గలరేని | — ,, |
| చెఱువులు | — ,, |
| వేకవిలశాను | — అగస్త్యేశ్వర దేవాలయము నెం 403 |
| భటారశఉన్ | — దిమ్మగుడి శాస. |
| ఇరశమ్మార్ఱరికిన్ | — ,, |

| | | |
|---|---|---|
| పసులాచమ్పిన | — | ఒంగోలుదగ్గఱ విడుమానూఱు శాస. |
| దేవానొజ్జలు | — | గురింద గుంట శాస. |
| వేయిగావిలల | — | ఏడువాడల పాలెపు శాస. |
| వేయి గుళ్లను | — | ,, |
| అఱువది వేలేండ్లు | — | ,, |
| మహారాజులయు | — | వైదుంబ రాజుల శాస. |
| సంవత్సరంబు శిరువాది మూండు | — | విక్రమాదిత్య బలికుల బాణరాజుల శాసనము |
| వేపుర బ్రాహ్మణులను | — | మైలవరము శాస. |
| వేగవిలలను | — | ,, |
| కొట్టంబుల్ | — | అద్దంకి శాస. |
| నృపులకున్ద | — | యుద్ధమల్లుని బెజవాడ శాస. |
| వందగుల్ సనిన | — | కామసాని గూడూరు శాస. |
| శార్లరేవ | — | నందంపూడి శాస. |

ఒక్క అహదనకర శాసనమునఁ దప్ప నింకెక్కడను చాళుక్య యుగము నందలి శాసనములలో కళ్, కొళ్, కొళు అను బహువచన ప్రత్యయములు కానవచ్చుటలేదు. కొండుకళ్ మున్నగు అహదనకర శాసనము నందలి ప్రయోగములలోఁ గర్త కొండుక + ళ్ అను నభిప్రాయముతో వ్రాసెనో, కొండు + కళ్ అను నభిప్రాయముతో వ్రాసెనో తెలియదు. కాని క్రీ. శ. 740 లోని కపిలేశ్వరపుర శాసనమున శకవై శ్రవను కొడుకు అను నేకవచన రూపము వాడఁబడి యున్నది. దీనిని బట్టి కొండుకళ్ అను బహువచనరూపములోని క అనునది ప్రకృతిలోని భాగముగాను, ళ్ అను నది ప్రత్యయముగాను గ్రహింపఁబడినట్లు తోఁచుచున్నది. ఇట్లే విప్పర్తి శాసనమున (E. P 351 of 1905) అడుగు అను నేకవచన రూపము వాడఁబడినది. అది + గళ్ అను దానినుండి అనుచిత విభాగముచే నేర్పడిన రూపమే యిది. ఇదియును చాళుక్య యుగారంభము నాఁటికే కళ్, గళ్ అనువానిలోని కగలు మూలపదములందుఁ జేరి ళ్ అనునదే బహువచన ప్రత్యయముగా నేర్పడెనని సూచించు చున్నది. కాని పణికొళు, ముద్దకళ్చికొళు (అహదనకర శాస.) అను పదములందలి కొళు, కళు అనుదాని రూపాంతరమే యగుటచే

నప్పటి కింకను కళ్, కళు అను ప్రాచీన ప్రత్యయములకుఁ గూడ విశే ప్రయోగము కలదని చెప్పనగును. రేవణకాలు, కుడ్డి కాళ్లు మొదలగు పదములందలి కాలు, కాళ్లు అనునవి సంస్కృతము నందలి పాదశబ్దము వంటివేయని యిదివఱకుఁ జెప్పఁబడినది. ఇవి కళ్ అను పూర్వబహువచన ప్రత్యయము యొక్క రూపాంతరములే అని చెప్పినను అసమంజసముగా నుండదు క్రీ. శ. 7, 8 శతాబ్దు లందలి మిగిలిన శాసనములలో ళ్, ళు అనునవే బహువచన ప్రత్యయములుగాఁ గనవచ్చు చున్నవి. కొఱవి శాసనమున చెఱువులు, రాజుల్గల రేని అను రూపములలో ల్, లు అనునవి బహువచన ప్రత్యయములుగా నున్నవి క్రమముగా నివియే భాషలో బహువచన ప్రత్యయములుగా స్థిరపడి పోయినవి

జయసింహ వల్లభుని విప్పర్తి శాసనమున (S I I VI 585) గుడ్లు అను రూపమును ఏడువాడలపాలెపు శాసనమున వేయిగుళ్లను అను రూపమును గానవచ్చు చున్నవి. గుడి + లు = గుడులు ఉకార లోపముచే గుడ్లు అను రూప మేర్పడినది. దకారము లఘు ళకారంబుగా మాఱి నప్పుడు గుళ్లు అను రూపము కలుగును. చాళుక్య యుగము నందలి శాసనములలో డ్లు ళ్ళు వర్ణాంతము లైన రూపములు రెండును గానవచ్చు చున్నవి కాని డ్లు వర్ణాంతములైన వాని సంఖ్యయే హెచ్చు. నన్నయ డ్లు వర్ణాంత రూపములనే సాధించెననియు నేఁటి ముద్రిత భారత ప్రతులలోఁగల ళ్లు వర్ణాంత రూపములు నన్నయ యంగీకరించి నట్లు నిరూపించుట కష్టమనియు, చింతామణిలోని డలటాముదితాంతస్య చవాలక్ అను సూత్రమున త్రాడులు, త్రాడ్లు అను రూపములే సాధింపఁ బడినవనియుఁ జింతామణి విషయ పరిశోధనమున నిరూపింపఁబడినది. (విష 33, 34 పుట 33 34, 35) నన్నయ తరువాతి కాలపు శాసనములలోఁ గూడ డ్లు వర్ణాంత రూపములు కానవచ్చుచున్నవి.

పెక్కు గుడ్లు విల్పి క్రీ. శ. 1146 (S. I I. Vol IV. 749).
వంజాడ్లు, ఎంగిడ్లెత్తి, పీడ్లు తెచ్చు (1084. S I I Vol IV. 1015).
కాహడ్లు క్రీ. శ. 1140 (S I. I Vol. IV నెం. 675).[1]

---

1. నన్నయ కావ్యకర్తగాఁ గల మండ గ్రామ శాసనమున మూర అనుటకు మూడ్లు అను రూప మున్నది గృహ క్షేత్రమున మూడ్లు నలువది,

తరువాత( గ్రమముగా ళ్లు వర్ణాంత రూపములకే ప్రాచుర్య మధికమైనది. కాలు + లు; కాల్లు: కాళ్ళు. ఈ విధముగా కాళ్ళు అనునదే బహువచన రూపమైనను మరల దానిపై బహువచన రూప మొక్కచో( జేర్ప(బడినది.

కొణ్డి కాళ్ల శ ఇచ్చిన పన్నస - ఎఱ్ఱగుడిపాడు శాస.
వేగుళ్లు శను ఇలపకుఱ్ఱు శాసనము S I. I X 35.

ఇట్లు బహువచన ప్రత్యయముపై మఱియొక బహువచన ప్రత్యయము చేరుట సంస్కృతమున సైతము వేదకాలము నుండియు( గలదని ప్రయోగ ములను బట్టి శాస్త్రజ్ఞులు నిర్ణయించి యున్నారు. దేవాస్ అను బహువచన రూపమునకు మరల అస్ అను బహువచన ప్రత్యయము చేర(గా దేవాసః అను రూప మేర్పడిన ద(ట।

పూజ్యార్థమున బహువచన ప్రత్యయము చేరుట ప్రాచీనకాలమునుండియు( గనవచ్చు చున్నది. రెండు మూ(డు శాసనములలో రాజు శబ్దమునకు( బూజ్యార్థమున ల్లు, ళ్లు అనునవి వాడ(బడినవి.

ఎఱికల్ముత్తు రాజుల్ల కుండికాళ్ల —> ఎఱ్ఱగుడిపాడు శాస.
(క్రీ. శ. 6 చివర).

చోళమహారాజుళ్లు } చోళమహారాజు ఉరుటూరు శాస.
తుగరాజళ్లు ఇచ్చిన } (క్రీ. శ. 7 వ శతాబ్ది చివర).
చోళమహారాజు ల్లేళన్ — చోళమహారాజు ఇందుకూరు శాస.
రాజు ల్లొళన — పొట్లదుర్తి మాలెపాడు శాస.

ఇట్టిచోట్ల ళు, లు అనునవి బహువచన ప్రత్యయము లనియు వానిపై మరల లు అను బహువచన ప్రత్యయము చేర(గా ళ్లు, ల్లు అను వంతరూపము లేర్పడిన వనియు( జెప్పవచ్చును.

రట్టొడి, రట్టగుడి శబ్దములకు రట్టొడ్లు - రట్టొళ్లు: రటగుడ్ను - రటగుళ్లు అను నవి బహువచనరూపములు.

రట్టొడ్లు అను దానిలోని డకారము ళకారముగా మాఱ(గా రట్టొళ్లు అను రూపమేర్పడినది. దీనినుండి యొక్కచో రట్టొళి యను నేకవచన రూపము కల్పింప(బడినది. (రట్టొళి యిచ్చినది. ఒంగోలు దగ్గఱనున్న నిడుమానూరు శాస.)

ఊరునకు ఊళ్లు, ఊఢ్లు అను బహువచన రూపములు కన(బడుచున్నవి.

ఊఢ్లందు (జయసింహవల్లభుని విప్పర్తి శాస. S I I Vol. VI 585)

పాన్ఠూళ్లు (సత్యాదిత్యుని మాలెపాడు శాసనము.)

బహువచన ప్రత్యయము పరమైనపుడు కొన్నిచోట్ల పూర్వాచ్చునకు దీర్ఘము వ్రాయ(బడినది.

వేగవిళాళు — లక్ష్మీపుర శాసనము.

వెయిగవిలాళు — విష్ణువర్ధన మహారాజు బుదమ నారాయలపాడు శాస బహుశః ఇది లేఖక ప్రమాదము కావచ్చును.

పాఱశబ్దము వేఱు బహువచన ప్రత్యయము లేకుండనే బహువచనమున వాడ(బడినది.

వేవురు పఱాను — లక్ష్మీపుర శాసనము.

వేవురు పాఱజమ్మిన — రామేశ్వర స్తంభశాస.

ద్విగుసమాసము పెక్కుచోట్ల నేకవచనాంతముగానే కన(బడుచున్నది.

పదేన్డుంబు — లక్ష్మీపుర శాసనము.

మున్నూఱునేల — రామేశ్వర స్తంభ శాస.

ప్రథమపురుష బహువచనమున వారు అను సర్వనామ రూపము కన(బడు చున్నది. వాణ్డు అనుదానికిది బహువచనము. ఇది క్రీ. శ. 7 వ శతాబ్ది నుండియు శాసనములలోఁ గానవచ్చుచున్నది.

దీని కాచి కుడిపిన వారు — వెలదుర్తి శాస.

వట్టంబున వారికి — రామేశ్వర స్తంభ శాస.

వే శబ్దమునకు వేయి యనునది రూపాంతరము. దీనికి శాసనములలో వేళు అనునది బహువచన రూపముగా వాడ(బడినది; ఇది వేయికే బహువచన రూపమైనచో ఱాయి, రేయి అనువాని యందు వలె బహువచన ప్రత్యయము పరమైనప్పు డంత్యాక్షరము లోపించినదని చెప్పవలెను.

లింగము :

సంస్కృతమున లింగమర్థముతో సంబంధించి యుండక శబ్దముపైనే యాధారపడి యుండును. పదాంతములఁ జేర్ప(బడు విభక్తి ప్రత్యయములఁ జూడ(గనే యర్థము తెలియకపోయినను అందు లింగమును గను(గొన వచ్చును.

ద్రావిడభాషా పదములలోఁ దొలుఁదొల్త నీ లింగభేదము లేనట్లే కనఁబడును. అర్థమును బట్టియే యందు లింగభేదమును నిర్ణయించుకొనవలెను పదముల రూపమునుబట్టి యిది తెలిసికొనుట కష్టము. తల్లి, తండ్రి, అన్న, అక్క, చిలుక, ఏనుఁగు, చెట్టు మొదలగువానిలో లింగభేదమును దెలుపు గుర్తు లేమియును లేవు. తుద, కోట యను ననాగరిక భాషలయందు నేఁటికిని లింగ భేదము లేకుండనే అదమ్ (అది, అమె, వాఁడు) ఇదమ్ (ఇది, ఈమె, వీఁడు) అను పదములు వాడఁ బడుచున్నవని డా. కాల్డ్వెల్ గారు చెప్పి యున్నారు. (పుట. 222) శబ్దమణిదర్పణమున కేశిరాజు కన్నడ మందు లింగ మర్థము నాశ్రయించినదే కాని శబ్దము నాశ్రయించినది కాదని చెప్పి యున్నాఁడు. అందుఁ బురుషవాచక శబ్దములే పుంలింగములు. స్త్రీవాచక ములే స్త్రీలింగములు మిగిలినవి నపుంసక లింగములు. ("పురుషరె పుంలింగం స్త్రీ యరె తాం స్త్రీ లింగ మిఁదువెల్లం నప్పాగిరె నల్గుం కన్నడదోళ్" శ. మ. ద. 91 సూత్ర.). సంస్కృతమున జననీ, జనకః, భ్రాతా, సోదరీ, శుకః, గజః, వృక్షః, మిత్రమ్ మొదలగు రూపములను జూచినంతనే యవి యే లింగమునకుఁ జెందినవో చెప్పవచ్చును. ఈ సంస్కృత ప్రభావముచేతనే కాఁబోలుఁ దరువాత ద్రావిడ భాషలలోఁ గూడ లింగభేదమును సూచించుటకుఁ బ్రయత్నములు చేయఁబడఁ జొచ్చెను. మొదట ఆడు, మగ అనువానిని బదముల ముందు చేర్చుటచే నీ భేదము సూచింపఁబడు చుండెను. ఉదా :- ఆడుపిల్ల; మగ పిల్ల, ఆడుగుఱ్ఱము మగగుఱ్ఱము తరువాత సంస్కృత సామ్యముచే ఆడు, మగ యను నర్థములను సూచించు పదములు శబ్దముల తరువాతనే చేర్పఁబడుచుఁ గ్రమముగా లింగమును సూచించు ప్రత్యయములుగాఁ స్థిరపడినవి. మగన్ = మగబిడ్డ, మగళ్ = ఆడుబిడ్డ, రామన్ (తమి) రాముఁడు (తెలు), ఇల్లాళ్ (తమి) ఇల్లాలు (తెలు). ఈ లింగ భేదము మొట్ట మొదటఁ బ్రథమ పురుష సర్వనామ ములలో సూచింపఁ బడినది. అ, ఇ, ఉ అనువానికి వరుసగా అన్, అళ్, తు అనువానిని జేర్చుటచే నందు పుం స్త్రీ నపుంసక లింగ భేదమును సూచించు రూపము లేర్పడినవి. అవన్, అ + అళ్ = అవళ్; అ + తు = అదు అను పదములిట్లే రూపొందినవి. అన్ అనునది అణ్ అను పూర్వరూపము నుండి యేర్పడి యుండును. దీని నుండియే తెలుఁగున డు అనునది పరిణమించి తరువాతఁ బుంలింగ నామముల ప్రథమా విభక్త్యేక వచనముగా స్థిరపడినది. కాని తమిళ కన్నడములలో వలె నందు స్త్రీ లింగ చిహ్నముగా అళ్ అను ప్రత్యయమును

జేర్చు సంప్రదాయ మధికముగాఁ గానవచ్చుట లేదు. అందు ది (దు) అను మహచ్చిహ్నమే యేకవచనము నందును, అర్ అను పుంలింగ చిహ్నమే బహువచనమందును స్త్రీలింగమును సూచించుచుండును. అది అను మాట యేకవచనమునఁ దిర్యగ్జడములనే కాక స్త్రీని గూడ సూచించును అట్లే అవర్-వారు అనునది పురుషులనే కాక స్త్రీలనుగూడ సూచించును. క్రియా రూపములను వాడు విషయమున సైత మీ పద్ధతియే యనుసరింపఁ బడుచున్న దనుట కీ క్రింది యుదాహరణములు దృష్టాంతములు.

| | |
|---|---|
| వారు (పురుషులు) వెళ్లిరి<br>వారు (స్త్రీలు) వెళ్లిరి | } బహువచనము. |
| వాఁడు వెళ్లినాఁడు | ఏక. |
| ఆమె వెళ్లినది | ,, |
| అది (అమహత్)వెళ్లినది. | ,, |
| అవి (అమహత్) వెళ్లినవి. | బహు. |

దీనిబట్టి బహువచనమున స్త్రీలింగ పుంలింగ రూపములకును ఏకవచనమున స్త్రీలింగ నపుంసక రూపములకును సమానత్వ మున్నట్లు స్పష్టమగుచున్నది. తమిళ కన్నడములలో నిట్లుగాక స్త్రీలింగములకుఁ గూడఁ బ్రత్యేక రూపములున్నవి [1]

అవన్ వన్దాన్ (పుం,) అవళ్ వన్దాళ్ (స్త్రీ) అదువన్దదు (నపుం.).

ఈపరిస్థితిని బరిశీలించి చూడ నీ భాషల చరిత్రలో అది (అదు) అను సర్వనామమే స్త్రీ నపుంసకలింగములు రెంటికిని సమానముగా వాడఁబడు చుండెననియు అళ్ అనునది స్త్రీలింగ ప్రత్యయముగా నేర్పడకముందును అన్ అనునది పుంలింగ ప్రత్యయముగా నేర్పడిన పిమ్మటను దెలుఁగితర ద్రావిడ భాషలనుండి విడివడి యుండెననియుఁ దెల్లమగుచున్నది.

---

1 నామముల తుది నెట్లున్నను క్రియావిభక్తి రూపముల తుదిని అరవము నను, గన్నడమునను మలయాళమునను మహతీవాచకమును నిరూపించుటకు ళ్ అను ప్రత్యయము వాడఁబడుచునే యున్నది.

అం. శా. వి. పుట 424.

ద్రావిడ భాషలకు సంస్కృత భాషతో సన్నిహిత సంబంధ మేర్పడిన పిమ్మటనే అన్ అనునది యందుఁ బ్రథమావిభక్త్యేక వచనమునఁ బుంలింగ ప్రత్యయముగాఁ జేర్పఁబడుట సంభవించి యుండును. ఏలయన నది సాధారణముగా రామన్, కుమారన్, వరదన్ మొదలైన తత్సమపదముల చివరనే కాననగుచున్నది. ఇది కాలక్రమమున వివిధ భాషలలో వివిధ రూపములను బొందినది.

రామన్ (తమి) రామన్ (కన్న).
రాముణ్డు, రాముఁడు (తె) అవ్వు (తుళు).

ఈ విధముగాఁ దమిళమున అన్ అనునదియుఁ, దెలుఁగున దానినిబట్టియే యేర్పడిన ణ్డు, డు అనునవియుఁ బ్రథమావిభక్తిలోఁ బుంలింగమును సూచించు ప్రత్యయములుగాఁ బరిగణింపఁ బడుచున్నవి. తెలుఁగున ది అనునది స్త్రీ నపుంసక లింగ చిహ్నముగా వాడఁబడుచున్నది. తమిళమున స్త్రీ లింగమునకు అళ్ అను ప్రత్యేక చిహ్నమున్నది. ఈ భేదము తొలుఁదొల్తఁ బ్రథమపురుష సర్వనామమునం దేర్పడి క్రమముగాఁ గ్రియారూపములకుఁ గూడఁ బ్రాకినది. కాని తెలుఁగున నిప్పటికిఁగూడ చేసెను (భూత. ప్రథ. ఏకవచనరూపము) చేయును, చేసెడును, చేసెడివి (తద్ధ. ప్రథ. ఏకవచన రూపములు) వంటి రూపములు లింగత్రయ సాధారణములుగా వాడఁబడు చుండుట చూడ నీ భాషలలో లింగభేదము మొదటినుండియు లేక కాలక్రమమున నేర్పడెనని యూహింపవచ్చును

తత్సమ పదములలోఁ గూడఁ గొన్నిటి చివర లింగ భేదమును సూచించు చిహ్నములు కానరావు.

రాజు; దుగరాజు; పణ్డరంగు, పాతకు; సాక్షి; ఉజ్జయిని; శర్మ; వారణాసి; స్థితి; భూపతి; పూర్ణిమ; సముద్ధరకై (సముద్ధరణకై)

ప్రాక్చాళుక్య యుగమునందలి శాసనములలో సమాపక క్రియలతోఁ గూడిన వాక్యములు తక్కువ. ఉన్నచోటనవి పుంలింగ పద కర్తృకములుగానే యుండుటచే నప్పుడు క్రియలలో లింగభేద మెంతవఱకుఁ బాటింపఁ బడెనో చెప్పుట కష్టము.

తత్సమములలో స్టు, ణ్డు వర్ణాంతములు పుంలింగపదము లనియు, ము బు, ంబు వర్ణాంతములు నపుంసకలింగ పదములనియు గ్రహింపవచ్చును.

ధనంజయుఱు (కలమళ్ళ శాస) రాచమానంబు (ఉరుటూరు శాస.) వక్రమ్బు (ఉరుటూరు శాస.) సంయుక్తుస్టు (ఇందుకూరు శాస.) దానంబు ఫలంబు సంవత్సరంబుళ్ (వెలుదుర్తి శాస.) మహేన్ద్రిన్ (బూడిదగడ్డపల్లి శాస) సముద్రంబు (విప్పర్తి శాస.) ప్రాణసమానుణ్డైన. (కొఱవి) కలశబిడ్డట్లు (యుద్ధమల్లుని బెజవాడ శా.) దేశ్య పదములలో లింగసూచక చిహ్నములు లేవి వాని సంఖ్యయే హెచ్చు వానినే స్త్రీ సమము లందురు. ఈ క్రింది పద ములను బరిశీలించినచో నా విషయము వ్యక్తమగును.

చిఱుమ్బూరు (కలమళ్ల శాస.) పాఱ (ఉరుటూరు శాస.) పన్నస (ఎఱ్ఱగుడి పాడు). మాఱ్పిడుగు (రామేశ్వరస్తంభ శాస.) మఱుస్తుఱ్లు, (ఎఱ్ఱ గుడి పాడు). అమ్మ, చిన్త (చామలూరు) పటు, చీకు, కొణ్డ (తిప్పలూరు శాస). దన్తియమ్మ పంగు (బూడిదగడ్డపల్లి శాస).

కొడుకు — సత్యాదిత్యుని మాలెపాడు శాస.
తేవు, దొంక — వెంకయచోడుని దొంగలసాని కనుమ శాస.
పుట్టి, చేను, తోట — విప్పర్ల శాస.
పణి, గొరవ — విష్ణువర్ధన మహారాజు బుదమనారాయలపాడు శాస
చెలి, ఒజ్జ — కొఱవి శాస.
పదువ, బాణ — అద్దంకి శాస.
ఒట్టు, చేబ్ఱోలు, చోటు, బెడంగు — యుద్ధమల్లుని బెజవాడ శాస.

చెల్వాన్టు (వైదుంబరాజుల శాస) మగన్టు (బూడిదగడ్డపల్లి శాస.) తబుణ్డు (కపిలేశ్వరపుర శాస.) మగన్టు (చిన్నతిప్పసముద్రము శాస.) మున్నగు పద ములలోఁ బుంస్త్వ సూచకమైన న్టు, ణ్డు అను ప్రత్యయములు కనవచ్చు చున్నవి. (ఇళె తేనికిన్ — ఇళె తేఁడు ప్రథమావిభక్తి) కొండయ్య (బుదమ నారాయలపాడు శాస) టోపలయ, బాదయ, రేవణ, పుద్దణ, ఏవియణ మున్నగు పదములలోని అయ్య, అయ, అణ అను పదములు పుంస్త్వ సూచక ములుగా నున్నవి.

కొన్ని పదములలోఁ బురుషనామముల చివరఁ గూడ అమ అను పదము కన వచ్చుచున్నది. (కన్నమ - ఏడువాదల పాలెపు శాస. ఎఱమ - వెలుదుర్తి శాస; యలమ్మయు - నిత్య వర్షని మాలెపాడు శాస ) గోపాలకృష్ణమ్మ మున్నగు పదములలో నిప్పటికిఁ గూడ నిట్టి రూపము గోచరించు చున్నది. కొట్టంబు (గోష్ఠము) పరియారము (పరిహారము) వట్టంబు (రామేశ్వర స్తంభ శాస.) బింకము (చా. భీ. ధర్మవర శాసనము) కయ్యంబు మున్నగు పదములలోఁ జివరఁ గల ంబు, ము అనునవి వాని యమహద్వాచకత్వమును దెల్పుచున్నవి. చెఱు వను పదములోని వు వర్ణము కూడ నిట్టిదే కావచ్చును. కొసినేపల్లి శాసనములో పెండ్లంబు అనుమాట యున్నది. పెండ్లికి అము అను తద్ధిత ప్రత్యయము చేర్పు టచే నిది యేర్పడినది. ఇది మహతీ వాచకమే కాని అమహద్వాచకము కాదు. దీని కాచి కుడిపినవారు, వక్ర పల్కినవారు అను చోట వారు అనుపదము స్త్రీ పురుష సామాన్యముగా నున్నది. కాని యిది వాన్రు, వాణ్ఱు అనుదానికి బహు వచనముగా వాడఁబడి నట్టిదే. వానికి, దేనికి అనునవి స్పష్టముగా మహత్త్వమును అమహత్త్వమును సూచించుచున్నవి.

విభక్తులు - విభక్త్యంగములు:

తెలుఁగున నిప్పుడు డు, ము, వు లు అనునవి ప్రథమావిభక్తి ప్రత్యయములుగా భావింపఁ బడుచున్నవి. అందు డు అనునది ప్రథమైక వచనమునఁ గొన్ని మహ ద్వాచకములకుఁ జేర్పఁబడు చుండును. తొలుఁదొల్త ద్రావిడ భాషాపదము లందు లింగ భేదమును సూచించు చిహ్నములు లేకపోయినను దరువాత అన్, అళ్ (అళ్) తు అనునవి పుంస్త్రీ నపుంసక లింగ సూచకములుగాఁ బదముల చివరఁ జేర్పఁబడు చుండెను. ఇందు స్త్రీత్వమును సూచించు అళ్ ప్రత్యయ మేలొకో తెలుఁ గున నధికముగా గ్రహింపఁబడి యుండలేదు. ఇల్లాలు, కోడలు, చెలియలు, మఱఁ దలు మున్నగు స్వల్ప సంఖ్యాకములైన పదము లందు మాత్రమే యది కనఁబడు చున్నది. అళ్, తు అను ప్రత్యయములు రెండు నుండగాఁ దెలుఁగువారు తు ప్రత్యయ వికారమైన ది అనుదానిని అమహన్మహతీ వాచకముల కధికముగా వాడఁ జొచ్చిరి. (చిన్నది). తు అను మూల ప్రత్యయము కూడ నించుక భేదముతో చాకిత, మాలెత, ముట్టుత మున్నగు వానియందుఁ గనఁబడుచున్నదని చెప్ప వచ్చును. వీనిలో మతుబర్థమును మహత్యర్థమును గూడ నిమిడియున్నవి. వీ చార్థమున త, ది వర్ణకములే మహత్యర్థ బోధకములుగా వాడఁబడినను ఆదరార్థ

మున అళ్ ప్రత్యయము కూడ స్వల్ప సంఖ్యాకములైన ఇల్లాలు మున్నగు పదము లందుఁ గనఁబడు చున్నది. కాని యిట్టి పదము లర్వాచీన కాలమున నేర్పడి నట్లుగాఁ దోఁచుచున్నది

పుంస్త్వ సూచకమైన అన్ ప్రత్యయము తొలుత నిర్దేశసూచక సర్వనామ ప్రకృతులకుఁ జేర్పఁబడి తరువాతఁ బుంలింగము నందలి తత్సమ పదములకుఁ గూడ వాడఁబడఁ జొచ్చెను. అవన్, రామన్, కుమారన్, దేవన్ మొదలైన రూపము లిట్లేర్పడినవే. వీని యందలి పదాంత నకారము పరుషమైన శకట రేఫ మును దన తరువాత సహాయ ధ్వనిగాఁ జేర్చుకొని ణ్ఱు (ṇṭṟ) అను రూప మున వ్రాయఁబడు చుండెననియు, నదియే పిమ్మట ణ్డు అను రూపముగా మాఱె ననియు నిదివఱకుఁ జెప్పఁబడినది. క్రీ. శ. 849 నాఁటి అద్దంకి శాసనములో పరమ మాహేశ్వరుణ్డు అనియు, నా కాలమునకే చెందిన కందుకూరు శాసనములో విరివద్యుణ్డు, చిత్తజాతసముణ్డు అనియు ణ్డు తోఁ గూడిన రూపములు కానవచ్చుచున్నవి. కందుకూరు శాసన మందలి సీసపద్య ద్వితీయ పాదమున (ఖలుణ్డు నన్నృతరిపు బలుణ్డు నాహవరావ, రణ్డమోద్యసి ఘూసను ణ్డగణిత) ఖలుణ్డు, నన్నృతరిపు బలుణ్డు అను పదములలో మూర్ధన్యణకారము కూడ నున్నచో గణభంగము కలుగు మన్నది. 'ఖలుఁడు నన్నృతరిపు - బలుఁడు నాహవరావ' అని చదివినప్పుడే యచ్చట గణములు సరిపోవును. దీనివలన గణానుసారముగ ననునాసికమును దొలఁగించిన రూపముకూడ క్రీ. శ. 9వ శతాబ్ది మధ్య కాలమునకే యేర్పడెనని తెలియుచున్నది. ఈ మూర్ధన్య ణకారమునకుఁ దరువాత ననుస్వారము వ్రాయఁ బడుచుండెను. దానినుచ్చరింప వలసినప్పుడు పరమైన హల్లును ద్విరుక్తముగను ఉచ్చరింప వలసిన యక్కఱ లేనప్పు డద్విరుక్తముగను వ్రాసెడివారు. ముద్రణ సౌకర్యములేర్పడు కాలమువఱకును అట్టి యనుస్వారముతోఁ గూడిన వ్రాఁతలే వాడుకలో నుండెననుటకుఁ దాళపత్ర గ్రంథములే తార్కాణము. అనుస్వారము తరువాత ద్విరుక్తమైన హల్లుండుచో నాయనుస్వారము నుచ్చరింపవలె ననియు, నది యద్విరుక్తముగా వ్రాయఁబడుచో ననుస్వారము నుచ్చరింప రాదనియుఁ

గారకులు గుర్తించు చుండిరి. ముద్రణ విధానము ప్రచురమైన తరువాత నుచ్చరింప నక్కఱలేని యనుస్వారమునకు బదులు అఱసున్నను నెలకొల్పు నాచారమేర్పడినది ఈ యర్ధానుస్వారముతోఁ గూడిన డువర్ణమే క్రమముగాఁ బ్రథమా విభక్త్యేకవచన ప్రత్యయముగాఁ బరిణామము నొందినది.

చాళుక్య యుగమునందలి శాసనములలో నారంభమున (6. 7. 8 శతాబ్దులలో) న్డు తోఁగూడిన రూపములును, మధ్యకాలమున (8 9 శతాబ్దులలో) ణ్డుతోఁ గూడిన రూపములును, అంత్య కాలమున (10. 1 . శతాబ్దులలో) ణ్డు, ండు, ఁడులతోఁ గూడిన రూపములును గనవచ్చు చున్నవి

| | | |
|---|---|---|
| వచినవాన్డు | — | ఉరుటూరు శాస. |
| సంయ్యుక్తున్డు గు | — | చోళమహారాజు ఇందుకూరు శాస. |
| అచ్చినవాన్డు | — | పొట్లదుర్తి మాలెపాడు శాస. |
| పుణ్యకుమారున్డు | — | వెలుదుర్తి శాస. |
| గణ్యమానున్డు. మదముదితున్డు | — | తిప్పలూరి శాస |
| వధిపినవాన్డు | — | వల్లచెఱువుపల్లి శాస క్రీ. శ. 720. |
| రక్షిచ్చు కుడిపినవాన్డు | — | విత్పర్తి శాస. |
| చెల్వ్యాన్డు | — | వైదుంబరాజుల శాస. క్రీ. శ. 850. |
| పరమ మహేశ్వరుణ్డు | — | అద్దంకి శాస. క్రీ. శ. 848. |
| శ్రీ విరవద్యుణ్డు | — | కందుకూరి శాస. |
| చిత్రజాతసముణ్డు | — | |
| రాజసేవితుణ్డు | — | |
| దానమాన్యుణ్డు | — | |
| దయానిలయుణ్డు | — | |
| పంకిలాణ్డు - వల్లభుణ్డు | — | చా. భీ. ధర్మవరశాస. క్రీ శ. 9 వ శతాబ్ది చివర. |
| మల్లుణ్డపద్య కీర్తిఁ | | (మల్లుఁడపద్య) బెజవాడ యుద్ధమల్లుని శాస. క్రీ. శ. 10వ శతాబ్ది యారంభము. |
| ప్రస్తుత రాజాశ్రయుణ్డు - | | ,, |
| త్రిభువనాభరణుణ్డు—సమేతుణ్డు - | | ,, |
| భూవల్లభుణ్డతిఁ. | | ,, |

భక్తుణ్డై (౯డై) —నృపధాముణ్డె (౯డె) త్తి శ్చె బెజవాడ యుద్ధమల్లుని శాస
క్రీ. శ. 10 వ శతాబ్ది యారంభము

శ్రీయుద్ధమల్లు ణ్డె (౯డె) త్తి శ్చె ..
సమిత తేజుణ్డు ..
పెన్నం దను సంభవుండయ్యె ..
నతి ప్రసిద్ధుండై కామసాని గూడూరు
పెన్నండు, పెన్నుండువోలె శాసనము. క్రీ. శ. 1000.
ఘనుండగు, భీముండో

బూకిదగడ్డపల్లి శాసనములో శ్రీమహేన్ద్రిన్ అనురూపమున్నది. ఇందుఁ బ్రాచీన ప్రత్యయమైన అన్ అనునదియే కానవచ్చుచున్నది. చామియన్ (268 of 1922) త్రిభువనాదిత్యన్ (271 of 1922) అను రూపము లిట్టివే. విప్పర్తి శాసనమున (Ep 35 of 1905) దేవి అచ్చు వాన్దు పఞ్చ మహాపాతక సంయ్యుక్తురగున్ అనువాక్యమున్నది. సంయ్యుక్తురు + అగున్ అను చోట రు ప్రథమా విభక్త్యేక వచన ప్రత్యయముగాఁ గనవచ్చు చున్నది అగున్ అను క్రియా పదమును బట్టి యిది యేకవచన ప్రత్యయమే యని నిర్ణయింప వచ్చును ఇట్టి రూపము మఱి యెక్కడను గాన రాలేదు.

ఈ శాసనములలోఁ గొన్ని పదములు ప్రథమా విభక్త్యేక వచన ప్రత్యయములు లేకుండనే వాడఁబడినవి అందుఁ గొన్ని తత్సమములు కూడ నున్నవి పణ్డరంగు, మహాపాతకు.

పాఱ, తే మొదలైన కొన్ని దేశ్య శబ్దములలోఁ గూడఁ బ్రథమా విభక్త్యేక వచన ప్రత్యయము కానవచ్చుట లేదు.

పాలఱే గారికి.
పెన్పాఱ ఇశెఱేనికిన్.

ప్రస్తుతము తెలుఁగులో నమహద్వాచకముల చివరఁ బ్రథమా విభక్త్యేక వచనమున ము, వు అను ప్రత్యయములు కనఁబడు చున్నవి. ఇందు ము అను దానికి మ్కు, మ్బు, బు, పు అనునవి పూర్వ రూపములని యిదివఱకుఁ జెప్పఁబడినది. (పామ్బు-పామ్బు-పాము; నాగబు-నాగంబు-నాగమ్కు-నాగము) మొదట నీ ప్రత్యయము లమహత్తులైన దేశీయ పదములకే వాడఁబడు చుండినను గ్రమ

ముగాఁ దత్సమీకరింపఁ బడినవు దదంతములైన కొన్ని సంస్కృత పదములకుఁ గూడఁ జేర్పఁబడు చుండెను. కొన్ని శబ్దములు సంస్కృతమునఁ బుం లింగము లైనను దెలుఁగున నమహద్వాచకములుగాఁ బరిగణింపఁ బడును. అట్టివాని చివరఁ గూడ నీ పై ప్రత్యయములు చేర్పఁబడు చుండును. ఇట్లమహత్తులైన అదంత పదములకు మ్బు అను దానిని బ్రథమైకవచనమునఁ బ్రత్యయముగాఁ జేర్చుట చిక్కుళ్ల తామ్ర శాసనము నాఁటినుండియుఁ గనవచ్చు చున్నది. (విజయ రాజ్య సంవత్సరమ్బుళ్). రే నాటి చోళుల శాసనములలో మ్బు. ంబు లతోఁ గూడిన పదములు పెక్కు గోచరించు చుండుటచే క్రీ. శ 6వ శతాబ్ది నాఁటికే యిట్టి రూపములు భాషలో స్థిరపడెనని తెలియుచున్నది.

కొట్టంబున — ఎఱ్ఱగుడిపాడు శాస.
వక్రిమ్బు వచినవాణ్ణు — ఉరుటూరు శాస.
దానంబు పలంబు. మహా
పాతకంబు — వెలుదుర్తి శాస.
సోమవారంబు • — తిప్పలూరు శాస.
పుణరు పుష్యంబు — Do
వట్టమ్బున — రామేశ్వర స్తంభ శాస.
పులొంబున Do
విజయరాజ్య సంవత్సరమ్బుళ్ —
ఉత్తరంబున
పడువారంబు — విప్పర్ల శాసనము.
స్థావిండీశ్వరంబున

క్రీ. శ. 6వ శతాబ్దినుండి 9వ శతాబ్ది వఱకుఁ గల శాసనములలోఁ గొన్నిచోట్ల ననునాసికములేవి కేవల బువర్ణముతోఁ గూడిన రూపములు కూడఁ గనఁబడు చున్నవి. కాని మ్బు తోఁగూడిన రూపముల సంఖ్యయే చాలహెచ్చు.

నివబుకాను — ఎఱ్ఱగుడిపాడు.
పిద్దాయబు, పట్టనబు — అహదనకర శాస.
కల్పట్టనబు — C. P. No 2 of 1914 క్రీ. శ. 8 వ శతాబ్ది.

క్రీ. శ. 9వ శతాబ్ది తరువాత మ్బు అను రూపము సమీకరణముచే మ్ము అను రూపముగా మాఱినది. మఱికొంత కాలమునకు మ్ము లోని ద్విత్వము. పోయి వట్టి ము అను రూపముకూడ నేర్పడినది. అప్పటినుండియు ంబు, మ్ము.

ము అను మూఁడింటితోఁగూడిన రూపములను గానవచ్చుచుండును. తెలుఁగున మొదటి పద్య శాసనమైన అద్దంకి శాసనములో పట్టంబు గట్టిన ప్రథమంబునేణ్డు

బలగర్వంబొప్పగ బైలేచి సేన
కొట్టంబు ల్వ ట్డెణ్డు గొణి వేంగి నాణ్టిం

అనురూపములు ప్రయోగింపఁబడినవి. ఇందు బలగర్వం బొప్పగ, కొట్టంబుల్ అనువానిని ంబు అను రూపముతోఁ గూడినవానిఁగనే పరిగణించినచో గణ భంగము కలుగును. అందుచే వీనిని బలగర్వ బొప్పగ, కొట్టబుల్ అనికాని బలగర్వ మొప్పగ—కొట్టముల్ అని కాని చదువవలయును. దీనినిబట్టి క్రీ. శ. 9వ శతాబ్ది నడిమి భాగముననే పూర్వరూపమైన బు అనుదాని ముందుచేరిన అనుస్వారమును లోపింపఁ జేయుటో లేక తేల్చిపలుకుటో జరుగుచుండెనని చెప్పవచ్చును. కొంచెము తరువాతి కాలము నకుఁ జెందిన చాళుక్య భీముని ధర్మవరి శాసనములో స్పష్టముగా మ్మ, ము అను వానితోఁ గూడిన రూపములు కనఁబడుచున్నవి.

ఉదా.

ధర్మపురమ్మున3 — బింకముడిచె7 — కిరణపురము8 — అవలప్తిము9
ఈశాసనమునందే లోహాసనంబెక్కి నిరుతంబు అను ంబు తోఁ గూడిన రూపమును, చేకొని కాచె భూ, లోకంబెఱుంగ అని గణమునకై యనుస్వారమును దేల్చి పలుకవలసిన రూపమును గూడఁ గానవచ్చుటచే ంబు, మ్మ, ము అను మూఁడును గూడ నప్పుడు ప్రత్యయములు గా వాడఁబడు చుండెనని తెలియుచున్నది.

క్రీ. శ. 725 ప్రాంతమునందలి కపిలేశ్వరపుర శాసనములో తబున్లు అను రూపమున్నది. విజయాదిత్య చోళుని చామలూరి శాసనమున తాంబుల్ అను బహువచన రూపము కానఁబడుచున్నది. క్రీ. శ. 848 లోని ధర్మవరి శాసనమున తమ్ముణ్డు బెజయరాజు అనుచోట ద్విత్వ మువర్ణముతోఁ గూడినరూపము ప్రయోగింపఁ బడినది. దీనినిబట్టి బు అనునది మొదట మ్బు, ంబు గా మాఱి క్రీ. శ. 850 నాఁటికి మ్మ గా మాఱెనని తెలియుచున్నది. ఈవిధముగా మఠబు మఠమ్బు, మఠమ్ము, మఠము అను రూపముల పరిణామ మేర్పడుటయు, గుణ

నామవాచకముల నేర్పఱచుటకై మొదట ధాతువులకుఁ జివరను,[1] తరువాత నవంతములును అమహత్తులు నైన సంస్కృత నపుంసక లింగముల చివరను జేర్పఁబడు చుండిన బు, ం బు అను రూపములే ము అను రూపముగా మాఱి యుండి తెలుఁగున నమహత్ప్రథమైక వచన ప్రత్యయముగాఁ బరిగణింపఁ బడుటయు సంభవించినది.

సంస్కృతమున అకారాంత నపుంసక లింగ శబ్దములు ప్రథమైక వచన ములో జ్ఞానమ్, ధనమ్, ఫలమ్ అనునట్లుగా మకారముతో ముగియుచుండును. వానికి ఉ చేర్పఁగా జ్ఞానము, ధనము, ఫలము అనురూపము లేర్పడి యుండునని సులభముగాఁ జెప్పవచ్చును. కాని మ్ము వర్ణాంతములగు దేశ్య పదముల సామ్య ముచేఁ బై తత్సమ పదములు కూడ మొదట ఫలమ్ము, జ్ఞానమ్ము, ధనమ్ము అని మ్ము వర్ణాంతములుగానే వాడఁబడుట సంభవించినది. క్రీ. శ. 9వ శతాబ్ది మధ్య కాలము వఱకు ఫలము, జ్ఞానము, ధనము వంటి ము వర్ణాంతరూపములు వాడుక లోనికి వచ్చియుండ లేదు. అంతకుఁ బూర్వము నందలి శాసనములలో నవి చాల చోట్ల మ్ము వర్ణాంతములుగను, గొన్ని చోట్ల బు వర్ణాంతములుగను గోచరించు చున్నవి.

చాళుక్య యుగమునందలి శాసనములలోని అమహద్వాచకములు పెక్కు ప్రీ నమములుగానే (ప్రథమైకవచన ప్రత్యయ రహితముగానే) కానవచ్చుచున్నవి. బు, మ్ము అను వానితో ముగియు శబ్దము లిదివఱకుఁ జూపఁబడినవి. వెలు దుర్తి శాసనము నందును, సత్యాదిత్యుని మాలెపాడు శాసనము నందును ప్రిధివీ రాజ్యం చేయ, పాతకఞ్చేసిన వానికి అను రూపములున్నవి. పాతకం అను పదములోని అనుస్వారమే చకారము పరమగుటచేఁ దాలవ్యానునాసికముగా వ్రాయఁబడినది. క్రీ. శ. 1018లోని యేదు వాడల పాలెపు శాసనములో "జ్యేష్ఠ మాసమ్మంన కృష్ణ పక్షం నవమీ ఆదిత్య వారం" అని అనుస్వారముతోఁ గూడిన రూపములు కానవచ్చు చున్నవి. దీనిని బట్టి యిప్పటివలెనే యప్పుడు కూడఁ గొన్ని చోట్లఁ బ్రథమైక వచన ప్రత్యయమైన ము వర్ణము ననుస్వారముగాఁ బల్కుచుండిరేమో యను సందేహము కలుగుచున్నది.

---

1 ఇరు-మ్ము, లే-మ్ము, కాయ్-బు-కాపు

వణం పరియారము చిలంకూరి శాసనము.

పట్టం కట్టబడి — ముదివేడు శాస.

జయసింహ వల్లభుని విప్పర్ల శాసనమున ప్లావింది సముద్రరకై అను రూపమున్నది. కై అను చతుర్థీ విభక్తి ప్రత్యయము తీసివైచినచో సముద్రర అను విభక్త్యంగము మిగులును. ఇది యెట్లు లేర్పడెనో చెప్పఁజాలము. వెలదుర్తి శాసనమున వక్రపల్కినవారు అనియు, చిలంకూరి శాసనమున ప్రసాద చేసిరి అనియు మువర్ణరహితములైన రూపములు కనవచ్చుచున్నవి. పద్యాదులు పరములగునపుడు ము వర్ణమునకు లోపముకాని పూర్ణబిందువుకాని వచ్చు రూపములు తరువాతి భాషలోఁ బ్రయోగింపఁ బడినవి. అట్లే యిచ్చటఁ గూడ పల్కు, చేయు అను క్రియలు పరముకాఁగా వక్రము, ప్రసాదము అను వానిలోని ము వర్ణము లోపించినట్లుగాఁ గనఁబడు చున్నది.

సంస్కృతమునందలి ఉకారాంత శబ్దములు తత్సమీకరింపఁ బడునపుడు వాని చివర వు అను ప్రత్యయము చేరుచుండును. (విష్ణువు, వధువు, మధువు) కొన్ని శబ్దములు తెలుఁగునకు సంస్కృతమునుండి ప్రత్యక్షముగా రాక అందుండి మొదటఁ బ్రాకృతమునకును, బ్రాకృతము నుండి తెలుఁగునకును వచ్చి యున్నవి. పరియారో (పరిహారః) దమ్మో (ధర్మః) మొదలైన శబ్దములు పరియారువు, దమ్ముపు అని వు వర్ణాంతములుగాఁ బ్రయోగింపఁ బడినవి. నిజమునకు పరిహార ధర్మశబ్దములు సంస్కృతమునఁ బుంలింగములైనను దెలుఁగున నమహత్తు లగుటచే పరిహారము ధర్మము అనురూపములను బొంది యుండవలసినది. కాని యవి సంస్కృతమునుండి ప్రత్యక్షముగాఁ దెలుఁగునఁ బ్రవేశింపక ప్రాకృతము ద్వారా ప్రవేశించుటచే సంస్కృతమునందలి ఉకారాంత శబ్దములవలెఁ బ్రథమైక వచనాంతమున వు అను ప్రత్యయముతో వాడఁబడి యున్నవి. వీని సామ్యముననే కాఁబోలు సాసనవు (C P No 10 of 1908) అచ్చర్వు (బూడిదగడ్డపల్లి శాసనము) అనురూపములు కూడ వు వర్ణాంతములు గానే ప్రయోగింపఁ బడినవి. ఆశ్చర్య శబ్దము ప్రాకృతమున అచ్చేరం అనురూపమును బొందును. అందుండి అచ్చెరువు అనురూప మేర్పడినది. నెం. 384/1904 లో దమ్మువు అను శబ్దము షష్ఠీ విభక్తిలో దమ్ముణకు అని వాడఁబడినది. ఇక్కడ వు అను ప్రత్యయము లోపించినది. నన్నయ ధర్మువు అర్థువు అను రూపములను వాడియున్నాఁడు.

చెఱువు, మడువు మొదలైన దేశ్య శబ్దముల చివరఁ గూడ వు వర్ణము కాన వచ్చుచున్నది.

ఈవిధముగా దేశ్య తత్సమశబ్దములు పెక్కు ప్రథమైక వచనమున వు వర్ణాంతములుగాఁ గానవచ్చుటచే వైయాకరణులు వును గూడఁ బ్రథమా విభక్త్యేకవచన ప్రత్యయముగాఁ బరిగణించి యుండిరి.

గో, ఆ అనువాని నిప్పుడు మనము గోవు, ఆవు అని వాడుచున్నాము. వీనికి గోవులు ఆవులు - ఆలు అనునవి బహువచన రూపములు. గోళ కోటి అనురూపము కానవచ్చుటచేఁ జాళుక్య యుగమున గో శబ్దము వు వర్ణరహిత ముగానే వాడఁబడుచుండె నని తెలియుచున్నది. ఇప్పుడు గోవులు అనురూపమే కాని గోలు అనురూపము కానరాదు.

తెలుఁగున వైయాకరణులు లు అనుదానిని గూడఁ బ్రథమా విభక్తి ప్రత్యయముగాఁ బరిగణించి యున్నారు. నిజమునకది బహువచన సూచక ప్రత్యయమే కాని ప్రథమావిభక్తి ప్రత్యయము కాఁజాలదు పరిశీలించి చూడఁగా ద్రావిడ భాషలలోఁ బ్రథమావిభక్త్యేక వచనమునఁ బ్రత్యేక ప్రత్యయములతోఁ గూడిన వేఱురూపములు లేకుండెననియు, మూలపదములే ప్రథమా విభక్త్యేకవచన రూపములుగా వాడఁబడు చుండెననియుఁ, దరువాత సంస్కృత వ్యాకరణానుకరణముచే డు, ము, వు అనునవి తెలుఁగునఁ బ్రథమా విభక్త్యేక వచన ప్రత్యయములుగాఁ బరిగణింపఁబడె ననియుఁ దోఁచుచున్నది.

ప్రథమా విభక్తి వలెనే మిగిలిన విభక్తులుకూడ సంస్కృత సామ్యముచేఁ దెలుఁగున నన్నయకుఁ బూర్వమే స్థిరపడిపోయినవి. తరువాతి భాషలోఁ గనఁబడు కూర్చి, గుఱించి, కొఱకు, కంటె, యొక్క మున్నగు విభక్తిప్రత్యయములు నన్నయకుఁ బూర్వమందలి శాసనములలోఁ గానరాకున్నను మిగిలిన ప్రత్యయములన్నియు నందుఁ జూపట్టుచునే యున్నవి.* అందు తోడ, వలన, లోపల, అందు, ఉండి మున్నగునవి మొదటఁ బ్రత్యేక పదములే యైనను గాలక్రమమునఁ దమ ప్రత్యేకతను గోల్పోయి కేవల విభక్తి ప్రత్యయములుగా స్థిరపడి పోయినవి. తెలుఁగితర ద్రావిడ భాషలనుండి విడివడిన పిమ్మటను, తెలుఁగున శాసనములు వ్రాయఁబడిన కాలమునకుఁ (క్రీ. శ. 6వ శతాబ్ది)

గొన్ని శతాబ్దులు పూర్వమునను ఈ పరిణామ మంతయు జరిగియుండును తమిళమున తొల్కాప్పియరు కాలమునకే అనఁగా క్రీస్తు శకారంభము నాఁటికే సంస్కృతము నుండి సప్త విభక్తులను గ్రహింపఁ బడినట్లు తెలియుచున్నది

తెలుఁగునఁ గొన్ని పదము లితరపదములు పర మగునప్పుడును, విభక్తి ప్రత్యయములు చేరునప్పుడును గొంత మార్పు చెందుట గోచరించుచున్నది కాలు + వ్రేలు = కాలివ్రేలు; కన్ను + రెప్ప = కంటిరెప్ప; నేయి + వెల = నేతివెల; కంటియందు, కాలితో, నేతికై, ఊరినుండి మొదలైనవిందుకు దృష్టాంతములు. ఇందామార్పాదేశాగమాత్మకములైన ఇ, టి, తి వర్ణములవలన సూచింపఁబడుచున్నది. ఇట్టి మార్పు చెందుపదము లౌపవిభక్తికము లనియు, ఆదేశాగమాత్మకములుగా వచ్చు నా ప్రత్యయము లౌపవిభక్తిక ప్రత్యయము లనియుఁ బిలువఁ బడుచున్నవి. ఈ ప్రత్యయములు పూర్వపర పదములకుఁ గల సంబంధమును దెల్పుచున్నవి.

కొన్ని పదములు విభక్తిప్రత్యయములు కావి, యితర పదములు కావి పరములగు నప్పు డెట్టిమార్పును జెందక యట్లే యుండిపోవును. ఉదా -తండ్రి పేరు; అన్నమాట; తల్లివలన; గోడకు మొద. ఇట్టి పదము లనౌపవిభక్తికములని పిలువఁబడుచున్నవి. ఇవి పరములైన పదములకును బ్రత్యయములకును ముందు తమకుఁగల స్థితిచేతనే వానితోడి సంబంధమును సూచించు చుండును. ఈ సంబంధము కొన్నిచోట్ల విశేషణత్వమును, గొన్నిచోట్ల 'యొక్క' అను భావమును (Possession) వ్యక్తముచేయు చుండును. వెండి చెంబు, చెట్టుకొమ్మ యను వానికి వెండితోఁ జేయఁబడిన చెంబనియుఁ జెట్టు యొక్క కొమ్మ యనియు నర్థము. ఆరంభకాలములోఁ బై సంబంధము పూర్వ పదముల స్థితిచేతనే సూచింపఁబడుచుండినను గాలక్రమమున దానిని సూచించుటకుఁ బ్రత్యేక పద్ధతి యవలంబింపఁబడఁ జొచ్చెను. దానిని బట్టియే కొన్ని శబ్దముల చివర ఇ, టి, తి అను ప్రత్యయము లాదేశాగమాత్మకములుగా వచ్చు చుండును. వీనితోఁ గూడిన రూపములే విభక్త్యంగములుగను సమాస పూర్వ పదములుగను నేర్పడినవి. తెలుఁగు నందలి విభక్త్యంత రూపము లన్నియు నొక విధముగా సమాసములే యని యిదివఱకుఁ జెప్పఁబడినది.

తెలుఁగు నందలి యాప విభక్తికముల పూర్వరూపములను బరిశీలించినచో వానిచివర ఇ, టి, తి వర్ణములు కలుగుట యెట్లేర్పడెనో తెలియ వచ్చును. కొన్ని పదముల తుదనున్న శకట రేఫము ద్విరుక్తమై ట్ట వర్ణముగా మాఱి సమీకరణముచే ట్ట - అను రూపమును, ఇ చేరుటచే ట్టి రూపమును బొంది యొక ట కారము లోపించుటచే టి అను రూపమును దాల్చు చున్నది. తెలుఁగు నందలి ఏఱు శబ్దమునకుఁ దమిళమున ఆఱ్ అనునది సమానరూపము. అతిప్రాచీన కాలమునఁ దెలుఁగునఁ గూడ నది యా రూపముతోడనే వాడఁబడి యుండవచ్చును. ద్రావిడభాష యందలి ఆ తెలుఁగున ఏ గా మార్పు చెందుట కుదాహరణము లిదివఱ కొసంగఁబడినవి. (ఆళ్—ఏలూరు) తమిళమున ఆఱ్ శబ్దమునకు కరై- అను పదము పరముకాఁగా నవి రెండును గలిసి ఆఱ్ఱు + కరై, అట్రుక్కరై అను సమాసముగా నేర్పడుచున్నవి. అట్లే తెలుఁగు నందలి ఏఱు, ఏఱ్ఱు—ఏట్రు అను రూపమును బొంది విశేషణత్వము కలిగించు ఇవర్ణము చేరఁగా ఏట్రి అయి, సమీకరణముచే ఏట్టి గను, ఒక టకారము లోపించుటచే ఏటి గను మాఱు చున్నది. సమాస పూర్వపదముగాఁ గాని, ద్వితీయాది విభక్త్యంగముగాఁ గాని వాడఁబడునప్పు డదియే దానిరూపము. (ఏటికట్ట — ఏటియందు). తమిళమున కాడు శబ్దము నందలి డకారము పరుషత్వమును ద్విత్వమును బొంది కాట్టు అగుచున్నది. తెలుఁగున నందలి డకారము పరుషత్వమునొంది ఇవర్ణము చేరఁగా టి యగుచున్నది. (కాటి). ఇచ్చట ద్విత్వము కలుగలేదు. ఈ విధముగాఁ దెలుఁగున ఱడాంతములైన కొన్ని పదములందు ఱడలు పరుషమైన టకారముగా మాఱుటయు, దాని కికారము చేరఁగా విభక్త్యంగ రూపము లేర్పడుటయు సంభవించినది. (ఉదా :-ఏఱు - ఏటి; నూఱు - నూటి; వీడు - వీటి; నాఁడు - నాఁటి) ఈ పదముల సామ్యముచే ఇల్లు, పల్లు మొదలైన అన్య వర్ణాంతములైన పదములకుఁ గూడ టి వర్ణము చేరిన రూపములు కానఁబడు చున్నవి. (ఇంటి, పంటి, వింటి, నోటి) కొన్ని శబ్దముల విభక్త్యంగ రూపము లొక్క ఇవర్ణము చేరుట చేతనే యేర్పడు చున్నవి. మ్రాను + ఇ = మ్రాని; కాలు + ఇ = కాలి; ఊరు + ఇ = ఊరి; అవన్ + ఇ = అవని - వాని; ఇవన్ + ఇ = ఇవని - వీని; అవర్ + ఇ = అవరి - వారి. అదు, ఇదు అనువానిలోఁ జివర వకారము లేకపోయినను వానికి దాని, దీని అను విభక్త్యంగ రూపము లేర్పడుట పైవానితోడి సామ్యముచేతనే యని చెప్ప

వలయును. తమిళమున గొన్ని శబ్దములకు విభక్తిప్రత్యయాదులు చేర్చుటకు ముందు అట్టు అనునది చేర్పఁబడు చుండును.

మరమ్ - మరట్టు: మరట్టై (ద్వితీ) మరట్టాల్ (తృతీ).

ఒకొకప్పు డీ అట్టుతో ఇన్ అనునది కూడఁ గలియుచుండును. (మరట్టినాల్) తెలుఁగునఁ గొన్నిపదములకు విశేషణత్వమును గాని యొక్క భావమును గాని కలిగించుటకుఁ జేర్పఁబడు ఇవర్ణమీ ఇన్ నుండి యేర్పడినది కావచ్చును

నేఁటి తెలుఁగున డు, డి వర్ణము లంతమందుఁగల పదములు ప్రాచీన కాలమున టకారంతములే యై యుండవలె ననియు కాట్ (కాడు) రాట్ (రాడు) వానిపై ఇవర్ణము చేరఁగా కాటి రాటి మొదలైన ద్వితీయాద్యంగము లేర్పడి యుండుననియు నాంధ్రభాషావికాసమునఁ జెప్పఁబడియున్నది. (పుట 417). తెలుఁగున కన్ను, మిన్ను, మన్ను మొదలగు ద్విత్వ నకారముతోఁ గూడిన రూపములు తమిళమున కణ్, మణ్, విణ్ అని ణకారాంతములుగాఁ గనవచ్చు చున్నవి. ఈ ణకారమున కందుఁ బరుషములు పరమైనప్పుడు టకార మాదేశ మగుచున్నది.

మణ్ + కుడమ్ = మట్కుడమ్ (మట్టికుండ).

ఇట్లే పదాంతళకారము కూడఁ బరుష పరకమైనప్పుడు టకారముగా మాఱు చుండును.

ముళ్ + కుఱై = ముట్కుఱై (ముంటిముక్క).

ఈ సంప్రదాయము ననుసరించియే తెలుఁగున కన్ను, మిన్ను, మన్ను మొదలైన వానికి సమాసమందును, విభక్తిప్రత్యయములు చేరుటకు ముందును (ట్ + ఇ) టి వర్ణముతోఁ గూడిన రూపము లేర్పడి యుండును.

తొల్కాప్పియమున మరమ్, కుళమ్, మొదలైన మకారాంత శబ్దముల కచ్చు పరమైనప్పుడు అత్తు అనునాగమము కలుగునని చెప్పఁబడినది (ఆం. భా. వి. పుట 418).

మరమ్ + ఇల్ = మరత్తిల్

కుళమ్ + ఇల్ = కుళత్తిల్

ఇడమ్ + ఇల్ = ఇడత్తిల్

ఈ అత్తు అనునదే తెలుఁగు శబ్దముల ప్రాచీన రూపములలో నుండి నేఁటి త్తివర్ణముగాఁ బరిణమించెనని చెప్పవచ్చును. కుఱ్ఱు, పఱ్ఱు మొదలగు శబ్దములతో ముగియు గ్రామనామములు విభక్తిప్రత్యయములకు ముందును సమాసములందుఁ బూర్వాంగములుగా నుండునప్పుడును ఈ తి చేరుటచేతనే కుర్తి, పర్తి అనునట్లుగా మాఱి తరువాత ననుచిత విభాగముచేఁ బ్రథమైక వచనరూపములుగాఁ బరిగణింపఁ బడుచున్నవి. ఉదా: వనపర్తి; గంగలకుర్తి.

తత్సమములలోఁ గొన్ని శబ్దముల కేకవచనమున డు, ము, వు అను ప్రత్యయములు చేర్పఁబడు చుండును. ఈ ప్రత్యయము లేవియుఁ జేరని శబ్దములు కూడఁ గొన్నికలవు. దేశ్యములందలి స్త్రీ సమ శబ్దముల తరువాత వలెనే వీనితరువాతఁ గూడ విభక్తి ప్రత్యయములు గాని యితరపదములుగాని చేరునప్పుడెట్టి మార్పులును గలుగవు. వానిప్రక్కనే యీ పదములును, ప్రత్యయములును అవ్యవధికముగాఁ జేర్పఁబడు చుండును. ఉదా: హరిజాడ, పితమేను, ధాతచేత; అగ్నియందు. రాముఁడు మొదలైన డు మంత శబ్దములకు రెండు విధములైన విభక్త్యంగ రూపములు కానఁబడుచున్నవి. రాముని, రామునిని, రాముచేత, రామునిచేత, రామువలన, రామునివలన, రామునందు, రామునియందు.

ప్రథమా విభక్తిప్రత్యయమైన డు లోపించి వైకల్పికముగా నిగాగమము వసుఁ దావిచ్చుటచే వీవిభక్త్యంగ రూపములేర్పడినవని వ్యాకరణ కర్తలు చెప్పుదురు ప్రాచీనకాలమున రాము, రామన్ అనునవే ప్రథమైకవచన రూపములగుట చేతను, డు వర్ణము కాలక్రమమునఁ జేరినదగుటచేతను, అట్లుచెప్పుట చరిత్రానుగుణమైన పద్ధతి కానేరదు. రామన్ అనుదాని కికారము చేరుటచే రామని యనురూపమేర్పడును. దేవని, చోళని, గరుడని మొదలగు నకారమధ్యములైన రూపములే ప్రాచీనము లైనవి. కాలక్రమమునఁ బ్రథమైక వచన రూపము తుదనుండు డు లోని అంత్యోకారము యొక్క ఆకర్షణముచే నడిమి అకారము ఉకారముగా మాఱినది. ఈ విధముగా దేవుని, చోళుని, రాముని మొదలైన విభక్త్యంగ రూపము లేర్పడినవి. ఇప్పుడు వ్యవహారమున డు మంతములకు రాముడి, దేవుడి ఇత్యాదిగా డి అంతమందుఁగల విభక్త్యంగ రూపములు వినఁబడుచున్నవి. రాముఁడు అను ప్రథమైకవచన రూపమున కికారము

చేరఁగా రాముడి అను రూపమేర్పడినదని చెప్పవలయును. కాని డు పంతమైన ప్రథమైకవచన రూపమే ఇకారము చేరుటచే ద్వితీయాది విభక్త్యంగముగా నేర్పడినదని చెప్పుట యిష్టము కామిచే వ్యాకరణ కర్త యిచ్చట డు లోపించి డి ఆగమముగా వచ్చినదని చెప్పవచ్చును. నిజమునకు డు మీఁద ఇకారము చేరి డి అంతమందుఁగల రూపము లేర్పడినవని చెప్పుటయే సహజమైన పద్ధతి

అకారాంత నపుంసకలింగ రూపములును, పుంలింగములయ్యు నమహత్తులైన శబ్దములును, ఉకారాంత శబ్దములును దత్సమీకరింపఁ బడునపుడు వాని చివర ము, వు వర్ణములు చేర్చఁబడుచుండును (వనము, సంవత్సరము, ధేనువు విష్ణువు, మధువు) ఈ ప్రథమైకవచన రూపములకే విభక్తి ప్రత్యయములు చేర్చఁబడు చుండును గావున నివియే యా శబ్దముల విభక్త్యంగ రూపములని చెప్పవచ్చును. వనము వలన; విష్ణువుచేత; వధువును; మధువు కొఱకు

దేశ్య శబ్దములందలి డుమంతములు మగాదు లనియు బల్లిదాదు లనియు రెండు విధములు మగ, మనుమ మున్నగువాని చివర అకారమే యున్నది మగనిచేత, మనుమని వలన అను రూపములనుబట్టి యిచట మగని, మనుమని అను నివర్ణాంతములే విభక్త్యంగము లని తెలియుచున్నది వీని వెనుకనున్న అకార ముకారముగా మాఱియుండలేదు. ప్రాచీనమైన మగన్ అను నకారాంత రూపమునకు ఇకారము చేరఁగా మగని యను విభక్త్యంగ రూపమేర్పడినదని తెలియుచున్నది. బల్లి దాదులు డుమంతములైన తత్సమములతో సామ్యమును బొందుటచే వానికి బల్లిదు, బల్లిదుని అను రెండువిధములైన విభక్త్యంగ రూపములును నేర్పడినవి. బల్లిదుచేత, బల్లిదునిచేత.

బహువచన ప్రత్యయమునకు సంబంధ బోధకమైన అ చేర్చుటచే ర అను రూప మేర్పడుచున్నది. ఇదియే బహువచనమున నెల్ల శబ్దములప ద్వితీయాది విభక్త్యంగముల చివరఁ గానవచ్చుచున్నది. వారు, వీరు అను ప్రథమ పురుషసర్వనామముల చివరనున్న బహువచన రు ప్రత్యయమునకు సంబంధార్థమున ఇవర్ణము చేరుటచే వారి, వీరి అను విభక్త్యంగరూపము లేర్పడినవి. అల్లురు మల్లురు మొదలైన శబ్దములకు బహువచనములో సంబంధార్థమున ఇకారమునకు బదులు అకారమే చేరుచున్నది. మల్లురవలన, అల్లురచేత. ఇది ల వర్ణసామ్యముచే నేర్పడియుండును.

తమిళమున యాన్, నీన్, తాన్ అను సర్వనామములకు విభక్తిప్రత్యయములు చేరునప్పు డందలి దీర్ఘము హ్రస్వ మగుచున్నది. అందుచే నందు ఎన్, నిన్, తన్ అను విభక్త్యంగ రూపము లేర్పడుచున్నవి. తెలుఁగునఁ గూడ నివియే ద్వితీయా విభక్త్యంగములుగా వాడఁబడు చున్నవి. చివర ఉకారము చేరఁగా నన్ను, నిన్ను, తన్ను అను ద్వితీయా విభక్త్యంత రూపము లేర్పడినవి. తరువాత నివి నన్, ను; నిన్, ను; తన్, ను అని విభజింపఁ బడుటయు, ను ద్వితీయావిభక్తి ప్రత్యయముగాఁ బరిగణింపఁబడుటయు సంభవించినది. మిగిలిన విభక్తులలో నీ, నా అనునవియే విభక్త్యంగములుగా వ్యవహరింపఁ బడుచున్నవి. తన్ అను దానికి విభక్తి ప్రత్యయములు చేరునప్పుడు షష్ఠ్యర్థమున అకారము చేరుటచే తన అను రూప మేర్పడు చున్నది. నావలన, నీచేత, తనయందు.

చాళుక్యయుగమునందలి శాసనములలోఁ గొన్నిచోట్ల సమానాధికరణ (attributive) విశేషణాది సంబంధములు పదముల స్థితి మాత్రముచేతనే (అనఁగా నెట్టి యాగమాదేశములు లేకుండనే) సూచింపఁబడుచున్నవి. కొన్నిచోట్ల ఇ, అ, టి, తి, పు అను ప్రత్యయములు చేరి యా సంబంధములను వ్యక్తము చేయుచున్నవి.

కాశ్యపగోత్రుణ్డు సత్యదిత్యుణ్డు — మాలెపాడు శాస.
కొచ్చియ పాఱ రేవశమ్మఀరికి — ఇందుకూరి శాస.
విటిపటితి కమ్మరి వినియణ — రామేశ్వర స్తంభ శాస.
తెంకణాదిత్యణ్ఱు కొమరురి భీముణ్డు
వెంకయా చోడ్డమహారాజు — వెంకయచోడుని దొంగల సాని కనుమ శాస.
ఉత్తరంబు కట్ట — చామలూరు శాస.

పై యుదాహరణములలో నెట్టి ప్రత్యయమును జేరియుండలేదు. మొదటి మూఁడింటిలో సమానాధికరణ సంబంధమే యున్నది. ఇట్టియెడ విశేషణత్వ సూచక వికార ముండనక్కఱలేదు. అగు ధాతుసంబంధము చాలును. అది యిచ్చట లోపించినది. కాశ్యపగోత్రుణ్డు సత్యదిత్యుణ్డు అనఁగా కాశ్యపగోత్రుఁ డగు సత్యాదిత్యుఁ డని యర్థము.

ఇ.

| | |
|---|---|
| చిఱుమ్బూరి రేవణకాలు | — కలమళ్ల శాస. |
| కూచవోఁజియార్రి తాంబుల్ | — చామలూరి శాస. |
| ఇన్పుఱోర్రి అనవోతులు | — పొట్లదుర్తి మాలెపాడు శాస |
| పల్లెయార్రి కొడుకు | — నలజానంపాడు శాస E I. XXVII P. 203 |
| నిడుమ్రన్రి కయ్యంబున | — మైలవరము శాస. |
| తేన్రి బింకముడిచె | — చా. భీ ధర్మవర శాసనము |
| ...ణుచోట్రి గొరగలు | యుద్ధమల్లుని బెజవాడ శాస |
| వాన్రిపై రి | — కామసాని గూడూరు శాస. |
| వాన్రి లోకమ్పు | — మాలెపాడు శాస. |
| దీన్రి యరివాణంబు | — బికిరాజు శాస.. S I I X 594 |
| వార్రి పెణ్లంబు | — కొసినేపల్లి శాస. నెం 598 |
| చూంటూరి యమ్మ వోట్యవ్వగుడి | — రెండవ అమ్మరాజు మచిలీ పట్టణ శాసనము. |

అ.

| | |
|---|---|
| ముత్తురాజుల్ల కుణ్డికాళ్లు | — ఎఱ్ఱగుడిపాడు శాస |
| తక్కఁణాపుఱోల పొరదాయ | — తిప్పలూరు శాస. |
| చోఁలమహారాజుల అమ్మ | — చామలూరు శాస. |
| విక్రమాదిత్యుల కొడుకు | — మాలెపాడు శాస. |
| [1]అశ్వమేధమ్బున ఫలమ్బగు | — నల జానం పాడు శాస |
| వట్టంబునవారికి | — రామేశ్వర స్తంభ శాస. |

1. అశ్వమేధము ఫలమన్నను షష్ఠ్యర్థము వచ్చుచునే యున్నది. దీనికే తరువాత విశేషణత్వద్యోతకముగా పుంప్వాది వికారము కలిగినది. అశ్వమేధపు ఫలము. అశ్వమేధంబు ఫల మనునపుడు సంబంధము సుస్పష్టము కాలేదను భావముచేఁ గాఁబోలు సంబంధ సూచకమైన అకారము వచ్చినది అప్పుడు సంధిచే అశ్వమేధంబ ఫలము అను అనిష్టరూప మేర్పడుచుండుటచే ప్రకృతి భావమును దొలఁగించుటకు న్ చేరినది.

| | |
|---|---|
| మ్లావిండిరాజుల ముట్టు | — విప్పర్ల శాస. |
| దొగరాజులముద్దు విట్టజుల ప్రతమ రాజ్యంబున | — లక్ష్మిపురి శాస. |
| బెజ ఇత్తభటరిళ విల్పినదత్తి | — కపిలేశ్వరపుర శాస. |

తి.

| | |
|---|---|
| విలిపఅితి కమ్మరి | — రామేశ్వర స్తంభ శాస |
| పిత్ప త్తి ఉత్తరంబున | — విప్పర్ల శాస |
| దేనప్పఱితి ముదుట్ల పొండయార | |

టి.

| | |
|---|---|
| తాటి యొద్ద | — నందంపూఁడి శాస |
| కొఱిప్పేటి టూప్పుణసీమ | — అమ్మరాజునమ్మూరుదాన శాస. |
| రేనాణ్టి ఏళుపేళు | — చెన్నరాయనిపల్లి శాస. |
| ఏవగునేణ్టి ఉత్తరాయన | — చా భీ. — ధర్మవర శాస. |
| పశ్చిమతః రేటి పడుమటిదరి | — రెండవ అమ్మరాజు మచిలీపట్టణ శాస. |

ప్రాక్చాళుక్య యుగమునందలి శాసనములలోఁ గూడ వేఙ్రిపాటి విషయే అని టి ప్రత్యయము కానఁబడుచున్నది. ఇది సంస్కృతసమాసమున నుండుటచే ననుచిత విభాగమువలన వేఙ్రిపాటి అనునదే ప్రథమైక వచనాంతముగాఁ బాటింపఁబడెనని తోఁచుచున్నది.

పు.

| | |
|---|---|
| కట్టెపు దుర్గంబు | — అద్దంకి శాస. |
| మిరియంపు బోళజప | — లక్ష్మిపుర శాస |

మ్బువర్ణాంతములు విశేషణత్వము నొందినపు డందలి బువర్ణము పరుషత్వము నొంది పువర్ణముగా మాఱును. ఉత్తరబు కట్టు అనుచోట నిట్టి మార్పురాలేదు.

విభక్తి ప్రత్యయములు

చాళుక్య యుగమునందలి శాసనములలోఁ గనవచ్చు ప్రథమైక వచన రూపము లిదివఱకుఁ జూపఁబడినవి. ఇతర విభక్తి ప్రత్యయములతో ముగియు రూపములీ క్రింద నొసంగఁబడుచున్నవి.

జడవాచకముల ద్వితీయకుఁ దఱుచుగాఁ బ్రథమా విభక్తియే వాడఁబడు చుండును.

రేనాణ్డు ఏళన్ — కలమళ్ల శాస.
దానంబు ఫలంబు పఞ్చమహా
పాతకంబు పడు — వెలుదుర్తి శాస.
పుత్రవద్య. స్త్రీవద్య. గోవద్య. పఞ్చ మహాపాతక ఞ్చేసిన
వానిలోకమ్బు — మాలెపాడు శాస.
గుడ్లు ప్రాకారంబు మంటపంబును ధర్మవర శాసనము.
నమయించిన నెల్లూరు జిల్లా శాస. 968
పట్టంబు గట్టిన — అద్దంకి శాస.
— దొంగల సాని కనుమ శాస.
నేలయెల్ల సర్వ పరిహారువుఇచ్చె Do
బణిచేసిన — విప్పర్ల శాస.
పడువారంబు ఇచ్చిరి — Do
ప్రత్యుపకారంబు చేయవలయును — కొఱవి శాస.
శిలాస్తంభంబు ప్రతిష్ఠించి — Do
కొట్టము ల్వడ్రెణ్డు గొని — అద్దంకి శాస.
దుర్గంబు కడు బయల్పేసి — Do
ఒట్టు ఱస్సి. లింగ మటి సి వ. ఫల ముపేక్షించివ. చోటు మెచ్చక
— యుద్ధమల్లుని బెజవాడ శాస.
వేయుదేవ బ్రాహ్మణులు. వేకవిల శాను అచ్చువణ్ణు పోన్దు.
అగస్త్యేశ్వర దేవాలయము. చిలంకూరు.
విదరడ్డి వెటవివారు బరనసియు చెఱువు కవిలయు నటిసివవారి పాపంబు —
వానపల్లి దగ్గరనున్న బుదిరెడ్డిపల్లి లోని శాసనము. నెం. 811.

(విదర + అడ్డి + పెట్టనివారు = Those who do not stop the slips or breaches)

పై రెండు శాసనములలో బ్రాహ్మణుఱు అనునది ఉచువస్తు అనుదానికిని. కవిలయు అనునది ఆటిసిన అనుదానికిని కర్మలుగా వాడఁబడినవి. ఇవి రెండును జడవాచకములు కావు. ప్రథమా విభక్తిలో నున్నవి. మొదటి శాసనమున బ్రాహ్మణుఱు అనుపదమునకు వెనువెంటనే వేకవిల శాను అను ద్వితీయాంతమైన పదము కనఁబడుచుండుటచే నది ప్రమాద పతితము కావచ్చును. లేక కవిలయు అనునది భారతము నందలి "అమ్మద నాగ మెదిర్చి" ఎంటి ప్రయోగము కావచ్చును.

ద్వితీయా విభక్తి 'ని':

| | |
|---|---|
| తేని ఒచ్చినవాస్తు— | చోళమహారాజు ఇందుకూరు శాస. |
| | పొట్లదుర్తి మాలెపాడు శాస. |
| దీని కాచికుడిపినవారు | — వెలుదుర్తి శాస. |
| దేనిపల్చిన వానికి | — మాలెపాడు శాస. |
| వేంగినాణ్డిం గొఱల్చియ | — అద్దంకి శాస. |
| పీని రక్షిఞ్చిన వారికి | — Do |
| పోరని చేకొని కాచె | — వా. భీ. ధర్మవర శాస |
| దీనిన్దారు విల్చిన వారు 34 | — యుద్ధమల్లుని బెజవాడ శాస. |
| దేశభూవిభుని గాకతివల్లభు | — కామసాని గూడూరు శాస. |

ను':

| | |
|---|---|
| వేవురుపాఱ్ఱజమ్మిన వాస్తు | — రామేశ్వర స్తంభ శాస. |
| బారనాసివేవుర వధిసినవాస్తు | — వల్ల చెఱువు పల్లి శాస. |
| లింగంబునష్టిసి | — వెంకయచోడుని దొంగల-సాని కనుప శాస. |
| వేవురు పఱాసు | — మంగి దొగ రాజు లక్ష్మీపుర శాస. |
| కన్న్యకను | — విష్ణువర్ధన మహారాజు బుదమ నారాయలపాడు శాస. |
| వేవురాను, వే కపిల శాను | — అగస్త్యేశ్వర దేవాలయ శాస. నెం. 403. |
| ప్రభుం బిడ్డఁింగుంబణ్చిన | — అద్దంకి శాస. |

| | |
|---|---|
| భోగంబుల ననుభవించుచు | — కొలవి శాస. |
| వేయిగుళ్లను | — ఏడువాడల పాలెపు శాస |
| గవిలలాను బ్రాహ్మణులను అటిపిన | — బాణరాజుల శాస |
| వేవుర బ్రాహ్మణులను, వేగవిలలను, వేగుడ్లుళను | — ఇలపకుఱ్ఱు శాస. |
| క్షేత్రంబును..నాకు ఇచ్చిరి | — వలజానంపాడు శాస |

తృతీయా విభక్తి 'తోడ, తో':

| | |
|---|---|
| దన్తియమ్మ మంగు తోటన్ పొడిచి | — బూడిదగడ్డపల్లి శాస |
| విష్ణువర్ధనుతో నడ్డి | — కొలవి శాస. |
| అగ్రహారంబుల తోడి పాడి చేసి | — ఏడువాడల పాలెపు శాస |
| మట్టితోడి తాటియొద్ద | — సిరిపుర తామ్ర శాస. |
| ఉదయించె గీర్తితోను | — కామసానిగూడూరు శాస |
| సోడుళతోడ | — కురుబలకోట శాస S. I I. X 626 |
| నాటందితోటి కయ్యంబున | — వైదుంబ మహా రాజు గండ త్రినేత్రుని శాస. |
| సామంత పదువతో | — అద్దంకి శాస. |
| ఈఱ్ల నల్వురాయు తోఱ | |
| నలరాప విభుతోఱ | చా. భీ. ధర్మవర శాస. |
| రపునతో బెజవాడకెల్ల | —యుద్ధమల్లుని బెజవాడ శాస. |
| వారి చేత పట్టం కట్టబడి | — S I. I X 629. ముదివేము శాస. |
| వైదుమ్బుల చేతం బట్టం కట్టబడి | — Do. 640 Do |

పై రెండు ప్రయోగము లందును చేత (న్) అను ప్రత్యయము కనఁబడుచున్నది

| | |
|---|---|
| విల్పివానిచే | — గూడూరు శాస. |

అగ్గప్ప రాజు పొదిలి శాసనమున చేతంగొని అనియున్నది. అట్లే కామసాని గూడూరు శాసనమున చేతఁబట్టి యను ప్రయోగమున్నది. ఈ రెండుచోట్ల చేత ప్రత్యయము కాదు.

(అన్). న - తృతీయార్థమున :

| | |
|---|---|
| రాచమానంబున | — రామేశ్వర స్తంభ శాస. |
| ఆత్మన్మతంబున | — S. I I. X పుట 2 ధర్మవర శాస. |
| బలపరాక్రమంబునం దచ్చియ | — కొఱవి శాస. |

ఉదంతజడంబు తృతీయకు నవర్ణకంబగునని బాలవ్యాకరణము చెప్పుచున్నది. సుఖముతో ఉండి యను నర్థమున సుఖంబుండి యను ప్రయోగము కనవచ్చు చున్నది (కొఱవి శాస.) సుఖంబు మనుమను ప్రయోగము కూడనిట్టిదే (కొఱవి). ఇట్టివానిని సమర్థించుటకే చిన్నయసూరి ఒకానొకచో నొకవిభక్తికి మఱియొక విభక్తియు నగునని సూత్రించెను. (బాల కారక. 21)

చతుర్థీ విభక్తి 'కై':

| | |
|---|---|
| ప్లావిండి సముద్రరకై | — విప్పర్ల శాస. |

కి, కు.

| | |
|---|---|
| పెన్వార ఇఱె రేనికిన్ | — పొట్లదుర్తి మాలెపాడు శాస. |
| కాశ్యపగోత్రినికి ఇచ్చిన. సల్పినవానికి పుణ్యంబు | — మాలెపాడు శాస. |
| పాఱకు కుణ్డికాళ్ల ఇచ్చిన | — ఎఱ్ఱగుడిపాడు. శాస. |
| తిరువులపాఱకు ఇచ్చిన | — ఉరుటూరు శాస |
| దేవికి వక్రమ్బు వచినవాన్డు | — Do |
| రేవశమ్మాఁరికిన్ | — ఇందుకూరు శాస. |
| పూలవట్టంబున వారికి | — రామేశ్వర స్తంభ శాస. |
| చేదిశర్మ కిచ్చిరి | — వెలుదుర్తి శాస. |
| కేశ్వరునకుం గార్తికేయుణ్డుబోలె | — ధర్మవర శాస. |
| భటారకకున్ | — దిమ్మగుడి శాస. |
| తిఱెవ్విశ్వంబునాకున్ | — నెం. 262. |
| చెఱువుకు | — పాలపఱ్ఱు సోమేశ్వరాలయ శాస. నెం. 796. |
| బటరవికి ఇచ్చిన | — అద్దంకి శాస. |

నృపులకున్ — యుద్ధమల్లుని బెజవాడ శాస
జాత్రకు — Do
వానికివి దానుదయించె — కామసాని గూడూరు శాస
చాళుక్యభీమునకు శౌచకందర్పునకు — కొలవి శాస.

పంచమీవిభక్తి — వలన :

గద్యంబులవలన శాశ్వతమ్బు — గుణగవిజయాదిత్యుని ధర్మవర శాస

ఉణ్డి :

జనసుత చేబ్రోలనుణ్డి బెజవాడ జాత్రకువచ్చి — యుద్ధమల్లుని బెజవాడ శాస.

షష్ఠీవిభక్తి — అ :

విక్రమాదిత్యుల కొడుకుల్ — మాలెపాడు శాస.
తన పూర్వవృత్తికి — నెం. 183. క్రీ. శ ొవ శతాబ్ది నడుమ.
[1]ప్లావింకి రాజుల ముట్బు — విప్పర్ల శాసనము.
లోన్.
వెన్నాజీలోం జూచె — చా. భీ. ధర్మవర శాస.
కయ్యంబు లోన — బిసినికొండ శాస.
భూమిలోన.

---

1. "సంబంధార్థ బోధకమై అ వర్ణ మేకవచన బహువచనములు రెంటను గాన్పించుచున్నది. (తన, తమ) అకారాంత శబ్దముల మీఁద నిది 'ఇ'గా కనఁబడు చున్నది. ఉకారాంతముల మీఁద 'ఇ' బహుళము గురుని యాజ్ఞ; గురునాజ్ఞ. గురు + ఆజ్ఞ అన్నప్పుడు ప్రకృతి భావమును దొలఁగించుటకై నుగాగమము వచ్చియుండును. షష్ఠీప్రత్యయమైన కు వర్ణమును అగు, అకు, ధాతువుయొక్క యవశిష్ట రూపముగా గ్రహించినచో నది విభక్తి ప్రత్యయ స్థానమునుండి తొలఁగ వచ్చును. శేష షష్ఠియందలి యొక్క కు కారకత్వము లేదు. దానికిఁ గావ్యములందు ప్రయోగమును విరళ విరళము. కావున షష్ఠీ ప్రత్యయములు ఇ, అ అనుట ఉచితతరముగా నుండును. కి కు, యొక్క, లో, లోపల అనునవన్నియు ఔపచారికములు" – శ్రీ ఖం. ల. రం గారు.

లోపల.

| | |
|---|---|
| దొక్కలోపలినేల | — వెంకయ చోళుని దొంగలసాని కనుమ శాస. |

వీరలోకంబునకేగె అనుటకు వీరలోకమ్బేగె అను ప్రయోగము కనవచ్చుచున్నది. ఇన్ద్రలోక మేగె (చిన్న తిప్పసముద్రము. S I I. X నెం. 374) అను ప్రయోగము కూడ నిట్టిదే. ఏగుధాతువు అకర్మకమైనను సకర్మకమను భ్రమను గొల్పి యుండుటచే వీరలోకము నేగె అను రూప మేర్పడి జరంబు ద్వితీయకుఁ బ్రథమ బహుళముగా నగును గావున వీరలోకమేగె అను రూపమును బొందియుండును.

సప్తమీ విభక్తి అన్, న :

| | | |
|---|---|---|
| చీకున | | తిప్పలూరి శాస. |
| కయ్యంబున జచ్చిన | - | మైలవరము శాసనము. నెం. 306. |
| వసన్తీశ్వరంబున | - | రామేశ్వర స్తంభ శాస. |
| దమ్మపురంబున దమ్మువులు | - | అద్దంకి శాస. |
| పురమునీశానంబున గుడినిల్పె | - | చా. భీ - ధర్మవర శాస |
| పొర్రిలగల తానపతులు | - | యుద్ధమల్లుని బెజవాడ శాస. |
| బెజవాడం గొమరుస్వామికి | - | Do. |
| పడుమటన్ గొణ్డయు గరుసుగాను | - | దొంగలసాని కనుమ శాస. |
| స్వర్గంబున మణ్డం గాంతురు | - | ఏడువాడలపాలెపు శాస. |

అన్దు:

| | | |
|---|---|---|
| ఆకారవిదేశమునందు ప్రతిష్ఠచేసి | - | గూడూరు శాస |

చిత్తడి పెమ్బునన్దుఅష్టమియు నాదిత్యవారమునన్దు తృతీయాసప్తమ్యర్థము లందుఁ బెక్కుచోట్ల న్, ని ప్రత్యయము కానవచ్చుచున్నది. చిన్నయసూరి జరంబు తృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబుగా నగునని చెప్పియుండెను. (బాల. కారక. 22).

| | |
|---|---|
| అర్థిఁన్ - (అర్థితో) | - యుద్ధమల్లుని బెజవాడ శాస. |

బారనాసి వేపుర వధిసిన వాన్డు (బారనాసియందు) నల్లచెఱువుపల్లి శాస.
అనుపమ దుజ్జయాన్వయ సుధాబ్ధిననేకులు (సుధాబ్ధియందు) గూడూరు శాస
భావిత కీర్తిఁ నాతనికి Do
ఉదయించె నున్నతిఁ (ఉన్నతితో) Do
లోకంబునందు అనుటకు మాలెపాడు శాసనమున "చేసిన వానిలోకంబునుణ్డు వాన్డు" అని ద్వితీయావిభక్తి 'ను' వాడఁబడినది.

భీమసలుకియ నదనేక వస్తువాహనంబు ల్వడయుచు (కొఱవి శాసనము) ఇచ్చట అందనఁగావలన ననియర్థము. లేదా యిచ్చట నందు స్థల వాచకముగాఁ వాడఁబడినదని చెప్పవచ్చును. అప్పుడు భీమసలుకి యను సానమునం దను పద మేర్పడును.

ను (ద్వితీయ) కు (చతుర్థి) లు (బహువచన) ప్రత్యయములకు వెనుకఁ గొన్నిచోట్ల హ్రస్వమైన అకారము దీర్ఘము చేయఁబడినది.
వేపురాను, వేకవిలశాను, అగస్త్యేశ్వరదేవాలయ శాసనము నెం. 403.
తిఖెన్విశ్వంబు నాకున్ - నెం. 267.
పసులాచమ్బిన - తుపాకులోల్లపల్లి శాస.
వేగవిశాకు - మంగిదొగరాజు లక్ష్మీపుర శాస
భటారశాకు - బుదమనారాయలపాడు శాస.

సంబంధార్థమున వచ్చు అకారము పెక్కుచోట్ల విసంధి నద్దుటకై వచ్చిన వ్తోఁగూడి న అనురూపముతోఁ గావవచ్చుచున్నది. అశ్వమేధమ్బు న్న ఫలమ్బు అన్వయంబున వారు, పులొంబున చెఱువు, కొట్టంబున పాలు మొద

సర్వనామములు :

దేవునకుఁగాని దేవాలయమునకుఁ గాని విద్వాంసునకుఁ గాని గురువునకుఁగాని యొసంగఁబడు దానమును సూచించుటకో, యుద్ధమున బలపరాక్రమములతోఁ బోరి విహతుఁడైన మహావీరుని శౌర్యమునకు స్మారకముగనో సాధారణముగా శాసనములు వేయింపఁబడుచుండును. దాత, ప్రతిగ్రహీత, దానము అను మూఁడు విషయములే యందుఁ బ్రాధాన్యము వహించియుండును. జను లందఱి

కిని సామాన్యముగను దత్తమైన గ్రామమున నివసించువారికిఁ బ్రత్యేకముగను దానవిషయమును బ్రకటించుటయే యీ శాసనముల ముఖ్యప్రయోజనము. అం దాజ్ఞా భాగము సాధారణముగా సంస్కృతభాషలో నుండుటచే నుత్తమ మధ్యమ పురుషప్రయోగ మందే యుండిపోవుట సంభవించెను.[1] అందుచే మధ్యమోత్తమ పురుష లందలి తెలుఁగు సర్వనామముల నా శాసనములలోఁ గాంచుట కవకాశము లేదు. ప్రథమ పురుష సర్వనామములు మాత్ర మచ్చటచ్చట గోచరించుచుండును. క్రియలలోఁ గూడ నిట్లే మధ్యమోత్తమ పురుష రూపములకీ శాసనములలో నంతగా నావశ్యక ముండదు. అసలు పూర్వపు శాసనములలో సమాపక క్రియలతోఁ గూడిన వాక్యములే చాల తక్కువగా నున్నవి. ఉన్నచోటఁ బ్రథమ పురుషకు సంబంధించిన రూపములే కనఁబడుచున్నవి.

విరిపఱితి కమ్మరి వినియణ వ్రాసె — రామేశ్వర స్తంభ శాస.

వక్రమ్బు పచిన వాన్దు పఞ్చ మహాపాతకు అగు (ను) — ఉరుటూరు శాస.

ప్రసాద చేసిరి — విక్రమాదిత్య చోళ మహారాజు చిలంకూరు శాస.

పసిణ్డిమితె కొఱాచె — నల్ల చెఱువుపల్లి శాస.

కచేఱుపాఱ ఎఱమన్వాసిరి
కొణ్డాఱువాన్దు కొట్టె — వెలుదుర్తి శాసనము.

అరివరజమున్దు అన్వాన్దు పడియెన్ — బూదిదిగడ్డపల్లె శాస.

కడుకు ర్వెజవాడ గావిశ్చె మెచ్చి — అద్దంకి శాస.

పొన్నె. చూపె. ఉడిచె. కాచె, చొచ్చె — దా. భీ. ధర్మవర శాస.

గుడియు నిరుపమ మతి నృపధాము డెత్తిశ్చె
నెగిదీచ్చెఁ మరంబు — యుద్ధమల్లుని బెజవాడ శాస.

ఎఱుభూపతి జగద్విదితుం డుదయించె కీర్తితోన్ — కామసాని గూడూరు శాస.

---

1. సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజాధిరాజ రాజపరమేశ్వరః రాష్ట్రకూట ప్రముఖా నిత్థ మాజ్ఞాపయతి ......... తస్మై మద్భక్తాయ వజ్జియ ప్రెగ్గడ ఇతి ప్రసిద్ధాభిధానాయ, భవద్విషయే — రణస్థి పూణ్డి నామగ్రామోఽగ్ర హారీకృత్య మత్సంవర్ధితా్వ నిమిత్తే మయా దత్త ఇతి విదితమస్తువః — రణస్థిపూఁడి శాస.

మిగిలిన వాక్యములలో వక్తవ్యాంశము
ఎఱిగల్ తుగరాజుల్లు ఇచ్చిన పన్నాస ఉరుటూరు శాస.
బెజయిత్త భటరళ విల్పినక్షేదత్తి కపిలేశ్వరపుర శాస.
అనునట్లుగా భూతకాల క్రియాజన్య విశేషణము చేతనో.
వక్రమ్బు వచ్చు వాన్డు పుత్రవద్య చేసినవాని లోకమ్బు నున్డువాన్డు
మాలెపాడు శాసనము.

అనునట్లుగా అధికరణాత్మక యోజనము గల (appositional construction) వాక్యముల తోడనో తెలుపఁ బడుచుండును.

చాళుక్య యుగమునందలి శాసనములలో నెల్ల నొక్క చాళుక్య భీముని కొఱవి శాసనమున మాత్రము మధ్యమోత్తమ పురుషములకు సంబంధించిన కొన్ని సర్వనామ రూపములు కనవచ్చుచున్నవి. "అందు కుసుమాయుధు పెద్ద కొడుకు రాజ్యము చేయుచు నిష్ట విషయ కామ భోగంబుల ననుభవించుచు సుఖం బుండి యొకనాఁడు కొఱవి నల్ల జెఱియ కొడుకు పెద్దనను రావించి "నీవు నా ప్రాణ సమానుణ్డవైన చెలివి. నీ చేసిన యుపకారంబునకు ప్రత్యుపకారంబు సేయ వలయుంగాన నీ కేమి .. నాకెల్లం గల దేమి మెకునవెణ్డి కొణ్డు మయ్యను" ఇత్యాదిగాఁ జెప్పినట్లు కలదు. ఇచటఁ బ్రత్యక్ష వాక్యప్రయోగము చేయఁబడుటచే మధ్యమోత్తమ పురుష సర్వనామముల కవకాశము కలిగినది. నీ వనునది మధ్యమ పురుష ప్రథమా విభక్త్యేక వచన రూపము. నీ, నీకు అనువానిలో దాని విభక్త్యంగ రూపమైన నీ కానవచ్చుచున్నది. నా అనునది (తృతీయా విభక్తి నుండి) ఉత్తమ పురుషైక వచన విభక్త్యంగ రూపము. ఈ కాలము నందలి శాసనములలో నెక్కడను ఉత్తమ పురుష ప్రథమావిభక్త్యేక వచన రూపము కానరాదు. చిన్నయసూరి నా, నీ అను వానినే యుత్తమ మధ్యమ పురుష సర్వనామముల ప్రాతిపదికములుగా గ్రహించెను.

తమిళమునఁ బ్రాచీన భాషలో (తొల్కాప్పియమున) నేకవచనమున యాన్ అనునదియు, బహువచనమున యామ్, నామ్ అనునవియుఁ బ్రామాణికములైన రూపములు. అర్వాచీన భాషలో నాన్ అను నేకవచన రూపము కూడ వాడఁబడుచున్నది. అట్లే కన్నడమునఁ బ్రాచీన కాలమున ఆన్ (ఏక) ఆమ్ (బహు) అనియు, నర్వాచీన కాళమున నాను (ఏక) ఆవు, నావు (బహు)

అనియు నేకవచన బహువచనములందుఁ బ్రామాణిక రూపములు గోచరించు చున్నవి. మలయాళమున ఞాన్ (ఏక) ఎజ్ఞళ్, నమ్మళ్ (బహు) అనునవి యేక వచనబహువచనములందలి రూపములు. ఈ మూఁడు భాషలలోఁ గూడ ఎన్ అను నది యేకవచనమున ద్వితీయాది విభక్త్యంగరూపముగా వాడఁబడుచున్నది దీనిని బట్టి విభక్త్యంగ రూపమున మొదటి దీర్ఘము హ్రస్వమైనదనియుఁ దుది (న్) నకారము నిల్చియున్నదనియు స్పష్టమగు చున్నది. తెలుఁగున నకారము లోపించుటయు మొదటి దీర్ఘమట్లే యుండిపోవుటయు జరిగినది. ఈ విధముగ నేకవచనమున నా యను విభక్త్యంగ రూపమేర్పడినది. ఇట్లే మధ్యమ పురుష విషయమునఁ గూడఁ దమిళ కన్నడములలోఁ దుది నకారము నిల్చి తొలి దీర్ఘము హ్రస్వమగుటచే విభక్త్యంగ రూపమేర్పడఁగాఁ (నీన్-నిన్) దెలుఁగునఁ దొలి దీర్ఘమట్లే నిల్చి నకారము లోపించుటచే విభక్త్యంగ రూప మేర్పడినది. (నీ) ప్రాచీన ద్రావిడ భాషకు మాండలికములైన గోండు, కు భాషలలోఁ గూడ మధ్య మోత్తమ పురుషముల ద్వితీయా ద్యేకవచన విభక్త్యంగ రూపములలో నీ, నా అను రూపములే కానవచ్చు చున్నవి. మఱియుఁ దెలుఁగున వలెనే వాని యందుఁగూడఁ బ్రథమ పురుషైక వచనమున స్త్రీ లింగమును సూచించు ప్రత్యేక రూప మేదియును లేదు. నపుంసక లింగైక వచన రూపమే స్త్రీని సూచించుటకుఁ గూడఁ వాడఁబడు చుండును. తెలుఁగున అది అనునది స్త్రీ తిర్యగ్జడాదుల నన్నిటిని సూచించును. తమిళ కన్నడములలో నట్లుకాక అ అను నిర్దేశ సర్వనామమునకు అళ్ అను ప్రత్యయము చేరుటచే అవళ్ అను స్త్రీవాచకరూప మేర్పడునని యిదివఱకుఁ జెప్పఁబడినది. పై రెండు విషయములలోఁ దెలుఁగునకును గోండుకు భాషలకును సామ్యము కానఁ బడుచున్నది అవియును దెలుఁగు వలెనే పూర్వ ద్రావిడభాషలో స్త్రీని సూచించుటకు అళ్ అను ప్రత్యయము ప్రత్యేకముగా వాడఁబడు నాచార మేర్పడక పూర్వమే యితర ద్రావిడ భాషలనుండి విడివడి యుండవలయును.[1]

---

1 "తెలుఁగున ఆమె, ఆవిడ (అ+బిడ్డ, అబిడ అవిడ) యనునవి పూజ్యార్థక స్త్రీ వాచకములుగ వాడఁబడుచున్నవి. అ + అమ్మ అనునది మొదట ఆయమగా మాఱి తరువాత ఆమెగాఁ బరివర్తనము చెందియుండవలెను. స్త్రీవాచక శబ్దములైన అమ్మ, అక్క, అప్ప |బిడ్డ వంటివి నిర్దేశక సర్వ నామముపైఁజేరి రూపాంతరమంది స్త్రీవాచక సర్వనామము లగుట కన్పించును. మైత్రియందును నీచస్త్రీని జెప్పునప్పుడును అది యను అనుహా

చాళుక్య యుగమునందలి శాసనములలో వాన్ఱు, వారు అను ప్రథమైక వచన బహువచన రూపములు కానఁబడుచున్నవి. అ అను నిర్దేశ సర్వనామమునకు అన్, అర్ అను ప్రత్యయములు చేరుటచే నీ రూపము లేర్పడినవి అ + అరు - అ (వ) రు - వారు. అ + అన్ - అ (వ) న్. తెలుఁగునకు సహజమైన అజంతత్వమును బొందునప్పు డిందలి పదాంత నకారము దంతమూల జన్యమైన (alveolar) శకటరేఫమును సహాయధ్వనిగా గ్రహించుటచే అవన్ఱు అను రూపమేర్పడి తరువాత వర్ణవ్యత్యయ, లోపదీర్ఘతలచే వాన్ఱు అనునట్లుగా మాఱినది. పదాంతనకారముతోఁ గలియునప్పుడు దంతమూలజన్యమైన పై శకట రేఫము టకార ధ్వనితోఁగూడ నుచ్చరింపఁబడుటచే న్ట్ఱ (nṭr) అను క్రొత్త ధ్వని యేర్పడెను. దీనిని సూచించుటకై యప్పుడు తెలుఁగు కన్నడ లిపిలో శకటరేఫమునకును ఱ కారమునకును భిన్నమైన యొక క్రొత్త యక్షరము (ఴ) వ్రాయఁబడుచుండెను. కాలక్రమమున నిందలి దంతమూలజములైన ధ్వనులు మూర్ధన్యములుగా మాఱుటయు, నప్పుడు ణకారముయొక్క సాహచర్యముచే ట్ఱ (ṭr) దగా మాఱుటయు సంభవించుటచే వాణ్డు అను రూపమేర్పడినది దీని సామ్యముచేఁ గొన్ని దేశ్యశబ్దముల తరువాతను, పుంలింగమునకుఁ జెందిన కొన్ని తత్సమముల తరువాతను జేర్పఁబడిన అన్ అను ప్రత్యయము న్ఱు (nṟu) గాను పిమ్మట ణ్డు గాను పరిణామమును జెందినది. క్రీ. శ. 9 వ శతాబ్ది యందలి పద్య శాసనములలో ణ్డు తోఁ గూడిన రూపములు కానవచ్చుచుండుటచే నీ పరిణామ మంతకుఁబూర్వమే జరిగియుండును.

పుణ్యకుమారున్ఱు గణ్యమానున్ఱు మదముదితున్ఱు — తిప్పలూరి శాస.
కాశ్యపగోత్రున్ఱు, సత్యదితున్ఱు — మాలెపాడు శాస.

---

దర్థక ప్రథమపురుషైక వచనమే వాడఁబడుచున్నది. దీనిని బట్టియే అళ్ ప్రత్యయ మర్వాచీనమనియు, అది యనునదో లేక యట్టిది మఱేదియో ప్రథమపురుషైక వచనమున సర్వద్రావిడ భాషాసామాన్యమైన స్త్రీవాచకముగా వాడఁబడుచుండి యుండవలెననియు నూహింపఁదగియున్నది' అని కొందఱు భాషావేత్త లూహించుచున్నారు. దీనినిబట్టి తెలుఁగున స్త్రీ వాచక ప్రథమపురుషైకవచన రూపము లేనేలే దను విషయ మింకను విచారింపవలసి యున్నది.

| | |
|---|---|
| పాఱజమ్పిన వాన్డు | రామేశ్వర స్తంభ శాస. |
| పుదలి ఏలువాన్డు | బూడిదగడ్డపల్లె శాస. |
| మగన్డు | చిన్నతిప్ప సముద్ర శాస. S I. I. X. |
| తబున్డు | కపిలేశ్వరపుర శాస. |
| చెల్వన్డు | వైదుంబరాజుల శాస. 850. A. D |

ణ్డు వర్ణాంతరూపములు :

| | |
|---|---|
| పరమ మహేశ్వరుణ్డు | అద్దంకి శాస. |
| శ్రీ నిరవద్యుణ్డు చిత్తజాత సముణ్డు | కందుకూరు శాస. |
| అచలితుణ్డు వల్లభుణ్డు | చా. భీ. ధర్మవరము శాస. |
| వృషధా ముణ్డెత్తిశ్చె | యుద్ధమల్లుని బెజవాడ శాస. |

దీనినిబట్టి తెలుఁగునఁ బ్రథమైకవచన రూపమైన డు వర్ణ మీకాలమునఁ బరిణామ దశయం దుండెననియు, అణ్ నుండియేర్పడిన అన్ అను ప్రత్యయమే కాలక్రమమున న్డు గాను, క్రీ. శ. తొమ్మిదవ శతాబ్ది తరువాత ణ్డుగాను, పిమ్మట డు, ండు గాను మాఱి అట్లే భాషలో స్థిరపడినదనియుఁ దెలియుచున్నది.

తేని అచ్చిన వాన్డు పఞ్చ మహాపాతక సంయుక్తున్డగు. ఇందుకూరి శాస.
వ క్తుఁగున్ (విత్పర్తి శాస.)
కొట్టలి కుణణ్డాటు వాన్డు కొట్టె (వెలదుర్తి శాస ).
అన్వాన్డు పొడిచి పడియెన్ — బూడిద గడ్డపల్లి శాస.
రక్షిఞ్చి కుడిపిన వాన్డు అశ్వమేధమ్బున పల్లమ్బు కాఞ్చున్.
మగన్డు ఇంద్రలోకం బేగె — చిన్న తిప్పసముద్ర శాస.
చన్ద్రాదిత్యున్డు పసులకు పొడిచి వీరలోకంబు పనియె - మదనపల్లి పడమట శివాలయము - S I I X.

అను రూపములన్నియు నేకవచనమునందున్న వనుటకుఁ దత్కర్తృకము లైన క్రియారూపములన్నియు నేకవచనమునందు వాడఁబడుటయే తార్కాణము. ఆ కాలమునఁ బూజ్యార్థమెట్లు చూపఁబడెనో సూచించు ప్రయోగము లనేకము లిదివఱ కొపంగఁబడినవి.

ఆ అను, నిర్దేశ సర్వనామమునకు అర్ అనునది చేర్పఁగా అ (వ) ర్ - వారు అను రూపమేర్పడెనని చెప్పఁబడినది. ఇందు బహువచనమును సూచించు (ర్) రకారము రెండను నర్థముగల ఇర్ యొక్క అవశిష్టరూపమై యుండవచ్చును కళ్ అనుదాని ననుచిత విభాగముచేయఁగా నేర్పడిన ళ్ ళు అను బహువచనరూపములు తరువాత నేర్పడినవి. వీనికంటె ర్ అనునదే పూర్వరూపము. అంతకంటెను బూర్వతరమైన బహువచన ప్రత్యయమున మ్ కానవచ్చు చుండెను అది సముచ్చయార్థకమైన ఉమ్ నుండి యేర్పడి యుండునని కాల్డ్వెల్ మున్నగు వారి యూహ. నాన్ - నామ్; నీన్ - నీమ్; తాన్ - తామ్ అను సర్వనామముల ప్రాచీన రూపముల బహువచన రూపములలో మ్ చూపట్టుచుండుట యిందుకు దార్కాణము. నీర్, తార్ అను మధ్యమ పురుష ఆత్మార్థక సర్వనాముల బహువచన రూపము లందుఁ గనఁబడు రకారము నీమ్, తామ్ అను వానిలోని మకారము కంటె నర్వాచీన రూపము. నీమ్ అనునది పూజ్యార్థమున నేక వచనము నందే స్థిరపడఁగా బహువచనమును సూచించుటకు నీర్ అను క్రొత్త రూప మేర్పడి యుండును.[1] ప్రథమపురుష బహువచన రూపము నందు (స్త్రీ-పుం) అవర్ అను రకారాంతరూపమేకాని మకారాంత రూపము కానవచ్చుటలేదు దీనిని బట్టి అవరను ప్రథమ పురుష బహువచన రూపము కంటె తామ్, నీమ్, నామ్ అను నాత్మార్థక మధ్యమోత్తమ పురుష బహువచన రూపములు పూర్వతరము లని యూహింప వచ్చును.

ప్రథమ పురుషైక వచన రూపమైన అవన్ అనునదియే తమిళమున ద్వితీయాది విభక్త్యంగ రూపముగా నున్నది. అందు దానికే విభక్తి ప్రత్యయములు చేర్పఁబడు చుండును. (అవనాల్, అతనోడు, అవనుక్కు మొద)

---

1. ఉపపత్తులు కల్పింప లేనప్పుడు పూజ్యార్థ మని చెప్పివేయుట పరిపాటియైనదనియుఁ బ్రజాసామాన్యమునం దీ పూజ్యార్థ భావన లేదనియే చెప్పవచ్చుననియు, భార్య భర్త నుద్దేశించి పల్కు నప్పుడును అగ్రవర్ణముల వారి నుద్దేశించి యవర వర్ణముల వారు పల్కు నప్పుడును నీవని ప్రయోగించుటయే పెక్కు ప్రాంతములఁ గానవచ్చుట యిందుకుఁ దార్కాణ మనియు, నీమ్ నీర్ అను రెండు బహువచన రూపములును వాడుకలో నుండఁగా, వానిలో నొకటి కాలాంతరమునఁ బూజ్యార్థకముగఁ మారె ననియు ఆచార్య శ్రీ లక్ష్మీరంజనముగారు తలంచుచున్నారు

తెలుఁగున నట్లుకాక ప్రథమైక వచన రూపమునకు ఇ అను సంబంధార్థమును జేర్చుటచే విభక్త్యంగ రూపము కలుగుచున్నది. (వానిని - వానిచేత, వానికై). ఇట్లు ఇ చేరుట తెలుఁగునకు మాత్రమే ప్రత్యేకమైన సంప్రదాయముగాఁ గాన వచ్చుచున్నది. ఇతర ద్రావిడ భాషల నుండి విడివడిన పిమ్మట నీ పద్ధతి యందు స్వతంత్రముగా నేర్పడి యుండును. ఇట్లే అవర్ అను దానికి ఇ చేర్పఁగా వారి అను బహువచన విభక్త్యంగ రూప మేర్పడినది.

తెలుఁగున స్త్రీ తిర్యగ్జదములను సూచించు సర్వనామైకవచన రూపము అది అనునది అదు అను ప్రాచీన రూపమునుండి యేర్పడినది. చివరి ఉకార మికారముగా మాఱుటకంటె నిం దెక్కువ భేద మేదియుఁ గానిపింపదు. కాని దాని ద్వితీయాది విభక్త్యంగ రూపములలో మాత్రము వాని యను పుంలింగ రూపముయొక్క సామ్యముచే నెక్కువ మార్పు కలిగినట్లు కనఁబడుచున్నది. అది అను దానిలోఁ జివర నకారము లేనప్పటికిని దాని విభక్త్యంగ రూపము లలో నది కనఁబడుటకు పుంలింగ రూపసామ్యము తప్ప వేఱు కారణము గోచ రించుట లేదు. అది, ఇది, ఎది అనువానికి దాని, దీని, దేని అనునవి విభక్త్యంగ రూపములు. ఈ రూపములు చాళుక్య యుగమునందలి శాసనములలోఁ బెక్కు చోట్లఁ గానిపించుచున్నవి కాని ప్రథమైక వచన రూపములు మాత్ర మెచ్చటను బ్రత్యేకముగాఁ గానవచ్చుట లేదు ఈ క్రింది ప్రయోగమున నది భూతకాల క్రియాజన్య విశేషణముతోఁ గూడి వాడఁబడి యున్నది.

వస న్తిపోటి చోళమహాదేవుల పూల్లవట్టమ్మున వారికి విరిపయితి పులొంబున రెండుతోటలు స (రి) హితంబ రాచమానంబున మున్నూఱునేల మాళ్వడుగు రట్టగుళ్ల ఆణతిగాను వస న్తీశ్వరంబు నా కిచ్చినది. (రామేశ్వర స్తంభ శాసనము) ఇచ్చినది - మున్నూఱునేల అనున విచ్చట అధికరణ (appositiona) సంబంధములో నున్నవి. స్వార్థముననే యున్నను ఇచట ఇచ్చినది (ఈఁబడినది) అను కర్మణ్యర్థమును సూచించుచున్నది. "దేవులచే నీఁబడినది మున్నూఱునేల" యని యర్థము.

రేనాటి చోళుల శాసనములు కొన్నింటిలో దేవి యనుటకు బదులు తేవి యను రూపము కానవచ్చుచున్నది. తమిళమున వదు అనునది దకారాంతము

గానే యుచ్చరింపఁబడినను అతు అవియే వ్రాయఁబడుచుండును అందు దాని విభక్త్యంగరూపము అత్తు అగుటయు దాని పూర్వరూపము తకారాంతముగనే యుండె నను విషయమును వ్యక్తము చేయుచున్నది తెలుఁగున విభక్త్యంగ రూపమునకు ఇ అనునది చేరు నాచార ముండుటచే నది - అది, అతి యని యేర్పడి యుండవలసినది. కాని 'వాని' యను పుంలింగ విభక్త్యంగరూపము సామ్యముచే నది నకారమును గూడఁ జేర్చుకొని. వర్ణవ్యత్యయముచే దాని యను రూపమును బొందినది (అదు, ని - దాని) ఇట్లే ఎది, ఎతి యనువానికి దేని, తేని యనునవి విభక్త్యంగ రూపములుగా నేర్పడియుండును. అది, ఇది ఎది యనునవి తెలుఁగున విప్పు దేసందర్భమునను బరుషాంతములుగా నుచ్చ రింపఁబడవు. కాని వానికిఁ గూడఁ దమిళమునవలెఁ బరుషాంతత్వ మొకప్పు డుండెననుటకు రేనాటి చోళుల శాసనములలోఁ గనవచ్చు తేనియను రూపము తార్కాణముగా నున్నది.

తేని ఉచ్చిన వాన్డు పఞ్చమహాపాతక సంయుక్తున్డుగు  ఇందుకూరు శాసనము
తేని ఉచ్చు  మహా పాతక  గు  విక్రమాదిత్యుని చిలంకూరు శాస.
తేని (వి)కి న్డు గోణ్డపుల్వ  వల్లచెఱువుపల్లి శాస.
తేని ఱచ్చిన వాన్డు పఞ్చమహా పాతకున్డకున్  పొట్లదుర్తి మాలెపాడు శాస

ఈ పైవానిలో తేని యనునది సంబంధార్థక సర్వనామముగా (Relative Pronoun) వాడఁబడి యున్నది. ఇట్లు యత్, తత్ అను సర్వనామములను సంబంధార్థక ములుగా వాడు సంప్రదాయము సంస్కృతములో నున్నది. ఆ ప్రభావమే యీ శాసనములలోఁ గూడఁ గనవచ్చుచున్నది. తెలుఁగుననే కాక ద్రావిడ భాష లన్నిటనుగూడ నిట్టి వాక్యయోజనము సంస్కృతము నుండి వచ్చినదే తెలుఁగున సహజముగా వ్రాయునప్పు డిట్టి వాక్యమును "ఇచ్చిన పన్నస. తేనిని ఒచ్చువాన్డు" అనునట్లు కాక "ఇచ్చిన యీ పన్నసను ఉచ్చు వాన్డు పఞ్చ మహా పాత కున్డగు" నని వ్రాయఁబడు చుండును. పుంలింగమున నేకవచన బహు వచనములందు ఎవ్వణు, ఎవ్వరు అనునవి సంబంధార్థమున వాడఁబడియున్నవి
ఎవణ్డేని రక్షిఞ్చు వానిద ధర్మవు  గురిందగుంట శాస.

వేఙ్గినాటి కెవ్వరు రాజులైరి వారుం బూర్వ్వ స్థితిం దప్పక పాలించువారు -
క్రి. శ. 1006  ఆహవమల్లదేవుని శాసనము. (S. I I. VI. నెం 2)

ఏ అను ప్రశ్నార్థక సర్వనామమునకు వాణ్డు, వారు అనునవి చేరఁగా పీరూపము లేర్పడినవి. ఏ యందలి దీర్ఘము హ్రస్వముకాఁగా వకారము ద్విరుక్త మగుట సంభవించినది.

చాళుక్యయుగము నందలి శాసనములలోని సర్వనామ రూపముల కీ క్రిందఁ బ్రయోగములు చూపఁబడుచున్నవి. వాన్డు వాణ్డు అనువాని కిదివఱకే పెక్కు ప్రయోగములు చూపఁ బడినవి.

దీని రక్షించిన వానికి నలజానంపాడు శాస. E I XXVII పుట 203.
దేవి సల్పిన వానికి మాలెపాడు శాస.
వాని జీవితంబు దణ్డువు కొఱవి శాస.
ఉదయించె వానికిన్, వానిచే కామసాని గూడూరు శాస.

వారు :

దీని కాచి కుడిపినవారు, వక్ర పల్కినవారు పెలుదుర్తి శాస.
కళా కణ్డుగ మిచ్చి కుడుచువారు, పిప్పర్ల శాస.
ప్రతిరవలు వచ్చువారు, దీని గాచినవారు, ఇచ్చినవారు, వడచినవారు,చరిగిన్చువారు
విష్ణువర్ధన మహారాజు బుదమ నారాయలపాడు శాస
కాపెడువారు ఏడువారం పాలెపు శాస.
ఏవోఁకక పున్నమం బెట్టువారు. S. I. I. X నెం. 598.
వారిచేత పట్టం కట్టబడి కురుబల కోట శాస.
పూల్ల వట్టమ్మున వారికి రామేశ్వర స్తంభ శాస.

యుద్ధమల్లుని బెజవాడ శాసనమున వారు అను దానిపై మరల బహువచన లు వర్ణము చేరిన రూపము కనఁబడు చున్నది. నలియం బయ్యారల వెల్వఱించిన (ద్వితీ - బహు).

ఎవణ్డు గురిందగుంట శాస.
ఎవ్వరు రాజులైరి ఆహవ మల్లదేవుని శాస. S. I. I. VI నెం. 2.

అది :

| | |
|---|---|
| వసన్తీశ్వరంబున కిచ్చినది | రామేశ్వర స్తంభ శాస. |
| వానిద ధర్మువు | గురిందగుంట శాస. |
| భటరకళ రట్టొడి యిచ్చినది | మైలవరము శాస. |

చాళుక్య యుగమునందలి శాసనములలో ఇది, అవి, ఇవి, ఎవి అను రూపము లెచ్చటను వాడఁబడి యుండలేదు కొఱవి శాసనమున " మఱియు యెవ్వియేవి నాతవి చేయంబడి" యనుచోట ఏవి యను దానికి రూపాంతరమైన ఎవ్వి యను రూపము కనఁబడుచున్నది.

దావి, దీని, తేని, దానికి, దీనికి అను వాని కుదాహరణము లిదివఱ కొసంగఁ బడినవి.

| | |
|---|---|
| దేనికి వ్రక్రమ్ము పచినవాన్డు | ఉరుటూరు శాసనము. |
| | రామేస్వర స్తంభ శాసనము. |
| తేని ఒచ్చినవాన్డు | ఇందుకూరు, చిలంకూరు, పొట్లదుర్తి |
| | మాలెపాడు శాసనములు. |
| దేని సల్పినవానికి | మాలెపాడు శాస. |
| దానికి కలశబిద్దట్లు | యుద్ధమల్లుని బెజవాడ శాస. |
| దీనిం జేఱ్ఱోభు యేలెసు | Do |

ఇది యనుదానికి ఇవి యనునది బహువచన రూపము. 'ఇది' కి - దీని యను విభక్త్యంగ రూప మేర్పడినట్లే ఇవికి వీని అను రూపమేర్పడినది. ఈ రూప మద్దంకి శాసనమునఁ - గనఁబడుచున్నది.

దమ్మపురంబున దమ్ము వులు. వెని (వీని) రక్షిచ్చినవారికి అశ్వమేధంబున ఫలంబు అగు.

ఆత్మార్థక సర్వనామమున కేకవచనమున తాను బహువచనమున తాము తారు అనునవి రూపములుగా నున్నవి. వీనికి వరుసగా తన, తమ అనునవి విభక్త్యంగ రూపములు.

| | |
|---|---|
| తానుం గట్టించెం గ్రమంబున | యుద్ధమల్లుని బెజవాడ శాస. |
| దీవిన్దారు నిల్పినవారు | Do |
| తనధర్మవొడఁబడి కాచు నృపులకు | Do |
| పాపంబు దమకు | Do |

రాజ్యమ్బు (మ్బు) నన్దన పూర్వవృత్తికి వక్రమ్బు వచ్చిన
కాడువెట్టి దత్తియాచ న్దన్ను నెం. 183. క్రీ. శ. 650.
ఓన్నవాని దాబరగంగ జేతబట్టి
బంధుజన సేవ్యుండు దానుదయించె కామసాని గూడూరు శాస.
తమయన్న రాజ్యశ్రీకెల్ల కొఱవి శాస.
న్దానయ ఈకుద్దై కొఱవి శాస.
దా (తా) ను + అ = తాన + అ = తానయ.
అతని కొట్టించి, అతని చేయంబడి - కొఱవి శాస.
అతఁడు (ప్రథమావిభక్తి రూపము) అతని (విభక్త్యంగ రూపము)

గుణగ విజయాదిత్యుని ధర్మవర శాసనమున "వచ్చిన వారు దంబుసల్పిన(నిల్పిన) వారు" అను రూపమున్నది. ఇచ్చట తంబు అనునది తానుయొక్క బహువచన రూప మనియు, తాము అను నది దానికిఁ దరువాత నేర్పడిన రూప మనియు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు తెల్పుచున్నారు [1]

ఉత్తమ మధ్యమ పురుష సర్వనామ రూపములు .

| | |
|---|---|
| నాకు బణిసేసిన | విప్పర్ల శాస. |
| నీవు నా ప్రాణసమానుణ్డవైన చెలివి | కొఱవి శాస. |
| నీ చేసిన యుపకారంబునకు, నాకెల్ల | Do. |

సంఖ్యా వాచకములు :

చాళుక్యయుగమునందలి శాసనములలోఁ బెక్కు సంఖ్యావాచక రూపములు కానవచ్చుచున్నవి. ఇవి యితర దాక్షిణాత్య భాషలందలి సంఖ్యా వాచకములతో

---

1. This tambu seems to be a later form of tamu. S. V O Inst Journal. XIII - 1 పుట 68.

సన్నిహిత సంబంధమును సూచించుచు వాని చరిత్ర పరిణామమున నన్వేషించు వారికెన్నియో విధములఁ దోడ్పడుచున్నవి.

ఒణ్డు - ఒకొటి, ఒక్కటి - యుద్ధమల్లుని బెజవాడ శాసనమున "త్రినయన సుతు జ్ణొణ్డు సోంట మెచ్చక" అనుచోట నుండు అను రూపము కనవచ్చుచున్నది అది యిచ్చట నన్యమైన యను నర్థమున వాడఁబడినను సహజమైన దాని యర్థ మొక్కటి యనియే. పై శాసనమందే "గొంగగ్లా కొరులిందు విడిసి" అనువెర ఒరుడు అను పదమునకు బహువచనమైన ఒరులను రూపము కనవచ్చుచున్నది ఈ రెండు రూపములును ఒర్ అను మూల ధాతువు నుండి యేర్పడినవి. తమిళమున ఒరు అను విశేషణ రూపము సాధురేఫముతోనే వ్రాయఁబడుచున్నను ఒణ్ఱు, ఒణ్ఱె (తమి), ఒణ్డు (తెలు) ఒన్జి (తుళు) మున్నగు రూపములు మూలరూపమునందలి రేఫము వల్లినమ్ రేఫమనియే సూచించుచున్నవి. ఈ రేఫము నాసిక్యమును బొందినప్పుడు ఒణ్డు అను రూపమును, వాణ్డు వాణ్డు అయినట్లే దానినుండి ఒణ్టు అను రూపమును గలుగుచున్నవి. ఒంటి యనునది ఒణ్డు నుండి యేర్పడిన యౌపవిభక్తిక రూపము. ఒర్ ధాతువునకు అగు ధాతువు యొక్క ప్రాచీనావశేషమైన క చేరఁగా ఒర్క అను రూపమును బిమ్మట సమీకరణముచే ఒక్క అను రూపమును ఏర్పడుచున్నవి. ఒక్క, ఒక అను రూపములేర్పడిన పిమ్మటనే ఒండు అర్థాంతరములందు వాడఁబడఁ జొచ్చెను. ఒక అను ప్రాతిపదికకు డు ప్రత్యయము చేరఁగా ఒకడు అను రూప మేర్పడుచున్నది ఇది మహద్రూపముగాను అమహద్రూపముగాను గూడ వాడఁబడును. దీనికి మహద్వాచకమైనప్పుడు ఒకవిన్, ఒకవిచేత అను రూపములును, అమహద్వాచక మైనప్పుడు ఒకటిన్, ఒకటిచేత, ఒకటికి మొదలైన రూపములను గలుగుచున్నవి. అమహద్వాచకమైన ఒకడు అను రూపమునుండి ఒకటి యను నౌపవిభక్తిక విభక్త్యంగ రూపమేర్పడఁగా ననుచిత విభాగముచే నదియే విశేష్యముగాఁ గూడ గ్రహింపఁబడినది. ఒకడు అను రూపమునందు డు ప్రత్యయ మెట్లు వచ్చెనో చెప్పుట కొంచెము కష్టము. అది అర్వాచీన రూపమగుటచే ఒండు యొక్క సామ్యమున డు అను ప్రత్యయమును జేర్చుకొని యుండు నవియు, లేదా ఒక + ఒణ్టు - ఒకొణ్టు - ఒకొణ్డు అనునట్లుగా నేర్పడిన పద సమ్మేళనజన్యమైన (pleonastic) రూపమై యుండునవియు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు చెప్పుచున్నారు.[1] ఒక్క, ఒక్కండు, ఒక్కటి అను

1. S. V. O Journal XIII 2 పుట 2.

ద్విరుక్తకకారముతోఁ గూడిన రూపములలో సమీకరణ పరిణామము కాన వచ్చుటచే నవి ఒక, ఒకఁడు, ఒకటి అను రూపములకంటెఁ బ్రాచీన తరములని చెప్పవచ్చును.

ఒకనాడు — కొఱవి శాస.

వణ్పాద్యది యొకటి యగునేణ్టి — వెంకయచోడుని దొంగలసానికనుమ శాస.

ఒక్కటికి — భీమేశ్వరస్వామి దేవాలయమునకుఁ దూర్పుననున్న శాస. S I I X నెం. 17.

ఒణ్డు పోటు గొరగల్గాకొరులిందు ఏడిసి: — యుద్ధమల్లుని బెజవాడ శాస

రెండు అను సంఖ్యావాచకము తమిళమున ఇరండు కన్నడమున ఎరడు మలయాళమున రెణ్డు అను రూపములతోఁ గానవచ్చుచున్నది ఇరణ్డు-ఎరణ్డు-రె అణ్డు (అకారలోపముచే) రెణ్డు అను రూపములు క్రమముగా నేర్పడెనని చెప్ప వచ్చును. తెలుఁగులోనేకాక యితర ద్రావిడభాషలలోఁ గూడ ఇరు అను దానితో నారంభించు సమాసపదములు పెక్కు కావిపించు చుండుటచే నీ రూపములు ఇర్ అను మూలధాతువునుండి కలిగెనవి తోఁచుచున్నది. (తమి. ఇరుబదు - తెలు. ఇరువది - కన్న. ఇప్పట్టు.) ఇరణ్డులోని డువర్ణము ఒణ్డ్రు. మూణ్డ్రు - ఒణ్డు, మూణ్డు అనువాని సామ్యమునే గలిగి యుండును. ఇర్ ధాతువులోని తొలి యచ్చు హ్రస్వేకారముగానే కనఁబడుచున్నను ఈరేడు (=14) ఈరారు మున్నగు రూపములలో నది దీర్ఘముగానే గోచరించు చున్నది.

ఇరవది యాది నాల్కుమఱుస్తుళ్లు — ఎఱ్ఱగుడిపాడు శాస.

రెణ్డుతోటకు — రామేశ్వర స్తంభ శాస.

ఇరువాది రెండు వచ్చరమ్బుళ్ — చామలూరు శాస,

| | |
|---|---|
| రెణ్డురేవులు | వెంకయచోడుని దొంగలసానికనుమ శాస |
| ఇరువుద్ది ఆళ్లపట్టుకుఱితి | విప్పర్తి శాసనము. |
| రెందువటి, రెండువట్టి | మంగిదొగరాజు లక్ష్మీపుర శాస |
| ఇరుబాదిమూండు ప్రవర్తిల్ల | విక్రమాదిత్య బలికుల బాణరాజుల శాస. |
| ఇరువోదినాలుగు | అగ్గపరాజుపొదిలి శాస. |
| నూటయిరువది మతుడ్లు | బికిరాజు శాస. S I. I X 509 |
| పడ్డెణ్డు వుట్లు | Do |
| రెణ్డు గద్యలు | చోడ మహారాజు సూర్య గ్రహణకాల శాస S I. I X 595 |
| రెణ్డేరులనడిమి | నందంపూండి శాస. |
| ఇరుభది ఎణ్డ్లు అగు | దిమ్మగుడి శాస. |
| రెణ్డు వాడల | అహదవకర శాస. |
| పడ్డెణ్డు | అద్దంకి శాస. |
| పంద్రెడు వేళ్ల | కామసాని గూడూరు శాస. |

వెలుదుర్తి శాసనమున ఇమ్మడి అనురూపము కనవచ్చుచున్నది ఇర్ + మడి (సమీకరణముచే) ఇమ్మడి అనునట్లు మాఱియుండును. మకారమునకు ముం దిర్‌లోని రేఫము పెక్కుచోట్ల వకారముగా మాఱుచున్నది ఇనుమడి, ఇనుమాఱు, ఇనుమిక్కిలి మొద.

మూండను సంఖ్యావాచకము పూర్వపు శాసనములలో నీ క్రింది రూపములతోం గనవచ్చు చున్నది.

| | |
|---|---|
| మూన్నువుటు ఆఱ్లు పట్టు క్షేత్రంబు | వలజానం పాడు శాస. |
| మున్నూఱు నేల | రామేశ్వర స్తంభ శాస. |
| మూటికి | జయసింహ వల్లభుని విప్పర్ల శాస. |
| ముప్పది | విప్పర్తి శాస |
| ఇరుబాదిమూండు ప్రవర్తిల్ల | విక్రమాదిత్య బలికుల బాణరాజుల శాస. |

| | |
|---|---|
| మూనూఱు | బాణరాజుల శాస. భారతి V-II పుట 792. |
| మూణ్డుద్రమ్మములు | గురిందగుంట శాస |
| మూదముప్పయిని | కామసాని గూడూరు శాస. |

వీనిలో మూన్టు అనునది ప్రాచీనరూపముగాఁ గాననగును.

ఒన్టు అనుదాని వలెనే యిది మూన్టు మూణ్డు మూణ్డు మూఁడు అను రీతిని బరిణామము చెంది యుండును. దీనికి వల్లినమ్ రేఫముతోఁ గూడిన మూఱ్ అనునది మూలధాతువు. కన్నడమున మూరు అను సాధురేఫముతోఁ గూడిన రూపమున్నను ప్రాచీన శాసనము లందలి మూన్టు అను రూపమును బట్టి అందలి రేఫము శకట రేఫమే యని చెప్పవచ్చు ను. మూఱ్లోని రేఫము పర హల్లుతో సమీకరణము చెందునప్పు డందలి దీర్ఘోకారము హ్రస్వ మగుట సంభవించు చున్నది.

మూఱ్ + పది = ముప్పది.
మూఱ్ + నూఱు = మున్నూఱు.

నాళ్లు పరమైనప్పుడు మూన్నాళ్లు, మూనాళ్లు అను రూపములు కనఁబడు చున్నవి ఇచ్చట దీర్ఘోకారము హ్రస్వము కాలేదు. పై బాణ రాజుల శాసనములోని మూనూ ఱు అను రూపమునఁ గూడ నది దీర్ఘాచ్కముగానే ప్రయోగింపఁ బడినది.

ప్రాక్చాళుక్య యుగము నందలి శాసనములలో ముయ్యార్ కూటువ అను పదము వాడఁబడి యుండుటచే నప్పటికే దీర్ఘోకారము హ్రస్వమైనట్లు తోఁచుచున్నది. చాళుక్య యుగము నందలి శాసనములు పెక్కింటిలో ముయ్యలుక్కట్టు (రెండవ అమ్మరాజు మచిలీపట్టణ తామ్ర శాస) అను పదియు దాని రూపాంతరములును గనవచ్చుచున్నవి

నాలుగు అనునది కన్నడమున నాల్కు, తమిళ మలయాళము లందు నాన్కు, నాన్గు అను రూపములతోఁ గనఁబడు చున్నది. తెలుఁగునఁ గూడ ఎఱ్ఱ గుడిపాడు శాసనములో (క్రీ. శ. 6) ఇరవది యాది నాల్కు అను కువర్ణముతోఁ గూడిన రూపము ప్రయోగింపఁ బడినది. అకు, అగు (to become) అను ధాతువు యొక్క అవశేషమైన కు అప్పటికే ప్రత్యయముగా వాడఁబడు చుండెనని తెలియు చున్నది. తమిళ మలయాళములలో కుప్రత్యయ విహీనమైన నాల్ అనునదే

విశేషణ విశేష్య రూపముగా వాడఁబడు చున్నది. కొన్ని చోట్ల సంధరి దీర్ఘాకారము హ్రస్వ మగుట యందును గాన వచ్చుచున్నను దీర్ఘయుక్త రూపములే హెచ్చు.

తమి. నాల్పదు; 40 నానూఱు.
కన్న. నాల్వట్టు; నాల్నూఱు.
మల. నాల్వదు.

తెలుఁగున నిట్టి సమాసములలో హ్రస్వాకారముతో గూడిన రూపములే గోచరించు చున్నవి. నలువది, నన్నూఱు.

| | |
|---|---|
| ఇరువది యాది నాల్క మఱున్నల్లు | ఎఱ్ఱగుడిపాడు శాస. |
| నల్వా ద్యది యొకొటి యగునేణ్ణి | దొంగలసాని కనుమ శాస. |
| నాలుగు పుట్టు | బుదమనారాయలపాడు శాస. |
| ఇరువోదినాలుగు | అగ్గపరాజా పొదిలి శాస. క్రీ. శ. 968. |
| నాలుగు స్తానంబులవారును | చోళమహారాజా సూర్యగ్రహణకాల శాస |
| నాల్కను పుట్టు పన్దుంబు | బోదనపాడు శాస. క్రీ. శ. 7. |

ఐదు, ఆయిదు అను రూపములు ప్రాచీన శాసనములలో నెచ్చటను గన వచ్చుటలేదు. ఏను, ఏన్ అను రూపములే యందు వాడఁబడి యున్నవి కొన్నిచోట్ల నను నాసికము కూడ లోపించుటచే ఏ అను రూపమొక్కటే చూపట్టుచున్నది. నన్నయ భారత భాగములోఁ గూడ అయిదు, ఐదు అను రూపములు ప్రయోగింపఁ బడియుండలేదు.[1] కాని యవియే కాలక్రమమున విశేషణ విశేష్య రూపములుగాఁ బ్రచారములోనికి వచ్చినవి. కొన్ని సమాస రూపములలో మాత్రమిప్పు డేను అను రూపము వినఁబడుచున్నది.

అయిదు అను సంఖ్యావాచకమున కితర ద్రావిడ భాషలలోఁ గల రూపములను బట్టి చూచినచో (తమి. ఐన్దు eindu అన్జు (వ్యవహార) ఐవర్

1. ఏడు నూట డెబ్బదియైదు శ్లోకంబులు ఆది. ౧-54 ఏనూట యిరువది యైదు శ్లోకంబులు ఆది. ౧-58 మున్నగు రెండు మూఁడు చోట్ల నైదు శబ్దము ముద్రిత ప్రతులలో నున్నది కాని వ్రాఁతప్రతులలో ఏను అను పదమే యిచ్చటఁ గనఁబడుచున్నది.

(e var); కన్న. ఐదు (eɪdu) అయ్దు; ఐవట్టు (eɪvattu) 50. తుళు. ఐవ (eɪva); తెలు. ఏఁబది. ఏవురు) దీని మూలరూపమగు ఐన్ (eɪn) లోని మొదటి యచ్చు ద్వ్యచ్సంయోగాత్మకమైన (d phthong) దనియు. నది ఏను. ఐన్దు (eɪndu) అన్దు రూపములుగాను. ఎయ్దు. అయ్దు అను రూపములుగాను బరిణమించెననియుఁ జెప్పనగును. ఉత్తమ పురుషసర్వనామైకవచన రూపముననుమఱి కొన్ని యితర రూపము లందును ద్వ్యచ్సంయోగాత్మకమైన యాద్యచ్చు రెండు విధములైన రూపములకుఁ దావిచ్చుట యిదివఱకు సూచింపఁబడినది.

తమి. యాన్—అన్ (నాన్) తెలు. ఏను—నేను.
యార్—అర్ ఎవరు—ఏరు.
యాణ్డు—అణ్డు ఏన్డు—ఏడు.

యానై మల. ఆన కన్న. తుళు ఆనె ఏనుఁగు.

ఐన్దులోని తు అనునది నపుంసకలింగ రూపము లేర్పడునప్పుడు చేరు ప్రత్యయమనియు. నది ఒణ్డు. రెణ్డు అను సంఖ్యావాచకములలోఁ గనఁబడు డు ప్రత్యయముతో సమానమైనదనియు కాల్డ్వెల్‌గారూహించి యుండిరి. కాని ఒణ్డులోని డు దంత మూలజములైన (alveolar) పదాంత నకార ళకార రేఫముల సమ్మేళనముచేఁ (ఒన్టు—ఒణ్ద్రు—ఒణ్డు అను నట్లుగా) గల్గి నదే కాని తు ప్రత్యయము చేరుటచేఁ గలిగినది కాదు. ఐన్ అనునది అజంత రూపమును బొందునప్పుడు త్ అను దానిని సహాయధ్వనిగా గ్రహించి యుండును. లేదా అది కాల్డ్వెల్ గారని న ట్లమహదర్థకచిహ్నమైన ప్రత్యయ మైనను గావచ్చును. అనునాసికలోపముచేఁ బిమ్మట ఎయ్దు అయ్దు అను రూపము లేర్పడియుండును.

| | |
|---|---|
| ఏబది తిరువుల పాలకు | ఉరుటూరు శాస. |
| సంవత్సరమ్బుళ్ యేనగు నాణ్డు | రామేశ్వరస్తంభ శాస. |
| ఏథాది మఱుస్తుల్లు నేల | చామలూరు శాస. |
| ఏను మాఱుత్రు | మాలెపాడు శాస. |
| ఏనువుట్లు | విప్పర్తి శాస. |

పదేన్దుంబు లక్ష్మీపుర శాస.
ఏనుంద్రమ్మలు, ఏనూఱుంద్రమ్మలు కొఱవి శాస.
(రెండవ దానిలో నానునాసిక లోపము.)
ఏనూఱు బాణ రాజుల శాస. భార. V-II పుట 792.
ఏనువుట్లు ఇలపకుఱ్ఱు శాస.
ఏనగునేణ్టి చా. భీ. - ధర్మవర శాస.
తిప్పలూరు శాసనములో ఏమ్బదియె అను రూప మున్నది.
ఏన్ + పది. పరమైన ఓష్ఠ్య పకార ప్రభావముచే దంత్యానునాసికము మకార ముగా మాఱినది.

ఆఱు అను రూపము పెక్కు ద్రావిడ భాషలలో సమానముగానే యున్నది తుళులో మాత్ర మాజి యను రూప మున్నది. ఒన్టు, మూన్టు అను వానిలో వలె నిందు శకటరేఫమునకు ముం దను నాసిక మేర్పడి యుండలేదు. సమాసము లం దాఱు లోని దీర్ఘము హ్రస్వ మగుచున్నది. తమి. అరుబదు. కన్న. అరువట్టు తుళు. అజిప తెలు. అఱువది. ఏడువాడలపాలెపు శాసనములో అఱువది వేలేండ్లను ప్రయోగ మున్నది. కొన్నిచోట్ల దీర్ఘము నిల్చిన సమాసములను గన్పట్టు చున్నవి. కన్న. ఆరునూరు తుళు ఆజినూడు. తెలు. ఆర్నూఱు ఆఱను సంఖ్యావాచకమునకు అఱు అనునది మూలధాతువు. విడివడు (to break-off) అను నర్థము గల అఱు అను ద్రావిడ ధాతువే యిది యని కాల్డ్వెల్ గారలి ప్రాయపడుచున్నారు. ఏలయన దీని నుండి సంఖ్యావాచకములను మొదటి చేతిని విడిచి రెండవ చేతి వ్రేళ్ళతో లెక్కింప వలసి వచ్చుచున్నది.

ప్రాచీన శాసనములలో ఏడు, ఏఱు, ఏడు, ఏళు అను రూపములతోఁ గానఁబడుచున్నది.

పదియేడగు నేణ్టి ఇంద్రకీల పర్వతముమీఁది శాస. క్రి. శ. 909.
రేనాణ్డేఝు వేలునేల సూర్యగ్రహణ కాల శాస. S. I. I X 595
ఏఱు వేఱు నేఱంగా కొసినేపల్లి శాస.
రేనాణ్టి యేళువేళు చెన్నరాయనిపల్లి శాస.
రేనాణ్డు ఏఱువేలు భికిరాజు శాస. S. I I X 509

తమిళమునందుఁ గూడ ఏఱు అను రూపమే గోచరించుచున్నది. ఆఱులోని ఆకారమువలెనే ఏఱు లోని ఏకారము సమాసములలో హ్రస్వ మగుచున్నది. తమి. ఎఱు బదు కన్న. ఎప్పదు తుళు. ఎళ్ప. కన్న. ఏళ్నూరు. తుళు. ఏళ్నూదు అను వానిలో దీర్ఘమే విల్చియున్నది. ఏఱు లో ఱ కారము దకారముగా మాఱిన పిమ్మట వర్ణవ్యత్యయముచే ఏడు + పది. ఏడు + బది; డెబ్బది యను రూపమేర్పడినది. అచ్చు హ్రస్వమై పోవుటచేఁ బరహల్లు ద్విరుక్తత్వము నొందినది. ఏఱు లో ఱ కారము ళ, ఱ అను నక్షరములుగా మాఱిన రూపములు కూడఁ బై నొసంగఁబడిన ప్రయోగములలోఁ గనవచ్చుచున్నవి.

ఎనిమిదికి సంబంధించిన శాసనములలోని రూపము లీ క్రింద నొసంగఁబడుచున్నవి.

| | |
|---|---|
| ఎణుంబొది అన్నేట్టి | విప్పర్ల శాస. |
| ఎణుంబొది పుట్లు | Do. |
| నూట ఎణ్మ | బాణరాజుల శాస. |
| నూట ఎనుబొణ్డిఇడ్డ | పెద్దముడియం శివాలయ శాస. S I. I X |
| ఎనుబొది పుడ్ల | అద్దంకి శాస. |

తెలుఁగున నిప్పు డెనిమిది యను రూపము కనవచ్చుచున్నది. తమిళ మలయాళములలో ఎట్టు అనియు, కన్నడమున ఎణ్టు అనియు, తుళులో ఎణ్మ అనియు దీనిరూపములు. వీనికిఁ బ్రాచీనరూపమైన ఎణ్ అనునది (తమి) ఎణ్బదు (80) ఎణ్ణూరు (800) తుళు. ఎణ్బ అను సమాసములలోఁ గనఁబడుచున్నది. ణకారము కన్నడమున మకారముగను (ఎమ్బట్టు) తెలుఁగున నకారముగను మాఱినది. (ఎనుబది). పూర్వశాసనములలో న ణ కారములతోఁ గూడిన రూపములు రెండును చూపట్టుచున్నవి. ఎణుంబొది (విప్పర్ల) ఎనుబొది (అద్దంకి). ఎణుంబొది అనురూపము ఎనిమిది (8) కంటె ఎనుబదికే (80) సన్నిహిత తరముగాఁ గన్పట్టుచున్నది. కాని శాసనమున నెనుబది యనునర్థము సందర్భమునకు విరుద్ధముగా నుండును. ఏలయన నది జయసింహవల్లభుని యెణుంబొదవ విజయరాజ్యసంవత్సరమున వేయఁ బడినది. జయసింహ వల్ల

ఘుఁడు క్రీ. శ. 641 నుండి సుమారు ముప్పదియేండ్లు మాత్రమే పాలించి యుండెను. అందుచే ఎనుబదవ యేట నది వేయింపఁ బడెననుట యసందర్భ ముగా నుండును. ఇందలి (బొది-పొది-పది) బొది పదియొక్క వికార మను టలో సందేహము లేదు. ఎణ్ + ఉమ్ + బొది అని పై శబ్దములను విడఁ దీసినచో ఎనిమిదియును బదియు = మొత్తము పదునెనిమిది యను నర్థము వచ్చును. అప్పుడు శాసనము నందలి సందర్భమునకుఁ గూడ వైరుధ్యముండదు కాని పదికిని ఇరువదికిని గల రూపములన్నియుఁ బదితోనే యారంభించు చున్నవి కాని యా రెండవ సంఖ్యతో నారంభించుట లేదు. (పదునొకటి, పదుమూఁడు, పదునెనిమిది, పందొమ్మిది) అందుచేఁ బై రూప మెనిమిదినే సూచించుచున్నదని యనుకొనుట యుక్తముగా నుండును. అప్పుడిది ప్రస్తుతము వాడుకలో నున్న ఎనిమిదికిఁ బూర్వరూపమై యుండు నని యూహింపవలెను. తమిళ కన్నడములందు ఇణై, ఎణె అను శబ్దములకు జంట యను నర్థ మున్నది. తెనుఁగున ఎన యనఁగా జోడు. దీనిని బట్టి ఎణుంబొది యనఁగా రెండు తక్కువ పది లేక పదికి వెనుక రెండవది యను నర్థము చెప్ప వచ్చును. (ఆం. భా. వి. పుట 453). కాని యప్పుడు ఉమ్ అను దానికి సార్థక్య మేమియు నుండదు. అందుచే నీ శబ్దము యొక్క వ్యుత్పత్తి యిదమిత్థ మని నిర్ణయించుటకు వీలు లేకున్నది. పది వఱకుఁ గల సంఖ్యా వాచకములలోఁ దొమ్మిది యనునదొక్కటే సమస్తపదముగా నున్నది. ఇది పది శబ్దము నుండియే వ్యుత్పన్నము చేయఁబడినది. తొమ్మిది యనఁగాఁ బదికి వెనుకనున్నది లేక ఒకటి తక్కువ పది యని యరము చెప్పఁబడుచున్నది. తమిళమునందలి తొమ్పత్తు, ఒమ్పదు అను శబ్దములు కూడ నిట్లేర్పడినవే ఈ తొమ్మిదియొక్క సామ్యముచేతనే ఎనిమిది యను శబ్దముకూడ నేర్పడిన దని చెప్పవలయును. తుళులో ఎణ్మ అను రూపమున్నది. ఎణ్ + మ అని విడఁదీసి పదిలోని పకారమే యిచ్చట నానునాసిక్యమును బొంది మకార మైనదని తలంపనగును. ఇతర ద్రావిడభాషలలో నెనిమిదిని బదితో సంబంధము గలదానినిగా వ్యుత్పన్నముచేయు నాచారములేదు. మఱియుఁ బది శబ్ద మీ తొమ్మిది, ఎనిమిది యను రెండురూపములలో మాత్రమే మిది గా మాఱు చున్నది. పెఱచోట్ల నది పదిగానే కానిపించుచున్నది.

క్రీ. శ. 849 నాఁటి అద్దంకిశాసనములో ఎనుబొది యను రూప మున్నది. ఇచ్చట ణకారము దంత్యనకారముగా మాఱినది. ఇట్టి మార్పితర

శబ్దములలోఁగూడఁ గనవచ్చుచున్నది. తమి. పణ్ = to do, పని (తెలు) తమి. మణ్ తెలు. మన్ను. ఎణ్ + ఉమ్ + బొది లోని ఉమ్ కూడ నిచ్చట లోపించినది. ఈ శాసనమునఁ గూడ నీ శబ్దమున కెనిమిది యని యర్థము చెప్పవలయునో, యెనుబది యని యర్థము చెప్పవలయునో నిశ్చయముగాఁ దెలియకున్నది. నూట యెనుబొణ్డ అను పెద్దముడియం శాసనములోని రూపమునఁ గూడ నెనుబొది యను రూపమే నిల్చియున్నది. ఎణ్ + ఉమ్ + పొది లోని ఉమ్ ప్రభావముచే పది పొదిగా మాఱియుండును.

తొమ్మిది యను సంఖ్యావాచకము తమిళమున తొమ్బత్తు, ఒమ్బదు అను రూపములతోను, గన్నడ తుళు భాషలలో ఒమ్బత్తు, ఒన్బ అను రూపముల తోను గనవచ్చు చున్నది. తమిళమున ఒర్మ్బ (ormpa) అను రూపము కూడ నున్నది. ఇవన్నియు సమస్తపదములే ఒర్మ్బలోని పూర్వార్థ మేకార్థక మైన ఒరు అనియు, నొకటి తక్కువ పది యను నర్థమునఁ బైసమాస మేర్పడె ననియుఁ జెప్పఁబడుచున్నది. తొన్నూరు, తొళ్లాయిరమ్ అను సమాసములలోఁ బూర్వపదములుగా తొన్, తొళ్ అనునవియే వాడఁబడినవి కాని ఒన్ అనునది వాడఁబడియుండలేదు తెలుఁగున సైతము తొళ్ లేక తొన్ అనునదియే సమాస పూర్వపదముగా స్వీకరింపఁబడినది. తమిళకన్నడములలో తొన్ లోని తకారము లోపించుటచే ఒన్, ఒమ్ పదు = ఒమ్బదు అను రూపమేర్పడినది. ఒమ్ లోని యేకార్థమును బురస్కరించుకొని దానికిఁ దరువాత నొకటి తక్కువ పదియని యర్థము చెప్పుట పరిపాటి యైనది.

ఏడువాదలపాలెపు శాసనములో "తొంబనూటావల్వొది యగు నేణ్డి" యనుచోట తొంబనూట అను ప్రయోగమున్నది. తొంబ నూట వల్వొది యనఁగాఁ దొమ్మిది వందల నలువది (శక 940 + 78 = క్రీ. శ. 1018) యని యర్థము. ఇందలి బ యనునది పదియొక్క అవశిష్ట రూపము. దీనిని బట్టి యా కాలమున తొంబది యనఁగాఁ దొమ్మిది యను నర్థముకూడ నుండెననియు, (cf ఎనిమిది = ఎఱుంబొది) నొకే పదమునకు రెండర్థములుండుటచేఁ గలుగు భ్రాంతిని దొలఁగించుటకై తరువాత నవార్థమునఁ దొమ్మిది యను పదమును నవత్యర్థమునఁ దొంబది యను పదమును స్థిరపడి యుండుననియు, శ్రీనాథుఁడు కాశీఖండమున

తొంబనూఱును దొంబది తొమ్మిదియును
జలజములఁ బూజసేసెను శార్ఙ్గపాణి
గ.

యని తొంబ పదమును దొమ్మిది యను నర్థమున వాడి యుండుటచే క్రీ. శ. 15వ శతాబ్ది వఱకును గూడ నది యా యర్థమున విరళముగనైన వాడఁబడు చుండవచ్చుననియు నూహించుట కవకాశమున్నది. కాని చాళుక్యశాసనము లలోఁ దొమ్మిది యను నర్థమునఁ దొంబది యని వ్యస్త ప్రయోగ మెచ్చటను గానవచ్చుట లేదు. అది సమాసపూర్వాంగమున మాత్రమే తొంబ యను రూప ముతోఁ గానవచ్చుచున్నది. మఱియు నది తొమ్మిదికిని తొంబదికిని భేదము చేయలేని ప్రాథమిక కాలము కాదు. అందుచే నీ విషయమును నిశ్చయముగాఁ జెప్పుటకు వీలులేకున్నది. తొంబ నుండియే సమీకరణముచే తొమ్మయను విశేషణరూపమేర్పడినది. తొంబదికి 'తొన్నూరు' అను పదము తెలుఁగునఁ బ్రవేశించి యుండలేదు.

పది యను సంఖ్యావాచకము ద్రావిడభాషలలో పత్తు - పదు అను రూపములతోఁ గానవచ్చుచున్నది. అదు, ఐదు, ఎదు అనునవి తెలుఁగున నిదంతములుగా మాఱినట్లే పదు అనునది పది యనురూపమును బొందినది. గ్రాంథికప్రయోగములలో నుదంతములతోఁ గూడిన రూపములు కూడఁ గానఁబడు చున్నవి. పదునాలుగు, పదునేను, పదునాఱు మొదలైనవి. లేదా యివి పది + ఉన్ + నాలుగు, పది + ఉన్ + ఏను, పది + ఉన్ + ఆఱు అనునట్లుగాఁ బదిశబ్దమునకు సముచ్చయార్థకమైన ఉమ్ నుండి యేర్పడిన ఉన్ అనునది చేరుటచేఁ గలిగినదని యైనఁ జెప్పవచ్చును. కొన్నిచోట్ల పర పదాద్యక్షరముమీఁది యూనికచే నీ ఉన్ లోపించుటయు రెండుపదములనడుమ హకారము చేరుటయు సంభవించుచున్నది. పదిహేను, పదహారు, పదిహేడు మొదలైన రూపము లిట్లేర్పడినవే. పదులోని ఉకారము లోపింపఁగా నా ఉకారలోపమును బూరించుటకై హకారము కలుగు చున్నదనియు, పధ్నాలుగు, పదహైదు, పదహారు, పదిహేడు, పద్దెనిమిది, పంధొమ్మిది మొదలైన రూపము లీ రీతిగా నేర్పడినవే యనియు నాంధ్రభాషావికాసమునఁ జెప్పఁబడినది. (ఆం. భా. వి. పుట 456.) పదులోని ఉకారము వ్యవహార మునఁ గొన్నిచోట్ల ఇకారముగను గొన్నిచోట్ల అకారముగను మాఱుచున్నది. (పదిహేను, పదమూఁడు, పదహారు, పదిహేడు) పత్తు లేక పది యనునది

సమాసాంగముగా నున్నప్పుడు పెక్కు మార్పులు చెందుచున్నది. సమాసము నందలి పూర్వపదముగా నున్నప్పుడు పత్తు, పన్‌గా మార్పు చెందుచుండును. (పన్—దుబు, పడ్రెణ్డు, పన్‌దొమ్మిది; పన్నిద్దరు) సమా సోత్తర పదముగా నున్నప్పుడు పది వది, బది, బొది అను రూపములను బొందుచుండును. (నలువది; ఏబది, ఎణుంబొది, ఎనుబొది) కొన్నిచోట్ల పదిలోని పకారము భకారముగా మార్పు చెందుచున్నది. ఇట్టి రూపములు లేఖకప్రమాద జనిత ములైనఁగావచ్చును. లేక మాండలికవ్యవహారసిద్ధములైన నై యుండ వచ్చును. ఉచ్చారణమునఁ బదిలోని పకారముపైఁ గలుగుచుండిన యూనికచే వది యల్పోత్తక్షరముగా మాఱియుండును. ఈ యూనికవలననే పదిలోని దకారము లోపించుటయు, ఏభది, ఏభఇ, ఏభై, ముప్పది, ముప్పఇ, ముప్పై; డెబ్బది, డెబ్బఇ, డెబ్బై వంటి రూపములేర్పడుటయు గూడ సంభవించి యుండును. కాని యిట్టి రూపములు చాళుక్య యుగమునందలి శాసనములలో గోచరించుటలేదు.

| | |
|---|---|
| ఏబది తిరువులపాఱకు | ఉరుటూరు శాస. |
| ఏమ్బదియె చామణ కాలధ | తిప్పలూరు శాస |
| ఇరువాదిరెండు వచ్చరంబుళ్ ఏభాది మఱున్తుల్లు నేల | చామలూరు శాసనము. దీర్ఘము లేఖక ప్రమాదము కావచ్చును |
| వళ్ప్వాద్యదియొకటి | దొంగలసాని కనుమ శాస. |
| ముప్పది | ఐత్వ త్తి శాస. |
| పదేన్డుంబు | లక్ష్మీపుర శాస. |
| పదియేడగునేణ్డు | ఇంద్రకీల పర్వత శాసనము 909 క్రీ. శ. |
| తోంభమాటనల్వాది యగునేణ్డి | ఏడువాడలపాలెపు శాస. |
| అఱువది వే లేండ్లు | Do |

ఎణుంబొదిలోఁ బదికి మాఱుగా పొది, బొది యను రూపములు కానఁబడు చున్నవి. గసడదవాదేశముచే నందలి ప వకారముగా మాఱఁగా వల్వొది యను రూప మేర్పడి యుండును.

| | |
|---|---|
| ఇరుబాది మూండు | విక్రమాదిత్యబలికుల బాణరాజుల శాస. |

| | |
|---|---|
| పస్దుబు | పెట్లూరు శాస. |
| ఇరువోదినాలుగు | అగ్గపరాజు పొదిలి శాస. |
| నూటయిరువది మఱుతుడ్లు | బికిరాజు శాస. S I I X 509 |
| పట్టె ణ్డుపుట్లు | Do |
| పం(డ్రెదువేలు | కామసాని గూడూరు శాస. |
| మూదముప్పయిని | Do. |

నూటానల్వోది, ఇరువోదినాలుగు, ఇరుబాది మూండు అను ప్రయోగములు మాండలిక వ్యవహారసిద్ధములై యుండును.

ద్రావిడ భాషలన్నిటియందు శతమునకు నూఱను పదము కనఁబడు చున్నది. ప్రాచీనకాలపు శాసనములలో సైత మీ పదమే యున్నది. మనమిప్పుడు వాడు వంద యను పద మెచ్చటను గ్నానరాదు. నూఱుయొక్క విశేషణరూపము నూట, విభక్త్యంగరూపము నూటి. నూఱులోని శకటరేఫము ద్విరుక్తము చేయఁబడుటచే నూట్టు అను రూపమేర్పడును. అది చిఱు, చిట్టు, చిట్టు అను వానివలె నూట్టు అని యుచ్చరింపఁ బడుచుండును. సంబంధార్థమైన అకారమును జేర్పఁగా నది నూట్టు అవియు, ఇకారము చేర్పఁగా నూట్టి అనియు మాఱి తరువాత నూట, నూటి అను రూపములను బొందినది. శకటరేఫము ద్విరుక్త మగుటచే నేర్పడిన యీ ట + ఇ = టి అనుదానినే వ్యాకరణకర్త లౌపవిభక్తిక ప్రత్యయముగా వ్యవహరించుచుందురు.

| | |
|---|---|
| ఏనూఱుంద్రమ్మలు — | కొఱవి శాస. |
| తోంభనూట నల్వోదియగునేణ్డి | ఏడువాడల పాలెపు శాస. |
| మూనూఱు / ఏనూఱు | బాణరాజుల శాసనము భారతి V-11-792వ పుట. |
| నూట యిరువది మఱుతుడ్లు | బికిరాజు శాస. S. I. I. X 509. |
| నూట (ట్ట) యెనుబొన్డ ఇద్ద | పెద్దముడియం శివాలయ శాస |
| నూఱుమాఱుతు | మోపూరు భైరవాలయ శాస. |

ఇచ్చట నూఱు అనునదియే విశేషణముగా వాడఁబడినది.

సహస్రమునకు ద్రావిడ రూపమైన వే అను పదమొక్క తెలుఁగులోనే కనఁబడుచున్నది. ఇతర ద్రావిడ భాషలలో సహస్రమునుండి యేర్పడిన (తమి. మల.) ఆయిరమ్ (కన్న) సవిర, సావిర (తుళు) సార అను రూపములు వాడఁబడు చున్నవి. వే అనుదానికి బహువచన రూపము వేలు (ళు) విశేషణరూపమును ప్రథమైకవచనరూపమును సమానములే. వేగవిలలను (ఇలపకుఱ్ఱు శాస.) వేచెఱువుళు (లక్ష్మిపుర శాస.) వేవాన్రుగ్లు (మాలెపాడు శాస.). వే శబ్దము వేయు వేయి అనురూపములతోఁ గూడఁ గొన్ని శాసనములలో వాడఁబడినది.

| | |
|---|---|
| వేయు గుళ్లవు | బుదమ నారాయల పాడు శాస. |
| వేయు చెఱువు | Do. |
| వేయి గవిలాళు | Do |
| వేయి గావిలల | ఏడు వాడల పాలెపు శాస. |
| వేయి గుళ్లను. | |

సిద్ధివేయు రేనాణ్డు ఏళ్తి వేల ఏలుచున్తి — మాలెపాడు శాస.

వేయులోని ఉకారము సముచ్చయార్థకమైన ఉమ్ (ఉన్) అనుదాని యవశేషము కావచ్చును. వేయిలోని యి ( వే, ఇ - వేయి) శ్రవణ సౌష్ఠవమునకై యేర్పడినదేయై యుండును. ఇప్పుడు వేయి అను రూపమే విశేషణ విశేష్యములుగా వాడఁబడు చున్నది. కాల్డ్వెల్‌గారు అధికముగా నుండుట, ఉష్ణముగా నుండుట అను నర్థము గల వే ధాతువు నుండియే యీ పదము వచ్చియుండెనని భావించియుండిరి.

వురు (గురు).

తెలుఁగున సంఖ్యా వాచకవిశేషణములకు మంది, గురు అను ప్రత్యయములను జేర్పఁగా నిప్పుడు మహన్మహతీవిశేషణము లేర్పడుచున్నవి. చాళుక్య శాసనము లందలి రూపములలో వురు అను ప్రత్యయమే కాని గురు - మంది అనునవి కానఁబడుట లేదు.

| | |
|---|---|
| వేవురు | రామేశ్వర స్తంభ శాస. |
| వేవుర | వల్ల చెఱువు పల్లి శాస. |
| వేవురు | కపిలేశ్వర పుర శాస. |

ఇన్నల్వ్వరు ఏడువాడలపాలెపు శాస.

ఇన్నల్వ్వరు సాక్షి బాణరాజుల శాస.

ణ్డు అను ప్రత్యయముతోఁ గూడిన ప్రయోగ మొకటి తుపాకులపల్లి శాసన ములో నున్నది. పదుణ్డు S I. I X నెం. 627.

పదు + ఉన్ = పదున్ + ఉ = పదుణ్డు + ఉ - పదుణ్డు ఇందలి శకట రేఫము తరువాత సాధురేఫమైనది.

మూన్ఱెనమణ్డకును నిత్యవర్షుని మాలెపాడు శాస.

ఇది మూన్ఱెనమణ్డకు అను దాని వికారము.

నన్నయ భారతమునఁ గూడ వకారయుక్త రూపములే కానఁబడు చున్నవి (ఇరువుర - ఆది - V 146. మువ్వురు ఆది III - 63 - 71. నలువురన్. సభా II - 196) కన్నడమున కేశిరాజు పర్, బర్, ంబర్ అను ప్రత్యయములే సంఖ్యావాచకములకుఁ జివరఁ జేరునని చెప్పి యుండెను. (శబ్దమణి. నామ ప్రకరణ 99 సూత్ర) అంతకంటెఁ బూర్వము నందలి కన్నడ శాసనములలో "ఓర్వన్, ఒర్వన్, సాసిర్వర్, ఏళ్నూర్వర్" అను ప్రయోగములు కలవని తెలియుచున్నది. (ఆం. భా. వికా. 457 పుట) దీనివిబట్టి వకారయుక్త రూపమే ప్రాచీనమైనదని తలంపవచ్చును. ఈ వురు క్రమముగా గురుగా మాఱి గ్రంథములలోని కెక్కినది.

సంఖ్యావాచకములకు అగు అను తద్ధర్మక్రియాజన్యవిశేషణమును జేర్పఁగాఁ దెలుఁగునఁ బూరణార్థకము లేర్పడుచుండెను. నన్నయ రెండగు పర్వము, ఎనిమిది యగు పర్వము అని అగుతోఁ గూడిన రూపములను వాడి యుండెను. అగు - అవుగా మాఱినచోట్లు కూడఁ గొన్ని కలవు. ముద్రిత ప్రతులలోఁ గొన్నిచోట్ల అవతోఁ గూడిన రూపములు గూడఁ గనఁబడు చున్నవి. కాని వానిని నన్నయ యట్లే వాడెనో లేదో తెలియదు. (ఆయంబు నందు నాలవభాగమొండె మూఁడవభాగమొండె సభా I - 46. సూర్యరా యాంధ్ర నిఘంటువు) కాలక్రమమున అగు, అవు అనునవి అవ, ఓ అను రూపములను బొందినవి. ఓ తోఁగూడిన రూప మిప్పుడు వాడుకలోఁ దఱుచుగాఁ గానవచ్చును. విరంతుకోపాఖ్యానమున (II - 102) మూఁడో జా మయ్యె

అని టతో( గూడిన రూప మున్నది. చాళుక్య యుగమునందలి శాసనములలో అగు తో(గూడిన రూపములే వాడ(బడినవి.

| | |
|---|---|
| సంవత్సరమ్బుళ్ యేనగునాణ్డు | రామేశ్వర స్తంభ శాస |
| పల్వ్రాది యగునేణ్డి | ఏడు వాడల పాలెపు శాస. |
| యేవగు నేణ్డి | చా. భీ. ధర్మవర శాస |

విశేషణములు·

ప్రాచీన ద్రావిడ భాషలో విశేష్యవిశేషణములకు రూపమునం దెట్టి భేదమును ఉండినట్లు కన(బడదు. పదముల కూర్పునందలి పౌర్వా పర్యమును బట్టియే యొకటి విశేషణముగను రెండవది విశేష్యముగను భావింప(బడు చుండెను. ఒకే పదము ముందు వాడ(బడినచో విశేషణత్వమును దరువాత వాడ(బడినచో విశేష్యత్వమును బడయుట కవకాశమున్నది. మేకపిల్ల (మేక యొక్క పిల్ల) పిల్ల మేక (పిల్లయైన మేక) బట్ట రంగు (బట్టయొక్క రంగు) రంగు బట్ట (రంగుగల బట్ట) ఇందు( బూర్వపదము పరపదమును గూర్చి కొంత చెప్పుచున్నది. దీనినే ఆంగ్లమున గుణసూచకము ( attribute) అని చెప్పుదురు. అన్ని భాషలలోను గూడ విశేష్య విశేషణముల నొండొంటితో మార్పవచ్చుననియు, వ్యాకరణ దృష్టితో( జూచినచో వానికి నిశ్చితమైన భేద మేదియు లేదనియు, వానిని రెండింటిని గూడ విశేష్యములుగనే వర్గీకరింప వచ్చుననియు వెన్డ్రిస్‌గారు Language అను గ్రంథమున( జెప్పియున్నారు.[1]

కాలక్రమమున( బూర్వపదముయొక్క గుణ సూచకత్వమును లేక విశేషణత్వమును స్పష్టతరము కావించుటకై దానికి అ, ఇ అను ప్రత్యయములను జేర్చునలవాటేర్పడెను. కాలు + గోరు = కాలిగోరు; పాలు + వాడుక = పాలవాడుక. ఇట్టి మార్పుతో( గూడిన పదములు చాళుక్యయుగమునందలి శాసనములలో( గూడ( గానవచ్చుచున్నవి. బహువచనాంతములైన పదము

---

1 Substantives and adjectives are inter-changeable in all languages and from a grammatical point of view there is no clear cut boundary between them. They may both be grouped together in a single category Language-Vendryes Page 117.

లను విశేషణములుగాఁ జేయుటకై అ చేర్పఁబడిన ప్రయోగములు పెక్కిఁది వఱకుఁ జూపఁబడినవి.

| | |
|---|---|
| చిఱుమ్బూరి (రు + ఇ) రేవణకాలు | కలమళ్ల శాస. |
| కూచపోఱియారి తాంబుల్ | |
| చోళమహారాజుల అమ్మ | చామలూరు శాస. |
| ఇన్పుత్రోలి అణపోతులు | పొట్లదుర్తి మాలెపాడు శాస. |
| మ్లావిండిరాజుల ముట్కు | విప్పర్ల శాస. |
| వారి (రు + ఇ) కొడుకు | కపిలేశ్వరపుర శాస. 740 క్రీ. శ |
| అఱువదివే లేండ్లు | ఏడువాదలపాలెపు శాస. |
| ఎనుబొది వుడ్ల అడ్లు | అద్దంకి శాస. |
| గోరన్టల పేరయ | |

విశేషణత్వమును గలిగించుటకై యేకవచనము లందలి పదములకుఁ గూడ అ చేర్పఁబడిన ప్రయోగములు తమిళ గ్రంధములలోఁ గానఁబడు చున్నవి. మలై + య (= hilly) సునై + య (of spring) కో. రా Tel. Lang. XIII-2 Page 79)

| | |
|---|---|
| మఱితోడి శాటియొద్ద | నందంపూఁడి శాస. |
| దొంకలోపలి నేల | దొంగలసాని కనుమ శాస. |
| నొలంబితోట్టి కయ్యంబున | వైదుంబరాజు గండత్రినేత్రుని శాస |

పై ప్రయోగములలో తోఁడ లోపల అనువానికి ఇప్రత్యయము చేర్పఁబడినది ఇవి ఇప్పుడు విభక్తి ప్రత్యయములుగా భావింపఁ బడుచున్నను ఒకప్పుడు లోపలు + అన్ = లోపలన్, తోడు + అన్ = తోడన్ అను స్వతంత్రపదములు గానే యుండెను. అందుచే వీని చివరనున్న నకారము లోపించినదనియు విశేషణత్వము కలిగించుటకై ఇప్రత్యయము చేరినదనియుఁ జెప్పవచ్చును

ఱడాంతములైన కొన్ని పదముల కజంతపదములు పరములగు నపుడు వాని చివరఁగల ఱడలు ద్విత్వమును బరుషత్వమును బొందుచుండును చిఱు + ఎలుక; చిట్టు + ఎలుక, చిట్టు + ఎలుక; చిట్టెలుక; నడు + ఇల్లు నడ్డు—నట్టు + ఇల్లు = నట్టిల్లు. హలాదులగు పదములు పరములగునపు డవి యే మార్పును జెందకుండ నట్లే యుండిపోవును. కడు + దవ్వు = కడుదవ్వు

నడు + రేయి = నడురేయి (నడిరేయి) చిఱు + నగవు = చిఱునగవు (చిర్నగవు).

ఏడు మొదలైన శబ్దములందు డకారము పరుషత్వమును బొందుటయే కాక దానిపై ఇకారము చేరుటయుఁ గనవచ్చుచున్నది.

ఎఱుంబొది అన్నేణ్టి అమ్మఁ పూణ్ణమ విప్పర్ల శాస
అగునేణ్టి వైశాఖ పుణ్ణమి అగ్గప్పరాజు పొదిలి శాస.
పదేనగునేణ్టి ధనుమాఁసమున భీమేశ్వర స్వామి ఆలయమునందలి శాసనము. S I I X

విప్పర్ల శాసనమున "పడుమాఱికోట" అను ప్రయోగమున్నది. ఇచ్చట ఱకారము టకారముగా మాఱలేదు కాని 'ఇ' ప్రత్యయము చేర్పఁబడినది. ఏడువాదలపాలెపు శాసనమున సమాసమునఁ గాకపోయినను 'పడుమటం గొణ్డ యను ప్రయోగమున పడుమఱ శబ్దమునందలి ఱ — టగా మాఱుట కానవచ్చుచున్నది. నూఱు శబ్దము విశేషణమైనప్పుడు నూట యను రూపమును బొందుచున్నది "నూటెన్మణ్డకు" నిత్యవర్షుని మాలెపాడు శాస.

పట్టు ధాతువు కొన్ని స్థలనామముల చివర పఱ్ఱు అను విశేష్య రూపమును బొందుచున్నది. ఈ పఱ్ఱు పట్టుగా మాఱిన చోట్లును గొన్ని గలవు. (చెంగల్పట్టు - పూతలపట్టు) అట్లు మాఱనిచోట్ల పఱ్ఱు విశేషణత్వమును బొందునపుడు ద్విత్వమును గోల్పోయి తి అను ప్రత్యయముతో వాడఁబడి యున్నది. తి యందలి ఇకార సాహచర్యమున నప్పుడు ఱు లోని ఉ కూడ ఇకారముగా మార్పు చెందును.

విరిపఱితి కమ్మరి వినియణ వ్రాసె రామేశ్వర స్తంభ శాస.
దేవంబఱితి ముదుల్ల కొండయ
ఱు లోని ఉకారము లోపించుటయుఁ గలదు.
విత్పత్తి ఉత్తరంబున-విత్పత్తి గాణంబు విప్పర్ల శాస.

ఈ పై ప్రయోగములోఁ బదాంతమైన శకటరేఫము టకారముగా మాఱి యుండలేదు.

కొన్ని ధాతువులలో హ్రస్వములుగా నుండు తొలి యచ్చులు విశేషణ రూపములలో దీర్ఘత్వము నొందుచున్నవి.

పెరు - పేరు + ఉరము = పేరురము; ఇరు - ఈరు + ఏడు = ఈరేడు కఱు - కాఱు + మబ్బు = కాఱుమబ్బు. జయసింహవల్లభుని విప్పర్తి శాసనమున పెరువేల్పుగు ల్లను ప్రయోగమున పెరు హ్రస్వేకారముతోనే కనఁబడుచున్నది. పెర్ ధాతువు చాళుక్య యుగమునందలి శాసనములలోఁ గొన్నిచోట్ల పెన్ అను రూపముతోఁ గనఁబడుచున్నది. (ఇట్లే ఇరు అన దానిలోని రు - ను గా మాఱి ఇను అను రూపమును బొందుట యిదివఱక సూచింపఁబడినది).

పెన్పాఱ ఇశెరేవికిన్ పొట్లదుర్తి మాలెపాడు శాస.
పెన్పాఱ రేవశర్మ్మాణ పుత్రస్య (చామలూరు శాస.)

కొఱవి శాసనమున "కుసుమాయుధు పెద్దకొడు కనుచోట పెద్దయను విశేషణము ప్రయోగింపఁబడును. (వీరి పెద్దకొడుకు - మైలవరము శాస). ఇదియు పెర్ ధాతువు నుండి యేర్పడినదే. పెర్ + దు (which is big) సమీకరణ ముచే పెద్దు అయి అకారము చేరుటచే పెద్ద అను రూపమును బొంది యుండును. ఇట్లే తెల్, నల్, వెళ్, చెడు మొదలైన గుణవాచక ములకుఁ గూడ అకారము చేరుచున్నది. తెల్ల, నల్ల, వెల్ల, చెడ్డ అకారమునకు ముందా పదములందలి తుదిహల్లు ద్విరుక్తత్వమును బొందినది అదంతములైన యీ విశేషణముల కొక్కొక్కప్పుడు ని అను ప్రత్యయము చేరి వాని విశేషణత్వమును స్పష్టము కావించుచుండును. తెల్లని, నల్లని మొదః నిప్రత్యయముతో ముగియు నీ రూపములకు మరల అగు ధాతు భూత తద్ధర్మ కాల క్రియాజన్యవిశేషణములైన అయిన, అగు అనునవి చేరుటయుఁ గలదు తెల్లని + అయిన = తెల్లనయిన; తెల్లనగు; నల్లని + అయిన = నల్లనయిన నల్లనగు.

'అయిన' యను ధాతుజవిశేషణము ని ప్రత్యయాంతములకే కాక మఱికొన్ని యితర విశేషణములకుఁ గూడఁ బరమై వానికిని దరువాత వచ్చు విశేష్యములకును గల సంబంధము చక్కఁగా వ్యక్తము చేయుచున్నది.

ఉత్తమోత్తముణ్డయిన వాణ్డు తిప్పలూరి శాస.
నీవు నాప్రాణసమానుణ్డవైన చెలివి కొఱవి శాస.

అయిన అనుదానిలోని ఇకారము లోపించుటచేఁ గలుగు అయ్న అనురూపము కూడ రెండు మూఁడు చోట్లఁ గనవచ్చుచున్నది.

అగ్న తనయుణ్డయ్న చాలుక్యభీమునకు
సంప్రాప్తంబ య్నర సమర్ధఁకశ్రీ. కొఱవి శాసనము.
సకలశాస్త్రార్థఁ పారగులయ్న పండరంగని ధర్మవర శాసనము.

ఐ యొక్క రూపాంతరమైన ఆయి లోని యికారము లోపించిన రూపములు యుద్ధమల్లుని బెజవాడ శాసనములో రెండు చోట్లఁ జూపట్టుచున్నవి.
సలియం (బయివారల) బయ్యారల.

ఇష్టప్రత్యక్ష (బయియున్న) బయ్యున్న.

అ గు. అను ధాతువుల తద్ధర్మార్థక విశేషణములు కూడఁ గొన్ని నామవాచకములకుఁ బరమై వానిని విశేషణములుగా నొనరించు చున్నవి.

బాదిరాజు అను వాణ్డు బాదిరాజనువాణ్డు సలజానంపాడు శాస.
అరివరజము ణ్డను వాణ్డు బూడిదగడ్డపల్లి శాస.
ఏఱుంబొది అను నేణ్టి ఏఱుంబొది అన్నేణ్టి విప్పర్ల శాస.
పదియేడు అగుఏణ్ట పదియేడగునేణ్ట ఇంద్రకీల పర్వత శాస.
క్రీ. శ. 909.

సంవత్సరముళ్ యేనగునాణ్డు రామేశ్వర స్తంభ శాస.
సఱ్వద్యది యొకటి యగునేణ్టి దొంగలసాని కనుమ శాస.

ఇతర ధాతువుల భూతతద్ధర్మకాలక్రియాజన్య విశేషణములు ప్రత్యేకవిశేషణములుగా వాడఁబడిన చోట్లనేకములున్నవి.

ఇచ్చిన పన్నస ఎఱ్ఱగుడిపాడు శాస.
ఆచ్చిన వాణ్డు ఇందుకూరి శాస.
కాచి కుడిపినవారు వెలుదుర్తి శాస.
చమ్పిన వాణ్డు రామేశ్వర స్తంభ శాస.
దీవిగాపెడవారు (గాపాడు) ఏడువాడలపాలెపు శాస.

| | |
|---|---|
| ఒడంబడి కాచునృపులకు | యుద్ధమల్లుని బెజవాడ శాస. |
| దీనిం జేత్రోలు యేలెడు రతిరజేలు | Do. |
| దీనిన్దారు విల్చినవారు | Do. |
| దీని చెఱుఙ్చువారు | పెట్లూరి శాస. |

అగ్గపరాజు పొదిలి శాసనములో (క్రీ. శ. 969.) సన్తతి నడపేవారు అను రూపమున్నది. నడపెడు అను తద్ధర్మకాలక్రియావిశేషణమునుండి నడపేవారు (డి లోపము — ఎకారమునకు దీర్ఘత్వము) అను రూపము క్రీ. శ. 10వ శతాబ్ది యుత్తరార్థమునకే యేర్పడినట్లు దీనినిబట్టి తెలియుచున్నది

మ్బు వర్ణాంతములైన కొన్ని నామవాచకములు విశేషణములుగా మాఱి నప్పుడు మ్బు లోని బకారము పరుషత్వము నొందుచున్నది.

| | | |
|---|---|---|
| మిరియమ్బు | మిరియమ్పు బోళజకు | లక్ష్మీపుర శాస. |
| కట్టెమ్బు | కట్టెపు దుర్గమ్బు | అద్దంకి శాస. |

దీనినే తరువాత వైయాకరణులు కర్మధారయంబులందు ము వర్ణకమునకు పుంపులగునని సూత్రించి యున్నారు. అలఘుచిన్త ఉత్తరంబుకట్టు (-చామలూరు శాస.) అనుచోట బు వర్ణము పరుషత్వము చెందక యథాస్థితముగా వాడఁబడి యున్నది.

ప్రథమావిభక్త్యేకవచనమునఁ బుంలింగతత్సమ పదముల చివరవచ్చు న్డు, ణ్డు, డు అను ప్రత్యయములు లోపించుటచే నా శబ్దములు విశేషణత్వమును బొందుచున్నవి. ఇట్టిచోట్లఁ బ్రాతిపదిక రూపములపై సంబంధార్థమున ఉ చేరిన దనియైనఁ జెప్పవచ్చును.

| | |
|---|---|
| వైశ్రవను కొడుకు ఱ్పోలయ | కపిలేశ్వర పుర శాస. |
| కుసుమాయుధు పెద్ద కొడుకు | కొఱవి శాస. |
| వల్లభు కొల్వున | చా. భీ. ధర్మవర శాసనము. |

తరతమ భావము:

సంస్కృతమున విశేషణముల తరతమ భావములను సూచించుటకు వాని తరువాత తరప్, తమప్ ప్రత్యయములు, కొన్నిచోట్ల ఈయస్. ఇష్ఠన్

ప్రత్యయములు చేర్పఁబడు చుండును. (అల్ప, అల్పతర, అల్పీయాన్, అల్ప తమ, అల్పిష్ఠ) ద్రావిడ భాషలలో నీ తరతమ భావమును సూచించుట కిట్టి ప్రత్యేక పద్ధతి యేదియును గానరాదు. తెలుఁగున తరప్ ప్రత్యయార్థమున న్యూనతా సూచకమైన శబ్దమునకు కంటె వర్ణకమును, తమప్ ప్రత్యయార్థమున సముదాయ వాచకమునకు లో, లోపల, అందు అనువానిలో నొకటియుఁజేర్పఁబడు చుండును. అంతేకాని విశేషణముల రూపములో నెట్టి మార్పును గలుగదు. ఉదా. జానపదులకంటె నాగరులు వివేకులు. గోవులలోఁ గపిల బహుక్షీర. గోవులలోపల, గోవులందు అనియుఁ జెప్పవచ్చును. పై పంచమీ షష్ఠులకు నిర్ధారణ పంచమి, నిర్ధారణషష్ఠి అను నామములను సంస్కృత కారక విధానము ననుసరించి చిన్నయసూరి విధించి యున్నాఁడు.

తమిళమున అవట్రిల్ ఇదు నల్లదు = వానిలో నిదిమంచిది. ఇదఱ్కు అది పెరిసు = దీనికది పెద్దది అనియుఁ, గన్నడమున సక్కరగిన్త నవి ఇల్ల = చక్కెరకంటె రుచి లేదు; అదక్కిన్తలూ దేవమాన హన్నెరడు అష్టు హెచ్చు = దానికంటె దేవమానము పండ్రెండు రెట్లు హెచ్చు; పురుషరోళ్ (పురుష రల్లి) క్షత్రియం శూరం అనియుఁ దెలుఁగున వలెనే విభక్తి ప్రత్యయముల మూలముననే తరతమ భావము తెలుపఁబడు చున్నది.

చాళుక్య యుగమునందలి శాసనములలో కంటె, లో, లోపల, అందు అను ప్రత్యయము లెచ్చటను దరతమ భావసూచకములుగా వాడఁబడి యుండ లేదు. ఈ భావమును సూచించుట కితర పద్ధతియు నం దెచ్చటను గానరాదు. కుసుమాయుధు పెద్దకొడు కనేక రిపు నృపతి మణి మకుట మకరికారేఖణ

మసృణిత గల రలావ త్తఁణంబు రాజ్యంబు సేయుచు —కొఱవి శాస.

నీవు నా ప్రాణసమానుఁడవైన చెలివి —కొఱవి శాస.

దోచయ్యమానిసి యెమ్మకాల మెఱెసి ప్రభూ చెల్వున్ను మహారాజులయు నొలంబియు సొరెమటి కయ్యంబున మెఱెసి నాగు శాన్కి పొడిచి వీరలోకా.... వోయె పై దుంబమహారాజు శాసనము.

మున్నగుచోట్లవలె సందర్భమును బట్టియుఁ బదముల యర్థ గాంభీర్యమును బట్టియు నుదాత్తతా శ్రేష్ఠతాదులు వ్యక్తము చేయఁబడి యున్నవి.

క్రియలు :

పూర్వపు శాసనములలో సమాపక క్రియలతోఁ గూడిన వాక్యముల సంఖ్య తక్కువ యని చెప్పియుంటిని. ఉన్న సమాపక క్రియలు భూత తద్ధర్మములలో మాత్రమే వాడఁబడి యున్నవి. వానిలోనైనను ఒక్క ప్రథమ పురుషమునందేకాని యితరపురుషములందలి రూపములు కానరావు. శాసనములందుఁ జెప్పఁబడు విషయము యొక్క స్వభావమే దీనికిఁ గారణము. వర్తమాన భవిష్యత్కాలములను సూచించు ప్రత్యేక క్రియారూపము లం దెక్కడను గానవచ్చుట లేదు. వర్తమాన భవిష్య దర్థములనే కాక ఆశీరాద్యర్థములను గూడఁ దద్ధర్మ రూపములే సూచించు చున్నవి.

భూతకాలమునఁ గొన్ని శాసనములలో చేసెన్, పడెన్, ఏగె, కాచె మున్నగు, ఎన్, ఎ అను ప్రత్యయములతో ముగియుచుఁ బురుష సర్వనామ చిహ్న రహితమైన రూపములు కొన్ని కానఁబడుచున్నవి. ఇట్టి రూపములొక్క తెలుఁగులోఁ దప్ప నితర ద్రావిడ భాషలలోఁ జూపట్టుట లేదు. ఈ రూపములు ప్రథమ పురుషమున నేక వచనమునం దన్ని లింగములకును అమహద్వాచకములకు బహువచనమునందును వాడఁబడుచుండును. ఇప్రత్యయముతో ముగియు క్త్వార్థక రూపములకుఁ బ్రథమపురుష సర్వనామరూపమైన అన్ అనునది చేరుటచే నీ రూపము తెలుఁగున స్వతంత్రముగా నేర్పడిన దని తోఁచు చున్నది. కవి + అన్; కవి - య్ - అన్ = కవియెన్, కవెన్ కవె, చేసి + అన్; చేసి-య్-అన్, చేసెన్, చేసె. ప్రస్తుతము వాడుకలోఁ గానఁబడుచున్న చేశాడు (చేశ్యాడు), కొట్టాడు (కొట్ట్యాడు) మున్నగు రూపములు ప్రాచీన కాలముననే గ్రంథస్థములైన చేసెన్, కొట్టెన్, కవియెన్ మున్నగు వానితో సంబంధించి యున్నట్లు తోఁచు చున్నది. పూర్వపు శాసనములలోని భూతకాల సమాపక క్రియారూపము లీ క్రింద నొసంగఁబడు చున్నవి.

| | |
|---|---|
| ఇచ్చె | నలజానంపాడు శాస; దొంగలసాని కనుమ శాస. |
| | కుసుమాయుధుని శాస. |
| వ్రాసె | రామేశ్వర స్తంభ శాస. |
| చేసిరి | చిలంకూరు అగస్త్యేశ్వర దేవాలయ శాస. |

| | |
|---|---|
| | పెట్లూరి శాసనము. |
| కొటొచె | నల్లచెఱువుపల్లి శాస. |
| ఇచ్చిరి, వ్రాసిరి, కొట్టె | వెలుదుర్తి శాస, విప్పర్ల శాస. బుదమ నారాయల పాడు శాస. |
| పడియెన్ | బూడిదగడ్డపల్లె శాస. |
| పడియె | ముదివేడు శాస. |
| ఐరి | ఆహవ మల్లదేవుని చేఁబ్రోలు శాస. |
| ఇచ్చిరి | మాచెర్ల శాస. |
| | భారతి — వ్యయ శ్రావణ. పు. 183. |
| ఆగిరి | మాలెపాడు శాస. |
| కెసిరి | కుసుమాయుధుని శాస. |
| వడిసిరి, నెఱపిరి | ఏడువాడలపాలెపు శాస. |
| కావిశ్చె | అద్దంకి శాస. |
| చొన్పె, చూపె, ఉడిచె, కాచె, చొచ్చె | చా. భీ. ధర్మవర శాసనము. |
| ఎత్తిశ్చె, తీర్చె, కట్టిశ్చె | యుద్ధమల్లుని బెజవాడశాస. |
| అయ్యె, ఉదయించె, జనియించె, | |
| వినుతించె పడసె | గూడూరు శాస. |
| ఎత్తిశ్చిరి - పెట్టిశ్చె | కొసినేపల్లి శాస. S I I X 594 |
| కట్టిశ్చె | 408. A. |
| ఏగె, ఏగ్గె | చిన్నతిప్పసముద్రము, నాగవుటిక్కాల్వ, కురుబలకోట, గంగిరెడ్డిపల్లి మద్దెమ్మ దేవాలయ,చెన్నరాయనిపల్లి శాసనములు. |
| చనియె | మదనపల్లి శివాలయ శాస. |
| క్రాచె | తుపాకులపల్లి శాస. |
| చేసె | బూడిదగడ్డపల్లి శాస. |
| ఏంగె, వ్రాసె | రామానాయునికోట శాస. |
| విర్చె | చిలంకూరు అగస్త్యేశ్వరాలయము: 400. A. |
| ఇచ్చెను | గోపాలపురమునందలి బంగారమ్మ రాయిపైఁ గల శాస. |

ఇచ్చిరి దిమ్మగుడి పేలపాడు శాస.
తీతెన్ S. I I X నెం. 267.

ఏడువాడలపాలెపు శాసనమున నడిపిరేవి, నెఱపిరేని అను రూపములున్నవి ఇవి నడిపిరి, నెఱపిరి అను భూతకాల ప్రథమపురుష బహువచన రూపములకు ఏని అను ప్రత్యయము చేర్పఁగా నేర్పడినవి. ఇవి చేదర్థమును భవిష్యదర్థ మును గూడ సూచించుచున్నవి. ఆహవమల్లదేవుని బాపట్లతాలూకా చేబ్రోలు నాగేశ్వరాలయము నందలి శాసనములో వేంగినాణ్టి కెవ్వరు రాజులైరి వారుం బూర్వ్వఽస్థితిం దప్పక పాలించువారు అను వాక్యమున భూతకాలక్రియ భవిష్య దర్థమున వాడఁబడినది. వేగినాటి కెవ్వరు రాజులగుదురో వారని యిక్కడ నర్థము. కుసుమాయుధుని శాసనమున కేసిరి అను రూపమున్నది. ఇది కెయ్-కె అను ద్రావిడ ధాతువునుండి యేర్పడిన రూపము. ఇదే తరువాత తాలవ్యీకరణమునొంది చేయు అను రూపమును బొందినది. S. I I X నెం. 47 లో పణికేసిరి; నెం. 54 లో కేసినపణి అను రూపములు ప్రయోగింపఁ బడినవి. దీనినిబట్టి ప్రాక్చాళుక్యయుగము నందువలెనే చాళుక్య యుగమునఁ గూడఁ దాలవ్యీకరణము జరుగుచునే యుండెనని తెలియుచున్నది.

చేసిన, వచ్చిన, చంపిన, మున్నగు క్రియాజన్య విశేషణములకుఁ దచ్ఛబ్ద రూపములగు వాణ్డు, వారు, అది అనువాని ననుప్రయుక్త మొన రించుటచే నొక విధమైన భూతకాల క్రియా రూపము లేర్పడుచుండును. ఇట్టి క్రియారూపములు నన్నయ భారతమున ననేకములున్నవి. అను ప్రయుక్తమైన తచ్ఛబ్దమునందలి వకారము లోపించుటచేఁ గలుగు చేసినాఁడు, వచ్చినాఁడు చంపినాఁడు మున్నగు రూపము లిప్పుడు భూతకాలమున బహుళముగా వాడఁ బడుచున్నవి. చాళుక్య యుగమునందలి శాసనములలోఁ దచ్ఛబ్దాను ప్రయోగముతోఁ గూడిన రూపములు పెక్కున్నవి కాని యవి యన్నియుఁ గ్రియారూపములుగా వాడఁబడినవని చెప్పుటకు వీలులేదు. అవి కొన్ని విశేషణ మాత్రములు. వాక్యార్థము పూర్తియగుటకు వాని కగు ధాతురూప ములు చేర్పఁబడుచుండును. అగు ధాతురూప విరహితముగఁ గూడ వాక్య మర్థము నీయఁగల్గును గాని సంస్కృతము నందువలెఁ బూర్ణ క్రియారూపమును సిద్ధింపఁజేయుటకై నన్నయ కొన్నిచోట్ల నగు ధాతువు ననుప్రయుక్తము చేసి యుండెను.

దీవికి వక్రమ్బు వచ్చువాన్లు బారనాసి
వేవురు పాఱ జమ్బినవాన్లు (అగును) రామేశ్వర స్తంభ శాస.

దేవికి వక్రంబు వచ్చిన పాఱను వేయు కవిలలాను వ్రచ్చినవారు (అగుదురు) ఈక్రింది వాక్యమునఁ దచ్ఛబ్దాను ప్రయోగముతోఁ గూడిన రూపమే క్రియా రూపముగా వాడఁబడినది.

వారి పెద్ద కొడుకు నిడుమని కయ్యంబున జచ్చిన వాన్లు. మైలవరము శాసనము క్త్వార్థకమునకు అన్ అను సర్వనామము చేరునపుడు మధ్య సంధి నాపుటకై య్ ఆగమముగా వచ్చును. పడి + అన్; పడి + య్ + అన్ = పడియెన్. చిన్నయసూరి యిట్టి రూపములను "గురు విరహితంబులయి యయాంతంబులైవ యేకస్వర ద్వి స్వరంబుల యించు గ్వక్రంబుల కియుడాగమంబువిభాషనగు" నను సూత్రముచే సాధించెను. ఇట్టి యి యుడాగమము గల రూపములు చాళుక్య యుగము నందలి శాసనములలోఁ బలుచోట్లఁ గానిపించుచున్నవి.

పడియెన్ (బసినికొండ శాస) చనియె (మదనపల్లి శివాలయము నందలి శాస ) పడియె (గంగిరెడ్డిపల్లి మద్దెమ్మ దేవాలయము నందలి శాస) పల్కి-పడియె (మర్ది నాయనిపల్లి శివాలయము నందలి శాస.) జనియించె (కామసాని గూడూరు శాస.) చాళుక్య యుగము నందలి శాసనములలోఁ బెక్కు ప్రేరణార్థక సమాప కాస మాపక క్రియా రూపములు భూత కాలముననే వాడఁబడి యున్నవి.

| | | |
|---|---|---|
| ఎత్తిశ్చిరి పెట్టిశ్చె | కొసినేపల్లి | S I. I X 598. |
| కట్టిశ్చె చెఱిచిన | | నెం. 408 A. |
| పెట్టిశ్చె | గంగిరెడ్డిపల్లి | మద్దెమ్మ దేవాలయము. |
| అఱిసినవారి | | బూడిద గడ్డపల్లి శాస. |
| అచ్చినవాన్లు | | గాలివాండ్రపల్లె శాస. |
| ఒడిచిన | | గొడ్డలోళ్ళపల్లె శాస. |
| చంపిన | చిలంకూరు | అగస్త్యేశ్వరాలయ శాస. |
| విల్చె | | నెం. 400 A. |
| మువిగిశ్చె | | గోవింద పురమునందలి బంగారమ్మ రాయిపైఁగల శాస. |
| కుడిపిన | | వెలుదుర్తి శాస. |

| | |
|---|---|
| ఱిచ్చిన | పొట్లదుర్తి మాలెపాడు శాస. |
| పన్చిన | ధర్మవర శాసనము. |
| అఱిషిన వాణ్డు | వెంకయ చోడుని దొంగలసాని కనుమ శాస. |

ఇందలి షకారము సకార స్థానీయముగాఁ దోఁచును.

అఱు ధాతువునకుఁ బ్రేరణమున అఱిచిన అఱిపిన అను రూపములు కావలసి యుండఁగా నిచ్చట స్వార్థమున యువర్ణాంత ధాతువులకువలె నకారము వచ్చుట విశేషము. లేదా యిచ్చట ఇసు అను ప్రత్యయము చేరినదని చెప్పవలయును

| | |
|---|---|
| పుచ్చిన | విప్పర్ల శాసనము. |
| కుడిపిన | విప్పర్తి శాస. |
| చంపిన | లక్ష్మీపుర శాస. |
| నిల్చిన | కపిలేశ్వరపుర శాస. |
| పరిగిన్చువారు | బుదమ నారాయలపాడు. ఇది తద్ధర్మమున నున్నది. |
| రావించి, నిల్పి, కొట్టించిన, చొచ్చి | కొఱవి శాస. |
| నడిపిరేని | ఏడువాదలపాలెపు శాస. |
| దచ్చిన | పెట్లూరి శాస. |
| కట్టిశ్చె, పన్చిన, నిల్పి, కావిశ్చె | అద్దంకి శాస. |
| చొన్పె, బడిచిన, చూపె, ఉడిచె, పన్చినన్ | చా. భీ ధర్మవర శాసనము. |
| ఎత్తిశ్చె, తీర్చె; ఱిస్పి, వెల్వరించిన; నిల్పిన; అఱిపుట, కట్టిశ్చె | యుద్ధమల్లుని బెజవాడ శాస. |

సాధారణముగా ధాతువునకు ఈ ధాతు రూపములైన ఇసు, ఇంచు అను వానిని జేర్చుటచేఁ బ్రేరణార్థక రూపము లేర్పడుచుండును. కొన్నిచోట్ల ఇ లోపించుటచే నొక్క చు అనునదే ఆప్రేరణార్థమును సూచించును. అది యకర్మక క్రియలను సకర్మకములుగా నొనరించును. కొన్ని ద్రావిడ ధాతువులకు స్వార్థమున చు చేరఁగా నేర్పడు రూపములు తెలుఁగున మరల రెండవ తరపు ధాతువులుగాఁ బరిగణింపఁ బడుచుండును.

వర్ అను ద్రావిడ ధాతువునకు స్వార్థమున చు చేరఁగా వర్, చు, సమీకరణముచే వచ్చు అనురూప మేర్పడినది. ఇదియే తెలుఁగున ధాతువుగాఁ బరిగణింపఁ బడుచున్నది. వర్ + ఇంచు; వర – ఇంచు > రావించు (వర్ణ వ్యత్యయము) అనునది దాని ప్రేరణార్థక రూపము. ఇచ్చట వర్ణ వ్యత్యయ సూత్రము నాశ్రయింప నక్కఱ లేకుండ వేఱు విధముగాఁ గూడ దీనిని సాధింప వచ్చును. తెలుఁగున వర్ ధాతు మధ్యమ పురుష రూపము రా, రమ్ము అనునవి దీనికి రూపాంతరము. కన్నడమున నిది బా అను రూపమునఁ గాన్పించును. వర్ ధాతువును గన్నడమువారు వకార ప్రధానముగా గ్రహింపఁగాఁ దెలుఁగువారు రవర్ణ ప్రధానముగా గ్రహించినట్లు తోఁచును. అప్పు డాగమనార్థకమైన రా ధాతువున కించు చేరు సందర్భమునఁ బ్రకృతి భావమును దొలఁగించుటకై వ్ వచ్చి రావించు అను రూప మేర్పడినది. దీర్ఘాకారము హ్రస్వమగుటయు వకారము పరుషత్వము పొందుటయు సంభవించుటచేఁ దరువాత నిది రాపించు–రప్పించు అను రూపమును గూడఁ బొందినది.

ఏరు (to rise) ఏరు + ఇంచు, ప్రేరణార్థక రూపము ముందర ద్విత్వము కలుగుటచే ఏఱ్ఱించు, ఏట్రించు, - ఎత్తించు అను రూప మేర్పడినది ఱ అంతమందుఁ గల శబ్దములు విశేషణత్వము పొందు నప్పుడును, మఱి కొన్ని యితర సమయము లందును వాని తుది ఱ కారమునకు ద్విత్వము వచ్చుట కన్పించును. చిఱు + ఎలుక = చిట్టెలుక; దీనినుండి పునర్విభజనముచే చిట్టి రూపము సిద్ధించినది. అట్లే ఏరు ప్రేరణార్థమున ఎత్తించు కాఁగా దానినుండి తిరిగి ఎత్తు అను ధాతు వాహరింపఁబడి యుండును [1]

కట్టు, పెట్టు, చ (జ) రుగు, కొట్టు, మున్నగు ధాతువులకు ఇంచు చేరుటచే కట్టించు, పెట్టించు, జరిగించు, కొట్టించు అను ప్రేరణార్థక రూపము లేర్పడినవి.

---

1 ఏరునుండి ఏఱ్ఱు - ఏట్టు(?) - ఏట్టు-ఎత్తు అను ప్రేరణ రూప మేర్పడినదనియు దాని కించు చేర్పుటచే మరల నింకొక ప్రేరణ రూపము కలుగుచున్నదనియు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు S. V O. పత్రికలో వ్రాసియున్నారు. ఎత్తిఞ్చు-ఎత్తించు.

వెలి—వెల్, పడు = వెలిపడు, వెల్పడు, వెల్వడు అను ధాతువున కించు చేర్పఁగా వెల్పడు + ఇంచు = వెల్వరించు అను ప్రేరణార్థక రూప మేర్పడినది. వెలి + వర్ + ఇంచు = వెలుపలికి వచ్చునట్లు చేయు, అని వర్ ధాతువు నుండి కూడ దీనిని విష్పన్నము చేయవచ్చును. అప్పుడిది వర్ ధాతువు తెలుఁగున స్వతంత్రముగా (అనఁగా చు అనునది చేర్పఁబడకుండనే) వాడఁబడె ననుట కుదాహరణము కాగలదు.[1] ఇంచు కాక వట్టి చు వర్ణ మేర్పడఁగాఁ గలుగు వెల్వఱుచు అను రూపము కూడ వాడుకలో నున్నది.

మునుఁగు ధాతువున కించు చేరఁగా ముంచిఁగించు అను రూప మేర్పడినది. మునుచు > ముంచు అను రూపము కూడఁ బ్రేరణార్థమున బహుళ వ్యవహార ములో నున్నది. ఇట్లే ఉడుగు ధాతువునకు చు చేర్పఁగా ఉడుచు అను రూప మేర్పడు చున్నది. మునుఁగు, ఉడుగు అను వానికి చు చేరునప్పుడు తుది గు వర్ణము లోపించుచున్నది.

ఓడు ధాతువున కిప్పు డించు చేర్పఁగా వచ్చిన ఓడించు అను రూపమే ప్రేరణార్థమునఁ దఱచుగా వాడఁబడు చున్నది. దీనికి ఒడుచు, ఓర్చు అను రూపములు కూడ గ్రంథములలోఁ గానవచ్చుచున్నవి. ఈ రెండును ఓడు ధాతువు నకు చు చేర్పఁగా నేర్పడిన రూపములు. " ఆదోదు కూడుల దకారంబునకుఁ జుక్కు పరంబగునపుడు రేఫంబగు" నని బాల వ్యాకరణము చెప్పుచున్నది. ఓడుచు, ఓరుచు, ఓర్చు.

పెట్లూరు శాసనమున చెఱుఙ్చువా రను రూప మున్నది. చెఱుఙ్చు అనునది చెడుధాతువు యొక్క ప్రేరణార్థక రూపము. ఇచ్చట చెడు నందలి దకారము శకటరేఫముగా మాఱినది. కన్నడమున నీ ధాతువు కెడు అని దవర్ణ సహిత రూపముతోనే కనవచ్చు చున్నది. దాని ప్రాచీన రూపమున శకటరేఫమే యుండినట్లు తెలియుచున్నది. చెడు నుండి తెలుఁగున నేర్పడిన చెఱుపు అను కృదంత రూపము నందలి శకటరేఫ మీ విషయమును ధ్రువ పఱుచు చున్నది. చెఱుఙ్చు అనునప్పుడు ప్రేరణార్థక ప్రత్యయమైన ఇంచు

---

1. ఇది ఆచార్య (శ్రీ) ఖండవల్లి లక్ష్మీరంజనము గారి యభిప్రాయము.

లోని ఇకారము లోపించినది తరువాత ననునాసికము కూడ లోపము పొందుటచే చెఱుచు అను రూపము నిల్చిపోయినది.

పణ్ అను ద్రావిడ ధాతువు నుండి పణ్ + ఇచు - పణిచు - పన్చు - పఞ్చు అను ప్రేరణార్థకరూపము లేర్పడినవి. తెలుఁగున నీ ధాతువు వ్యవహారము నుండి తొలఁగినది. కాని పని వంటి నామవాచక రూపములలో నిది కనఁబడుచునే యున్నది. పంచులోని చువర్ణ మొక్కొక్కప్పుడు పు వర్ణముగా మాఱుట కలదు. (పంపు). పణ్ ధాతు ప్రేరణార్థక రూపమైన దీని కూరక పోవునట్లుచేయు అను నర్థముకంటెఁ బనిచేయునట్లు వియోగించు అను నర్థము చెప్పుట యుక్తముగా నుండును. అప్పుడు పణ్ ధాతువు నర్థము కూడ నం దిమిడి యుండుట సంభవించును. పుచ్చు అనునది కూడఁ దెలుఁగునఁ బంపునకుఁ బర్యాయముగా వాడఁబడు చున్నది. ఇది పోవు ధాతువు యొక్క ప్రేరణార్థకము. తమిళ మలయాళ కన్నడములందు పుగు = to enter in, to go అను నర్థముగల ధాతు వున్నది. తుళు లో పొగు అను ధాతు వున్నది. అదియే తెలుఁగున పోవు అయినది. పుగు + చు = పుగ్చు (ఉకారలోపము) పిమ్మట సమీకరణముచే పుచ్చు అను రూపమును బొంది యుండును పంపు అనఁగాఁ బోవునట్లు చేయు అను నర్థము వాడుకలోఁ బ్రవేశించుటచే అది కూడ పోవు ధాతువు యొక్క ప్రేరణార్థకమే అని చెప్పఁబడు చున్నది.[1]

విల్ అను ద్రావిడ ధాతువునకు స్వార్థమున చు ప్రత్యయము చేరఁగాఁ దెలుఁగున విల్చు అను ధాతు వేర్పడినది. (cf వర్ + చు = వచ్చు) ప్రేర

1. ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారు పనుచు = వెళ్లనట్లు చేయు అను దానిని చను = పోవు అను ధాతువు నుండి నిష్పన్నము చేయవచ్చునని యభిప్రాయపడుచున్నారు చనునకు చు చేర్పఁగా చనుచు, చంచు అను రూప మేర్పడును ఈ రూపమున రెండు చకారము లవ్యవహితముగా వచ్చుటచే నొక చకారమున కుపకార మాదేశముగా వచ్చె నని చెప్పవచ్చును చూచు + ఇంచు = చూపించు అయినట్లు చంచు లోని రెండవ చకారము పకారముగా మాఱకుండుట కప్పుడు చంపు అను నిట్టిరూప మేర్పడుచుండుటే హేతువు. పంచు ధాతువు విభాగము చేయు (divide) అను నర్థమునఁ గూడ వచ్చుచుండుటచే సందేహ నివృత్తికై పంపు అను రూప మేర్పడి యుండును.

ణేంచుక్కు-న కవశేష రూపమైన చు కంటె నిది భిన్నముగాఁ దోఁచు చున్నది ప్రాచీన ద్రావిడ ధాతువుల కర్థవైశద్యమునకై సహాయముగాఁ జేర్పఁబడు ఉతు - తు అనునదే చు గా మాఱియుండును. ద్రావిడ ధాతువుల కిట్లీ చువర్ణము చేరఁగా నేర్పడిన తెలుఁగు ధాతువులు చాలఁ గలవు. తర్, తెర్ + చు = తెచ్చు; విర్ + చు = విర్చు > విచ్చు; మెర్ + చు = మెర్చు > మెచ్చు చా + చు = చచ్చు. ఇచ్చట దీర్ఘము హ్రస్వమై చువర్ణము ద్విత్వము నొందినది. విశతముగాఁ బరిశీలించినచో నీ చువర్ణము కూడఁ గొన్ని చోట్లఁ బ్రేరణార్థమును సూచించుచున్నట్లే కనిపించును పూవు విచ్చినచో నది తన రేకులను దెఱచును. ఒక రెవ్వరైన నింకొకరిని మెచ్చుచో వారిని మెఱయఁ జేయుదురు. వచ్చు, చొచ్చు, విల్చు మున్నగువానిలో మాత్రమట్టి ప్రేరణార్థము కనఁబడదు. వీనికిఁ బ్రేరణార్థమున ఇంచు అను దానికి బదులు పువర్ణము చేరుచుండును. విల్చు - విల్వు; చూచు - చూపు, చచ్చు - చంపు; చొచ్చు - చొన్పు; వీనిలో మరలఁ బ్రేరణార్థమున ఇంచుక్కు- చేరుచుండును. చూపు + ఇంచు = చూపించు; చంపు + ఇంచు = చంపించు; చొన్పు + ఇంచు = చొన్పించు, చొప్పించు దీనిబట్టి చూడఁ బై పువర్ణము క్త్వర్థరూపముల నేర్పఱుచుటకు జేర్పఁబడు పువర్ణమేయనియు, దానిపై ఈ ధాతు రూపమైన ఇంచు చేరఁగా చూపించు (చూపు + ఇచ్చు) నోయ్, నొచ్చు - నొప్పి + ఇంచు = నొప్పించు (నొప్పి + ఇచ్చు) అనురూపము లేర్పడినవనియుఁ గొందఱు భాష తత్త్వజ్ఞులభిప్రాయ పడుచున్నారు. కాని చు వర్ణేతరములైన యు, నుదు దు అను వర్ణములతో ముగియు ధాతువుల విషయమున నీ విధి యన్వయింపఁజాలదు వీనిలోఁ గ్త్వర్థరూపములపై నించుగాగమము వచ్చినట్లు కన్పింపదు. అందుచేఁ గ్త్వర్థరూపముపై నించుగాగమము వచ్చుట సార్వత్రికము కాదు. చు వర్ణాంత ధాతువుల కించుగాగమము కలుగునప్పుడు పు వర్ణము వచ్చుట కన్పించును ఈ ధాతువుల క్త్వర్థరూపమునందును పు వర్ణము నిలుచుచున్నది. కావున వీనిలో క్త్వర్థరూపమునవచ్చు పువర్ణమును బ్రేరణార్థమునవచ్చు పు వర్ణాదేశమును సమానములయి క్త్వర్థరూపము మీఁదనే ఇంచుక్కు- వచ్చినట్లుతోఁచును. ప్రేరణార్థమున వచ్చు పు వర్ణాదేశమునకు హేతువు విట్లూరయవచ్చును చూచు + ఇంచు = చూచించు అని కావలసి యుండఁగా నేక వర్ణపునరావృత్తిని వారించుటకై పకారమువచ్చి యుండునని భావింపవచ్చును. చూపించు. ఇట్లిచ్చట సహేతుక

ముగా వచ్చిన పవర్ణాదేశము చ వర్ణేతర ధాతువులపైఁ గూడఁ సామ్యభ్రాంతి (false analogy) వలన వచ్చుచున్నది. ఇట్టి రూపములు పెక్కు తెలంగాణమున వ్యవహారములో నున్నవి. వ్రాయు-రాపించు· కాయు-కాపించు; కొన్నిచోట్ల ప వర్ణ మాగమముగా వచ్చుచున్నది. తిను-తినిపించు ఇదియును సామ్య భ్రాంతిచేతనే. [1]

మాలెపాడు శాసనమున దేని సల్పినవారికి అనురూపము ప్రయోగింపఁ బడినది. ఇది జరిగించినవారికి అను నర్థమున వాడఁబడి యున్నది సల్ (చల్) = కదలు, జరుగు అను ధాతువునకు పు వర్ణము చేరఁగా నీప్రేరణార్థక రూప మేర్పడినది. సల్పు అనుదానికి శబ్ద రత్నాకరమున చేయు, కడపు అను రెండర్థము లీయఁబడినవి. ఇది తఱుచుగా చేయు అను నర్థముననే యిప్పుడు వాడఁబడు చున్నది.

కుడుచు, నడచు అనువానికిఁ బ్రేరణార్థమున పు వర్ణము చేరుచున్నది. అది చేరునప్పుడు నిలుచు మున్నగు వానియందు వలెనే వీని చివరనున్న చు వర్ణము లోపించుచున్నది. చిన్నయ సూరి మప్వాగమంబుల దంగ్వాది మాయ్వాదుల కగును. అనుచో వానికర వ్రాలు లోపించునని సూత్రించి యుండెను. (కుడుపు, నడపు)

యుద్ధమల్లుని బెజవాడ శాసనమున తీర్పె మఠంబు అను ప్రయోగ మున్నది. తీర్ + ఇమ, తీర్ + చు = తీర్చు అవి యిది సుందరముగా నుండు అను తీర్ ధాతువునుండి యేర్పడినది. తీర్ ధాతువు రమ్యార్థమునఁ దెలుఁగులోఁ గన్పడుటలేదు. కన్నుతీరు, తీరుబొమ్మలు మొదలగుచోట్ల నది విశేష్య విశేషణ రూపములతోఁ గానవచ్చుచున్నది.

ఈ శాసనములలో అఱిసిన, ఒస్సి: ఒచ్చువారు, దచ్చిన: ఒచ్చిన: వచ్చిన అనురూపములు పెక్కు పలుచోట్లఁ గానవచ్చుచున్నవి. ఇవి అఱి =

---

2. ఈయభిప్రాయమును ఆచార్య (శ్రీ) ఖండవల్లి లక్ష్మీరంజనముగారు తెల్పి యున్నారు. (ప్రేరణార్థమున ఇచ్చు సహాయ ధాతువయ్యెననుటకుఁ దెలంగాణము నందలి వ్యవహారమునఁ గానవచ్చు చేపిచ్చు, తినిపిచ్చు (తినిపించు) అను రూపముల నుదాహరణములుగాఁ జూపవచ్చును.

పొడగు అను ధాతువునుండి యేర్పడినవి.[1] వీని విష్ణుత్రిక్రమ మిదివఱకు నిరూపింపఁబడినది. అఱి + చ్చు; ఱిచ్చు; దచ్చు అనునవి ప్రేరణార్థక రూపములు. అఱపుట యను యుద్ధమల్లుని బెజవాడ శాసనము నందలి భావార్థక రూపమును బట్టి అటిపు అను పువర్ణాంతమైన ప్రేరణార్థక రూపము కూడ నప్పుడుండెనని తెలియుచున్నది.

ఈ శాసనములలో ఇ చేర్పఁగావచ్చు క్త్వార్థక రూపములును, ఇన చేర్పఁగావచ్చు భూతకాల క్రియాజన్య విశేషణములును విశేషములుగా నున్నవి.

| క్త్వార్థక రూపములు | | క్రియాజన్య విశేషణములు. |
|---|---|---|
| | వలజానంపాడు శాస. | అఱిచ్చిన, రక్షిఞ్చిన |
| | ఎఱ్ఱగుడిపాడు శాస. | ఇచ్చిన |
| | ఉరుటూరు శాస. | ఇచిన |
| | ఇందుకూరు శాస. | వచిన |
| | | ఇచ్చిన |
| | | ఋచ్చిన |
| | వెలుదుర్తి శాస. | ఱడిపిన |
| | | వక్రపల్కిన |
| | శివ్వలూరి శాస. | అయిన |
| | రామేశ్వర స్తంభ శాస. | చంపిన |
| | వల్లచెఱువుపల్లి శాస. | వధిసిన [2] |

---

1 అటి ధాతువునకు యు చేర్పఁగా అఱియు అను రూప మేర్పడును. దీని నుండి అఱిసిన – టిస్సి అను రూపములేర్పడి యుండవచ్చును నన్నయ భారతమున 'అవియు' అను ధాతువు వాడఁబడినది (ఈయండంబవియించిన యవినీతవు) అఱియు – అవియుగా మాఱెనాయని సందేహింపఁదగియున్నది.

2. కన్నడమున ఇంచు, ఇసు అనురూపమునఁ గూడఁ గానఁబడును ఇచ్చట ఆ ప్రత్యయము చేరినట్లున్నది వధించిన అనునదే వధిసిన అను రూపమున బ్రయోగింపఁ బడినది.

| | | |
|---|---|---|
| ఇచ్చి | చామలూరు శాస. | |
| పొడుచి | బూడిదగడ్డపల్లి శాస. | |
| | పొట్లదుర్తి మాలెపాడు | ఒచ్చిన |
| | మాలెపాడు | చేసిన, సల్పిన |
| కలసి | ధర్మవర శాస. | నమయించిన |
| అని | | పన్చిన, అయ్న |
| | దొంగలసాని కనుమ శాస. | కట్టిన, అష్టి(సి)న |
| | విప్పర్ల శాస. | చేసిన |
| విల్చి | విప్పర్తి శాస. | వచ్చిన, ప్రచ్చిన |
| రక్షిఞ్చి | విత్పత్తి శాస. | కుడ్డిపిన |
| | లక్ష్మీపుర శాస. | పెడశిన |
| | | చంపిన |
| | కపిలేశ్వరపుర శాస. | విల్చిన |
| మెచ్చి | బుదమనారాయలపాడు శాస. | కాచిన |
| | | ఇచ్చిన, నడచిన |
| కట్టి, ఎత్తి, పూని | కొఱవి శాసనము. | |
| ఉడ్డి, రావించి, | | అయ్న |
| గెల్చి, ఐ, చేకొని, | | చేసిన |
| విల్చి, ప్రతిష్ఠించి | | ఇచ్చిన |
| చేయంబడి, చొచ్చి | | కొట్టించిన |
| | | మడిసిన |
| ఇచ్చి | ఏడువాదలపాలెపు శాస | అయ్న, అయ్ని |
| | | అటిసిన |
| మెఱెపి; తాన్కి (తాఁకి) | వైదుంబరాజుల శాస. | |
| పొడిచి, పోయి | | |
| | వైదుంబరాజ గండ త్రినే | |
| | త్రుని శాస. | వధించిన, ఏలిన |
| | విత్యవర్షుని మాలెపాడు శాస. | అటిసిన |
| | మైలవరపు శాస. | చచ్చిన |
| | పెట్లూరి శాస. | దచ్చిన |

| | | |
|---|---|---|
| | అగ్గపరాజు పొదిలి శాస. | వ్రాసిన |
| విల్చి, వేడ్డికొని | రేమయ్య శాస. S I I X 593 | వచ్చిన |
| | బికిరాజు శాస. నెం. 594 | విల్చిన, ఇచ్చిన ష్టచ్చిన, వ్టాసిన, క్రొచ్చిన. |
| | చోళమహారాజు సూర్య గ్రహణకాల శాస. | వ్రచ్చిన |
| | 408 A | చెఱిచిన |
| | పెద్దముడియం శివాలయ శాస. | కొఙ్ని, ఇద్ద కొఱ్ఱచిన. |
| పొడుచ్చి | ముత్తుకూరు చెన్నకేశవ స్వామి శాస. | |
| | మైసూరు భైరవస్వామి శాస | తప్పిన, నిల్పిన ఇచ్చిన |
| | గొడ్డలొళ్లపల్లి శాస. | వొడిచిన |
| | ముదివేడు శాస. | కట్టంబడిన |
| పొడిచి, పెట్టిశ్చి | గంగిరెడ్డిపల్లి మద్దెమ్మ దేవాలయ శాస. | |
| | గాలివాండ్లపల్లి శాస. | ఙచ్చిన |
| ఏఱుచుణ్డి, అలిగ | చెన్నరాయనిపల్లి శాస. | |
| తలగొని, ఒగిచి, | | |
| ఏలి | ముదివేడు శాస. | |
| పోయి, కుడిచి | రామానాయని కోట శాస. | |
| కట్టి | చిలంకూరు అగస్త్యేశ్వర శాస. 400 A. | |
| వగచి | పెన్నేరు నదిలోని శాస. | |
| పల్కి | మద్దినాయనిపల్లి శివాలయ శాసనము | |

| | | |
|---|---|---|
| | వెలిగల్లు శాస. నెం 314 | వధించిన. |
| లేచి, కట్టిఇచ్చి, కొణి; | అద్దంకి శాస. | కట్టిన |
| గొట్టిల్చి, విల్చి, చేసి, మెచ్చి | | |
| ఎక్కి, చేకొని | చా. భీ. ధర్మవర శాస. | అయ్న (ఐన) ఎడఱిన ఉన్న |
| ఐ, విడిసి, కొని | యుద్ధమల్లుని బెజవాడ శాసనము | అఱిసిన, ఇద్ద |
| ఉన్చి, వచ్చి, చేకొని | | |
| ఇచ్చి, ఒడంబడి | | |
| ఐ, చేకొని, పట్టి, కని | కామసాని గూడూరు శాస. | చనిన |

ఇ, ఇన అను ప్రత్యయములు పరములగునపుడు అగు, పోవు ధాతువుల కడ వ్రాలకు యకార మగును. అయి, అయిన; పోయి, పోయిన. అయి అనునది కొన్నిచోట్ల ఐ గా మాఱును. అయిన అను దానిలోని ఇకారము లోపింపఁగా నేర్పడు అయ్న అను రూపము కొన్ని శాసనములలో వాడఁబడి నది. పడు, ఇడు, చెడు, కను, కొను, మొదలగు ధాతువుల భూతకాల క్రియా జన్య విశేషణ రూపములగు పడిన, ఇడిన, చెడిన, కనిన, కొనిన అను వానికి పద్ద, ఇద్ద, చెద్ద, కన్న, కొన్న అను రూపములు కననచ్చు చున్నవి సూరి "పడ్వాదుల నవర్ణంబున కత్వంబును గడహల్లునకు ద్విత్వంబు నగు" నను సూత్రముచే వీ రూపములను సాధించెను. ఉండు ధాతువునకు భూతకాల క్రియాజన్య విశేషణమైన ఉండిన అనునది ఉన్న అను రూపమును బొందు చున్నది.

తద్ధర్మకాలము :-

ధాతువునకు (ఉమ్) ఉన్ అను ప్రత్యయము చేర్చఁగాఁ దద్ధర్మకాల ప్రథమపురుషైకవచన రూప మేర్పడును. హలవసానంబులు పరంబు లగు నప్పుడు చివర నున్న ద్రుతమునకు వైకల్పికముగా లోపము కలుగు చుండును. తద్ధర్మకాల క్రియాజన్య విశేషణ రూపమునకును ధాతుర్రూపమునకును భేదమే లేదు. ఎడు, ఎడి అను ప్రత్యయములను

జేర్చఁగా నేర్పడు రూపములు కూడఁ దరువాతఁ దద్ధర్మకాలక్రియాజన్య విశేషణములుగా వాడఁబడు చున్నవి.

| క్రియా రూపములు | | క్రియాజన్య విశేషణములు |
|---|---|---|
| అగు. | ఉరుటూరు, ఇందుకూరు,. వెలుదుర్తి | |
| | రామేశ్వర స్తంభ శాసనములు | వచ్చు |
| | బూదిద గద్దపల్లి శాస. | ఏలు, అన్వాన్ఱు |
| | నలజానంపాడు శాస. | అన్వాన్ఱు |
| అఱున్ | పొట్లదుర్తి మాలెపాడు శాస. | |
| | మాలెపాడు | ఉణ్డు వాన్ఱు |
| ఉండు | దొంగలసాని కనుమ శాస. | అగు, కల |
| | విప్పర్ల శాస. | అన్నెట్టి, ప |
| అగున్, కాఱ్చున్ | విప్పర్తి శాస. | ఎఱుగు, ఱుడు |
| కలరు | లక్ష్మీపుర శాస. | అచు వరు |
| | బుదమ నారాయలపాడు శాస. | చరిగిన్చువారు |
| వలయున్ | కొఱవి శావ. | |
| కాన్తురు ఉండుదురు | ఏడువాడల పాలెపు శాస. | కాపెడవారు |
| అగున్ | బాణరాజుల శాస. | పచ్చు వాన్ఱు |
| | విక్రమాదిత్య బలికుల బాణరాజుల శాస. | ఏఱు వారి |
| | అగ్గప్పరాజు పొదిలి శాస. | |
| రక్షిఞ్చు | గురింద గుంట శావ. | నడపేవారు |
| | రెండవ జయసింహుని పెణుకపఱ్ఱు శాస. | పోవు పంథాః |
| కలరు | అహదనకర శాస. | అగు |
| | బికిరాజు శాస S I. I. X 594 | పచ్చు వాణ్డు |
| | చోడ మహారాజు సూర్యగ్రహణ కాల శాస. | చెడు వాన్ఱు |
| | భీమేశ్వరాలయ శాస. | అగు నేణ్డు |
| కొణ్డురి | బూదిద గద్దపల్లి శాస. | |
| | అపిమన గంగు కేశరాజు | |
| | చిలంకూరు అన్తేశ్వరాలయ శాస | పొణ్డు |

అగు అద్దంకి శాస.
చా. భీ. ధర్మవర శాస. అగు నేణ్టి
ఏలు. అను.
కొణ్డుఱ్రి యుద్ధమల్లుని బెజవాడ శాస. ఉణ్డు వారు
ఏలెడు
కామసాని గూడూరు శాస. ఏలెడు (ఏరెడు)
మాచర్ల శాస. భార. వ్యయ. శ్రావణ 183 చిన్తిఞ్చు

తద్ధర్మమునఁ బ్రథమ పురుష బహు వచనములో ధాతువునకు దు. రు అను ప్రత్యయములు చేరును. కొంచుదురు. ఉండుదురు. కొనుదురు. చ వర్గము తోడి దుగ్గకారము తకారముగా మాఱిన రూపము ఏడువాడల పాలెపు శాసనమున మన్నది. కాన్తురు. తిదుటలు పరంబులగు నపు దన్వాదుల ను స్థానంబునఁ బూర్ణ బిందు వగును. కొనుదురు - కొందురు. బిందువు మీఁది ద కారము వైకల్పిక ముగా డ కార మగును. కొండురు. ఉత్వ లోపము రాఁగా కొండ్రు అను రూప మేర్పడును. శాసనములలో నిచ్చటి రేఫము శకట రేఫముగా వ్రాయఁ బడినది. బహువచన రు ప్రత్యయము శకట రేఫమైనఁ గావచ్చును. కొన్ — ఱు. ఇచ్చట న కారమునకు దంత మూలజమైన (alveolar) రేఫము సహాయ ధ్వనిగా రాఁగా కొన్ట్ + ఱు అను రూపము వచ్చును. న్ట తెలుఁగునఁ బెక్కు చోట్ల ణ్డ్ గా మాఱుట కలదు దానిని బట్టి కొణ్డు అను రూప మేర్పడినదని చెప్పవచ్చును.

చిన్నయసూరి కలుగున క స్త్యర్థమున కలయగునని సూత్రించెను. దీనినిబట్టి కలఁడు, కలరు, అనునవి వర్తమాన కాల రూపములే యగుచున్నవి. కాని ప్రయోగమును బట్టి చూడఁగా నివి తద్ధర్మమును గూడ సూచించుచున్నవి. (ఈ రెణ్డుట్టి ఱచువరు గళరేని బారనాసి వేగవిళాళు లక్ష్మీపుర శాసనము)

ధాతువున కెడు అను ప్రత్యయము చేర్పఁగా నేర్పడు తద్ధర్మ క్రియా జన్య విశేషణము యుద్ధమల్లుని బెజవాడ శాసన మందును, కామసాని గూడూరు శాసన మందును దప్పఁ జాళుక్య యుగమునందలి శాసనములలో మఱెచ్చటను గానవచ్చుట లేదు. కాని ఎడులోని డు లోపింప ఎకారమునకు దీర్ఘత్వము కలిగిన రూపము లొండు రెండు చూపట్టుచున్నవి. (వడపే వారు, ఏలేవారు) అను ధాతు తద్ధర్మ విశేషణమైన అనులోని ఉకారము కొన్ని చోట్ల లోపించు

చున్నది. (అన్వాస్థు - నలజానంపాడు - బూడిద గడ్డపల్లి). కలుగు ధాతువునకు కల యను రూపము తద్ధర్మ క్రియాజన్య విశేషణముగా వాడఁబడినది (కల వారు) సూరి త్రర్థంబునం గలా దేశంబు విభాషనగుననియు నెడి యెడుల కిట లోపంబు నిత్యంబనియుఁ జెప్పి యుండెను. (క్రియా 106) పుణ్య కుమారుని వెలుదుర్తి శాసనమునఁ జివర "వక్ర పల్కినవారు పఞ్చ మహాపాతకంబు పడు" అని యున్నది. కర్త బహు వచనమున నున్నను ఇట పడు అను క్రియారూప మేక వచన మందే యున్నది. పల్కిన అను భూతకాల క్రియాజన్య విశేషణము భవిష్య దర్థమున వాడఁ బడినది.

తచ్ఛబ్దాను ప్రయోగముతోఁ గూడిన తద్ధర్మ విశేషణములు పెక్కు కవఁ బడుచున్నవి. "వేంగి నాణ్టి కెవ్వరు రాజులైరి వారుం బూర్వ్వ స్థితిం దప్పక పాలించువారు" అను ఆహవ మల్లదేవుని బాపట్ల తాలూకా చేబ్రోలు శాసనమున (1006) పాలించు వారనునది పాలింత్రు గాక లేక పాలింపవలయును అను నర్థమున వాడఁబడి యున్నది.

భవిష్యద్వర్తమాన కాలములు :

ఈ శాసనములందు భవిష్య ద్వర్తమాన కాల క్రియ లెచ్చటను గాన వచ్చుట లేదు. కామసాని గూడూరు శాసనము నందలి మూఁడవ పద్యమున "మొగుడుపల్లియు పంద్రడు నేలు విప్పుడే" అని యున్నది. ఇప్పుడేయను నిదానీ మర్థకమైన శబ్దముచే ఏలునను క్రియ తద్ధర్మమునం దున్నను వర్తమానార్థమును సూచించుచున్నది. తిప్పలూరు శాసనమున ఏళుచు, చామలూరు శాసనమున ఏళుచు, మాలెపాడు శాసనమున ఏలుచుణ్డి, కొఱవి శాసనమున చేయుచు, అను భవించుచు, పడయుచు, వైదుంబ గండత్రినేత్రుని శాసనమున ఏలుచున్, చెన్న రాయని పల్లి శాసనమున ఏలుచుణ్డి, దొంగలసాని కనుమ శాసనమున వార్ధిలుచు నుండు అను రూపములు కనవచ్చుచున్నవి. పై ప్రయోగములన్నియు ధాతువునకు చు చేర్పఁగా నేర్పడు శత్రర్థక రూపములతోఁ గూడియున్నవి. కొఱవి శాసనమున చేయుచున్నయను వర్తమానకాల క్రియాజన్య విశేషణము ప్రయోగింపఁ బడియున్నది.

"రట్టగుళ్ల అన్వయంబున వారెవ్వరైయుమ్ రక్షింపనుంన" (మాచెర్ల శాస. భారతి. వ్యయ. శ్రావణ. పు 183) అను ప్రయోగమున రక్షించు ధాతువు

తుమర్థ రూపమైన రక్షింపన్ అను దానికి ఉన్న అను క్రియాజన్య విశేషణము చేర్చుటచే భవిష్యదర్థము సూచింపఁబడు చున్నది. ''రట్టగుళ్ల వంశమునందలి వారెవరైన రక్షింపఁబోవుచో'' నని యీ వాక్యముయొక్క యర్థము. పై నుదాహరింపఁబడిన ఆహవ మల్లదేవుని శాసనమున 'రాజులైరి' అనుచోటఁ గల ఐరి అను భూతకాల క్రియ భవిష్యదర్థమునందే వాడఁబడినది. ''ఎవ్వరు రాజులగుదురో'' వారని యర్థము.

కొన్నిచోట్లఁ దద్ధర్మ రూపమే భవిష్యదర్థమును సూచించుచున్నది. దీని కి వక్రమ్బువచ్చువాన్లు పుత్రవద్య . చేసినవాని లోకమ్బు నుందువాన్లు" మాలెపాడు శాసనము. ఉండఁగలరని యర్థము. ''దేనికి వక్రమ్బు వచినవాన్లు పఞ్చమహాపాతకు అగు" ఉరుటూరుశాస. కాఁగలఁడని యర్థము.

విధ్యర్థకము·

కొలవి శాసనమున సుఖంబు మనుము అను ప్రయోగ మున్నది. ఇందలి మనుము మనుధాతువు యొక్క విధ్యర్థక రూపమువలెఁ గానవచ్చుచున్నది ఇంకెక్కడను నిట్టి రూపములు కాన రాలేదు.

కొన్నిచోట్లఁ దుమున్నర్థక రూపమునకుఁ దద్ధర్మము వందలి వలయు ధాతురూపమును జేర్చుటచే విధ్యర్థకము సూచింపఁబడినది. "నీ చేసిన యుపకారంబునకుఁ బ్రత్యుపకారంబు చేయవలయు" కొలవి శాస. పై నుదాహృతమైన ఆహవమల్లదేవుని శాసనములో "వారుం బూర్వ్వస్థితిం దప్పక పాలించువారు" అను వాక్యమున తప్పక అను పదముచే విధ్యర్థము వ్యక్తము చేయఁబడినది.

కొన్నిచోట్ల నిట్టి పదాంతరము లేమియు లేకుండనే తచ్ఛబ్దాను ప్రయోగముతోఁ గూడిన తద్ధర్మ విశేషణములు విధ్యర్థమును సూచించు చున్నవి. "దీవిని కాపులు కాచువారు" పెట్లూరు శాస. కావవలయు నని యర్థము.

ఆశీరాద్యర్థకములు :

ఆశీశ్శాపాదులను గాని యిచ్ఛను గాని తెలియఁజేయుటకు సాధారణముగా ధాతువున కెడు తలు చేర్పఁబడు చుండును. కొన్ని యెడలఁ దద్ధర్మ క్రియా

రూపమునకుఁ గాక యనునది చేర్పఁబడుచుండును. కొన్నియెడలఁ గేవల తద్ధర్మ క్రియయే యీ యర్థములను సూచించుటయుఁ గలదు. చిన్నయసూరి తద్ధర్మాదులందు లొట్టగు నవి చెప్పి తచ్ఛీల సంభావనా సంప్రశ్న సాతత్య వర్తమాన భావ్యాశీరాదు లాది పద గ్రాహ్యము లని సూచించెను. చాళుక్య యుగమునందలి శాసనములలో ఎడు, త, కాక లతోఁ గూడిన రూపము లెక్కడను గానరాలేదు. తద్ధర్మ క్రియలో తచ్ఛబ్దాను ప్రయోగముతోఁ గూడిన తద్ధర్మ విశేషణములో యీ యర్థములను సూచించుచున్నవి.

దీని రక్షిఞ్చిన వానికి అడుగడు గశ్వమేధమ్బు నా ఫలం బగు. (నలజానంపాడు శాస.) అగుఁగాక యని యర్థము.

దేవస్వంబు లఞ్చంబు గొణ్నవాన్డు వారణాసి వ్రచ్చిన పాపంబు గొణ్నవాన్డు (పెద్దముడియం శివాలయము శాస) అగునుగాక అనున దధ్యాహార్యము. అఱువది వే లేండ్లు నరక యోని నుండుదురు. (ఏడువాడలపాలెపు శాస) ఉందురుగాక యని భావము.

చేదర్థకములు :

చేసిన, వచ్చిన మున్నగు రూపములకు చో, ఎడల అను వానిని జేర్చిన రూపము లిప్పుడు చేదర్థమును సూచించు చున్నవి. చేసినన్, చేసిరేని అను నవి కేవల గ్రాంధిక రూపములు. చేసితే, చేస్తే, వచ్చితే, వస్తే అనునవి కేవల వ్యవహార రూపములు. భూతకాలమున మధ్యమపురుషైక వచనమున ధాతువునకు తివి చేరును. చేసితివి, వచ్చితివి. వీనికి ఏని లేక ఏన్ చేర్చినచో చేసితేని చేసితేన్ అను రూపము లేర్పడును. ఇవే చేస్తే, వస్తే అను రూపములుగా వ్యవహరింపఁ బడుచున్నవి. ప్రథమ పురుషమున ధాతువునకు తి అను ప్రత్యయము చేరకపోయినను మధ్యమ పురుష రూపముల సామ్యమున నా పురుషమునఁ గూడ నీ రూపములే వాడఁబడుచున్నవి; వాఁడు వస్తే; నీవు చేస్తే, మొదలైనవి.

చాళుక్యయుగము నందలి శాసనములలోఁ జేదర్థమును సూచించుటకుఁ గొన్నిచోట్ల భూత తద్ధర్మ క్రియలకు ఏని అను ప్రత్యయము చేర్పఁబడి యున్నది.[1]

1. ఒక్కొక్కప్పుడేని అనునది క్రియకుఁగాక కర్తకు జేర్పఁబడు చుండును

అచువరు గళరేని — లక్ష్మీపుర శాసనము.
కట్టను గావను రక్షింపను వలయునేవి — కొలవి శాస.
దీని నెడపక నడిపిరేని, దీని నెఱపిరేని — ఏడువాడలపాలెపు శాస.
వచ్చినవారు గళరేని — అహదనకర శాస.

ధాతువునకు ఇనన్ చేర్పఁగా వచ్చురూపములు కూడఁ గొన్నిచోట్లఁ జేదర్థమును సూచించు చున్నవి

పచ్చిన సామంత పదువతో — అద్దంకి శాస.
వెల్వరించిన నశ్వమేధంబు ఫలంబు.
ఉపేక్షించి నా లింగంబఱిసిన పాపంబు — యుద్ధమల్లుని బెజవాడ శాస.
చేయకున్న నే — చా. భీ. ధర్మవర శాస.
దీనికి వక్రంబు వచ్చిన పాఱును వేయు — విప్పర్తి శాస.
చెఱిచినను చురియ వెఱకినను — కొలవి శాస.

వ్యతిరేకార్థకములు :

అహదన కర శాసనమున లేదు అను రూపమున్నది. ఇల్ అను ధాతువునకు (to be)అని యర్థము. తెలుఁగుననే కాక ద్రావిడ భాషలన్నింట అ అనునది వ్యతిరేకార్థక చిహ్నముగాఁ బరిగణింపఁ బడుచున్నది. ఇల్ + అ + దు; ఇల్ + అదు; వర్ణవ్యత్యయముచే లేదు అను రూపమేర్పడినది.

ఇల్ అనుధాతువు నర్థములోనే వ్యతిరేకార్థ మున్నదని కొందఱి అభిప్రాయము. కామసాని గూడూరు శాసనమున కోటి పేయదే అను వాక్యమున్నది. చేయదు అనునది చేయుధాతువునుండి యేర్పడిన వ్యతిరేకార్థక క్రియారూపము. దీనికి ఏ అను ప్రశ్నార్థకము చేరుటచే నిది వ్యతిరేకార్థముమగాక సామాన్యార్థమునే (స్వార్థమునే) యొసంగు చున్నది కోటిపేయదే యనఁగాఁ దప్పక కోటిపేయు నని భావము.

యుద్ధమల్లుని బెజవాడ శాసనమున గొరగల్గాక అనుచో కాక అనునదియు, ఏడువాడల పాలెపు శాసనమున ఎడపక నడిపిరేని అనుచో ఎడపక అనునదియు వ్యతిరేక రూపములే. ఇవి ధాతువునకు అక చేర్పఁగా వచ్చిన వ్యతిరేకక్త్వార్థక ములు. అగు + అక వర్ణవ్యత్యయముచే కాక. ఎడపు + అక = ఎడపక.

కర్మార్థకము:

కర్మణి ప్రయోగము తెలుఁగునకుఁగాని యితర ద్రావిడ భాషలకుఁ గాని సహజమైనది కాదు ఇది సంస్కృతాను కరణముననే యీ భాషలలోఁ బ్రవేశించి యుండును. తెలుఁగున అన్నంతమైన తుమర్థరూపమునకు (బడు ధాతువును జేర్చినచోఁ గర్మార్థక ధాతువేర్పడును. ఇట్టికర్మణ్యర్థక ప్రయోగములు చాళుక్య యుగమునందలి శాసనములలో మూఁడు నాలుగు కంటె హెచ్చులేవు

| | |
|---|---|
| ఎవ్వియేని నాతని చేయంబడి | కొఱవి శాస. |
| వైదుమ్బుళచేత పట్టం కట్టబడి | ముదివేడు S I I X 640. |
| వారిచేత పట్టం కట్టబడి | S I I. X 629. |

నన్నయ భారతమున కర్మణి ప్రయోగములు కానవచ్చుచునే యుండును కాని తరువాతి కవుల గ్రంథములలో నవి చాల నరుదుగఁ గానవచ్చును. ఆంగ్లేయ భాషాభ్యాస ప్రభావముచే నిప్పటివారి రచనలందును మాటలందును గర్మణి ప్రయోగములు తఱుచుగనే గోచరించు చుండును.

తుమున్నర్థకములు·

ధాతువునకు అన్ చేర్పఁగాఁ దుమున్నర్థక రూపమేర్పడును. ఏలు + అన్ = ఏలన్. ఈ అన్‌లోని ద్రుతము తఱుచుగా లోపము చెందుచుండును ఇప్పటి వ్యవహారమున నీ తుమున్నర్థకములకు బదులు భావార్థములకు కు చేర్పఁగా, వచ్చురూపములు వాడఁబడు చుండును. చేయుటకు, చేయడానికి మున్నగు రూపములు మనమిప్పుడు తఱుచుగా వినుచుందుము. అగు ధాతు తుమున్నర్థక రూపమైన కాన్, కన్ (గాన్, గన్) అనునది మాత్రము విశేష ముగా వాడుకలో నున్నది.[1] దీనిని వాడునప్పుడు చివరనున్న ద్రుతమును లోపింపఁ జేయుటయే తఱుచు. చాళుక్య యుగమునందలి శాసనములలో నీ తుమున్నర్థకముల చివర ద్రుతము లోపించిన రూపములును, న్, ను అను ద్రుత చిహ్నములతోఁ గూడిన రూపములును గానవచ్చుచున్నవి.

ఏళన్ కలమళ్ల, ఉరుటూరు, ఇందుకూరు, చిలంకూరు

---

1. కాన్, గాన్ అనువాని నానంతర్యార్థ సూచకములుగాఁ గూడ వాడు చుందురు వెళ్లఁగాన్ = వెళ్లిన యనంతరము.

| | |
|---|---|
| కాను | ఎఱ్ఱగుడిపాడు, తిప్పలూరు. రామేశ్వర స్తంభ శాసనములు, దొంగలసాని కనుమ. యుద్ధమల్లుని బెజవాడ శాసనములు. |
| చేయ | వెలుదుర్తి, బాణరాజుల శాస. గంగిరెడ్డిపల్లి మద్దెమ్మ గుడి శాస. |
| ప్రివర్తిఁల్లన్ | చామలూరు. విక్రమాదిత్య బలికుల బాణరాజుల శాస. |
| అచ్చెర్వ్వగను | బూడిదగడ్డపల్లి శాస. |
| విల్వను | రెండవ చోళమహారాజు చిలంకూరు శాస. |
| కాపన్, కట్టను, కావను, రక్షింపను | కొఱవి శాస. |
| ఓడంగ | చెన్నరాయనిపల్లి శాసనము. |
| వెలయంగ, వలియన్ | యుద్ధమల్లుని బెజవాడ శాస. |
| అనంగా, పరగగ | కామసాని గూడూరు శాస. |

ఒప్పగ, వెలయంగ, అనంగా, పరగగ, ఓడఙ్గ మున్నగు రూపములలోఁ దుమున్నర్థకములపై అగు ధాతు తుమున్నర్థక రూపములైన గన్, గా (కన్, కా) అనునవి కానఁబడుచున్నవి.

ఈ శాసనములందలి క్రియలలోఁ గొన్ని తత్సమములు కూడ నున్నవి.

రక్షించిన (నలజానంపాడు) రక్షించి (విప్పర్తి) రక్షింపను (కొఱవి) రక్షించున్ (గురిందగుంట)

వధిసినవాన్డు (నల్ల చెఱువుపల్లి) వధించిన (వైదుంబ రాజుల శాస.)
రక్షించిన (అద్దంకి) వధించిన (వెలిగల్లు) నెం. 314.
ప్రివర్తిఁల్లన్ (చామలూరు) (విక్రమాదిత్య బలికుల బాణరాజుల శాస)
అనుభవించుచు, ప్రతిష్ఠించి, (కొఱవి).

ఉపేక్షించిన (యుద్ధమల్లుని బెజవాడ శాస.)
ఉదయించె, జనియించె, వినుతించె కామసాని గూడూరు శాస.

తత్సమ పదపూర్వములైన దేశ్య క్రియా రూపములు కొన్ని చూపట్టుచున్నవి.
వక్రపల్కిన (వెలుదుర్తి) ప్రసాదచేసిరి. (చిలంకూరు) ఈ రెంటింట మువర్ణము లోపించినది.
దయచేసిరి పెట్లూరి శాస.

ఈ క్రిందివి శబ్ద పల్లవ ధాతువులు.
చేకొని (కొఱవి, చా. భీ. ధర్మవర గూడూరు శాసనములు).
నుఱుకాడినను (కొఱవి).
తలగొని (చెన్నరాయనిపల్లి).

కృత్తద్ధిత ప్రత్యయములు :

ద్రావిడ భాషలలో మొదట ధాతురూపములే విశేష్యములుగాఁ గూడ వాడఁబడుచుండెను. అట్టివిప్పటికిఁ గూడఁ గొన్నికలవు చాళుక్య శాసనములలో నట్టివి రెండు మూఁడు చూపట్టుచున్నవి.

చీకు (నిస్సారమగు—పాడైపోవు) ఇది తిప్పలూరి శాసనమున కొంత కార్తికాయ చీకున అను నెడఁ గృష్ణ పక్షమున అను నర్థమునందు నామ వాచకముగా వాడఁబడినది.

కట్టు = బంధించు—పృధ్వీవల్లభ విజయాదిత్య చోళుని చామలూరు శాసనము ఉత్తరబు కట్టు — (విశేష్యము) ఇదే కొన్నిచోట్ల గట్టు, కట్ట అనియు వాడఁబడుచున్నది. రెండవ అమ్మరాజు మచిలీ పట్టణ తామ్ర శాసనము (కట్టల చేఱువున) కొన్నిధాతువుల తుది పరళము పరుషత్వము నొంది హ్రస్వాచ్చు దీర్ఘమగుటచే నామవాచక రూపమేర్పడు చున్నది.

పొడు—పోటు—వైదుంబ గండత్రినేత్రుని శాస.
నిల్—నేల—చామలూరు శాస.
నడు—నాణ్డు (దేశము) గండ త్రినేత్రుని శాస.
తోణ్డు—తోణ్ట—తోఁట—రామేశ్వర స్తంభ శాస. (తోండు v tr to dg excavate (తమిళ) Dr Cognates page 130)
ధాతువులకు పు, వు, దు, ఇ మొదలగు ప్రత్యయములు చేర్పఁగా నామవాచక రూపము లేర్పటడు కొన్నియెడలఁ జూపట్టుచున్నది.
తూఱు (ప్రవేశించు) తూఱ్పు—తూర్పు మాలెపాడు శాస
వేళ్, వేల్చు (యజించు) వేల్పు (విప్పర్తి శాస.)
పెర్, పెన్ (పెనుచు) పెంపు.
కొల్వు — కొలెవు, కొలుచు (సేవించు) కొల్వు.

వల్లభు కొల్పున చా. భీ ధర్మవర శాసనము.
కా—కాచు కామ్పు (రక్షణ) కాపు = (రక్షించువాఁడు) కొఱవి శాస.
ప్రోచు — ప్రోపు కొసినేపల్లి S. I. I: X 408 A.
ప్రాచు — ప్రాపు Do
తాలు — తాల్మి - వెంకయచోడునిదొంగలసాని కనుమ శాసనము నందలి
దాష్మయను పదమిదియే యని శ్రీ వెంకట రామయ్యగారు సూచించి
యున్నారు. (త్రిలింగ రజతోత్సవ సంపుటము).
కుడి (త్రాగు) కుడుపు.
కెళె (స్నేహముగా నుండు) తాలవ్యీకరణము చెల్వ = అందము.[1]
చేఱు — చేఱువున - అమ్మరాజు II మచలీపట్టణ తామ్ర శాస
కుఱి = లక్ష్యముచేయు—గుఱువు (గుర్తు) దొంగలసాని కనుమ శాస.
మేల్ — మేన్—మీన్—మీన్దు (ఎత్తు)
పణ్ — పని.
కృత్ప్రత్యయములు పరములగు నప్పుడు కొన్ని తెలుఁగు ధాతువుల తుదివర్ణ
ములకు లోపము కలుగుచున్నది.

తద్ధిత రూపములు·

ఈ శాసనములలోఁ గొన్ని తద్ధిత రూపములు కూడఁ గనవచ్చుచున్నవి.
బడియ బొలయణ్ట పేదరి యాకుఁ జిన్త—రెండవతాళుని సిరిపురపు శాసనము.
ఇచ్చట పేదరి + ఆకు అనఁగా (poor leafed) విరళపత్రమైన అనువర్థము
చెప్పఁబడినది. పేద అను పదమునకు అరి ప్రత్యయమ్ము చేరఁగా పేదరి
అను రూపమేర్పడును. ఇప్పు దరి ప్రత్యయము పెక్కు చోట్ల
మతుబర్థమున వాడఁబడు చున్నది. కాని యది యిచ్చట స్వార్థము
నవే వాడఁబడినట్లు తోఁచుచున్నది. పేదరి = పేద. తక్కువ ఆకులతోఁ
గూడిన చింతచెట్టు అని యర్థము.

---

1. చెలువు, చెలువ చెలువుఁడు అనుపదములందు సౌందర్యమను నర్థమే ప్రధానము. అందమైనవాఁడు అను భావమునుండి చెలువుఁడు అనఁగా ప్రియుఁడు మిత్రుఁడు అను భావముకూడ వచ్చియుండును చెలి, నెచ్చెలి = ప్రియ మిత్రుఁడు. చెలిమి = స్నేహము.

చెల్వ్యడు - చెల్వ కలవాఁడను నర్థమున అనఁగా మతుబర్థమున డు ప్రత్యయము చేరినట్లు కనిపించుచున్నది. చెల్వ + డు = చెల్వ్యడు. కాని వైదుంబరాజుల శాసనమున నీ పదము ప్రభుచెల్వ్యన్టు అను సంజ్ఞానామవాచకము (Proper Noun) గా వాడఁబడినది.

కురుబలకోటకు దక్షిణమున నెం. 300రు. గల శాసనములో గండసజ్కలీన్టు అను రూపమున్నది. ఇదియును సంజ్ఞావాచకమే. "స్వస్తిశ్రీ గండ సజ్కలీన్టు" సంకలె (సంకలియ) శబ్దమునకు మతుబర్థమున ఈ ప్రత్యయము చేర్పఁగా నీ రూపమేర్పడినదని చెప్పవచ్చును. శబ్దరత్నాకరమున సంకెల అను రూపమేకాని సంకలె అను రూపములేదు.

తూము + ఎణ్డు; మాన + ఎణ్డు = మానెణ్డు బాణరాజుల శాస.

ఇచ్చట మానార్థమున ఎణ్డు (ఎఁడు) ప్రత్యయము చేరినది. పెండ్లి శబ్దమునకు మతుబర్థమునం దము ప్రత్యయము చేర్పఁగా పెండ్లము రూపమేర్పడును. కొసినే పల్లి S I. I X 598. శాసనమున వారి పెణ్డ్లంబు అను రూపమున్నది ఇది పెండ్లముయొక్క పూర్వ రూపము.

సముచ్చయార్థకము:

ఇప్పుడు ఉను అనునది సముచ్చయార్థక ప్రత్యయముగా వాడఁబడుచున్నది. దీనికిఁ బూర్వ రూపము ఉమ్, ఉము. ఇది ఉ, యు అను రూపములతోఁగూడఁ గనవచ్చుచున్నది.

ఉము, ఉమ్

ఆగ్నేయతః ఆలపత్రియుం జూంటూరియుం ముయ్యాల్కట్టున బూరువు పడువ. రెండవ అమ్మరాజు మచిలీపట్టణ శాసనము

పూర్వతః ఇయ్యూరియుమ్ బిల్లెమపెద్దపూణ్డియుమ్

బొలగరుసున పల్లమున కొణ్డియ గుంట (నందంపూఁడి శాస)

రట్టగుళ్ల అన్వయంబున వారెవ్వరైయును రక్షింపనున్న (మాచెర్లశాస)

వేగవిళాకు వేడ్లుము వేశెఱువుకు లక్ష్మీపుర శాస.

రేనాణ్డేలు వేఱుమ్ ఏకుచుమ్. గండత్రినేత్రుని శాస.

యు

| | |
|---|---|
| ఇసరయ విల్చిన గుడియు | కపిలేశ్వరపుర శాస. 740. |
| శ్రీకుఱువది ఆచాఱ్లు కేసిన పణియు | S I I X 54. |
| దుర్గ్గాదేవి నేలయు ఉఱువుటురి బోళ రెండుట్టియు | లక్ష్మీపుర శాసనము. |
| అంగరయ్యయు, మాదవయ్యయు, | |
| చాముణ్డియు, దుగ్గయ్యయు | బాణరాజుల శాస. |
| మహారాజులయు నొలంబియు | |
| పొరెమటి కయ్యంబున | వైదుమ్బరాజుల శాసనము. |

ఉన్, ఉ, ఉను.

| | |
|---|---|
| ధమ్మ్రగవులు ననంబును నేగట్టను | |
| గావను రక్షింపను వలయునేని | కొఱవి శాస. |
| మానెణ్డు నెయును, గొల్లణ్డును, | |
| చాముణ్డియును, ఎఱ్ఱవమ్మయును, | |
| చిరయనయును, ఇన్దొఱను ఇచ్చిన దత్తి | బాణరాజుల శాసనము. |
| వావియు దేగుళంబులను | బుదమ నారాయలపాడు |

ఈ సముచ్చయార్థము కొన్నిచోట్ల దానిచేఁగలపఁబడు నన్నిపదముల చివరను, గొన్నిచోట్ల నొకేపదము చివరను గనఁబడుచున్నది.

కొమరుస్వామికి భక్తుణ్డై గుడియు నిరుపమమతి నృపధాము ణ్డెత్తిఞ్చె మఠంబు

(యుద్ధమల్లుని బెజవాడ)

ప్రోలగల తానపతులున్ను రాజు పట్టంబుగట్టినపతియు
వలియం బయ్యారల వెల్వఱించిన.

కవి మల్లణ్డెత్తించ్చె గుడియు మఠంబునుం గాత్తిఁకేయునకు. ఇందు మఠంబు మన్ అనుచోట సముచ్చయముపై మరల సముచ్చయము వాడఁబడినది.

అవ్యయములు :

ఎల్ల—ఇది సర్వపర్యాయము. ద్రుతాంతము.

| | |
|---|---|
| దొంకలోపలినేల యెల్ల<br>సర్వపరిహారువు ఇచ్చె | వెంకయచోళుని<br>దొంగలసాని శాస. |
| ఖడ్గసహాయుణ్డై నేలయెల్లంగావంబూని | కొఱవి శాస. |
| రమనతో బెజవాడ కెల్ల బెడంగును<br>రక్షయుంగాను | యుద్ధమల్లుని<br>బెజవాడ శాస. |

అంత.

జెవియంత యేనియు తోఁగొణ్న వాన్టు పెద్దముడియం శివాలయ శాస
వేల్పు పాల అజెవి యంత

మీన్దు

పుఱూరు మీన్దు మిన్ని

మహిమిన్ద

ఏని (చేదర్థకము).

గళరేవి లక్ష్మీపుర శాస.

నడిపిరేని — నెఱపిరేని— ఏడువాడల పాలెపు శాస.

రట్టొడ్లు నెవ్వండేని రక్షిఞ్చు గురిందగుంట శాస.

ఉమ్ (ఉన్) సముచ్చయము (దీనికుదాహరణము లొసంగఁబడినవి)

ఇఱ్లు.

కుడుచువారు యిఱ్లు కాను ఏవెఱుగువారు, విప్పర్ల శాస.

ఇది తరువాత ఇట్లు ఇటుల అను రూపములతోఁ గనవచ్చుచున్నది.

అట్లు.

దానిక కలశ బిడ్డట్లు యుద్ధమల్లుని బెజవాడ శాస.

అ (ఏవార్థకము).

దానికి + అ = దానిక

గుణ్టేటియు కఱితి వేములగోను - రెండవ అమ్మరాజు వేమలూర్పాడు శాస

పశ్చిమతః ఏటియ కట్టితి చటలలు Do

తాడ్లరేవసీమా, ముయ్యలి కుట్ర సీమా; గొల్లతేవ సీమా;

యేఱువగడ్డయసీమా; చింతయ సీమా నందంపూడి శాస.

ఇప్పుడు కామసాని గూడూరు శాస.

పోలె (వలె)

ఈశ్వరునకుం గాత్తిౕకేయుణ్డు బోలె ధర్మవర శాస.

వెన్నుఁడుపోలె వానికిన్ గూడూరు శాస.

ఓ (ఉత్ప్రేక్షా వాచకము)

భీముఁడో యనంగా కామసాని గూడూరు శాస.

పై

బలగర్వం బొప్పగ బై లేచిసేన అద్దంకి శాస.

కదు - కట్టెపు దుర్గంబు కదుబయల్సేసి Do.

చూవె (చూడవె)

పణ్డరంగ చూవె (చూరె) పణ్డరంగు

కొన్నిచోట్ల నామ వాచకములే అవ్యయములుగా వాడఁ బడినవి.

సుఖంబుండి (సుఖముతో) సుఖముగా నుండి యని యర్థము కొలవి శాస.

వణం పరియారము మరుతుణ్డు . ప్రసాద చేసిరి

రెండవ చోళ మహారాజు చిలంకూరు శాస.

సర్వబాద పరియారువు ఊరుదయ చేసి ఇచి అహదనకర శాస.

సర్వబాధా పరిహారముగా నని యర్థము.

వెగి

వెగి దీచ్చె మరంబు యుద్ధమల్లుని బెజవాడ శాస.

ఒగి, మొగి అనువాని వలెనే యిదియు నవ్యయము వోలెఁ గానవచ్చు చున్నది. శ్రీ జయంతి రామయ్యపంతులుగారు దీనికి "వెగయఁ దీర్చె. వెగయ = ఎడయః తీర్చు = ఏర్పఱుచు, కట్టించెనని భావము" అని వ్రాసి యున్నారు.

యుద్ధ. బెజ శాస. పుట 30.

తుమున్నర్థకము, క్త్వార్థకము, చే దర్థకము మున్నగు నసంపూర్ణ క్రియలు కూడ నవ్యయములే. అట్టివాని కుదాహరణము లొసంగఁ బడినవి. వీనినే లాక్షణి కావ్య యము లందురు.

సంధి.

చాళుక్య యుగమునందలి వచన శాసనములలో సంధి చేయఁబడిన చోట్లును, విసంధిగా వ్రాయఁబడిన చోట్లును, యడాగమము వచ్చిన చోట్లును గూడఁ గాని పించుచున్నవి. వీనిలో విసంధిగా వ్రాయఁబడిన చోట్లే చాల హెచ్చు. సంధి పాటింపఁబడిన చోట్ల పైతము నిశ్చితమైన నియమ మేమియుఁ గాన వచ్చుట లేదు. పద్య శాసనములందు సంధి పాటింపఁ బడుటయే సార్వత్రికముగాఁ గన వచ్చుచున్నది.

పూర్వ పదము హలంతమై పరపద మచ్చుతో నారంభించు నప్పుడా హల్లును అచ్చును గలిపి వ్రాయుట యిప్పుడు పరిపాటి. పద్య కావ్యములందు మాత్ర మొక పాదము చివర హలంతమైన పద ముండుచోఁ దరువాతి పాదము మొదట నజాదియైన పదము వచ్చినను ఆ రెండింటిని విడివిడిగా వ్రాయు పద్ధతి కొన్ని చోట్లఁ గానవచ్చుచున్నది. చిన్నయసూరి వాక్యావసానంబున సంధిలేమి దోషముకా దనియు నట్లు సంధి విరహము కావ్యము లందుఁ బాదాంత మందే చూపట్టుననియు వ్రాసి యున్నాఁడు. చాళుక్య యుగము నందలి శాసనములలోఁ బదాంత స్థితమైన హల్లును బర పదాదిగమైన అచ్చుతోఁ గలపకుండ విడివిడిగా వ్రాసిన చోట్లు కొన్ని కనఁబడు చున్నవి

| | |
|---|---|
| ఏళన్ ఎరిగల్, రాజుల్ ఇచ్చిన | ఇందుకూరి శాస. |
| సంవత్సరంబుళ్ ఎఱుంబొది | విప్పర్ల శాస. |
| సంవత్సరంబుళ్ ఇరుభది | దిమ్మగుడి శాస. |
| ఊరి స్వాముళ్ ఇచ్చిన స్థితి | అహదనకర శాస. |
| మున్ ఇచ్చిరి | దిమ్మగుడి శాస. |
| పడుమాటి కోటన్ ఎనుంబొది | విప్పర్ల శాస. |

ఇట్టి చోట్ల వచ్చును హల్లుతోఁ గలపి వ్రాయక పోవుటయే కాక యడాగమము చేసిన చోట్లు కూడఁ గొన్ని చూపట్టు చున్నవి.

| | |
|---|---|
| సంవత్సరంబుళ్ యేనగు | రామేశ్వర స్తంభ శాస |
| శ్రీమత్ యిన్మడి | ఏడువాడల పాలెపు శాస |

విసంధిగా వ్రాయఁ బడిన చోట్లు.

| | |
|---|---|
| రేనాణ్డు ఏళన్ | కలమళ్ళ శాస. |
| కాను ఇచ్చిన | ఎఱ్ఱ గుడిపాడు శాస. |
| కాళ్ళుళ ఇచ్చిన, ఏళ ఎరిగల్ | ఉరుటూరి శాస. |
| రాజుల్లు ఇచ్చిన, రాచ మావంబున ఏబది, | |
| పాఱకు ఇచ్చిన, పాతకు అగు | ఉరుటూరి శాస. |
| కుమారుణ్డు అతిశయ | వెలుదుర్తి శాస. |
| రట్టగుళ్ళు ఆనతిగాను | రామేశ్వర స్తంభ శాస. |
| చిరుమ్బురు ఏళన్ | చిలంకూరు శాస. |
| రట్టగుళ్లు అతిశయ | Do |

| | |
|---|---|
| రేనాణ్డు ఏళ | నల్ల చెఱువుపల్లి శాస. |
| పరిహారువు ఇచ్చె | వెంకయచోళుని దొంగలసాని కనుమ శాస. |
| అడుగు అడుగు | విప్పర్తి శాస. |
| ఉణ్డేలు ఉజ్జయిని. | నల్ల చెఱువుపల్లి శాస. |
| రాజు అచ్చర్వ్వగను అరివరజమున్ను అన్వాన్ను | బూదిద గడ్డపల్లి శాస. |
| పుద్దణకాలు ఇచ్చిన | పొట్లదుర్తి మాలెపాడు శాస. |
| రేనాణ్టి ఏళువేళు ఏళుచుణ్డి | చెన్న రాయనిపల్లె |
| ఓడజ్గ ఎగిచి. | చెన్న రాయనిపల్లిఉత్తరము S I I X 342. |
| రాజుల అన్దు, నాకు ఇచ్చిరి | నలజానంపాడు శాస. |
| పదేన్దుంబు అడ్డుపట్టు, నేలయు ఉరువు టురిబోళ | లక్ష్మీపుర శాస. |
| పెన్వర ఇశె తేనికిన్ | పొట్లదుర్తి మాలెపాడు శాస. |
| మహారాజుల్లోళన ఇన్నుప్ట్రోలి అనపోతులు | పొట్లదుర్తి మాలెపాడు శాస. |
| చిరుంబూరి ఉత్తరదిశ | మాలెపాడు శాస. |
| ఏమంబొది అన్నేణ్టి | విప్పర్ల శాస. |
| పమద్దుండని అత్మన్మతంబున | ధర్మవర శాస. |
| కాశ్యప గోత్రునికి ఇచ్చిన | మాలెపాడు శాస. |
| దీనికి ఇమ్మలూరి కాపులు | నెల్లూరు జిల్లాశాస. |
| దేవికి అహితంబు, | మాచెర్లశాస. |
| అదిత్యభటారనికి ఇచ్చిన | అద్దంకి శాస. |
| బలిఇంద్ర బాణరాజుల్లు | కొండుపల్లి గ్రామశాస. |
| ఇరుభది ఎణ్డ్ను అగు | దిమ్మగుడి శాస. |
| శివప్పరాజు ఇచ్చినదతి | బుదమ నారాయలపాడు శాస. |
| యడాగమము వచ్చినచోట్లు | |
| పేదరియాకు జీన్త | సిరిపుర గ్రామశాస. |
| ఒకొటియగు నేణ్టి | వెంకయచోళుని దొంగలసాని కనుమ శాస. |
| అళ్లపట్టు పుఱితి యా (ఊ) ద్లందు | విప్పర్తి శాస. |

పుళుంబుణ్డి యొక నాణ్డు; తమయన్న; నేలయెల్లం గావంబావి; భీమపలుకి యన్దనేక; నాయకుణ్డె యా కాపులయ్న; వీ చేసిన యుపకారంబునకు;

కొలవి శాస.

| | |
|---|---|
| అధిపతి యాయ్నవఱు | ఏడువాదల పాలెపు శాస. |
| మళాయాధిపతి యయ్ని: తోడిపాడి | |
| యిచ్చి, దయచేసి యిచ్చిన | ఏడువాదల పాలెపు శాశ. |
| దివియ యొక్కొటికి | విష్ణువర్ధనుని భీమేశ్వరాలయ శాస |
| ఇరువది యాఱగు | Do |
| ఏటియ కఱితి | వేమలూర్పాడు శాస. |
| మట్టితోడితాటి యొద్ద | నందంపూఁడి శాస. |
| నూటయెన్మ | బాణరాజుల శాస. |
| రట్టోళి యిచ్చినది | ఒంగోలుదగ్గఱ నిడుమానూరు శాస. |
| మానిసియెమ్మికాల | వైదుంబరాజుల శాస |

సంధిపాటింపఁ బడినచోట్లు:

| | |
|---|---|
| రాజుల్లేళన్ | ఇందుకూరి శాస. |
| ఉత్తమోత్తము స్తయిన; రేనాణ్డేలుచు- | తిప్పలూరి శాస. |
| ఏనగు | రామేశ్వర స్తంభ శాస |
| చోళమహారాజు లేళన్ | చిలంకూరు శాస. |
| ప్రాణసమానుణ్డవైన | కొఱవిశాస. |

గలరేనియు; సుఖంబుణ్డ యొకనాఁడు; శ్రీనిరవద్యుణ్డనేక; ఖడ్గ సహాయుణ్డై

| | |
|---|---|
| భీమసలుకి యన్దనేక | కొఱవి శాసనము. |
| అఱువది వే లేండ్లు | ఏడువాదల పాలెపు శాస. |
| రేనాణ్డేలుచున్ | వైదుంబరాజుల శాస. |
| పాపంబగు | పెట్లూరి శాస. |
| సంయుక్తు స్తగున్ | బాణరాజుల శాస. |
| సంవత్సరంబు శిరువది మూండు | విక్రమాదిత్య బలిపుల బాణరాజుల శాస |
| తూమెన్డు; మానెన్డు; నూపెన్మణ్డకు | బాణరాజుల శాస. |
| రేనాణ్డేఱువేలనేల | S I I X 595. |
| గొణ్నివాన్దు నిచ్చినవాన్దు | పెద్ద ముడియం |
| ఇన్ద్రలో కంబేగె | చిన్నతిప్ప సముద్రము |
| భద్దుణ్డయి | ఉప్పరపల్లి |

| | |
|---|---|
| పాతకుణ్డగు | మదనపల్లి పోతురాజుగుడి S.I.I X 287. |
| గ్రామమిచెను | గోవిందపురం బంగారమ్మరాయి S.I.I X 403. |

పై యుదాహరణములను బట్టి చూడ ఉత్తునకుఁ బెక్కుచోట్ల సంధియగుచున్నట్లును. అత్తునకు వైకల్పికముగా నగుచున్నట్లును. ఇత్తునకు సంధిలేనట్లును దెలియుచున్నది. సంధిలేనిచోట్లఁ గొన్నియెడల యడాగమము చేయఁబడినది.

ఉత్తునకు అచ్చు పరమగునపుడు సంధిలేకుండుటయే కాక యడాగమము కల్గినచోట్లు కూడఁ గొన్ని కానఁబడుచున్నవి. ఇవి లేఖక ప్రమాద జనితములైనఁ గావచ్చును. లేదా చింతామణిలోఁ జెప్పఁబడినట్లు యకారాదులైన పదములప్పుడు వాడుకలో నుండియైన నుండవచ్చును. హలంత పదముల తరువాతఁ బదాది యకారము చూపట్టుట కూడ నీ విషయమునే స్థిరపఱుచుచున్నది.

| | |
|---|---|
| వారుయిల్లకాను | విప్పర్ల శాస. |
| విషయంబు యేళువారి | విక్రమాదిత్య బలికుల బాణరాజుల శాస. |
| వేత్రోలు యేలెడు | యుద్ధమల్లుని బెజవాడ శాస. |

షష్ఠీవిభక్తి ప్రత్యయములైన కి కు అనునవి ద్రుతాంతములుగాఁ బ్రయోగింపఁ బడినవి. వీని కచ్చు పరమైనప్పుడు సంధియైన రూపములును, ద్రుతము లోపింపఁగా విసంధి పాటింపఁబడిన రూపములును గనవచ్చుచున్నవి. కాని ద్రుతముతోఁ బరాచ్చు సంశ్లేషము నొందిన రూపములెచ్చటను గానవచ్చుట లేదు.

| | |
|---|---|
| పెన్బుఱ ఇశెరేవికిన్ | పొట్లదుర్తి మాలెపాడు శాస. |
| ఏలినవేవికిన్ | గండత్రినేత్రుని శాస. |
| మహారాజులాకున్ | విప్పర్ల శాస. |
| భటారకకున్ | దిమ్మగుడి శాస. |
| శీతెన్వికర్వంబు నాకున్ | S. I. I. X 287 |
| పాఱకు ఇచ్చిన | ఉరుటూరు శాస. |

| | |
|---|---|
| వప స్త్రీశ్వరమ్మున కిచ్చినది | రామేశ్వర స్తంభశాస. |
| నాకెల్లః పీకేమివలయుః శ్రీకెల్ల న్దానయ | కొఱవి శాస. |
| చేది శర్మకిచ్చిరి. | వెలిదుర్తి శాస. |
| గొఱవలకిచ్చిన | S I I X 594. |
| శర్మ్మాఙ్ఱరి కిచ్చిన దఠి | చామలూరు శాస. |
| ఆదిత్య బటరవికి ఇచ్చిన | అద్దంకి శాస. |
| నాకు ఇచ్చిరి | నలజానంపాడు శాస. |
| కశ్యపగోత్రినికి ఇచ్చిన | మాలెపాడు శాస. |

చోళమహారాజు ఇందుకూరు శాసనమందును ఉత్తమాదిత్య చోళమహారాజు వెలుదుర్తి శాసనమందును ఉత్తున కచ్చు పరమగునప్పుడు పరాచ్చులోపించిన ప్రయోగములు కనఁబడుచున్నవి. ఇవి లేఖక ప్రమాద జనితములో యప్పు దట్టి సంధి వాడుకలో నుండెడిదో చెప్పఁ జాలము.

సంయుక్తున్ను + అగు = సంయుక్తున్నుగు     ఇందుకూరు శాస.
పఞ్చ మహాపాతకున్ను + అగు = పఞ్చ మహా పాతకున్నుగు - వెలుదుర్తి శాస
ఇందు, అందు అనున విప్పుడు సప్తమీ విభక్తి ప్రత్యయములుగను ద్రుతాంతములుగను బరిగణింపఁ బడుచున్నవి. ఈ శాసనముల కాలమున నవి యుదంతములైన ప్రథమా విభక్తి రూపములుగాఁ గనఁబడు చున్నవి.

| | |
|---|---|
| గ్రొరగల్గా కొరులిందు విడిసి - | యుద్ధమల్లుని బెజవాడ శాస. |
| ఇన్దు ప్రత్యక్ష బయన్న | Do. |

సముచ్చయమునకు (ఉన్) అచ్చు పర మైనప్పుడు ద్రుతము లోపించుటయు యదాగమము వచ్చుటయుఁ గనఁబడు చున్నది.

| | |
|---|---|
| గల రేనియు యీ స్థితి. | కొఱవి శాస. |
| మఱియు యెవ్వియేని. | Do. |

నన్నయ భారతము నందును దరువాతి గ్రంథము లందును ద్రుత ప్రకృతికములకుఁ బరమైన పరుషములు సరళములుగా మాఱుట కనవచ్చుచున్నది. అప్పు

దా ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాష వగును. ఈ శాసనములలోఁ గొన్ని చోట్ల సరళాదేశము కనవచ్చుట లేదు. కొన్నిచోట్ల సరళాదేశము చేయఁబడినను బిందువు లోపించుచున్నది.

రేవళమ్మాఁ రికిన్ తేని — చోళ మహారాజు ఇందుకూరి శాస.
ఇకె రేవికిన్ తేని. — పొట్లదుర్తి మాలెపాడు శాస.
మహారాజు లాకున్ ప్రవర్ధమాన — విప్పర్ల శాస.
మా . .డియారికి తేని — నల్లచెఱువుపల్లి శాస.
ఏఱచు వల్లవాధి రాజుల — చామలూరు శాస.
మంగుతోటన్ పొడుచి — బూడిదగడ్డపల్లి శాస.
ప్రాపున ప్రోపు — S I. I. 598
మాఱత్రు గాను తాగిరి — మాలెపాడు శాస.
వాకు బణి పేసిన — విప్పర్ల శాస.
ఏ చేసిన యుపకారంబునకు ప్రత్యుపకారంబు — కొఱవి శాస.
వారిచేత పట్టం కట్టబడి — ముదివేడు శాస.
కయ్యంబున జచ్చిన — మైలవర శాస.
పాఱ జమ్పిన వాన్డు — రామేశ్వర స్తంభ శాస.
ఠీవి గాచినవారు — బుదమ నారాయలపాడు శాస.

సరళాదేశమైన పిమ్మట ద్రుతము బిందువుగా మాఱిన రూపములు.

పరుమటం గొణ్డ — దొంగలసాని కనుమ శాస.
వలయుంగాన; నేలయెల్లం గావంబూవి; చేయంబడి — కొఱవి శాస.
పున్నమం బెట్టువారు — S. I. I. 595
ఉణ్డంగాంతురు — ఏడువాడల పాలెపు శాస.

సంఖ్యావాచకమైన ఏను నన్నయ భారతమునఁ గళ గానే వాడఁబడినట్లు తోఁచుచున్నది. ఏలయన ఏను తీర్థములు ఆది. (8.148) ఏను ప్రకారంబులు

( ఆది 7 274 ) మున్నగు చోట్ల దాని తరువాత సరళాదేశము చేయఁబడి యుండలేదు.

లక్ష్మీపుర శాసనమున పదేన్దుమ్బు అను రూప మున్నది. ఇందేను లోని ఉ లోపించుటయుఁ బిమ్మటఁ బరమైన త కారము ద కారముగా మాఱుటయుఁ గాన వచ్చుచున్నది. దీనిని బట్టి యుత్వ లోపము కలుగు నప్పు డది ద్రుత ప్రకృతికమే యని భావింపవచ్చును.[1] ఏను కళయైనను ఏను + పది = ఏఁబది; ఏను + తుము = ఏఁదుము అను రూపములను బ్రాఁతాది సూత్రముచే సాధింప వచ్చును. ఇలప ఱుఱ్ఱు శాసనమునను విప్పర్తి శాసనమునను ఏనువుట్లు అని ఏను తరువాత గస డదవా దేశము చేయఁ బడినది. అందుచే నప్పుడది కళగా నుండెనని భావించుటయే యుక్తముగాఁ దోఁచుచున్నది.

గసడదవా దేశము బహుళమని చిన్నయసూరి సూచించెను ఇప్పటి యా దేశము చాల నరుదై పోయినది. ఒక్క అగు ధాతు తుమున్నర్థక రూపమైన కాన్, కన్ అను వానిలోని క కారమునకు మాత్రము గాదేశము నిత్యముగాఁ గనవచ్చు చున్నది. చాళుక్య కాలపు శాసనములలోఁ గొన్ని చోట్ల నీ కకారము నకు గాదేశము కనఁబడుట లేదు. మిగిలిన చోట్ల గసడదవా దేశము నియత ముగాఁ గలుగుచున్నట్లే భావింప వచ్చును.

వివలుకాను (ఎఱ్ఱ గుడిపాడు) వారుయిల్లకాను (విప్పర్ల) చిర్పలియపటు కాను (తిప్పలూరు శాస.) బృహస్పతి హోరకాను (తిప్పలూరు శాస.)

| | |
|---|---|
| అణతిగ్గాను (ఇట గా దేశమైనది) | రామేశ్వర స్తంభ శాస. |
| అచ్చర్వుగ్గను Do | బూదిదగడ్డపల్లి శాస. |
| స్వస్తిశ్రీ స్తోళ మహారాజు ల్లొళన | పొట్లదుర్తి మాలెపాడు శాస. |
| వేగ్గళవు. వేసైఱువుళు. వేవ్వాన్టూల్లు | మాలెపాడు శాస. |
| పట్టంబు గట్టిన | దొంగలసాని కనుమ శాస. |

1. నాలుగేన్ ణ్ణాడికుఱ్ఱుం నీఁడె పీనికి" భార. ఆది ౫-218 లో (చింతా. విష పరి పుట 191 పాఠము) నాలుగైనను అనియేకాక నాలుగైదను నర్థముకూడఁ జెప్పవచ్చును అప్పుడిది కూడ ఏన్ ద్రుత ప్రకృతిక మనుట కుదాహరణ మగును.

| | |
|---|---|
| వాళుబణి స్తేసివ | విప్పర్ల శాస. |
| అళ్లి పట్టు సేను | Do |
| ఇరువుట్టి | విప్పర్తి శాస. |
| అచువరు గ్గళరేని | లక్ష్మీపుర శాస. |
| వేగవిళలు | Do |
| నాలుగు వ్టుట్టు ఆళ్లి పట్టుస్తేను | బుదమ నారాయల పాడు శాస. |
| వెయిగవిలాళు, రాజ్యంబు స్తేయుచు | కొఱవి శాస. |
| ప్రత్యుపకారంబు సేయ వలయున్ | Do |
| వెయి పెఱువుళు వేయిగావిలల | ఏడువాడల పాలెపు శాస. |
| ఇరుగణ్డు గార్ల పట్టుసేను | మైలవర శాస. |
| దయ పేసిరి | పెట్లూరి శాస. |
| మూన్టు వుట్టు | నంజానంపాడు శాస |
| పడ్డెణ్డు వుట్లు | బికిరాజు శాస. |
| రజ్యంబు గొణ్ణవాన్టు | పెద్దముడియం శివాలయ శాస. |
| ప్రిథివిరాజ్యమ్బుసేయ | ముదివేడు చెఱువు దగ్గర శాస |
| వేదబ్రాహ్మణ గురు భక్తుణ్డు సత్రిత్రయ | ధర్మవర శాస. |

ఇప్పుడు పై పయి అను నవ్యయములు ద్రుతాంతములుగా వాడఁబడు చున్నవి. రామానాయవికోట (S I. I. X 642) శాసనములో వాణరాజుపై పోయి వాడిచి అను ప్రయోగము కనఁబడుచున్నది. దీనిని బట్టి యప్పుడు 'పై' శబ్దమైన యవ్యయముగానే పరిగణింపఁ బడుచుండెనేమో యను సందేహ మొదవు చున్నది.

ఇప్పుడుదంతమైన ధాతువును యథాస్థితముగా వాడినచోఁ దద్ధర్మ విశేషణమగు చున్నది. దీనికచ్చు పరమగునప్పుడు నుగాగమ మగునని వ్యాకర ణములు చెప్పుచున్నవి. పూర్వము ధాతువునకు ఉమ చర్పఁగా నీ తద్ధర్మ విశేషణ మేర్పడుచుండెనని తెలియుచున్నది. (అగుమ్, పోగుమ్, చేయుమ్) ఈ ఉమ్ కాలక్రమమున ఉన్‌గా మాఱినది. హల్లు పరమైనప్పు డిందలి ద్రుతము లోపించును. అచ్చు పరమగునప్పుడు దానితో సంశ్లేషము నొందును. ఈ శాసన

ముల కాలము నాఁటికే యిట్టి రూపములు కనవచ్చుటచే ఉమ్‌లోని మకారమప్ప టికే ద్రుతముగా మాఱెనని తెలియుచున్నది.

అగు + నాణ్డు రామేశ్వర స్తంభ శాస.
వచ్చు + వాన్టు Do : మాలెపాడు శాస.
వర్ప్రాద్యది యొకొటి యగునేణ్టి దొంగలసాని కనుమ శాస
ఎణుంబొది అన్నేణ్టి.
సంవత్సరంబుళ్ పదియేడగు నేణ్డ ఇంద్రకీల పర్వత శాస.
నూటానల్వొది యగునేణ్టి ఏడువాడల పాలెపు శాస
అగ్గపరాజు సవత్స (౮౫౦) యగు నేణ్టి } పొదిలి శాస.

కొన్నిచోట్ల అనుధాతు తద్ధర్మ క్రియాజన్య విశేషణమునందలి ప్రత్యయముతో ధాతువు నందలి ఉకారము కూడ లోపించుచున్నది.

అన్వాన్టు (బూడిద గడ్డపల్లి) బాదిరాజన్వాన్టు (నలజానంపాడు శాస.)
శత్రర్థక చువర్ణము ద్రుతాంతము. దీనికచ్చు పరమైనప్పుడు ద్రుతము లోపించి సంధి యగుటయు, ద్రుతమచ్చుతో సంశ్లేషము నొందుటయుఁ గూడ గానవచ్చుచున్నది.

ఏలుచుణ్డి మాలెపాడు శాస, చెన్నరాయనిపల్లి శాస.
రాజ్యంబు చేయుచు నిష్ట విషయ భోగంబులు } కొలవి శాస.
ఆచంద్రార్క తారకంబును వార్ధిఁలుచు నుండు } దొంగలసాని కనుమ శాస.
అపదాద్యచ్చు పరమగునపుడు సంధియైన రూపమే కనఁబడు చున్నది :
మాన + ఎణ్డు = మానెణ్డు విత్యవర్షుని మాలెపాడు శాస.
వధి + ఇంచు = వధించు గండ త్రినేత్రుని శాస.

పద్య శాసనములందలి వచన భాగములలోఁ గూడ విసంధి పాటింపబడిన ప్రయోగములే హెచ్చుగానున్నవి. యడాగమాదులు కూడఁ బైవచన శాసనములందువలెనే కనవచ్చు'చున్నవి.

అద్దంకిశాస :
పరమ మహేశ్వరుణ్డు ఆదిత్య బటరనికి ఇచ్చిన భూమి ఎనుబొది వుట్ల అర్ధు పట్టువేల
వారికి అస్వమేదంబున ఫలంబు అగు
చా. భీ. ధర్మవర శాసనము :
విజయరాజ్య సంవత్సరంబు యేనగునేణ్ఠి ఉత్తరాయన, నల్లాతణ్ణ య్న అయ్యప రాజా, బెజయరాజా ఈ పురము.
బెజవాడ శాసనము· (యుద్ధమల్లునిది)
చేంబ్రోలు యేలెడు.
ఒణ్డుసోటి (గసడదవాదేశము).
యిస్తిపేకొణి Do
డీవిన్దారు విల్పినవారు .. దప్పి యటి పుట.

పద్య శాసనములందలి పద్య భాగములలో గసడదవాదేశము విియతముగాఁ జేయఁబడినది.

అద్దంకి శాస·
పట్టంబుగట్టిన, పట్టంబు గట్టి ఙ్చి: కొట్టం బుల్వణ్డె ణ్డు గొణి; దుర్గంబు గదు బయల్పేసి; బెజవాడ గావిశ్చె.
కందుకూరు శాస·
శ్రీవిరవద్యుణ్డు సిత్త జాతసముణ్డు
చా. భీ. ధర్మవర శాసనము.
అడవి పొన్చె; అచలపురము పొచ్చె.
యుద్ధమల్లుని బెజవాడ శాస.
రాజాశ్రయుణ్డు త్రిభువనాభరణుణ్డు, పట్టంబుగట్టిన పతి.
పాపంబు దమకు; ఒణ్డుసోటు; అనఘుణ్డుపేకొవి; ఇన్దుఁ బ్రత్యక్ష బయన్నవిచ్చు; స్థితిపేకొణి; పేరదు దానం
గూడూరు శాస:
రాజవందనుల్ సనిన; పేమ్యందు దానుదయించె; ప్రతిష్ఠపేసి; కోటిసేయదే.

---

ఇందు తెలుఁగు మీఁది సాంస్కృతిక పరుషమునకు గ స డ దవాదేశమైనది ఇం దప్పుడు కళగా నుం డెననుటకుఁ గూడ నిదియొక నిదర్శనము.

ఉకార సంధి:

బలగర్వం బొప్పగ (అద్దంకి).

పేవితు ణ్ణఖిలుణ్ణనృతరిపు బలుణ్డాహవ (కందుకూరు)

లోహాసనంబైక్కి; వెన్నాజిలో; సంకిలాణ్ణను, బింకమ్ము డిచె, బెణ్డైన;

భూలోకంబెఱుంగ. చా. భీ. ధర్మవరశాస.

మల్లుణ్ణనవద్య: వల్లభుంద త్రిణా· భక్తుణ్డై, నృపధాముణ్డెత్తిశ్చె. ఒరులింద

మలినురై; ఫలం బుపేక్షించినా; లింగబఱిసిన; సుతుణ్ణోణ్ణు; మల్లణ్డెత్తించ్చె

కలశ బిడ్డ; మాడువమరంగ; ధర్మవాదంబడి. (యుద్ధ. బెజవాద శాస)

వెన్నందను సంభవుండయ్యె; ప్రసిద్ధుండై; ఘనుండగు; జగద్విదితుం డుదయించె

భీముండ్రో; భూషణుండెట్టి, నరేంద్రుండు త్తమ, అతండ్ర వి; అరుస్త్రగు.

కాలుండై - కామసాని గూడూరు శాస.

ఇతర సంధులు :

గొరగల్గాక + ఒరులు = గొరగల్గాకొరులు (అకార సంధి).

కొవి + ఉణ్డు వారు = కొవియుణ్డువారు (యడాగమము).

పతి + ఉ = పతియు.

తివిరి + ఇన్నెలవ = తివిరి యిన్నెలవ (యడాగమము)

బెజవాదకు + ఎల్ల = బెజవాదకెల్ల.

దానికి + అ = దానిక.

ఇద్ద + అట్లు = ఇద్దట్లు.

భీముండో + అనంగా = భీముండో యనంగా (గూడూరు శాస.)

దేశము + అందు = దేశము నందు.

అట్టి + ఎట్టు = అటి యెట్టు.

కామమసాని + ఒక్క = కామమసాని యొక్క.

చంపి + ఆ కొరవి = చంపి యా కొరవి.

అత్తునకు సంధి యైనది. ఇత్తునకు సంధి లేదు. క్త్వార్థకమైన యిత్తునకు సంధి లేదు. ఉత్తునకు సంధియైనది; దేశము నందు అను ప్రయోగమును బట్టి

గూడూరు శాసనమునాఁటికి (క్రీ. శ. 1000) అందు విభక్తిప్రత్యయముగా మాఱినదని తెలియు చున్నది. దేశమునకిది పరమైనప్పుడు నుగాగమమైనది.

ద్రుత ప్రకృతిక సంధి:

ఒప్పగ బైలేచి; ప్రభుం బణ్డరింగుం బణ్చిన. వేంగి నాణ్టిం గొఱల్చియ (అద్దంకి శాస )

ఆజిలోం జూపె, చోఱనింజేకొని. (చా భీ. ధర్మవర శాస )

పరగంగ; బెజవాడం గొమరు స్వామికి, వెలయంగ, విడిసిన బ్రోల్ల గలం మతంబునుం గార్త్తికేయునకు, రక్షయుంగాను తానుం గట్టించెం గ్రమంబున; అమరంగ: (యుద్ధ. బెజవాడ శాస )

వానికిం ఘనుండగు, ఉదయించె గీర్త్తితో, అనంగా , వసుధాధిపుం జేకొని, ఉద్ధ్రితముగ జంపి; నాయకు జంపి (గూడూరు శాస.)

ద్రుత ప్రకృతికము మీఁది పరుషములకు సరళము లగును ఆదేశ సరళమునకు ముందున్న ద్రుతమునకు బిందు వగును ఈ బిందు వున్న చోట్ల నెల్ల నిండు సున్న గనే వ్రాయఁ బడినది. కొన్ని చోట్ల నర్ధ బిందువు విడిచి వేయఁ బడినది. కొన్ని చోట్ల నిండు సున్నగనే వ్రాయఁ బడినది. వర్గ యుక్కు పరమైనప్పుడు గూడూరు శాసనమున ద్రుతమునకుఁ బూర్ణ బిందువైన ప్రయోగ మున్నది. (వానికిం ఘనుండు) అరుదగు + అట్టి = అరుదగు నట్టి (గూడూరు) ఉదంత తద్ధర్మ విశేషణమున కచ్చు పరమైనప్పుడు నుగాగమ మైనదని వ్యాకరణము చెప్పు చున్నది. నిజమునకు అగునట్టి అను నప్పుడు (ఉమ్) ఉన్ లోని ద్రుతము, పరమైన యచ్చుతో సంశ్లేష మొందిన దని చెప్పవలయును.

నృపు + అంగన = నృపు నంగన (గూడూరు శాస.) షష్ఠీ సమాసమున నుత్తున కచ్చు పరమైనప్పుడు నుగాగమ మైనది. వేలుపు + కొండ (గూడూరు శాస.) ఉదంత స్త్రీ సమమునకుఁ బరుషము పరమౌటచే నుగాగమ మైనది. పిమ్మట సరళాదేశము. బిందువు విడువఁ బడినది. వేలుపు గొండ.

అకు + చింత (రెండవ తాళుని సిరిపుర తామ్ర శాసనము)

అకు జింత , పొలయణ్ణ పేదరి యాకు జింత)

అద్దంకి శాసనమున ప్రథమంబు నేణ్డను ప్రయోగ మున్నది. ఇది కర్మ ధారయ సమాసము. నన్నయ తరువాతఁ గర్మధారయము నందు ము వర్ణము నకుఁ బుంపులగుటయు నుత్తున కచ్చు పరమగు నప్పుడు టుగాగమమగుటయు గనఁబడు చున్నది. ఇచ్చటనుగాగమమైనది.

పై శాసనము నందే కట్టెము + దుర్గము అనుచోట పుగాగమము చేయఁ బడినది. ఇట్లే లక్ష్మీపుర శాసనము నందు (675) మిరియంపు బోళ అనుచోట ంపు గాగమము కన్పట్టు చున్నది. వైయాకరణులు ము వర్ణమునకు పుంపు లగునని చెప్పుదురు కాని యీ పుంపులు ము వర్ణము యొక్క పూర్వ రూపములే. ఉత్తమా దిత్య చోళ మహారాజా వెలుదుర్తి శాసనమున (750 A D.) ఉత్తరంబు కట్ట అను ప్రయోగమున ము వర్ణమునకుఁ బూర్వ రూపమైన బు వర్ణము కనఁబడుచున్నది

వాని + అది = వానిది (గురింద గుంట శాస.)

ఇచ్చట అది శబ్దము యొక్క అత్తునకు వృత్తిని లోపమైనది.

ఉరుపు టు రిచోళ( లక్ష్మీపుర శాస. ) ఉరుపు + ఊరి, ఇచ్చట నుత్తున కచ్చు పరము కాఁగా టుగాగమమైనది. యుద్ధమల్లుని బెజవాడ శాసనమున ఈ + నెలవు = ఇన్నెలవు; ఈ + ఒట్టు = ఈ యొట్టు; ఇయ్యొట్టు అను రూపము లున్నవి. దీనికే త్రిక సంధి యని పేరు ఈ సంధి వచన శాసనములలోఁ గూడఁ జూపట్టు చున్నది. ఏ + వాణ్డు; ఎవ్వాణ్డు (గురింద గుంట శాస ) ఈ + నల్వురు; ఇన్నల్వురు: (బాణరాజుల శాస )

మూఁడు + నూరు = మున్నూరు (రామేశ్వర స్తంభ శాస.)

ఇచ్చట మూఁడు శబ్దము నందలి డుజ్ఞునకు లోపంబును, మీఁది హల్లునకు ద్విత్వ మును, బిమ్మట దీర్ఘో కారమునకు హ్రస్వమును గలిగినవి. బాణరాజుల శాసన మున మూనూఱను ప్రయోగము కూడఁ గలదు.

అశ్వమేధమ్బున ఫలమ్బు (విత్పత్తి శాస.) (నలజానంపాడు) (అద్దంకి) ఇట్టి రూపములు నన్నయ భారతము నందును దరువాతి భాషలోను గూడఁ గనవచ్చు చున్నవి. ఇచ్చటి న కారము సప్తమీ విభక్తి ప్రత్యయము కాదు. సంబంధార్థమున వచ్చిన అకారమునకు ముందు ప్రకృతి భావమును నివారించుటకై నకారము చేరఁగా నా రెండును గలసి 'న' యైనవి. అశ్వమేధమ్బున అనున దిక్కడ గుణ సూచకముగా (attributive) వాడఁబడినది. అశ్వమేధమ్బున ఫల మనఁగా

వశ్వమేధ యాగము చేయఁగాఁ గలుగు ఫలమని యర్థము.

పై చర్చనుబట్టి వచన శాసనములలో సంధివిషయమున స్థిరమైన నియమములేవియుఁ గానరాకపోయినను బద్యములందుమాత్రము తరువాత నేర్పడిన సంధి విధానమంతయుఁ జాళుక్యయుగము నాఁటికే క్రమముగా నేర్పడుచుండె నని చెప్పుటకు వీలగుచున్నది.

వాక్యములు :

పెక్కు వాక్యములలో సమాపక క్రియలు లేనేలేవు అట్టిచోట్ల భూత తద్ధర్మ క్రియాజన్య విశేషణములతోఁ గూడిన విశేష్యములతోడనో, తచ్ఛబ్దాను ప్రయోగముతోఁగూడిన భూతతద్ధర్మ క్రియా విశేషణములతోడనో యర్థము వ్యక్తము చేయఁబడుచుండును. కొన్నియెడలఁ గ్రియాజన్య విశేషణములు లేకుండఁ గూడ సందర్భమునుబట్టియే యర్థము సూచితమగుచున్నది.

భూతకాల క్రియాజన్య విశేషణముతోఁ గూడిన విశేష్యము.

కుణ్డికాళ్ల వివబుకాను ఇచ్చిన పన్నస.

వవప్రియ ముత్తురాజులు ఇచ్చిన పన్నస సాక్షికాను } ఎఱ్ఱగుడిపాడు శాస.

కొట్టంబున పాఱకు కుణ్డికాళ్ల ళ ఇచ్చిన పన్నస.

ఎఱిగల్ తుగరాజుల్లఇచ్చిన పన్నస ఉరుటూరు శాస.

ఎఱిగల్ దుగరాజుల్ ఇచ్చిన పన్నస

కొచ్చియపాఱరేవ శమ్మాఱరికిన్ ఇందుకూరు శాస.

బెజఇత్తబటరళ విల్చినదత్తి కపిలేశ్వరపుర శాస.

ఇళరయ విల్చిన గుడియు Do

తద్ధర్మ క్రియాజన్య విశేషణముతోఁ గూడిన విశేష్యము :

పళకుపోవు పన్థాః-రెండవ జయసింహుని పెణుకపఱ్ఱు దాన శాస. A D 707.

దక్షిణతః పెంజెఱువు కట్టడిగ్గు నాలిత్రోవ - రణస్థిపూఁడి శాస.

తచ్ఛబ్దాను ప్రయోగముతోఁ గూడిన భూతతద్ధర్మ క్రియాజన్య విశేషణములు,

వసన్తిపోఱి చోళమహా దేవుల.... రాచమానంబున మున్నూఱు నేల మాఱ్పడుగు రట్టగుళ్ల ఆనతిగాను వసన్తీశ్వరంబు నాకిచ్చినది.

దేనికి వక్రమ్బువచ్చు వాన్డు బారిణాపి వేవురు } రామేశ్వర స్తంభ శాస
పాఱజమ్మినవాన్డు

దీనికి వక్రంబువచ్చు వాన్డు పుత్రావద్య, స్త్రీవద్య, గోవద్య పఞ్చమహాపాతక
ఞ్చేసిన వాని లోకంబు నుణ్డు వాన్డు మాలెపాడు శాస

వేంగినాణ్టి కెవ్వరు రాజులైరి వారుం బూర్వ్వ స్థితిందప్పక పాలించు వారు-
ఆహవమల్లదేవుని బాపట్ల తాలూకా చేబ్రోలు నాగేశ్వరాలయ మండలి శాసనము
(క్రీ శ. 1006)

ఱోగొణ్ణవాన్డు నిచ్చినవాన్డు చెడువాన్డు పెద్దముడియం శివాలయ శాస

ఇరుగణ్డు గాడ్ల పట్టుపేను భటరశకు } మైలవర శాసనము
రట్టొళ యిచ్చినది

వీనియందుఁ గర్త్రను గుణముగా నగుధాతు రూపమును జేర్చినచో నర్థము
విస్పష్టమగును. ఇట్టి వాక్యముల కూర్పు నధికరణాత్మకమైన కూర్పు
(appos t onal construction) అని చెప్పుదురు.

ఈ క్రింది వాక్యమున తచ్ఛబ్దాను ప్రయోగముతోఁ గూడిన భూతకాల క్రియా
జన్య విశేషణమే సంపూర్ణ భూతకాలార్థమును సూచించు చున్నది

వీరి పెద్దకొడుకు విదుమ్రని కయ్యంబున జచ్చిన వాన్డు మైలవర శాసనము

క్రియాజన్య విశేషణ రహితముగా నర్థము వ్యక్తము చేయఁబడిన
ప్రయోగములు

వెల్వఱించిన నశ్వమేధంబు ఫలంబు పేకించివా లింగం బటెసిన పాపంబు
తమకు. (యుద్ధమల్లుని బెజవాడ శాస) ఇచ్చట వగు అధ్యాహార్యము

పూర్వతః మణ్ణ్యారి పొలగరుసున యిసుకట్టలు చేఱువున దూబ.
రెండవ అమ్మరాజు మచిలీపట్టణ శాస

పశ్చిమతః రేటి పడుమటిదరి. Do

ఆగ్నేయతః పరువులగుణ్ట. దక్షిణతః చాకిచెఱువు- మొదటి చాళుక్యభీముని
బెజవాడ తామ్ర శాస (888–918)

ఇట్టి స్థలములలో కలదు, ఉన్నది మొదలగు క్రియారూపముల నధ్యాహార్యము
చేసికోవచ్చును.

తూఱ్పునకట్ట (క) లిద్ది పుట్టరాట వెలుంగ గుంజ చింత్తలు C P No 13

నీవు నా ప్రాణ సమానుణ్ణవైన చెలివి కొఱవిశాన ఇది ప్రథమాంతమైన యుష్మ దర్థ మగుటచే (ఏకవచనము) వు ఆగమముగా వచ్చినది ఇది (వు) ఇకారము మీఁద వి గా మాఱినది.

కొన్నిచోట్లఁ బై వాక్యముల తరువాత తేని లేక దేని అను దానితో నారంభించు నట్టియు, అగునను సమాపక క్రియతోఁ గూడినట్టియు సంబంధ బోధక వాక్యములు వాడఁబడియున్నవి ఒక్కొక్కప్పు డీ సంబంధ బోధక వాక్యము లలోఁ గూడ సమాపక క్రియలకు బదులు తచ్ఛబ్దాను ప్రయోగముతోఁ గూడిన క్రియాజన్య విశేషణములే కనిపించుచున్నవి. రాచమానంబున ఏబది తిరువుల పాఱకు ఇచ్చిన పన్నాసదేనికి వక్రమ్ము వచినవాన్డు పఞ్చమహాపాతకన్డు అగు.

ఉరుటూరు శాస.

ఎరిగల్ దుగరాజుల్ ఇచ్చిన పన్నస కొచ్చియ పాఱరేవ శర్మ్మాఁరికిన్ తేని ఱచ్చినవాన్డు పఞ్చమహాపాతక సంయుక్తున్డగు

రేవణకాలు పుద్దణకాలు ఇచ్చిన పన్నస పెన్పాఱ ఇశెరేసికిన్ తేని ఱచ్చినవాన్డు పఞ్చమహా పాతకున్డకున్.

వసన్తిపోఱి చోళమహాదేవులు వసన్తీశ్వరంబునా కిచ్చినది దేనికి వక్రమ్ము వచ్చువాన్డు బారణాసి వేవురు పాఱ జమ్పినవాన్డు.

ప్రధానవాక్యమునందును సంబంధ బోధక వాక్యమునందును గూడ సమాపక క్రియలు వాడఁబడిన చోట్లును గలవు.

కోపియపాఱ చేదిశర్మకిచ్చిరి ...దేనికి వక్రమ్మువచ్చు వాన్డు పఞ్చమహాపాత కున్డగు. ఉత్తమచోళుని వెలుదుర్తి శాస

ప్రధానవాక్యము సమాపక క్రియతోఁ గూడియుండ సంబంధ సూచక వాక్యము క్రియారహితమై యుండుట కీ క్రింది ప్రయోగము నిదర్శనము.

ఏనుమాఱు త్రుగాను తాగిరి దేవిసల్పిన వానికి వేగళవు వేసెఱువుఱు. పేవాన్డాఱ్లి నిల్పినమ్ పుణ్యమ్ము మాలెపాడు శాస.

ఈ సంబంధ బోధక వాక్యములు సంస్కృత శాసనములలోఁ జివరఁ గనఁబడు "స్వదత్తాం పరదత్తాం వా యోహరేత వసుంధరాం షష్టివర్ష సహ స్రాణి విష్ఠాయాం జాయతేక్రిమిః" అను శ్లోకమునకు బదులుగా వ్రాయఁబడి నట్లు తోఁచుచున్నది. ఈ రెండింటి ప్రయోజనోద్దేశములును సమానములే.

పృథివీవల్లభ విజయాదిత్యచోళుని చామలూరు శాసనమున తెలుఁగులో శాసనమంతయు వ్రాయఁబడిన పిమ్మట తేవి, దేవి అను వానితో నారంభించు వాక్యము లేకుండుటయు దానికిబదులు స్వదత్తామిత్యాది శ్లోకముండుటయు నిందుకుఁ దార్కాణము. ఈ సంబంధ బోధక వాక్య సంఘటనము సంస్కృతమున విరివిగాఁ గానిపించును. అట్టి వాక్యములందందు సంబంధ బోధకములగు యత్తచ్ఛబ్దములు కనఁబడు చుండును. తెలుఁగునఁగాని యితర ద్రావిడ భాషలలోఁగాని యిట్టివాక్యములను వ్రాయుట సహజమైన పద్ధతికాదు సంస్కృతానుకరణము వలననే యిట్టివాక్యము లీ భాషలలోఁ బ్రవేశించినవి. ఇట్టికూర్పు తెలుఁగునకు నైజము కాకపోవుటచేతనే తరువాత తేనికి, దేవికి అను సంబంధ బోధకములతోఁ గూడిన యుపవాక్యములకు బదులు దీనికి అను నిర్దేశ సర్వనామవాచకముతోఁ గూడిన వేఱు వాక్యములు వ్రాయుట సంభవించినది.

దాయనంబు నాకు ఇచ్చె. దీని రక్షిఞ్చేన వానికి అడుగడు గశ్వమేధమ్బు నా ఫలమ్బగు. దీని ఒచ్చినవానికి శ్రీపవ్వఁతంబు అచ్చిన పాపంబగు (నలజానంపాడు శాస. E I Vol 27 Page 203 )

దీని కాచి కుడిపినవారు భూమిదానంబు ఫలంబు - వక్రపఱ్చినవారు పఞ్చ మహాపాతకంబుపడు. (ఎరికల్ ముతురాజు పుణ్యకుమారుని వెలదుర్తి శాస )

ఇచ్చట పడుదురు లేక పడువారు అని యుండవలెను. లేదా వారునకు బదులు వాన్డు వాణ్డు అనియైన నుండవలెను. పడు = పొందు అను నర్థమున నిచ్చట వాడఁబడినది. దీనికి వక్రమ్బు వచ్చువాన్డు పఞ్చ మహాపాతక ఞ్చేసిన వానిలో కమ్బు నున్డువాన్డు మాలెపాడు శాస.

నన్నయ భారతమున నిట్టి సంబంధ బోధక వాక్యములచ్చటచ్చటఁ గాననగును గాని తరువాతి కవుల గ్రంథములలో వానికిఁ బ్రాచుర్యము క్రమముగాఁ దగ్గి పోయినది.

సాధారణముగా వాక్యములందుఁ బదములు కర్త కర్మ క్రియ అనువరుసలోఁ గానవచ్చుచుండును. విశేషణములు విశేష్యములకు వెనుకను అవ్యయములు క్రియలకు వెనుకను వాడఁబడుచుండును. కాని వీని కపవాదములు కూడ నచ్చటచ్చటఁ జూపట్టుచున్నవి. పద్యములందుఁ బదముల వరుస గణానుసారముగా వ్యవస్థితమై యుండును.

ఒక్కొక్కప్పుడు విశేషణములు విశేష్యముల తరువాత వ్రాయఁబడు చుండును

కొమ్మటి పాలరేవశమ్మః కశ్యపగోత్రినికి ఇచ్చిన — మాలెపాడు శాస.

శ్రీమహేన్ద్రిన్ మానరవి కాపిబోటి ముత్తురాజు అచ్చవ్వుఃగను అరివరజమున్టుఅవ్వాన్టు బూదిదగడ్డపల్లి శాస.

చాళుక్యభీమునకు శౌచకందర్పునకు వేగీశ్వరునకు — కొలవి శాస

కొన్నిచోట్ల కర్మ క్రియ తరువాత వాడఁబడినది

రేవణకాలు పుద్దణకాలు ఇచ్చిన పన్నస పెన్పాల ఇశెరేవికిన్ } పొట్లదుర్తి మాలెపాడు శాస

దన్నుఁ వయశ్ చేసి విల్పె విద్దమయ్య విప్రకవచమ్ము No 183 650A D

కల్యాణ దశనుల ఇచ్చిరి - అరహన్త భటారశకు ఆరు పుట్ల సుక్షేత్రంబు

సాధారణముగాఁ దచ్ఛబ్దాను ప్రయోగముతోఁ గూడినక్రియాజన్య విశేషణములకుఁ గర్మలైన పదములు వాని తరువాతనే వాడఁబడు చుండును కొన్నిచోట్ల నవి వానికి ముందున్న ప్రయోగములు కూడ లేక పోలేదు.

స్వస్తిశ్రీ దుగిరాజు మగన్టు కొండివిల్లు రచ్చ యిట్టికి ఇచ్చినది పన్దులు అల్లపట్టు పేను పెట్లూరి శాస (తరువాత నున్నది)

ఇరుగణ్ణ గాడ్ల పట్టుపేను భటరశకు రట్టొడి యిచ్చినది - మైలవర శాస. (ముందున్నది)

అసంపూర్ణ వాక్యములలోఁ దు మున్నర్థకములు గాని క్త్వార్థకములు గాని చేదర్థకములుగాని కనఁబడు చున్నవి.

స్వస్తిశ్రీ చోళ మహారాజు లేకన్ ఇచ్చిన పన్నస - ఇందుకూరు శాస.

పత్యదితున్టు పిద్దివేయు రేనాణ్టు ఏలువేలు ఏలుచున్టి ఏనుమాలుత్రు గాను శాగిరి.

దీనికి వక్రమ్ము వచ్చిన పాలను వేయు కవిలలా వచ్చినవారు-విప్పర్తి శాస.

వవియం బయ్యారల వెల్వలించిన నశ్వమేధంబు ఫలమ్ము పేకించినా లింగం బటిపిన షాపంబు దమకు యుద్ధ. బెజవాడ శాస.

ఏనితోఁ గూడిన సమాపక క్రియలు కూడఁ జేదర్థకముల వలెనే యసంపూర్ణ వాక్యములలో వాడఁబడి యున్నవి.

ఈ రెణ్ణుట్టి ఁచువరు గళరేని — లక్ష్మిపుర శాస.
దీని వెదపక నడిపిరేవి — ఏడువాడల పాలెపు శాస.

ఏకాశ్రయము లగు క్రియలు పెక్కున్నప్పుడు చివరి దానికి సమాపక క్రియా రూపములను మిగిలిన వానికి క్త్వార్థకే కారమును గానఁబడు చున్నవి

సామంతపదువతో బోయ కొట్టంబు ల్వణ్డెణ్డు గొణి, వేంగి నాణ్టిం గొఅల్చియ, త్రిభువనాంకుశ బాణ నిల్పి, కట్టెపు దుర్గంబు కదు బయల్పేసి, కణ్డుకు ర్వెజవాద గావించె మెచ్చి— అద్దంకి శాస.

పద్యములలోఁ గర్తృ కర్మ క్రియల క్రమము గణానుసారముగా మాఱు చుండును గుడియు నిరుపమమతి నృపధాము ఢెత్తించ్చె - యుద్ధ బెజవాద శాస మొదటఁ గర్మయుఁ దరువాతఁ గర్తయుఁ గ్రియయుఁ బ్రయోగింపఁ బడినవి కవిమల్లుఢెత్తించె గుడియు మరంటు (కర్త, క్రియ, కర్మ.)
శ్రీయుద్ధమల్లుఢెత్తించె పమిత తేజుణ్డు (విశేష్యము తరువాత విశేషణము)
పెక్కుచోట్లఁ గర్తృపద ప్రథమకు షష్ఠి వాడఁ బడినది.

ఎరిగళ్ తుగరాజుల్ల ఇచ్చిన పన్నాస— ఉరుటూరు శాస.
ఎరికల్ ముత్తురాజుల్ల కుణ్డికాళ్ల నివబుకాను ఇచ్చినపన్నస-ఎఱ్ఱగుడిపాడు శాస.
బెజయిత్త బటరళ నిల్పిన దత్తి - కపిలేశ్వరపుర శాస.
ప్రితివి పతుల్ల ఇచ్చిన పన్నశా విత్పత్తి శాస.

భూదాన శాసనములలో పరిహద్దులు వివరించి వ్రాసిన వాక్యములందు ఏ వార్థకమైన అకారము ప్రయోగింపఁ బడియున్నది.

దక్షిణతః ఇయ్యూరియు నెరపులయుం బొలగరుసున తాడ్లతేవ సీమా
(తేవు + అ = తేవ)
యేఱువ గడ్డయ సీమా (గడ్డ + అ)
తాటియొద్ద చింతయ సీమా (చింత + అ) నందంపూడి శాస.

శాసన రచనలో నిట్టి సంప్రదాయ మున్న దనుటకుఁ దరువాతి శాసనములు కూడఁ గొన్ని సాక్ష్య మిచ్చుచున్నవి.

"పిఠాపుర మందున్న మల్లిదేవుని శాసనములో (E. I IV P 92) నందంపూడి

శాసనములో నన్నయ వ్రాసినట్లే ఎనిమిది దిక్కుల సరిహద్దులు తెల్పు వాక్యము లలో కొసను వరుసగా ఎఱ్ఱ గుంటయ సీమా, కాలియ సీమా, గుణ్డయ సీమా, గుంటల సీమా, వంకయసీమా అని ఏవార్థ కాకార సహితముగానే శబ్దము లున్నవి[1]. అదే సీమ యని చెప్పుట కీ యే వార్థకము నుపయోగించు చుండిరని చెప్పవచ్చును. సంస్కృత భాష వాడఁబడి నప్పు డిట్టి చోట్ల సీమైవ సీమా అని ఏవ శబ్దమును వాడుట కూడ నిందుకు నిదర్శకముగా నున్నది విశేష్య విశేష ణములకు నడుమ అగు, అయిన మున్నగు భవత్యర్థకములు లేని ప్రయోగ ములు పెక్కు కనఁబడు చున్నవి.

స్వస్తిశ్రీ ఎరికల్లు ముతురాజు పుణ్య కుమారున్డు, గణ్య మానున్డు, మాఱున్డ పిడుగు, మద ముదితు స్తుత్తమో త్తమున్డయిన వాన్డు· తిప్పలూరు శాస.
చోఌ మహారాజుల తేవుళ్ మంఖి పొట్టియారు నల్ల చెఱువుపల్లి శాస.
విక్రమాదిత్యుల కొడుకుళ్, కాశ్యప గోత్రున్డు, సత్యదితున్డు — మాలెపాడు శాస.
కొమరిపాఌ రేవశమ్మఁ కశ్యప గోత్రివికి Do
తమ అన్న గాణగయ్య చేసిన కొఱవి శాస.
యుద్ధమల్లుని బెజవాడ శాసన మందలి మొదటి పద్యములోని విశేషణములు.
తమ తాత మల్లపరాజు యుద్ధ. బెజవాడ శాస.
అయిన (అయ్న) అను భవత్యర్థకముతోఁ గూడిన విశేషణ విశేష్యముల కుదా హరణములు.

శ్రీ విక్రమాదిత్య నృపాగ్ర తనయుణ్డయ్న చాళుక్య భీమునకు — కొఱవి శాస.
రవమద్దాన్వయ కుల తిలకుణయ్న కుసుమాయుధుణ్డు Do
స్వస్తిశ్రీ మళయాళాధి పతి యయ్న చోడయ రాజులు- ఏడువాడల పాలెపు శాస.
విశేష్యము షష్ఠీ విభక్తి యందుండఁగాఁ బూర్వ ప్రయుక్తమైన విశేషణము ప్రథమాంతముగాఁ నుండుట కొన్ని యెడలఁ జూపట్టు చున్నది.

పెన్బాఌ ఇశె రేవికిన్ పొట్లదుర్తి.
కొచ్చియపాఌ రేవశమ్మాఁరికిన్ ఇందుకూరు శాస.
తక్కఁ పుట్టోల పారదాయ కితేవురు కట్టిశమ్మఁకు — తిప్పలూరు శాస

1. రాజ. రాజ నరేం. పట్టా. సం. పుట 121.

కోపియపాఱ చేదిశమ్మఁగారు ఉత్త, చో. వెలుదుర్తి శాస.
కొమరిపాఱ రేవశమ్మఁగ కశ్యప గోత్రివికి మాలెపాడు శాస.
అను ప్రయోగమున విశేషణమునకే షష్ఠివిభక్తి ప్రత్యయము చేర్పఁబడినది విశేష్యము ప్రథమాంతమై యున్నది.

చిన్నయసూరి సంప్రదానంబునకుఁ జతుర్థియగునవి చెప్పి చతుర్థికి మాఱుగా షష్ఠియే తఱుచుగాఁ బ్రయోగంబులఁ గానంబడియెడి నని సూచించెను. ఈ శాసనములందుఁ గూడ సంప్రదానమునకు షష్ఠియే కానవచ్చుచున్నది

తిరువుల పాఱకు ఇచ్చిన పన్నాస — ఉరుటూరు శాస.

ఇట్టివి పెక్కు ప్రయోగములున్నవి.

కొఱవి శాసనమునఁ బ్రత్యక్ష వాక్య ప్రయోగమున్నది. (Direct speech).
కుసుమాయుధు పెద్ద కొడుకు పెద్దన రావించి :"నీవు నాప్రాణ సమానుఁడవైన చెలివి." మొద.

సమాసములు·

కొన్ని శాసనములలో రాజులబిరుదావళులు దీర్ఘ సంస్కృత సమాస ఘటితములై యున్నవి. (బికిరాజు శాస. S I I X 594). చోడమహారాజు సూర్యగ్రహణకాల శాస. నెం. 595. భీమేశ్వరాలయ శాస. పుల్లగణ్ణి వారిపల్లి శాస. యుద్ధమల్లుని బెజవాడ శాస.) అక్కడక్కడ రెండు మూఁడు పదములతోఁ గూడిన తెలుఁగు సమాసములుకూడ నున్నవి.

మాఱుణ్ణ పిడుకు (గు) తిప్పలూరు. Thunderbolt to hostile kings
మాఱురా పిడుగు బూదిద గడ్డపల్లి శాస.
వేవాణ్ణూ ఱు మాలెపాడు.
ముయ్యలిపట్టు రెండవ అమ్మరాజు వేములూర్పాడు శాస
కలవెలగుల (కల్వెలగుల) పెద్ద చిన్త (Big tamarind tree adjoining the stone fencing )
గొరగపల్లము; కట్టుమ్బొడెలు రెండవ తాళుని సిరిపుర తామ్ర శాస
పొలయణ్ణ పేదరియాకు జిన్త.

వాలుగైదుచోట్ల శుద్ధ సంస్కృతముతోఁ దెలుఁగు పదములు కలిసిన వైరి సమాసములు కనఁబడుచున్నవి

| | |
|---|---|
| త్రిపవణసింగంబు | (త్రిభువన సింహము) చెయ్యేటి యొద్దున పాంటూరు. |
| అరివర జమున్ను | బూదద గద్దపల్లి. |
| సాసన బిదిగల్లు | కొసినేవల్లి S I I X 598. |
| అపిమన గొరవలు | బికిరాజు శాస నెం. 594. అభిమాన గొరవలు. |
| అతిశయరట్ట గుళ్ల | విక్ర చో. చిలంకూరు శాస. |
| త్రికోణ మడువు | No C P 13. |
| విడుంగట్ట తటాకః | రెండవ జయసింహుని పెణుకపఱ్ఱు శాస. |
| స్థాపిత శిలాగుణ్ఱ సీమ | అమ్మరాజు నమ్మూరుదాన శాస. |

మణిప్రవాళ చిహ్నములు·

కొన్ని శాసనములలో సుబాద్యంతములైన సంస్కృత పదములు కూడ వాడఁబడియున్నవి. శాసనమునఁ గొంత భాగము తెలుఁగున వ్రాయఁబడిన పిమ్మట నొండు రెండు సంస్కృత శ్లోకము లుండుటయో, శాసనమంతయు సంస్కృతమున వ్రాయఁబడిన పిమ్మట సీమావధులను జెప్పునప్పుడు తెలుఁగు పదములను వాడుటయో యచ్చటచ్చటఁ గానఁబడును. ఇందు వైపరీత్యమేదియును లేదు. కాని తెలుఁగు వాక్యములలోనే సుబాద్యంతములైన సంస్కృత పదములను డు జాది విభక్త్యంతములైన తెలుఁగు పదములను గలపి వ్రాయుట వింత పద్ధతి. ఇట్టి శైలికే మణిప్రవాళశైలి యని పేరు ఈ శైలి దేశమున నొకప్పు డుండెనని యూహించుట కవకాశము లున్నవి. పాల్కురికి సోమనాథుఁడు వృషాధిప శతకమున మణి ప్రవాళ శైలిలో నొకపద్యమును వ్రాయుట యిందుకుఁ దార్కాణము; చాళుక్య యుగమునందలి తొలి శతాబ్దులలోని శాసనములలో నిట్టిశైలి యక్కడక్కడఁ గనఁబడుచుండుట యది యా రోజులలో నుండెనేమో యను సందేహమును బలపఱుచు చున్నది. పశ్చిమతోఽవధిః ఓం గోడు మణ్ణి శిగదేబుపళకు పోవువన్థాః — రెండవ జయసింహుని పెణుక పఱ్ఱు శాస. వాచ్ఛొతాళ కొడుకు పల్లవాచార్యస్య లికితం—నలజానంపాడు. అపివైరువు లిఖితమ్. ఇందుకూరు శాస.

ఉత్తరబు కట్టు కౌణ్డిల్య గోత్రస్య పెన్బాల రేవశర్మాణ పుత్రస్య అగ్గి శర్మాకి కిచ్చిన దతి చామలూరు శాస. శ్రీ విష్ణువర్ధన మహారాజుల ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరంబుళ్ పదియేడగునేణ్ట విక్రమాదిత్య, తనయ శ్రీ విష్ణు వర్ధన ప్రసాదాచట్టపాఖ్యేన యిన్ద్రకీల ప్రతిష్ఠితః పాత్రీశ్వరః – ఇంద్రకీల పర్వత చాళుక్య శాస. 909.

కొన్ని శాసనములం దెల్లలు తెలుఁగునఁ జెప్పఁబడినను దిక్కుల పేర్లు సంస్కృతమునవనే వ్రాయఁబడియున్నవి. పూర్వస్యాందిశ త్రికోణ మడువు పీమా పొట్టేరి వెలువున కోటలువు. దక్షిణతః మగ్గాణ్డు – ఉత్తరతః మున్నట్టున గట్టు గట దూర్పునకట్టు. (శ) లిడ్ది పుట్టరాట వెలుంగ గుంజ చింతలు No C P 13 (709 A D ).
ఈ పద్ధతి కూడ నప్పుడు సంస్కృత సుబాద్యంతములను దెలుఁగు పదములను గలిపి మణి ప్రవాళశైలి వాడు పద్ధతి కొంత యుండినట్లు వ్యక్తము చేయు చున్నది.

ఈ విధముగాఁ జాళుక్య యుగమునందలి శాసనములలోని భాషను బరి శీలించి చూడఁగా మొదట స్థిరత్వము లేక యా యా ప్రాంతములందలి వారుక లోని వైవిధ్యమును బట్టి భిన్న రూపములతో నుండిన శబ్దములే క్రమముగా 11వ శతాబ్ది నాఁటికి స్థిరరూపములను బొంద నారంభించిన వనియు నిప్పటి తెలుఁగును బట్టి చూచినచోఁ జాలవింతగాఁ గనఁబడుచు దురవగాహములుగా దోఁచు పదములు పెక్కు నన్నయనాఁటికిఁ బూర్వ గ్రంథముల ద్వారా మనకుఁ బరిచితములగు రూపములను బొందినవనియు, మొదటఁ బ్రాకృత పద బహుళ మైన భాష క్రమముగా సంస్కృత పదములను జేర్చుకొని నన్నయ భారతము నందలి భాషకు సన్నిహితమైన స్థితిని బడసినదనియుఁ దెలియ వచ్చుచున్నది కొఱవి శాసనమునందలి వచన శైలియు, కామసాని గూడూరు శాసనమునందలి పద్య శైలియు నన్నయ భారతము నందలి గద్య పద్యముల శైలితోఁ దులతూగు చున్న వనుటలో నతిశయోక్తి లేదు. తన నాఁటి కీ విధముగాఁ బరిణత రూప మగుచున్న భాషను బరిశీలించి యందింకను విల్చియున్న కొన్ని వికృతులను వైకల్యములను దొలఁగించుటచే దానికి మహాకావ్యోచితమును సమగ్రసుందరము నైన రూపమును దీర్చి దిద్ది నన్నయ భారతాంధ్రీకరణోద్యమమునకుఁ బూనుకొనెను.

---

# 4. నన్నయకుఁ బూర్వము ఛందస్సు

మనకిప్పుడు లభ్యములైనను గాకపోయినను జాళుక్య యుగమున దేశి మార్గమునకుఁ జెందినవియు, మార్గ పద్ధతికిఁ జెందినవియు నగు కొన్ని రచన లుండెనని యూహించి యుంటిమి. అందు క్రీ శ. 10వ శతాబ్దికిఁ బూర్వము లభించిన దంతయు దేశిరచనయే. ఇందుకు అద్దంకి, కందుకూరు, బెజవాడ అనుచోట్ల వేయఁబడిన శాసనములే తార్కాణము. ఇందు వ్రాయఁ బడినవన్నియుఁ బద్యములే యైనను ఆ కాలమునఁ బాల్కురికి సోమనాథుఁడు పేర్కొనియుండిన పద వాఙ్మయముకూడఁ గొంత యుండెనని భావింప వచ్చును. క్రీ. శ. 10వ శతాబ్దికిఁ బిమ్మట రచితములైనట్లు కొందఱు చెప్పు జైనకవుల కావ్యములును, విరియాల కామసాని గూడూరుశాసనమును మార్గ పద్ధతినే యవలంబించినట్లు తెలియుచున్నది. అంతకుఁ బూర్వమునుండియు వచ్చుచున్న పదవాఙ్మయ మప్పుడుకూడ సాగుచునే యుండెనని తలంప వచ్చును. దీనినిబట్టి చాళుక్య యుగమున క్రీ శ. 10వ శతాబ్దికిఁ బూర్వము కేవల దేశి కవిత్వమును దరువాత దేశిమార్గకవిత్వములు రెండును వ్రాయఁ బడుచుండెనని తెలియుచున్నది. ఆ కవిత్వములందలి ఛందోవిషయముల నింకఁ బరిశీలింతము

పద్యములు వృత్తములు, జాతులు అని రెండు విధములు. వృత్తము లక్షర గణములతోఁ గూడినవి; సంస్కృతమునుండి గ్రహింపఁ బడినట్టివి. జాతులు సాంస్కృతికములనియు దేశ్యములనియు రెండు రకములు. సంస్కృత జాతులు మాత్రాసంఖ్యా నియమముగల నాలుగు పాదములతోఁ గూడియుండును. దేశ్యజాతులు మాత్రాగణ బద్ధములైన పాదములతోఁ గూడియుండును. సంస్కృత వృత్తముల ననుసరించి తరువాత వీనికిఁ బాద సంఖ్యా నియమ మేర్పడినను మొదట నట్టి నియమ మేమియు లేనట్లే తోఁచుచున్నది. దేశ్య జాతులు, జాతులు, ఉప జాతులు అని మరల రెండువిధములు. జాతులలో వృత్తము లందువలె యతి ప్రాస నియమములు రెండును గాన నగును. ఉపజాతులలో యతి యొక్కటే యుండును. ఒకప్పు

డింది యతికి బదులు ప్రాసయతి నిల్పవచ్చును. అనఁగా నిందుఁ బ్రాస మున్నచోఁ బాద ద్వితీయాక్షరముగాఁ గాక యతి భేదముగా మాత్రము కానవచ్చును. జాతులలోఁ బ్రథమ పాదము మొదట గురులఘువులలో నేది యుండునో మిగిలిన మూఁడు పాదముల యారంభములఁ గూడ నదే యుండ వలయును. గురులఘువులు సమముగా నున్నచో గణములు మాఱినను దోషములేదు. ఒకపాదము మొదట స గణ మున్నచో రెండవ పాదముమొదట నల ముండవచ్చును. ఉపజాతులలో నాల్గుపాదములందుఁ బ్రథమాక్షరములు యథాసంభవముగా మార్పు చెందవచ్చును ఈ విషయమునే యప్పకవి యిట్లు చెప్పియున్నాఁడు.

జాతులు కందాదిక ముప
జాతులు గీతాదికములు సరసిజనయనా!
గురులఘువులలో నెయ్యది
మురసంహర ప్రథమ పాదముఖమున నిలిచెన్
ధర నుపజాతుల దక్కఁగఁ
బరఁగ నిలుచు నదియె నాల్గు పదముల మొదలన్.

ధరణిన్ జాతుల కాదివర్ణ మొకఁడే తప్పంగ రా దెల్లడన్
హరి! తజ్జాతిగణంబు లెన్న సరి యి ట్టట్లైనఁ గా వచ్చు మం
దరధారీ యుపజాతులం బ్రథమవర్ణంబున్ యథేచ్ఛంబుగా
నొరిదిం జెప్పఁగవచ్చుఁ బ్రాసములు నిల్పన్ వర్ల కై యొక్కచోన్

ఛందో విషయమున ద్రావిడ భాషలలో సంస్కృతమున లేని యొక విశేషమున్నది. సంస్కృతమున శ్లోకము వ్రాయవలెనన్న గణములొక్కటి కుదిరినఁ జాలును. యతియున్నది కాని యది విశ్రాంతి రూపమైనది అనఁగా నందు యతి స్థానమునఁ బదము విఱిగినఁ జాలును పాదాద్యక్షరముకాని తన్మిత్రమగు నింకొకయక్షరముకాని పునరా వృత్తము కావలె నను నియమ మందులేదు. ద్రావిడభాషలలో వృత్తములందును జాతు లందును బ్రాసనియమమున్నది. అనఁగా నాలుగుపాదములందలి ద్వితీయాక్షర ములును సమానములై యుండవలెను తెలుఁగున నుపజాతులుగాఁ బరిగ ణింపఁబడు సీస గీతములందు మాత్ర మీ పాసనియమము లేదు వీనిలో

యతికి బదులుగాఁ బ్రాసయతి వాడవచ్చును కన్నడమున గీతికెయందుఁ గూడఁ బ్రాసనియమ మున్నది కాని యందు వృత్తములలోఁ గాని జాతులలోఁ గాని యతినియమ నిర్బంధములేదు అరవమున యతి కొన్నిట నియత మైనను గొన్నింట నైచ్ఛికముగా మాత్రమే పాటింపఁబడును. మొత్తము మీఁద నీ ప్రావళ్లను నవి సంస్కృత ప్రాకృత సంప్రదాయ సిద్ధములు కావనియు దేశీయ సంప్రదాయ సిద్ధములై కొన్ని దేశ భాషలలో నియతముగను, గొన్నిటిలో నైచ్ఛికముగను ఏక దేశముగను బాటింపఁ బడిన వనియుఁ జెప్పవచ్చును. తెలుఁగు పద్యరచనమున సంస్కృత ములోఁ గాని కన్నడములోఁ గాని లేని వడినియమ మొకటి విశేషముగాఁ గావవచ్చుచున్నది కన్నడ కవులు సంస్కృత వృత్తములలో నుండు విచ్ఛేద రూపయతిని గూడఁ బరిహరించి యుండఁగాఁ దెలుఁగు వారు దేశీయ సంప్రదాయ సిద్ధమైన ప్రాసము తోపాటు పాదాద్యక్షరమో తన్మిత్రాక్షరమో యతి స్థానమునఁ బునరావృత్తము కావలె ననువడి నియమమును గూడఁ బ్రవేశ పెట్టి వారు. కన్నడాంధ్రములకు సమానములైన యక్కరలలోఁ గూడఁ గన్నడ కవు లీ యతిని బాటించి యుండలేదు దీనినిబట్టి యా రెండు దేశభాషలందు నైతము చిరకాలమునుండి దేశీయ కవితారచన కొన్నివిషయములలో భిన్న మార్గముల ననుసరించుచుండెనని తెలియుచున్నది ఇట్టి భేదము లెదనెద గోచ రించినను బ్రావళ్లను నవి ద్రావిడ భాషలకుఁ బ్రత్యేకములైన వని చెప్పవచ్చును ఈ భాషలందలి కవులు సంస్కృతమునందలి వృత్తముల నెరవు తీసికొన్నపుడు వానియందుఁ దమ ఛందమునకు సహజమైన యతి ప్రాసలను గల్పించుకొనియే యున్నారు. సింహాసన ద్వాత్రింశికలో కొఱవి గోపరాజొక పాంచాలిక భోజునికిఁ జెప్పిన కథలో నీ విశేషమును గూర్చి ప్రస్తావించియున్నాఁడు. అతని పురోహితుని కుమారుఁడు పితృనిందితుఁడై దేశాంతరమున కేగి విద్యలు నేర్చివచ్చి రాజుతో

సంస్కృతాదిభాషలు నేర్చి
కవిత యెఱిఁగి యెల్ల కడలఁ దిరిగి
తెలిసినాఁడ నిచటఁ గల లక్షణముకంటె
మాతనంబు లేదు భూతలేంద్ర. ४-187

వ॥ అట్టి విధం బయ్యును సంధ్రమండలంబునం గౌణదేశంబునం దెలుంగు కవితకుఁ బ్రాలు వళ్లు నను నియమంబులు చూచినాఁడ. అవి యెయ్యెడం దఱుచు కాకుంట నపూర్వం బవధరింపుము. ౪. 83

పుణ్యస్త్రీకి గుణంబు మంగళ గుణంబు న్సొమ్ములై యొప్పఁగాఁ
బణ్యస్త్రీకి సువర్ణ మౌక్తిక సురూప వ్యక్తి భూషాకృతుల్
గణ్యం బౌ గతి సంస్కృతంబునకు వాగ్భావంబు శబ్దంబు లా
వర్ణ్యాకారములౌఁ, దెలుంగునకుఁ బ్రాల్వళ్లుం గడున్ వన్నియల్ 190

పలుదెలుంగు లైన పలుకులు గలిగియుఁ
బ్రాలు వళ్లు లేని బేలకవిత
వన్నెలెల్లఁ గూర్చి వ్రాయుచోఁ గాటుక
వన్నె లేని ప్రతిమవ్రాఁతఁ బోలు.

తప్పక వళ్లను బ్రాలను
ముప్పిరి గొనఁ దగిన శబ్దములు మెఱఁ గెక్కం
జెప్పిన కవితాచాతురి
యొప్పము వెట్టిన పసిండి యొఱపున మెఱయున్." 192

అని చెప్పియుండెను. ప్రావళ్లవలనఁ దెలుఁగు కవితకొక వన్నె చేకూరిన దనుటలో సందేహములేదు.

సంస్కృతమున జాతులలో మాత్రల సంఖ్యతోడనే పాదము లేర్పడును అనఁగాఁ బాదమున కిన్ని మాత్ర లుండవలెనని లక్షణము చెప్పఁబడును తెలుఁగు జాతులలో మాత్రా గణములతోఁ బాదము లేర్పడును. అనఁగా బాదమున కిన్ని యింద్రగణములు, ఇన్ని సూర్యగణములు అని లక్షణము చెప్పఁబడును ఇంద్ర చంద్ర సూర్యగణములు మాత్రా ఘటితములే యైనను వీనియందలి గణము లన్నియు సమాన మాత్రా సంఖ్య గలిగి యుండవు. సూర్యగణములైన గలవ గణములు రెంటను మాత్రము మాత్రలు సమానమే. ఉదాహరణమున కొక తేటగీతి పాదము తీసికొందము. ఇందు ప్రతి పాదమునందుఁ గ్రమముగా నొక సూర్యగణము, రెం డింద్ర గణములు, రెండు సూర్యగణములు నుండవలయును మాత్రల సంఖ్యనుబట్టి చూచినచో నిందు పదునేడు కాని పదునెనిమిది కాని పందొమ్మిది కాని మాత్ర లుండవచ్చును. ఇట్లే సీస పద్యమునఁ బాదమునకు

ముప్పది మొదలు ముప్పదియాఱు మాత్రలవఱకు నుండుట కవకాశమున్నది ఇం దిన్ని మాత్ర లుండవలెనని నిశ్చితముగా సంఖ్య చెప్పుటకు వీలులేదు. ఒక వేళ అట్లు చెప్పినచో బహువిధములుగా నుండు సీసములలో నొక్క విధము నకు మాత్రము లక్షణము చెప్పిన ట్లగును ఇందు కింద్ర గణములన్నియు సమాన మాత్రాకములు గాకుండుటయే కారణము ఈ విధముగా సంస్కృత జాతులును దెలుఁగు జాతులును మాత్రా ఘటితములే యైనను వాని లక్షణము చెప్పుటలో మాత్రము కొంత భేదము గోచరించును సంస్కృత జాతిపాదములు మాత్రా సంఖ్యా నిబద్ధములు, దేశ్య జాతిపాదములు మాత్రా గణ నిబద్ధములు

మొట్టమొదట దేశభాషలలోని ఛందోరచనలకు లక్షణము నిబంధించిన వారు సంస్కృత భాషాపండితులే. వారి దృష్టిలో సంస్కృత ప్రాకృతములే ప్రధానము లగుటచేతను, అందలి ఛందోరీతులే వారికి సుపరిచితము లగుటచేతను వారు వృత్తాదులను గూర్చి ముందు చెప్పి మాత్రా నిబద్ధములైన పద్యములను గూర్చి తరువాతఁ జెప్పినారు మాత్రా సంఖ్యను నిర్దేశించుట సంస్కృత పద్ధతి. మాత్రా గణములను నిర్దేశించుట దేశీయపద్ధతి. మాత్రా సంఖ్యా బద్ధములగు కొన్నిటిని మాత్రా గణనిబద్ధములుగాఁ గూడఁ జెప్పుట కవకాశమున్నది. ఉదాహరణమున కుత్సాహమును దీసికొందము. ఇందు పాదమునకేడు సూర్య గణములపై నొక గురువుండవలెను దీనినే మాత్రా సంఖ్యగా మార్చి త్రిమాత్రాకములైన యేడు గణములను బై నొక గురువును గూడిన ఉత్సాహపాద మేర్పడునని చెప్పవచ్చును. ఇట్లు చెప్పుటవలన నొక చిక్కేర్పడు చున్నది. సూర్యగణములైన గల న గణములు రెండును త్రిమాత్రాక గణములేకాని మూఁడు మాత్రల గణములన్నియు సూర్యగణములు కావు మూఁడు మాత్రల గణమన్నప్పుడు గల, నగణములతోపాటు లగమును గూడ వాడవచ్చును. కాని యది లక్షణమునకు విరుద్ధము. పైఁగా నట్లు చెప్పుటవలన దేశీయగణముల దేశీయత రూపు మాయుటయు, సంస్కృత లక్షణమునకు సంకుచితత్వ మేర్పడుటయు సంభవించును సీస పాదమునకు దేశీయ పద్ధతిని ఆఱింద్ర గణములు రెండు సూర్యగణములు నుండవలెనని చెప్పుదురు. ఇంద్ర గణములలోఁ గొన్ని (భ, నల) చతుర్మాత్రాకములును, గొన్ని పంచమాత్రాకములును నై యుండుటచే పై లక్షణమునుబట్టి యొక్కప్పుడన్నియుఁ జతుర్మాత్రా గణములే రావచ్చును. ఒకప్పుడన్నియుఁ బంచమాత్రా గణములే యై యుండవచ్చును. ఒకప్పుడవియు

వివియుఁగలసి రావచ్చును. వీనినే మాత్రా సంఖ్యతోఁ జెప్పినచో నాలు చతు ర్మాత్రా గణములో పంచమాత్రా గణములో అని చెప్పవలెను అప్పుడు లక్షణము సంకుచితమై పోవుటయు నొకప్పు డవ్యాప్తి దోషమునకు గుఱియగుటయు సంభవించును ఇట్లే రగడల విషయము కూడ నుదాహరింపవచ్చును. "నాలుగు మాత్రలు నాటిన గణములు వాలు"గని అప్పకవి చెప్పఁగా వసంతుఁడు "అవి గగ, వల, భ స లను నాల్గిటిఁగృతి" అని నిర్దేశించినాఁడు (అనం. ఛం ఆశ్వా. 3. 57) స్థూలముగాఁ జూచినచో నీ రెండులక్షణములు నొకటే యనిపించును. కాని సూక్ష్మముగాఁ బరికింపఁ గొంతభేదము లేకపోలేదు. నాలుగు మాత్రలగణములని చెప్పినప్పుడు గగ భ, స, వల ములతో జ గణమును గూడ వాడవచ్చు నను నర్థము కల్గును ఇట్లు దేశీయములైన పద్యములకు లాక్షణికులు మాత్రాసంఖ్యా నియమముతోనో అక్షరగణ నియమముతోనో సాధ్యమైనంత వఱకు లక్షణము నిర్దేశించి కొన్నిటిని దాళబద్ధములని చెప్పి, యింకను గుదురని వానిని విడిచి వేసినారు అందుచే నాప్రకారముగాఁ జూచినచోఁ గొన్నిటికి లక్షణము సరిపోదు దేశీయ పద్ధతిని జూచినచో సరిపోవచ్చును అందుచే దేశీయములైన తమిళ కన్నడ చ్ఛందోరీతులనుగూడ దృష్టియం దిడుకొని యట్టివానికి లక్షణము నిర్దేశింప వలయును. [1]

గురులఘు స్వరూపముననే కాక గణప్రస్తార పర్గీకరణాది విషయము లన్నిటఁగూడ దక్షిణ దేశభాషలలోని ఛందోరీతికిని సంస్కృత చ్ఛందోరీతికిని గొంత యంతరము కానవచ్చును ఇటీవలి కాలమున దేశీయ భాషాచ్ఛందో లక్షణముల నేర్పఱిచిన పండితులు వానిని సంస్కృత చ్ఛందోరీతుల కను

---

1. 'సంస్కృత ప్రాకృతచ్ఛందో రచనలలోని యక్షరగణవృత్త మాత్రా వృత్తాదుల లక్షణమును బరిశీలించి దేశీయజాతులకు మాత్రాగణ ప్రస్తారము మూలముగా లక్షణ మేర్పఱిచిన మన లాక్షణికుల పద్ధతికి దేశీయ రచనలన్నియు లొంగకపోవుట తమిళచ్ఛందఃఫక్కి దీనినిబోలి యున్నను ఇంతకంటె విపులమైనదిగా కనఁబడుచుండుట ఈ మొదలగు వానికి కారణ మేమియని విచారించినచో నందలి గురు లఘు సంకేత ములలోనే కొంత భేదమేర్పడి యున్నట్లు గోచరింపక పోదు

కో. రా. దేశి. పుట 197.

గుణముగా సంస్కరించి యుండుటచే నవి కొన్నివిషయములలో నసమగ్రము లగుట సంభవించినది మఱియుఁ బ్రాకృత చ్ఛందస్సునందలి మాత్రాఘటితము లైన జాతులలోఁ బెక్కు దేశీయములే యై యుండునని తోఁచుచున్నది. వానికి లక్షణము నేర్పఱుచునప్పుడు లాక్షణికులు దేశీయ మాత్రాగణపద్ధతిని వాని కన్వయింపఁ జాలక కేవల మాత్రాసంఖ్యా పద్ధతినే యవలంబించి యాలక్షణమునకు సంకుచితత్వము నాపాదించిరి. ఇట్లు సంస్కృత ప్రాకృత లాక్షణికులచే మాత్రాచ్ఛందములుగా గ్రహింపఁబడిన దేశీయ సంప్రదాయసిద్ధములగు గేయ రచనలలో శీర్షకమనున దొకటి. ఇది తమిళమునందలి నేర్, నిరై లను నక్షరముల ప్రస్తారమువలన నేర్పడిన యీరశైచ్చీర్లను గణములతోఁ గూడియుండు దాక్షిణాత్య రచనా విశేషమైన సీసమునకుఁ బూర్వరూపము భరతుఁడు శీర్షకమను పేర నొప్పు నొకగేయ విశేషమును నాట్య శాస్త్రమునఁ బేర్కొని, దానికి మాత్రల సంఖ్యతోను, అక్షరముల సంఖ్యతోను లక్షణమును జెప్పియుండుటచే నది దేశీయరచనమే యనియు నతని నాఁటికిఁ గూడఁ బ్రచార మొందియుండెననియుఁ దెలియుచున్నది శీర్షితమను తాళభేదముతోఁ గూడి యుండుటచే దాని కతఁడు శీర్షకమను పేరు పెట్టియుండఁ దరువాత నది తెలుఁగున సీసమైనదని తోఁచుచున్నది భరతుఁడు చెప్పిన శీర్షక లక్షణము కొంచె మించుమించుగాఁ దెలుఁగునందలి యొక విధమైన సీసపద్యము లక్షణముతో సరిపోవుచున్నది. అందొక్కొక్క పాదమునకు నాలుగేసి గణములతో గూడిన రెండేసి దళము లుండుననియు,[1] నాగణములు నాలుగు మాత్రలతోఁ గూడియుండుననియుఁ, బాదమునకు ముప్పది మాత్రలును, ఇరువదియొకటికిని ఇరువది యాఱింటికిని నడుమ సంఖ్యగల యక్షరములును ఉండుననియు నతఁడు చెప్పియున్నాఁడు. ఇంద్రగణములలో భ, నలములు చతుర్మాత్రాకము లైనవే. కాని సీసమునకుఁ జివరనుండు రెండు సూర్యగణములును ద్రిమాత్రాకములు

1. చతుర్మాత్రాగణో జ్ఞేయః పూర్వచ్ఛందో వికల్పకః
అర్ధాష్టమ గణాః పాదాః శీర్షకస్య భవంతి హి
త్రింశన్మాత్రా శ్చ విజ్ఞేయా యుగ్మౌ జాతురశ్రైః పదైః
శీర్షకే హ్యేకవింశత్యా షడ్వింశతి పర స్తథా
అక్షరాణాం భవే త్పిండః పాదే హ్యేకత్ర నిర్దిశః

భరతనాట్య 32 అధ్యా. 250-252.

మాత్రమే. అందుచే, శీర్షకపీస లక్షణములకుఁ గొంత భేదము కనవచ్చు చున్నది. కాని కన్నడమునందలి బ్రహ్మగణములలో నాలుగు మాత్రలతోఁ గూడిన స గగ గణములున్నవి. ఇట్లే తమిళమున రెండు నేర్లతోఁ గూడిన గణములలోఁ గూడ నాలుగు మాత్రలు గల గగమున్నది. వీనిలో నే రెండైన పీసమునకుఁ జివర నుండు వనుకొన్నచో లక్షణము సరిపోవును సీసపాద మున నింద్రగణములన్నియుఁ జతుర్మాత్రాకములే గ్రహింపఁబడుచో ముప్పది మాత్రలే యుండును ఇతరములైన యింద్రగణములను గ్రహించినచో నవి ముప్పదియాఱింటి వఱకుఁ బెరుఁగును. ఇట్లే యక్షరముల విషయమున పైతము కొంత వ్యత్యాసము కనఁబడుచున్నది. తెలుఁగు పీసమున నిరువదిరెండక్షరముల కంటెఁ దక్కువయుండుట కవకాశములేదు. భరతుఁ డిరువదియొక్కటి మొద లిరువదియాఱు వఱకు శీర్షకమున నక్షరము లుండవచ్చునని చెప్పెను కాని యీ శీర్షకము దేశియ గేయ విశేషమగుటచే నిందు పాట కనుగుణముగా నొండు రెం డక్షరములను తగ్గించుటకో హెచ్చించుటకో యవకాశమున్న కతమున నీ భేద మేర్పడి యుండవచ్చును దీనిని బట్టి ప్రాచీనదేశీయ గేయ రచన లనేకములు సంస్కృతప్రాకృత లాక్షణికులచే మాత్రాచ్ఛందములుగాఁ బరిగణింపఁబడినట్లును, వారు వానికిఁ దద్భాషాచ్ఛందోరీతుల కనుగుణముగా లక్షణము చెప్పినట్లును దెలియుచున్నది.

ఇట్లే దేశభాషా కవులు సంస్కృతచ్ఛందముల నుండి గ్రహించిన సంప్రదాయములను లెక్కగలవు మన భాషలలోఁ గననగు వృత్తములన్నియు సంస్కృతచ్ఛందమునుండి గ్రహింపఁబడినవే. మఱియుఁ దొలుత దేశీయ పద్యములందుఁగాని పాటలందుఁగాని పాదనియమ మున్నట్లు తోఁపదు. విషయ విస్తృతినిబట్టి పాదసంఖ్యయుఁ బెరుఁగుచుండెను. "తెలుఁగు కవిత యేకపదమై ద్విపదమై, త్రి పదమై, చతుష్పదమై పరిణతి చెందినట్లు కానవచ్చుచున్నది ఏక పదములగు పాటలును, ద్విపదములగు ప్రబంధములును, త్రి పదాది సంయుక్తములై సంపూర్ణ గాన యోగ్యములగు యక్షగానములును, సలక్షణ చతుష్పాద వృత్తకవితా సమన్వితములగు భారతాది గ్రంథములును, వాఙ్మయ పీఠిని ప్రథమ ద్వితీయ తృతీయ చతుర్థ ఘట్టము"లని శ్రీ నిడుదవోలు వేంకట రావుగా రుదాహరణ వాఙ్మయ చరిత్రమున (పుట 3) తెల్పిన విషయ మిందుకు నిదర్శనము. సంస్కృతమున వృత్తములన్నియుఁ జతుష్పాదములే యగుటచే

వానిని జూచి దేశభాషా కవులు గూడ దేశీయ పద్యములను నాల్గు పాదములు గల వానినిగా వ్రాయఁజొచ్చిరి. మధ్యాక్కర, తరువోజ మొదలగు పద్యములు చతుష్పాదములుగా స్థిరపడుట కీ సంస్కృత ప్రభావమే కారణము.

కొందఱు పండిత కవులు దేశీయచ్ఛందములతో సుపరిచయము కలవారగుటచే సంస్కృత భాషలోనే కవిత్వము చెప్పినను అందు దేశీయచ్ఛందములను దేశీయ సంప్రదాయములను ప్రవేశ పెట్టియుండిరి క్రీ. శ. 9వ శతాబ్ది వాఁడైన సోమదేవ సూరి యశస్తిలకచంపువునఁ గొన్ని రగడలు కలవు అందుఁ గల

వికచ కర్ణోత్పలస్పర్ధి తరళేక్షణాః
కేళి తాళక్వణ త్కనక మయకంకణాః

ఇత్యాదియగు రగడ తెలుఁగు నందలి ద్విరదగతి రగడకు సరిపోవుచున్నది. కేవల సాంస్కృతికుఁ డగు యశస్తిలక చంపూవ్యాఖ్యాత దేశీయ ఛందో విశేషమైన యీ రగడ వైలక్షణ్యమును గమనింపలేక పోయెను. అందది పాదభేద విరహితమై వచన ప్రాయముగా వ్రాయఁ బడియుండుటచే నాతఁడు దానిని గద్యముగానే భావించియుండును. సంస్కృతమున రగడకుఁ బ్రచారములేదు ఇది దాక్షిణాత్య సంస్కృత కవులచే మాత్రము వాడఁబడియుండుటచే దక్షిణదేశీయ వాఙ్మయమునకే సహజమైనదని భావింపవచ్చును. క్రీ. శ. 1022వ సంవత్సరమున రాజరాజు పట్టాభిషేకా నంతరము వేతనభట్టు వ్రాసిన కోరుమిల్లి శాసనములో సంస్కృత శ్లోకములును గొంత గద్యభాగమును నైన పిమ్మట నొక రగడ కానవచ్చుచున్నది. ఇందుఁ గల 28 పాదములలో మొదటి ఇరువది నాలుగు పాదములందును నంత్యానుప్రాస మున్నది. మొదటి నాలుగు తుది నాలుగు పాదములలో నాదిప్రాస నియమము పాటింపఁబడలేదు. మిగిలినవానిలో నా నియమము గోచరించుచున్నది. 16వ పాదమున తత్ర యను పదమున కర్థమేమియు లేకపోవుట యటుండ యతి కూడఁ దప్పిపోవుచున్నది. మఱియు 15వ పాదము సకల అను పదముచే నారంభించుటచేఁ బ్రాస పూర్వాక్షరము లఘువుగా నున్నది. 16వ పాదము మొదట తత్ర యని యున్నచోఁ బ్రాస చెడుటయే కాక ప్రాస పూర్వాక్షరము గురువగుట కూడ సంభవించుచున్నది. ఇట్లీరగడలో నాద్యంతములందలి రెండు పాదముల జంటలలో నాది ప్రాసనియమము పాటింపఁబడక పోయినను బ్రాస పూర్వాక్షర

నియమోల్లంఘన మెచ్చటను లేదు. అందుచే తత్ర యనుచోట ప్రకటయని కవి వ్రాసియుండునేమో యని నే నూహించుచున్నాను. పై కారణములు తప్ప నిట్లూహించుటకు మఱే యాధారములును లేవు. పై యూహ సరియైనది కానిచో 15, 16 పాదములతోఁ గూడిన జంటలోఁగూడ నాది ప్రాసనియమము పాటింపఁబడలేదని చెప్పవలయును. 2 5, 8, 10 12 14, 15, 16, 17, 18 23, 24 25, 26, 28 పాదములలో సవర్ణాక్షర పునరావృత్తి రూపమైన యతి కానవచ్చుటలేదు. 10, 12, 14, 15, 16, 17 23, 24, 28 పాదములలో సంస్కృత కవులు పాటించు విచ్ఛేద రూపమైన యతికూడ లేదు (8 వ పాదమున నుంభిత యనుచోట జృంభిత యని యుండుట లెస్స. అప్పుడు యతికూడ సరిపడును.) 13 (హోమ—అమి) 19 (నిత్య—సత్య) 25 (ధారా—హారి) పాదములలోఁ బ్రాసయతియు 18, 26 పాదములం దఖండయతియు నున్నవి. ఇవి యాదృచ్ఛికములైనను గావచ్చును. 1, 6, 11 పాదములందలి యతి విచ్ఛేదరూపమున లేక కేవలం సవర్ణాక్షర పునరావృత్తి రూపమున నున్నది. ఈ రగడకు విజయభద్ర రగడ యని పేరు. పాదమున కైదేశి మాత్రలతో నాలుగు గణము లున్నవి. ఇట్లీ రగడలోఁ దెలుఁగు రగడ లక్షణము కొంత లోపించినను దీనిని రచించిన కవికిఁ దెనుఁగు రగడతోఁ జాల పరిచయ మున్నదని మాత్రము నిస్సందేహముగాఁ జెప్పవచ్చును. ఇది నన్నయకుఁ బూర్వము రగడలు కొన్ని వ్రాయఁబడుచుండె ననుటకుఁ దార్కాణ మగుచున్నది.

---

రగడ.

తస్మై సమస్త జనతా విశేషగుణాయ 1
రైనుతర్పిత మహీదేవదేవ గణాయ 2
విప్రాన్వయాబ్ధి శశిభృత్ప్రతి చ్ఛందాయ 3
విద్వజ్జనాధికృత విశ్రుతానందాయ 4
జన్మ ప్రభృతి గీత వేధాంత తత్వాయ 5
సన్మనోవసతి వాస్తవ్యాత్మ సత్వాయ 6
లంభితగురుత్వ పరిలాలిత సుచరిత్రాయ 7
నుంభితమతి స్థగిత జీవ భృగు పుత్రాయ 8

క్రీ. శ. 10 వ శతాబ్ది చివరఁ గన్నడమున ఛందోఽంబుధియను ఛందో గ్రంథమును రచించిన నాగవర్మ "అవఱి పొఱగె పుట్టువ మాలావృత్త దండక రఘట మాత్రార్య త్రిపది చతుష్పది షట్పది అష్టపది శంఖా (సంఖ్యా) వృత్త, తాళవృత్తా"దులు జాతు లనియు అక్కర, చౌపది, గీతికె, ఏళె, ఉత్సాహ, షట్పది మొదలగునవి దేశీయ జాతులనియుఁ జెప్పియుండెను. దేశీయజాతులనఁగా బ్రహ్మ విష్ణు రుద్రరూప మాత్రాగణ బద్ధములైన పద్యము లని యాతని యభిప్రాయమై యుండును. లేనిచో మాత్రాఘటితములేయైన రగడాది జాతులకును వీనికిని భేదమే లేకయుండును. నన్నయకుఁ బూర్వుఁడైన నాగవర్మ పేర్కొనిన యీ జాతిభేదములన్నియుఁ గన్నడమున వలెనే తెలుఁగునఁ గూడ నుండెననియే భావింప వచ్చును. కన్నడమున రగడలు

---

సిద్ధనిజనాథకృత సేవిత మనీషాయ 9
శుద్ధమతి దూషిత సమస్తజన దోషాయ 10
సంతతారాధిత నిజస్వామి పాదాయ 11
చింతిత మనస్థ సుఖదాభూత పాదాయ 12
హోమధూమ పిసర్గతామిత కలంకాయ 18
ధీమత్ప్రగీత రుచిరస్వనామాంకాయ 14
సకల మునిగణ నుతావస్తంబ సూత్రాయ 15
తత్రసంగీత శారదాంబ గోత్రాయ 16
సప్తతంతుకృత యూపస్తంభ శోభాయ 17
విప్రాశ్వరూప పదృశాత్మ తనులాభాయ 18
నిత్యజనతోచిత సునత్యగుణ యత్నాయ 19
సత్యభిలషిత కార్య సంపత్తిసక్తాయ 20
పరమ పురుషార్థ సంపాదన పటిష్ఠాయ 21
పరమేశ్వర స్మరణపాలన పరిష్ఠాయ 22
సకలార్థశాస్త్ర పరినిష్ఠిత వినోదాయ 28
సుకుమారతాధిక సరోజనిభ పాదాయ 24

కవిరాజమార్గమునకుఁ బూర్వమే (క్రీ. శ. 840) వాడఁ బడియుండె ననుటకవి యందుఁ బేర్కొనఁ బడియుండుటే తార్కాణము. నాగవర్మ లలిత మందాని లోత్సవములను మూఁడు విధములైన రగడలను జెప్పియుండెను. అతనికిఁ బూర్వుఁడైన పంపకవి లలిత మందానిల రగడలను వాడియుండెను. లలిత మందానిలోత్సవములు మూఁడును గ్రమముగాఁ దెలుఁగు నందలి మధురగతి ద్విరదగతి, తురగ వల్గనగతి రగడలకు సరిపోవును. నన్నయకాని నన్ని చోడుఁడుకాని రగడను వాడియుండలేదు. ఉపలబ్ధములైన యాంధ్రచ్ఛందో గ్రంథములలో మొదటిదైన కవిజనాశ్రయమున రగడలు పేర్కొనఁ బడలేదు. క్రీ. శ. 14వ శతాబ్దియందలి పెద్దన కావ్యాలంకారచూడామణిలోఁ జతుర్థోల్లా సమున ముక్తకాదులగు చాటు ప్రబంధములను గూర్చి చెప్పుచు రగడనుగూడఁ బేర్కొనెను.

అతఁడు

సరియౌ పది రేకులచేఁ
బరువడి నుత్సాహవృత్తపదయుగళముచే
నిరవుగ వడిప్రాసంబుల
నరుదుగ రచియింప రగడ యగుఁ దగు వృత్తిన్. శ—40

అని రగడకు లక్షణము చెప్పియుండెను. ఈ లక్షణము సమగ్రమైనది కాదు. ఇందుత్సాహ ద్వితయముతోఁ గూడిన రగడ యొక్కటే చెప్పఁ బడినది. అనంతుఁడు రగడలను గూర్చి సమగ్రముగాఁ జెప్పుచుఁ దొమ్మిది విధములగు రగడ భేదములను వివరించెను. అప్పకవి రగడలను వైతాళీయములలోఁ జేర్చి యవి యనేక విధములుగా నుండునని సూచించి, యందు నవ విధ రగడలకు మాత్రమే లక్షణము చెప్పెను. శిష్టకవులు వాడని కారణమునఁ గాఁ బోలు రగడలను కవి జనాశ్రయము పేర్కొని యుండలేదు. పెద్దన యొక్క యుత్సాహద్వితయ రూప రగడనే సూచించెను. అనంతుఁడు, అప్పకవి వానిని

ధారాగ్ర హేణా గ్రహారీకృతః కోరు 25
మిల్లినామ గ్రామ మిందూవరాగేణ 26
దత్తోమయా చంద్రతారం హితిష్టేత 27
తస్యావధివ్యక్తి రేషాచ్యతేఽద్య. 28

సమగ్రముగా వివరించిరి. దీనినిబట్టి కాలము గడచిన కొలంది వానికిఁ గ్రమ ముగాఁ బ్రచారమధిక మగుచుండె నని తెలియుచున్నది.

నాగవర్మ "గణనియమ విపర్యాసముండినను సమములైన మాత్రలు గలిగి తాళబద్ధమై యుండునది రఘటా బంధమగు"[1] నని రగడ లక్షణమును నిర్దేశించెను. దీనిని బట్టి యొక్కొక్క పాదమున మూఁడో నాలుగో యైదో మాత్రలు గల గణము లుండవలె నని తెలియుచున్నది. గణ సంఖ్యా నియమ మాతఁడు కావించినట్లు లేదు. అనంతుఁడు

ఆద్యంత ప్రాసంబులు
హృద్యంబుగ రెంట రెంట నిడి పాదములు
ద్య ద్యతులఁ గూర్పఁ దగు నన
వద్యంబగు రగడలందు వారిజనాభా 3. 52.

అని చెప్పిన లక్షణములో గణ సంఖ్య గాని యందలి మాత్రల సంఖ్యగాని కానరాదు. రెండేసి పాదముల కాద్యంత ప్రాసములును, బ్రతి పాదమునందు యతియు నుండవలె నని మాత్రము చెప్పఁబడినది. కాని తరువాతి లక్ష్యలక్షణ ములను బట్టిచూడ నొక్క హరిణగతిలోఁ దప్ప మిగిలిన యెనిమిది విధము లైన రగడలందు సమాన మాత్రలు గల నాలుగో యెనిమిదో పదునాఱో గణము లుండవలె నని తేలుచున్నది. ఒక్క హరిణ గతిలో మాత్ర మేదేసి మాత్రలు గల రెండు గణములే యుండును. ఈ పాదమును రెట్టించినచో వృషభ గతి రగడ వచ్చును. హయప్రచార రగడలోఁ బాదమునకు మూఁడు మాత్రల గణములు నాలుగుండును. దీనిని రెట్టింపుచేసిన తురగవల్గన రగడ పాదమగును. అనఁగా నిందు పాదమున కెనిమిది గణము లుండును విజయ మంగళ రగడలోఁ బాదమునకు మూఁడేసి మాత్రలు గల పదునాఱు గణము లుండును. నాలుగు పంచ మాత్రాగణములు కూడిన నొక ద్విరదగతి రగడ పాద

1. గణ నియమ విపర్యాస దొ
ళెణెవడె దొప్పెసెయె మాత్రె సమనాగి గుణా
గ్రణియ మతదిందె తాళద
గణనెగొడంబట్టె దదువె రఘటాబంధం. ఛందోంబుధి. 3—222

మగును. దీనిని రెట్టింపుచేసిన జయభద్ర రగడ పాదమగును ఇట్లే నాలుగు నాలుగు మాత్రల గణములు గల మధురగతి రగడ పాదమును రెట్టించినచో హరిగతి రగడపాద మేర్పడును. దీనిని బట్టి ఎనిమిది విధములైన రగడలలో నాలుగు గణములు గల పాదము కనిష్ఠ ప్రమాణమనియు, దానిని రెట్టింపుచేసినచో నితర రగడ భేదముల పాదము లేర్పడుననియుఁ దెలియుచున్నది.

నాగవర్మ కర్ణాట విషయజాతులని పేర్కొనిన అక్కర, త్రిపది చౌపది, ఛందోవతంస, ఏళ, గీతికె ఉత్సాహ, షట్పది మున్నగువానిలోఁ గొన్ని తెలుఁగులోఁగూడ నున్నవే నామలక్షణములందుఁ గొంతభేదమున్నను అక్కరలు కన్న డాంధ్రములకు సమానములే ఇట్లే ఉత్సాహ విషయమున కన్నడాంధ్ర లక్షణములకు భేదము లేదు. షట్పదులు తెలుఁగున శిష్టకవితలోని కెక్కలేదు కాని పాటలు మున్నగువానిలోఁ గానవచ్చుచునే యుండును. నాగవర్మ ఛందోఽంబుధిలో నొక్క శరషట్పదిని మాత్రమే చెప్పెను. కాని తరువాతివా రాఱు విధములైన షట్పదులను జెప్పియుండిరి. శరషట్పదికి నాగవర్మ చెప్పిన లక్షణములు తెలుఁగున స్త్రీలు పాడు తలుపు దగ్గఱి పాటలోఁ గనఁబడుచున్నవి. 6 విష్ణుగణములు 1 రుద్రగణము కూడినచో శరషట్పది యందలి మూఁడు పాదములతోఁ గూడిన సగమగునని నాగవర్మ చెప్పినలక్షణము అప్పకవి తెనుఁగున షట్పదిపాదమున మూఁడు ప్రాసములతోఁ గూడిన ఆ ఱింద్ర గణములు 1 చంద్రగణము నుండునని చెప్పెను [1] కన్న డాంధ్రము లందలి చివరి రుద్ర చంద్రగణములనుగూడ విష్ణ్వింద్ర గణములుగాఁ జెప్పినచో నింకఁ బై నొక్కగురువు మిగులును. అప్పుడు పాదమునకు 7 విష్ణుగణముల లేక ఇంద్రగణములును బై నొక్క గురువును వచ్చునని చెప్పినచో రెండింటను లక్షణము సరిపోవును. ఇట్లే కుసుమ షట్పదిలోఁ గూడ నేడు పంచమాత్రా గణములపై నొక గురు వుండును. ఈ పై రెండు షట్పదులందలి చివరి గురువును సంపూర్ణగణముగాఁ జేసినచో నొక్కొక్క పాదమున నెనిమిదేసి గణము లేర్పడును. పాడుటకనువుగా నుండుటకై పాదాంతముల నొండు రెం డక్షరములు చేర్చుటయో తొలఁగించుటయో పెక్కుచోట్లఁ గాననగును ఈ

1. ప్రాసముల్ ముమ్మారు వాసవు లార్గురు
పై సుధా దీధితితో నిర్మితి.

యెనిమిదిగణముల షట్పది పాదమును రెండుగా విభజించినచో నాలుగేసి గణములు గల రెండు రగడ పాదము లగును.

భోగషట్పదికి మొదటి రెండు పాదములలో నాలుగేసి సూర్యగణములును మూఁడవ పాదమున నాఱు సూర్య గణములపై నొక్క గురువును గానవచ్చును. ఇందలి మొదటి రెండు పాదములు ప్రత్యేకముగా హయ ప్రచార రగడ పాద ములతోను, గలసి తురగ వల్గన రగడ పాదముల తోడను సరిపోవు చున్నవి. మూఁడవ పాదమున కొక్క లఘువును ఇంకొక సూర్య గణమును గలపినచో నదియుఁ బై రెండు పాదములకును సమాన మగును. అప్పు డందుండి యొక్క లఘువును దొలఁగించినచో నేడు సూర్య గణములపై నొక్క గురువుతోఁ గూడిన యుత్సాహ పాద మగును. మన యిండ్లలో వృద్ధాంగనలు పాడుచుండు తులసిపాటయు, సువ్విపాటయు నీభోగ షట్పదులే.[1] పాడుట కనువుగా నించుక మార్పు చేసినచో, నీ క్రింది మంగళ హారతియు భోగ షట్పది జాతికే చెందును.

రామ, చం–, ద్రాయ, జనక, రాజ, జామ, నోహ, రాయ
మామ, కా–, భీష్ట, దాయ, మహిత, మంగ, ళం.

ఇందు రెండు పాదము లందును రెండవ గణము లం దొక లఘువును జేర్చు కొనవలయును. మొదటి పాదము నందలి తుది లఘువును దొలఁగించి రెండవ పాదమున నింకొక సూర్యగణమును గలపినచో నుత్సాహ లక్షణము సరిపోవును.

మూఁడు నాలుగు మాత్రలతోఁ గూడిన రెండు గణములు చేరిన భామినీ షట్పది యందలి యొక పాద మగును. ఇట్లు రెండు పాదములు చెప్పి మూఁడవ పాదమున సప్త మాత్రా గణములు మూఁడును బై నొక్క గురువును జేర్చిన నా షట్పదిలో నర్ధభాగ మగును. మూఁడవ పాదమునఁ దుది గణమును బూర్తి చేసినచో నిది హరిణగతి రగడకు సరిపోవును.

---

1. తులసి, ఇంట, నుంచు వార్కి
తులసి, పూజ, చేయు, వార్కి
తులసి, యందు, భక్తి, యుంచి మెలగు, వారి, నీ.
సువ్వి, సువ్వి, రామ, చంద్ర
సువ్వి, సువ్వి, కీర్తి, సాంద్ర
సువ్వి, సీ –, తమ్మ, మాకు శుభము, లి –, మ్మా

గుమ్మదేదే, గోపిదేవీ, గుమ్మదేదే, కన్నతల్లీ
గుమ్మడిని పొద, సూప గదవే, అమ్మగోపె, మ్మా

అను పాట యీ భామినీషట్పదికి దగ్గఱగానున్నది ఈ విధముగా శిష్టకవి ఒచిత గ్రంథములలోని కెక్కకపోయినను జనవ్యవహారమున బహుళముగా వినవచ్చు పాటలు పెక్కు షట్పదీ భేదములుగానో రగడభేదములుగానో కానవచ్చుచున్నవి ఇవి యన్నియు నతి ప్రాచీన కాలమునుండి దేశమున వాడుకలో నున్నట్టివే

పాల్కురికి సోమనాథుఁడు భక్తులు బసవపురాణము నేలలుపెట్టి పాడి నట్లు చెప్పియున్నాఁడు. రెండేసి పాదములకో మూఁడేసి పాదములకో యొక సారి యే దేవునిపేరో రాగక్రమమున నుచ్చరించుచుఁ జదువుట యేలలుపెట్టి చదువుట యని తోఁచుచున్నది. ఇట్టివి యక్షగానములలోఁ గొన్ని కానవచ్చు చున్నవి. కొన్ని ప్రత్యేక రచనలుకూడ నున్నవి. కందుకూరి రుద్రకవి రచించిన సుగ్రీవ విజయమున నీ యేల యున్నది.

భానువంశా మూనబుట్టి
దానవాకామీనిగొట్టి
పూనిమఖమువిర్వహింపావా - ఓ రామచంద్ర
మౌనివరులు సమ్మతింపాగాన్.
రాతినాతిజేసి పూరా
రాతిచేతి విల్లు విరిచి
భూతలేంద్రులెల్లమెచ్చాగా - ఓ రామచంద్ర
సీతనూ వివాహ మాడావా.

ఇందు పాడుట కనువుగాఁ గొన్ని యచ్చులు దీర్ఘీకరింపఁబడినవి. అందుచేఁ గొన్నిచోట్ల రెండు గురువుల గణములేర్పడుట సంభవించినది. కన్నడము నందలి బ్రహ్మగణములలోను దమిళమునందలి రెండునేర్లతో నేర్పడిన యీరశీ చ్చీర్లలోను గగముకూడ నుండుటచే దీనిని దక్షిణ దేశీయ సంప్రదాయమును బట్టి సమర్థింపవచ్చును. లేదా పై పాదములను

భానువంశమునను బుట్టి
దానవ<u>ప్రకా</u>మినివిగొట్టి
పూని, మఖము, నిర్వహింప, వా, ఓరామచంద్ర
మౌని, వరులు, సమ్మ, తింప,గా
రాతి, నాతి, జేసి, పురా
రాతి, చేతి, విల్లు, విఱిచి,
భూత, లేంద్రు, లెల్ల, మెచ్చ, గా, ఓ రామచంద్ర
సీత, నావి, వాహ, మాడ, వా.

అనురీతిగా వ్రాసి మూఁడు నాలుగు పాదముల యంతములఁ దప్ప మిగిలిన చోట్ల నన్నియుఁ ద్రిమాత్రాగణములని చెప్పవచ్చును. అప్పుడు వకా, పురా, అనుచోట్ల లగములు వచ్చుచున్నవి. ఇవి సూర్య గణములు కావు కాని తమిళమునందలి యీరశీర్చీర్లలో నున్నవి. (నేర్, నేర్) ఇట్లు మాత్రా సంఖ్యా ఘటితములైన గణములతోఁ జెప్పుట దేశీయపద్ధతి కాదు.

పై ఏలలో మూఁడు నాల్గు పాదముల చివరఁగల గురువులను తృతీయ పాదాంతము నందలి సంబోధనను విడిచినచో నాపాదములు వేఱు వేఱుగా నాలుగు సూర్యగణములతోఁ గూడిన హయప్రచారరగడ పాదము లగును, రెండేసి కలసినచో తురగ వల్గన గతి రగడ పాదమునకును సరిపోవు చున్నవి. ఇట్లే

కావరాని యడవిలోన
వానలేని మడుగునిండె
వానలేని మడుగుమీదనూ, ఏగంటిలింగా.
మానరాని అగ్ని పొడమెరా.
ఆకులేని యడవిలోన
తోకలేని మృగముపుట్టె
తోకలేని మృగము కడుపునా, ఏగంటిలింగా
ఈకలేని పక్షిపుట్టెరా

అను ఏగంటి వారి యేలకూడఁ దుఁరగవల్గన రగడకే సన్నిహితముగాఁ గనవచ్చుచున్నది. సారంగధర యక్షగానములోని యీ క్రిందిపాట

కూడ నేలయే కాని దీనికిని బైదానికిని గొంచెము భేదము కనఁబడుచున్నది. ఇందు ప్రథమ చతుర్థ పాదాంతములందు సంబోధన లగపడుచున్నవి. అవికూడఁ బాదములలోనే యిముడుచున్నవి. ఆ సంబోధన వలన ముందున్న రెండు గురువులకును ఒక్కొక్క లఘువునుజేర్చి వానినిగూడ సూర్యగణములుగాఁ జేసికొనవలయును.

పావురంబు ఎగురవేయుడీ – ఓ బాలు లార (రా)
పావురంబు ఎగురవేసీ పిలిచితే మళ్లివచ్చు (ను)
ఓడు గెల్పు రెండు చూడవలెను గాక యిపుడు మీరు
పావురంబు ఎగురవేయుడీ – ఓ బాలులార.

యతిప్రాసల నియమములను విడిచిచూచినచో నీ పాదములను తురగ వల్గన రగడ పాదములే యగును.

కిటెల్ సంపాదించిన ఛందోఽంబుధిలో అష్టపది, ఏకతాళ, త్రిపుట యనునవి కూడ రగడ భేదములుగా గ్రహింపఁబడినవి చతుర్మాత్రకములైన రెండేసి గణములతో నేడు పాదములను, నాలుగు గణములతో నెనిమిదవ పాదమును, జెప్పి యెనిమిది పాదములందును బ్రాసనియమమును బాటించినచో నది యష్టపది యగును. ఇందలి రెండేసి పాదములను గలిపినచో నొక మధుర గతి రగడ పాదమగును. అందుచే నష్టపదికూడ నేకతాళముతో నొప్పు రగడ భేదమే. 1

త్రిపుటకు "మ గ నె నీ విం, తళియపెఁ్రయిపె, నెంతొ పేళెయ్, శంకరా" యనున దుదాహరణముగా నొసంగఁబడినది. ఇందు సప్త మాత్రాగణములు మూఁడును, బంచ మాత్రాగణ మొకటియుఁ గలదు. నాల్గవ గణమునుగూడ సప్తమాత్రాకముగా నొనరించినచో నిది వృషభగతి రగడ పాదమగును. పాట సౌకర్యమునకై యిందుఁదుదిని రెండు మాత్రలు లోపింపఁ జేయఁబడినవి.

---

1. నాలుగేసి మాత్రల గణములతోఁ గూడిన మధురగతి రగడ ఏక తాళముతోఁ గూడి యుండును

అల్లొనేరేళ్లగూడ నాలుగేసి మాత్రల నాలుగు గణములతోఁగూడి మధురగతి రగడకు సంబంధించినవిగాఁ గనవచ్చుచున్నవి. ఇందుఁగొన్ని పాదముల చివరఁ బాడుట కనువుగా నొక్కొక్క గురువు లోపించుచున్నది.

పల్లవి. నెయ్యము, లల్లో, నేరే, ళ్లో
వొయ్యన, మారెడి, పువ్వి, ళ్లో

చరణము : పలుచని, చెమటలు, బాహూ, మూలలు
చెలమల, లోనా, జెలువము, లే .. ....
తళతళ, మనుము, త్యంపుజె, లంగా
దులిపెవి నీళ్లా తుంపి ళ్లో.

అప్పకవి యే రగడ లే యే మూర్పులుచేసిన నే యే తాళములకు సరిపోవునో తెల్పి యా తాళములతోఁగూడిన అర్ధచంద్రికలు మున్నగునవి రగడ భేదములే యనియు, వానిని యక్షగానములలో వాడవచ్చు ననియుఁ జెప్పి యున్నాఁడు. [1]

---

1 తుద రెండులఘువులు తొలఁగించిచదివిన త్రిపుటకు వృషభగతి పదయుగము లలిగడపలనొక్క లఘువుమానినజంపె మనుద్విరదగతి నమపదము గురుతురూపకమునకుఁ దురగవల్ల నా హ్వాయమేకతాళి యా మధురగతికి హరికినిర్వదినాలుగట తాళమున మాత్రలోలి విశ్రాంతి పద్నాలు గింట

తెలియనర్ధంబు నర్ధచంద్రికలువీన
యక్షగాన ప్రబంధంబు లతుక వచ్చు
రగడభేదంబులివి యంద్రు రసఁ గవీంద్రు
లవిత నిజసేవకస్తోమ యబ్ధిధామ

రంగాజమ్మ రచించిన మన్నారు దాసవిలాసమునఁ ద్రిపుటతాళమున కొక యుదాహరణము కనవచ్చుచున్నది.

చందనాచల కంద రోదర మందమారుత బృందసోదర
నింద్యకోవిద నంద్యసద్రస తుంది లోదిత కందళోజ్జ్వల
ఇందేదు మాత్రలతోడను మూఁడు దెబ్బలతోడను (8, 2, 2) గూడిన నాలుగేసి గణములున్నవి. ఇవి వృషభగతి రగడ పాదములు

మల్లికార్జున దేవుని సేవించుటకై శ్రీశైలము చేరిన భక్తులు రాత్రి జాగరణము చేయు సందర్భమునఁ జదువుచుండిన గ్రంథములను బాల్కురికి సోమనాథుఁడు పేర్కొనియున్నాఁడు. అందు శతకము, దీపకళిక, మహా నాటకము, ఉదాహరణము, ముక్తకావళులు, గీత సూక్తములు, అష్టకములు ముఖ్యములైనవి[1] ఇవిగాక వారలువత్తు మూలు చరితంబును ఏలలుపెట్టి చదువుచుండిరఁట। అందుఁగొందఱు పురాతన చారుగీతములు పకటించి పాడు కొనుచుండిరి ఈ రచనలన్నియు సోమనాథునికిఁ బూర్వమునందే కాక నన్నయకుఁ బూర్వమునఁగూడ నుండెనని చెప్పవచ్చును వీనిలోఁ గొన్నింటి లక్షణములు తరువాతి లక్షణ గ్రంథములలోఁగానిపించును గాని యివి శిష్టకవితా మార్గముముందు నిలువలేక వెనుకఁబడిపోయినవి. ఆంధ్రమునఁ బండితారాధ్యుని శివతత్త్వసారమే శతక వాఙ్మయమునకు శ్రీకారము చుట్టిన దని చెప్పుదురు తరువాత నీ జాతికిఁ జెందిన వాఙ్మయము విరివిగాఁ బెరిఁగినది. మహా నాటక స్వరూపమెట్టిదో తెలియదు. కాని శివరాత్రి జాగరణ సందర్భమునఁ బ్రదర్శింపఁ బడిన వేడుకలు వర్ణించునప్పుడు సోమనాథుఁడు నాటకములను పేర్కొని యుండెను. ఈ నాటకములు బహుశః యక్షగాన జాతికి జెందియుండును జక్కులపాటలను తెనుఁగు పదమునకు యక్షగాన మనునది సంస్కృతము కవిజనాశ్రయమునఁ గాని కావ్యాలంకారచూడామణిలోఁగాని యీ యక్ష గానముల ప్రశంసయే లేదు. అంత మాత్రముచే, నంతకు ముం దట్టివి లేకుండె నని మన మూహించుట తగదు. మార్గకవితా పద్ధతిపైఁ గల మక్కువచే శిష్టు లెవ్వరును దేశి రచనల నాదరింప లేదు అందుచే లాక్షణికులు వానికి లక్షణము వివరించి యుండలేదు. చిత్రకవి పెద్దన యాళు మధుర చిత్ర విస్తరములను కవితా భేదములను పేర్కొని యక్షగానమున వచ్చు పదములు, దరువులు, ఏలలు మొదలైనవి దేశి రచన లందలి మధుర కవితా శాఖకుఁ జెందునని చెప్పినాఁడు. ఇట్లే క్రీ. శ. 1650 ప్రాంతము వాఁడైన వార్తాకవి రాఘవయ్య యను లాక్షణికుఁడు లక్షణ దీపిక యను గ్రంథమున నాళు

---

1. శతకంబు శివతత్త్వసారంబు దీప, కళిక మహా నాటకము నుదాహరణ ములు రుద్రమహిమయు ముక్తకావళులు గీతసూక్తములు భృంగిస్త వంబులు పు రాతనముని ముఖ్యరచితాష్టకములు అరుదొందఁ జదువుచు నంకించువారు

మధుర చిత్ర విస్తారములను నాలుగు తెఱఁగుల కవిత్వములను చేర్కొని నాట కాలంకారంబులు, కళికోత్కళికలు విభక్త్యర్థి దేవతోదాహరణములు, సప్త తాళ పటనలు వట్టొట్లు, గీత ప్రబంధములు, చతుష్పద్రికాష్ట భద్రికలు, బిరుదావళి, నామావళి, భోగావళి, రంగ ఘోష, జయ ఘోష, చతురుత్తర సంఘటనలు, యక్ష గానంబున వెలయు పదంబులు, దరువులు, లీలలు, ధవళములు, మంగళ హారతులు, శోభనంబులు ఉయ్యాల జోలలు, జక్కుల రేకు పదంబులు, చంద మామ సుద్దులు, అష్టకంబులు, ఏక పద ద్వి పద త్రిపద చతుష్పద షట్పదాష్ట పదులు, ఇవి యాదిగా నన్నియు లయ ప్రమాణంబుల నొప్పి మృదు మధుర వచన రచనలఁ బ్రసిద్ధంబైనవి మధుర కవిత్వంబులని వివరించెను. క్రీ. శ. 2వ శతాబ్ది యందలి పాట్టియల్ అను తమిళ లక్షణ గ్రంథమునఁ గూడఁ గవిత్వ మిట్లే చతుర్విధముగా విభజింపఁ బడినది. పై లాక్షణికులు నాటకములను యక్ష గానములను వేఱు వేఱుగాఁ జేర్కొని యుండుటచే నవి ప్రత్యేకములైన రచన లేమో యనిపించును. కాని తంజావూరు నాయక రాజుల కాలమున రచింపఁ బడిన యక్ష గానములలోఁ గొన్నిటికి యక్షగానము లనియు (సుగ్రీవ విజయము) కొన్నిటికి నాటకము లనియు (మన్నారు దాస విలాస నాటకము) కొన్నిటికిఁ బ్రబంధము లనియు (పల్లకీసేవా ప్రబంధము) నామములు కనవచ్చు చుండుటచే నామభేదములున్నను అవియన్నియు నొకతరగతికిఁ జెందినవే యని భావింపవచ్చును. వీని లక్షణమునఁ గూడఁ గించిద్భేదముండిన నుండవచ్చును గాని యవి యన్నియుఁ బ్రదర్శనోచితములైన రచనలే యనుటలో సందేహము లేదు. వీనిలో ఏలలు, జోలలు, సువ్వాలలు, ఆరతులు, ధవళములు, వెన్నెల పదములు, వివాళి పదములు, గొబ్బిపదములు, తుమ్మెదపదములు, అల్లోనేరేళ్లు, త్రిభంగులు, ద్విపదలు, త్రిపదులు, చౌపదులు, షట్పదులు, అష్టపదులు, మంజరులు, జక్కుల రేకులు మున్నగు దేశిరచన లెన్నియోకలవు. ఇవన్నియుఁ బ్రాచీన కాలమునుండియు వ్యవహారమున నుండినవే కాని హఠాత్తుగా నొక్క మాఱు వెలసినట్టివి కావు. నన్నయ యవతారికలో రాజరాజ నరేంద్రుని కొలువున మృదుమధుర చిత్రవిస్తరనవరసభావ భాసుర వచనరచనా విశారదు లైన మహాకవు లుండినట్లు వర్ణించి యున్నాఁడు. శ్రీనాథుఁడు నైషధమున (1-11) మృదుమధుర చిత్రవిస్తరకవితావిలాస వాగీశ్వరులగు కవీశ్వరులను

బేర్కొనియుండెను.[1] పైని పేర్కొనఁ బడిన దేశి రచనలలో ఏలలు సువ్వాలలు, షట్పదాష్టపదులు, మున్నగునవి రగడ వించుక మార్పుచేయఁగా వచ్చినరూపములే. మిగిలినవి పాల్కురికి సోమనాథుఁడు పేర్కొన్న అనియత గణైః ప్రాసో వా యతిర్వా అను ఛంద స్సూత్రములకు సంబంధించి, యతి ప్రాసలలో నొక దానితోఁ గూడి, యనియతములైన మాత్రా గణములచే నిబంధింపఁ బడిన దేశి రచనలుగాఁ దోఁచు చున్నవి.

గొబ్బిళ్ల పాటలో పాదమున కెనిమిదేసి మాత్రలు గల రెండేసి గణములు కనిపించు చున్నవి. సరిపాదముల చివర గొబ్బిళ్లో యని యుండుచోట మాత్ర మా గణమున రెండు మాత్రలు తక్కువగు చున్నవి.

పల్లవి : కొలని దోపరికి — గొబ్బిళ్లో — యదు
కులము సామికిని — గొబ్బిళ్లో
చరణము : కొండ గొడుగుగా — ఆవుల గాచిన
కొండొక శిశువుకు — గొబ్బిళ్లో.
దుండగంపు దై — త్యులకెల్లను దల
గుండు గండనికి — గొబ్బిళ్ళో.

వెన్నెల పాటలోఁ గూడఁ జివరి పాదమునఁ దక్క మిగిలిన యన్నిటను నాలుగేసి గణములే యున్నవి. కాని యీ గణములన్నియు సమాన మాత్రాకములైనవి కావు నాలుగు మాత్రల గణములు ఐదు మాత్రల గణములు కలపి వచ్చు చుండును

కాకీ కాకీ గంతుల కాకీ
కాకిని తీసుక గంగలో ముంచితే
గంగా నాకూ పాలూ ఇచ్చే
పాలూ తీస్కెళ్లి అమ్మాకిస్తే (తీసుక)

---

1. నన్నయ శ్రీనాథు లిరువురును ఆశుకవిత్వమునకు బదులు మృదు కవిత్వము నొక కవితాభేదముగాఁ బేర్కొనియున్నారు. అప్పకవినాఁటికి మధురవిస్తర కవిత్వముల స్థానమును బంధగర్భ కవిత్వము లాక్రమించినవి అతని మతమున కవిత్వమాశు, బంధ, చిత్ర, గర్భకవిత్వము లని నాలుగు విధములు.

అమ్మా నాకూ డబ్బూ ఇచ్చే
.. . ... . ...
పిల్లా పేరూ మల్లే మొగ్గా
నా పేరు జమీందార్

గంగలో, ముంచితె అని తుది యక్షరములను హ్రస్వములుగాఁ బలికినచో వరియు నాలుగు మాత్రల గణములే యగును. నా-ఆ పేరూ జామీం దారూ అని చదివినచో తుది పాదమునఁ గూడ నాలుగు చతుర్మాత్రా గణము లేర్పడును.

పాల్కురికి సోమనాథుఁడు దీపకళిక యను కావ్యభేదమును బేర్కొని యుండెను. ఈ పేరుగల ప్రత్యేక రచన లెచ్చటను గానవచ్చుటలేదు. కాని యుదాహరణములందు కళికలు, ఉత్కళికలు అను దేశిరచనలు కానవచ్చు చున్నవి. చిత్రకవి పెద్దనయు వార్తాకవి రాఘవయ్యయుఁగూడ వీనిని మధుర కవిత క్రిందఁ జేర్చియుండిరి. ఈ రెండు రగడ భేదములే. బసవోదాహరణ త్రిపురాంత కోదాహరణము లందలి కళికలన్నియు రగడలే. కళికలో సగ ముత్కళిక. అందుచే దీని నర్ధ కళిక యనియు వాకొందురు. [1] కావ్యాలంకార సూత్రవృత్తిలో వామనుఁ డుత్కళికను గద్య భేదముగాఁ బేర్కొని యది చూర్ణమునకు విపరీతమైన లక్షణము కలదని (దీర్ఘ సమాస రచన కలదని) వచించెను. కాని యుదాహరణము లందలి యుత్కళికలలో దీర్ఘ సమాస భూయిష్ఠమైన రచన కానవచ్చుటలేదు. [2] శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు "తెలుఁగున నేక సమాసము, క్త్వార్థక క్రియలతో నడిపి చివర సమాపక క్రియతో నంతము నొందించి విభక్త్యంతముగాఁ జేయుటవలన నేర్పడు"నని (ఉదా వా. చ. పుట 59) చెప్పియున్నారు. కాని యీ నియమముకూడఁ బెక్కుచోట్లఁ గానఁబడుటలేదు.

పారజీవన్ముక్తి, కారణంబగు భక్తి
చేకూరుసమ్మత, మేకలింగవ్రతము.

---

1. పాతోర్ధ కలికాన్ పాతాన్ కుర్యా ల్లఘ్వుత రేషు చ భర. నా. శా. అధ్యా 31-318

2. కళికలు ప్రత్యేక దళము లెన్మిదిచేసి తత్పరార్థముల నుత్కళికలనఁగఁ నేకసమాసమై యేడు దళంబులు తుదవిభక్త్యర్థంబు తోఁపఁ బలుక

త్రోవఁ బొందని పసుప, దైవజ్ఞులనుమనుప
నోపు ధీరునివలన, బాపహారునివలన (బసవోదాహరణము)
ఇలయు సలిలంబు – వెలుఁగు ననిలంబు
దివియు మిత్రుండు – కువలయాప్తుండు
పరఁగుయజమాన – పరిపూర్ణుఁడైన
యష్టతను నందు – శిష్టనుతునందు. త్రిపురాంతకోదాహరణము.
మున్నగున విందుకు నిదర్శనములు

ఉదాహరణములు కూడ మధుర కవితా జాతికిఁ జెందినవే. ఇందు మార్గ దేశీ కవిత్వముల సమ్మేళనము కాన నగును. ఏలయన మార్గ పద్ధతికిఁ జెందిన వృత్తములకును దేశి మార్గమునకుఁ జెందిన కళికోత్కళికలకును గూడ నిందుఁ బ్రవేశము కలదు. ప్రాచీన కాలమునఁ గన్నడమునం దుండిన చెత్తాణె, బెదండె అను కావ్యములలోఁ గూడ నిట్టే వృత్త-జాతి సమ్మేళనము కాన వచ్చుచున్నది " ఒక కంద పద్యము తరువాత నొక వృత్తమును రచించి అచ్చటచ్చట జాతులను బొదిగిన నది బెదండె కావ్య మగునఁట ; చెత్తాణె కావ్యమును గంద పద్య బహుళముగాఁ జేసి యక్కడక్కడ సుందర వృత్తములను, అక్కర, చౌపది గీతిక, తివది మొదలగు వాని నందముగాఁ జేర్పవలయునఁట."[1] అప్పకవి యీ యుదాహరణములను జాటు ప్రబంధములలోఁ జేర్చి యందు పద్ధళి, బద్ధళి ఉత్ఫుల్లకము అను నాలుగు భేదములను జెప్పి యున్నాఁడు. అందుత్ఫుల్లక మనునది ఇతర పద్యములు లేక కేవల కళికోత్కళికలతోఁ గూడినది వలెఁ

1 కందము మమళిన వృత్తము-
మొందొదెడె గొందు జాతి జాణెనెయె బెడం
గొంది వళిరమరె పేఱ
ల్సుందర రూపిం బెదెండె గబ్బమ దక్కుం.
కందళ్పల వాగిరె
సుందర వృత్తం గళక్కరం చవుపదిను
త్తం గీతగె తివదిగ
ళందంబు త్తెసెయె పే త్తొడదు చత్తాణం.

గనవచ్చు చున్నది [1] ఇది కేవల దేశీయమైన యుదాహరణము. అనంతామాత్యుఁ డుదాహరణములను పేర్కొనెను గాని యందలి భేదములను వివరింపలేదు. అంతకుఁ బూర్వములైన కావ్యాలంకార చూడామణిలోఁగాని కవిజనాశ్రయమునఁ గాని వీని ప్రసక్తిలేదు ఋగ్వేదమున కుంతాప సూక్తమున నుదాహరణమును బోలిన రచన యున్నదఁట; కాళిదాసు రఘువంశ చతుర్థ సర్గమునను (78)[2] విక్రమోర్వశీయ ద్వితీయాంకమునను[3] ఉదాహరణమను రచనా భేదమును పేర్కొని యుండుటచే నాతనికాలమున నట్టి కావ్యము లుండెనేమోయని సందేహము కలుగుచున్నది. కాని వానిస్వరూపమెట్టిదో తెలిసికొనుట కాధారములులేవు. సంస్కృతమున లభ్యములగుచున్న మూఁడు నాలు గుదాహరణములును ఆంధ్రోదాహరణ లక్షణములతోనే కూడియున్నవి. అందొకటి పాల్కురికి సోమనాథుఁడు సంస్కృతమున రచించిన బసవోదాహరణము. ఇదియే లభ్యములైన సంస్కృతాంధ్రోదాహరణములకెల్ల మొదటిదిగాఁ గానవచ్చుచున్నది. విద్యానాథునికి ముందుండిన సంస్కృత లాక్షణికు లెవ్వరును ఉదాహరణ లక్షణములను పేర్కొనియుండలేదు అతఁడైనను దెలుఁగువారి యుదాహరణములను జూచియే యా లక్షణమును జెప్పినట్లు విమర్శకుల యభిప్రాయము. కాని యాతఁడు చెప్పిన లక్షణమునకును బాల్కురికి సోమనాథుని యుదాహరణములందలి లక్షణమునకును గొంచెము భేదము కనఁబడుచున్నది. అతఁడదిజయత్యుపక్రమమై మాలిన్యాది ప్రాసవిచిత్రితమై[4] విభక్త్యష్టక సంయుతమై యేదో యొక తాళముతో గద్యపద్య సమన్వితమై యుండు క్షుద్రప్రబంధమని నిరూపించెను. సంస్కృతోదాహరణములు పై లక్షణమున కనుగుణముగా మాలినీ వృత్తముతోడను జయతి పదము తోడను బ్రారంభించుచున్నవి. తెనుఁగువానిలో నీ నియమములేదు. తెలుఁగుదాహరణము

---

1 కళిక లుత్కళికలు గమకింపఁ బలికిన కావ్యంబు నుత్ఫుల్లకంబు ననఁగ అప్ప.

2. జయోదాహరణం బాహ్వో ర్గాపయామాస కిన్నరాన్ - రఘు ౪. 78.

3 పత్రే నివేశిత ముదాహరణం ప్రియాయాః - విక్ర ౨-15

4. ఉదా వా చ. పుట 3.
యేన కేనాపి తాళేన గద్యపద్య సమన్వితమ్
జయత్యుపక్రమమ్ మాలి న్యాదిప్రాస విచిత్రితమ్
తదుదాహరణం నామ విభక్త్యష్టక సంయుతమ్

లలో నెనిమిది విభక్తులై నపిమ్మట సార్వ విభక్తికమైన యొక పద్య ముండును. విద్యానాథుఁ డీ విషయమును జెప్పలేదు. ఇట్లే సోమనాథుఁడు రచించిన తెలుఁగు బసవోదాహరణమున లేకపోయినను సంస్కృత బసవోదాహరణమున నుండిన అంకితాంకపద్యము విషయముకూడ నాతఁడు సూచించియుండలేదు అందుచే నాతఁడు సోమనాథుని యుదాహరణములను జూచెనో చూడలేదో చెప్పఁజాలము. ప్రతాపరుద్రీయ వ్యాఖ్యాతయైన కుమారస్వామి సోమయాజి "యత్వేత్యాదినా అత్ర సంబోధనవిభక్తి రష్టమీ ప్రబంధాంతే సర్వవిభక్త్యంకితో నవమ శ్లోక శ్చేత్యాది విశేషాణాం సాక్షిశ్లోకా స్సాహిత్య చింతామణౌ ద్రష్టవ్యాః" అనియు "అంతే కవిప్రబంధ నామాంకితాంక పద్య విశేషం కుర్యాత్తదుక్తం" అంతేనుష్టుభ మార్యాం వా కవికృత్యాఖ్యయాన్వితాం, కుర్యాచ్చాటుప్రబంధానా మయం సాధారణో విధిః" అనియు సార్వవిభక్తి కాంకితాంక పద్యములనుగూర్చి మూలమున లేని విషయములను సూచించినాఁడు. సాహిత్య చింతామణి శ్రీనాథుని కాశ్రయుఁడును సర్వజ్ఞ బిరుతాంకితుఁడు నైన పెదకోమటి వేమభూపాలుఁడు రచించిన యలంకార శాస్త్రము అదియు సంస్కృత భాషారచితమే యైనను గవి తెలుఁగు వాఁడగుటచే నందు దేశీయము లైన రచనలను గూర్చి విశేషముగఁ దెల్పియున్నాఁడు అతఁడు విద్యానాథుని యుదాహరణ లక్షణమునందలి లోపములు సవరించి తన గ్రంథమున దానిని సమగ్రము కావించినాఁడు. ఈతని లక్షణములకు సోమనాథుని యుదాహరణములే లక్ష్యములని చెప్పవచ్చును.

ఇట్లు పైని పేర్కొనఁ బడిన దేశిరచనా భేదము లన్నియు నన్నయకుఁ బూర్వము నుండియు నుండె నని యూహించుట కవకాశమున్నది కాని శిష్టులైన వా రెవ్వరును వాని నాదరింపక పోవుట చేతను. అందుఁ బెక్కు గ్రంథస్థములు గాక ముఖస్థములుగా మాత్రమే ప్రచారము నొంది యుండుట చేతను, శిష్టకవి ప్రయుక్తములు కామిచే లాక్షణికులు వానికి సరిగా లక్షణములు నిర్దేశింపక పోవుట చేతను, వాని యథార్థ స్వరూపము మఱుఁగుపడి పోయినది ఇప్పటికిని గ్రంథస్థములు కాక జనుల నోళ్లలో మాత్రము జీవించి యున్న గేయములు, పదములు, పాటలు, పెక్కు కానఁబడుచుండుటయే యిందుకు దృష్టాంతము.

క్రీ. శ. 1000 వ సంవత్సరము ప్రాంతమున నుండిన విరియాల కామసాని గూడూరు శాసనములో రెం డుత్పల మాలలును మూఁడు చంపక మాలలను వ్రాయఁబడి యున్నవి. క్రీ. శ. 10 వ శతాబ్ది మధ్య భాగమున నివసించిన సర్వ దేవుని యాది పురాణము నందలి మత్తేభ మొకటి ప్రబంధ రత్నావళి యందును జంపకమాల యొకటి పెనుమర్తి వెంకటార్యుఁడు సంధానించిన లక్షణసార మను ఛందో గ్రంథ మందును నుదాహరింపఁబడియున్నవి. వీనిని బట్టి చూడఁగా నన్నయకుఁ బూర్వము దేశి మార్గమునకుఁ జెందిన జాతులు, పాటలు, గేయములు మాత్రమే కాక మార్గ పద్ధతికిఁ జెందిన వృత్తములు కూడ రచింపఁబడుచుండె ననుట కవకాశము కలుగుచున్నది. క్రీ శ. 9 వ శతాబ్ది యుత్తరార్ధమునఁ జాళుక్య సామ్రాజ్యమును బాలించిన గుణగ విజయాదిత్యుని సాతలూరు శాసనములో నొక చంపక మాలావృత్త మున్నది ఇది సంస్కృత భాషలోనే రచింపఁ బడినను ఇందు సంస్కృత కవులు పాటింపని ప్రాసనియమము కనఁబడుచున్నది. మొదటి రెండు పాదములలోఁ బాదాద్యక్షర పునరావృత్తి రూపమైన తెలుఁగు వడి సంప్రదాయము కూడ గోచరించుచున్నది. అసలు చంపక మాలా వృత్త మక్షర గణ బద్ధమే యైనను సంస్కృతమున దీని కంతగాఁ బ్రచారము లేదు. ప్రాచీన సంస్కృత కవు లెవ్వరును దీనిని వాడి యుండలేదు. క్రీ. శ. 8, 9. శతాబ్దులలో నివసించిన రాజశేఖరాది సంస్కృత కవుల గ్రంథములలో మాత్రము దీనికి విరళమైన ప్రయోగము కానవచ్చుచున్నది. తెలుఁగు కన్నడములలో నీ వృత్తమున కమితమైన ప్రచారమున్నది. దీనినిబట్టి సాతలూరు శాసన కావ్యకర్త యెవ్వరైనను దెలుఁగు కవిత్వముకూడ వ్రాయనేర్చినవాఁడే యనియు, నప్పటికే సంస్కృత వృత్తములు కొన్ని దాక్షిణాత్య వాఙ్మయమునకు సహజములైన యతిప్రాస లక్షణములతో వ్రాయఁబడుచుండె ననియుఁ దెలియుచున్నది. సాతలూరు శాసనమున కాజ్ఞప్తి సుప్రసిద్ధుఁడైన పండరంగఁడు. దాని కర్త కూడ నాతఁడే యై యుండు నని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారి యూహ. అదియే నిజమైనచోఁ బండరంగఁడు సేనానాయకుఁడే కాక తెలుఁగు సంస్కృత భాషలలోఁ గవియై కూడ నుండెననియు, సంస్కృత వృత్తములను దెలుఁగు లోనికిఁ దెచ్చుట కతఁడే మార్గదర్శకుఁడనియుఁ జెప్పవచ్చును. అతఁడు సంస్కృతములోఁ దొలుత నొక తెలుఁగు లక్షణమును బ్రవేశపెట్టి వ్రాయఁగాఁ దరువాతివారు క్రమముగాఁ దక్కిన లక్షణములనుగూడఁ బ్రవేశపెట్టి వృత్తము

లను వాడఁజొచ్చి రనియు, నన్నయకూడ నా పద్ధతిలోనే కొన్ని సంస్కృత వృత్తములను గ్రహించి భారతమునఁ బ్రయోగించె ననియుఁ దోఁచుచున్నది.

కందము జాతులలోఁ జేరిన పద్యము. "దక్షిణదేశ భాషా సంప్రదాయములకు సరివచ్చు మాత్రాగణచ్ఛందములోని ఆర్యాజాతిభేదమే యీ కంద పద్య మగుటచేతఁ బ్రాచీన దేశీయ కవిత్వములో దీనికిఁ బ్రాధాన్యము కలిగి యుండవచ్చును. ఆర్యాగీతియే ప్రాకృతమున ఖందసీ యను పేరు కలదై యుండినట్లును ఆంధ్ర కర్ణాటకములలోని కందము ప్రాకృతము మూలముగా నీ భాషలలోఁ జేరినట్లును దలంపఁ బడుచున్నది.[1] " ఈ భాషలలోఁ జేరఁగానే వానికి సహజములైన కొన్ని యితరలక్షణములు కూడ నందుఁ బ్రవేశించినవి. వానిలో యతిప్రాసలును బ్రాస పూర్వాక్షర నియమమును పేర్కొనఁ దగియున్నవి. కన్నడమునఁ బ్రాచీన రచనములైన చెత్తాణె, బెదండె యను కావ్య భేదములలోఁ గంద పద్య బాహుళ్య ముండినట్లు తెలియుచున్నది. కవిరాజ మార్గమునఁ గొన్ని వృత్తములును గీతికలును గూడ నున్నను అందుఁ గంద పద్యముల సంఖ్యయే హెచ్చు. కాని కంద పద్యముల కప్పు డున్న ప్రాధాన్యము క్రమ క్రమముగాఁ దగ్గినట్లు పంపాదుల రచనలలో నవి యచ్చటచ్చట మాత్రమే కానవచ్చు చుండుట వలనఁ దెలియుచున్నది. తెలుఁగునఁ గందమునకుఁ బ్రయోగ వైరళ్యమే యుండెనో బాహుళ్యమే యుండెనో చెప్పుట కాధారములు లేవు నన్నయ్యకు సుమారొక శతాబ్ది తరువాతి వాఁడైన పండితారాధ్యుని శివ తత్త్వ సార మంతయుఁ గంద పద్య మయమే యని చెప్పవచ్చును. తరువాతఁ గంద పద్యములలో శతకములు వ్రాసినవారు పలువురున్నారు. కాని నన్నయ్య రచనలోఁ బంపాదుల రచనలలో వలెనే కంద పద్యము లక్కడక్కడ మాత్రమే కానవచ్చు చున్నవి. అంతకుఁ బూర్వము కూడఁ గందములు వాడఁబడు చుండె ననుటకుఁ దార్కాణము లున్నవి. సర్వదేవుని (క్రీ శ. 953) ఆది పురాణము నందలి దవి

1. దేశి పుట 127.

ప్రబంధ రత్నావళిలో నొక కంద పద్య ముదాహృతమై యున్నది [1] క్రీ. శ. 980 ప్రాంతమున నుండిన అయ్యనభట్టు రచించిన ఆరుంబాక శాసన కావ్యములో సంస్కృత శ్లోకముల మధ్యఁ దెలుఁగునకు విసర్గములైన యతిప్రాస లక్షణములతోఁ గూడిన కంద పద్య మొకటి కానవచ్చుచున్నది.

ధవళగుణో ధవళయశో
ధవళిత దిఙ్మండలోఽవ దమి తారాతిః
భవభక్తో భవ కరుణో
నృప భవభోగాన్వితో విభాతి సుకీర్తిః 22.

ఇది సంస్కృతభాషలో వ్రాయఁబడిన తెలుఁగు కందమే యనుటకు సందేహములేదు. దీనినిబట్టి అయ్యనభట్టు తెలుఁగులోఁగూడఁ గవియై యుండునని చెప్పనగును. కాని యాతని రచన లేమియు మనకు లభ్యము లగుటలేదు. నన్నయకుఁ బూర్వము కందములు కూడఁ బ్రచారమున నుండె ననుట కిదియొక ప్రబలమైన తార్కాణము.

కందుకూరు శాసనమం దొకటియు [2] ధర్మవరశాసనమందొకటియు సీస పద్యములు కనవచ్చుచున్నవి. పద్మకవి జినేంద్ర పురాణమునుండియు సర్వ

---

1. హరి నీలమణి విరాజిత
సురుచిర గోపురము దగిలి చూచి తమిస్రా
కరుఁడు విధుంతుద మండల
పరిశంకం జేసి పురముపైఁ జనదోడున్.

2. (శ్రీ)నిరవద్యుణ్డు - సిత్తజాతసముణ్డు
శివపదవర రాజ్య - సేవితు ణ్డ
ఖలుఁడు నన్నృతరిపు - బలుఁడు నాహవరావ
రణ్డ మోద్యసిఘూన - ము ణ్డగణిత
దానమాన్యుణ్డు ( ద - యానిలయుణ్డును )
బణ్డనపణ్డన - పణ్డురంగు
...... . ..... .......... కోలడిలేని
కొట్టములోవ్వడిచి గొణకనల్ల

గీ. తని పక్షపాతి ......
.....................
............... ......
...... .. ............విభవ గొరవేంద్ర.

కందుకూరి శాసనము. (శ్రీ) కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగారి పాఠము.

దేవుని విరాటమునుండియుఁ బ్రబంధరత్నావళిలో నుదాహరింపఁబడిన పద్యములలో రెండు సీసములున్నవి. ఇందు కందుకూరు శాసనమునందలి సీసమున గీతపద్యముపోయినది. సీసపాదముల పారమైనను నిశ్చితముగాలేదు. ఇందు మొదటి పాదమందలి రెండు దళములలో యతి నియమము పాటింపఁబడినది నాల్గవ పాదమునందలి యుత్తరార్ధమునఁగూడ ( కొట్టము ల్వోడిచి – గొణక నల్ల ) యతియే కానవచ్చుచున్నది. ద్వితీయ తృతీయ పాదముల పూర్వోత్తరార్ధములు రెంటను బ్రాసయతి వేయఁబడినది. ఇట్టిది అప్పకవియు ననంతుఁడును జెప్పిన సీస భేదములలో సమసీస మను భేదమునకుఁ జెందుచున్నది ఏలయన నిందుఁ గొన్నిదళములలో సామాన్యయతియుఁ గొన్ని దళములలోఁ బ్రాసయతియు వేయఁబడియున్నవి. ధర్మవర శాసనమునందలి సీసములో సీస పాదముల యేడర్ధములందునుఁ (మొదటిపాదము పూర్వార్ధము పోయినది) తరువాతఁ గల ఆటవెలఁది నాలుగు పాదములందును బ్రాస యతియే కలదు. ఇది అనంతుఁడు చెప్పిన అవకలిప్రాస సీస మను సీసభేదమునకుఁ జెందును. దీని నప్పకవి అవకలివడి సీసమని పేర్కొన్నాఁడు. కవిజనాశ్రయ కావ్యాలంకార చూడామణులలో నిది సమసీసము లందలి పంచ విధములలో నొకటైన అవకలి సీస మని చెప్పఁబడినది పద్మకవి జినేంద్ర పురాణమునందలి సీసములోఁ బెద్ద పాదముల యెనిమిది దళములందును యతియుఁ బ్రాసయతియుఁ గూడనున్నవి శ్లేషకై యొకేసమాసమును బునరుక్తముచేయుటచే నిట్టిపరిస్థితి యేర్పడినది చివరఁ జెప్పఁబడిన తేటగీతలో రెండవ పాదమునఁ బ్రాసయతియు మిగిలిన మూఁడు పాదము లందు యతియు వేయఁబడినవి. అందుచే నిదియు సమ సీస మనియే చెప్పవలయును. సర్వదేవుని విరాటమునందలి పురసరోవరములను పద్యముకూడ సమసీసమే. ఇందు రెండవపాదము పూర్వార్ధమునను, మూఁడవ పాదమును త్తరార్ధమునను, నాల్గవపాదము పూర్వార్ధమునను, జివరఁ జెప్పఁబడిన తేటగీతిలోఁ దుదిమూఁడు పాదము లందును బ్రాసయతి వేయఁబడినది మిగిలినచోట్ల సామాన్యయతి నియమము పాటింపఁబడినది. తేటగీతి చివరి పాదము "భరిత జలములై పుర సరోవరము లొప్పు" అని యుండుటచే నందు యతియుఁ బ్రాసయతియుఁ గూడ నున్నవని చెప్పవచ్చును.

నన్నయకుఁ బూర్వ ముండెనని నిశ్చయముగాఁ జెప్పఁబడిన ధర్మవరపు శాసనములో సీసమున నాలుగు పాదముల తరువాత నాటవెలఁది చెప్పఁబడినది

అతని కించుక తరువాత వ్రాయఁబడిన సోమల్దేవి శాసనమునందలి సీసములలోఁ గూడ నాటవెలఁదులే యున్నవి. కందుకూరు శాసనమునందలి గీతము సరిగాఁ దెలియవచ్చుటలేదు. కాని కీ. శే. కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు పంతులు గారు చూపిన పాఠములో నాగీతము నారంభావసానములు కానవచ్చుచున్నవి.

I I ∪ I ∪ I
గి త వి ప క్ష పా తి ... .....

...... .........

...........

I I I ∪ I ∪
... .. ....విభవ గౌర వేంద్ర.

ఇందారంభ మాటవెలఁదికిని జెందదు. తేట గీతికిని జెందదు. బహుశః పాఠములోఁ గొంత దోష మున్నట్లున్నది. అవసానమున నున్న పదముల క్రమమును బట్టి యది యాటవెలఁదియుఁ గావచ్చును. తేట గీతియుఁ గావచ్చును. అందుచే నన్నయకుఁ బూర్వము సీసముల చివర నాటవెలఁదులను మాత్రమే వాడెడి వారని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు చెప్పిన విషయమున[1] కిది యేమాత్రమును భంగకరముగా లేదు. కాని పద్మసర్వ దేవుల వని ప్రబంధ రత్నావళిలోఁ జేర్పఁబడిన రెండు సీసము లందును దేట గీతులే వ్రాయఁబడినవి. దీనిని బట్టి యా పద్యములు నన్నయ్యకుఁ బూర్వము వ్రాయఁ బడిన వనుట సందేహాస్పద మగుచున్నది. నిజముగా నవి పద్మకవి సర్వదేవులు వ్రాసినవే యగుచో నప్పుడు సీసముల చివర నాటవెలఁదులే కాక తేట గీతులు కూడ వ్రాయఁ బడుచుండె నని చెప్పవలయును.

ఒక విధముగాఁ జూచినచో సీసమును గూడ రగడ భేదమే యని చెప్పవచ్చును. శీర్షిత మను తాళ భేదమును బట్టి భరతుఁడు దానికి శీర్షక మను పేరు పెట్టి యుండు ననియు, నాతఁడు దానికిఁ జెప్పిన లక్షణములనుబట్టి యందు నాలుగేసి మాత్రల నాలుగేసి గణములతోఁ గూడిన రెండు దళము లొక్క పాదముగా నేర్పడు ననియు నిదివఱకుఁ దెలుపఁ బడినది. దీనిని బట్టి కొన్ని రగడల వలె సీసము కూడ నాలుగేసి గణములు గల పాదములను రెట్టింపు చేయుటచే నేర్పడినదే యని తెలియ వచ్చుచున్నది. కాని రగడలలో గణము లందలి మాత్రల

1. తె. క, చ, పుట, 126.

సంఖ్య యెల్లెడ సమానములుగా నుండ సీసమున నింద్ర గణములలోఁ గొన్ని చతుర్మాత్రాకము లగుటయుఁ గొన్ని పంచమాత్రాకము లగుటయు మాత్రమేకాక చివర రెండు సూర్యగణము లుండుచోట మూఁడేసి మాత్రల గణములే వచ్చుటయు సంభవించుచున్నది. "సంస్కృత లాక్షణికుల గ్రహించిన మాత్రాసంఖ్యా నియమమును దెచ్చిపెట్టుకొనుటవలన నీ చిక్కు కలుగుచున్న ట్లగపడుచున్నది. కాని దేశీయగణములు పాదమునకు నాలుగేసి యుండవలయునన్నచో నా చిక్కు" తొలఁగిపోవును. (దేశి. పుట 172) పాదమునకు నాలుగేసి దేశీయ గణములతోఁ గూడిన రెండు దళము లుండునని చెప్పినచో నప్పుడు సూర్యగణములుకూడ వాడుట కవకాశ మేర్పడును ఈవిధముగాఁ జెప్పినచో నిదియు నొక రగడ భేదమే యగును.

తెలుఁగు నందలి ఆటవెలఁది తేటగీతి పద్యములలోఁ బాదమున కైదేసి గణములుండును. వీనిలోఁ బ్రాసనియమములేదు. ఇవియును సీసమును నుప జాతులని పేర్కొనఁ బడినవి. కన్నడమునఁ బ్రాసనియమములేని పద్యమే లేదు. అందు గీతమునకుఁగూడఁ బ్రాస నియమముండును. అందుచే దాని నుప జాతులలోఁ జేర్చుటకు వీలులేదు. తమిళమునందలి వెణ్బా పద్య భేదములలోఁ గొన్నింటిలోఁ బ్రాస (యదుగై) యుండును. "ఇన్నిశై వెణ్బా" యను వెణ్బాపద్య భేదము ప్రాసరహితముగాఁ గూడ నుండవచ్చును. దీనినిబట్టి తమిళమునందలి ప్రాసయుక్తములైన వెణ్బాభేదములను గన్నడమువారును బ్రాసరహితము లైనవానిని తెలుఁగువారును నవలంబించిరని యూహింప వచ్చును. గణముల విషయమునఁగూడ వెణ్బాపద్యములకును దేటగీతికిని సంబంధము కుదుర్ప వచ్చును. పాదమునకు మావిళ, కాయ్ చ్చీర్లలోఁ (సూర్యేంద్ర చంద్రగణములవంటివి) నే వైన నాలుగు గణములు వచ్చుచో నొక వెణ్బా పద్యపాద మగును. దీనిలో నిక్కడ సూర్యేంద్ర గణములు ఇక్కడ చంద్రగణము రావలెనను నియమములేదు. కావున నందలి యొక రక ములో నొక సూర్యగణము, రెండింద్రగణములు, ఒక చంద్రగణము వచ్చుట కవ కాశమున్నది. తుది చంద్ర గణము రలమో నగలమో యైనచో దానిని రెండు సూర్య గణములుగా విభజించుటకు వీలగును. అప్పుడా పాదమున సరిగా నొక సూర్య గణము రెం డింద్ర గణములు చివర రెండు సూర్య గణములు నుండు టయు నది తేటగీతితో సమాన లక్షణము కలిగి యుండుటయు సంభవించును

తెలుఁగు నందలి అంతరాక్కరలోఁ గూడ నిట్లే యొక సూర్య గణము, రెం డింద్ర గణములు, ఒక చంద్ర గణము వచ్చును గావున నది సరిగాఁ బైని పేర్కొనఁ బడిన వెణ్బా పద్య భేదమునకుఁ జెందిన పాదమే యని చెప్ప వచ్చును. ఇందలి చంద్ర గణమును గూడ రెండు సూర్య గణములుగాఁ జేసి నచో నొక తేట గీతి పాద మేర్పడును.

ఆటవెలఁదిలో బేసి పాదములందు మూఁడు సూర్య గణములు, రెం డింద్ర గణములును, సరి పాదములలో నైదు సూర్య గణములును నుండును. ఈ పాదములను గూడ వెణ్బా పద్య పాదములతో సరిపెట్ట వచ్చును మొదటి మూఁడు సూర్య గణములును ఒక చంద్ర గణము, ఒక సూర్య గణముగాఁ గాని, ఒక చంద్ర గణము ఒక ఇంద్ర గణముగాఁ గాని, రెండింద్ర గణములుగాఁ గాని మార్చుట కవకాశ మున్నది. అందుచేఁ దెలుఁగు నందలి ఆటవెలఁదియుఁ దేట గీతియుఁ దమిళము నందలి వెణ్బా పద్య భేద ముతో సరివచ్చునని చెప్పవచ్చును. కాని వీని గణముల సంఖ్యలో మాత్రము భేదమున్నది. వెణ్బా పద్య భేదములోఁ బాదమునకు నాలుగేసి గణములు ; ఆట వెలఁది తేట గీతులలో నైదేసి గణములు తమిళమున నైదేసి గణముల నాలుగు పాదములతోఁ గూడిన కట్టళై కలిత్తురై యను కలిప్పా భేద మొకటి కలదు కాని యందు మొదటి నాలుగు గణములను రెండు దేశీయ ఛందోఽ క్షరములు ప్రస్తరింపఁగా వచ్చు నీరశై చ్చీర్లుగను, తుది గణము మూఁడ క్షరములు ప్రస్తరింపఁగా వచ్చు విళంగాయ్చ్చీర్లలోనిదిగను, ఉండ వలెను. ఈ తుది గణము మన చంద్ర గణములను బోలినదిగా నుండును. తెలుఁగునందలి ఆటవెలఁది సరి పాదమునఁగాని బేసి పాదమునఁ గాని తేటగీతి పాదమునఁగాని చివరఁ జంద్రగణ ముండదు. అందుచే నివి తమిళమునందలి కళిప్పాభేదమునకుఁగాక వెణ్బా పద్యమునకే సంబంధించి యుండునని చెప్పవచ్చును

తెలుఁగునందలి మొదటి పద్య శాసనమైన పండరంగని అద్దంకి శాసన ములో నొక తరువోజయున్నది. "తరువోజవృత్తము ధ్రువాపదమునుండి నిష్పన్నమైనది. ధ్రువపద, దరువద, తరువద, తరువోజ అని దీని రూపాంతర ములు. కొఱవి గోపరాజు సింహాసనద్వాత్రింశికలో ధ్రువాపద ప్రబంధములను

జెప్పినాఁడు. నన్నిచోడ మహాకవి తరువద నుపయోగించియున్నాఁడు "[1] తరువోజ దంపునప్పుడు పాడు పాటయని కావ్యాలంకార చూడామణిలో విన్నకోటపెద్దన చెప్పియున్నాఁడు [2] ప్రాచీనకవు లీతరువోజ నుపయోగించినను దరువాతి ప్రబంధకవు లెవ్వరును దీనిని వాడియుండలేదు రెండు ద్విపద పాదములను గలపఁగా నొక తరువోజ పాద మేర్పడును. అనఁగా నిందు బాదమునకు మూఁ డింద్రగణములు నొక సూర్యగణము. మరల మూఁ డింద్ర గణములు నొక సూర్యగణము మొత్త మెనిమిది గణము లుండును. మూఁడవ ఐదవ, ఏడవ గణముల మొదట యతి నిల్పవలయును. ఎనిమిది గణముల పాదములు నాల్గింటిలోఁ బ్రాస యుండవలయును. అద్దంకి శాసనము నందలి తరువోజలోఁగూడ నీ లక్షణమేయున్నది. కాని మూడవపాదమునందలి యైదవ గణము " గౌఅల్చియ " అను నక్షరములతో నేర్పడుచున్నది ఇప్పటి పద్ధతిని గురు లఘు నిర్దేశము చేసినచోనిది 'జల'గణమగును. ఇది యింద్ర గణములలో నిదికాదు. ల్చి సంయుక్తాక్షరమైనను దానిని దేల్చి పల్కినచో నప్పు డిది నల గణమగుటయు, లక్షణానురోధ మేర్పడుటయు సంభవించును. ఆరోజులలో ల కార శ్లిష్టములైన సంయుక్తాక్షరములను గొన్నిచోట్లఁ దేల్చిపల్కు నాచారముండెనని తోఁచుచున్నది. యుద్ధమల్లుని బెజవాడశాసనమందలి మధ్యాక్కరలలో నొకపాదము మొదట గౌరగల్గా అనునక్షరములతోఁ గూడిన గణమున్నది ఇది సగమగును, సగమింద్ర గణములలోనిదికాదు. అందుచే నిచ్చట గణ భంగ మేర్పడినదని చెప్పవలయును. కాని ల్గా అను సంయుక్తాక్షరమును దేల్చి పల్కినచో నది నగమగును. లేదా అప్పుడు జల, సగములను రెండు పంచమాత్రాగణములు కూడ నింద్ర గణములుగాఁ బరిగణింపఁబడు చుండె నవియైనఁ దలంపవలయును. తమిళమునందలి నేర్ నిరై లను నక్షరములను బ్రస్తరించినచో నీ గణములు కూడ నేర్పడును.[3]

---

1. తెలుగుఁ కవుల చరిత్ర పుట 27.

2. " తలకొని తలఁబ్రాలు దంపెడు చోటఁ
దరుణులచే సొంపు దనరుఁ దరోజ " అష్టమోల్లాసము 50

8 ఈ విషయము "భారతములోని ఛందస్సు" అను ప్రకరణమునఁ జెప్పఁబడును.

సీస పాదమున నాలుగేసి గణముల రెండు దళము లుండుననియు, నొక విధముగా దానిని గూడ రగడభేదముగాఁ బరిగణింపవచ్చుననియు నిదివఱకుఁ జెప్పఁబడినది. ద్విపద పాదములను రెండింటిని గలిపినచో మొత్తమా ఱింద్ర గణములను రెండు సూర్యగణములను వచ్చును. అనఁగానొక సీస పద్య పాద మగును. కాని గణముల క్రమములో మాత్ర మించుక భేదమున్నది. ద్విపదలో మూఁ డింద్ర గణముల తరువాత నొక సూర్యగణమువచ్చును. సీసమున నా ఱింద్ర గణములను వరుసగా రావలెను. దాని కనుగుణముగా ద్విపదలలోఁ గొంతమార్పుచేసి వానినొక సీసపాదముగాఁ జేయుట కంత కష్టపడవలసిన యవసరములేదు. ఏడవదైన యింద్రగణమున నొండు రెండు మాత్రలను దగ్గించి నాల్గవ దైన సూర్య గణమున కొండు రెండు మాత్రలు చేర్చినచో నీ మార్పు సంఘటిల్లును. అదిగాక ద్విప దలోవలె రగడలోఁగూడ మాత్రాసంఖ్యా నియమముతో సంబంధములేని నాలుగు దేశీయ గణము లుండునని చెప్పినచో నదియు నొక రగడ భేదమే యగును. దానిని రెట్టింపు చేసినచోఁ దరువోజ యేర్పడును గావున నిదియొక విధముగాఁ బాదమున కెనిమిదేసి గణములతోఁ గూడిన హరిగతి రగడను బోలి యుండునని చెప్పవచ్చును. 1

యుద్ధమల్లుని బెజవాడ శాసనములో నైదు పూర్తి మధ్యాక్కర లున్నవి. ఈ యక్కరలు పంచప్రకారములుగ నుండును. కన్నడమునఁగూడ నీ యైదు విధములైన యక్కర లున్నవి. ఈ రెండు భాషలందలి యక్కరలలో సాదృశ్యమే యెక్కువగా నున్నను గొంతభేదము కూడ లేకపోలేదు. రెం డక్కరలకుఁ బేర్లలో వ్యత్యాసము గోచరించుచున్నది.

| తెలుఁగు | గణములు | కన్నడము |
|---|---|---|
| 1 మహాక్కర | 7 | పిరియక్కర |
| 2 మధ్యాక్కర | 6 | దొరెయక్కర |
| 3 మధురాక్కర | 5 | నడువణక్కర |
| 4 అంతరాక్కర | 4 | ఎడెయక్కర |
| 5 అల్పాక్కర | 3 | కిరియక్కర. |

1. శ్రీరామాకుచకుంకుమ పంకము
చేఁబొలుపగు విపులోరః ఫలకము. హరిగతిరగడ.

తెలుఁగున రెండవది మధ్యాక్కర. కన్నడమున దీనితో సమానార్థకమైన పేరు మూఁడవ యక్కరకున్నది. పరిశీలించి చూచినచోఁ గన్నడమునందలి పేర్లే యెక్కువ సార్థకముగా నున్నట్లు కనఁబడును. గణముల సంఖ్యనుబట్టి చూచి నచో మూఁడవది సరిగా మధ్యనున్నది. అందుచేఁ గన్నడమున దానికి నడువణ క్కరయను పేరుకల్గినది. తెలుఁగున నీ యర్థముగలపేరు రెండవయక్కరకేల వచ్చినదో తెలియదు. సరిగా యతి మూఁడు గణముల తరువాత (అనఁగా నాఱు గణములు గల పాదములలో నడుమ) నుండుటచే దీని కీ పేరు వచ్చినదని చెప్పవచ్చును గాని ప్రాచీన కాలమున యతి యైదవ గణము మొదటనే కాని నాల్గవ గణము మొదట వేసెడి వారు కారు. కన్నడమున దీనికి దొరె యక్కరఁ యని పేరు. ఈ మాటకు సమాన భాగములు గల అక్కర యని యర్థము మధ్యాక్కర (కన్నడ దొరె యక్కర) పాదమును సమాన గణములు గల రెం డర్ధములుగా విభజింపవచ్చును. అందుచే దానికి దొరె యక్కర యను పేరే సార్థకమై యుండును.

నన్నయ 39 మధ్యాక్కరలను ఒక మధు రాక్కరను వాడియుండెను తిక్కన అక్కరలను వాడనే లేదు. ఎఱ్ఱా ప్రెగడ అరణ్య పర్వ శేషమునఁ గొన్ని మధ్యాక్కరలున్నవి. తరువాతి కవులెవ్వరును వాని నుపయోగించి యుండలేదు. నన్నయ ఎఱ్ఱనల మధ్యాక్కరలకు గణముల విషయమున లక్ష ణము సమానముగానే యున్నది కాని యతి విషయమున నించుక భేదమున్నది నన్నయ ఐదవ గణము మొదట యతి నిల్పఁగా నెఱ్ఱన నాల్గవ గణము మొదట యతి వేసి యుండెను. కవిజనాశ్రయకారాదు లగు లాక్షణికులు కూడఁ జతుర్థ గణాద్యక్షరమునే యతి స్థానముగా నిరూపించిరి. బహుశః ఈ మార్పు నన్నయ తరువాత వచ్చియుండును. ఎఱ్ఱన కవిజనాశ్రయ మతము ననుసరించి యుండును. అదియును గాక శ్రుతి సుభగత్వమును బట్టి చూచినచో యతి యైదవ గణము మొదటఁ గాక నాల్గవ గణము మొదట నుండుటయే యుచిత ముగాఁ గన్పించును. యతి స్థాన విషయమున నన్నయ అక్కరలకును బెజవాడ శాసనము నందలి అక్కరలకును సాదృశ్య మున్నది. వానిలోఁ గూడ నైదవ గణము మొదటనే యతి కన్పించుచున్నది.

శాసనములో నున్న లిపి క్రమము ననుసరించియే చూచినచో నీ మధ్యా క్కరలలోఁ గొన్ని చోట్ల గణభంగము గోచరించుచున్నది. సూర్యగణ మంద

వలసిన చోట గగ, స, జగణములును ఇంద్ర గణములుండ వలసిన చోట్ల నగ (బెజవాదం)మ(భక్తుణ్డై) జగ (ఫలంబుపే) యల (సుతుండొణ్డు) జ (బయన్న) జల (బెడంగును) గణములను గానిపించుచున్నవి ఆధునిక లిపి క్రమము నను సరించి పై పద్యములను వ్రాసినచో నిందలి వ్యతిక్రమములు పెక్కు తొలఁగి పోవును.

| పంక్తి | శాసన లిపి | ఆధునిక లిపి |
|---|---|---|
| 3 | ∪∪ I I ∪I<br>మల్లు ణ్డన వద్య | ∪I I I ∪I<br>మల్లుఁ డన వద్య |
| 7 | ∪I ∪∪∪<br>వల్లభుణ్డర్ధిన్ | ∪I I ∪∪<br>వల్లభుఁ డర్ధిన్ |
| 7 | I I∪∪ I I<br>బెజవాదం గొము | I I∪I I I<br>బెజవాద గొమ |
| 8 | ∪∪ I I ∪∪∪<br>ర స్వామికి భక్తుణ్డై | I ∪I I ∪I ∪<br>రు సామికి భక్తుఁడై |
| 9 | ∪∪∪∪ I<br>ధాముణ్డె త్రిచ్చె | ∪I ∪∪ I<br>ధాము దెత్రించె |
| 10 | I ∪ I<br>మరంబు | I I I<br>మరము |
| 18 | I I∪ ∪∪ I I<br>నలియం బయ్వారల | I I I ∪ ∪I I<br>నలియఁ బై వారల |
| 20 | I∪ I ∪∪ I<br>ఫలంబు పేక్షించి | I I I∪∪ I<br>ఫల ము పేక్షించి |
| 24 | I I I I I ∪∪ I<br>త్రిణయణు సుతుణ్డొణ్డు | I I I I I I ∪ I<br>త్రిణయను సుతుఁదొందు |
| 27 | I ∪ I ∪I<br>బయన్న విచ్చు | ∪ ∪ I ∪I<br>బైయున్న విచ్చు |
| 27 | I I ∪∪∪∪ I<br>కని మల్లణ్డె త్రించె | I I ∪I ∪∪ I<br>కవి మల్లఁ దెత్రించె |
| 29 | I∪ I ∪<br>మరంబు నుం | I I I I<br>మరమును |
| 38 | I∪ I I<br>బెడంగును | I I I I<br>బెడఁగును |
| 38 | ∪∪ I I ∪I<br>గాను న్దమ శాత | ∪I I I ∪I<br>గాను దమ శాత |
| 40 | ∪∪ ∪∪ ∪<br>దానుం గట్టించెం | ∪I ∪∪ I<br>దాము గట్టించె |

| | | |
|---|---|---|
| 41 | I ∪ I I<br>క్రమంబున | I I I I<br>క్రమమున |
| 43, 44 | మల్లుఙ్డె త్తించె | ∪I ∪ ∪ I<br>మల్లుఁ డె త్తించె |

ఇట్లు వ్రాసినను లక్షణమునకు విరుద్ధముగా నున్న పదములు కొన్ని కాన వచ్చుచున్నవి. (అర్థిన్, కొమరు స్వామికి, గొరగల్గా.) అర్థిన్ అను దాని వర్ధి యనియు, కొమరు స్వామికి అను దానిని కొమరు సామి కనియు, దిద్ది వ్రాసి యున్నారు. ఉన్నవాని నున్నట్లు చూచినచో నచ్చట సూర్య గణములు కాక గగ సగణములు వచ్చుటయే యవి యట్లు దిద్దఁ బడుటకుఁ గారణము. కాని కన్నడ మున గగ, సగణములు కూడ బ్రహ్మ గణములుగాఁ బరిగణింపఁ బడుచున్నవి అందలి బ్రహ్మ విష్ణు రుద్ర గణములకును మన సూర్యేంద్ర చంద్ర గణముల కును జాలవఱకు సామ్య మున్నది. అందుచే సూర్య గణమునకు బదులు బ్రహ్మ గణ ముండ వలెనని మన మనుకొన్నచోఁ బై పాదము లందు లక్షణము సరి పోవును. కొమరు స్వా మికి అనుచోట స్వానూది పల్కక తేల్చి పల్కినచో కొమరు అనునది నగణమే యగును గావున నప్పుడు లక్షణ విరోధమే యుం డదు. గొరగల్గా అను చోట ల్గాను దేల్చి పలుకవలయును. అప్పు డా గణము సగము కాక నగ మగును, నగ మింద్ర గణమే కావున లక్షణ భంగ మగునేమో యను సందేహమే యుండదు. అద్దంకి శాసన మందలి తరువోజలోఁ గూడ గొఱల్చియ యను చోట విస్లే 'ల్చి' యనుదానిని దేల్చి పలుక వలె ననియు లేనిచో గణ భంగ మేర్పడు ననియు సూచించి యుంటిని. అట్లు కాక తమిళ కన్నడము లందలి దేశీయ గణములను గొన్నింటి నింద్ర గణములలోఁ జేర్చు కొన్నచో నట్లు తేల్చి పలుక వలసిన యక్కఱ యుండదు. ఏలయన నప్పుడు సగ, జలములు కూడ నింద్ర గణములలోఁ జేరుట సంభవించును.

ఇట్లు నన్నయకుఁ బూర్వ ముండిన శాసనములలో దేశీయ ఛందమునకు జెందిన తరువోజ, సీసము మధ్యాక్కర అను పద్యములు మాత్రమే కానవచ్చు చున్నవి. పంప సర్వదేవుల రచనలలోఁ గందములును, సంస్కృత వృత్తము లనుగూడ నుపయోగింపఁబడినవి. ఇవిగాక కొన్ని శాసనములలో వృత్త గంధి గద్యములని చెప్పఁదగిన భాగములు కానఁబడు చున్నవి. వామనుఁడు కావ్యాలం కార సూత్ర వృత్తిలో గద్యము వృత్త గంధి, చూర్ణము, ఉత్కలికాప్రాయము

అని మూఁడు విధములుగా నుండునని చెప్పి వానిని నిర్వచించియున్నాఁడు. అందుఁ బద్య భాగవంతమైనది (అనఁగాఁ బద్య భాగములతోఁ బ్రారంభమై వృత్త పాదమని తోఁపఁ జేయునది) వృత్త గంధి, అనావిద్ధలలిత పదము (అనఁగా దీర్ఘ సమాసములు లేని లలిత రచన) చూర్ణము. దానికి వ్యతిరేక మైనది. (అనఁగా దీర్ఘ సమాసములతోఁ గూడియుండు రచన) యుత్కలికా ప్రాయము. నన్నయ భారత భాగమున నీ మూఁడు రకములైన గద్యలను జూపవచ్చును.

ఆధునిక కాలమున గద్యమన్నను వచన మన్నను సమానమే. ఇవి యొండొంటికిఁ బర్యాయ పదములు ఛందో బద్ధత కాని పాద నియమము కాని లేకుండ భావ ప్రకటనమునకై మాత్రము కూర్పఁబడు వాక్యము నిప్పుడు మన మా పేర్లతోఁ బిల్చు చుందుము. పూర్వ మీ పదములు తాళలయాను గుణముగఁ జదువఁ దగిన పద పద్య రచనలకుఁ గూడఁ జెల్లుచుండెను ఇవి మాత్రా వృందము ననుసరించి నడచుచుఁ బాటగాఁ బాడుట కనువై యుండుటచే ఛంద శ్శాస్త్రముననే కాక సంగీతమునఁ గూడ వీనికి లక్షణము చెప్పఁబడుచుండెను. ఇవి పాద నియమము కలవి, పాద నియమము లేనివి యని రెండు రకములు. రగడ, కళిక, ఉత్కళిక మున్నగునవి పాదనియమముతోఁ గూడినవి. వీనిని గూడ నప్పుడు వచనముల వలెనే యఖండములైన పంక్తులుగా వ్రాయుచుండిరి. క్రీ. శ. 940 ప్రాంతమున నుండిన సోమదేవ సూరి యశస్తిలక చంపువులో ద్విరదగతి రగడ యొకటి వచన భేదముగానే ముద్రితమైనది. సోమనాథుని పంచ ప్రకార గద్య విజమున నుత్కళికా రూపమే యైనను వచనమువలె వ్రాయఁ బడు చుండుట పరిపాటి. కోరుమిల్లి శాసనమందలి రగడ కూడ నట్లే వ్రాయఁ బడినది. అది గాక వామనుఁడు గద్య భేదములలో నొక దాని నుత్కలికా ప్రాయ మని స్పష్టముగాఁ జెప్పియే యున్నాఁడు. వచనములు, గద్యలు మొద లైనవి పాద నియమము లేనివి. కన్నడ భాషలో బసవాదులగు శివభక్తులు పెక్కు వచనములను రచించిరి. బసవేశ్వరుఁడు రచించిన షట్‌స్థల వచన, కాలజ్ఞాన వచన, మంత్ర గోప్య వచనములు సుప్రసిద్ధము లైనవే. ఇవి పాటలవలెఁ బాడుట కనువుగా నుండును. ఇట్లే అక్కమహాదేవి, అల్లమప్రభువు, మోళిగ మారయ్య మున్నగు భక్తులు రచించిన వచనములెన్నో కలవు తెలుఁగున కృష్ణమాచార్యుఁడు (క్రీ. శ. 1300 ప్రాంతము) రచించిన సింహగిరి వచన

ములు, తాళ్ళపాక పెద తిరుమలాచార్యుఁడు రచించిన (1468—1553) వేంకటేశ్వర వచనములు, ఏగంటివారి వచనములు, చిలుకపాటివారి వచనములు మున్నగున విట్టివే. అనంతుఁడు ఛందోదర్పణమున వానినే యిట్లు నిర్వచించినాఁడు.

కనుఁగొనఁ బాదరహితమై
పనుపడి హరిగద్దెవోలె బహుముఖ రచనం
బున మెఱయు గద్యమది దాఁ
దెనుఁగుఁ గృతుల వచనమనఁగ దీపించుఁగడున్.

అన్నమాచార్యుఁడు సంకీర్తన లక్షణమున దీనినే తాళగంధి యని పేర్కొని యుండెను. ఇది గద్య భేదములలోఁ జూర్ణికకు సంబంధించినది కావున దీనికే తాళగంధి చూర్ణకమని మఱియొక పేరు [1]

నన్నయకుఁ బూర్వము కన్నడమున గద్య పద్య మిశ్రితములైన చంపూ కావ్యములు వెలసియుండెను. నన్నయయు నన్నిచోడుఁడును గూడ నా పద్ధతి ననుసరించియే తమకావ్యములను గద్య పద్య మయములుగా నొనరించిరి వారి గద్యలలో వృత్తగంధులు, చూర్ణికలు, ఉత్కలికాప్రాయములు కూడఁ గానిపించును. సరస్వతీ కంఠాభరణమున భోజుఁడు "యథాహి అటవీ వర్ణనాదౌ గద్యం ప్రగల్భతే" అని అడవి మున్నగువానిని వర్ణించుపట్లఁ బద్యముకంటె గద్యమే యుచితముగా నుండునని చెప్పియుండెను. ప్రాచీనులైన శిష్టకవులా యాలంకారిక వచనము ననుసరించియే కొన్నివర్ణనములను వచనములుగా వ్రాసియుండిరి. తిక్కన మాత్రము

"వచనము లేకయు వర్ణన
రచియింపఁగఁ గొంతవచ్చుఁ బ్రౌఢులకుఁ గథా.
ప్రచయము పద్యములన పొం
దుచితంబుగఁ జెప్పుటార్య లొప్పిద మవరే,

1. ధరఁగృష్ణాచార్యాదిక పరికల్పిత వదము తాళ బంధచ్ఛందో విరహితమై చూర్ణాఖ్యం, బరఁగునది నిరుక్త నామ భాసిత మగుచున్ ఛందోగణముల నియతిం బొందక తాళప్రమాణమునఁ గడుఁజెలువై కొందఱిచేఁ దచ్చూర్ణం, బందముగాఁ దాళగంధియని పొగడొందున్.

కీ శే ప్రభాకరశాస్త్రులుగారి వేంకటేశ్వర వచనముల పీఠిక.

అని వచనము లేకుండనే నిర్వచనోత్తర రామాయణము రచించియుండెను. మరల నతఁడు భారతమున మాత్రము గద్య పద్యమయమైన చంపూ పద్ధతినే యవలంబించి "మహా కవిత్వ దీక్షావిధి నొంది పద్యముల గద్యములన్ రచియించెదం గృతు" లని చెప్పియుండెను. ఈ గద్య పద్యమయమైన రచననే పాల్కురికి సోమనాథుఁడు "అరూఢ పద్య గద్యాది ప్రబంధ, పూరిత సంస్కృత భూయిష్ఠరచన, మానుగా సర్వసామాన్యంబుగామి" నని నిరసించి అంతము ద్విపదచ్ఛందోమయమైన కావ్యములను రచింపఁ బూనెను.

ఈ విధముగా నిప్పుడు మనము వచన మనియు గద్య మనియు భావించు రచనలకును గొందఱు పూర్వులు వ్రాసిన గద్యవచనములకును గొంత భేదము గోచరించుచున్నది. ఇప్పటివచనము విషయప్రధానమై చదువుటకు మాత్ర మనువైనది. పూర్వపు వచనము భావ వర్ణనాప్రధానమై పాడుటకుఁగూడ ననువై యుండినది. నన్నయాదులు రచించిన చంపూ కావ్యములందలి వచనములు కొంచె మించుమించుగా నిప్పటి వచనములను బోలినట్టివే. అవికూడఁ జదువుటకే కాని పాడుటకుఁ బనికిరావు. మన పద్య కావ్యములలోఁ గవు లాశ్వాసాంతములందు గద్యలు వ్రాసికొనుచుందురు ఇవి సంస్కృత సమాసభూయిష్ఠములై తాళబద్ధములై యున్నట్లు తోఁచును. వానిని గవులును నితరులును గద్యలనియేయందురు కానివచనములని పేర్కొనరు. గ్రంథాంతర భాగమునందలి ఛందోబద్ధములు కాని రచనలకు ముందు వచనమునకుఁ జిహ్నమైన వ అను నక్షరమే గోచరించుచుండును. తిక్కన పద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్ అను చోట గద్య శబ్దముచే నిట్టి వచనములనే యుద్దేశించి యుండెను కాని వీనిని వచనములనియే తఱుచుగా నందఱును బేర్కొనుచుందురు. ఆశ్వాసాంత గద్యలందుండు నంత గేయతార్హత లోపలి వచనముల కుండ కుండుటయే యీ నామ భేదమునకుఁ గారణమై యుండును.

గద్య పద్యోభయమైన కావ్యమును జంపు వందు రని దండి మున్నగు లాక్షణికులు చెప్పినను గన్నడమున నట్టి వానికి గద్యలనియే ప్రతీతి కలదని నృపతుంగుఁడు కవిరాజ మార్గములోఁ జెప్పిన యీ పద్యమునుబట్టి తెలియుచున్నది.

మిగెకన్నడ కబ్బంగళొ
ళ గణిత గుణగద్య పద్య సమ్మిశ్రితమం
విగది సువర్గద్యకథా
ప్రగీతియుం తచ్చిరంత నాచార్యర్కళ్.

ఇట్లనుటకు బహుశః గద్యములుకూడఁ దాళబద్ధములై పద్యములవలెఁ బాడుటకుఁ దగియుండుటయే హేతువై యుండును. ఈ యాచారము తెలుఁగునఁ గూడఁ గొన్ని చోట్లఁ గానఁబడుచున్నది. హరిభట్టుత్తరనార సింహ పురాణమునం దట్లే చెప్పినాఁడు. 1 లోకేరావు సోమన శివరాత్రి మాహాత్మ్యమును వచన కావ్యముగా రచియించితి నని తన బలభద్ర విజయమునఁ జెప్పుకొన్నాఁడు. అది పద్య కావ్యము. "అల శివరాత్రిమహత్త్వము తెలుఁగున వలనుగా వచన కావ్యమును జేసినాఁడ" నని యాతని వాక్యము (ఉదా. వా. చ. పు 61) ఇప్పుడు కావ్యములలోని గద్యములనుగాని వచనములను గాని తాళ బద్ధముగా గేయ రీతిని జదువు సంప్రదాయ మరుదైపోయినది. వానినిప్పుడు మనము సాధారణ వచన భాగములుగానే భావించుచుందుము

ఏ వాఙ్మయ మందైనను వచనముకంటెఁ బదమో పద్యమో ముందు వెలువడునను మాట సత్యమే. లిపి యేర్పడు నంత దనుక నది జనుల ముఖములందే యుండి క్రమముగా నా భాషయందలి సాహిత్యముగ్గా నేర్పడును. తరువాతఁ బద పద్యముల తోపాటు వచనము కూడ వర్ధిల్లును. ఈ వచనము పండిత ప్రణీత మగునప్పు డందు సప్రయత్నముగనో అప్రయత్నముగనో పద పద్య భాగములు చొచ్చు చుండును. అనఁగా గణనియమము లేని వచనమందు గణబద్ధములైన పద్య పాదములు కూడ నక్కడక్కడఁ గనఁ బడుచుండును. ఇట్టి గద్యమును వృత్తగంధి యని కాని పద్య గంధి యని కాని చెప్పవచ్చును.

శ్రీ నిడుదవోలు వేంకటరావుగా రాంధ్ర వచన వాఙ్మయ చరిత్రమున వృత్త గంధి కుదాహరణముగా భగవద్రామానుజ రచితమైన వైకుంఠ గద్యము నందలి భాగము నొసంగి యున్నారు. ఇందు వంశస్థ వృత్తము

---

1 "నవరసాలంకార బంధురంబుగా నొక ప్రబంధం బాంధ్రభాషావ్యం బగు వచన కావ్యంబుగా రచియింపం బూనిన సమయంబున"

నందలి యైదు పూర్తి పాదము లున్నవి.[1] వ్రాఁతలోఁ బద విభాగము చేయఁబడి పది కాని సంధులు కలిపి వ్రాసినచో దీనిని వంశస్థ వృత్తమే యనవచ్చును. నాలుగు పాదములతో నాగక యింకను గొనసాగుటచేఁ గాఁబోలు నిది గద్యగాఁ బరిగణింపఁ బడినది. నన్నయ భారతమునుండి వృత్తగంధి వచనముల కుదాహరణములుగా వా రొసంగిన వన్నియు నా యా వచనముల యారంభ భాగములే. మఱియు నందు "నన్నయ వచనమును బ్రారంభించు పట్టులఁ బద్యమువలెనే నడపించు' నని స్పష్టముగాఁ దెల్పఁబడినది. కాని నన్నయ వచనము లన్నియు నట్లు పద్య గమనముతో నారంభించు చుండుటలేదు. ఈయఁబడిన యుదాహరణములలో నొక్క గణములు మాత్రమే కొంత వఱకు సరిపోవుచున్నవి యతి విషయము పాటింపఁబడినట్లు లేదు.

అని నిశ్చయించి గొం-తిని మాద్రినింజూచి

మీరలిం దుండిన వయకహస్తి

పురమునకుం జని

ఇందు మొదటి యర్థమునఁ బ్రాస యతి వేయఁబడినది. రెండవ యర్థమున యతి లేనేలేదు.

క్రీ శే. గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారు రచించిన ప్రాఁదెనుఁగు కమ్మకూడ వృత్తగంధి సంప్రదాయముతోనే వ్రాయఁబడినది ఇం దాదినుండి తుదిదాఁక నేదో యొక పద్యము పాదము కానఁబడుచునే యుండును. ఒకచోట సీసపాదార్థము. తరువాత ద్విపద పాదము. పిమ్మట వరుసగాఁ గొన్ని ద్విపద పాదములు - ఈ విధముగా నా కమ్మయంతయు సాగినది. కొన్నిచోట్ల యతి నియమము పాటింపఁబడలేదు. కొన్నిచోట్ల నొండు రెండు మాత్ర లధికముగా నున్నవి. ఉదా:

---

1. ప్రిబుద్ధముగ్ధాంబుజ చారులోచనం
సవిభ్రమ భ్రూలతమ్-ఉజ్జ్వలాధరం
శుచిస్మితం కోమలగండమ్ ఉన్నసం
ఉదగ్ర పీనాంసవిలంబి కుండలా
లకావళీ బంధుర కంబుకంధరమ్.

సిరిఁదాల్చి, చేఁదొగిఁ జిన్నిచూ, డ్కాలఁజూచు,
తెనుఁగు చ,దువుల రచ్చ - తీర్పరు,లార.

ఇందు మొదటిది సీస పాదార్థము రెండవది ద్విపద పాదమువలె నున్నది కాని యొక మాత్ర యధికముగా నున్నది. ఈ ప్రాఁదెనుఁగు కమ్మను బట్టి చూడ వృత్తగంధి గద్యమున నేదో యొక పద్యమునడక యాద్యంతము గోచరించు చునే యుండవలెనని తోఁచుచున్నది. యతిప్రాసల నియమము యథా సంభవముగాఁ బాటింపఁబడును. వాని విషయమున నియతమైన పద్ధతి కానరాదు.

కీ. శే. కందుకూరి వీరేశలింగం పంతులుగారు శుద్ధాంధ్ర భారత సంగ్రహము ముఖ పత్రమున

శ్రీరస్తు
శుద్ధాంధ్ర భారత సంగ్రహము
వినుఁడి

ఇది
చెన్నపురిని మిగుల
వాసినిగన్న కొల్లా సుబ్బరాయలు సెట్టియు
గురుసామిసెట్టియు నను

ఇత్యాదిగా నొక సీసపద్యమును వ్రాసియున్నారు. పాద విభాగ పూర్వకముగా వ్రాసినచో నిది సలక్షణమైన సీసపద్యమే. కాని యిది సాధారణముగా వచన ముందుచోట వ్రాయఁబడినది. ఇట్లే కీ. శే. మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నం పంతులుగారి బిల్వేశ్వరీయమున

శ్రీరస్తు
బిల్వేశ్వరీయము
విషయసూచిక
పీఠిక
కథాముఖము

ఇత్యాదిగా నూటయెన్మిది సీసపాదములును నొక తేటగీతియును వ్రాయఁ బడినవి. ఇవన్నియు సర్వలక్షణ సంపన్నములైన సీసపాదములే. వీనిని గూడఁ బై వీరేశలింగం పంతులుగారి పద్యమునువలెఁ బద్యములే యన వలెను గాని వృత్తగంధు లనుటకు వీలులేదు.

పైని వృత్తగంధి వచనమున కీఁబడిన యుదాహరణము లన్నియుఁ బద్య పద గంధులుగానే యున్నవి కావి వృత్తగంధులుగా లేవు. ఏలయన నం దిమిడియున్న పాదములలో నొక్కటియు వృత్తపాదములేదు. శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు ఛందస్సాహితీ రీతులను వ్యాసమున "గద్యము పద్యభాగమువలె వృత్తగంధియై యుండుట యనఁగానేమో సంస్కృత కవితా రచనలనుబట్టి తెలిసికొనుట సాధ్యమగునో కాదో. కాని దేశీయములగు శ్రీరం పాటలు మొదలగు వానిలోని కందార్థము లనఁబడునవి వీని క్రిందఁ జేరవచ్చును. ఇవి ముందు కందాది పద్యముల ధోరణికల్గి తరువాతఁ బాటగా మాఱుచుండుట గలదు. ఈ క్రింది పాటలోని పద్య ముత్పలమాలగా నున్నది.

శ్రీమధురాధరీ వినవె శేషగిరీ శుఁడ నీదుకేళికా
ధామమునందు నింతవడి దర్పకలీలల నుండి యంతటన్
వేమరువేఁట లాడఁజని వేగమె వచ్చితి తల్పుతీయవే
భామా సద్గుణా గుణాధామా లావణ్యాచతురాసీమా
అలమేలుమంగానామా.

ఇట్టి దేశీయరచనలను బట్టి యీ విభాగము చేయఁబడినదా యను సందేహము కలుగక మాన" దని వ్రాసి యున్నారు దీనినిబట్టి వృత్తగంధి యనఁగాఁ బాట లలో ముం దేదో వృత్తమునకుఁ జెందిన పాదము లుండవలె నని తేలుచున్నది.

వామనుఁడు కావ్యాలంకార సూత్రవృత్తిలో వృత్తగంధిని ( పద్యభాగ వత్ ) పద్యభాగవంతమని నిర్వచించెను. దీనికిఁ బద్యభాగములుగల గద్యము వృత్తగంధి యనఁబడునని యర్థము. ఆ పద్యభాగము మొదటనే యుండవలెనని కాని, ఆద్యంతము నుండవలెననికాని యిందుఁజెప్పఁబడి యుండలేదు. అందుచే నెక్కడనైన సరే గణ బద్ధములైన పద్య పాదములు గోచరించినచో నట్టి గద్యను బద్యగంధి లేక వృత్తగంధి యని చెప్పవచ్చునని తోఁచుచున్నది. నన్నయకుఁ

బూర్వమందలి కొన్ని శాసనములలో నీ విధముగా వృత్తగంధులని చెప్పఁదగిన వచనములు కొన్ని గోచరించుచున్నవి. మిగిలినవి విషయ ప్రధానములై యిప్పటి మన వచనములనే పోలియున్నవి. అవి తాళబద్ధములై యున్నట్లును గనఁబడదు; వానిని బాడుటకు వీలున్నట్లును దోఁపదు.

1. పుణ్యకుమారుండు గణ్య మానుండు -
ఎరికల్ ముత్తురాజు పుణ్య కుమారుని తిప్పలూరి శాసనము
ఇది ద్విపద పాదము. ప్రాసయతి వేయఁబడినది.

2. విరిప త్తి (ఱితి) కమ్మరి వినియన వ్రాసె.
పుణ్య కుమార చోళ మహారాజు రామేశ్వర స్తంభ శాసనము.
ఇదియును ద్విపద పాదమే. యతి సరిగా నున్నది.

3. i శ్రీ మహేన్ద్రన్ మాన రవి మాఱు రా పిడుగు
ఇందుఁ బంచ మాత్రాకములైన నాలుగు గణము లున్నవి.
ఇది ద్విరదగతి రగడ పాదము. యతి లేదు.
ii మగడు, పుదలి, యేలు, వాఁడు, కాపి, బోళ, ముత్త, రాజు
ఇందు నాలుగేసి సూర్య గణములతో (త్రిమాత్రా గణములతోఁ గూడిన) రెండు దళము లున్నవి. యతి లేదు. తురగ వల్గన రగడ పాద మగును
iii అచ్చెర్వు గనునరి వరజముం దన్వాదు
దన్తియమంగుతో (ఙన్) పొడుచి పడియె (న్) :—
(రెండవ మహేంద్రుని బూడిద గడ్డపల్లి శాసనము)
కొంచెము మార్పుతో నిది సీస పద్య పాదమువలెఁ గనఁ బడుచున్నది. యతులు లేవు.

పుణ్య కుమారుని పొట్లదుర్తి మాలెపాడు శాసనమున ద్విరద గతి రగడ గర్భితమై యున్నదని మొదటి పరిశోధన పత్రికలో శ్రీ దేవరపల్లి వేంకట కృష్ణారెడ్డిగారు వ్రాసి యున్నారు.

అణపోతులు రేవణకాలు పుద్దణకాలు
ఇచ్చిన పన్నస పెన్పార ఇశెరేవికిన్.

ఇందుఁ బాదమున కిరువదేసి మాత్ర లున్నవనియు మొదటి పాదమునఁ బ్రాస యతియు (అణ - ద్దణ) రెండవ పాదమున సమాక్షర యతియు వేయఁబడిన

వనియు (౩ - ౩) యతిస్థానములు సమస్థానములో నున్నవనియు వారు వ్రాసి యున్నారు. ఇం దిరువదేసి మాత్రలున్న మాట నిజమే కాని యైదేసి మాత్రల గణము విఱుగుటలేదు. (ఇచ్చిన పన్నస). గణములు తాళానుగుణముగాఁ బంచ లఘువులతో లేవనివారే వ్రాసి యున్నారు. ఇట్లు విఱుగ కుండుట సంప్రదాయమునకు విరుద్ధము. యతులు సమస్థానము లందున్నవని వారు వ్రాసియుండిరి. నిజమున కవి సమస్థానములలో లేవు. మొదటి పాదమున 15 మాత్రల తరువాతను రెండవ పాదమున 13 మాత్రలు తరువాతను యతి వేయఁ బడినది. లక్షణము ననుసరించి మూఁడవ గణము మొదట యతి యుండవలెను. ఇం దాద్యంత ప్రాసలు లేవు. ఈ విధముగా నిందొక్క మాత్రా నియమము తప్ప పతే ద్విరదగతి గతి రగడ లక్షణమును గాన వచ్చుటలేదు. కేవల మాత్రల లెక్కను బట్టియే చూచినచో మనము వ్రాయు ప్రతి వచన భాగము నందు నేదో యొక పద్య పాదమును జూప వచ్చును. అందుచే నిది ద్విరదగతి రగడ యని చెప్పుట యుక్తము కాదు. ఐదేసి మాత్రలకు గణము విఱుగ కుండుటచే నిది వృత్త గంధి యనియైనఁ జెప్పుట కవకాశము లేదు.

5. వక్రంబు వచ్చిన - వార్వారణాసియు (వారువా)
శ్రీ పర్వతంబు వ్ర-చ్చిన రేమయ్య శాస. S I I X 593.
ఇందు సీస పద్య లక్షణము సరిపడు చున్నది.

6. i ప్రభు చోల రట్టోడి - పరహితుఁ డితఁడు.
ఇది ద్విపద పాదము.

11 కట్టించె కనికపొం - పట్టంబు హఱులుగు
కొపినేపల్లి శాసనము. S I I X 598.
ఇది సీస పాద పూర్వార్ధము.

7. దేవస్వంబు లంచము గొన్నవాఁడు వార
ణాసి వ్రచ్చిన పాపంబు గొన్నవాఁడు

యతిలేదు కాని యివి రెండును దేటగీతి పాదము లనుటకుఁ దగి యున్నవి. దేవస్వంబుఅన్నప్పుడు స్వనూది పలుకక తేల్చిపలుకవలెను.

(పెద్దముడియం శివాలయ శాసనము. (S. I. I· X 611)

8\. ఏవియు తోగొన్నవాఁడు విచ్చినవాఁడు
చెడువాఁడు క్రొచ్చినవాఁడు వెంట
యతులులేని సీసపాదము. (S. I. I. X 612)

9\. వెంకయబోదుని దొంగలసాని కనుమశాసనములో మహాక్కర యున్నదవి శ్రీ ముట్లూరి వేంకటరామయ్యగారు త్రిలింగ రజతోత్సవ సంచికలో వ్రాసి యున్నారు. మహాక్కరలోఁ బాదమునకు 1 సూర్యగణము 5 ఇంద్రగణములు 1 చంద్రగణము రావలెను. రెండునాల్గుచోట్ల సూర్యగణమైన రావచ్చును. ప్రాస యుండవలెను. యతి యైదవ గణము మొదట.

1 2 3
వెంక-యాచో ష్ట-మహరాజు-తెంకణా
4 5
దిత్యుండు-కొమరుర-భీముండు పుసి
ఇల్ల-దాష్టమీ-ధర్మమా-చందార్క-
తారకం, బునువార్ధి-లుచునుండు.

ఇందు గణములు కొంతవఱకు సరిపోవుచున్నవి. మొదటి పాదమునందలి చంద్రగణమున నొకమాత్ర హెచ్చుగను రెండవ పాదమునందలి చంద్రగణమున నొకమాత్ర తక్కువగను గనఁబడుచున్నవి. యతి మొదటి పాదమువ నాల్గవ గణము మొదట వేయఁబడినది (వెంక-తెంక) అది ప్రాసయతి. అది లక్షణమునుబట్టి యైదవగణము మొదట నుండవలెను. రెండవ పాదమున యతి లేదు. ప్రాస కూడలేదు. అందుచే దీనివి మహాక్కర యనుటకంటె నా పాదములున్న వృత్తగంధి వచనమనుట యుచితము.

10\. జయసింహ వల్లభుని విప్పర్తి శాసనము (S. I. I. VI 585) పద్యమయమువలెఁ గన్పట్టుచున్నది కాని యందేపద్యమున్నదో తెలిసికొనుట కవకాశములేకున్నది. కాని

హతకపుత్రకముని యా శ్రీ శిలావిశా
లవిపుల

అనుచోట సీసపద్యచ్ఛాయ తోఁచుచున్నది.

11\. బెజఇత్త భటరళ విళ్పినదత్తి

కడల్దల ఇళరయ విల్పినగుడియు

కపిలేశ్వరపురపు శాసనము. (శ్రీ వేంకటేశ్వర. Vol V నెం 2 పుట 41-52) యతి ప్రాసలు లేని ద్విపదములివి. కడల్దల అనుచోట ల్దను దేల్చి పలుకవలెను.

2. i శ్రీ విక్రమాదిత్య-నృపాగ్ర తనయుఁడైన
చాళుక్యభీమునకు-శౌచ కందర్పునకు
వేగీశ్వరునకు-రణమర్దాన్వ యకులతిల
కుండైన కుసుమాయు-ధుండు గన్నరబల్ల
హునికి సంప్రాప్తమై-నరనమర్దక శ్రీ
మదన భుజవీర్యబల- పరాక్రమమున దచ్చి
కణ్ఠియంగట్టి పట్టంబెత్తి ఖడ్గ

ఈ యేడు పాదములందును ఐదేసిమాత్రలుగల నాలుగేసి గణములున్నవి. కావున ద్విరద గతి రగడ పాదములుగాఁ గవవచ్చును. మూఁడు పాదములలో యతిపరిపోయినది. ఆద్యంత ప్రాసములు లేవు.

ii కొరవి వల్లజెఱియ-కొడుకు పెద్దన్న (న)
రావించినీవునా-ప్రాణసమాను
ఇవి యతికూడ సరిపడిన ద్విపద పాదములు. ప్రాసలేదు.

iii శ్రీ కెల్లఁదానయ ఈకుఁడై చేకొని
విల్చిభీమ సలుకి యం దనేక

సీసపాదము. యతిలేదు.

13. దీవి వడపక నడ్పి (డిపి)- రేవి యఖువది వే
లేండ్లు స్వర్గమ్మున నుండఁగాంత్రు.

సీసపాదము. (ఏడువాడల పాలెపు శాస.)

పైని సూచించిన పద్యము లన్నియు జాతులకుఁ జెందినవే కాని వృత్తములకు సంబంధించినవి కావు. జాతులన్నియు మాత్రా గణ బద్ధములే. కావున నందలి గణములు పద్య పాదక్రమమున వచనములోఁ గూడఁ గానఁబడుట కవకాశమున్నది. అందుచేఁ బై పద్య పాదములలోఁ గొన్ని యాదృచ్ఛికముగా సరిపోయినవి కూడఁ గావచ్చును.

ఇప్పు డమహద్వాచకముల ప్రథమైక వచనముల చివర ము, మ్ము, ంబు అను ప్రత్యయములు కనవచ్చుచున్నవి. ప్రాచీనకాలమున నీ ప్రత్యయము బిందు రహితమై బు రూపమునఁగూడ నుండెడిది. వనబు, సిద్ధాయబు, వక్రబు మరబు, నాగబు మొదలైన శాసనస్థములైన రూపము లిందుకుఁ దార్కాణము దీనినిబట్టి బు అను రూపమే క్రమముగా మ్ము, ము అను రూపములుగాఁ బరిణమించినదని తెలియుచున్నది. బిందు రహితమైన బు తోఁ గూడిన రూపములు నన్నయ భారతమందుఁగాని తరువాతఁగాని కానరావు. తెలుఁగున పు ఫు బు భు లకు విభక్తి ము కారముతో యతిచెల్లును. దీనికి ము విభక్తిక యతి యని పేరు. ముకార యతి యను పేర విం కొక యతి కూడఁ దెలుఁగున నున్నది. దీనివిబట్టి పద మధ్యముకారమునకును పు ఫు బు భు లకును గూడ యతి చెల్లును. ఈ యతి నన్నయ వాడలేదు తరువాత నేర్పడినది. విభక్తి ముకారమునకే పు ఫు బు భు లతో యతి చెల్లుటకుఁ గారణము అది యంతకుఁ బూర్వము బు అను రూపమును గలిగియుండుటే పద మధ్య ముకారమునకును బుకారమునకును ఎట్టి సంబంధమును లేదు. ము విభక్తిక యతి సామ్యముచేఁ దరువాత ముకార యతి కూడ నేర్పడినది. దీనినిబట్టి ము విభక్తికయతి ప్రథమా విభక్తి-ప్రత్యమము బు రూపముతో నుండిన కాలమున (అనఁగా నన్నయకుఁ బూర్వమే) నేర్పడినదని స్పష్టమగుచున్నది. ఇది నన్నయకుఁ బూర్వ ముండిన యొక యతి భేదమును దేటతెల్ల మొనరించుచున్నది

కవిజనాశ్రయ కర్త గురువైన వాదీంద్ర చూడామణి యొక ఛందస్సు వ్రాసినట్లు కనఁబడుచున్నది. కవిజనాశ్రయమందును నాగవర్మ ఛందోఽంబుధి యందునుగూడ జయ దేవాదుల ఛందోగ్రంథములు పేర్కొనఁబడినవి గుణగవిజయాదిత్యుఁ డొక ఛందో గ్రంథమును వ్రాసినట్లు యాప్పిరుంగలమ్ కారికై వలనఁ దెలియు చున్నది. ఈ ఛందో గ్రంథములు కొన్ని తెలుఁగున కును గొన్ని కన్నడమునకును సంబంధించి యుండవచ్చును. అవి యే భాషకు సంబంధించినవైనను నన్నయకుఁ బూర్వము వెలసినట్టివే. కాని యవి యేవియు నిప్పుడు లభ్యములు కామిచే నన్నయకుఁ బూర్వమందలి ఛందస్సును గూర్చి యెఱుంగుట కే విధముగను దోడ్పడఁ జాలకున్నవి.



# 5 మార్గదేశీ కవిత్వములు

సంస్కృత లాక్షణికులు కాని కవులుకాని కవిత్వమున మార్గదేశీ విభేదములను పాటించినట్లు కనఁబడదు. సంగీత శాస్త్ర గ్రంథములందు మాత్రము తత్కర్తలు సంగీతమును మార్గమని దేశియని యిరు తెఱఁగులుగా విభజించి యుండిరి. ఆ సంప్రదాయమును బట్టి కన్నడ కవులును, వారినిబట్టి నన్నెచోడుఁడును గవిత్వమునఁగూడ నీ భేదములను బ్రవేశపెట్టి యుందురు. అందుచేఁ గవిత్వమునకు సంబంధించిన వీని స్వరూపమును గుర్తించుటకు సంగీత శాస్త్రములోఁగల తల్లక్షణములను బరికింప వలయును. సంగీత రత్నాకరమున వాని భేద మిట్లు చెప్పఁబడినది.

"గీతం వాద్యం తథా నృత్తం త్రయం సంగీత ముచ్యతే
మార్గో దేశీతి త ద్ద్వేధా తత్ర మార్గ స్స ఉచ్యతే
యో మార్గితో విరించాద్యైః ప్రయుక్తో భరతాదిభిః
దేవస్య పురత శ్శంభో ర్నియతో భ్యుదయ ప్రదః
దేశే దేశే జనానాం య ద్రుచ్యా హృదయ రంజకం
గీతం చ వాదనం నృత్తం త ద్దేశీ త్యభిధీయతే."

దీనిని బట్టి బ్రహ్మాదులచే మార్గితమై (అన్వేషింపఁబడి స్థాపితమై) యీశ్వరుని సమక్షమున భరతాదులచేఁ బ్రయోగింపఁ బడినది మార్గమనియు, నా యా దేశములందు జనులకు రుచిచే హృదయ రంజకమగునది దేశి యనియుఁ, దెలి యుచున్నది. ఆ గ్రంథముననే శార్ఙ్గదేవుఁడు మార్గ దేశి రాగములకుఁగల భేదమును వివరించుచు

"యేషాం శ్రుతిస్వరగ్రామజాత్యాదినియమో న హి
నానాదేశగతిచ్ఛాయా దేశీరాగా స్తు తే మతాః
కామచారప్రవర్తిత్వం దేశీరాగస్య లక్షణం
నియమే తు సతి తత్ర మార్గత్వ మనులక్షితమ్"

అని చెప్పి యున్నాఁడు. దీనిని బట్టి నియమరహితమైన కామచార ప్రవర్తిత్వ మును దేశానుగుణప్రవృత్తియు దేశీరాగముల లక్షణమనియు, నియమ సాహిత్య మును, సర్వదేశ సమానరూప శాలిత్వమును మార్గరాగముల లక్షణ మనియు విశదమగుచున్నది కాశీనాథుఁడు కూడ సంగీత సుధాకరమున నీ భావమునే వెల్లడించి యున్నాఁడు [1] దేశినిగూర్చి చెప్పుచుఁ బలువురు సంగీత శాస్త్ర కర్తలు లోకజన రంజనమును దాని ప్రధాన లక్షణముగా వ్రాసిచ్చి యున్నారు. సంగీత దర్పణమున నా యా దేశములందలి రీతులచే లోకాను రంజన మొనర్చుట దేశి లక్షణమని చెప్పఁబడియున్నది. [2] రామయామా త్యుఁడు స్వరమేళకళానిధిలో " దేశీరాగాదిభిః ప్రోక్తం తద్గావం జనరంజన " మ్మని నుడివిన వాక్యమును, " దేశే దేశే జనానాం యద్రుచ్యా హృదయ రంజన " మ్మను సంగీత రత్నాకరము నందలి శార్ఙ్గదేవుని వాక్యమును నీ భావమునే వెల్లడించు చున్నవి. ఇచ్చట లోకజన శబ్దములు సామాన్య జనతా సూచకములు. పండితులైనవారు దేశిసంగీతమునువలె నియమసహితమును శాస్త్ర బద్ధమునైన మార్గ సంగీతమును గూడ నాస్వాదించి యానందింపఁ జాలుదురు సామాన్య జను లట్లు కాదు. వారు శాస్త్ర జ్ఞాన హీనులగుటచే హృదయ రంజక మైన దేశిసంగీతమునువలె బుద్ధిరంజకమైన మార్గ సంగీతము నాస్వాదింపఁ జాలరు. ఈ యుద్దేశము తోడనే పై శాస్త్ర కర్తలందఱును దేశి సంగీతము నకు జనలోక హృదయరంజకత్వమును ముఖ్య లక్షణముగాఁ జెప్పియుందురు

శార్ఙ్గదేవుఁడు సంగీతరత్నాకరమునందలి ప్రబంధాధ్యాయమున సంగీత మును రెండురకములుగా విభజించి యందు మార్గమునకు గాంధర్వమనియు, దేశికి గానమనియు నామాంతరములు సూచించెను. [3] ఆ శబ్దములకు వ్యాఖ్యానము వ్రాయుచుఁ గల్లినాథుఁడు"గాంధర్వం మార్గః,గానంతు దేశీ త్యవగంతవ్య"మ్మని

---

1. " అథునా గీయతే య చ్చానియతం కామచారతః
దేశే దేశే ప్రచలితం తత్సర్వం దేశిసమ్మతమ్ '

2 తత్తద్దేశస్థ యా రీత్యా యస్మా ల్లోకాను రంజనం
దేశే దేశే తు సంగీతం తద్దేశీ త్యభిధీయతే

3. గాంధర్వం గాన మి త్యస్య భేదద్వయ ముదీరితమ్

తెలిపి యుండెను. ఈ నామములనే శార్ఙ్గదేవు ననుసరించి రామయామాత్యుఁడు కూడ వాడియుండెను. శార్ఙ్గదేవుఁడు గాంధర్వ మనాదిసంప్రదాయమని కూడ నిర్వచించెను. " అనాది సంప్రదాయ మిత్యనేన గాంధర్వస్య వేదవ దపౌరుషేయత్వ మితి సూచితం భవతి " యని కల్లినాథుఁడు దానికిఁ జేసిన వ్యాఖ్యానము. దీని ననుసరించి గాంధర్వము లేక మార్గ మనాది కాలమునుండి వచ్చుచున్నదనియు, నపౌరుషేయ మనియుఁ దెలుచున్నది. "యో మార్గితో విరించాద్యైః ప్రయుక్తో భరతాదిభిః" అన్న శార్ఙ్గదేవుని వాక్యము నందలి భావము కూడనిదియే.

గాంధర్వము (మార్గము) లక్షణాను రోధముగాఁ బ్రయోగింపఁబడును[1] అనఁగాఁ బూర్వ సిద్ధములైన లక్షణముల నుల్లంఘింపక యది ప్రాఁత మార్గమునే యనుసరించును అందుఁగ్రొత్త పోకడలకుఁ దావు లేదు దేశి సంగీతమట్లు కాదు. అది లక్ష్యప్రధానమైనది. అనఁగా దీనికిఁ బూర్వసిద్ధమైన స్థిరలక్షణ మేదియు నుండదు. ఆయాదేశము లందలి జనులు తమ యభిరుచుల ననుసరించి భిన్నభిన్న విధములుగా దానిని బాడుకొందురు. శార్ఙ్గదేవుఁడీ విషయమునే

"యద్వా లక్ష్యప్రధానాని శాస్త్రాణ్యేతాని మన్వతే
తస్మా ల్లక్ష్య విరుద్ధం యత్తచ్ఛాస్త్రం నేయ మన్యథా"

అని సంగీత రత్నాకరమునఁ జెప్పియుండెను ఇచ్చట "ఏతాని శాస్త్రాణి" అను పదములను గల్లినాథుఁడు "దేశీవిషయాణీత్యర్థః" అని వివరించి యుండెను. దీనిని బట్టి మార్గమున లక్షణము బలవత్తరమనియు, దేశిలో లక్ష్యము బలవత్తర మనియు విదితమగు చున్నది. దేశి పద్ధతిలో లక్ష్యలక్షణములకు వైరుద్ధ్యము కలుగుచో లక్ష్యమును బట్టియే లక్షణమును సవరించు కొనవలెను.

పైచర్చను బట్టి సంగీతము నందు మార్గదేశి పద్ధతులకుఁగల ప్రధాన భేదముల నీ విధముగా సంగ్రహింప వచ్చును

1. మార్గసంగీతము నియమ సహితమైనది. దేశి కామచార ప్రవృత్తితోఁ గూడినది. అనఁగా స్థిరమైన నియమము లేనిది.

---

1. "తత్ర లక్ష్యానురోధేన గాంధర్వం సంప్రయుజ్యతే' (స్వరమేళ కళానిధి)

2. మార్గ సంగీతము బ్రహ్మచే మార్గితమై భరతాది మహర్షులచేఁ బ్రయోగింపఁ బడినది. దేశీ సంగీతమట్లు కాక యా యా దేశములందలి ప్రజలచే రుచ్యను గుణముగా నాదరింపఁ బడునది.

3. మార్గము విద్వద్రంజకమైనది. దేశి సామాన్య జనరంజన దక్షమైనది.

4. మార్గ మనాది సంప్రదాయ సిద్ధమైనది[1] దేశి నూతనమైనది.

5. మార్గము లక్షణప్రధానమైనది. దేశి లక్ష్యప్రధానమైనది.

మార్గ శబ్దము మృగ్ (వెదకుట) ధాతువునుండి యేర్పడినది "మార్గత్వం చతుర్షు వేదేషు అన్విష్య కృతత్వాత్" అని కల్లినాథుఁడు చెప్పి యుండుటచే నీ మార్గపద్ధతి వేదములందు వెదకి సంగ్రహింపఁ బడినదని తెలియుచున్నది. స్వరయుక్తముగా వేదములను గానముచేయు విధాన మీ మార్గపద్ధతికిఁ జెందినట్టిదే. భారత రామాయణములు వేదములు కాకపోయినను వేదప్రాయములుగా భావింపఁ బడుచుండుటచే వానిని జదువునప్పుడు కూడ నీ మార్గపద్ధతియే యనుసరింపఁ బడుచుండినట్లు తోఁచుచున్నది. వాల్మీకి యుత్తరకాండమునఁ గుశలవులు రామవచః ప్రేరితులై రామాయణమును మార్గ విధానమునఁ బాడిరని వ్రాసియుండెను.[2] దీనిని బట్టి పవిత్రములును ఉదాత్తములునగు విషయములను గానము చేయునప్పుడు మార్గపద్ధతియుఁ దద్భిన్నములైన సామాన్య విషయములను గానము చేయునప్పుడు దేశి పద్ధతియుఁ బాటింపఁబడు చుండెనని నిశ్చయింప వచ్చును.

దశరూపకకర్త నాట్యలక్షణములను జెప్పుచుఁ బ్రసంగ వశమున నృత్యనృత్తములను గూడ నిర్వచించి యుండెను. నృత్యము భావాశ్రయమైన దనియు, నృత్తము తాళ లయాశ్రయమైన దనియు నుడివి యాతఁడం దాద్యము (నృత్యము) పదార్థాభినయమై మార్గ మనఁబడు ననియు, రెండవది దేశియనఁ బడు ననియు వివరించెను.[3] "దేవైర్మృగితత్వా న్నృత్యస్య మార్గ ఇతి ప్రసిద్ధిః

---

1. "మార్గగీతం పురైవాసీత్' సంగీత రత్నాకరము

2 "తతస్తు తౌ రామవచఃప్రచోదితా వగాయతాం మార్గవిధాన సంపదా'

3 "అన్య ద్భావాశ్రయం నృత్యం, నృత్తం తాళలయాశ్రయమ్
ఆద్యం పదార్థాభినయో మార్గో దేశీ తథా పరమ్." దశ. ౧-౯

తత్తద్దేశ సంబద్ధత్వా న్నృత్తస్య దేశీతిప్రసిద్ధిః ఆద్యం నృత్యంపరం నృత్త"మని ప్రభావాఖ్య పై వాక్యముల యర్థము స్పష్టపఱుచుచున్నది. Prof. Haas మార్గమును H gher style అనియు దేశిని Lower style అనియుఁ బరివర్తనము చేసియున్నాఁడు. తాళలయ మాత్రాపేక్షమై యభినయ శూన్యమైన యంగ విక్షేపము నృత్యము. నృత్తనృత్యములందు గాత్ర విక్షేపసామ్యమున్నను నృత్యమున అవస్థానుకృతియగు ననుకరణముండుటయు, నృత్తమున నది లేకపోవుటయు వానికి భేదమును గల్పించుచున్నవి.[1] ఈ భేదమే నృత్తముకంటె నృత్యమించుక యుదాత్తతరమని స్పష్టీకరించు చున్నది. దీనినిబట్టి మార్గదేశీలక్షణములకు సంగీతమునఁ గల వ్యత్యాసమే నృత్యవిషయమునఁగూడఁ గన్పట్టుచున్నదని చెప్పవచ్చును. ఈ భేదమును బురస్కరించుకొనియే కవితా వాఙ్మయములందుఁ గూడ మార్గదేశీవిధానములకుఁ గల వ్యత్యాసముఁ బరిశీలింప వలయును.

సంగీత విషయమునఁ గనవచ్చు పై మార్గ దేశీ భేదములను భాషల కన్వయించి చూచినప్పుడు సంస్కృత భాష మార్గ విధానమునకును ఆంధ్ర కర్ణాటకాది భాషలు దేశి విధానమునకును జెందునని స్ఫురించును సంస్కృతము దేవభాష. శాస్త్ర పురాణ కావ్యాది వాఙ్మయ మెంతో యందు నిబంధింపఁబడినది. పాణిన్యాదులు దానికి స్థిరమైన నియమములు కల్పించి వ్యాకరణములు రచించియున్నారు. ఆ భాష విషయమున నా వ్యాకరణ లక్షణముల నుల్లంఘించుటకు వీలులేదు. అదివేద కాలము నుండి యనాది సంప్రదాయ సిద్ధమై వచ్చుచున్నది. అది పండిత జనైకవేద్యము. పామరు లందఱి కావ్యముల నర్థము చేసికొని రసాస్వాదనము కావింపఁజాలరు. ఈ లక్షణము లన్నియు సంస్కృత భాష మార్గ విధానమునకుఁ జెందినదని చెప్పక చెప్పుచున్నవి. కాని స్థిర లక్షణ శాలిత్వమే మార్గ ధర్మమైనచో గీర్వాణ భాషకుఁగూడ నది జనోపయోగము నం దున్నప్పుడు లేదనియే చెప్పవలెను. వైదిక సంస్కృతమునకును పాణిన్యాదుల సంస్కృతమునకును ఏక లక్షణత్వము లేదనుట ప్రసిద్ధమే. "భాషాయా" మ్మనియు "ఛందసి" అనియు పాణిని వేఱువేఱుగా అనుశాసనము చేయుట దీనికిఁ దార్కాణము. కాల ధర్మ

1. 'నృత్తనృత్యయోః గాత్రవిక్షేపసామ్యేఽపి నృత్తే ఽనుకరణం న భవతి నృత్యేచ భవతీతి నృత్తనృత్యయో ర్యథా పరస్పరం భేదస్తథే త్యన్వయః" ప్రభావాఖ్య.

మును బట్టియే యొకటి మార్గమగుటయు, వేఱొకటి తద్భిన్నమగుటయుఁ జూప ట్టును. లౌకిక సంస్కృత దృష్టితోఁ బరికించినచో వైదిక భాషయు, దేశ భాషల దృష్టితోఁ బరికించినచో కావ్య సంస్కృతమును మార్గలక్షణ సమన్వితము లగుచున్నవి. "మార్గ గీతం పురై వాసీత్" అన్నట్లు మార్గ లక్షణము ప్రథామముగా పౌరాతన్యమును సూచించుచున్నది. ప్రాచీనత మార్గ పద్ధతికిని నూతనత్వము దేశీ పద్ధతికిని లక్షణము లని యొక విధముగాఁ జెప్పవచ్చును. ఆంధ్ర కర్ణాటకాది భాష లాయా దేశములందలి జనుల హృదయ రంజనకై యర్వాచీన కాలమున నేర్పడినట్టివి. కాలక్రమమున వానికిని వ్యాకరణాది నియమము లేర్పడినను అవి జీవద్భాష లగుటచే నా నియమములు స్థిరములైనట్టివి కావు. అవి కాలము గడచిన కొలంది మాఱుట కవకాశమున్నది. సామాన్య జనులు కూడ వానిని జదివి యర్థము చేసికొని రసానందము ననుభవింపఁ జాలుదురు. ఈ భాషలు సంస్కృతము వలె ననాది సంప్రదాయ సిద్ధములైనవి కావు. క్రీస్తు శకారంభము తరువాతనే యీ భాషలు పెక్కింటిలోఁ జెప్పఁదగిన వాఙ్మయ ముద్భవిల్లినది. ఈ లక్షణము లన్నియు నీ భాషలు దేశీ విధానమునకుఁ జెందిన వని సూచించుచున్నవి.

భాష యొక్కటే కవిత్వము కాదు. కవిత్వమును వ్యక్తీకరించుటకు భాష సాధనము. ఒకే భాషలో భిన్న విధానములకుఁ జెందిన కవిత్వము లుండవచ్చును. మానవ సంఘము మాటలాడ నేర్చినప్పటినుండియు నేదో యొక రకమైన కవిత్వము సృజింపఁబడుచునే యున్నది. కవిత్వమునకు భాష, భావములు, రసము, ఛందస్సు, రీతి, వస్తువు మున్నగునవి ప్రధానములైన యంగములు. కాలము గడచిన కొలంది నీ యంగము లివి యిట్టులుండవలెనను నియమము లేర్పడినవి. సంస్కృతము నందలి లక్షణ గ్రంథములు పెక్కునియమములను బ్రవచించు నట్టివే. సాధారణముగాఁ బండితులైనవా రీ లక్షణము లన్నియు నెఱింగి తామే భాషలో కవిత్వము వ్రాసినను దానిని దల్లక్షణాను గుణముగానే వెలయించుచుందురు. కవిత్వము కేవలము పండితుల సొత్తే కాదు. పాండిత్య హీనులు కూడ వివిధ సన్నివేశములయందు భావోద్రేకము కలిగినప్పుడు కవితా సృష్టికిఁ గడంగుచుందురు. వారు లక్షణ గ్రంథములను జదివినవారు కాకపోవుటచేఁ గవిత్వాంగములకు సంబంధించిన నియమములు వారి కవిత్వమునఁ బూర్ణముగాఁ గానఁబడకపోవుటయు, నది సంప్రదాయ భిన్నములైన కొన్ని నవ్యతా

లక్షణములతో భాసిల్లుచుండుటయు సంభవించును ఈ రెండు తెలుంగులైన కవిత్వములలోఁ బండితులచే లక్షణానుగుణముగా వెలయింపఁబడినదానిని మార్గ కవిత్వమనియు లక్షణములతో సంబంధము లేకుండఁ దమ హృదయ రుచి ననుసరించి సామాన్య జనులచే వెలయింపఁబడు దానిని దేశి కవిత్వమనియుఁ జెప్పవచ్చును. సలక్షణమై నియమబద్ధమైన భాష, ఉదాత్తములైన వస్తు భావములు, సంప్రదాయ సిద్ధమైన ఛందస్సు, లక్షణానుగుణమైన రస పోషణము మార్గ కవిత్వమునకు చిహ్నములు. దేశీ కవిత్వమున భాషాభావరస చ్ఛందోవస్తువుల విషయమున స్థిరమైన నియమము లేవియుఁ గానరావు. అవి కవుల యభిరుచులనుబట్టి, దేశ కాలములనుబట్టి భిన్న భిన్న విధములుగా గోచరించుచుండును. మార్గ కవిత్వ మే కాలమున నే దేశమునందలివారు వ్రాసినను గొంత రూపసాదృశ్యమును గలిగియుండును. దేశి కవిత్వము దేశ కాల కర్తృ భేదముల ననుసరించి మాఱుచుఁ జిత్ర చిత్ర స్వభావమైయుండును కవిత్వము నందలి మార్గ దేశీ విధానముల నొక్క భాషా దృష్టితో మాత్రమే నిరూపింపరాదు. అట్టి సమయముల భాషతోపా టితర కవిత్వాంగములనుగూడ దృష్టియం దుంచుకొనవలయును.

ద్రావిడభాష లొండొంటితో నెప్పుడు విడివడి యుండెనో, యందేది ముందు విడివడి యుండెనో నిశ్చయముగాఁ జెప్పఁ జాలము. కాని యాంధ్రము కంటెఁ గన్నడమునను, గన్నడముకంటెఁ దమిళమునను వాఙ్మయము ముం దుద్భవించె నని మాత్రము చెప్పుట కవకాశ మున్నది. తమిళమున మూఁడు భిన్న కాలములలో మూఁడు భిన్న దేశములలో మూఁడు భిన్న సంఘములు విలసిల్లి నట్లును, బలువురు కవులు రచించిన గ్రంథము లా సంఘములచే నామోదింపఁ బడినట్లును దెలియుచున్నది. ఇఱైనారు రచించిన అగప్పొరలుకు నక్కీరర్ వ్రాసిన వ్యాఖ్యానములో నీ మూఁడు సంఘముల వృత్తాంతమును వివరింపఁ బడియున్నది. ఈ సంఘములు వర్ధిల్లిన మాట నిజమే యైనను వానిని గూర్చి వ్రాయఁబడిన యితర వివరము లతిశయోక్తులతోఁ గూడి యవిశ్వాస్యములుగా నున్నవని విమర్శకుల యభిప్రాయము. మూఁడవ సంఘము వర్ధిల్లిన కాలమును గూర్చి పండితులలో భిన్నాభిప్రాయము లున్నవి కొందఱు క్రీ. శ. 2 వ శతాబ్ది లోను, గొందఱు 5 వ శతాబ్ది లోను, కొందఱు 8 వ శతాబ్ది లోను, అది విలసిల్లెనని చెప్పుచున్నారు. కాని పలువురు ద్వితీయ శతాబ్దికి సంబంధించిన వాదమునే యంగీకరించి

యున్నారు. కాఁగాఁ దమిళమున వింతకుఁ బూర్వమే యుత్తమ శ్రేణికిఁ జెందిన వాఙ్మయము విలసిల్లెనని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

కన్నడమున రచింపఁబడి లభ్యము లగుచున్న గ్రంథములలో క్రీ. శ. 815 నుండి 877 వఱకుఁ బరిపాలించిన నృపతుంగుఁ డను నామాంతరము గల అమోఘ వర్షుఁడు రచించిన కవిరాజ మార్గము ప్రాచీన తరమైనది ఈ రాష్ట్ర కూట రాజు కన్నడ సంస్కృతములలో గొప్ప పండితుఁడై పలువురు కవులను బోషించి యుండెను. అతఁడాది పురాణకర్తయైన జినసేనుని శిష్యుఁడు. కవిరాజ మార్గమున నాతఁడు తనకుఁ బూర్వ ముండిన మహాకవులను బలువురిని బేర్కొని యుండుటచేఁ గన్నడ వాఙ్మయ మప్పటికిఁ గొన్ని శతాబ్దులు పూర్వమే యున్నత స్థితి యం దుండెనని చెప్పనగుచున్నది. విమలోదయ నాగార్జున జయబంధు దుర్వినీతులు గొప్ప గద్య రచయితలు గాను, శ్రీ విజయ కవీశ్వర పండిత చంద్ర లోకపాలురు గొప్ప కవులుగాను గవిరాజ మార్గమునఁ బేర్కొనఁ బడి యున్నారు చెన్నపట్టణము నందలి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము వారిచేఁ బ్రకటింపఁ బడిన అవంతి సుందరీ కథాసారము వలనఁ గిరాతార్జునీయ కర్త యైన భారవి దుర్వినీతుని యాస్థానమునఁ గొంత కాల ముండెననియు, నతఁడు తూర్పు చాళుక్య విష్ణు వర్ధనునికి (ఈతఁడు కుబ్జ విష్ణు వర్ధనుఁడై యుండును) బల్లవ సింహ విష్ణువునకును సమకాలికుఁ డనియుఁ దెలియవచ్చుచున్నది. ఈ దుర్వినీతుఁడే కిరాతార్జునీయ మహాకావ్యము నందలి పదునైదవ సర్గమునకు వ్యాఖ్యానము వ్రాసి యుండుట కూడఁ బై విషయమును బలపఱుచు చున్నది.పల్లవ సింహ విష్ణువు క్రీ. శ. 6వ శతాబ్ది చివర భాగమునఁ బాలించి యుండుటచే నతనికి సమ కాలికుఁడైన దుర్వినీతుఁడు కూడ క్రీ. శ. 6వ శతాబ్ది లోనే నివసించెనని చెప్పవచ్చును. దీనిని బట్టి క్రీ. శ. ఆఱవ శతాబ్ది నాఁటికే కన్నడమున మంచి కావ్యములు రచింపఁబడి యుండె నని తెలియుచున్నది. క్రీ. శ. 5వ శతాబ్ది నుం డియుఁ గన్నడమున శాసనములు కనఁబడు చున్నవి. (చిక్మగళూర్ 50c-500) క్రీ. శ. 700 ప్రాంత మందలి శ్రావణ బెళ్గొళ 27 శాసనమున కన్నడ భాషలో శార్దూల వృత్తము వ్రాయఁబడి యున్నది. ఈ విషయములు నృపతుంగునికిఁ బూర్వము చాలకాలము నుండియుఁ గన్నడ వాఙ్మయము వర్ధిల్లు చుండెనని సాక్ష్య మిచ్చు చున్నవి.

తెలుఁగున లభ్యము లగుచున్న కావ్యములలో నన్నయ రచించిన భారత భాగమే మొదటిదిగాఁ గానవచ్చు చున్నది. అంతకుఁ బూర్వ మా భాషలో నేవైనఁ గావ్యము లుండెనో లేవో యుండినచో నవి యెట్లుండెనో స్పష్టముగాఁ దెలియదు. కాని యంతకుఁ బూర్వము ఛందోమయమైన కవిత్వ ముండెనని కొన్ని శాసనములు సాక్ష్యమిచ్చుచున్నవి. క్రీ శ. ఆఱవ శతాబ్ది నడిమి భాగము నుండియు [1] రేనాటి చోళులును, దూర్పు చాళుక్యులును వ్రాయించిన తెలుఁగు శాసనములు కానవచ్చు చున్నవి. క్రీ. శ. 9వ శతాబ్ది వఱకు నుండిన శాసనము లన్నియు గద్యమయము లైనవే. తరువాత వెలసిన కొన్ని శాసనములలో తరువోజ, మధ్యాక్కర, సీసము మొదలగు దేశి చ్ఛందస్సుతోఁ గూడిన పద్యములు కనఁబడు చున్నవి. ఇట్లు నన్నయకుఁ బూర్వము కూడఁ గొంత కవిత్వ మున్న మాట నిజమే యైనను గావ్యము లేవియు లభ్యములు గాకుండుటచే నాతఁడు రచించిన భారతమే యాది కావ్యముగాఁ బరిగణింపఁ బడుచున్నది

తెలుఁగున మార్గదేశీ పదములను గవిత్వ పరముగా వాడిన మొదటి కవి పన్నె చోడుఁడు. అతఁడు తన కుమార సంభవమున మూఁడు నాలుగు పద్యములలో వీని ప్రసక్తి తెచ్చినాఁడు. అందు మొదటిది కవిస్తుతిలో నున్న యీ క్రింది పద్యము :

"మును మార్గ కవిత లోకం
బున వెలయఁగ దేశి కవిత పుట్టించి తెనుం
గును నిలిపి రంధ్ర విషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలగు పలువుర్"

ఈ పద్యమున నాతఁడు మార్గదేశీ కవిత్వములుగాఁ బరిగణించిన కవిత్వము లెట్టివో పరిశీలింప వలయును. ఆతఁడు కార్యారంభమునఁ దొలుత నిష్ట దేవతా స్తుతియుఁ బిమ్మట గురు ప్రశంసయు నాచరించి తరువాత కవి స్తుతి కావించెను. ఆ కవిస్తుతిలో వాల్మీకిని, వేదవ్యాసుని, కాళిదాసుని, భారవిని, ఉద్భటుని, బాణునిఁ

---

1. రేనాటి చోళుల శాసనములు క్రీ శ. ఆఱవ శతాబ్ది నడిమి భాగము నుండియు నిలిచియున్నవని (శ్రీ) ముట్నూరి వెంకటరామయ్యగారు Ep I XX VII సంపుటములో వ్రాసి యున్నారు.

గ్రమముగా బ్రస్తుతించెను. వీరందఱును సంస్కృత భాషలోఁ గవిత్వము చెప్పిన వారే. తరువాత నాతఁడు మార్గ దేశీ కవితా ప్రసక్తితోఁ గూడిన పై పద్యమును వ్రాసెను. తదనంతరము

"సురవరులం గ్రమంబున వచోమణి సంహతిఁ బూజసేసి మ
ద్గురు చరణార విందములకుం దగ సమ్మతిఁ జేసి కొల్చి వి
స్తర మతులం బురాణ కవి సంఘము నుత్తమ మార్గ పత్కవీ
శ్వరులను దేశి సత్కవుల సంస్తుతి చేసి మనో ముదంబునన్"

అను పద్య మున్నది ఈపద్యమున నాతఁడు తాను గావ్యారంభమునఁ గావించిన స్తుతి క్రమమును సింహావలోకనము చేసి యున్నాఁడు. సురలను, గురువును, బురాణకవి సంఘమును, బ్రత్యేకముగాఁ బేర్కొని నట్లాతఁడు మార్గదేశీ కవు లను బేర్కొని యుండలేదు. పై నుదాహరింపఁ బడిన " మును మార్గ కవిత " యను పద్యములో " తొల్లి మార్గ కవిత లోకమున వెలయఁగాఁ జాళుక్యరాజ మొదలైన పలువురు దేశి కవిత పుట్టించి యాంధ్ర దేశమునఁ దెలుంగు నిల్పి"రను విషయము మాత్ర ముద్ఘాటింపఁ బడినది. ఇందు మార్గదేశి కవుల స్తుతి యేమియు లేదు. ఒక విధముగా దేశి కవిత పుట్టించిన చాళుక్య రాజాదుల ప్రశంస కొంచె మున్నదని చెప్ప వచ్చును. ఈ యాదులలోఁ గొందఱు కవులు కూడ నుండ వచ్చును. వాల్మీకి వ్యాసులను బురాణ కవులుగను, గాళిదాసాదులను మార్గకవుల గను బరిగణించి కీ. శే. వీరేశలింగం పంతులుగారు దేశికవులఁ బేర్కొని నన్నె చోడుఁడు స్తుతించి యుండిన పద్య మొకటి పై పద్యము తరువాత లేఖక ప్రమాద మున విడిచి వేయఁబడి యుండునని భావించిరి. ఈ యూహ యెంత వఱకు నిజమో మనము చెప్పఁ జాలము. ఉన్న పద్యములను బట్టియే మన మొక నిర్ణ యమునకు రావలయును.

స్తుతి సింహావలోకన మొనరించిన పిదప నన్నెచోడుఁ దొక పద్యములో "విబుధ వర్గమును" తలపోసెను. అనంతరము కుకవి వరాకులఁ బరిహరించుచు

మార్గ కుమార్గము దేశియ
మార్గము వగవంగఁ దమకు మది వదలక దు
ర్మార్గ పద వర్తులనఁ దగు
మార్గవులం దలఁప నలఁతి మహి సుకవులకున్.

అను పద్యమును వ్రాసెను. మార్గదేశీ పదములకు మనమిచ్చు వర్థ మీ పై మూఁడు పద్యము లందలి యన్వయ సందర్భములకు నవిరుద్ధముగా నుండవలయును. అప్పు డా పదములకు నన్నెచోడుఁ డూహించిన యర్థ మదియే యని మనము నిశ్చయించు కొనవచ్చును.

కవిత్వము నందలి మార్గదేశీ భేదములను బరిశీలించు నప్పుడు సాహిత్య గ్రంథములలోఁ గవిత్వాంగములుగాఁ జెప్పఁబడిన భాషాచ్ఛందోఽలంకార రీతి వస్తురస పాత్రాదుల నన్నిటిని దృష్టియం దుంచుకొనవలసిన మాట నిజమే యైనను బలువురు భాషాచ్ఛందో వస్తువులకు మాత్రమే ప్రాధాన్య మిచ్చినట్లు కానవచ్చుచున్నది. సంస్కృత పద బహుళమై లక్షణ యుక్తమైన భాషయు, సంస్కృతకావ్య ప్రయుక్తములై యందుండి తెచ్చుకొనఁబడిన శార్దూలాదివృత్తము లను, ధీరోదాత్తాది నాయక వృత్తములతోఁ గూడి పురాణాదుల యందుఁ బ్రసిద్ధ మైన వస్తువును గల కవిత్వము మార్గ విధానమునకును, దీర్ఘ సమాస రహితమై దేశీయ పద ప్రచురమై వ్యవహార సిద్ధ ప్రయోగములతోఁ గూడిన భాషయు, దేశీ యములైన ద్విపద, తరువోజ, రగడ, అక్కర, సీసము మొదలైన పద్యము లను, బురాణ ప్రసిద్ధము కాక స్థానిక ప్రాధాన్యముతోఁ గూడిన వస్తువును గల కవిత్వము దేశీ విధానమునకును జెందునని సామాన్యముగా నిర్దేశింపఁ బడు చుండును. వర్ణనాదులలో సంస్కృత సంప్రదాయము ననుసరించుటయు, నను సరింపక పోవుటయుఁ గూడ నీ రెండు విధానముల పార్థక్యమును గనుఁగొను టకుఁ దోడ్పడ వచ్చును. ఈ నిర్దేశమును బట్టి యే భాషలో నైనఁ బై రెండు తెఱఁగులకుఁ జెందిన కవిత్వ ముండుట కవకాశ మున్నది.

నన్నెచోడుని "మును మార్గ కవిత" యను పద్యమున కర్థము చెప్పిన వారు మొదట కేవలము భాషను మాత్రమే దృష్టియం దిడికొని మార్గదేశీ కవి త్వములను నిర్ణయము చేసినట్లు కానఁబడును. ఆ నిర్ణయము ప్రకారము సం స్కృత కవిత్వము మార్గ కవిత్వముగను, దేశ భాషల యందలి కవిత్వము సం స్కృత పద భూయిష్ఠమైననుగాక పోయినను దేశి కవిత్వముగను బరిగణింపఁ బడినది. దానిని బట్టి తొల్లి సంస్కృత కవిత్వము లోకమున వెలసి యుండఁగాఁ జాళుక్యరాజు మొదలైనవారు దేశి (తెలుఁగు) కవిత్వమును బుట్టించి యాంధ్ర విషయమునఁ దెలుఁగును నిల్పిరని పై పద్యమున కర్థము తేలుచున్నది. అప్పుడు

పురాణకవు లనఁగా వాల్మీకి వ్యాసులనియు, మార్గకవు లనఁగాఁ గాళిదాసాదు లనియు, దేశి కవు లనఁగాఁ దెలుఁగునఁ గవిత్వము చెప్పినవా రనియు వారిని నన్నె చోడుఁడు స్తుతించి యుండెననియుఁ జెప్పవలయును. నన్నెచోడుఁడు కుకవి వరాకులను బరిహరించిన మార్గ కుమార్గ మిత్యాది పద్యమున "వగవంగఁ దమకు మది వదలక దుర్మార్గ పదవర్తు లనఁదగు మార్గవులం దలఁప నలఁతి మహి సుకవులకున్ " అని మార్గవులను గుకవులుగాఁ బరిగణించి యుండెను. ఈ మార్గవులను మార్గ కవులని భావించుట యుచితము కాదు. అట్లు భావించినచో నన్నెచోడుఁ డిందు మార్గ కవులను దుర్మార్గ పదవర్తు లని నిందించుటకును, గవిస్తుతిలో వాల్మీకి వ్యాస కాళిదాసాదులను, "సురవరుల నను" పద్యమున మార్గ కవీశ్వరులను స్తుతించుటకును బొత్తు కుదుర నేరదు. నన్నెచోడుఁడు గాని మఱి యెవ్వరుగాని సంస్కృత కవిత్వమును, సంస్కృత కవులను నిందింతు రనుట భావ్యము కాదు. అతఁడు కవిస్తుతిలోఁ బేరు పేరువెట్టి తనకు నచ్చిన సంస్కృత మహాకవులను భక్తి పూర్వకముగా సంస్మరించియే యుండెను. అందుచే నిచ్చటి మార్గవులు మార్గ కవుల (సంస్కృత కవుల) కంటె భిన్నులైయే యుండవలయును. వీరు మార్గకవిత యందలి కుమార్గమును, దేశి పద్ధతి యందలి యమార్గమును వదలి వేయుటకు మనసొప్పక, యా రెండింటి యందలి దుష్ట పద్ధతుల నవలంబించుచు 'దుర్మార్గ పదవర్తు' లనుటకు సర్వథా తగియున్నారని కొందఱు విమర్శకులు భావించుచున్నారు. మార్గ కవిత యందలి కుమార్గ మనఁగా నతి దీర్ఘ సమాస జుష్టమై నిఘంటు పదప్రయోగ భూయిష్ఠమైన రచనా పద్ధతి. దేశి యందలి యమార్గ మనఁగా వ్యాకరణ సాధ్యములు గాని వ్యావహారిక పదములతోఁ గూడిన రచనా పద్ధతి. ఈ రెండు పద్ధతులను విడువని వారు దుర్మార్గ పదవర్తులైన మార్గవులు. ఇట్టివారిని సత్కవులు తలంప నక్కఱలేదని నన్నెచోడుని యభిప్రాయమై యుండవలయును.

ఈ యన్వయ క్రమమును బట్టి మార్గ కవితయనఁగా సంస్కృత కవిత దేశి కవిత యనఁగాఁ దెలుఁగు కవిత. నన్నయాదుల కవిత్వముకూడ దేశి కవిత్వమే. ఈ రెండింటియందలి యుత్తమ పద్ధతులు నన్నెచోడుని కభిమతములైనవే. అందలి యల్ప పద్ధతులు మాత్ర మాతనికి విరుద్ధములైనవి. అతఁడు "సురవరుల" నిత్యాదిగాఁగల పద్యమున స్తుతించిన యుత్తమ మార్గ సత్కవీశ్వరులును దేశి సత్కవులును ఉత్తమ మార్గముల నవలంబించినట్టివారే.

కాని సంస్కృత కవిత్వమే మార్గ కవిత్వమని భావించినచో నన్నె చోడుని కవిస్తుతియందుఁ గొంత వైరుధ్యము గోచరించుచున్నది. అతఁ డందుఁ బురాణ కవులను మార్గకవులను వేఱువేఱుగాఁ బేర్కొని యున్నాఁడు. అతని దృష్టిలో వ్యాస వాల్మీకులు పురాణ కవులు. కాళిదాసాదులు మార్గకవులు. రచించిన కావ్యముల స్వరూపములో భేదమున్నను నిజమునకు వారందఱును మార్గకవులే. కాళిదాసాదులే మార్గకవులై వ్యాసాదు లట్టివారు కారనుట కవకాశము లేదు. మఱియు 'సురవరు' లను పద్యమున నాతఁడు సింహావలోకనమే చేసి యుండె ననుకొన్నఁ బురాణ కవులను దృష్టితో వాల్మీకివ్యాసుల నిరువురినే పేర్కొని "పు రా ణ క వి సం ఘ" మని సంఘ శబ్దము నుపయోగింప వలసిన యావశ్యకము లేదు. సంఘమను పద మంతకంటె నెక్కువ సంఖ్యను సూచించు నదిగా నున్నది. ఎవ్వరైనను నన్నెచోడుఁడు ముందు వాల్మీకి వ్యాసుల నిరువురినే స్తుతించినను మిగిలిన పురాణ కవులనుగూడ సూచించుటకై క్రింద పురాణ కవిసంఘమని వాడెననియు, ముందుఁ గాళిదాసాదులను నలుగురినే పేర్కొన్నను మిగిలిన వారిఁగూడ సూచించుటకై క్రింద మరల మార్గ సత్కవీశ్వరుల నని వ్రాసి యుండెననియుఁ జెప్పవచ్చును. అది యంగీకరించినను సంస్కృత కవిత్వమే మార్గకవిత్వమని యాతఁడు తలంచినప్పుడు సంస్కృత కవులనే పురాణకవులని మార్గకవులని వేఱువేఱుగాఁ జెప్పుటకుఁ గారణము కనఁబడదు. అదియునుగాక "దేశియ మార్గ"మను నెడ దేశి యందలి యమార్గమని యర్థము చెప్పి దానిని సప్తమీ తత్పురుషముగా భావించుట యుచితముగాఁ దోఁచుటలేదు. దేశి + అమార్గము అని కాని, దేశియ + మార్గము అనికాని యచ్చట నన్వయము చెప్పుకొన వలయును. అట్టిచో మార్గ కుమార్గ మనియు దేశి యమార్గమనియు నన్నెచోడుఁడు చెప్పినట్లు మనము తలంపవలసి వచ్చును. మార్గదేశీ కవిత్వములను గూర్చి యాతని కట్టి యభిప్రాయము లేదనుట యాతఁడు మార్గదేశీ సత్కవుల నుతించుటను బట్టి వ్యక్తమగుచునే యున్నది. అందుచే నాతఁడు పురాణకవి సంఘమను పదముచేతనే సంస్కృతకవు లందఱిని బేర్కొని మార్గ సత్కవీశ్వరులను పదముచేఁ దద్భిన్నులైన కవులను సూచించెనని తలంచుట యుక్తముగా నుండును.

నన్నెచోడుఁడు మా ర్గ క వి త్వ మ ని పేర్కొన్న కవిత్వమేది? అది యేదైనను మున్ను లోకంబున వెలసి యుండెనని యాతఁడు చెప్పుచున్నాఁడు.

లోకము, దేశము, విషయము అను వానికంటె విస్తృతతరమైనది. ఈ శబ్దమును వాడుటలో నాతఁడు మార్గకవిత్వ మొక్క యాంధ్ర విషయముననే కాక యితర దేశములఁగూడ వ్యాపించి యుండెనని యూహించినట్లు తోఁచుచున్నది. ఈ యితర దేశములలో నాంధ్రదేశమునకుఁ బరిసరముల నున్న తమిళ కర్ణాటములు ముఖ్యములైనవి. నన్నెచోడునకుఁ దమిళకర్ణాట భాషలతోడను, దద్దేశాచారముల తోడను గూడఁ బరిచయమున్నట్లు కుమార సంభవము సాక్ష్య మిచ్చుచున్నది. అందును దమిళభాష కంటెను గర్ణాటభాష యాతనికెక్కువ పరిచితమును బ్రీతికరమునునై యుండినట్లు తలంచుట కవకాశములున్నవి. ఆతఁ డా భాషలోఁ బంపాదులు రచించి యుండిన కావ్యముల నాదరముతోఁ జదివి యుండును. మార్గదేశీ కవితా సంప్రదాయ మాతఁ డందుండి గ్రహించినట్టిదే. పంపాదులకుఁ బూర్వముకూడఁ గన్నడ భాషలో గద్యపద్యాత్మకములైన కావ్యములు పెక్కు రచింపఁబడినట్లు నృపతుంగుని (815-877) కవిరాజ మార్గము వలనఁ దెలియుచున్నది. వానిని రచించిన విమలోదయ నాగార్జున దుర్వినీత చంద్ర లోకపాలాదు లొక్క కన్నడముననందే కాక సంస్కృతముననందుఁ గూడ గొప్ప పండితులు. అందుచే వారు కన్నడ దేశ్య పదములతో పాటు తత్సమ పదములను గూడఁ దమ కావ్యములలో వాడియుండిరి. క్రీ. శ. 700 ప్రాంతము నందలి శ్రావణ బెళ్గొళ (27) [1] శాసనమునందును, క్రీ. శ. 500 ప్రాంతమునందలి చిక్మగళూర్ (50) [2] శాసనమునందును పైతమిట్టి రచన కానఁబడుచున్నది. పై శ్రావణ బెళ్గొళ శాసనమునందు శార్దూలవృత్త మున్నది. భాషాచ్ఛందములను బురస్కరించుకొని యిది మార్గకవిత్వమని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. నృపతుంగుఁడు తనకుఁ బూర్వులుగాఁ బేర్కొన్న మహాకవుల రచన కూడ నిట్టిదియే యై యుండును. దీనిని బట్టి క్రీ. శ. 700 కుఁ బూర్వము నుండియుఁ గన్నడమున మార్గకవిత ప్రచారము నందుండె నని చెప్పవచ్చును.

---

1. 'మాసేనర్ పరమ ప్రభావ రుషియర్ కల్వప్పినా వెట్టిదుళ్
(శ్రీ) సంఘం గళపేట్ల సిద్ధ సమయం తప్పాదెనోం తించినిన్
ప్రాసాదాంతరమాన్ విచిత్ర కనక ప్రజ్వల్యాదిన్ మిక్కుదాన్
సానిర్వన్ వరపూజిదందుదెయె అవర్ స్వర్గాగ్రమానేఱిదార్'

శ్రావణ బెళ్గొళ. C 700

2. 'నిర్విసీతరా కిఱియా మగన్దిర్ వట్టి మూడిదోర్'— చిక్మగళూర్. C 500.

క్రీ. శ. 500 కుఁ బూర్వము తమిళములోఁ గొంత సారస్వతముండినను ఆంధ్రి కర్ణాటములలో మాత్రము సారస్వత మేదియునులేదు. అప్పటికే కాక తరువాత మఱికొన్ని శతాబ్దుల వఱకును బండితులును గవులును సంస్కృతమును గూడఁ దప్పక చదువుచుండిరి. అస లప్పుడు పాండిత్య మనఁగా సంస్కృత భాషా సాహిత్యములకు సంబంధించినదే యని చెప్పినను దప్పులేదు. సంస్కృత కవితా వాఙ్మయములపై నభిమానము కుదిరియుండిన పండితులు దేశభాషలను అందలి కవిత్వములను లాఘవముతోఁ జూచు చుండి రనుటకును దార్కాణము లున్నవి. అప్పుడే యననేల క్రీ. శ. 13 వ శతాబ్దినాఁటికిఁ గూడ నాంధ్రదేశమునఁ దెలుఁగు కవిత్వమునకుఁ బురస్కారము లేదని విన్నకోట పెద్దన రచించిన యొక పద్యము వలనఁ దెలియుచున్నది. [1] భారతమువంటి యుద్గ్రంథములు బయలుదేఱిన పిమ్మటనే దేశభాషయగు తెలుఁగునఁగల గౌరవాదరము లిట్లుండ నంతకుమున్ను దానియెడఁ బండితులకు విరసన భావ ముండెననుటలో వింత లేదు ఆ పండితులు సంస్కృతభాషా విష్ణాతులగుటచేఁ దమలోఁదాము వాదము లొనరించుకొనునప్పుడును బ్రసంగించు కొనునప్పుడును సంస్కృత భాషనే యుపయోగించు చుండియుందురు. కాని సంస్కృతభాషానభిజ్ఞులైన సామాన్య జనులతో మాటాడవలసి వప్పుడు తమ యభిప్రాయము వారికిఁ దెలియుటకై వారు దేశభాషలోనే మాటలాడక తప్పదు. వారు మాటాడుచుండిన యా భాషయంతయు దేశీయపదపూరితమైనది కాదు. అందు సంస్కృత పదములుకూడఁ బెక్కు ప్రవేశించి యుండెను. సంస్కృత పదములను దేశీయ పదములతోఁ గలపి ప్రయోగింప వలసి వప్పుడు వానికెట్టి రూపము నొసంగవలెనను విషయమున భిన్న భిన్నాభి ప్రాయములుండుట కవకాశమున్నది. కొందఱు సంస్కృత పదములకు దేశ భాషా విభక్తులనుజేర్చి మనమిప్పుడు తత్సమములని పిల్చునట్టి శబ్దములవంటి శబ్దములను వాడుచుండిరి. ఇట్లు సంస్కృత శబ్దములను "దేశీయములు"గాఁ జేయుపద్ధతి యప్పటికి సువ్యవస్థితమై రూపొందకపోయినను బుద్ధిశాలులైన

---

1. 'విలసద్భావ రసాద్యలంకృతులచే విప్పారి గీర్వాణ భా
షల కబ్బంబులకెన్ని మంచితనముల్ సంధిల్లు నా చందమై
వళియుం బ్రాసయు నంత కగ్గలముగా వర్తిల్లు సత్కావ్యముం
దెలుఁగంచుం జెవిఁబెట్టలేమి యుడుపం దేఁగల్గునే మందిలన్' కావ్యా. ౯-4.

కవులు వానిని దేశభాషావిభక్త్యంతములుగానే చేసి వాడుచుండిరి నృపతుంగు నికిఁ బూర్వముండిన కవులు తమ కావ్యములలో నిట్టి రూపములనే వాడి యుందురు. నృపతుంగుని భాషకును వారి భాషకును చాల వ్యత్యాసముండవచ్చును. కాని సంస్కృత శబ్దములను దేశభాషాపదములతోఁ గలపి వాడుకోవలసినప్పు డవలంబింపవలసిన పద్ధతులను వారొకవిధముగా నేర్పఱుచుకొనియుందురు. వానినన్నిటిని బరిశీలించియుఁ దన కాలమునందలి శిష్టజనవ్యవహారమును దృష్టి యందుంచుకొనియు నృపతుంగుఁడు తరువాత నా విషయమున సుస్థిరమైన వ్యవస్థచేసియుండును. సంస్కృతభాషయం దత్యంతాదరము గల పండితులకుఁ గొందఱి కీ తత్సమీకరణము రుచింపకపోవుటలో వింతయుండదు. సంస్కృత పదములకు దేశభాషావిభక్తులఁజేర్చు పద్ధతి వారి కంగీకార్యము కాకపోవుటచే వారు సంస్కృతపదములను సంస్కృత విభక్త్యంతములుగాను దేశభాషా పదములను దేశీయ విభక్త్యంతములుగాను బ్రయోగించుటయే యుక్తమని తలంచియుందురు. ఈ పద్ధతియే తరువాత మణిప్రవాళమను పేరుతోఁ బ్రసిద్ధ మైనది. ఆ పండితులలోఁ గొందఱిట్టి భాషలోఁ గవిత్వముకూడఁ జెప్పి యుందురు. ఇట్టి కవితాపద్ధతి కొంత యుండుటచేతనే పాల్కురికి సోమనాథుఁడు వృషాధిప శతకమునఁ బలుతెఱఁగుల భాషలలోఁ బద్యములు వ్రాయుచు మణిప్రవాళమునఁగూడ నొక పద్యమును వ్రాసియుండెను.[1] ఈ మణిప్రవాళ సంప్రదాయము క్రమముగాఁ గర్ణాటాంధ్రభాషలలో నష్టమైపోయెను గాని మల యాళమున నిల్చియున్నది. కావుననే మలయాళ లక్షణగ్రంథములలో మొదటి దగు లీలా తిలకము "భాషాసంస్కృతయో ర్యోగో మణిప్రవాళ" మ్మని యాశైలిని నిర్వచించియున్నది.

నృపతుంగుని కవిరాజ మార్గమునందలి కన్నడ భాషకును దరువాతి కన్నడ కవుల భాషకును వ్యత్యాస మంతగాఁ గానరాదు. భాషా విషయమున నాతఁడు చెప్పిన సూత్రములను దరువాతివారు పాటించుటయే దానికిఁ గారణము.

1. అనయము చేతులందు భవదంఘ్రి సరోజయుగం నమామి నె మ్మనమున సంస్మరామి యనుమాటల ని న్వరివస్కరోమ్యహ మ్మనుచు మణిప్రవాళమున నంకననేయుదు భక్తలోకహృ ద్వనజ విహారలోల బసవా! బసవా! బసవా వృషాధిపా

కాని యతనికిఁ బూర్వము "చౌపది, గీతిక, అక్కర, కందము మొదలగు పద్యములతోఁ గూడినవి చెత్తాణం, బెదండె యను పేరఁ బరఁగునవి కొన్ని కలవనియు, నృపతుంగుని కాలముననే పఱగన్నడమని (ప్రాచీన కన్నడము) చెప్పఁబడఁదగిన భాషలో నవి రచింపఁబడి యుండుననియుఁ" గవిరాజమార్గ పీఠికను బట్టి తెలియుచున్నది. ఈ పఱ గన్నడము సంస్కృత పద భూయిష్ఠమగు శిష్ట భాషవలె నాతనికి సమ్మతము కాకపోవుటచే నతఁడు "విరసంకరమవు దేసిగె ఱిద్వధూ విషయ సురతరస రసికతె వోల్" అని విరసించియుండెను. ఇట్లు పఱ గన్నడ' భాషాప్రయోగమును విరసించి యాతఁడు సమ సంస్కృతమునే దేశ భాషలలోఁ గలుపవలెను గాని కేవల సంస్కృత పదములను గలుపరాదని నియమము కావించియుండెను.[1] మఱియు అహరహః, ఉచ్చైః, నీచైః, ముహుర్ముహుః, ఇతస్తతః, పునః, అతః బహిః మున్నగువానిని గన్నడ భాషా వాక్యమున వాడఁగూడదనియు వాడినచో గఱిడియను మద్దెలను ఒక్కమాఱు వాయించుట వలనఁ గలుగు జర్జరధ్వని కలుగుననియు, సమ సంస్కృతముతోఁ గలిపి చెప్పినది మృదంగ సంగీతకాది మధుర రవమును బోలుననియు నాతఁడు వివరించి యుండెను. ఇట్లే "అరస కుమార, ఆయత తరకడె గణ్ణు, కెళది సమేతం" మున్నగు మిశ్ర సమాసములు కూడఁ బరిహార్యములే యనియు వానిని నరపతి తనయ, ఆయత తరళాపాంగ, కెళదియ రొడె యనునట్లుగా వాడుట యుక్తమనియు నాతఁడు సూచించియుండెను. దీనినిబట్టి సంస్కృత పదములను గన్నడ భాషలో నెట్లు వాడవలెనో, యెట్టి రూపములను దేశభాషా పదములతోఁ గలిపి వాడరాదో కవిరాజ మార్గము కాలము నాఁటికే కన్నడమున నిర్ణయింపఁబడెననియు నా నిర్ణయము ననుసరించియే పంపాదులు కావ్య రచనము కావించిరనియుఁ దెలియుచున్నది.

కేతవ, వృక్షేణ, దక్షాయ, పక్షిభిః, పుత్త్రిస్య యను సంస్కృత విభక్త్యంత పదములను, అస్తి, ప్రయాతి, గాయంతి, భుంక్తే మ్మున్నగు క్రియా

1. సమ సంస్కృతం గళొ (క ప)
య్తు మర్ది రె కన్నడ మనటిదు పేళ్తెంబుది దా
గమ కోవిద నిగదిత మా
ర్గ మిదం బెర సల్క మాగదీ సక్కద దొళ్.

రూపములను, గత్వా, హసిత్వా, ప్రకాశ్య, సంత్యజ్య మొదలైన క్త్వార్థక ల్యబం తములను, గంతుం, హంతుం మున్నగు తుమున్నర్థక రూపములను, అపి, చ, తుహి, వై, న, వా అను నవ్యయములను దెలుఁగునఁ బ్రయోగింపరాదని యాంధ్ర భాషా భూషణమున స్పష్టముగాఁ జెప్పియుండెను. సంస్కృత విభక్త్యంత శబ్ద ప్రయోగము తెనుఁగున యథాతథముగాఁ జేయుట నన్నయకును సమ్మతము కాదని యాతని భారతము వలననేఁ తెలియుచున్నది. ఆంధ్ర శబ్ద చింతామణి లోని "న పదాన్త్యవ్యయ సుప్తిఙ్ క్త్వా తుమునా" మ్మను సూత్రముకూడ నీ విషయమునే చెప్పుచున్నది. తిక్కన నిర్వచనోత్తర రామాయణ పీఠికలో "జాత్యము గామి నొప్పయిన సంస్కృత మెప్పుడుఁ జొన్ప"నని చెప్పుట కూడఁ గేవల సంస్కృత పదములను దెలుఁగునఁ బ్రయోగింపరాదను నిషేధమును సూచించుటకే. పాల్కురికి సోమనాథుఁడు వృషాధిప శతకములో మణిప్రవాళ శైలి నొక పద్యము వ్రాయుటయుఁ, దిక్కన కేతనలును ఆంధ్ర శబ్ద చింతా మణియుఁ గేవల సంస్కృత పదములను దెలుఁగునఁ బ్రయోగింపరాదని సూచిం చుటయుఁ జూడ నట్టి ప్రయోగము వారికిఁ బూర్వము తక్కువగనో, యెక్కువ గనో ప్రచారమున నుండెనని వ్యక్తము చేయుచున్నవి. లేనిచో వారట్లు నిషే ధించుటకుఁ గారణము కనఁబడదు.

పై పరిస్థితులను దృష్టియం దిడుకొని నన్నెచోడుని పద్యములకు సమ న్వయము చేయ యత్నింతము. ఆతఁడు పంపాదుల కావ్యములను, గవిరాజ మార్గమును, అప్పటికే నష్టమై పోయి యుండనిచో నంతకుఁ బూర్వము కన్నడమున రచింపఁ బడిన విమలోదయాదుల గ్రంథములను బఠించియుండును. నృపతుంగునికిఁ బూర్వము విలసిల్లిన కావ్యము లప్పటికే నశించి యుండినచో నాతఁడు కవిరాజ మార్గము వలన వాని యునికిని గుర్తించి యుండును. వానిలోఁ బెక్కు మార్గకవితాపద్ధతిని రచింపఁబడినవే యగుటచే నాతఁడు " మును మార్గ కవిత లోకంబున " వెలసి యుండెనని వ్రాకుచ్చి యుండెను. చాళుక్య రాజాదుల తెలుఁగు దేశమున నట్టి మార్గ కవిత్వమును గాక దేశి కవిత్వమును బుట్టించి తెనుఁగును నిల్పుటకు యత్నించి యుండిరి. ఈ చాళుక్యరాజు రాజరాజ నరేం ద్రుఁడు కాదనియు నాతని పూర్వులలో నొకఁడై యుండుననియుఁ దోఁచుచున్నది ఆతఁడే యా చాళుక్య రాజైనచోఁ " బుట్టించి " యను పదమున కర్థము కుదు రదు. ఏలయన నంతకుఁ బూర్వ మట్టి కవిత్వము లేనప్పుడును, అది క్రొత్తగాఁ

ప్రచారమునకు దేఁబడి నప్పుడును మాత్రమే యా పదము వాడఁదగి యుండును. రాజరాజానకుఁ బూర్వము కావ్యముల మాట యెట్లున్నను గవిత్వమును, బద్య రచనమును నుండె ననుటకు శాసనములు నిదర్శనములుగా నున్నవి. అందలి పద్యములు సీసము, తరువోజ, మధ్యాక్కర మొదలగు దేశి చ్ఛందో భేదములకు మాత్రమే చెందియున్నవి అందలి పదప్రయోగము సైతము దేశి మార్గమునకు సంబంధించినదే యని చెప్పఁదగి యున్నది. ఇట్లు శాసనములలో దేశికవిత్వము శిలాక్షరమై కానఁబడు చుండఁగా రాజరాజే దానిని బుట్టించె ననుట యుక్తము కాదు. దాని నట్లు పుట్టించినవారు తప్పక యాతనికిఁ బూర్వులే యై యుందురు. వారెవ్వరో స్పష్టముగాఁ జెప్పుటకుఁ దగిన యాధారములు లేవు. మఱియు రాజ రాజే యా దేశికవిత పుట్టించిన వాఁడన్నచో నన్నయభారతమే యా దేశకవిత యని చెప్పవలసి వచ్చును. కాని భాషాచ్ఛందో వస్తు వర్ణనాదులను బురస్క రించుకొని చూచినచో నది మార్గ కవితా పద్ధతియే కాని దేశికవిత్వము కాదు.

కన్నడ భాషలోఁ గవిరాజ మార్గమునకుఁ బూర్వమే మార్గ కవిత్వము వ్యాపించి యుండెనని వెనుకఁ జెప్పఁ బడినది ఆ రోజులలోఁ గన్నడ తెలుఁగు భాషల కిప్పు డున్నంత వ్యత్యాసమును, బార్థక్యమును లేకుండుటచే నా రెండు దేశము లందలి కవులును బ్రజలును నొండొరుల భాషా కవితలతోఁ బరిచయము కలిగియుండుట కవకాశ మున్నది. అందుచేఁ గన్నడమున వ్యాపిం చిన మార్గకవితా పద్ధతియే తెలుఁగునఁ గూడఁ బ్రచార మందుట సంభావ్యమై యున్నది. దానికిఁ దోడు సంస్కృత భాషాభిమానులు సంస్కృత పదములను దేశభాషా విభక్త్యంతములుగాఁ జేసి వాడుటకుఁ గాని, కేవల దేశభాషా పదము లనే వాడుటకుఁగాని యిచ్చగింపక సంస్కృత పదములను దేశ భాషా పదము లతోఁ గలిపి వాడు మణిప్రవాళ శైలితోఁ గూడిన పద్ధతియుఁ గొంత వ్యాప్తిలో నుండెను. ఈ పద్ధతులు రెండును మార్గకవితా విధానమునకుఁ జెందినవే నన్నె చోడుఁడు దేశి కవిత పుట్టించిరని చెప్పిన చాళుక్య రాజాదు లీ విధానము నంగీక రింపక దేశి కవితకును సంస్కృత పద ప్రచురము కాని తెనుఁగునకును బ్రాధా న్యము కల్గింప యత్నించి యుండిరి. వారి యా యత్నములకుఁ గలిగిన ఫలమే యప్పటి శాసనములందును ఏ లేశమైనలభ్యమైనచో నప్పటివాఙ్మయమునందును గానవచ్చును.వారట్లు యత్న మొనరించియుండని పక్షమున మార్గ కవితా పద్ధతియో మణి ప్రవాళ పద్ధతియో తెలుఁగు దేశమునఁ గూడ వ్యాపించి దేశి పద్ధతికిని.

దెనుఁగునకును గొంత విరోధము కలిగించి యుండును. అందుచేతనే నన్నెచోడుఁడు చాళుక్య రాజాదులు " దేశి కవిత పుట్టించి యాంధ్ర విషయంబునఁ దెలుంగు నిలిపి " యుండిరని వ్రాసి యుండెను.

ఇది క్రీ. శ. తొమ్మిదవ శతాబ్ది వఱకు వర్తిల్లిన పరిస్థితి. ఈ శతాబ్దిలో నృపతుంగుఁడు కన్నడమునఁ 'గవిరాజ మార్గమును రచించి భాషా ప్రయోగ విషయమునను, ఇతర కవితా లక్షణముల విషయమునను సుస్థిరములైన నియమములు కావించి మార్గ కవితా పద్ధతికి "ఘంటాపథము" నిర్మించెను. అప్పటి నుండియుఁ గన్నడ కవులు నిశ్శంకముగా నా మార్గమునే యవలంబించిరి. ఆ ప్రభావము తెలుఁగు దేశమునఁ గూడఁ గానిపించెను. పండితులైన కవుల యాదరము దేశి పద్ధతి యెడఁ గాక మార్గపద్ధతి యెడ ములు సూపఁ దొడంగెను. నన్నయ నాఁటి కది పేటూనెను. నన్నయ కూడఁ దత్కాల పరిస్థితుల ననుసరించి కన్నడ భాషతోఁ బరిచయము కలిగియే యుండును అతని మాట యెట్లున్నను అతని సహాధ్యాయుఁడును వాఙ్మయ ధురంధరుఁడు నైన నారాయణభట్టా భాషలోఁ బండితుఁడును గవియునై యుండె ననుటకు శాసన ప్రమాణమున్నది[1] అతఁడందలి మార్గకవితా పద్ధతి గాంచి,యందలి సామంజస్యమున కలరి మహాభారతమువంటి యుద్గ్రంథము నేమార్గమున నెట్లు వ్రాయుదమా యని యాలోచించుచున్న తనమిత్రున కా పద్ధతియే యుత్తము ననుసరణీయమునని సూచించి యుండును. సంస్కృత భాషాభిమానులు మణిప్రవాళ పద్ధతియే యుచితమని బలవంతమైన వాదము కావించియుందురు "ఈ ఘోరరణము"నందే పాకశాసనికి నారాయణునట్లు భట్టారకునికి నారాయణభట్టు తోడయి, విషాదము తొలంచి కర్మమార్గమున నున్ముఖునిఁ గావించియుండెను. నన్నయభట్టును విజయుని వలె వారేమనుకొందురో వీరేమనుకొందురో యను సందియమును విడనాడి నారాయణ నిర్దిష్టమార్గమునఁ గావ్యమున కుపక్రమించి సఫలీకృత మనోరథుఁ డయ్యెను.

నన్నెచోడుఁడు సురవరు లను పద్యమున స్తుతించిన-యుత్తమ మార్గ కవులు తెలుఁగునకు సంబంధించినవారే. వారిలో నన్నయ కూడ నొక్కఁడై

1. "యస్సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచికాంధ్ర భాషాసు
కవిరాజ శేఖర ఇతి ప్రథితః సుకవిత్వ విభవేన".

యుండును. తాను శైవ మతాభిమాని యగుటచేతను, నన్నయ యద్వైత మార్గావలంబి యగుటచేతను, నన్నయకుఁ దరువాతఁ గొలఁదికాలమునకే తాను వర్ధిల్లిన వాఁడగుట నప్పటికింకను నన్నయ భారత మధికప్రాచుర్యము నంది యుండక పోవుటచేతను అతఁడు ప్రత్యేకముగా నతనిఁ బేర్కొనక సామాన్యముగా "నుత్తమమార్గ కవులను" మాటతో నాతని స్తుతించి యుండును. అందుచే నన్నెచోడుఁ డిచ్చటఁ బేర్కొన్న యుత్తమ మార్గకవులు, దేశి సత్కవులు, అను పదములు "దేశభాషలోఁ జేయఁబడిన రచనను లక్ష్యముగాఁ జేసికొని చెప్పినవని తలంపవలసినదేకాని సంస్కృత భాషారచిత కవిత విషయమున కిందుఁ బ్రసక్తి యేమున్నది?" 1

ఇంక "మార్గకుమార్గ" మిత్యాదిగాఁ గుకవివరాళులఁ బరిహరించుచు నన్నెచోడుఁడు వ్రాసిన పద్యమును బై యభిప్రాయముతో నన్వయింపవలసి యున్నది. నన్నెచోడున కుత్తమమార్గ సత్కవీశ్వరులన్నను దేశి సత్కవులన్నను గౌరవమే యనుటకు "సురవరులను" పద్యమున నా యిరుతెగలకుఁ జెందిన కవీంద్రుల నాతఁడు గొల్చుటయే తార్కాణము. మార్గకవుల నిందుఁ గొల్చి తరువాత "మార్గకుమార్గమ"ని నిరసించుటలో స్వవచన వ్యాఘాతము గానిపించుచున్నది. మఱియు "మార్గకుమార్గము - దేశి యమార్గము" అనునది నన్నెచోడుని యభిప్రాయమే యైనచో నాతఁడు మార్గకవులను గొల్చియే యుండఁడు. "అట్లుగాక అతఁడుత్తములైన మార్గ సత్కవీశ్వరులను గొల్చెను. దుర్మార్గమని చెప్పఁదగిన మణిప్రవాళపద్ధతి నవలంబించిన మార్గవులను నిందించెను. ఆ దుర్మార్గమునే మార్గకుమార్గమని నిరసించెను". అని ఎవ్వరైనఁజెప్పవచ్చును. మార్గ కుమార్గమను మాటలో నుత్తమమైనను దుష్టమైనను మార్గపద్ధతియే యాతని కిష్టములేనట్లు తోఁచుచున్నది, అందుత్తమమార్గము కాక దుర్మార్గమే కుమార్గమనునంత యర్థము స్ఫురించుటలేదు. అందుచే "మార్గకుమార్గము దేశి యమార్గమ"ను నభిప్రాయ మతనిది కాదనియు నాతనిచేఁ బరిహరింపఁబడిన "మార్గవు"ల దనియుఁ దోఁచుచున్నది. ఈ మార్గవులు మణిప్రవాళపద్ధతి నవలంబించిన వారే. వీరికి సంస్కృత పదములను దత్సమములుగాఁ జేసి

---

1. కుమార సంభవ పీఠిక—26.

దేశభాషాపదములతోఁ గలిపిచెప్పు మార్గకవిత్వమునెడఁగాని దేశికవిత్వమునెడఁగాని ప్రీతిలేదు వీరిది "తృతీయః పంథా." వీరి కామార్గము కుమార్గము దేశి యమార్గము. రెండు పద్ధతులును నచ్చవు కావున మాటాడక యూరకుండుటకు వారి మన సిచ్చగింపదు. అందుచే వా రొక క్రొత్తమార్గమును-సంస్కృత పదములను సంస్కృతపదములుగానేయుంచి దేశి పదములతోఁగలిపిచెప్పు మార్గమును-అవలంబించిరి. నన్నెచోడుని కిది దుర్మార్గము. ఉత్తమమార్గ మాతనికిఁ బ్రీతికరమే. అందుచేఁనాతఁడు తమకు ( మార్గవులకు) వగవంగ (ఆలోచింపఁగా) మార్గ ( సంస్కృత పదములను దత్సమీకరించి చెప్పుమార్గము ) కుమార్గము ( కుత్సితమార్గము ) దేశి (కేవలదేశికవిత్వము) అమార్గము (మార్గముకానిది) అయినను గవిత్వమును బూర్తిగా విడిచివేయుటకు మది = మనస్సు; వదలక ( విడువక ) దుర్మార్గ పదవర్తులు దుర్మార్గమను ( మణిప్రవాళమను ) దారిని వర్తించు వారగు మార్గవులను సుకవులు తలంప నక్కఱలేదని హేళనపూర్వకముగాఁ జెప్పినాఁడు. వారికిఁ గవిరాజమార్గ నిర్దిష్టమైన మార్గము కుమార్గము కేవల దేశిమార్గ మమార్గము. ఇది వారియభిప్రాయముకాని నన్నెచోడునిదికాదు అతనికిఁ గవిరాజమార్గ నిర్దిష్టమైనమార్గ ముత్తమమార్గము. సంస్కృతాభిమానులైన యీ మార్గవులవలంబించు మణిప్రవాళమార్గము దుర్మార్గము. అందుచేతనే యాతఁడుత్తమమార్గ సత్కవీశ్వరులనుబొగడి దుర్మార్గపదవర్తులైన మార్గవులను దెగడినాఁడు.

మార్గవుల యభిప్రాయములో మార్గము కుమార్గము. దేశి అమార్గము ఇచ్చటి కుమార్గ అమార్గపదముల కర్థములో వ్యత్యాస మున్నది. కుమార్గ మనఁగాఁ గుత్సితమైన మార్గము. అదియు నొకమార్గమే కాని చెడ్డ మార్గము దేశి యసలు మార్గమే కాదు. తిరుపతి కేగిన పిమ్మటఁ దిరుమల శిఖరమున కరుగుటకుఁ బలుమార్గములున్నవి. కొందఱు మోటారు కారుపైఁ బోవుదురు కొందఱు సోపాన మార్గమునఁ బోవుదురు. కొంద ఱీ రెండు మార్గములను విడిచి విషమమును నుపద్రవకరము నైన కాలిబాట ద్వారా పోవుదురు. ఈ మూఁడును గొండకొనకుఁ జేర్చునవేయైనను యిందుఁ గాలిబాట కుమార్గము అన లీ మార్గములను మూఁటిని విడిచి కొండవైపునకుఁ గాక మఱొక దిక్కున కరుగుట యమార్గము. ఈ మార్గము నవలంబించినవారు మఱెక్కడికైనఁ బోఁజాలుదురు గాని కొండకొనకేగఁజాలరు. అట్లే సంస్కృతాభిమానులైన మార్గ

పులకుఁ దత్సమములను దేశభాషా పదములతోఁజేర్చి చెప్పు పద్ధతి కుమార్గము. దేశకవితా పద్ధతి యమార్గము. ఈ రెండును వమనసంజీయములు కాఁజాలవు. ఇంక మూఁడవది - సంస్కృత పదములను సుబాద్యంతములుగానే యుంచి దేశి పదములతోఁగలిపి చెప్పునది - సన్మార్గము. ఇది నన్నెచోడునకు దుర్మార్గము. ఈ దుర్మార్గము నవలంబించు మార్గవులనే యాతఁడు పై పద్యమునఁ గుకవి వరాకులని పరిహరించినాఁడు.

మార్గదేశీ కవితా పద్ధతులు ప్రత్యేకములైనవనియు వాని కొండొంటితో నెట్టి సంపర్కము నుండదనియుఁ దలంపరాదు. ఏదైన నొక పద్ధతిని మార్గమో దేశియో యని చెప్పుట బాహుళ్యదృష్టితోడనే. మార్గ కవిత్వమున దేశి కవితా చ్ఛాయలు కొన్నియు దేశి కవిత్వమున మార్గకవితాచ్ఛాయలు కొన్నియుఁ గాన వచ్చుచునే యుండును. ఉదాహరణమునకు నన్నయ భారతమునే తీసికొందము. ఇందు మార్గకవితాంశ మధికమే యనుమాట సత్యమేయైనను దేశకవితా రేఖ లపలు లేకపోలేదు, అతని కవితలోఁ దరువోజ లున్నవి. మధ్యాక్కర లున్నవి; సీసము లున్నవి. అచ్చటచ్చట దేశ్యపదప్రచురమైన రచన యున్నది. ఇదంతయు దేశి కవిత్వమే యనిపించుకొనును. కాని సలక్షణము, సమాస భూయిష్ఠము, శార్దూల మత్తేభ చంపకోత్పలమాలాలంకృతము నగు మిగిలిన రచ నతోఁ బోల్చి చూచినచో నిట్టిది చాలఁ దక్కువ అందుచే మొత్తముమీఁద నాతని రచన మార్గ కవిత్వమని చెప్పఁబడుచున్నది. నన్నెచోడుని కుమార సంభవ రచనకూడ మార్గపద్ధతికిఁ జెందినదే. ఇందలి వృత్తము పురాణ ప్రసిద్ధ మైనది. ఛందస్సున శార్దూలాది సంస్కృత వృత్తముల సంఖ్యయే యెక్కువ. అతఁడు తనకు జానుతెనుఁగు రచన యభిమతమని చెప్పుకొన్నను అందు సమాస భూయిష్ఠమైన రచన చేయకపోలేదు ఈ విధముగా నిందు మార్గకవితా విధానమే కానవచ్చుచున్నను నన్నయ భారతమునకంటె దేశి మార్గ చ్ఛాయ లధి కముగా గోచరించును. వస్తువునను, (గణేశ జన్మ ప్రకారము, ఓషధీప్రస్థము నందలి విట విటీ జార చోరాదుల సంభాషణము, కన్యావరణము) సంప్రదాయము నను (మందనాంకానోకహములు, కవి గమకి వాది వాగ్మలు) గవి సమయము లందును, భాషాభావ వ్యాకరణాదులందును అతఁ డవలంబించిన దేశీయ విధాన మును శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు కుమార సంభవ పీఠికలో సమగ్రముగాఁ బ్రదర్శించి యున్నారు. వ్యాకరణ సూత్రములకు విరుద్ధములైన పదములును,

సమాసములును నీతని గ్రంథమునఁ జాలఁ గనవచ్చుచున్నవి. అతఁ డవలంబించిన భాషా ప్రయోగ పద్ధతి యంతకుఁ బూర్వము ప్రసిద్ధి వహించిన నన్నయ పద్ధతి కించుక భిన్నమైనది ఈ కారణముచేతనే యీతని విశేషరూపము లా కాలమునఁ బ్రామాణికముగా గ్రహింపఁబడుచున్న శిష్ట వ్యవహారమునకు భిన్నములగుటయు, వాని నప్రామాణికములని కొందఱు తలంచుటయుఁ దటస్థించుచున్నది. "ఈతఁ డవలంబించునదియు దేశీయ శిష్ట వ్యవహార పద్ధతియే కాని కేవల సామాన్య జన వ్యవహార పద్ధతియు గ్రామ్య పద్ధతియుఁ గాదు. అట్లే యైనచోఁ గొంచెము తరువాతి కాలమునఁ దెనుఁగున మొదటి లాక్షణికుఁడగు కేతన లక్షణమునఁ జెప్పిన గ్రామ్యోక్తులు "వస్తాడా హరి సొమ్ములు తెస్తాడా" అను నట్టివి యీతని రచనలోఁ గనఁబడవలసినదే కదా! అట్టివి లేవు కొంత కన్నడ సంప్రదాయమును బట్టి శాసనాదులలో సర్వజన సామాన్యముగా నెఱుకపడుట కవలంబింపఁబడిన రచనారీతిని బట్టి యితఁడు తనకుఁ దోఁచినరీతి నా కాలపు భాషకు దేశీయతను బెంపొందించెను[1]. "ఇదంతయు బరిశీలించిచూచినచో నన్నయ నన్నెచోడుల రచనలు రెండును మార్గ పద్ధతికే చెందినను నన్నయలో దేశి కవితా గుణము చాలఁ దక్కువగను. నన్నెచోడునిలో నంతకంటె నెక్కువగను నుండినట్లు గోచరించును.

శార్ఙ్గదేవుఁడు సంగీత రత్నాకరమున గాన గాంధర్వములను గూర్చి వివరించుచు గానము నిబద్ధము. అనిబద్ధము అని రెండు తెఱంగులని సూచించెను గాంధర్వ గానములు మార్గదేశిభేదముల కపర రూపములని కూడ నాతఁడు తెల్పియుండెను కవిత్వ విషయమున మార్గపద్ధతిలోఁ గూడ నీ రెండు తెఱంగులు గోచరించునని చెప్పవచ్చును, ఒకటి కేవల లక్షణానుసారి యైనది. రెండవది యించుక స్వాతంత్ర్య చ్ఛాయలతోఁ గూడినది. నన్నయ కవితా పద్ధతి మొదటి దానికిని, నన్నెచోడునిది రెండవ దానికిని లక్ష్యములు కాఁజాలును పాల్కురికి సోమనాథుఁడు రచించిన బసవ పురాణ పండితారాధ్య చరిత్రలు ప్రధానముగా దేశి మార్గమునకుఁ జెందినవి. ఇందలి వృత్తము, ఛందస్సు, భాషా ప్రయోగాదులు మున్నగున వన్నియు దేశి పద్ధతిని జెప్పక చెప్పుచున్నవి. కాని యిందు మార్గ కవితాచ్ఛాయ లసలు లేవని చెప్పరాదు. సంస్కృత లాక్షణికులు కవిత్వమునం

---

1. శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు - సారస్వత వ్యాసములు

దుండవలెనని చెప్పిన లక్షణము లిందును గొన్ని కానవచ్చుచున్నవి. అట్టివి యున్నవని సోమనాథుఁడే కంఠో క్తిగాఁ జెప్పియున్నాఁడు. ఇందు జాతీయము లైన పలుకుబళ్ళు హెచ్చు. వైరి సమాసములు, స్వతంత్ర పద ప్రయోగములు బహుళముగాఁ గానవచ్చును. కాని యాతఁడు వ్యాకరణమును బూర్తిగా విడిచి పైచి వ్యావహారిక భాష నుపయోగించి యుండలేదు అతనిది మార్గపుఁ బా లించుక యధికముగాఁ గల నిబద్ధమైన దేశి కవితా పద్ధతి. నన్నెచోడునిలో దేశిచ్ఛాయ లెంతగా నున్నవో యీతనిలో మార్గచ్ఛాయ లంతగా నున్నవని చెప్ప వచ్చును. ఇట్లుగాక నన్నయకుఁ బూర్వముననుు బరముననుగూడ జన వ్యవహారము నందుండిన పదకవిత్వములో మార్గపుఁబాలు దృశ్యాదృశ్యముగ నుండును. అక్కడక్కడ వించుక యాలంకారికమైన రచనయు నొండు రెండు తత్సమ పదములును గోచరించినను అది వస్తుచ్ఛందో భాషాభావములలోఁ బూర్ణమైన దేశితనము గలది. నన్నయ కవిత్వములో మార్గ గుణమెంతో యీ పదముల రచనలో దేశిగుణ మంత. ఇందలి భాషాచ్ఛందోరీతులు నియమరహితములైనవి కావుచే నిది యనిబద్ధమైన దేశిరచనయని చెప్పవచ్చును.

నన్నెచోడుఁడు కుమార సంభవమునఁ గావ్య ప్రశస్తిలో "దేశి మార్గంబులు దేశీయములుగా, నలంకారములు దా నలంకరింపఁ" గవిత రచింపవలెనని సూచించెను. ఇచ్చట దేశిమార్గములు దేశీయములగుట యన వేమో పరిశీలింప వలయును. మార్గమును దేశీయముగా నొనరించుట యనఁగా సంస్కృతపదములను దేశభాషా విభక్త్యంతములుగా నొనరించుట, సంస్కృతమునుండి గ్రహించిన వస్తువులోఁ గొన్ని దేశీయాచార సంప్రదాయములను బ్రవేశపెట్టుట, కేవల సంస్కృత లక్షణములతో నందలి వృత్తములనేకాక యతిప్రాసలతోఁ గూడి దేశీయ ఛందోనుగుణములైన వృత్తములఁ జేర్చుట మున్నగు కార్యములని యర్థము చెప్పుకోవచ్చును. ఇంక దేశిని దేశీయముగా నొనరించుట యననేమి? 'దేశి సహజముగా దేశీయ మైనదే కదా' యను ప్రశ్న యుదయించును. దేశి కవితను బోషించి యధికతర దేశీయతా ముద్రతో దానిని బ్రభావితము చేయవలయు ననుటయే యాతని యభిప్రాయమై యుండును. దేశకవితా రీతి నితోఽధిక దేశీయముగను మార్గకవిత్వమును దేశకవితకు సన్నిహితముగను జేయుట యాతని ధ్యేయ మైనట్లు తోఁచును. ఆతని కావ్యమున నీ రెండు ప్రక్రియలును గోచరించును.

అతఁడు మార్గమును దేశీయముగ నొనరించుటకే కాక ఛందోవస్తుభాషా రీతులలో సాధ్యమైనంతవఱకు దేశీయ లక్షణములఁ జొప్పించుటకును యత్నించి యందుఁ గృతార్థుఁడు కాఁజాలెను. అతఁడు మార్గమును దేశిఁ గలుపుచుఁ దమిళ కర్ణాట భాషాకావ్యములనుండికూడఁ గొన్ని దేశీయ సంప్రదాయములను గ్రహించి తన కావ్యములో వానికిఁ దావు కల్పించెను దేశిమార్గములను గలుపుటయను నీ పద్ధతిని గూడ నన్నెచోడుఁడు కన్నడ కవులనుండియే గ్రహించి యుండెను. "దేశియొళ్ పుగువుదు, పొక్కు మార్గదొళె తళ్వుదు" అని పంపకవియు "నెగళ్దరసం మసం గొళిసె మార్గ మొడంబడె, దేసికబ్బ మంబగె గొళెలింత పేల్దుదు" అని రన్నకవియు భారత గదాయుద్ధములలోఁ జెప్పియుండిరి. మార్గదేశివిధానములను గలిపి చెప్పుటయే వారి కభిమతమైన పద్ధతి.

తెలుఁగున నీ మార్గదేశిపద్ధతుల ప్రసక్తి తెచ్చినవాఁ డింకొకఁడు గలఁడు. అతఁడు నన్నెచోడుని కించుక తరువాతివాఁడని చెప్పఁదగు నృపధూర్జటి భీమయపండఁడు. (క్రీ. శ. 1145). అతఁడు

"తలంపు సదర్థ భావమునం దగ్గత సూక్తులఁగూడ వనజానన్
గొలును గొనంగ బ్రావడులు గోరిన భంగిక వచ్చి ముట్టఁ గో
మలగతి దేశిమార్గములు మటుపడం గ్గటనంబులొప్పనా
ద్యుల క్రియం జెప్ప నేర్చె నృపధూర్జటి భీమయ పండ్డ డిమ్మహిని"

—South Indian Inscriptions Vol.. VI, No 103
శాసనపద్య మంజరి 19

అను పద్యమున "దేశిమార్గములు మట్టువడునట్లుగా నాద్యుల క్రియఁజెప్పఁ" గల నేర్పును బ్రశంసించుకొని యున్నాఁడు. ఈ పద్యము భాషాభావ గమనము లందు నన్నెచోడుని కావ్య ప్రశంసలోని "సరళముగాఁగ భావములు" మున్నగు పద్యములను బోలియున్నది. మట్టుపడుట యనఁగాఁ గుదురుకొనుట యని యర్థము. నన్నెచోడుఁడు "దేశిమార్గములు దేశీయములుగాఁ" గవిత చెప్ప వలెనన నీతఁడు "దేశిమార్గములు కుదురుకొనునట్లుగాఁ" జెప్పవలెనని సూచించినాఁడు. దేశిమార్గములను గలిపి చెప్పవలెననియే యిరువురి యభి ప్రాయములైనను నన్నెచోడుని పదప్రయోగమునందు దేశీయాభిమానము మిక్కు

చూపుచున్నది. భీమయపండఁడు తనకుఁ బూర్వులైన కొందఱు దేశిమార్గ ములు మట్టుపడునట్లుగాఁ జెప్పియుండిరని పై పద్యమున సూచించి యుండెను. ఈ యాద్యులు నన్నెచోడుఁడో, నన్నయయో లేక కన్నడము నందలి పంపా దులో కావలయును. నన్నయలో మార్గపుఁబాలును, నన్నెచోడునిలో దేశిపాలును గొంచె మధికముగా నుండినను అవి రెండును వారి కవితలలోఁ గుదురుపడి యుండుట సత్యమే. దానినే భీమయపండఁ డాదర్శముగా గ్రహించియుండును.

నన్నెచోడుని తరువాతఁ బాల్కురికి సోమనాథుఁడు సంస్కృత వృత్తము లను, వస్తువును గూడఁ బరిహరించి తన బసవపురాణ పండితారాధ్య చరిత్రలలో దేశిమార్గమున కధిక ప్రాధాన్య మొసంగెను. తిక్కన కూడ భాషా విషయమున దేశి కవితాభిమానమునే ప్రదర్శించెను గాని యితర కవితా లక్షణములలో మార్గ పద్ధతినే యవలంబించెను నన్నెచోడుఁడు విశ్లే షించినను భాషా సమాసాది ప్రయోగమున నించుక విశృంఖలముగా వర్తిం చుటచేఁ బండితాదరమును బడయలేకపోయెను. నన్నయ కవిత్వము నందు మార్గ కవితాభాగ మెక్కువ. తిక్కన కవిత కేవల మార్గమును గాదు. దేశియును గాదు అది రెండింటి సలక్షణమైన సమరసమైన కూడిక.

తిక్కన తరువాత మరల దేశి కవితా సంప్రదాయమునకు దుర్దినములు పట్టి నవి. పండితులును గవులును దేశిమార్గమునం దాదరము చూపక నన్నయ యవలం బించిన మార్గకవితా సంప్రదాయమునే యవలంబించి పెంపొందింపఁ దొడంగిరి. నాచన సోమనాథ శ్రీనాథాదులును, పెద్దనాది ప్రబంధ కవులును ఆ మార్గమును బరాకాష్ఠ నొందించిరి. అప్పటి నుండి నేఁటి వఱకును గూడ నా సంప్రదాయమే కవి పండితుల మన్ననల నందుచున్నదని చెప్పవచ్చును నన్నెచోడుఁడు దుర్మార్గ పద్ధతి యని చెప్పిన మణి ప్రవాళ రచనా విధానము నన్నయనాఁటికే కృశించి తరువాతఁ గ్రమ క్రమముగా రూపు లేకుండఁ బోయినది. కన్నడమునఁ గూడ నది చిరకాలము సాగి యుండలేదు. కాని మలయాళమున మాత్రము వేఱు రన్ని నేఁటికిని నిల్చియే యున్నది.

ఇంక దేశి కవితా ప్రవాహము నన్నయకుఁ బూర్వకాలము నుండియుఁ గాల పరిస్థితుల ననుసరించి పోటుపాటుల నందుచు సన్న సన్నగాఁ బ్రవహించి వచ్చుచునే యున్నది. నన్నయకుఁ బూర్వము చాళుక్య రాజాదులు దేశి కవితను

బుట్టించి దానిని బెంపొందింప యత్నములు కావించిరి కాని యప్పుడు పండితు లందును శిష్టు లందును సంస్కృతాభిమానము పెచ్చు పెరిఁగి యుండుటచే దానికిఁ దగినంత యౌన్నత్యము చేకూరి యుండలేదు. నన్నయ కన్నడము నందలి పంపాదుల ననుసరించి మార్గకవితా పద్ధతికే ప్రాధాన్య మొసంగి భారతము వ్రాయ నారంభించిన పిమ్మట నది మఱియు హీనస్థితి నొందుట సంభవించెను. తరువాత మత ప్రచారమే ప్రధాన ప్రయోజనముగాఁ గావ్య సృష్టి కావించిన పాల్కురికి సోమనాథాదుల కాల మా దేశి కవితా ప్రవాహినికిఁ బ్రావృట్కాల కల్పమై యనల్ప మైన యుల్బణము నాపాదించెను. కాని యా యుల్బణము చిరకాలము సాగి యుండలేదు వర్షకాలము గడచిన పిమ్మట నది క్రమ క్రమముగా సన్నగిల్లి నిదాఘసమయము నాఁటికి నిర్జలమై పోవున ట్లది ప్రబంధకాలము నాఁటికి రూపఱి దృశ్యా దృశ్యమై పోవుట సంభవించెను అప్పుడు తాళ్ళపాకవారి కృతు లలో నది సజీవమై యుండినను ఉరవడితో నుద్వేలమై ప్రవహించిన ప్రబంధ వాహినిముందు దాని నంతగా నాదరించినవారు లేకపోయిరి.

తరువాత నాయక రాజుల కాలమున యక్ష గానాదుల రూపమున నది కొంత విజృంభణము గాంచెను గాని యా విజృంభణము కూడ దీర్ఘ కాలము సాగక యచిర కాలములోనే యంతరించెను. మరల నాధునిక కాలమునఁ బండి తులకును బ్రజలకును గవులకును గూడ దేశి కవితా వాఙ్మయముపై నధికమైన యాదరాభిమానము లుదయించినవి పలువురు ప్రాఁత పాటల నన్నిటిని సేకరించి గ్రంథస్థము చేయఁ జూచుచున్నారు. కవులు పూర్వపుఁ బాటలను బదములను నొజ్జ బంతులుగా గ్రహించి సర్వజన సుబోధములైన గేయ రచనలు కావించు చున్నారు. ఆధునికాభ్యుదయ కవిత్వమునఁ జాల భాగము దేశి మార్గముననే నడచుచున్న దనుటలో నత్యుక్తి యుండదు. కాని పండితులకును, శిష్టులకును బూర్వము వలె, నేఁడును దీని యెడ విరసనభావమే కాని సహజమైన యాదరా భిమానము లంతగా గోచరించుట లేదు. దీని భవిష్యత్ప్రవృత్తి యెట్లుండునో యిప్పుడు నిర్ణయించుట కష్టము.



# 6. నన్నయ 'ఆదికవిత్వము'-భారత రచనకుఁబూర్వరంగము

ఆంధ్ర వాఙ్మయము నందలి కవులను గూర్చి చెప్పునప్పుడు నన్నయ నాది కవిగాఁ బేర్కొనుట దేశమున నాచారమై యున్నది. ఈ ప్రశస్తి యాతని కర్వాచీనకాలమునఁ గలిగినదే. కాని ప్రాచీన కాలమున నున్నట్లు కనఁబడదు. ఏల యనఁ దిక్కన ఎఱ్ఱనలు కాని శ్రీనాథాదులు కాని యాతనియెడ భక్తి ప్రపత్తులు కలవారయ్యు నతని నా విధముగాఁ బ్రస్తుతించి యుండలేదు. మారన యాతని నాంధ్ర కవితా గురుఁడని స్తుతించి యుండెను. * కొలని గణపతి దేవకవి శివ యోగ సారావతారికలో "ఆంధ్ర కావ్యపథము తీర్చినవాఁడు" గా నన్నయను బ్రశంసించి యున్నాఁడు. భట్టుమూర్తి మహిమున్ వాగనుశాసనుం డను పద్య మున నతఁడు బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమును సృజించెనని చెప్పి యున్నాఁడు. ఈ ప్రస్తుతులలో నాతఁ డాదికవి యను ధ్వని స్ఫురించు చున్నది కాని యట్టి బిరుద మాతని కున్నట్లు లేదు. నన్నయ కూడఁ దన్నుగూర్చి యట్లెచ్చ టను జెప్పుకొని యుండలేదు. తమకున్న బిరుదములను గ్రంథాంత గద్య లలోఁ జెప్పుకొను నాచారము నన్నయకుఁ బూర్వ మందలి కన్నడ కవులలోను దరువాత నుండిన తెలుఁగు కవులలోను గూడఁ గనవచ్చు చున్నది. పంపకవి ఆదిపురాణ విక్రమార్జున విజయములలోఁ దనకున్న కవితా గుణార్ణవ బిరుద మును, పొన్నకవి శాంతి పురాణమునఁ దనకుఁ గల ఉభయకవి చక్రవర్తి బిరుద మును, రన్నకవి గదాయుద్ధమున కవి చక్రవర్తి, అభినవ కవి చక్రవర్తి బిరుదము లను, నాగవర్మ ఛందో ఒంబుధిలోఁ గవిరాజ కలహంస బిరుదమును బేర్కొని యున్నారు. నన్నెచోడ తిక్కన కేతన శ్రీనాథాదులు కూడ నట్లే తమకున్న బిరుదముల నాశ్వాసాంత గద్యలలోఁ జెప్పుకొని యుండిరి. అప్పటి నుండి యాధు నిక కాలము వఱకును బిరుదముల నాశ్వాసాంత గద్యలలోఁ జెప్పుకొను సంప్ర దాయము గోచరించుచునే యున్నది. నన్నయ భారతము నందలి ఆశ్వాసాంత గద్యలలో "సకల సుకవిజన వినుత నన్నయ భట్ట ప్రణీత" మని మాత్రమే

---

* అట్టి విద్యారమణీయు నాంధ్ర కవితా గురు నన్నయభట్టుఁ గొల్చెదన్.

(మార్కండేయ)

వ్రాసికొని యుండెను. అందుచే నతని కాదికవి యను ప్రశస్తి తరువాతఁ గలిగి నదే కాని పూర్వ కాలమున నుండినట్లు చెప్పుట కాధారములు లేవు.

ఆదికవి యనఁగా మొదటి కవి యని యర్థము. సంస్కృతమున వాల్మీకి కాదికవి యను బిరుద మున్నది. ఆతనికి ముందు వేదాదు లందు వైదిక చ్ఛందము లున్నమాట నిజమే యైనను లౌకిక భాషలో ప్రథమ చ్ఛందో వివర్త మాతనివలననే యవతరించినది అందుచే నాతని నావిధముగాఁ బ్రస్తుతించుట యుచితమే. అట్లే నన్నయకుఁ బూర్వము కూడ నాంధ్రమునఁ గవితారచన లేక యుండ నతఁడే తొలుఁదొల్తఁ బద్యరచన కారంభించినచో నతని నాంధ్రమున నాదికవి యని ప్రస్తుతింప వచ్చును. కాని యాతనికి ముందు శాసనము లందు శిలాక్షరములై కొన్ని పద్యములు కానవచ్చుటయే కాక పద్మ సర్వ దేవాదులగు పండిత కవులు కొన్ని కావ్యములను గూడ రచించి యుండినట్లు కొందఱు చెప్పు చున్నారు. మఱియు దేశిమార్గమునకుఁ జెందిన పదములు, పాటలు అప్పుడు విరివిగా నుండె ననుట కాధారము లున్నవి. ఇట్టి యెడ నాంధ్రమున నాతని నాదికవి యనుట యుచితమా యను ప్రశ్న యుదయించును. దానికి సమాధానము చెప్పవలయును.

నన్నయకుఁ బూర్వము శాసనము లందలి పద్యములేకాక కొన్ని పద గేయ కావ్యములుకూడ నుండియుండునని తలంచుట కవకాశ మున్నమాట నిజమే కాని యా కవిత్వమంతయు దేశిమార్గమునకుఁ జెందినది. అది ప్రజాదరణమును బొందియుండినఁ బొందియుండవచ్చును గాని పండితుల యాదర గౌరవములకు మాత్రము పాత్రమై యుండలేదు. ఒక్కొక్కప్పు డా పండితులు దేశిమార్గమునకుఁ జెందిన యా కవితను నిరసించుచుండి రనుటలోఁగూడ నతిశయోక్తి యుండదు. అందుచే నా కావ్యములను కావ్యములని కాని, కవులను గవులని కాని ప్రశంసించి సంభావించిన వారెవ్వరును లేకపోయిరి నన్నయకుఁ దరువాత నాతఁడు ప్రారంభించిన మార్గకవితా పద్ధతియే ప్రచారము నొంది పండిత కవుల నాకర్షించినది. పాల్కురికి సోమనాథాదులగు కవులు కొందఱు దేశికవిత నభిమానించి యా మార్గమునఁ గవిత్వము చెప్పినను వారి కా రోజులలోఁ బండితకవులలో నంత ప్రశస్తి యుండినట్లు గోచరింపదు. పూర్వ కవిస్తుతులలో వారిని దరువాతి కవు లెవ్వరును జేర్కొన కుండుటయే యిందుకుఁ

దార్కాణము. మొన్నమొన్న బసవపురాణ పండితారాధ్య చరిత్రలు ప్రచురింపఁ బడుదాఁక సోమనాథుని మహాకవిగాఁ బాటించి ప్రశంసించిన వారెవ్వరును లేరనుట యెల్లరెఱింగినదే. మహాపండితుఁడును, మహాకవియు నైన సోమనాథుని స్థితియే యిట్లుండ సామాన్యులై ప్రజాప్రీతి కొఱకేదో కవిత్వము చెప్పిన నన్నయ్యకుఁ బూర్వమందలి దేశికవుల మాట వేఱచెప్పనేల? వారు కొందఱుండినను వాస్తవమునకు లేనట్లయై పోయినది. మఱియు వారి కావ్యములను గాని కవిత్వమును గాని యెవ్వరును గౌరవ పూర్వకముగా గ్రంథస్థముచేసి కాపాడిన పుణ్యము కట్టుకొనరైరి. అందుచే వారికవితా వ్యవసాయము కేవల కథావశేషమగుట సంభవించినది.

పద్మ సర్వదేవాదులు పండితులనుటయు, నుత్తమ మార్గ పథానుయాయు లనుటయు నిజమే. కాని ప్రబంధ రత్నావళిలో నుదాహరింపఁబడిన యొండు రెండు పద్యములుతప్ప వారి కావ్యములు లభించుటలేదు. ఆ పద్యముల విషయమునఁగూడ కర్తృత్వము నిర్వివాదమై లేదు. మఱియు మతముచే వారు జైనులుగాఁ గన్పట్టుచున్నారు వారు రచించిన జినేంద్రపురాణాది పురాణములు కూడ జైనమత సంబంధి వస్తుకము లైనట్టివే రెండవ అమ్మరాజు వంటి రాజులు జినాలయములకును జైనాచార్యులకును బెక్కుదానములు చేసినట్లు శాసనాధారములు కనఁబడుచుండుట చేతను (మచిలీపట్టణ తామ్రశాసనము, మలియంపూడి దానశాసనము) విమలాదిత్యుఁడు జీవితాంతమున శ్రావకుఁడైనట్లు తెలియుచుండుట చేతను, నేదునూరు, తాటిపాక, కొలనుపాక, జోగిపేట మున్నగుచోట్ల నప్పుడు నిర్మించిన జైనవసతుల యవశేషము లిప్పటికిని గానఁబడుచుండుటచేతను ఆంధ్రదేశమున నా రోజులలో జైనమతమునకుఁ గొంత యాదరప్రచారము లున్నట్లే భావింపవచ్చును. అయ్యును ప్రభు ప్రజాదరణమను త్రాసు వైదికమతము వంకకే విశేషముగా మ్రొగ్గుచుండెనని చెప్పుటకు సందేహింప నవసరములేదు ఈ కారణముచేతనే కాఁబోలు జన్మచే నాంధ్రులయ్యు నా కవులు జైనమతాభిమానముచే నా మతమును బోషించు కన్నడరాజుల కొలువు చేరవలసిన వారైరి. వా రా కావ్యములను గన్నడదేశమున నుండియే వ్రాసియుందురు. అందుచే వారి నాంధ్రమున మహాకవులుగాఁ బరిగణించి వారి కావ్యముల నాదరపురస్సరముగాఁ బఠించిన వారి సంఖ్యయు నరుదైయుండును. వారి కావ్యములు పూర్తిగా లభింపక నష్టములైపోయి యుండుటకుఁ గూడ

విదియే హేతువై యుండును. అందుచే నా కవులకును దత్కావ్యములకును వర్హమైన పరిగణనము లేకపోవు టటుండ నొకవిధముగాఁ గొంత తిరస్కారమే సంఘటిల్లి యుండుననికూడఁ జెప్పవచ్చును.

భీమనభట్టు, బేతనభట్టు, అయ్యనభట్టు [1] మున్నగువారు పండితులును గవులునై కొన్ని శాసన కావ్యములను రచించియుండిరి. అవి సంస్కృత భాషలో రచింపఁబడినవే యైనను తెలుఁగు ఛందస్సునకు సంబంధించిన యతి ప్రాసాది లక్షణములును, సంస్కృతమునఁ బూర్వకవులచే వాడఁబడక తెలుఁగు కన్నడములందుమాత్రమే బహుళప్రచారమునందిన రగడ, చంపకమాల కందము మున్నగు పద్యములును అందుఁ గానిపించుచున్నవి. దీనినిబట్టి వారికిఁ దెలుఁగుకవిత్వముకూడ సుపరిచితమేయై యుండెననిచెప్పుట కవకాశమున్నది కాని వారువ్రాసిన కావ్యము లేవియు లభ్యములగుటలేదు.

ఇట్టి పరిస్థితిలో నన్నయ రాజరాజు కోరిక ననుసరించి మహాభారతము నాంధ్రీకరించుటకుఁ బూనుకొనెను ఇది వైదికమత సిద్ధాంతములతో నిండి తత్ప్రచారమున కనువగు కథోపాఖ్యానములతోఁగూడి పంచమవేదమని ప్రసిద్ధి నొందిన గ్రంథము. వైదిక మతాభిమానముగల ప్రజలు, పండితులు అట్టి యుద్గ్రంథము నవతరణమును హృదయపూర్వకముగా స్వాగతీకరింతురనుటలో నత్యుక్తి యుండదు. అట్టి గ్రంథమును సమర్థతతో నిర్వహించిన పండితాఖండలుఁడైన కవి వారికి ఋషి ప్రాయుఁడుగా గోచరించుటయు సత్యదూరము గాదు. మఱియు భారతరచనమున నన్నయ దేశిపద్ధతిని బూర్తిగాఁ బరిహరింపక పోయినను జాలవఱకుఁ దగ్గించి మార్గపద్ధతికిఁ బ్రాధాన్యమొసంగెను. ఇది ప్రజల కా గ్రంథమునెడ గౌరవభావమును బండితుల కాదరభావమును గలిగించెను. నిజముగా నన్నయ మార్గపద్ధతి నవలంబింపక పూర్వశాసనము లందలి దేశికవితా మార్గమునకుఁ జెందిన పద్యములను మాత్రమే రచించియుండినచో నాతని కావ్యమును బామరు లగ్గించినను బండితు లంతగా మెచ్చియుండెడివారు కారు. అందుచేతనే యాతఁ డిరుతెగలకుఁ బ్రీతిపాత్రమైన ప్రశస్త పక్కి ననుసరించెను. ఈ పద్ధతి తరువాతి కవుల కాదర్శప్రాయమును శిరోధార్యమునై

1. రణస్థిపూఁడి, కోరుమిల్లి, ఆరుంబాక శాసనములు.

యలరారెను. నన్నయకుఁ బూర్వమం దుండిన కవితలోఁ గొంత భాగము కేవల దేశీ మార్గమునకుఁ జెందిన దగుటయుఁ, గొంత భాగము మార్గపద్ధతికిఁ జెందినదే యయ్యు నవైదిక మతావలంబులగు కవులచే రచింపఁబడి ఆ మత సిద్ధాంతములనే ప్రచారము చేయునట్టిదగుటయు, నా రెండు తెఱంగుల కవిత్వముకూడఁ బూర్తిగా లభ్యముగాక కొంత శిథిలమై కొంత జనముఖమాత్ర స్థితమై బహుళ ప్రచారము నందకపోవుటయు, నన్నయ రచించిన కావ్యము భాషచే, భావములచే, వస్తువుచే, వర్ణనాదికములచే, కవితచే, పవిత్రతచే మహోదాత్తమై యలరారుటయు నాతని కాదికవి యను ప్రథ తెచ్చిపెట్టినవి. నన్నయ భారత మాదికావ్య మనఁగా నుత్తమ శ్రేణికిఁ జెంది మనకు లభించుచున్న కావ్య జాలములో నది మొదటి దని యర్థము అంతేకాని యంతకుముందు కవిత్వముకాని కావ్యములుకాని లేవని యర్థము కాదు. నన్నయ భారతమువంటి యుత్తమ కావ్య మాకస్మిక ముగా నవతరించె ననుటయు విశ్వసనీయము కాదు.

భారతము వంటి యుద్గ్రంథమును మూలార్థము చెడకుండఁ దెనుఁగున రచింపవలెనని యెవ్వరైనఁ గోరుట సులభమే కాని యా రోజులలో నట్టి కార్యభారమునకుఁ దల యొగ్గుట మాత్రము సులభ సాధ్యము కాదు. అప్పుడు మహా కావ్య రచనానుకూలమైన విస్తృతికాని ఛందస్సామగ్రి కాని తెలుఁగున లేకుండెను. ఉన్న భాషయైనను స్థిరమైన రూపము వహింపక పలుప్రదేశములఁ బలు తరగతుల ప్రజలచేఁ బలురకముల మాటాడఁబడుచుండెను. ఆదర్శముగా గ్రహించి యనుసరించుట కంతకుఁ బూర్వ ముత్తమ కావ్య మేదియు లేకుం డెను. మొదటినుండి తుదిదాఁక శ్లోకమయమై యుండిన భారతమును బద్య కావ్యముగా వ్రాయవలెనో గద్య కావ్యముగా వ్రాయవలెనో లేక చంపూ కావ్య ముగా వ్రాయవలెనో తెలియదయ్యెను. సంస్కృత భారత ప్రతులైనను అన్నియు నొకరీతిగా నుండక ప్రక్షేపములతో నిండి బహు రూపములుగా నుండెను. అది వేదతుల్యముగాఁ బరిగణింపఁ బడుచుండుటచే దానిని దేశ భాష యైన తెలుఁగులో వ్రాయు విషయమునఁ బండితు లందఱికి నైక కంఠ్యము లేకుం డెను. రచించు సామర్థ్యము గలవా రనేకులు లేకపోయినను రచించిన పిమ్మట విమర్శించు దోషజ్ఞుల సంఖ్య బహుళముగా నుండెను. ఇట్టి పరిస్థితులలో రాజు కోరికను వెంటనే పూరింతునని పూనుటకుఁగాని, నావల్లఁ గాదని విరర్థకము చేయుటకుఁ గాని నన్నయకు భార మనిపించెను. 'అమలిన తారకా సముదయం

బుల నెన్నను' ఇత్యాదిగాఁగల పద్య మప్పటి యతని మనఃపరిస్థితిని జక్కఁగా వ్యక్తము చేయుచున్నది. చివర కాలోచించి రాజా ననుమతంబును విద్వజ్జనుల యనుగ్రహంబును జేకూరును గదా యను తలంపుతో నాతఁ డా బృహద్భారమును వహింప నడుము కట్టెను. కాని నిజముగాఁ 'గావ్య రచనకు శ్రీకారము చుట్టుటకుముం దాతఁడు సిద్ధము చేయవలసిన పూర్వరంగ మెంతో యుండెను ఆ పూర్వరంగము నుచితరీతి నిర్వహించుటలోనే నన్నయ యపూర్వమైన ప్రతిభ గోచరించును. ఇ త ర క వు లు కావ్య రచనారంభమునకు ముందు పొందు "కృత్యాద్యవస్థ" కేవల మంతరంగమునకు సంబంధించినది. అనఁగా వారు వస్తు సంవిధానము, భావ ప్రకటనము, రస పాత్ర పోషణము మున్నగు కావ్యాంతః స్వరూపమును దీర్చి దిద్దుటకే క్లేశపడవలెను. మఱి నన్నయ పొందిన 'కృత్యాద్యవస్థ' అంతరంగ బహిరంగములు రెంటికిని సంబంధించినది అనఁగా నాతఁడు కావ్యాంతః స్వరూపమైన భావాదికమునువలె బహిఃస్వరూపమైన భాషా ఛందస్సుల సమకూర్చుకొనుటకుఁగూడఁ గ్లేశపడవలసి వచ్చెను. ఆతఁ డంధకార బంధురము నగమ్యమునైన యడవిలో నఖిల జన సుగమమైన ఘంటాపథమును కష్టపడి కల్పించెను తరువాతి కవులు తీర్చి దిద్దిన యా దివ్యాధ్వముపై ననాయాసముగఁ గవితాయానము సాగించిరి. అందుచేతనే వారెల్లరు తమ కావ్యారంభములం దా సకల సుకవి జన వినుతుని శుభ నామమును భక్తి పూర్వకముగా సంస్మరించి యుండిరి.

నన్నయ భారత రచనానుకూలమైన భాషా సామగ్రి నెట్టు లలవఱుచుకొనెనో తొలుతఁ బరిశీలింతము క్రీ. శ. ప్రథమ శతాబ్దికిఁ బూర్వము నుండియుఁ ద మి ళాం ధ్ర క ర్ణా ట భాషలు త ల్లి భా ష యై న మూల ద్రా వి డ ము నుం డి వి డి వ డి దేశకాలానుగుణమైన ప్రత్యేక పరిణామము నొంద మొదలిడెనని తలంపవచ్చును. ఆ పరిణామ క్రమమున వానికి సంస్కృత ప్రాకృత భాషా సాహిత్యములతో సన్నిహిత సంబంధ మేర్పడుట సంభవించెను. ఈ సంబంధము రాజకీయ సాంఘిక పరిస్థితులందలి వ్యత్యాసమును బట్టియు, దూర సామీప్యాది భేదములను బట్టియు నాంధ్ర కన్నడములం దెక్కువగాను దమిళమునందుఁ దక్కువగాను గన్పట్టుచున్నది తమిళ భాషా సాహిత్యములు క్రీ. శ. ప్రథమశతాబ్దినాఁటికే యొక విధమైన స్థిరాకృతిని బొందియుండుటచే దానియందుఁ గంటె ద్రవరూపమున నుండిన

యాంధ్ర కన్నడ భాషలందు సంస్కృత ప్రాకృత భాషలప్రభావము హెచ్చు సంక్రమించుట కవకాశ మేర్పడెను. మఱియు క్రీ. శ. మొదటినాలుగైదు శతాబ్దములలో నాంధ్ర కర్ణాటకముల నేలిన రాజులలోఁ గొందఱు ప్రాకృత మును గొందఱు సంస్కృతమును నభిమానించుటచే జనసామాన్యము వ్యవ హారములో నుండిన తెలుఁగు కన్నడభాషలందుఁ దద్భాషా సాహితీరీతులు కొన్ని చొచ్చుట సంభవించెను. సంస్కృత ప్రాకృత భాషలందు నిష్ణాతులైన పండితులు దేశభాషాసాహితీ పరిస్థితులను గమనించి తమకు సుపరిచితములైన యా భాషలలో వానిని సమన్వయించి వానికి లక్షణము నిర్ణయింప దొరకొనిరి. అందుచే దేశభాషా సాహిత్యముల కేర్పఱుపఁబడిన లక్షణములు సంస్కృత ప్రాకృతములందలి వానికిఁ బ్రతిబింతములగుట యనివార్య మయ్యెను. ఈ పరిస్థితుఁలో సంస్కృత ప్రాకృత సమములైన పదములు కూడ విశేషముగా దేశభాషలలోఁ బ్రవేశించెను. క్రమముగాఁ దత్సమపద బహుళమైన భాష శిష్టజనులందును, దేశ్యపదబహుళమైన భాష సామాన్యజనులందును వ్యాప్తి చెందుట సంభవించెను. రాజాస్థానమునందు శిష్టజనులకే యెక్కువ పలుకు బడి యుండుట కవకాశముండును గావునఁ దత్సమ భూయిష్ఠమైన వారిభాషకే ప్రామాణ్యము కలుగుటయుఁ గవులు పండితులునైన వా రాభాషలోనే రచనలు కావింప నారంభించుటయుఁ దటస్థించెను. తత్సమపద భూయిష్ఠమైన భాష యందలి యత్యాదరముచే వారు సామాన్యజన వ్యవహారమునందలి దేశ భాష నీసడించుటయు నొక్కొక్కప్పుడు జరుగుచుండెను ఈ పరిస్థితి కన్నడ దేశమున క్రీ. శ. 8, 9 శతాబ్దముల నాఁటికే యేర్పడిన ట్లందలి ప్రథమ లక్షణ గ్రంథమైన కవిరాజమార్గము వలనఁ దెలియుచున్నది. తత్కర్తయైన నృపతుంగుఁడు తనకాలమున సామాన్యజన వ్యవహారమున నుండిన పఱగన్నడ మును గూర్చి చెప్పుచుఁ దాను కన్నడభాషా స్వరూపమును బాగుగాఁ జెప్పఁ గలుగుట యసాధ్యమనియు, నది పరమాచార్యులకే సరిగాఁ దెలియదనియుఁ, గన్నడ దేశీయులైన జనులే యా విషయమున సమర్థులనియు, దేశ భిన్నభిన్న ములుగా నుండుటచే నందలి కావ్యదోషములిన్నియని విచారించి నిశ్చయించి చెప్పుట వాసుకికిఁ గూడ నశక్యమనియు, నప్పటికి నిల్చియున్న కావ్యములను దల్లక్షణములను నవశ్యాదరణీయములుగా భావించి లక్షణజ్ఞాన మంతగా లేనివా రా పఱగన్నడమును బాడుచేసి చెప్పెదరనియు, నది సుందరముగాదని వారికే

తెలియుననియు, నది పురాణకావ్యములం దా కాలమునుబట్టి యింపుగానే యుండినను దనకాలమునకు జరద్వధూ విషయసురత రసికతనుబోలి విరసంకరమగుననియుఁ దెల్పి సమసంస్కృతమును గన్నడభాషలోఁ గలిపి చెప్పు పద్ధతిని బ్రశంసించి యున్నాఁడు[1]. ఇదంతయుఁ జూడ జనవ్యవహారమునందలి ప్రాచీన కన్నడభాషను ద్రోసిపుచ్చి సంస్కృత భూయిష్ఠమైన తత్సమభాషను బ్రచారమునకుఁ దెచ్చుటకుఁ జేయు యత్నముగాఁ గానిపించుచున్నది తొలిరోజులలో సంస్కృతభాష యందలి పదములను, పద్ధతులను, దేశభాషల లోనికిఁ జొప్పించుట యెట్లనునదే పండితులకును లాక్షణికులకును బ్రధాన విచారమైనట్లు పొడగట్టుచున్నది సరిగాఁ గన్నడమునఁ గన్పట్టు నీ పరిస్థితియే తెలుఁగు దేశమునఁగూడ వర్తిల్లినది. కాని చాళుక్యరాజులు దేశిభాషయం దభిమానము కలవారగుటచే నం దీ పరిణామము కొంచె మాలస్యముగా నావహిల్లినది తెలుఁగున వ్రాయఁబడిన శాసనములలోఁ దొలుతఁ గొంత ప్రాకృత భాషా సంపర్క మధికముగాఁ గానిపించును. తరువాతఁ బ్రాకృత భాషాపదముల సంఖ్య సన్నగిల్లుటయు వానిస్థానమున సంస్కృత పదములు ప్రవేశించుటయు జరిగినది. కాని యప్పుడుకూడ దేశిపదముల సంఖ్యయే శాసనములం దధికముగాఁ గానిపించును. తరువాతఁ గ్రమముగా నన్నయ నాఁటికి వాని సంఖ్య తగ్గి తత్సమ భూయిష్ఠమైన భాషయే ప్రచారమునకు వచ్చుట తటస్థించినది నృపతుంగుఁడును దత్కాలమునందలి కవిపండితులును గన్నడ భాషకుఁ జేసిన సంస్కారమునే నన్నయ యాంధ్రభాష కొనరించి శబ్దశాసనుఁడుగా ప్రసిద్ధికెక్కినాఁడు. అనఁగా సంస్కృతమునందలి యజంత హలంత నామములను విశేషణములను దెలుఁగునకుఁ దెచ్చుకొనునప్పుడు వాని చివర నెప్పు దే యే

---

1. అరిదాదం కన్నడదొళ్ - తిరికొఱెగొండ ఱియె పెఱ్వెనంబుది దార్గం
పరమాచార్య రపోల్స - ఱ్తిరల్ అఱియర్ కన్నడక్కెనాడ వరోజర్
దోసమినితెందు బగెదు - ద్భాసిసితఱి నందు కన్నడం గళొళెందుం
వాసుగి యుమఱియ లారదె - బేసరుగుం దేశి బేఱె బేఱప్పుదఱిం
నెలసిద కావ్యం కావ్య - క్కెలతుణం సతత మెన్నెపతి గన్నడమం
పాలడిసి నుడివరాగమ - బలహీనర్ దేసియల్లి దెందరి దిర్దుం 1-48
దొరెకొండి రెసొగయిసుగుం - పురాణకావ్య ప్రయోగ దోల్ తత్కాలం
విరసంకరమవు దేసిగె - జరద్వధూ విషయసురతరస రసికతవోల్. 1-50

ప్రత్యయములను జేర్పవలయునో నిర్ణయించి దేశపదములతో వానిని గూడఁ గలిపి రచనచేయు పద్ధతిని నెలకొల్పినాఁడు. అంతకుఁ బూర్వముకూడ నిట్టి పద్ధతి లేకపోలేదు. కాని యది పరిణామదశయందుండెను నన్నయ దాని కొక విధమైన స్థిరత్వమునిచ్చి భారతమును దానికి లక్ష్యము గావించెను

నన్నయకుఁ బూర్వమునందలి శాసనములలో సంస్కృత పుంనపుంసక లింగనామములు పొందిన రూపములు కొన్ని యీ క్రింద నొసంగఁబడు చున్నవి. వీనిని బట్టి యొకే రూప మప్పు డెంత వైవిధ్యమును బొంది యవ్యవస్థితముగా నుండెనో తెలియవచ్చును ఈ రూపములు వైవిధ్యమును, భిన్నత్వమును విడిచి నన్నయ భారతమున స్థిరత్వమును బొందినవి. తత్సమ పదములను దెలుఁగు భాషలోనికి గ్రహించుపట్ల నన్నయ కావించిన సంస్కార మిచ్చటఁ బొడఁగట్టును.

ధనంజయులు - ఎరికల్ ముతురాజు ధనంజయుని కలమళ్ళ శాసనము.

పాతకు అగు - చోళ మహారాజు ఉరుటూరు శాసనము.

పుణ్యకుమారున్డు - పుణ్యకుమారుని తిప్పలూరి శాసనము

అరివరజ మున్డు, శ్రీ మహేన్ద్రన్ } - రెండవ మహేంద్రుని బుదిగడ్డిపల్లి శాసనము.

గుణగణాభరణున్డు - ధర్మవరము శాసనము.

సత్యదితున్డు - సత్యాదిత్యుని పొట్లదుర్తి మాలెపాడు శాసనము.

మహాపాతకస క్రూరగున్ - విశ్వర్త్రి శాసనము

పండరంగు ... పరమ మహేశ్వరుండు - అద్దంకి శాసనము

గణ్డసంకలీన్డు - 300 ( 1922 )

అపిమనగంగు - 811 ( 19 7 ) అభిమాన గంగః

కల్లెగణ్డ రామణ్డు - 342 ( 1922 )

చామియన్ - 268 ( 1922 )

శ్రీ త్రిభువనాదిత్యన్ - 2~1 ( 1922 )

కామిసీబొజ్జ మార్తణ్డఅల్గి - 342 ( 1922 )

పులవుణ్డు - 403 ( 1904 )

ఈ రూపములన్నియు నన్నయభారతమున ధనంజయుఁడు పాతకుఁడు అనునట్లుగా బిందుపూర్వక డు వర్ణముతోఁగూడిన రూపములుగా స్థిరపడినవి. అనఁగా నంతకుఁ బూర్వముండిన వివిధరూపములను బరిశీలించి నన్నయ వాని యన్నింటిలోఁ దనకు మంచిదని తోఁచిన పై రూపమును గ్రహించినాఁ డన్న మాట ఇట్లే సంస్కృత నపుంసకలింగ రూపములుకూడఁ దనకుఁబూర్వము వైవిధ్యముతోఁగూడియుండ నన్నయ వానినన్నింటిని బరిశీలించి, బువర్ణాంతము లగురూపములను బరిహరించి, ంబు, మ్ము, ము అను ప్రత్యయములతోఁగూడిన వానినే గ్రహించినాఁడు అతనికిఁబూర్వ ముండిన నపుంసక లింగరూపములు రకమున కొకటిగా నీ క్రింద నొసంగఁబడుచున్నవి.

| | | |
|---|---|---|
| వక్రబు | - 403 | ( 1904 ) |
| వక్రంబు | - | అహదనకర శాసనము. |
| సిద్ధాయబు | - | గురిందగుంట శాసనము. |
| సిద్ధాయంబు | - | చోడమహారాజు సూర్యగ్రహణకాల శాసనము. 595. S I. I. X |
| శ్రీ బ్రహ్మేశ్వరమ్ | - 268 | ( 1922 ) |
| పాతకచ్చేసినవాని | - | పొట్లదుర్తి మాలెపాడు శాసనము. |
| ఉద్యోగమ్మ | - | మూఁడవ విజయాదిత్యుని ధర్మవరశాసనము |
| దమ్మునకు | - 384 | ( 1904 ) |
| ధర్మవు | - | గురిందగుంట శాసనము. |
| ద్రమ్మము | - | గురిందగుంట శాసనము. |
| సాసనవు | - | C P No. 10 (1908 - 1909) |
| రాజ్యమ్మున | - | నె. జి. శా. దర్శి. 2. |

కేవల దేశ్య భాషకుఁ గావ్య రచనార్హమైన విస్తృతి లేదనియు, సంస్కృతము నుండి శబ్దములను గ్రహించిననే కాని దానికిఁ బుష్టియు సౌష్ఠవమును జేకూరవనియు గ్రహించి నన్నయ తనకుఁ బూర్వ మున్న తత్సమ రూపము లన్నిటిని బరిశీలించి పై విధమున నందలి యుచిత రూపములఁ బరిగ్రహించి వాని కొక స్థిరమైన రూపము నొసంగెను. ఇట్లు సంస్కృత శబ్దములను దత్సమ ములుగాఁ జేసి తెలుఁగున నుపయోగించు పద్ధతికి విరుద్ధులైన యతి సంస్కృ

లాభిమానులును, గొంత యంతనుఁ బూర్ణము లేక పోలేదు. అనఁగా సంస్కృత శబ్దములను వాడుటయే సంభవించినచో వాని కెట్టి వికారమును గల్గింపక వాని సుబాద్యంతముగా సంస్కృతమున నుండు స్థిర రూపములతోనే వాడవలయు నని వారి వాదము. అట్లు సుబాద్యంతములైన సంస్కృత సిద్ధ రూపములను దెలుఁగు దేశ్యములతోఁ గలిపి వాడు పద్ధతికే మణి ప్రవాళ మనిపేరు. ఇట్టి శైలి యప్పుడుండె ననుట కాధారముగా నందు వ్రాయఁబడిన శాసనములు గాని కావ్యములు గాని లభింపక పోవుట నిజమే యైనను బాల్కురికి సోమనాథుఁడు వృషాధిప శతకమున నట్టి భాషలో నొక పద్యమును వ్రాసి చూపుటయుఁ గేతన యాంధ్ర భాషా భూషణమునఁ గొన్ని సంస్కృత రూపములు తెలుఁగు కవితలోఁ జొరవని ప్రత్యేకముగా సూచించుటయుఁ, తిక్కన నిర్వచనోత్తర రామాయణమున "జాత్యము గాని నొప్పయిన సంస్కృత మెప్పుడుఁ జొప్ప" నని ప్రతిజ్ఞ చేయుటయు నట్టి భాష యొకప్పు డుండె ననుటకు సాక్ష్యము లగుచున్నవి. తెలుఁగు నందే కాక యిట్టిది కన్నడమునఁ గూడ నొకప్పు డుండినట్లు తోఁచుచున్నది. ఏలయన నృపతుంగుఁడు కవిరాజ మార్గమున నట్టి ఫక్కి అగమ కోవిద విగలిత మార్గము కాదనియు, [1] అహరహః, ఉచ్చైః, నీచైః, ముహుర్ముహుః, ఇత స్తతః, అంతః, బహిః మున్నగు సంస్కృతావ్యయములను గన్నడమున వాడఁ గూడదనియు, వానికచో గరిమెయు మర్దెలయుఁ గలసి వాయించు నప్పటి జర్ఝర ధ్వని కలుగు ననియు నిరసించినాఁడు. అరవసుమారం. ఆయత తరకమె గణ్ణం మున్నగు నా సమాసములను గూడఁ బ్రయోగింప రాదని యాతఁ డందు శాసించెను. నన్నయయు నీ కవిరాజ మార్గ పద్ధతినే యాదర్శముగా గ్రహించి, నారాయణ భట్టాది మిత్రుల సాహాయ్యమున మణి ప్రవాళము నభిమానించు పండితులను నచ్చఁజెప్పి, తెలుఁగునఁ దత్సమ బహుళమైన భాషయే కావ్యోచితమైన భాష యని సిద్ధాంతీకరించెను. ఎవరెన ప్రతివాదము కానవచ్చినను ఆ సిద్ధాంతము నేఁటి దాఁక నిరంతరాయముగాఁ గొనసాగుచునే యున్నది.

బహువచన విభక్త్యాది ప్రత్యయములను స్వీకరించు సందర్భమునఁ గూడ నిట్టే నన్నయ కొంత క్లేశపడవలసి వచ్చెను. ఈ క్రింది పదములను బరికించి

---

1. సమసంస్కృతం గళొళ్ తఱ్తు మడిప్ రేకన్నడ మనఱిదు పేర్గెంబుదిరా గమ కోవిదరి గదితమా - ర్గమిదం చెరపళ్కా మాఱిరి వక్కరదొళ్.

నచో నాతనిముం దుండిన బహువచన ప్రత్యయముల పరిస్థితి కొంత యవగతము కాఁజాలును.

పొలగరుసున తాడ్లరేవ - నందంపూఁడి శాసనము.
కదు వండ్లు, అష్లు, వేడ్లుము - మంగి దొగరాజు లక్ష్మీపుర శాసనము.
అళ్లపట్లుసేను - జయసింహ వల్లభుని విప్పర్తి శాసనము
మహారాజుళ్లు - తుకరాజుళ్లు - చోళ మహారాజు ఇందుకూరు శాసనము
రెండు తోటళు - రామేశ్వర స్తంభ శాసనము.
రట్టగుళ్లు - రామేశ్వర స్తంభ చిలంకూరి శాసనములు.
గుడ్లు - జయసింహ వల్లభుని విప్పర్తి శాసనము.

గుడ్లుళను
వేగ విలలను } ఇలపకుఱ్ఱు శాసనము.
బ్రాహ్మణులను

భటా రళాకు
కన్న్యళను } విష్ణువర్ధన మహారాజు బుదమ వారాయలపాడు శాసనము.

ఊరి స్వాముళ్
కొ స్తుకళ్ } అహదన కర శాసనము
కొణ్డు కళ్

మలినురై - యుద్ధమల్లుని బెజవాడ శాసనము.
అలపాక బోళ్ - ఇంద్రవర్మ కొండనగూరు తామ్ర శాసనము.

ఈ విధముగా బహువచన ప్రత్యయము ళు, ళ్, కళ్, కళు, లు, ల్, రు అను భిన్నరూపములతోఁ గానవచ్చుచున్నది. ఒక్కశాసనములోనే యిది వివిధ రూపములతో గోచరించుట మఱియు విశేషము. ళ్లు వర్ణాంత రూపములుకూడ నక్కడక్కడఁ గనఁబడుచున్నను డ్లు వర్ణాంతరూపముల సంఖ్యయే యెక్కువగా నున్నట్లు తోఁచుచున్నది. ఈ రూపములన్నియుఁ బరిశీలించి నన్నయ లు, ల్ అను వానిని మాత్రమే బహువచన ప్రత్యయములుగా గ్రహించెను. ఇప్పుడు ముద్రితములైన భారతప్రతులలో గుళ్లువంటి ళ్లు వర్ణాంతరూపములుకూడఁ గనఁబడుచున్నను, అవి నన్నయ కంగీకృతములైన రూపములు కావనియు నతఁడు డ్లు వర్ణాంత రూపములనే సాధించెననియు, నాంధ్రశబ్ద చింతామణిలోఁ

గూడ " డలటా ముదితాంతస్య వాలుక్ " అను సూత్రమున త్రాడులు, త్రాడ్లు అను రూపములే సాధింపఁబడెననియు శ్రీ గంటి జోగి సోమయాజిగారు ఆంధ్ర భాషావికాసములో వ్రాసియున్నారు ( పుట 403 ).

ఇట్లే నన్నయకుఁ బూర్వమందలి శాసనములలో నాతని భారతములోఁ గనఁబడు విభక్తి ప్రత్యయములన్నియుఁ గానరావు. ష్టు, న్, ండు, బు,ంబు, వు మున్నగు ప్రథమైక వచన ప్రత్యయములను, లు, కళ్, కుళు, ళ్, ళు, రు మున్నగు బహువచన ప్రత్యయములను నప్పుడుండెనని యిదివఱకుఁ దెల్పఁబడినది. ప్రథమేతర విభక్తిప్రత్యయములలో

ను - వేకవిశాను - 403 ( 1904 )

| | | |
|---|---|---|
| | పాఱ జమ్పినవాష్టు | - రామేశ్వర స్తంభ శాసనము. |
| | మరమును | - బెజవాడ యుద్ధమల్లుని శాసనము. |
| ని | - దీనికాచి కుడిపినవారు | - పుణ్యకుమారుని వెలుదుర్తి శాసనము. |
| | వేంగినాణ్టి గొఱల్చ్రియ | - అద్దంకి శాసనము |
| తొ | - సామంత పదువతో | - అద్దంకి శాసనము. |
| | రమనతో బెజవాద | - యుద్ధమల్లుని బెజవాడ శాసనము. |
| తోఁడ | - సోఁడులతోఁడ పొడుచి పడియె | - కురుబలకోట శాసనము |
| | దన్తియ మంగుతోఁలన్ పొడుచి | - రెండవ మహేంద్రుని బుదిగడ్డపల్లి శాసనము. |
| | నొలంబితోఁటి కయ్యంబున | - గండత్రినేత్రుని శాసనము. |
| | రామవిభుతోఁడ | - చా. భీ ధర్మవరము శాసనము. |
| న | - రాచమానంబునన్ | - వెలుదుర్తి శాసనము. |
| చేత | - వారిచేత పట్టంకట్టబడి<br>వైదుంబులచేత పట్టంకట్టబడి | ముదివేడు శాసవము. |
| కై | - ప్లావిండి సముద్రరకై | - జయసింహ వల్లభుని విప్పర్ల శాసవము. |
| ఉండి | - చేఁబ్రోలునుండి | - యుద్ధ బెజవాడ శాసవము. |
| కిన్ | - ఇశెరేవికిన్ | - మాలెపాడు శాసనము. |
| | కొమరు సామికి | - యుద్ధ. బెజవాడ శాసనము. |
| కు | - పసులకు | - మదవపల్లికి పడమట శివాలయము నందలి శాసనము. |

| | |
|---|---|
| కార్తికేయునకు | - యుద్ధ. బెజవాడ శాసనము. |
| లో - వెన్నాజిలోజూపె | - ధర్మవరము శాసనము. |
| ఏళ్గవిలో | - 307 ( 1922 ) |
| లోన - కయ్యంబులోన | - బసివికొండ శాసనము. |
| లోపల - దొంకలోపలినేల | - వెంకయ చోళుని దొంగలసాని శాసనము. |
| అన్ - ప్రోలన్గల | - యుద్ధ. బెజవాడ శాసనము. |
| న - కయ్యంబున వైదుంబరాజుల | - నలజానంపాడు శాసనము. |

న - అశ్వమేధంబున ఫలంబు - విశ్వ త్రి శాసనము; నలజానంపాడు శాసనము అనునవి మాత్రమే కానవచ్చుచున్నవి.

పై. గుఱిచి, గుఱించి, చేన్, చేసి, మెయిన్, పొంటెన్, వలనన్, కంటెన్, కోలెన్, అందు మున్నగు ప్రత్యయములు నన్నయభారతమునం దున్నవి. కాని యంతకు ముందుండిన శాసనములలోఁ గనరావు. ఇందు చేసి, వలన, కంటె, పొంటె, మెయి, అనువానికి నేఁడు వ్యవహారములోఁ బ్రయోగము భ్రష్టమైనది. వల్ల, ద్వారా, గుండా, ఉంచి మున్నగునవి వాడుకలోని కెక్కినవి. తనకు ముందుండిన విభక్తి ప్రత్యయము లర్థభేదములను వ్యక్తముచేయుటకుఁ జాలమిచే నన్నయ క్రొత్త వానినిగూడ గ్రహించియుండును. నన్నయకుఁ బూర్వపు శాసనములలో సముచ్చయము ఉమ్, ఉం, ఉను అను మూఁడు రూపములతోడను గానవచ్చుచున్నది [1] నన్నయ యిందు మూఁడవదియైన ఉను అను రూపమునే గ్రహించి భారతమునఁ బ్రయోగించియుండెను.

ప్రాక్చాళుక్య యుగమునందలి శాసనములలోఁ గనవచ్చిన ఱ ( ఌ - కన్నడ ) కారము చాళుక్య యుగమునందలి శాసనములలోఁగూడఁ బెక్కు చోట్ల గోచరించుచున్నది. నన్నయకుఁ దరువాతి శాసనములలో పైత మీ ధ్వని విరళముగాఁ జూపట్టుచునే యున్నది. ఉదా.

| | | | | |
|---|---|---|---|---|
| క్రీ. శ. 1084 | జీవితమాఱ, నఱ పంగలవారు | S. I I | VI | 1015. |
| 1093 | మేఱయ దణ్డనాయక | .. | V | 1106. |
| 1107 | రజనరయన విణ్ణగరాఱు వారికి | .. | V | 81. |

1. ఈ విషయము వెనుకటి ప్రకరణమున వివరింపఁబడినది.

| | | | |
|---|---|---|---|
| | 1127 | చోఱ కులశేఖర | విక్రమచోళుని చేబ్రోలుశాసనము. |
| | 1142 | పఱమ నాయకురాలు | .. V 1142. |
| క్రీ. శ. | 12 | వేలమ నూఱలు, మఱనూఱలు కుముదాఱలు, నరియాఱలు, అర్ధనూఱలు | రాజరాజ చోడగంగుని టేకిశాసనము. |

నన్నయ భారతమున దీనిని బరిహరించెను. ఇది పెక్కుచోట్ల డ, శ, ఱ, అను నక్షరములుగా మాఱినది. దీనిని బట్టి నన్నయయు నతనికాలమునందలి పండితులును దానిని బ్రామాణికముగా గ్రహింపలేదనియు, నది క్రమ క్రమముగాఁ బ్రయోగ వైరళ్యమును బొంది పూర్తిగా భ్రష్టమై పోయెననియుఁ దెలియుచున్నది. తెలుఁగున వలెనే యది ప్రాచీన కన్నడమున నుండినను దరువాత నదృశ్యమైపోయినది. దీనితో సదృశమైన యుచ్చారణగల యక్షర మొకటి తమిళమునఁ గలదు. ఱ కాని యక్కడఁగూడ దాని కెల్లయెడల సమానమైన యుచ్చారణము లేమియు, నది క్రమక్రమముగా భ్రష్టమై రూపాంతరమును బొందుచుండుటయుఁ గానవచ్చుచున్నది.[1]

ఇట్లే ణ్డు అను ధ్వనియు నన్నయకుఁ బూర్వము ప్రచురముగనే యుండినను అతని భారతములోఁ బ్రవేశించి యుండలేదు. అతని నాఁటి కది ణ్డు, ండు, అను రూపములను బొందినది. ఈ పరిణామ మాతనికి ముందుండిన శాసనములలోఁ గూడఁ గొన్నిచోట్లఁ గానవచ్చుచునే యున్నది.

సత్యాదితుణ్డు, ఏలుచుణ్డి, చెడువాణ్డు, తోగొన్న వాణ్డు, పాతకుణ్డకున్ (చోళ రాజుల శాసనములలోని రూపములు)

గుణగణా భరణుణ్డు, తమ్మణ్డు, చిత్రజాత సముణ్డు మున్నగునవి ణ్డుగా మాఱిన రూపములు.

---

1. Even the Tamils cannot pronounce this letter correctly and in some districts substitute ళ. య and ర for it or omit it altogether. In Madras య and ర are used by the lower classes while in Madura and Tinnavelly ళ is preferred (Tamil studies by M Srinivasa Iyengar ఆ. భా. వి పుట. 91).

ఈ పరిణామమును గనిపెట్టి యాతఁడు ణ్డు. ండు. ఁడు అనువానితో నంత మొందు రూపములనే స్థిరపఱిచినాఁడు

నన్నయకుఁ బూర్వము శకట రేఫముయొక్క ప్రయోగము చాలఁ దఱచుగాఁ గానవచ్చుచున్నది. నేఁడు లఘు రేఫములతో స్థిరపడిన పదములు పెక్కప్పుడు శకట రేఫములతోనే వ్రాయఁబడుచుండెను. అదియుఁగాక శకట రేఫమును సంయుక్తాక్షరములలోఁ గ్రిందను మీఁదను గూడ వ్రాయు నాచార మప్పుడుండెను.

వ్ఱచ్చిన, చేఱ్బోలనుండి, ఎనుబొన్ద, వైదుంబఱ్హోలు, ఇఱ్లకాను, తూఱ్పు, మాఱ్పిడుగు, ముయ్యాలి కుట్ఱున, మున్నగున విందుకుఁ దార్కాణములు నన్నయ వీనివి బ్రామాణికములుగా గ్రహింపక సంయుక్తాక్షరములలో శకట రేఫమును బ్రయోగించు పద్ధతిని విసర్జించెను.

ఇంక నృపతుంగుఁడు కవిరాజ మార్గమునఁ బఱ గన్నడమును గూర్చి వ్రాసిన విషయ మంతయు నన్నయకుఁ బూర్వము నందలి తెలుఁగు దేశ్యమునకుఁ గూడ సమన్వయింప వచ్చును. అది దేశ కాల పాత్ర భేదము ననుసరించి భిన్నభిన్న విధముల నుచ్చరింపఁబడుచు నా విధముగానే వ్రాయఁబడుచుండెను. అందుచేతనే యొకే రూపము వేఱువేఱు స్థలములలో వేఱువేఱు రూపములతోఁ గనఁబడుచుఁ జదువువారికి సందేహమును అర్థ క్లేశమును గలిగించుచుండును. నన్నయకుఁ బూర్వ మా భాష కింకను నిశ్చితమైన గ్రాంథికరూప మేర్పడినట్లు తోఁపదు. అది యప్పుడే వ్యావహారిక దశనుండి గ్రాంథికత్వము నొందుచుండినట్లు కానిపించును. రూప బాహుళ్యము, రూప వైవిధ్యము ఆ కాలమునందలి భాషయొక్క లక్షణములు. వ్యావహారి కావస్థయం దుండిన భాషలలో నిట్టి లక్షణములు గానిపించుట సహజమే. అప్పుడు తార్కికుల మతమున బ్రత్యక్షావస్థాయియైన యుచ్చారణమే దానికిఁ బ్రమాణము. నన్నయ తన కాలమునఁ బ్రజల వ్యవహారమున నుండినదియు, శాసనాదులం దుండినదియు నగు దేశ్య భాష నంతను బరిశీలించి వైవిధ్యముతోఁ గూడి చిత్ర చిత్రముగా నుండిన యందలి రూపములకుఁ దత్సమ శబ్దములకు వలెనే యొక స్థిరమైన రూపము నొసంగుటకు యత్నించెను. అంతవఱకును నొక వ్యవస్థలేక యది యుపయోగించువారి యభిరుచ్యభ్యాసములపై నాధారపడి యుండెను.

తూఱువ్వ నూర్ల బాదెయ్య రట్టొడ్లు 408 (1904)
తుఱుగు నుడ్ల బాదెయ్య రట్టొడ్లు 408^A (1904)
తూపుఁన 340 (1905)

తూర్పు అను శబ్దమే శాసనములలోఁ బై మూఁడు రూపములతో వ్రాయఁబడినది. అట్లే యిప్పుడు మనము వాడు రెడ్లు అను శబ్దము శాసనములలో రట్టొడ్లు రట్టాడ్లు 341 (1905) రట్టగుళ్లు (రామేశ్వర స్తంభ శాసనము) చిలంకూరు శాసనము. రటగుడ్ను (400 – 1904) రట్టడ్ను (400D–1900) రాడ్లు 408 A (1904) అని బహువచనమందును రట్టకుడి. రట్టోళ అని యేక వచన మందును గానవచ్చు చున్నది. కొన్ని శబ్దములకు శాసనము లందుఁ గనఁబడు రూప వైవిధ్య మీక్రింద సూచింపఁ బడుచున్నది.

ఏలు· ఏళ్లవాన్లు 797–1917 ఎల్లుంగా 408 (1904)
ఏలన్ (చిలంకూరి శాసనము) ఏళుచుణ్డి 338 (1922)
ఎళ 495 (1906)

పాఱువారు పాఱువారికి 338 (1922) పాఱళ్లు 287 (1905)
పాఱళ 384 (1904) పాఱ (రామేశ్వర స్తంభ శాసనము)
పఱాను (లక్ష్మీపుర శాసనము) పాఱ్లు (చిలంకూరు శాస.)

పొడుచు· పొడుచి (బుడ్డి గడ్డిపల్లి శాసనము)
పొడిచి (వైదుంబరాజుల శాసవము)
పొడిచ్చి (చిన్న తిప్పసముద్ర కురుబలకోట శాసనములు)

పెండ్లము· పెండ్లంబు S. I I. 598
పెండ్లాంబులు 408 (1904)

కవిలె: గవిలల (చోళ మహారాజు సూర్యగ్రహణకాల శాసవము)
కవిళ (విష్ణువర్ధనుని సాలెపాడు శాసనము)
గవిలళ 401 (1904)
కవిలళాను 403 ( 1904 )

కూఁతురు — కున్తుఌ, కున్తులు 401 ( 1904 )
కున్తుళ్ 281 ( 1922 )

దీనికి — దినికి 401 ( 1904 ) దెన్నిల్పి 400 A ( 1904 )
దేనికి 403 ( 1904 )
తేని ఇందుకూరి శాస. చిలంకూరు శాస.

దుగరాజు — దుకరాజు (ఎఱ్ఱగుడిపాడు శాసనము)
తుగరాజు ఌ (ఉరుటూరు శాసనము)
దుగరాజుల్ (ఇందుకూరి శాసనము)

మఱుత్రు (మానము) — మఱున్తుఌ - ఎఱ్ఱగుడిపాడు, చామలూరు శాసనము.
మఱుతున్డు - చిలంకూరి శాసనము
ప్రితుడ్లు - రేమయ్య శాసనము
మఱుతుడ్లు - బికిరాజు శాసనము

పన్నస — పన్నస - ఎఱ్ఱగుడిపాడు శాసనము
పన్నాస - ఉరుటూరు శాసనము.
పన్నవీస - వెలుదుర్తి శాసనము

ప్రోలు — పుఱోళ పార - తిప్పలూరు శాసనము.
వ్ఱోలు

(అఱ్ఱి) ఒచ్చు — ప్రచిన వాణ్డు - కొసినేపల్లి శాసనము
వ్ఱచ్చిన - పెద్దముడియం శాస.
ఱిచ్చినవన్టు - చిలంకూరు - అగస్త్యేశ్వర శాస.
అఱిసిన వారి - బూడిదగడ్డపల్లి శాస.
వచ్చిన - నెల్లూరు Vol II 676 పుట

నన్నయకు శబ్ద శాసనత్వమును గలిగించిన ప్రధాన కారణములలో నాఁ డవ్యవస్థితమైన తెలుఁగు శబ్దముల కొక వ్యవస్థ నేర్పఱచి వానికి రూపస్థైర్యము నొసంగుట యొకటని నిస్సందేహముగాఁ జెప్పవచ్చును.

నన్నయకుఁ బూర్వమందుఁగల శాసనములలోఁ బెక్కుచోట్ల వణలు, ళళలు, శషలు, తారుమాఱుగా వ్రాయఁబడుచున్నవి. అందుకుఁ దొలి రోజులలోఁ

దెలుఁగుభాషపై నుండిన ప్రాకృత ప్రభావము కొంతవఱకుఁ గారణమై యుండవచ్చును. కొన్నిచోట్ల దానికి శాసనలేఖకుల యజ్ఞతకూడ హేతువై యుండుటలో వింతలేదు ఈః పై వర్ణముల విషయముననే కాక మఱికొన్ని యితర వర్ణముల విషయమునను, గొన్ని పదముల విషయమువను సుప్రసిద్ధ ములైన సంస్కృత పదములను వ్రాయు విషయమునను గూడ వైవిధ్యము గోచరించుచున్నది.

గొణిన - 400 (1904) ఎణ్బోది (ఎనిమిది) జయసింహ వల్లభుని విప్పర్ల శాసనము.

పణిగణి - 314 (1922) వేణ్డికొణి 401 (1904)

కళరేని - లక్ష్మీపుర శాసనము.

పణ్బ్, గొణి - అద్దంకి శాసనము.

గొణ్నవాన్రు - పెద్ద ముడియమ్ శివాలయ శాసనము.

బణిసేసిన - జయసింహ వల్లభుని విప్పర్ల శాసనము.

కిరనపురము - ఉత్తరాయన-నిర్వహనోద్యోగమ్మున- బ్రాహ్మన- భ్రమరాయ మాన- మూఁడవ విజయాదిత్యుని ధర్మవరపు శాసనము.

సాక్షి, సక్షి, శాక్షి, చాక్షి

శూర్య్యగ్రహన విమిత్యంబున

కొలవిస్తారకుణ్డు

మహారాజులాకు - జయసింహ వల్లభుని విప్పర్ల శాసనము.

భటారళాకు - బుదమనారాయలపాడు శాసనము.

భటరికి - బిసినికొండ శాసనము.

భటారలకు - S. I I. X 405

భటరళ - కపిలేశ్వరపుర శాసనము.

వార్ధిఁఖచునుండు- వెంకయచోళుని దొంగలసాని శాసనము.

వారణాసి అనుమాట బారనాసి (రామేశ్వర స్తంభ శాసనము)

బారణా (నల్ల చెరువుపల్లి శాస.) భారనా (విత్పత్తి శాసనము)

భారణాసి (బుదమ నారాయలపాడు శాస.) భారనాసి (బికిరాజు శాసనము)

వారణాపి (చిలంకూరు) అను వివిధ రూపములతోఁ గానవచ్చు చున్నది. ఈ వర్ణక్రమ దోషములను, రూపవైవిధ్యమును దొలఁగించి పైపద ములను అట్టి యితర పదములను శ్రుతి సుభగములైన యుచిత రూపములతో స్థిరీకరించుటలో నన్నయ పడిన శ్రమ భారతమునందలి ప్రయోగములను వైవా వితోఁ బోల్చునప్పుడు విశదము కాఁగలదు

నృపతుంగుఁడు కవిరాజమార్గమున మణిప్రవాళ శైలినివలెనే అరిసమా సములనుగూడ విరసించెనని యిదివఱకుఁ దెల్పఁబడినది. నన్నయయు నట్టి వైరి సమాసములను బరిహరించె ననుట కాతనికిఁబూర్వమున్న శాసనములలోఁ గొన్నిచోట్ల నట్టి సమాసములు కానవచ్చుటయే దృష్టాంతము. పోర్ముఖ రాముఁడు ( పోరు + ముఖ + రామ = అవిమొనరామునివంటి వాఁడని భావము ) అరివరజముఁడు; త్రిపువన సింగంబు ( పాటూరికి పడమరనున్న చెయ్యేరుతీరమునందలి శాసనము ) మున్నగు సమాసము లిందుకు నిదర్శన ములు. ఇట్టి సమాసములను నన్నయ పూర్తిగాఁ దొలఁగించినను అనింద్య గ్రామ్యము లనుపేర నట్టి వొండు రెండు తరువాతఁగూడ గోచరించుచున్నవి శివకవులు విశ్శంకముగా నట్టి సమాసములను దమ గ్రంథములలో నుపయో గించియుండిరి. తరువాతి కవులు కవిత్రయము వారి భారతమునఁ గనవచ్చు ననింద్యగ్రామ్యములను దప్ప నితరములైన యట్టి సమాసములను బ్రామాణిక ముగా గ్రహించియుండలేదు.

చాళుక్యయుగమునఁ బదవర్ణములవలెనే సంధులవిషయముగూడ నవ్యవ స్థితముగనేయుండెను. పెక్కుచోట్ల వచనమున నచ్చున కచ్చు పరమగునప్పుడు సంధిలేకుండ నుండుటయే ( విసంధియే ) తఱుచు. పద్య రచనలలోమాత్రము క్రీ. శ. 9 వ శతాబ్ది మధ్యభాగమునుండి సంధినియమములు పాటింపఁబడు చుండెననియే చెప్పవచ్చును.

ప్రథమంబు + ఏణ్డు = ప్రథమంబునేణ్డు అద్దంకి శాసనము.
బలగర్వంబు + ఒప్పగ = బలగర్వంబొప్పగ
సేవితుణ్డు + అఖిలుణ్డు + అనృతరిపుబలుఁడు + ఆహవవరణమోద్యసి
ఘాసనుణ్డు + అగణితదాన మాన్యుణ్డు = సేవితుణ్డ ఖిలు దనృతరిపుబలు

ణ్డాహవ రావరణ్ణ మోద్యసి ఘాసనుణ్డగణితదాన మాన్యుణ్డు -
కందుకూరు శాసనము.

లోహాసనంబు + ఎక్కి = లోహాసనంబెక్కి   చా. భీ ధర్మవరము
శాసనము.

సంకిలాండు + అనుజేని = సంకిలాండనుజేని
యుద్ధమల్లుణ్డు + అనవద్య = యుద్ధమల్లుండనవద్య.
వల్లభుణ్డు + అర్థిన్ = వల్లభుణ్డర్థిన్
భక్తుణ్డు + ఐ = భక్తుణ్డై
నృపధాముణ్డు + ఎత్తిచ్చె = నృపధాముణ్డెత్తిచ్చె
కాక + ఒరులు + ఇందు = కాకొరులిందు
ఫలము + ఉపేక్షించిన = ఫలముపేక్షించిన- యుద్ధమల్లుని
బెజవాద శాసనము.

సుతుణ్డు + ఒణ్డు = సుతుణ్డొణ్డు
మల్లణ్డు + ఎత్తించె = మల్లణ్డెత్తించె
కలశబు + ఇద్ద + అట్లు = కలశబిద్దట్లు
మొగమాదువు + అమరంగ = మొగమాదు వమరంగ
ధర్మవు + ఒదబడి = ధర్మవొదబడి

పై శాసనములందే వచనమునందు విసంధి కనవచ్చుచున్నది.

పరమ మహేశ్వరుణ్డు + ఆదిత్యభట్టారవికి + ఇచ్చిన
ఎనుబదిపుట్ల అఖ్లపట్టునేల - అద్దంకి శాసనము.
వారికి అశ్వమేధంబున ఫలంబుఅగు
బెజయరాజు + ఈ పురము-చా. భీ. ధర్మవరము శాసనము.

ఇతరవచన శాసనములందలి యుదాహరణములు

పుద్దనకాలు + ఇచ్చిన ( పొట్లదుర్తి శాసనము )
రేనాణ్డు + ఏళువేల + ఏలుచున్ది ( సత్యాదిత్యుని మాలెపాడు శాసనము )
నేలయు + ఉరువుటూరిబోళ ( లక్ష్మీపుర శాసవము )
పణ్డరంగును + ఈధర్మ ( ధర్మవర శాసవము )
పెన్వాఱు + ఇశెరేనికిన్ ( పొట్లదుర్తి శాసనము )

మహారాజుల్లోళన + ఇన్నుతొలి + అణవోతులు
చిరుమ్బూరి + ఉత్తరదిశ ( సత్యాదిత్యుని మాలెపాడుశాసనము )
కాశ్యపగోత్రునికి + ఇచ్చిన ( ధర్మవర శాసనము )
దేనికి + అహితమ్బు ( మాచెర్ల శాసనము )

*కొన్నిచోట్లఁ బొల్లు తరువాత వచ్చిన య చ్చాపొల్లుతో సంశ్లేషము నొందకుండ విడిగనే వ్రాయఁబడియున్నది.

సంవత్సరంబుళ్ + ఇరుభది ( దిమ్మగుడి శాసనము )
సంవత్సరంబుళ్ + ఎనుమ్బొది (జయసింహ వల్లభుని విప్పర్తిశాసనము)
ఏలన్ + ఎరిగల్ (రేనాటిచోళ శాస )
ఊరి స్వాముళ్ + ఇచ్చిన (అహదనకర శాస.)
ఏడువేలమ్ + ఏళుచున్ (వైదుమ్బరాజుల శాసనము)

పొల్లుతో దానితరువాత వచ్చిన యచ్చు సంశ్లేషము నొందనిచోట్లఁ గొన్ని యెడల యడాగమము కనవచ్చుచున్నది.

సంవత్సరంబుళ్ + యేవగు (రామేశ్వర స్తంభ శాసనము)

ఇట్లే కొన్నియెడల నుత్తున కచ్చుపరంబగువప్పుడు కూడ యడాగమము వచ్చిన చోట్లు కలవు.

చేంబ్రోలు + యేలెడు (యుద్ధమల్లుని బెజవాడ శాసనము.)
సంవత్సరంబు + యేనగు (దా. బీ. ధర్మవర శాసనము )

ద్రుతమునకుఁ బరమైన పరుషములు కొన్నియెడల సరళములుగా మాఱుటయుఁ గొన్నియెడలఁ బ్రకృతి భావము నొందుటయుఁ గానవచ్చుచున్నది.

ఇళెరేనికిన్ + తేని (పొట్లదుర్తిశాసనము)
మహారాజులకున్ + ప్రవర్ధమాన (జయసింహవల్లభుని విప్పర్తి శాస )
మరుత్రుగాను + ౘాగిరి ,,
నాకు బనిసేసిన
ఆత్మస్మతంబునన్ బచ్చిన
ఆజిలోన్ జూచె
చోళవిన్ జేకొని (దా. బీ. ధర్మవర శాస.)

తరువాతి వాఙ్మయమున బహుళముగాఁ బాటింపఁబడిన గ స డ ద వాదేశము చాళుక్య శాసనములలోఁ గొంచె మించుమించుగా నిత్యముగాఁ గానవచ్చు చున్నది. ( ఉదాహరణములు వెనుకటి ప్రకరణమున నీయఁబడినవి ) ఈ విధముగా నిశ్చిత వ్యవస్థ లేక నొకచోట నొక విధముగను ఇంకొకచోట నింకొక విధముగను గానవచ్చు సంధి పరిస్థితులు గమనించి నన్నయ సంధి నిత్యముగా వచ్చుచోట్లు, వైకల్పికముగా వచ్చుచోట్లు, బహుళముగా వచ్చు చోట్లు, రానిచోట్లు అనఁగా యడాగమము చేయవలసినచోట్లు నిర్ణయించి యా నిర్ణయము ప్రకారమే తన భారతమున సంధి నియమములు పాటించెను. ఈ నియమములే తరువాతి కవులకుఁ బ్రమాణములయ్యెను.

చాళుక్య యుగమునందలి శాసనములలో నచ్చ టచ్చట ఏజ్గె, చేసిరి, చచ్చిరి, పడియె, క్ణొచ్చె వ్రాపె మున్నగు భూతకాలిక క్రియలును, గొణ్డుౘి అగు వంటి తద్ధర్మ క్రియలును, కట్టించె, ఎత్తిఞ్చె, పెట్టించె మున్నగు ప్రేరణార్థక క్రియలును, పట్టమ్ కట్టఁబడియె మున్నగు కర్మణ్యర్థక క్రియ లును గలవని యిదివఱకుఁ జెప్పఁబడినది. ఇవిగాక క్త్వార్థక వ్యతిరేక క్త్వార్థక (కట్టిఞ్చి, విడిచి, పొడిచి, వడి, మెచ్చక, ఎఱుంగక) రూపములును, వెల్వరిఞ్చినన్ వంటి చేదర్థక రూపములును విరళముగాఁ గనవచ్చుచున్నవి. కాని మొత్తముమీఁదఁ బెక్కుశాసనములలో సమాపక క్రియలు లేని వాక్యములే హెచ్చుగాఁ గానఁబడును. అట్టి వానిలోఁ దచ్ఛబ్దానుప్రయుక్తమైన క్రియా జన్య విశేషములే క్రియావ్యాపారము నొనరించుచుండును (దీనికి వక్రమ్బు వచ్చు వాణ్డు బారనాసి వేవురు పాఱ జమ్పినవాణ్డు—రామేశ్వర స్తంభ శాసనము) దీనికి వక్రము వచ్చువాఁడు వేవురు బ్రాహ్మణులను జంపిన వాఁడగునని యిందలి భావము. ఇట్లు అగు, ఉండు ధాతువుల రూపముల నధ్యాహార్యము చేసికోవలసిన వాక్యము లీ శాసనములలోఁ గానిపించును. నన్నయ భారతమున నధ్యాహార్యము చేసికోవలసిన వీనిని సమాపక క్రియలుగా వాడి వ్రాసిన వాక్యములు పెక్కుగలవు.

రమ్యమగు సభాపర్వ మిలన్ ఆది 1-38.

అగు ననిమిత్తా గమంబు లయిన భయంబుల్ ఆది 1-86.

అవసర మాస్త్రీకున కిప్పుడయ్యె నంబుజనేత్రా ఆది 2-219.

ఈ అభ్యాసము నన్నయకుఁ బూర్వమందలి శాసనములలోఁ గూడ మూఁడు నాలుగు చోట్ల లేకపోలేదు.

పంచమహా పాతకు అగు (ఉరుటూరు శాసనము)
పంచమహా పాతక సంయుక్తు న్నగు (ఇందుకూరు శాసనము)

"ఇది సంస్కృత భాషా వ్యాకరణ జ్ఞానమువలన వచ్చినదే. వాక్యమునఁ గ్రియ ప్రధానమనియు, దాని స్వరూప మిదమిత్థమనియుఁ బాతంజల మహాభాష్యాది వైయాకరణ గ్రంథములందుఁ జేయఁబడిన సిద్ధాంతములందు నాఁటి పండితులకుఁ జాలపరిచయము కలిగి యుండినదని యూహింపక తప్పదుగదా. ఆ యభ్యాసమునఁ గాలక్రమమున పీనియం దధ్యాహృతములైన క్రియలగు ఉండు, అగు ధాతువుల రూపములు నన్నయకు ముందే కొంచెము కొంచెము ఉక్తములగుచుండఁ గాలక్రమమున నది గ్రాంథిక వ్యవహారమున స్థిర పడినట్లు నిరూపింప నగును....తనకు ముందు చాల నల్పముగా నుండిన యీ యభ్యాసమును నన్నయ స్థిరపఱిచెను" ఆం. భా. వి. 148-150. ఇట్లని నన్నయ భారత భాగమున నగు ధాతు వధ్యాహార్యము చేసికొనని రూపములు లేనేలేవని భావింప రాదు. కాని యట్టివి చాల తక్కువగా నున్నవి.

| | | |
|---|---|---|
| దాస్యమువలన విముక్తులగు వారము | ఆది | 2-56. |
| పాండుమహాదేవి నిద్రపోయిన యది | ,, | 6-179. |
| అవి పవయం బడిన యవి. | ,, | 6-222. |

మున్నగున విందు ఉదాహరణములు కాని నన్నయ వ్యతిరేకార్థక క్రియల తరువాత నగు ధాతువును దప్పక యనుప్రయుక్తము చేయుచునే యుండును.

| | |
|---|---|
| నల్ల లేదయ్యె నేని | ఆది. 2-32. |
| మీ పంపు పేయరైరి | ఆది. 3-5. |
| నమ్మ నేర నయ్యెదను | ఆది. 4-30. |
| పొరయరైరి వారు దురిత విధులు | ఆది. 3-12. |

పొరయరు, నేరను, లేదు, మున్నగు వ్యతిరేకార్థకములును, విముక్తుండను, విముక్తులరు మున్నగు వానియందలి ను, రు అంతమందుఁ గల పదములును విశేషణ ప్రాయములగుటచే వాక్యమును బరిపూర్ణ మొనరించుటకై నాఁ డగు ధాతురూపము ననుప్రయుక్త మొనరించుచు వచ్చెనని యూహింప నగును

దీనినే దృష్టియం దిడుకొని చిన్నయసూరి "భూతంబున లజీకి లిఙర్థంబగు నగు ధాతు వనుప్రయుక్తమగు" నని సూత్రము వ్రాసియుండెను.

సంస్కృతమున యత్తదర్థకములతోఁ గూడిన వాక్యములు తఱుచుగాఁ గానంబడు చుండును. "ఈ రెండు శబ్దములకును నిత్య సంబంధ మనియు నొక్కటి ప్రయోగించిన రెండవది అధ్యాహార్యమనియు సంస్కృత మర్యాద."1 ఇట్టి వానితోఁ గూడిన వాక్యయోజన ఆంగ్లమునఁ గూడఁ గలదు అందు దానిని Relative Construction అందురు. ఆ ఆంగ్ల సంప్రదాయము ననుసరించి యత్త దర్థకములను దెలుఁగున సంబంధ బోధక సర్వనామములని పిల్చుచున్నారు. "యదేవ రోచతే యస్మై - భవే త్తత్తస్య సుందరమ్" అనునట్లుగా వాక్యములను వ్రాయు పద్ధతి సంస్కృతమున నధికముగా గోచరించును. అట్టివానిని దెలుఁగున కనువదించు నప్పుడు యత్తదర్థకములతో వాక్యమును గూర్చుట కొంత యనుకూలముగాఁ గానఁబడును. అందుచే నన్నయ భారత మున నిట్టి ప్రణాళిక పెక్కుచోట్ల గోచరించును.

ఏయది హృద్య మపూర్వం
బేయది. యెద్దాని వినిన నెఱుక సమగ్రం
బై యుండు నఘ నిబర్హణ
మేయది యక్కథయ వినఁగ నిష్టము మాకున్ ఆ. 1 30.
ఎవ్వఁడు పొడిచి యొడిచె నతనినె వలతున్ ఆ. 8 110.

మున్నగున విందులకుఁ దార్కాణములు. ఇట్టి వాక్యయోజన నన్నయకుఁ బూర్వపు శాసనములలోఁ గూడ లేకపోలేదు. క్రీ. శ. 1006 వ సంవత్సరము నందలి బాపట్ల తాలూకా చేబ్రోలు నాగేశ్వరస్వామి యాలయములో లభించిన శ్రీమ దాహవమల్లదేవుని పరిపాలనకుఁ జెందిన శాసనములో "వేంగినాణ్టి కెవ్వరు రాజులైరి వారుం బూర్వ స్థితిం దప్పక పాలించువా"రను వాక్యమున నిట్టి యోజన స్పష్టముగాఁ గానఁబడుచున్నది. కాని యప్పుడు యత్తదర్థక ములను రెంటిని లోపింపఁజేసి క్రియాజన్య విశేషములకుఁ దచ్ఛబ్దానుప్రయో

1. ఆం. భా. వి. పుట 152.

గముచేసి వ్రాసిన వాక్యములే హెచ్చు. (వక్రమ్బు వచ్చువాన్దు .వేవ్రు పాఱ జమ్బినవాన్దు) ఈ వాక్యమును విస్తృతము చేసినచో యత్తదర్థకములతో వాక్యము వ్రాయవలసి వచ్చును. ఎవఁడు వక్రంబు వచ్చునో వాఁడు వేవ్రు పాఱఁజమ్బిన వాఁ డగునని యిందలి భావము. ఇందుఁగల రెండు వాక్యములకును ఎవ్వఁడు, వాఁడు అనునవి సంబంధమును గల్పించి వాని నేకవాక్యముగాఁ జేయుచున్నవి. "రచనలో సంక్షేప స్వరూపమైన ప్రాచీన వాక్యము తెనుఁగునకు స్వాభావికము తెనుఁగువా రితర ద్రావిడ భాషాభ్యాసముతో సమానమైన తమ పద్ధతి ననుసరించి తాము కల్పించుకొనినది." ఆం. భా వి 152. నేఁటికిఁ గూడ నదియే బహుళ ప్రచారమున నున్నది. కాని యర్థవిశేష బోధనమునందును, ఛందోరచనమందును విస్తృతమైన రెండవ ప్రణాళిక యెక్కువ యు ప యో గ క ర ము గా నుండుననుటలో సందేహము లేదు. "ఈ ప్రణాళికనే నన్నయ తన భారతమున నవలంబించెను." 152 పుట.

నన్నయకుఁ బూర్వమందలి శాసనములలో రెండు చోట్ల "వైదుమ్బుళ చేత పట్టమ్ కట్టబడియె; వారిచేత పట్టమ్ కట్టబడిన వాన్దు" అని కర్మార్థక వాక్యప్రయోగము కానవచ్చుచున్నది. సంస్కృతములో నిట్టి కర్మార్థక వాక్యములు తఱుచుగా వాడఁబడు చుండును. సంస్కృతమునుండి భారతమును దెనిఁగించు పట్టున నన్నయ పదు ధాత్వనుప్రయోగముతోఁ గూడిన కర్మార్థక వాక్యమునకుఁ బ్రాచుర్యము కలిగించెను. ద్రావిడ భాష లన్నింటియందు నిట్టి ప్రయోగము చాల విరళము. కర్మార్థక ప్రయోగము యొక్క ముఖ్య లక్షణములలోఁ గర్త్రపేక్ష లేకుండఁ గర్మకుఁ బ్రాధాన్య మొసంగుట ప్రధానమైనది. తెనుఁగున వ్యవహారములో నిట్టి ప్రయోగము అరుదుగా వినిపించును. కాని గ్రంథములం దక్కడక్కడఁ గనిపించుచునే యుండును. ఆంగ్ల భాషలోఁగూడ నీ ప్రయోగమునకుఁ బ్రాచుర్య ముండుటచేఁ దత్సంపర్కము కలిగిన పిమ్మటఁ దెనుఁగునఁగూడ నిట్టి వాక్యములకుఁ బ్రయోగ బాహుళ్య మేర్పడినది. అస లార్యభాషలలోఁ గూడ నది తొలుత లేకుండెననియుఁ, గాలక్రమమున నందు

జొచ్చెననియు భాషా తత్త్వజ్ఞులు చెప్పుచున్నారు[1]. అట్లే ద్రావిడ భాషలో మొదట లేకుండినను అట్టి ప్రయోగము క్రమక్రమముగా నందుఁగూడఁ బ్రవేశించినది. "అద్దాని నొక ప్రణాళికగా గ్రహించి దానికి వివిధరూప యోగ్యతయుఁ బ్రయోగ బహుళతయు నేర్పఱుచుటలో నన్నయ సంస్కృత వ్యాకరణ సంప్రదాయము ననుసరించె ననుట నిస్సంశయము ... . ఈ కర్మార్థకము తెనుఁగునందలి సంస్కృత వృత్తములలో ఛందస్సౌకర్యమును గలిగించు ననుటకూడ నన్నయ కుపకారకమే యైయుండును " ఆం భా.వి పుట 154-155

ఇంక ఛందో విషయము. నన్నయకుఁ బూర్వముండిన శాసనములలో దేశీయ చ్ఛందమునకుఁ జెందిన తరువోజ, మధ్యాక్కర, సీసము అను పద్యములు కానవచ్చుచున్నవి. రగడ, కందము, చంపకమాల మున్నగు నితర పద్యములు కూడ నప్పు డుండె ననుటకుఁ దార్కాణములున్నవి. మొత్తముమీఁద నప్పుడు మాత్రా ఛందస్సునకుఁ జెందిన జాత్యుపజాతులే హెచ్చుగా వాడఁబడు చుండెనని చెప్పవచ్చును నన్నయ వీనికిఁ దో దక్షరచ్ఛందమునకుఁ జెందిన పలు వృత్తములను సంస్కృతము నుండి గ్రహించి తన భారతమున వాడియుం డెను. సంస్కృత పదములను దత్సమీకరించు పద్ధతి యేర్పఱిచి వానిని దెనుఁగున విస్తారముగా వాడి, తెనుఁగు పద సంపదను విస్తరింపఁ జేసినట్లే యాతఁడు సంస్కృతమునుండి మత్తేభ శార్దూల చంపకోత్పలమాలాది వృత్తములను గ్రహించి తెలుఁగు నందలి ఛందస్సంపదనుగూడ మిక్కిలి విస్తృతము కావించెను. అతఁడు గ్రహించిన వృత్తము లన్నియు ధారాళమైన మంచి గమనము కలిగినట్టివే. బహు సంఖ్యాకములైన సంస్కృత వృత్తములనుండి ధారాళ గమనము గల చక్కని వృత్తములను మాత్రమే యెన్నుకొనుట నన్నయ ఛందః పరిజ్ఞానమునకుఁ దార్కాణముగా నున్నది. పంపాది కర్ణాట కవులు కన్నడమున గ్రంథములు వ్రాయ నారంభించినప్పు డిట్లే యొనరించిరి. ఛందో విషయమున వా రనుసరించిన పద్ధతియే నన్నయకు మార్గదర్శకమయ్యెను.

---

1 The Passive is a form acquired gradually by the diverse Indo-Europeon languages long after the system of their conjugation was completed in its principal l nes Breal Semantics P. 85 (ఆం.భా.వి. 154). The primitive Aryan verb possessed no passive voice In fact the passive is comparatively a late creation Science of Language Prof Sayce Vol II Page 158

ఛందో విషయమున వలెనే కావ్యమును జంపువుగా వ్రాయుటయందుఁ గూడ నన్నయకుఁ గన్నడ కవులే యొజ్జబంతులైరి. కన్నడ రత్నత్రయము వ్రాసిన గ్రంథములన్నియుఁ జంపూ పద్ధతినే రచింపఁబడియుండెను. మఱియు నన్నయకుఁ బూర్వమందుఁగల శాసనములలోఁ బద్యము తరువాతఁ గొంత వచనముగూడ నచ్చటచ్చట వ్రాయఁబడి యున్నది. ఇట్టి పద్య గద్యాత్మకమైన పద్ధతియే చంపూ పద్ధతి యనఁబడును. కన్నడ కవులు కావ్యములం దవలంబించిన చంపూ పద్ధతిని, శాసనములందలి గద్య పద్యోభయ రీతిని బాగుగాఁ బరిశీలించి నన్నయ భారతము నా పద్ధతిలోనే వ్రాయఁగడంగెను. అప్పటినుండి ప్రబంధ యుగము చివరివఱకు నొక్క విస్వచనోత్తర రామాయణమునఁ దక్క మిగిలిన యన్ని కావ్యములలో నీ చంపూ పద్ధతియే యవలంబింపఁబడి యుండెను. నేఁటి కవుల రచనలలోఁ బెక్కు పద్యైకరచనతోఁ గూడిన కావ్యములే కానవచ్చుచున్నవి. పూర్వ పద్ధతి ననుసరించి మహా కావ్యములను వ్రాయువా రిప్పటికిని జంపూ పద్ధతినే యవలంబించుచున్నారు. (విశ్వనాథ రామాయణము, శ్రీపాదవారి భారత రామాయణములు మున్నగునవి).

ఇట్లు మహాకావ్య రచనానుకూలములైన భాషా చ్ఛందములను, రచనా పద్ధతిని నిర్ణయించుకొని నన్నయ మహాభారత రచన కుపక్రమించెను. కావ్య బహిః స్వరూపమును దీర్చి దిద్దు వీనివి నిర్ణయించు కొనుటయందు వలెనే యందు వస్తు భావముల నౌచిత్య భాసురములుగా, నానుపూర్వి తప్పకుండ నేర్పఱుచుకొనుటలోఁ గూడ నన్నయ కష్టపడ వలసియే వచ్చెను. ఏలయన మహాభారతము గహనము వంటిది. ఇప్పటికిఁ గూడ విమర్శకులు వ్యాసప్రోక్తమైన మూల భారత స్వరూప మిద మిత్థమని నిర్ణయింపఁజాల కుండుటయే కాక యిట్లు చేయుట యసంభవ మని కూడ భావించుచున్నారు. మహా భారతమున వివిధ ప్రాంతములలో వివిధ కాలములలో బహు విధములైన ప్రక్షేపములు చొచ్చి యుండుట యిందుకుఁ గారణము. ఆ కాలమున ముద్రణ సౌకర్యము లేకపోవుటయు, నారంభ కాలమునఁ దాళపత్ర గ్రంథము లైనను లేక భారతము కూడ వేదమువలెఁ బండితులయుఁ బారకులయు ముఖస్థితముగా మాత్రమే యుండి పోవుటయు, వేద విషయమున నున్న కట్టుపాట్లు గాని అపౌరుషేయతా గౌరవము గాని భారత విషయమున లేకపోవుటయు నం దా ప్రక్షేపములు చొచ్చుట కవకాశము గలిగించినవి. ప్రక్షేపముల మాట యటుండ నందుఁ బాఠభేదముల సంఖ్య యపారముగా

నుండె ననుటలో నచ్చెరువు లేదు ప్రతు లందును అందలి పాఠ విశేషము లందే కాక కథానుక్రమణిక యందుఁగూడ వైవిధ్య ముండుటచే నం దే ప్రతి ననుస రింప వలెనను విషయము సైతము నన్నయకు విచారణీయమే యయ్యెను. అందుచే నాతఁడు లభ్యములైన ప్రతు లన్నియుఁ బరిశీలించి, యందుత్తమమైన దానినో వానినో నిర్ణయించుకొని, యసంఖ్యాకముగాఁ గనవచ్చు పాఠ భేదము లలో నుచితమైన వానిని గ్రహించి, పునరుక్తులు, ప్రక్షేపములు నని తోఁచిన వానిని బరిహరించి, యనౌచిత్యములను దొలఁగించి, వర్ణనాదుల నెచ్చటఁ బెంచ వలెనో యెచ్చటఁ దగ్గించ వలెనో నిశ్చయించి భారత రచనకు శ్రీకారము చుట్ట వలసి వచ్చెను. ముద్రిత ప్రతులు కావలసినన్ని లభించుచున్న యీ కాలములో సైత మిట్టి పనిచేయుట దుష్కరమే యనిపించుచుండ శిథిలములు, అస్పష్టములు, అసంపూర్ణములు, అపరిశుద్ధములు నైన తాళపత్ర ప్రతులు మాత్రమే లభించుట కవకాశ ముండిన యా కాలములో నది యెంత దుస్సాధ్యమో వేఱుగా వచింప నక్కఱ లేదు. ఎంత ప్రతిభాశాలికైన నొక్కనికి పని యశక్యముగా నుండును. ఈ సందర్భముననే నన్నయకు సహాధ్యాయుఁడును, బండితాఖండలుఁడు నైన నారాయణభట్టు కొంతవఱకు సాహాయ్య మొనరించి యుండును. ఆతఁ డొసంగిన తోడ్పాటు నిజముగా భారతము రచించుట యందుఁ గాక తద్రచనా విధానమును సుకరమొనరించు పై ప్రయత్నమునం దెక్కువగాఁ గలిగి యుండునని యూహించు టలో నసామంజస్య ముండదు.

ఈ విధముగా భారత రచన కారంభించుటకు ముందు నన్నయ పూర్వ రంగము నెంతో శ్రమపడి సవరించు కొనవలసి వచ్చెను. ప్రతిభాశాలియుఁ బాండిత్య సముద్రుఁడును గావున నాతఁడు దాని నెంతో సమగ్రముగా, సుమనః ప్రశంసా పాత్రముగా నిర్వహింపఁ జాలెను. ఈ ప్రయత్నములో నాతనికి సమాన వయః ప్రతిభా పాండిత్యములు గల నారాయణ భట్టు తోడగుట భారత సంగ్రామ మునఁ బాండవుల విజయమునకు నారాయణుని తోడ్పాటువలె నాంధ్ర భారతా వతరణమున కెన్నో విధముల సౌలభ్యము చేకూర్చెను. అందుచేతనే నన్నయ తన మిత్రుని సాహాయ్యమును భారతావతారికలోఁ గృతజ్ఞతా పూర్వకముగా

సంస్మరించి యుండెను. రాజ రాజునకుఁ గలిగిన భారతాంధ్రీకరణాసక్తి, నన్నయ యతి ప్రతిభ, నారాయణుని సాహాయ్య సంపద యను గంగా యమునా సరస్వతీ స్రవంతులు మూఁడును గూడి యాంధ్ర భారత మను త్రివేణీ సంగమమునకు రూపొసంగినవి. అది యాంధ్ర మహాజనుల కఖిల పురుషార్థ సాధనమై యల రారు చున్నది.

అమరావతి ప్రెస్, హైదరాబాదు,

# ముఖ్యవిషయానుక్రమణిక


అ

అగ్గపరాజు 150
అద్దంకి శాసనము 33 73
అనుస్వారము 58,176
అప్పకవి 101,105,310,314,327,
అయ్యనభట్టు 115,390
అల్లానేరేళ్ళు 327
అవ్యయములు 283
అశోకుఁడు 2
అహదనకర శాసనము 161,193మొద

ఆ

ఆంధ్రభాషావికాసము 65,182,410,
412, 413 మొద
ఆంధ్రాట్ఠకథ 15,17
ఆశీరాద్యర్థకము 275

ఇ

ఇక్ష్వాకులు 4,40

ఉ

ఉకారసంధి 296
ఉత్ఫుల్లకము 332
ఉదాహరణము 332

ఏ

ఏను 291
ఏం 323

ఔ

ఔపవిభక్తికము 211

క

కథాసరిత్సాగరము 19
కర్మార్థకము 278
కలమళ్ళశాసనము 170
కల్లినాథుఁడు 361
కవిజనాశ్రయము 104,105,106,107,
107,108,109,110
కవిరాజమార్గము 366,375,378 402,406
కళింగము 3 43
కాగ్నెట్స్ ద్రవిడియన్ 31,32,33
కాషేపండితుఁడు 25
కామసూత్రములు 24 FF
కాల్డ్వెల్ 5,10 11,154,163,190
197,230
కావ్యాలంకార చూడామణి 320,328,333-
342
కావ్యాలంకార సూత్రవృత్తి 331,353
కాశీఖండము 133
కిటెల్ 325
కీత్ ఏ బి. 14
కుమారస్వామి సోమయా 334
కుమారిలభట్టు 164
కృత్తద్ధిత ప్రత్యయములు 280
కృష్ణదేవరాయలు 101
కేతన 7,375,382
కేశిరాజు 153,163,186,197
క్త్వార్థకరూపములు 268
క్రియలు 258
క్షేమేంద్రకవి 96,98,99

గ

గజాంకుశుఁడు 96
గణపతిదేవుఁడు (కాంచి) 387
గద్యము 349
గసడదవాదేశము 292
గాథాసప్తశతి 17,18,27,28,29 34,65
గుణగవిజయాదిత్యుఁడు 70,73,74,761 78,535·
గుణాఢ్యుఁడు 19,24,25
గొబ్బిళ్లపాట 330
గోవరాజు (కాంచి) 311,341
గ్రియర్సన్ సర్ జార్జి 11,22

చ

చంపూ కావ్యము 72
చాణూరుఁడు 4,8
చిన్నయసూరి 223,226,273,292, 306,411
చేదర్థకము 276

జ

జయదేవుఁడు 109
జయవర్మ 38,42
జవానుపూర్ శాసనము 6
జాతులు (సంస్కృతదేశి) 312
జోగిసోమయాజి గంటి 36,45

ట

టోలిమీ 5

డ

డుబ్రెయిల్ 136

త

తద్ధర్మములు 271
తద్ధితరూపములు 281
తరతమభావము 256
తాలవ్యీకరణము 57 147
తిక్కనసోమయాజి 7,100,397 414
తిమ్మప్పయ్య 93
తుమున్నర్థకము 278
తేర్ నది 3
తొల్కాప్పియరు 59 61,210,212
త్రిపుట 326
దశరూపకము 362
దుర్వినీతుడు 366
దెందులూరు 53
మిశ్రప్రకృతికసంధి 297

న

నందివర్మ శాలంకాయన 57
నక్కీరర్ 365
నన్నయభట్టు 7 91
నన్నెచోడుఁడు 7,108,118,119 367, 368,369 383,378 415
నాగవర్మ 319,320,321,322
నారాయణభట్టు 7 73,110,111,112 113
డా. నారాయణరావు, చిలుకూరి 10,85
నీలకంఠశాస్త్రి 66

నృపతుంగుఁడు 374,394

ప

పండితారాధ్యుఁడు 84
పంపకవి 93,94,102
పద్మకవి 337
పార్జియల్ 329
పెద్దన చిత్రకవి 331
పైశాచి 17,20,FF
పొన్నకవి 102
ప్రతిష్ఠానపురము 19
ప్రత్యక్షవాక్యము 306
ప్రబంధరత్నావళి 94 95,100, 103,338,389
ప్రభాకరశాస్త్రి వేటూరి 95,103,107,117
ప్రేరణార్థకరూపములు 261
ప్లినీ 4
ప్లీటు-డాక్టర్ 55,116

బ

బహువచనప్రత్యయము 190
బిందుసారుఁడు 3
బుద్ధుఁడు 16
బుద్ధఘోషుఁడు 16,17
బృహత్కథ 18,23
బృహత్ఫలాయనులు 4
బ్రహ్మాండపురాణము 5,8
భరత నాట్యశాస్త్రము 14,17,24FF
భవిష్యద్వర్తమానములు 274
భామినీషట్పది 323
భీమకవి వేములవాడ 104,105,106,111
భీమనభట్టు 115,390
భీమయ పండఁడు 384,385
భోగషట్పది 323
భోజరాజు 96 97

మ

మణిప్రవాళవిన్యాసము 305
మధ్యాక్కరలు 34,35 346
మనోమోహన్ ఘోషు 15
మల్లదేవనందివర్మ 6
మల్లేశ్వరుఁడు 91FF
మహాతలవరి (ర) 50
మాధవవర్మ 36,42
మారన 387
మార్గవులు 379 380
మెగస్తనీసు 2,8

య

యశస్తిలక చంపువు 347
యశోవర్మ 21
యుద్ధమల్లుని బెజవాడశాసనము 71 77,78,79,114,115 మొదల

ర

రగడ 317
రాఘవన్. వి 17
రాఘవయ్య, వార్తాకవి 331
రాజరాజు 7,114,115,116,123, 131, 134
రామకృష్ణకవి, మానవల్లి 97,98,99,119
రామకృష్ణయ్య కోరాడ 10,12,13FF 37,156,159,164,173,353,381
రామయ్య పంతులు, జయంతి 79,133,138
డా రామారావు, మారేమండ 3,18

రామేశ్వర స్తంభశాసనము 178
రుద్రదాముఁడు 4
రేచన 110

## ల

లక్ష్మీరంజనం, ఖండవల్లి 21,190, 264,265,267
లింగము 196

## వ

వచనము 348
వరరుచి 18,23 26
వాక్యములు 299
వాదీంద్రచూడామణి 358
విక్రమేంద్రవర్మ (విక్రుకుల్లశాసనము) 53 54, 60
విద్యానాథ పండితుఁడు 67
విధ్యర్థకము 275
విప్పర్తి శాసనము (జయసింహవల్లభుఁడు) 73,193
విప్పర్ల 5,45,124
విభక్తిప్రత్యయములు 218
విభక్తులు-విభక్త్యంగములు 201
విశేషణములు 251
విశ్వామిత్రుఁడు 1,8
విష్ణుకుండినులు 4,42

## వీ

వీరపురుషదత్తుఁడు 50
వీరభద్రరావు, చిలుకూరి 101,106,110
వీరేశలింగంపంతులు 352 368
వృత్తగంధి 356
వెంకయ చోడుఁడు 871,FF మొద.
వెండ్రీస్ 251
వెజ్బా 340,341
వెన్నెలపాటు 330
వెల్దుర్తిశాసనము 126
వేంకటకృష్ణారావు, భావరాజు 139
వేంకటకృష్ణారెడ్డి - దేవరపల్లి 87 FF
వేంకటనృసింహకవి - పైడిపాటి 98
వేంకటపతి - నడిమింటి 98
వేంకటరత్నం పంతులు - కొక్కొండ 352
వేంకటరమణయ్య - డా నేలటూరి 39,80,102,112
వేంకటరామమూర్తి - గిడుగు 134,351
వేంకటరామయ్య - ముట్లూరి 356
వేంకటరావు - నిడుదవోలు 5,17,75, 92,93,97,108,111,114,316, 331,335,339,350
వేంకట లక్ష్మణరావు - కొమర్రాజు 11 12 FF,13,FF,76 112
వైదుంబరాజులు 69 87,122
వ్యతిరేకార్థకము 277

## శ

శకటరేఫము 52 165
శతపథబ్రాహ్మణము 37
శరషట్పది 322
శర్వవర్మ 19
శాతవాహనులు 4,17,14,38 40
శాలంకాయనులు 4
శివతత్త్వసారము 328,336

శివరాత్రిమాహాత్మ్యము 349
శివస్కంధవర్మ 4,45
శీర్షకము 315 316,319
శోర్మడి యుద్ధము 68 69
శ్రావణబెళ్గొళ 366,373

శ్రీధరాచార్యుడు 96
శ్రీనాథుడు 133,134 139

శ్రీపతి పండితుడు 82,86

స

సంఖ్యావాచకము 235
సంగీత రత్నాకరము - 359, 360, 361, 382
సంగీతసుధాకరము 360
సంధి 285
సమాసములు 306
సముచ్చయార్థకము 282
సర్వదేవుడు 100,103 336 339
సర్వనామములు 224

సహదేవుడు 2
సారంగధర యక్షగానము 325
సింగన 95 96,97,99,113
సింహగిరి వచనము 347
సుగ్రీవ విజయము 324
సుగ్రీవుడు 1 8
సూర్యనారాయణశాస్త్రి, మల్లాది 14
సోమదేవసూరి 23,115 317
సోమం, లోకేరావు 350
సోమనాథుడు, పాల్కురికి 7,85,86, 324,328,330,331,333,374

సోమశేఖరశర్మ, మల్లంపల్లి 131,134, 135 136,138
స్టెన్ కోనో 17 51
స్మిత్, విన్సెంట్ 39 F.F

హ

హయవదనరావు సి 85
హరప్రసాదశాస్త్రి 14
హరిభట్టు 350
హర్షచరిత్ర 24 F F
హార్నెల్ 17
హాలుడు 18
హాస్, ప్రొఫెసర్ 363
హేమచంద్రుడు 20 F F,21,26, 30,F.F,31,45
హ్యూయెన్ త్సాంగ్ 6,65,66

ళ

ళ కారము 154


248